కొండు    గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందని నీ యిష్టం యెవరిక్కావాలి ముండ యేడుపు సంత యే దొమ్మరి గుడిసెలూ దూరకపోతే యే అకార్యకరణాలు చెయ్యకపోతే నీకు బోలెడేసి డబ్బుపోసి చదువెలా చెప్పిస్తున్నా ననుకొన్నావ్ ?

రామ్మూర్తి    సాని కొంపలు తిరిగి తెచ్చే డబ్బుపెట్టి నాకు చదువు చెప్పించనక్కరలేదు

కొండు    అయితే మున్సబీదాకా చదువుకోవూ నీ యధాన్న యిదివరకల్లా పోస్ని డబ్బంతా బూడిదలో పోసిన పన్నీరే? ఇదివరకు తిన్నది మాత్రం దుష్ట డబ్బుకాదా యేమిటి? అది ముందు వెళ్ళగక్కి తరువాతనీ శ్రీరంగనీతులు చెప్పు

రామ్మూర్తి    మీరు మన యింటి పరువు తీసేస్తున్నారు

కొండు    ఓరీ నీ పరువుకు తండ్రినయినాను కాను రాముడు దేవుడుకాదని వెధవ ముండల్ని పెళ్ళి చేసుకొమ్మనే కిరస్తానపు వెధవలకు సాని యింటికి వెళ్ళితే తప్పొచ్చిందీ? నీ పెళ్ళి కూడా సమీపించింది కిరస్తానంలో కలిసిపోవాలనుకుంటే ఈ లోగానే కలిసిపో నీ మేనమామ కూతురు కొంపెందుకు తీస్తావు

రామ్మూర్తి    నేను కిరస్తానంలో యెంత మాత్రం కలియను

కొండు    ఈ తండ్రి మీద తిరుగుబాటంతా యేమిటి ?

రామ్మూర్తి    నేను బ్రహ్మ సమాజంలో కలిశాను

కొండు    బ్రహ్మ సమాజం యేమిటి ? విష్ణుమతం శివమతం అని సృష్ట్యాది నుంచి విన్నాం గాని బ్రహ్మకి పూజెక్కడేడిసింది పోనియ్యి యే సమాజమైనా యెవణ్ణో మన దేవుణ్ణి పట్టుకుని కిరస్తానంలో కలియకుండా వుంటే చాలు

రామ్మూర్తి    కిరస్తాన మతం అసత్య మతం దాన్లో బుద్ధిమంతు డెవడూ కలియడు

కొండు    అదిగో ఆ మాత్రం మంచి మాటన్నావంటే నాకు పరమానందం (కౌగలించుకుని) మున్సబీ పరీక్షకోసం తెల్లవాళ్ళ చదువు చదువు గాని స్వేతముఖులు కల్పించి మన మతం చెడ గొట్టాలని వ్రాసిన సంగతులు ఒకటయ్నా నమ్మవద్దు ఇవిగో ఇరవై రూపాయలు తెచ్చాను ఇవి కట్టి మెటికలేషను పరీక్షకు వెళ్ళు.

రామ్మూర్తి    (రూపాయలు పుచ్చుకొని) సానింటికి వెళ్ళడం మానేస్తే బాగుండును

కొండు    మరో పరమార్థం మాట మనస్సులో వుంచుకోవాలి విన్నావా ? జాజి మొక్కకి పేడ వగైరా అసుద్ధ పదార్థములు వేస్తే మొక్క పెరిగి పరిమళ భరితములగు పుష్పాలు పూస్తుంది చెట్టుకి పేడ వేశామని పుష్పాలకేమైనా అపవిత్రత వచ్చిందా ? అవి దేవుడి నెత్తి మీద పెడతాం అఘవలెనే యే మాయోపాయం చేతనైనా ద్రవ్యం సంపాదించి పెద్ద అవస్తలోనికి వచ్చిం తర్వాత వుచితంగా ధర్మం చేస్తే పాపాలన్నీ దహించుకుపోతాయి నీ పెళ్ళి అయిన తరువాత శివపంచాక్షరి మంత్ర ఉపదేశం చేస్తాను దాంతో విద్యా ఐశ్వర్యము ముక్తి కూడా లభిస్తాయి పాపాలు యెగిరి పోతాయి

రామ్మూర్తి    (ఆత్మగతంగా) కాష్టవాదం వల్ల కార్యం లేదు ఎంతయినా పెద్ద వాడు తండ్రి గదా (ప్రకాశం) అలాగే

(తెర)

# కొండు భట్టీయము

## ద్వితీయాంకము

### ప్రథమ రంగము

(కొండుభట్లు యింటి అరుగుమీద చాప పరుచుకొని వెంకన్న కూర్చుని చుట్ట చేతితో పట్టుకొనును)

వెంకన్న — రాముడు చుట్ట మా రీవిగా కాలుస్తాడు ముక్కులోంచి పొగ తెప్పిస్తాడు ఆ విద్య పట్టుపడింది కాదు (అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించుతుండగా తలుపు తియ్యబడును చటుక్కున చుట్ట అగ్గిపుల్ల పారవేసి తటాలున ముసుగెత్తి పడుకొనును )

పార్వతి — (ప్రవేశించి గుమ్మమువద్ద నిలవబడి మెల్లగా) వెంకడూ వెంకడూ (వెంకన్న మారుపలకక నిద్రించినట్లు నటించును పార్వతమ్మ అరికాలు గోకి తిరిగి నిమ్మళముగా వెంకడూ వెంకడూ " అని పిలుచును )

వెంక — (కాలు ముడుచుకుని) నిద్రపోతున్నానే

పార్వతి — దొంగనిద్రపోతున్నావు నువ్వు చుట్టకాల్చడం సొంపు చూడలేదనుకున్నావా యేమిటి ?

వెంక — చూశావూ ?

పార్వతి — చూశాను

వెంక — బాబుతో చెబుతాసంచావా యేమిషి ? కాల్చడం మానేస్తాన్లే

పార్వతి — నే చెప్పినమాట వింటే చెప్పను గదా చుట్టలు కొండానికి రూపాయలు కూడా యిస్తాను

వెంక — చుట్టల శిఘా గోశెను గాని పది రూపాయలంటూ ఇచ్చావంటే పొడుం దుకాణం పెట్టుకుంచాను

పార్వతి — చెప్పినట్లు వింటే పది కాదు యిరవై రూపాయలు యిస్తాను యిప్పుడే యిమ్మంటావా యేమిటి

వెంక — ఇచ్చావంటే నీకన్న పుణ్యాత్మురాలుందా ?

పార్వతి — అయితే లోపలికిరా (అని గదిలోకి వెళ్ళును)

వెంక — (సావిడిలోనికి వచ్చి నిలుచుని పొడుం పీల్చి) పార్వతి బహుదొడ్డ మనిషి. బాబుకంటే నయం నేను పొడుం కొట్టు పెట్టానంటే వర్షులు కొట్టుమీద వక్క దమ్మిడీ పొడుం చెల్లదు

పార్వతి — (ఒక చేతితో విస్తరంటలో అట్టున్నూ రెండవ చేతితో రూపాయిలున్నూ పట్టుకువచ్చి అట్లు కింద వుంచి) అట్లు తిను

వెంక — కాళ్ళూ చేతులు కడుక్కుని తడి గాపంచా కట్టుకుని తించాను

పార్వతి — (తనలో) వెట్టివెధవ (పైకి) మీ బాబు కాళ్ళు కడుక్కోందీ వీధిలోంచి వొచ్చిన బట్టతో తింటాడు గాని నీకు అంతకన్న అచారం బలువయి పోయిందీ? తిన్నగా తిను

వెంక — కాళ్ళూ చేతులు కడుక్కోవద్దంఛావా యేమిషి

పార్వతి కాళ్ళు కడుక్కుంటె చప్పుడవుతుంది.

వెంక . చప్పుడవుతే యేమిషి ?

పార్వతి . (తనలో) మొద్దు వెధవ (పైకి) అంతా లేస్తారు

వెంక (గట్టిగా) ఓహో దొంగతనంగా తెచ్చావు ?

పార్వతి నిమ్మళంగా మాట్లాడు చెప్పినట్టు వినకపోతే రూపాయలివ్వను

వెంక ఆనాచారంగా తింటె యిస్తానంఛావా ? (తినును)

పార్వతి పది రూపాయలు యిస్తే యేం చేస్తావు ?

వెంక పొగాకు కొని పొడుం కొట్టు పెడతాను నేను పొడుంకొట్టు పెట్టానంటే మరి వాడి కొట్టు పడిపోతుంది

పార్వతి గట్టిగా మాట్లడకు

వెంక నా పొడుం యెంత బాగా వుంటుందనుకున్నావేమిషి చిన్నపట్టు పీల్చి చూడు (అని ఎడమ చేతిలో మొలనున్న పొడుం కాయను చూపించును)

పార్వతి (ముక్కుమీద వేలుంచి) ఆడవాళ్ళు పొండు పీలుస్తారుట్రా? (పొడుం కాయ మొలలోంచి లీసి రూపాయలు మొలలో ముడుచును అలా చేయుటలో తన శరీరము వెంకన్న పార్శ్వమునకు తగిలించును)

వెంక (తనలో) యిదేమిషోయి మీదపడుతున్నాది

పార్వతి (అట్టుముక్క తాను కొరికి వెంకన్న నోటి కందించును)

వెంక ఇదేమిటి ? యెంగిలి తినమంఛావా యేమిషి ?

పార్వతి నే చెప్పినట్టూ వింటానన్నావే (అని నోటిలో కుక్కును)

వెంక (అయిష్టముతో మింగుతూ) యెంగిలి తినడానికి పది రూపాయిలు యిచ్చానంషావు

పార్వతి యింకా వుంది

వెంక యేమిటుంది ?

పార్వతి యిదిగో (అని కౌగిలించుకొనును)

వెంక వెధవముండా ? (అని విదిలించివేయును పార్వతి నేలబడును వెంకన్న పైకి పారిపోయి అరుగుమీద ముసుగు పెట్టుకొని పడుకొనును) (తనలో) చచ్చానురోయి యిదేమిటీ రంకుముండకి పోయీకాలం రామ రామ

పార్వతి (చీపురుకట్ట తెచ్చి) గాడిద కొడకా ! (అని కొట్టును)

(తెర)

## ద్వితీయ రంగము

(అక్కాభత్తుడి యిల్లు)

వెంక అక్కాబత్తుడూ - అక్కాబత్తుడూ (అని తలుపు కొట్టును)

అక్కా యెవరది ?

వెంక వెంకన్న

అక్కా (తలుపు తీసి పైకి వచ్చి) యేమిటి వెంకన్న ?

వెంక కొంప మునిగింది

అక్కా మునగడానికి నీకు కొంపవుంటేనా ? మీ చినబాబుగారి కొంప మునిగినట్టాయిన శుభవార్త చెప్పు

వెంక కొంప మునిగింది

అక్కా యెందు కా తొందర ? నింపాదిగా చెప్పు దొంగలొచ్చారా ? యిల్లంటుకుందా ? యేదయ్నా సంతోషమే

వెంక చెప్పనా ?

అక్కా (అరుగు మీద కూచుని) చెప్పు

వెంక నేను చెప్పను

అక్కా చెప్పకపోతే యింట్లోకి పోయి వెచ్చగా పరుంటాను (లేచి తలుపువైపు పోవును)

వెంక (అక్కాబత్తుడి దుప్పటి బట్టుకు లాగి) నేను చెప్తుతాను చెప్తుతాను

అక్కా (తిరిగి కూర్చుని) అయితే చెప్పండి

వెంక యెవరితో చెప్పరుగద

అక్కా యేమటా మహా రహస్యం

వెంక చెప్పరు గదా ? యిదుగో పార్వతి రాత్రి పడుకుంటే మెల్లిగా లేపి మయిల బట్టతో అట్లు తినమంది

అక్కా యిదా రహస్యం మైల బట్టలతో యెందుకు తిన్నావు ?

వెంక (తల గోక్కుంటూ) పొదుం కొట్టు పెట్టుకోవడానికి పది రూపాయిలు యిస్తానంది

అక్కా మరేమి నీ రొట్టి నేతిలో ఁ

వెంక నెయ్యి లేదు వొట్టి రొట్టిలే పెట్టింది

అక్కా యిదేనా కొంప మునగడం ?

వెంక తను కొరికిన యెంగిలి రొట్టి ముక్క తినమన్నది

అక్కా (నవ్వి) తిన్నావా ?

వెంక తిన్నాను

అక్కా (నవ్వు పట్టలేక మిక్కిలిగా నవ్వుతూ) రూపాయి లిచ్చిందా ?

వెంక యిచ్చింది యిచ్చీ. యిచ్చీ

అక్కా యిచ్చి యేం చేసింది ?

వెంక మీదపడి కాగలించుతుంది వెధవముండా అని తోసేసి అరుగు మీద వచ్చి పడుకున్నాను అయిందా చీపురుగట్ట పట్టుకు వచ్చి వీపు పెట్లగొట్టింది దాంతో మీదగ్గరకు పారిపోవచ్చినాను

అక్కా (నవ్వు పట్టలేక దొర్లును)

వెంక యెందుకు నవ్వుతారేమిషి ?

అక్కా నవ్వక యేడవమన్నావ యేమిటి ?

వెంక నేను కూడా నవ్వనా ?

అక్కా అడిగి నవ్వుతారా యేమిటి? నవ్వు

వెంక (నవ్వును)

అక్కా అయితే యిప్పుడు యేం చేస్తావు ?

వెంక . యేం చెయ్యమంటారు ?

అక్కా తిన్నగా వెళ్ళి అరుగు మీద పడుకో

వెంక చీపురుకట్ట ముతకది

అక్కా నిష్కారణం దెబ్బలు తిండం యెందుకు పార్వతి చెప్పినట్టు చెయ్యి

వెంక వెధవతో సంగమం చెయ్యమంటావయ్యా

అక్కా · నీ పినతండ్రి కంటె నువ్వు గొప్పవాడివా ఏమిటి ? ఆయన యెన్నో పాడు దేవాలయాలు ప్రతిష్ట చేశారు

వెంక మా తండ్రి మహాయోగ్యుడు అయ్య పేరు చెడగొట్టుతానా ?

అక్కా హాస్యాని కన్నాను బహు ధర్మంగా ప్రవర్తించావు నిన్ను చూచి మీ చినబాబు బుద్ధితెచ్చుకోవాలి నీవు వేలలో యెన్నికైన మనిషివి గాని రేపటినుంచీ యెలా కాలక్షేపం చేస్తావు

వెంక మధోకరం

అక్కా నేస్తం నేను వుండగా నీకా అవస్థ రానిస్తానా ? ఆ పది రూపాయలు ఏం చేస్తావు?

వెంక · పార్వతికి పంపిస్తాను

అక్కా నేను యంత మదుపు పడితే అంత మదుపు పెట్టుతాను పొడుం కొట్టుపెట్టు. నీ కాలక్షేపము పోగా మనికి లాభం కూడా వస్తుంది

(తెర)

## తృతీయ రంగము

(రామ్మూర్తి చేతులు తాడుతో కట్టబడి పార్వతమ్మ ప్రవేశించును )

రామ్మూర్తి — యిదేమిటి పార్వతి ?

పార్వతి — (కంట నీరొలుకుతూ పూరుకుండును)

రామ — (దగ్గరచేరి కూర్చుని) యే దుర్మార్గులు కట్టారు నీ చేతులు ?

పార్వతి — (మాట్లాడదు)

రామ — (వెంట్రుకలు సవరించి ముద్దుపెట్టుకొని చేతులు కట్లు విప్పి) యెవరు నీకీ అవస్థకి కారణభూతులు ?

పార్వతి — వెంకడు

రామ — వెధవని యెముకలు విరగతంతాను

(తెర)

## చతుర్థ రంగము

(పొడుం దుకాణం)

వెంకన్న — (పొడుంచేస్తూ ప్రవేశించును)

రామ్మూర్తి — యెందుకురా వెంకా చేతులు కట్టావు ?

వెంక — యెప్పుడొచ్చావు రాముడూ ? పరీక్ష ప్యాసయిందిరా ?

మ — ధున్నపోతా ? అడిగిన మాటకు జవాబు చెప్పవేమి ?

వెంక — (పొడుం కఱ్ఱ పడవేసి నిర్ఘాంతపోయి చూచును) ఎందుకురా రాముడూ ఈ కోపం ?

రామ — పార్వతి చేతులు కట్టినందుకు ఇదిగో, పూనితీసి వో లెంపకాయ (కొట్టును)

వెంక — (బుగ్గ తడుముకుంటూ) యెవఱ్ఱా కట్టారు పార్వతి చేతులు

రామ — నువ్వు కట్టావని చెప్పింది

వెంక — నేను కట్టానని చెప్పిందా వెధవముండ

రామ — వెధవముండని దాన్ని తూల్నాడితే మరో లెంపకాయ తీస్తాను

వెంక — వెధవముండ కాకుంటే పునిస్త్రీ ముండనమంఛావురా ఈ మాటు లెంపకాయ తీస్తే ఆ మండ విరిచేస్తాను విన్నావా ఒక దెబ్బకి మా రాముడివి కదా అని వూరుకున్నాను

రామ — (పస్తాయించి) అయితే నువ్వు కట్టకపోతే దాని చేతు లెవరు కట్టారు ?

వెంక — అదేమో నాకేం తెల్సును నెల రోజులాయి నేను యింటికే వెళ్ళలేదు

రామ — (కూర్చుని ఆశ్చర్యముతో) యెంచేతరా ? అబద్ధమాడిందా ? అబద్ధమాడి వుండదు నే వినడం తప్పు కావచ్చు. యెంచేతరా నెల రోజులాయి ఇంటికి వెళ్ళలేదు ?

| | |
|---|---|
| వెంక | యెంచేతనంటే చెప్పకుమ్మా పొదుం కొట్టు పెట్టుకున్నాను |
| రామ | మా నాన్న గెంటేశాడా ఏమిటి ? |
| వెంక | మీ నాన్న నెలరోజులాయి వూళ్ళో లేడు |
| రామ | నీ మానాన్న నువ్వు బతకాలని బుద్ధిపుట్టిందా ఏమిటి ? |
| వెంక | అవున్రా ? పొదుం మా బాగా తయారు చేస్తాను మీతట్టు పొదుం యిలా వుంటుందిరా ? ఒక పట్టు పీల్చు |
| రామ | (పీల్చి) మా మజాగా వుందిరా ఏం వేస్తావేమిటి ? |
| వెంక | ఏం వేస్తానా ? మకోబా పిక్క వేస్తాను ఘుమఘుమ లాడుతుంది ఓ పెద్ద పొట్లాం పుచ్చుకో నీకు యెప్పుడు కావలిస్తే అప్పుడో పోట్లాం యిస్తాన్రా |
| రామ | వెంకన్నా నువ్వు మంచివాడివిరా |
| వెంక | నేను మంచివాణ్నిరా ? |
| రామ | అవును |
| వెంక | మరి నన్నెందుకు కొట్టావు ? |
| రామ | బుద్ధి తక్కువచేత |
| వెంక | మరెప్పుడూ కొట్టవు గద? |
| రామ | కొట్టను |
| వెంక | రాముదు నువ్వు మునసబు పనిచేస్తూవుంటే నేను వచ్చి వోరే రాముడూ? అని పిలుస్తాను కోప్పడవు గద ? |
| రామ | కోప్పడను యింటికి వెళ్ళిపోయిరా |
| వెంక | అమ్మా నేను రాన్రా |
| రామ | యిన్నాళ్ళు అన్నదమ్ముల్లా వుండి యిప్పుడు వేరుంటావురా? |
| వెంక | చీపురుగట్ట (అని వీపు తడుముకొనును) |
| రామ | నీ కేం ప్రాలుబ్ధం చీపురుగట్టతో స్వయం ఇల్లు తుడుచుకోవడం వంట చేసుకోవడం నాకేం మనస్కరించలేదు |
| వెంక | వోరే రాముడూ వంట ఓ ఎంత సొగసుగా చేస్తానూ చినబాబు దేశాంతరం వెళ్ళితే నేనే గద వండుతాను ఈ రాత్రి ఉల్లిపాయల పులుసు చేస్తాను వస్తావూ? |
| రామ | యెందుకు శ్రమపడతావు నా మాట విని యింటికి వెళ్ళిపోయిరా |
| వెంక | యెంత డబొస్తూందంటావంటే రెయిలు వచ్చినప్పుడల్లా అక్కా బత్తుడు పొట్లాలు పంపిస్తాడు ఒక రూపాయి పొట్లాలు చెల్లుతాయి నా పొదుం పూరు వూళ్ళ వాళ్ళు కొనుక్కుపోతారు |

రామ రహస్యం ఏమిట్రో

వెంక పొడుం షడక్షరని ఒక మహామంత్రం వుంది కంసాలి గురువు వీరనాభాచార్యులు దగ్గిర ఉపదేశమై పునశ్చరణ చేశాను శిద్ధయింది

రామ నాకు చెపుతావురా ఆ మంత్రం ?

వెంక చెప్తుతే తల పేలిపోతుందిష. గురువు చెప్పాడ్రా

రామ మంత్రాలబద్ధం శ్రమపడి పునశ్చరణ చెయ్యకు

వెంక అదొక్కటేన్రా నీ దగ్గర దౌర్భాగ్యపు గుణం తెల్లవాడి మాట నమ్మేసి మన గ్రంధాలన్నీ అబద్ధం అంచావు నాకు దాఖలా యిస్తేనే. స్వప్నంలో మంత్రదేవత నానాభరణభూషితురాలవు కుంచున్నూ బంగారపు పొడుం కర్రతో వీపుమీద వేసింది దాంతో తెలివొచ్చింది మరి ఆ వేళ నిద్రపోలేదు నిద్రపోతే ఫలం పోతుందిష.

రామ పూర్ పూల్

(తెర)

## పంచమ రంగము

(అక్కాబత్తుడు వెంకన్న ప్రవేశించును)

అక్కాబత్తుడు ఏమిటి కబుర్లు?

వెంక మా రాముడు పరీక్ష ప్పేసు అయినాడు ఈ వేళే పట్నంనుంచి వచ్చివో లెంపకాయ తీశాదు

అక్కా యెందు కేమిటి ?

వెంక పార్వతి చేతులు యెవడో కట్టాడుష.

అక్కా యెవడో కట్టలేదు వీధి గడప దగ్గిర నిలుచుని తోవంటపోయే వాళ్ళని చూస్తూవుంటే మీ మేనత్తతో ఖాయిదా పెట్టమని నేనే చెప్పాను అందుచేత చేతులు కట్టింది

వెంక మా మేనత్త కడితే రాముడు నన్నెందుకు కొట్టేడు ?

అక్కా నీ సత్యకాలము చూసి రామమూర్తికి గూడ కదలేశావు కావూ ?

వెంక రాముణ్ణి కొడతానా వాడికి మునసబీ అయితే వొరే రాముడూ అని పిలుస్తాను వాడికి పెళ్ళి చేస్తాను

అక్కా నువ్వే చేస్తావూ ?

వెంక (పొడుం పీల్చి) ఆ నేనే మా చిన్నాన్న వచ్చి నన్ను కౌగలించుకుయెత్తి యింటికి తీసుకుపోయినాడు ఇవాళనుండి మా యింట్లోనే భోజనం స్టాంపు సంతకంచేసి వెయ్యి రూపాయీలు తెచ్చి మా మామకిచ్చాను

అక్కా యంత బుద్ధితక్కువ పనిచేశావు నాతో చెప్పంది యెందుకు సంతకం చేశావు

వెంక రాముడికి పెళ్ళి చెయ్యవొద్దంచారా ఏమిటి ?

అక్కా యంత పనిచేశావు ! (ఆత్మగతం) దీనికేమిటి ప్రతీకారం ? (ప్రకాశముగా) రెయిలుకి వేళయింది పొట్లాలు పంపిచు

(తెర)

## షష్ఠమ రంగము

(రెయిలు స్టేషను రెయిలు వచ్చును ఫస్టు క్లాసు బండిలో జరీ టోపీ కన్ కాఫ్ ఫాయిజామా మొదలయిన పోషక్ వేసుకుని త్రివిక్రమరావు పంతులు కిటికీలో నుంచి తొంగిచూచి అల్లీఖాన్ అల్లీఖాన్ అని నౌకర్ను పిలుచును కొండుభట్లు ప్రవేశించును)

కొండు — యే తాలూకా వారు వీరు యే తాలూకా రాజా వారు వీరు (అని దగ్గరు నున్న వార్ని అడుగును )

దగ్గిర వున్న వారు — మాకు తెలియదు

కొండు — (త్రివిక్రమరావు పంతులుగారి దగ్గరకు వెళ్ళి) ప్రభువు వారు జాజి నగరం జమీందారువారనుకుంటాను

త్రివిక్రమరావు — అలాగే నన్ను చూసి అంతా అనుకుంటారు మేము తుమ్మల పాలెం మొఖాసాదార్లం మాకు భూములవల్ల పది పదహేరు వేల్దాక వస్తాయి

కొండు — రా ఏష్ణుః పృధ్వీపతిః అన్నాడ్లు భూస్వాములు కాకపోతే రాజవర్చస్సు యెలా వస్తుంది తమ నాయనగార్ని మ్హా బాగా యెరుగదు నాయందు వారికి చాలా దయ పిల్ల జమీందార్లున్ను అఖండ అన్న ప్రదాతలున్ను ప్రభువువారు యిక్కడ దిగుతార? పైకి విజయం చేస్తార ? యిక్కడ దిగేట్టయితె మ్హా యిల్లు చాల్హా విశాలంగా వుంచుంది యే విధమయిన ఇబ్బందిన్నీ వుండదు యీ గ్రామం గొప్ప క్షేత్రం పాండవ ప్రతిష్ఠ కోదండరామస్వామివారు స్వయం వ్యక్తం

త్రివిక్రమ — మెము విలాసార్ధం దేశం చూదామని విజయం చేస్తున్నాం మీ గ్రామంలో చోద్యాలేమయ్నా వుంటే రెండు పూటలు గడుప అభిప్రాయం కద్దు

కొండు — చోద్యం అంటే పాత కోట కద్దు సీత గుడ్డ కద్దు స్వామివారి ఉద్యానవనం కద్దు అందులో మంటపము దేవ నిర్మాణం దేవాలయం నౌకరీ చేసేవారు యాభయ్యిళ్ళ భోగంవాళ్ళు వున్నారు మంచి విద్యావంతులు రూప వంతులున్నూ

త్రివిక్రమ — అయితే యిక్కడ దిగుతాం

కొండు — యేమర్రా ఓయి కళాసులూ

త్రివిక్రమ — సాయిబు వున్నాడు మీరు శ్రమ పడకండి

కొండు — పరాయిల పనా యేమిటి ? తమ పనికి నా కభ్యంతరం లేదు

అల్లీఖాన్ — (ప్రవేశించి) నీకీ పైకీ చలోజీ

కొండు — నేను సామాను అందిస్తాను నువ్వు బహార్రఖో

అల్లీ — నాకీ బాత్ నకోజీ నీకీ సామాన్ మత్పకడో

కొండు — అమ్మక్ తక్లీఫ్ నహి (అని అట్టూ ఇటూ సామాను తీస్తూ సీసా గళాసులును తన్ని వేసును )

అల్లీ : అరె బంచూత్ కామ్ కియా.

కొండు : అపరాధం, అపరాధం

త్రివిక్రమ : అవి మనవి కావండి! యెవడో దొర వొదిలి వెళ్ళి పోయినాడు. (అని వూరుకొమ్మని సాయిబుతో సౌంజ్ఞ చేయును.)

కొండు : నేను పరాయివాణ్ణి కాను ! శాక్తేయుణ్ణీని, వామాచార తత్పరుణ్ణిన్ని, నా దగ్గర ప్రభువు వారు అరమర వుంచవద్దు. రండి ప్రభువువారు దయచేయండి : సామాను వెనుకనుండి తీసుకువస్తారు. (టిక్కెట్టు కలెక్టరు ప్రవేశించి కొండుభట్లు చెయ్యిపట్టుకు లాగి )

టిక్కెట్టు కలెక్టరు : ఫస్టు క్లాసు బండిలోంచి దిగుతూవుండగా నేను కళ్ళార చూశాను.

కొండు : అది యెవర్ని చూసి నే ననుకున్నావో ! వొంటి మీద చెయ్యి వెయ్యకు, ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. నీవీద డామేజీ దావా తెస్తాను. (కొండు భట్లు త్రివిక్రమరావుగారి వేపు తిరిగి) చిత్తగించారా ప్రభువ్వారు. ఈ మూర్ఖుడికి యింగ్లీషున నాలుగు చీవాట్లు రానియ్యండి. శ్రోత్రియుణ్ణయిన బ్రాహ్మణ్ణి అమాంతంగా ముట్టుగుంటాడు, తల పగిలిపోతుంది.

టిక్కెట్టు కలెక్టరు : ఈ కబుర్లెందుకు పదండి స్టేషను మేష్టరు దగ్గిరికి.

కొండు : పద, నాకేం భయమనుకున్నావ యేమిటి ? (త్రివిక్రమరావు పంతులుతో) యిప్పుడే వస్తాను. తాము వొక్క నిముషం ప్రభువు వారు కుర్చీమీద కూచోండి; (రంగనాయకులు శెట్టి తొందరగా ప్రవేశించి కొండుభట్లు చెవిలో యేమో చెప్పును. కొండుభట్లు ఆందోళనపడును. ఇద్దరూ ప్రత్యేకము మాట్లాడడమునకు ప్రక్కకు వెళ్ళిపోదురు.)

టిక్కెట్టు కలెక్టరు : యెక్కడికి వెళ్ళుతావు స్టేషను మేష్టరు దగ్గిరికి రా !

శెట్టి : ఏమిటీ అల్లరి ?

కొండు : నేను ఫస్టు క్లాసులో కూచున్నానని ప్రాణం పుచ్చుగుంటున్నాడు.

శెట్టి : యెళ్ళు! బావనోళ్ళ మీదే నీ ఝూంకారమంతాను. యింద! సుట్ట ముక్కలకి (అని ఒక అణా చేతిలో పెట్టును.)

కొండు : కొంప మునిగింది ! హటాత్తుగా చచ్చిందీ ముండ! యింత వేగం ఛస్తుందని నే నెరుగను. లేకుంటే వూరు దాటుదునా ? అయితే మంజువాణిని యవరయినా ఆదుకున్నార ? ఆమెకు యెవరు భరాసా యిస్తున్నారు... నువ్వు వెళ్ళావు కావు.

శెట్టి : అంతా రత్నాంగే... మరెవరు . నేను వెళితే కఱ్ఱ పట్టుకు వెంట తరుముతుంది.

కొండు : అయితే మనకేం చేయి జిక్కదు కాబోలు,

శెట్టి : సిక్కకేం! మీరు వేగెళ్ళి సుఋవు చెయ్యండి.

కొండు : యేం సుఋవు చెయ్యడం ? బుద్ధిహీన్ని వెధవని. నాలుగు రాళ్ళకి [illegible] అంత [illegible]

శెట్టి : బుద్ధి తక్కువకు లెంపలాయించుకుని బేగెళ్ళి కథ యెలా వుందో కనిపెట్టండి.

కొండు : సరేగాని ప్రొద్దుపోతూంది. నువ్వు ముందు వెళ్ళి పెరటి గుమ్మం దగ్గర వుండు. నే నిప్పుడే ఆ బోడి పంతులుని బసకు దిగబెట్టి వచ్చి కలుసుకుంటాను... (త్రివిక్రమరావు వద్దకు వెళ్ళి) ప్రభువు వారు దయచెయ్యాలి... యేదిరా గుర్రబ్బండి. తీసుకురా జట్కా ! ప్రభువ్వారి హోదాకి తగినది కాదు కాని కుచేలుడింటికి శ్రీ కృష్ణమూర్తి వారు విజయం చేసినట్టు అనుగ్రహించాలి... సాయిబూ! మా బసకి పోనియ్యి, యీ సామాను పట్టించుకుని నౌకర్లతో కూడా నేను వస్తాను.

వెంకటస్వామి : నా గాజు సామానుకు వేరే బండి కావాలి.

కొండు : ఈ బండి నీకు

అచ్చన్న : నా లాంతరికీ కొవ్వొత్తులకీ వేరే బండి కావాలి.

కొండు : ఈ బండి నీకు

అల్లిఖాను : పంతులుగారి హంక్కాకి, లేహ్యం డబ్బాకి వేరే బండి కావాలి.

కొండు : ఈ బండి నీకు

అల్లిఖాను : పంతులుగారి పోషక్‌కు వేరే బండి కావాలి.

కొండు : ఈ బండి నీకు

బుచ్చన్న : వంటసామానుకి ఒక బండి కావాలి.

పాపన్న : ప్రత్యేకంగా నా కొక బండి కావాలి.

కొండు : మరి లేవు పొండి.

పాపన్న : స్నేహితుణ్ణి ఆశ్రితుణ్ణి.

కొండు : మరి లేవు. బళ్ళు ఒక్కొక్కరే వో బండి యెక్కి వాళ్ళు ఉడాయించారు.

బుచ్చన్న : అయితే యివాళ పంతులుగారు పస్తుపడుకోవాలి.

కొండు : నడిచి వెళ్ళిపోదాం! మరి బళ్ళు దొరకవు.

బుచ్చన్న : సామానెవడు మోస్తాడు.

కొండు : కూలివాడు వొహడూ కనపడ్డూ, మనమే మోసుకపోవాలి.

పాపన్న : మనం తిమ్మనం... ఆ పప్పుడుకదు ! నేను ఒక్కవస్తువయ్నా పట్టుకోను.

బుచ్చన్న : దొబ్బితిని భంగు తాగి పంతులితో మజా వుడాయించడానికి నువ్వూనూ, అరవ చాకిరి చేయడనానికి నేనూనా ?

పాపన్న : బ్రహ్మదేవుడు నీ కలా రాశాడు. నీ కిలా రాశాడు. కావలిస్తే బ్రహ్మ దేవుడితో వెళ్ళి ఫిర్యాదు చేసుకో. శాస్త్రుల్లుగారు! ఈ వూళ్లో డానుస్ కథ యేమయ్నా వున్నదా యేమిటి? లేకుంటే పంతులు పడడు.

కొండు యీ దేవాలయం నౌకర్లలో మంజువాణి సాక్షాత్తు రంభావ- ఉంది

పాప యెవరయ్యా వుంచుకున్నారా

కొండు నరహరిరావని వొక పంతులు వుంచుకున్నాడు

పాప అయితే మా పంతులికి అవకాశం యెలాగ ?

కొండు నేను కొంచెము వైద్యము కూడా చేస్తాను పంతులికి పైత్యాధికం పోవడానికి అప్పటప్పట విరోచన సాధనం చేస్తాను దాంతో మూడు నాలుగు రోజులు మంజువాణికి ఆటవిడుపు కలుగుతూ వుంటుంది

బుచ్చన్న నువ్వు పాతర సామాను పట్టుకుంటే నే దినస్సు పట్టుకుంటాను

కొండు నా ప్రారబ్ధం కాలితే నా స్వగ్రామంలో మూటలు మొయ్యమంటావు

బుచ్చన్న అంత పౌరుషముంటే వెడికి కూలాట్టి యవద్నయ్యా తీసుకురా

(తెర)

## సప్తమ రంగము

(మంజువాణి పెరటి యింట్లో గది గదిలో ఒకవైపు పెద్ద పాత పందిరి మంచము ఒక మూలకు ఒక పాత బోనుపెట్టె గోడవైపు రెండు పెద్ద జాడీలు గోడకు బల్లల పీటలు వాటిపైన బొమ్మలు పాత పరాలు పందిరి మంచం క్రింద యిత్తడి సామానులు చింపిరి తల కొంచెము మాసిన బట్టలతో రత్నాంగి దువ్విన జుత్తు తగుమాత్రం అలంకారం కాని రంగు చీరతో మంజువాణి ఒక జాడీకి యీ ప్రక్క నౌకరు ఆ ప్రక్క నౌకరు నిలిచివుందురు రత్నాంగి చేతిలో ఒక వెలుగుతూ వున్న కొవ్వొత్తి జాడీ దగ్గర ఒక ముక్కల పీటపైని బంగారపు సరుకులు మరి ఒక పీట మీద వెండి సామాను, ఒక వేపు బట్టల మూట ).

రత్నాంగి (కొవ్వొత్తి వెలుతుర్ని జాడీ నాలుగు మూలలా చూపి తల యెత్తి) యింతే మరి లేదు యేమను కున్నావు? యిరవై ముప్పై వేలకు దేకురుతుంది యంత గణించిందని యవరూ యెన్నడూ అనుకోలేరు బతికి నిన్ను భాదపెడితే పెట్టింది కాని చచ్చి నీకు కనకాభిషేకం చేసింది లోకం కోసమైనా కంట తడిబెట్టివు కావు ?

మంజువాణి చచ్చిందని సంతోషించుతూ కంట నీరు పెట్టడం ఎలాగ ?

రత్నాంగి నవ్వులు కన్నీళ్లు భోగందానికి తలిచేటప్పటికి రావద్దా ?

మంజు నేను భోగం దాన్నా ?

రత్నాంగి నాలుగేళ్లు సానెరికం చేసి యింకా సంసార్ని అనుకుంటున్నావా ?

మంజు నమ్మక స్వామిద్రోహము చేసి నన్ను అమ్మి కొండుభట్లూ డబ్బిచ్చి కొని రామసానీ నాలుగేళ్లు యీ చెరలో పెట్టారు దేవుడు ఇన్నాళ్లకి చెర వొదిల్చాడు ఈ డబ్బు నాకు యివ్వాలని ఆ పిశాచం యిచ్చిందా యేమిటి ? యీ డబ్బు నాకు దేవుడు యిచ్చాడు నన్ను బెట్టి అది యెంత ఆర్జించింది యిక స్వేచ్ఛగా బతుకుతాను

రత్నాంగి : అనగా ?

మంజు : వొకరి బాధ లేకుండాను.

రత్నాంగి : యెవరి బాధ.

మంజు : రామసాని బాధ వొదిలి పోయింది. యిక పంతులు బాధ.

రత్నాంగి : (జాడీలో సరుకులు వుంచడం మాని, నిలిచి) నా మాట కొంచం వింటావా ?

మంజు : నీ కంటె నా మంచి కోరినవా రెవరున్నారు ?

రత్నాంగి : అట్టి నమ్మకం వుంటే పది రోజుల కాలం పాత తోవనే జరగనియ్.

మంజు : అయితే నీ యిష్టం.

రత్నాంగి : అలిసి వున్నావు వెళ్ళి పడుకొని నిద్దర తెచ్చుకో.

మంజు : అలాగే ! గాని నిద్దర రావడం యెలాగ ? యీ మంచంమీద యింకా పడుకుందేమో అని బితుకువేస్తూంది.... దెయ్య మైందేమో ?

రత్నాంగి : చచ్చిన ఉత్తర క్షణం వెర్రి కుక్కయి పుట్టి వుంటుంది... మనుషుల్ని పీక్కు తినే పిసినిగొట్లకు అదే గతి - అంజనేయ దండకం చదువుకుంటూ పడుకో (మంజువాణిని కౌగలించుకొని, జుత్తు సవరించి ముద్దు పెట్టుకొని) వెళ్ళు, పడుకో.

మంజు : నీకీ రాత్రి జాగరంవేనా ?

రత్నాంగి : లేకుంటే ప్రమాదం వుంది. డబ్బు పాపిష్టిది; యెవరికే దుర్వ్యూహలు వున్నవో ?

మంజు : వొకర్తెవీ వుండడానికి భయ మేయదా ?

రత్నాంగి : బతికి వున్నప్పుడు భయపడం దానికి చచ్చింతరవాత భయపడుతానా ? (మంజువాణి పైకి వెళ్లను రత్నాంగి తలుపు తీసి లాంతరు వెలిగించి తిరిగి చూచును. మూలనున్న పెద్ద జాడీలోంచి కొండు భట్లు వూరుకొమ్మని చేత్తో సంజ్ఞ చేయును. రత్నాంగి కొవ్వొత్తి తిరిగి తీసుకొని కొండుభట్లు దగ్గరకు వెళ్ళును.)

కొండు : మంచి యెత్తు యెత్తావు ! నీ అంత బుద్ధిమంతురాలు లోకంలో లేదు !

రత్నాంగి : మీ కంటేనా ?

కొండు : అంచేతనే మన వుభయులం ఇక్కడ కలిశాం.

రత్నాంగి : ఇన్నాళ్లు యిటు కనపడితే అటు మొహం తిప్పువారే ?

కొండు : ఆ రాక్షసి ముండ రామసానికి నీ పేరు జెబితే యిష్టం లేక పోయేది. మరి దాన్ని ఆశ్రయించుకు బతక్క తీరేది కాదు. అంచేత నీకు యెడ యెడంగా తిరిగేవాణ్ని. కాని నీ చతురతా, నీ విద్యా, నీ ధర్మ బుద్ధీ చదువుకున్న వాణ్ణి, నేను కానలేదనుకున్నావా ?.... తెలవారేసరికి ఈ సరుకులన్నీ కరగడానికి తగిన సాధన సామాగ్రి సిద్ధంగా వుంది. వొంతులు ఏర్పర్చేయి. నన్ను మాత్రం కలుపుకున్నావంటే పోలీసు, గిలీసు నిన్ను ముట్టలేరు. మంజువాణి డబ్బు విలువ యెరగదు.

మనం యెంత వుడాయించినా పోల్చలేదు (రత్నాంగి భుజముమీద చెయివేసి) కొంచెం ఆసరా ఇయ్యి పైకిరావడం దండగడియ పడుతుంది కాళ్ళకి కొంచెం మేహవాత నొప్పులు (రత్నాంగి కొండుభొట్లు చెయివిదిల్చి సరుకులు జాడీలో పడవేయ నారంభించును)

కొండు సరుకులు జాడీలో పడవేస్తున్నావేమి ?

రత్నాం జాడీతో కూడా పట్టుకుపోవడానికి

కొండు జాడీ యెలా మోసుకెళ్ళడం ?

రత్నాం జాడీ మొయ్యడానికి మనుషులున్నారు

కొండు యెందుకూ వృథాశ్రమ నలుగురికీ తెలియడం నా మాట విని యీ గావంచా గుడ్డలో కట్టు (గావంచా చుట్టచుట్టి రత్నాంగిపై విసురును ) నీకు యీ విద్యలో ప్రావీణ్యత తక్కువగా వున్నట్టు కనబడుతుంది

రత్నాం బంగారం యెవరు కరిగిస్తారు ?

కొండు యిడిగో మన

రత్నాం మన యెవరు ?

కొండు యెవరతే నేం ? పేర్లడక్కు

రత్నాం నమ్మి నట్టా ? నమ్మ నట్టా ?

కొండు కావలిస్తే నువ్వు కూడా దగ్గిర వుందువుగాని

రత్నాం అయితే పేరు చెప్పరా ?

కొండు ఏడీ గ్రంధంలో దిగింతర్వాత అసలు అవతారాలేదిగుతాయి పేర్లతో ఏం పని ?

రత్నాం అయితే మీరు చెప్పరా ?

కొండు నీ పుణ్యం వుంటుంది కొంచం అసరా ఇయ్యి పైకి వొచ్చి అన్ని సంగతులు చెబుతాను వీటి తప్పా గొయ్యా బొద్దెంకులు చెడ కరుస్తున్నాయి

రత్నాం బొద్దెంకులు కరవ్వు కొంచం తాళండి యీ జాడీ పెట్టించి మళ్ళా వస్తాను (తలుపు దగ్గరికి వెళ్ళి గడియలు తీయ నారంభించును )

కొండు అంతా నువ్వే అవుపోసనం పడతావు ? కొంచం బ్రాహ్మడికి పారెయ్యక పోతే శ్రేయస్సు కాదు ఆ ధనంలో మూడవ వంతు నా మంత్రాంగంవల్ల రామసాని సంపాదించింది (రత్నాంగి తలుపు కొంచం తీయును కొండుభట్లు జాడీలోకి తల తీసును )

రత్నాం ఆ తగాయిదా యేదో మంజువాణితో తీర్చుకోండి పిలుస్తాను

కొండు (బుర్ర పైకెత్తి) అమాంతంగా చంపేస్తావా యేమిటి ?

రత్నాం అయితే పేరు చెప్పండి

కొండు చెప్పక పోతే యేం చేస్తావు ?

రత్నాం మంజువాణ్ణి పిలుస్తాను

కొండు నువ్వు కాకనే కాదంటే చెబుతాను కానీ కోరి లభించిన ధనం కాళ్ళని తన్నుక పోవడమే ?

రత్నాం పేరు ? పేరు ?

కొండు అయితే విను (పొడుం పిల్చి) అక్కాబత్తుడు

రత్నాం కంసాలాడి శ్రీరంగ నీతులన్నీ హొట్టివేనా ?

కొండు మరేవింటనుకున్నావు ? లోకమంతా అంతే నీలాంటి ధనవొల్లని వెర్రికుట్టే ఎక్కడో వుంటాడు నా మాట విను

రత్నాం ముందు నా మాట వింటే ఆ తరువాత నీ మాట ఆలోచిస్తాను

కొండు నీ చిత్తం నువ్వేమి చెబితే అది చేస్తాను

రత్నాం యీ గదిలోకి యలా వచ్చావో చెప్పు

కొండు యేకవచనం ప్రయోగిస్తున్నా వేమిటి? యక్ష ప్రశ్నలు అడుగుతున్నావు నా వంటి మంత్రవేత్తకి తలుపులూ గోడలూ ఒక అడ్డా ?

రత్నాం అయితే ఆ మంత్రం వల్లె పైకి దాటు ఈ జాడీ పైన పెట్టించి పైనుండి తాళం వేస్తాను

కొండు గదిలో ప్రవేశించడానికి యే బ్రహ్మవిద్య కావాలి? మారు తాళం పెట్టి తీశాను

రత్నాం ఏ మనిషి నీకు సాయం చేసింది

కొండు నా కొకరి సాయం కూడా కావాలా ?

రత్నాం పేరు ?

కొండు చెప్పకపోతే ?

రత్నాం పట్టి అప్పచెపతాం

కొండు పట్టి అప్పచెప్పితే ప్రాణత్యాగం చేస్తాను బ్రహ్మ హత్య నిన్ను చుట్టి చుట్టి శేషువులా చుట్టుకుంటుంది

రత్నాం అయితే చెప్పిన మాటకి జవాబు చెప్పండి

కొండు పేరు కేం వుంది (పొడుంపీల్చి) అంకి

రత్నాం అబద్ధం

కొండు అయితే పైడి !

రత్నాం అబ్బదం

కొండు యెరిగి నన్నెందుకు కడుగుతావూ ?

రత్నాం బ్రాహ్మడికుండే నీతి నీకు లేకపోయినా దొంగకి ఉండవలసిన నీతైనా ఉన్నందుకు అలరుతున్నాను

కొండు అయితే బ్రాహ్మణ్ణి దయదల్చి ప్రాణాల్తో వొదిలివేస్తావా యేమిటి ? నువ్వు ధర్మాత్మురాలివి ఈ పుణ్యం కట్టుకుంటే స్వర్గం యెదురుగా వస్తుంది కొంచెం అసరా ఇయ్యి జాడీలోంచి పైకి వచ్చి యీ దొంగ ముండా బొద్దెంకల బాధ వొదుల్చుకుంటాను

రత్నాం శిఖా యజ్ఞోపవీతం ఇక్కడ సమర్పించి మరీ పైకి రావాలి

కొండు  అదేవింటది

రత్నాం  అలా నిలుచుండండి చెబుతాను (దగ్గరకు వెళ్ళి) ముందు జంఝం దర్భముడి వుంగరం యిలా ఇచ్చెయ్యి

కొండు  (జంఝం తీసియిచ్చి,) ఇదిగో జంఝం పోస దాఖలుచేసుకో బ్రాహ్మడన్న వాడికి ప్రాణసమానమైన ధనం ఇదే అది నీపాలు చేశాను అంతటితో వొదిలివేయి

రత్నాం  వుంగరం ఇలా ఇయ్యి

కొండు  నువ్వు నీతిమంతురాలవని పేరుపడ్డావు బ్రాహ్మణ ద్రవ్యం అపహరిస్తావా? "నవిషం విషమిత్యాహు. బ్రహ్మస్వం విషముచ్యతే' అని వెయ్యి నోళ్ళతో శాస్త్రకారుడు చెప్పాడు చదువుకున్న బ్రాహ్మణ్ణి కొంచం చెయ్యి తడిచేస్తావేమో అని ఆశపడితే అసలుకే మోసం తెస్తున్నావేమిటి ?

రత్నాం  అధిక ప్రసంగం అలస్యానికి హేతువు మన మాటలు విని ఎవరయ్నా వొస్తే గుట్టు బట్టబయలవుతుంది వుంగరం

కొండు  కానియ్యి నా వేలు వుంగరం నీ మృదువైన వేలు అలంకరిస్తే కృతార్థత చెందుతుంది (వుంగరం అందించును )

రత్నాం  ఆ మాట బాగుంది (వుంగరం వేలునుంచుకుని) యిక శిఖ వుండిపోయింది (తలవంచి ఒక నిమియం గదలకుండా వుండి మొలలోంచి కత్తెరతీసి చూపించును )

కొండు  (జుత్తు చేత పట్టుకుని) శిగకే తాళంపట్టావూ? అదిమాత్రం వొదిలెయ్ నీకు దాసుడనై తిరుగుతాను యెన్నడైనా నీ మాట గడువు దాటితే అప్పుడే యీ మర్యాద చేదువు గాని

రత్నాం  శుభస్య శీఘ్రం అన్నాదు

కొండు  కేశఖండన వుత్సవానికి చెప్పినట్టు చెప్తున్నావు ఈమాత్రం గడపవా? ముందు నీకు యెంతో పనికి వస్తాను సుమా .

రత్నాం  అలా అయితే కొస కొంచం కత్తిరించి వొదిలేస్తాను అది మాత్రం తప్పదు

కొండు  అయితే కానియి

రత్నాం  (జుత్తు కత్తిరించును )

కొండు  కొసేమిటి మొయ్యా కత్తిరించేశావు

రత్నాం  వెంట్రుకల కేవింటి తరిగినకొద్ది పెరుగులాయి బరువు తగ్గింది

కొండు  ఈ అవమానంతో నలుగుర్లో యెలా తలెత్తి తిరగడం ? దాని సిగ్గోసిన సిగపోతేపోయింది కొంచెం ఆసరా యిచ్చి పైకి లేవదియ్యి కాళ్ళు కొంకర్లు పోయినాయి

రత్నాం  మొదలు యెలా దిగావు ?

కొండు  తలుపు తాళం రాగానే శరీరానికి యెక్కళ్ళేని లాఘవం వొచ్చి హనుమానులా యెగిరి లోపలికి జారాను గాని వొళ్ళు కొట్టుకుపోయింది

రత్నాం రాలేకపోతే అలాగే వుండు

కొండు యేం యిలాంటి కాఠిన్యం వహించావు ? (అంచులు చేతపట్టి ఉబక ప్రయత్నించకగా జాడీ పగిలి కొండుభట్లు పెంకుల మధ్య కూలబడును ) చంపావు (రత్నాంగి కొంత కనికరముతో లేవతీయును )

కొండు వొళ్ళంతా గాయాలు తగిలాయి గాని నీ కరస్పర్శ తగలగానే అమృత నిష్యందనంలాగ (కుంటుతూ తలుపు వేపు నడుచును తలుపు దగ్గర నిలిచి ధనం వేపు చూసి) ధనం కాళ్ళ తన్నుకు పోతున్నావు ? లేక నాతో వొంతుకూడ్డం యిష్టం లేదు కాబోలు నా మట్టుకు కొత్త నీరూ పాత నీరూ కూడా యేకంగా కొట్టుకుపోయినాయి నా వుంగ్రరం దొబ్బినందుకు లేదా దేవుడు? (అంటూ తలుపు గడియలు తీసును )

రత్నాం (తాను కూడా తలుపు దగ్గరికి వెళ్ళి తలుపు తాసేవేస్తూ) నిన్ను ఒక్కణ్ణి పైకి వొదిలి నే గదిలో వున్నానంటే పైని గొళ్ళెం వేసి కొంపకగి పెట్టగలవు కనుక నిన్ను వీధిలోకి సాగనంపి వీధి తలుపు ఘడియ వేస్తాను (గదిపైన గొళ్ళెంవేసి కొండు భట్లుతో పైకి వెళ్ళును )

(బోనిపెట్టి తలుపుయెత్తి కోమటి రంగన్న శెట్టి పైకి వచ్చి సరుకులు పరీక్షించి అందులోంచి వుంగరాలు తీసి చేతిని పెట్టుకుని కొన్ని కాసులు మొలను దోపుకొనును యింతట్లో రత్నాంగి కాళ్ళ చప్పుడవును సెట్టి మంచం మీద పడుకుని దుప్పటి తీసి కప్పుకొనును )

రత్నాం (తలుపు తీసి గదిలో ప్రవేశించి సరుకుల వేపు చూసి కాసులు పోగుచేసి) ఏమిటీ చిత్రం కాసులు సగానికి సగం తగ్గిపోయినాయి? (నిలుచుని నాలుగు వైపులా చూచును మంచం మీద మనిషి వుండడం చూసి గతుక్కుమని రెండడుగులు వెనక్కు వేసి అంజనేయ దండకం పఠిస్తూ) శ్రీమన్మహా అంజనీగర్భ సంభూత సద్బ్రహ్మచారీ కపీంద్రాదివంద్యా కిరీటోజ్వలద్రత్న (రత్నాంగి దుప్పటి ముసుగు తీస్తూంది గాఢ నిద్రలో వున్నట్టు సెట్టి కదలడు రత్నాంగి బాగా మనిషిని నఖశిఖ పర్యంతం పరీక్షించి మొల దగ్గిర చెయ్యి పెట్టును )

శెట్టి (తటాలున రత్నాంగి తల పట్టుకొని) దొరికావు మరొగ్గను చెప్పు అమ్మవారివా ? ఆసిరమ్మవా? పీడవా? పిశాచానివా? ఆ యేటీ వాలకం? చెప్పు నిశిరాత్రివేళ యిటొస్తావు ఆటొస్తావు నీకేం నేనాశ్శకవాఁ పరాశ్శకవాఁ వోలమ్మ ఇది ఏ వూరు ఏ లోకం నా కొంపలో నా పక్కమీద నేను వల్లక పడుకున్న ముండావాణ్ణి అమాంతంగా యెత్తి తెచ్చి యిక్కడ పడేసినావు గదా గుండెలు బద్దలయి నవ్వానా ? రామ సానీ నీకేటి కావాల? ఒక్క మాట చెప్పు యేటపోతు కావాలా ? నీ రూపం చూస్తే నాకు భయం వేస్తున్నాది కళ్ళు మూసుకున్నాను తల్లీ రక్షించు

రత్నాం చదవవలసిన్ని పారచవంతా అయిందా యింకా వుందా?

శెట్టి అయితే మనిషివే ? యెవరమ్మా నువ్వు చెప్పు నా యిల్లు చేర్చు తల్లీ మా వాళ్ళు బెంగపెట్టుకుంటారు - రత్నాంగివా ? అయితే బలికాను (నలు ప్రక్కలా పరికించి) యిది రామసాని చీకటి గది కాదు గద? పిశాచమై పీక్కు తింటూంది నన్ను తెచ్చి పడేసినట్టే నిన్నూ తెచ్చి పడేసిందా ఏమిటి ? ఇక్కడుంటే మన్ని చంపే. పోగలదు రా పైకి పోయి మంత్రగాడి కాళ్ళట్టుకుని ప్రాణం బచాయించుకుందాం

రత్నాం తల వొదిలెయి

శెట్టి చూశావా నా చేతులు యెలా గజ గజ వొణుకుతున్నాయో? భయం చేత వళ్లు కంపం పట్టుకుంది నా వశవాఁ చేతులు వొదల్డానికి

(రత్నాంగి పెనుగులాడి మొల దగ్గరికి చెయ్యి పోనిచ్చును)

శెట్టి సెయ్యి మాత్రం మొలలోకి వెళనీయకు దోపిడే ? సానిబుద్ధిపోతుందా? పిశాచం పీక్కుతింటూవుంటే సరసానికి యాళా?

రత్నాం వేళాకోళం మాని మొలనున్న కాసులు అక్కడ పెట్టు

శెట్టి ఈ వాళకం శెట్టి దగ్గర పనికి రాదు (లేచి నిలబడి రత్నాంగిని దూరానికి తోసి తలుపు వేపు ఒరుగును )

రత్నాం దొంగ దొంగ మంజువాణీ (అని కేక వేసును)

శెట్టి నేనేం యెర్రి కుట్టి బాపణ్ణాణ్ణనుకున్నావా యేమిటి? పిలువు నీ యిష్టం వచ్చినవాళ్ళని పిలువు నాకు భయమనుకున్నావా ? (పెద్ద గొంతుతో) నన్ను యీ సీకటి గదిలోకి పిలిచి యీ బంగారం మనం పంచుకు దొబ్బుదామంటే నే నొప్పుతానా ? నీక్కావలిస్తే నువ్వు దొబ్బు పోలీసోళ్ళు పట్టుకున్నప్పుడు నువ్వడ్డుతావా? రామ సాని దెయ్యమై పీక పిసికితే నీ దబ్బడ్డుతాదా? (తలుపు దగ్గరికి దాసీలు మంజువాణీ నరహరిరావు గారు వచ్చి తట్టుదురు )

శెట్టి నా యెత్తు ధనం పోస్తే యిలాంటి దొంగ పని నేను చెయ్యను యింత ద్రోహవాఁ పాపము ఒద్దలై ఆకాశమంత పిడుగు నెత్తి మీద పడదా నా చెయ్యి వొదిలెయి తలుపు తీసి నీ భవిష్యం నలుగురి యదటా తీస్తాను

రత్నాం చేతులు పట్టు వొదల్డు ఏం చెయ్యను?

నరహరి (తలుపు మీద చేయివేసి) యెవర్లోపల?

రత్నాం శెట్టి

శెట్టి శెట్టి యెలా వొచ్చాడా ? రత్నం రమ్మని ప్రాణం తింటే వచ్చాను బంగారం నాణెం చేసి ఖరీదు కట్టాలి రమ్మంటే వొచ్చాను దొంగ పని చెయ్యమంటే నే నొనబడతానా ? రామసాని సొమ్ము ఒక్క చిల్లి కాసు ముట్టుకుంటే పిశాచై పీక పిసగదా? (తలుపు తీసుకు పైకి పోవడానికి ప్రయత్నిస్తూండగా)

రత్నాఁ పట్టుకొండి మొల్లో కాసులు ముడుచుకు పోతున్నాడు ? అవిగో వుంగరాలతో పాటు

శెట్టి యేటీ మనిషి యికారం (రత్నాంగి మీదికి వంగి మొహం దగ్గిర మొహం పెట్టి) నేం దొంగనా ? నువ్వు దొంగవా? మా యింటా వంటా ఆ మాటలేదు ఆ మాట మళ్ళీ అన్నావంటే చాలా దూరం యెళుతుంది కోమటోళ్ళం మా యిల్లంతా బంగారం మా వొళ్ళంతా బంగారం

నరహరి శెట్టీ

శెట్టి : సిత్తం బాబూ! పిశాచమంటే నాకు భయం. పోలీసోళ్ళంటే నాకు భయం – మరెవళ్ళకీ లచ్చపెట్టను. (తిరిగి సాగి వెళుతాడు.)

నరహరి : నిలబడు!

శెట్టి : (వెళ్ళిపోతూ) భోగం దానింట్లో ఒక్క నిమిషం నిలబణ్ణు! అదంతా బాపనాళ్ళకు చెల్లుతుంది.

నరహరి : (పరిగెత్తి శెట్టి రెక్క పట్టుకొని నిలబెట్టి) కాసులు, వుంగరాలు పెట్టు

శెట్టి : సెయిముట్టు సరసం మాత్రం సెయకండి, మాటొస్తుంది !

నరహరి : యిస్తావా ? యివ్వవా ?

శెట్టి : దోపిడే !

నరహరి : ఆహా!

శెట్టి : యివ్వకుంటే ఏటిసేస్తావు ?

నరహరి : పిలకూడదీస్తాను.

శెట్టి : గవరుమెంటు బావుటా యెగురుతుండగా యెవడు పిలకట్టుకునే వాడు ?

నరహరి : ఇదుగో నేను ( అని పిలకట్టుకుని వంచును)

శెట్టి : బాబ్బాబు! మీ మాట కెప్పుడయినా కోవంటోడు అడ్డు సెప్పుతాడా? మీ శలవు ! బావనోరికి బంగారం యిచ్చుకుంట్టె పుణ్ణెం కదా! పితాళ్లు స్వర్గానికి పోరా? ముండ కాసులు మళ్ళీ ఆర్జించు కుంటాను; పుచ్చుకోండి! (కాసులు పుచ్చుకుని నరహరి రావు జుత్తు వదలివేయును.)

నరహరి : దెబ్బకు దెయ్యం వెరుస్తుంది.

శెట్టి : బాబు! దెయ్యమంటే నాకు వొల్లమాల్ని భయం! మరొగ్గెయ్యండి; ఈ కొంపలోంచి దారిపోతే బతుకుతాము. (గడప దిగుతూండగా)

రత్నాం : వుంగరాలో ?

నరహరి : వుంగరాలిచ్చి మరీ వెళ్ళు !

శెట్టి : మీ శలవు ! మీ శలవు కద్దా? (వుంగరాలు తీస్తూ రెండడుగులు ముందు కేసి పరిగెత్తి పారిపోవును.)

**(తెర)**

## అష్టమ రంగము

(అక్కా భక్తుడి దుకాణం అక్కాభక్తుడు రామ్మూర్తి ప్రవేశించును )

అక్కా ఇక రామ్మూర్తి అని పిలవకూడదు "రామ్మూర్తి పంతులు గారు అని పిలవాలి

రామ ఏదో పెద్ద ఉద్యోగాలు అయినప్పుడు కదా అని పిలవడం

అక్కా అందాకా మామూలుగా పిలవొచ్చునా?

రామ ఏం చదువు ? ఏం ఉద్యోగాలు?

అక్కా యేం అలా అటున్నారు?

రామ మా తండ్రి సంగతి బాగుంది కాదు ఆయనకి మంచి స్నేహితులయిన్నీ మీలాంటివాళ్ళు కూడదని చెప్పరు

అక్కా ఆయన ఏ కూడని పనీ చెయ్యలేదే యేదో ఉపాయం వల్ల పది రాళ్ళ సొమ్ము ఆర్జించుకుని సంసారం గడుపుకుంటున్నాడు .

రామ ఎవడో షోళంగిరాజును ఈ వేళ యింటో దింపి పార్వతిని వాడికి ఉపచారం చెయ్యమని అప్పచెప్పాడు ఈ దౌర్జన్యం చూసారా ?

అక్కా భార్యా రూపవతీ శత్రుః" అన్నాడు మొగుడున్న పెళ్ళామే సొగసుగా వుంటే పయివాళ్ళు కన్నేస్తారు గదా ఖాయిదా లేకుంటే సొగసైన వింతతు చెడిపోవడమనగా యెంతసేపు?

రామ మా తండ్రికి అలా గడ్డిపెట్రాదా ?

అక్కా మీ తండ్రికి గడ్డిపెడితే గడ్డయ్యేది గట్రయ్యేది సాపుగా తినేస్తాడు అయినా ఆయన ప్రతిబంధకం మీ ప్రయత్నానికి అడ్డవుతుందా ఏమిటి? పెళ్ళి మూర్తం యెప్పుడండి ?

రామ ఎవరి పెళ్ళండి ?

అక్కా ఎవరి పెళ్ళనుకున్నారు ?

రామ నా పెళ్ళి

అక్కా ఆ మాటే మీ పెళ్ళీ పార్వతమ్మ పెళ్ళిన్నీ

రామ (నిర్ఘాంతపోయి) యెవరు చెప్పారేమిటి ?

అక్కా యెవరూ చెప్పలేదు మీ మాటలవల్లా మీ చర్యలవల్లా ఊహించాను మరెం భయపడకండ అది మహామంచి పని మీ తండ్రి ఆదాలో వుంటే రత్నం లాంటి పిల్ల చెడిపోతుంది ఈ మాట పొక్కేలోగా శీఘ్రుంగా కానియ్యండి నా చేతనయ్ని సహాయం చేస్తాను

రామ నిజంగాను ?

అక్కా లింగం సాక్షి

రామ అయితే మా గురువు గిరీశంగార్ని తీసుకొస్తాను

**(తెర)**

## నవమరంగము

(మంజువాణి ఇల్లు, ఒక బల్ల చుట్టూ కుర్చీలు బల్ల మీద గళాసులు, విప్పిన సీసా; మంజువాణి మంచం మీదను; త్రివిక్రమరావు పంతులు యాజీ చెయిరు మీద మితిమీరి పడివుందురు.)

కొండు : (చప్పుడు కాకుండా బొటనవ్రేలి మీద నడిచివచ్చి త్రివిక్రమ రావును కదిపి చూచును. తెలివి రాదు, ఆత్మగతం) జేబులో ఏముందో, (చెయి జేబులో జొరిపి... మనీ పర్సు తీసి... విప్పి చూచి) దీనిలో పెద్ద కాసులు చాలా వున్నాయి. యివి వీడికి దక్కేవి కావు. వివాహ కార్యం కింద వినియోగ పరిస్తే కొంత పుణ్యం అయ్యా వీడికి దక్కుతుంది. రెండు కాసులు మంజువాణికి యిచ్చేటందుకు యిందులో వుంచి యిదిగో మళ్ళీ జేబులో పడేస్తాను. కడంవి కాకితం పొట్లాం కట్టి కంచుల జాడీలో లోతుగా కప్పివేస్తాను (నిష్క్రమించును.)

త్రివిక్రమ : (నిద్రలో కాలు చాచగా సారాబుడ్డి నేలకి పడి చప్పుడవును. అంతట ఉలికిపడి లేచి మరివొక గళాసు పుచ్చుకుని) దీనికి డబ్బిచ్చి వెళదాం. (జేబులో మనీ పర్సు తీసి జూచి నిర్ఘాంత పోయి) ఆ! రెండేనా వున్నాయి. కడంవి ఎవరు దొబ్బారు? అది మంచం మీద వొళ్ళెరక్క పడే వున్నది, లేక నేను ఖర్చు పెట్టాన! లేకుంటే నా నౌఖర్లు ఎవరయినా చెపాయించేశారా ?.... యీ రెండు కాసుబూ దీనికి యిచ్చేస్తే యింటికిజేరే సాధన మేమిటో?... ఒకటే సాధనం కనబడుతూంది. శాస్తుల్లు ఇంట్లో దాని శిగగోస్ని పాత్ర సామాను వొదిలివేసి సన్నంగా నలుగురుం జారిపోయి తెల్లారగట్ల రెయిలులో విశాఖపట్నం జేరుకుంటే అక్కడ రుణం చేసుకోవచ్చును. ఎవడూ మేలుకుందులేదు గద? (తలుపు మెల్లగా తీసి వెళ్ళిపోవును)

**(తెర)**

# కొండుబట్టీయము

## తృతీయాంకము

### ప్రథమ రంగము

(కేశవరాయుడిగారి చదువు గది : కేశవరాయుడు గారు, దివాన్ బహద్దర్ రాజారాం గారు ప్రవేశించును.)

కేశవ : బహుకాలానికి ! దయచేయండి !

రాజా : రిటయిరయ్ని వాళ్ళం కామండీ, బ్రతుకు యొక్క సాయంకాలంలో దేవుడికీ దేశానికి నౌకరి చెయ్యవలెననే అభిలాష కలిగి దైవారాధనా గ్రంథ కాలక్షేపంతో కాలం వెళ్ళబుచ్చుచున్నాను. భగవద్గీత ఆచార్యులవారి వ్యాఖ్యాన సహితంగా ఆంధ్రీకరించినాను కద. ఇప్పుడు ఉపనిషత్ భాస్యం తెనిగిస్తున్నాను. నాస్తికం ఇంగ్లీసు చదువుకున్న మనవారిలో ఎక్కువగుచున్నది. పెద్దలు చిన్నలు కూడా అప్పటి ఐహికములందు మగ్న చిత్తులయి వుండడమే కాని, "వాట్ యేమ్ ఐ" కోహం! నే నెవడను నా దేవుని యడల నా యడల నాతోటి పాటి జంతువుల యడల నా డ్యూటీ యేమిటి? "వేర్ యామై డ్రిఫ్టింగు" నే నేతోవ జారుతున్నాను. అనే తలంపులు యేమి పాపమో కాని బుర్రలో జొరబడవు. ఆస్తికులయిన తాము ప్రదానోపాధ్యాయులై యుండుటను ఈ పట్నమున బాలురు మాత్రము ఇతర పట్నముల వారివలె కాక బుద్ధిమంతులుగా నున్నారు.

కేశవ : దయచేత నన్ను పొగుడుచున్నారు కాని నేను యంతటి వాడను, నే చేసే పననగా యెంతటిది ?

రాజా : మీ వంటి సత్పురుషులకు వినయము సదా భూషణమయే వుండును. దేశమున ముందు నుండి యున్న పాప చింతా ఆంగ్లేయ విద్యవలన కలిగిన 'నాస్తికతా' అనే మహా మసిసిపి మిసోరి ప్రవాహములకు బ్రహ్మ సమాజము మత మనేది పెద్ద ఆనకట్ట వలె ఆచరిస్తున్నాది. బ్రహ్మ సమాజము లోకములో నుండు మతము లన్నింటి కన్న రేషనల్ ! సబబయినదే అయిననూ లోకమున అవస్తా భేదము, రుచి భేదము కలిగి యుండుట చేత ఏ జాయ మనుష్యులకు ఆ జాయను జ్ఞానోత్పత్తి, ధర్మోపదేశమూ చేయడము విధి గనుక తాము తర్కమును బట్టి సూటిగా పోవు బుద్ధులకు బ్రహ్మ మతోపదేశము చేయుచున్నారు. నే నంటిరో, హిందూ మంత గ్రంథములలో పురాణాదులు కేవలం స్త్రీ పామరజన బోధక ప్రయోజనములుగా తెలిగించి పాశ్చాత్యులు గూడా వేయి నోళ్ళ బొగడు భగవద్గీతాది మహా గ్రంథముల సాహాయ్యమున ఆర్యమంతమునకు చిరకాలమావరించిన త్రుప్పును గడిగి ఆచార్య నిర్దిష్ట కర్మ, వేదాంత మార్గములను చదువరుల కంటి కింపుగా గనపర్చ ప్రయత్నిస్తున్నాను.

కేశవ : యే రీతినయినా నాస్తికతా పాపము యడల భీతి, పుణ్యము యెడల ఆసక్తి కలగ చెయ్యడం యిప్పుడు మన దేశములో అత్యావశ్యకములయినప్పటి మనవాళ్ళ అవివేకానికి మేరలేకుండా వున్నది.

రాజా : పార్డన్ మీ ! యేదో వర తరహా అంటే ఇంచుకు నేను తమ అభిప్రాయముతో భేదించవలసివస్తుంది. క్షమించవలయును. యే రీతినైన ఆస్తికత అంటే.. ఇదిగో ఛండాలుడు, యెను పోతును. వేట

వేసి మరిడమ్మకు పూజ చేస్తాడు. మనమునూ అట్టుల చేయగలమా ? సంఘములో పై అంతస్తుల వారమైన మనము రేషనల్ రెలిజను కలిగి వుండవలెను. అట్టి మతము క్రమ క్రమంగా క్రింది వారికి దిగువ... సవబునే నేను పూజిస్తాను. థియాసఫిష్టు మతముపలె పేడా బెల్లం కలిపి మనవాళ్ళు సంతోషించడము కొరకు ప్రతి వెర్రి మొర్రి వ్రాతలకు సందర్భార్థము కల్పించడమూ, ప్రతి అవక తవక ఆచారమునకు రహస్య సవబులు, గుణములు కల్పించడము.. యేమంటారు . తాము అట్టి వెర్రి మాయలు నమ్మజాలరే ?

కేశవ : నిజమే !

రాజా : అట్టి ప్రవర్తన కలవారితో రాజీ లెల్లను యెట్లు పాటించవలయును ? మత సంబంధమయిన అతర్కిత ఆచరణలో మన వాకిటలోనే కొండంత యిన్‌కాన్‌సిస్టెన్సీ వున్నది, చూడండి. నాయుడు గారూ! మన మాధవయ్య గారున్నారు, వారి యోగ్యత, ఆంధ్ర పాండిత్యమూ, కవితా సామర్థ్యము మన దేశమున కెల్ల నలంకార భూషితములై యున్నవే. వారు బ్రహ్మ సమాజ మతము నెన్నాళ్ళ నుండియో అవలంబించి ఆ మతమునకు మొనగాండ్లయి వున్నారు. విధవా వివాహములు ఆచరించవలసి వచ్చినప్పుడు రీజన్ కాగినవారు బ్రహ్మ సమాజము యొక్క మార్గము వదలి హిందూశాస్త్ర ప్రకారం ఆచరిస్తారు. అది యేమన వచ్చు.

కేశవ : నిజమే ! గాని మాధవయ్యగారు సవబుమాలిన పని చేసిననూ మళ్ళించడము శక్యము కాదు. కాని, తాము విధవా వివాహమునకు ఫర్ గాని, యెగినెస్టుగాని వున్నట్టు కానకాదు ! తమవంటి పండితులు ఆ రిఫారం విషయమయి చర్చించి, యేదో వక నిశ్చయమును తీసుక వుండకపోతే...

రాజా : అన్ని పనులు అందరూ చెయ్యడమూ శక్యమా ? మత సంస్కారము, అందుతో సంబంధించిన గ్రంథరచనా, నా బ్రతుకుకు విధానములుగా నిర్ణయించుకు వున్నాను, చేయవలసిన పనులు లోకములో మెండుకలవు. చేయచేకొనిన పని శాయశక్తుల జేయనగు. అందు విద్య అన్య వ్యాపార నిరోధి; జలస్ వైఫ్! ప్రాస్తావన వశాత్తూ విధవా వివాహముల మాట అంటిని గాని, ఆ భారము గూడా వహించుటకు నా భుజములకు వైశాల్యము చాలదు. మాధవయ్య గారూ తమలాంటి వారు పట్టియుండగా నా రిఫార్ముకు మరియొకరి సహాయ్యమావశ్యకము కాదు. గాని నా మనసునకు కలిగిన సందేహము నివారించుకో జాలక, మాధవయ్య గారి మతమునకు ఆచరణకుగల వైరుధ్యము తాము సమన్వయించ గలుగుదురని అడిగితిని.

కేశవ : రాత్రింబవళ్ళు నే నిదే ఆలోచించుతాను. వారు వినరు. యేమి చెయ్యను. నేను కూడా మోరల్ కరేజ్ లేనివాడిలా కనపడుతున్నాను. నా శత్రువులు నన్ను తరచుగా వెక్కిరిస్తూ వుంటారు.

రాజా : మాధవయ్య గారు గొప్ప గ్రంథకర్త, సంఘ సంస్కార నిర్వాహకులు! వారిపేరట చంద్రకాంత శిలా ప్రతిమ నిలుపనగు గాని తప్పుత్రోవను మనం వీడ్చుకుపోయి హాస్యాస్పదులనుగా చేసినప్పుడు నేనయిన నేమి చేతును? పెళ్ళి చేసుకునే కుర్రవాడు బ్రహ్మసమాజ మతస్థుడైనప్పుడు సమాజ పద్ధతి ప్రకారం పెళ్ళి చేయించుదును. మాధవయ్యగారేమి చేయుదురు?

కేశవ : తమరిచ్చిన సలహా బాగా వున్నది. సంస్కార సమాజము వారము చాలమందంతా బ్రహ్మసమాజము వారమే. మేము నలుగురమూ కలిసి మా మత ప్రకారం వివాహము

చెయ్యడమునకు నిశ్చయిస్తే మిగిలిన ముచ్చకాయ ముగ్గురూ యేమి చెయ్యగలరు. అందులో మా స్కూలు కుర్రవాళ్ళు మా పక్షం వుంటారు కదా! ఒట్ల మెజారిటీ ఏ మీటింగులోనయినా మాకే వస్తుంది. యిటుపైని మా నమ్మకముల ననుసరించి పని చేసి చూస్తాం. థేంక్యూ వెరీ మచ్ ఫర్ ది ఎడ్వైస్స్ !

రాజా : నేను ఎడ్వైసును యివ్వలేదు. ఇవ్వజాలినంతటి వాడిని కాను. రిఫారము విషయమై నేను తమకు ఎడ్వైస్స్ యేల ? ఈ హంశము మన ప్రసంగములో ఉపమానముగా తెచ్చివాను. దీని మాటకేమి, తాము నవబు ప్రకారం నడిచేటప్పుడు లోకం అంతా మీ పట్ల వుంటారు. మనం అనుకుంటూ వున్న ప్రస్తావన రెలిజన్ రేషనల్‌గా వుండకుంటే అన్యమతస్తులయొక్క, నాస్తికం యొక్క ధోకాకు నిలవగలదా ?

కేశవ : అవును.

రాజా : నేను యిప్పుడు తమ దర్శనానికి రావడము కారణమేమిటంటే, తమతో ముచ్చటించడమనే సంతోష మలా వుండగా, ఆదివారం రోజున మా తోటలో నలుగురు ఫ్రెండ్సుకు టీ పార్టీ యిస్తాను. ఆహూయము చేయుటకు వచ్చితిని.

కేశవ : చీటీవ్రాస్తే వస్తానే ! నా కోసం యింత శ్రమ తీసున్నారు ?

రామ : తామును చూడడవు ఆనందమో, తమతో ముచ్చటించుటవలన గలుగు జ్ఞానోత్పత్తియో? గుడ్ బై ? (షేక్ హేండ్స్ చేసుకొందురు)

కేశవ : గుడ్ బై !

(తెర)

## ద్వితీయ రంగము

(దివాన్ జహద్దర్ రాజారాంగారి కచేరి గది : రాజారాం గారు, గంగాధరశాస్త్రి ప్రవేశించును.)

రాజారాం : ఈ పటుపటాంగములో యెవరు గెలుస్తారంటారు ?

శాస్త్రి : తాము దివాన్ బహద్దర్లు; మాధవయ్య గారు రావుబహద్దర్లు ఇద్దరి తారతమ్యము కంపెనీ వారు యెంచే వుంచారు. తాము సార్ధకనాములగు మంత్రులు, మాధవయ్యగారిది వైదీకపు రస్తా. అందులో వేగినాటి సన్యాసం. ఆయ్నకు దేశాన్ని పట్టి అబ్బింది. గ్రంథాలయితే చాలా రాశారు.

రాజా : పండితులయిన మీరూ అనా అనడం ఆశ్చర్యముగా నున్నది. పిట్ట కథలు, పిచక కథలు, తిట్లూ గ్రంథములంటారో. ఇంగ్లీషులో సోలిడ్ బుక్ అంటారే, అనగా ఉద్గ్రంథము! అది మనము వ్రాస్తూన్నాము. మన భగద్గీత ఆంధ్రభాషకు వజ్రకిరీటమని పేపరు వాడు వ్రాశాడు.. శైలిభేదం చూశారా ? మాధవయ్యగారి వ్రాత ఊక! పేలపిండి ! మా శైలి అలంకార భూయిష్టమైన యుండును. వాక్యముల నడక సంగీత గమనము ననుకరించును. పామర జనులకు ఉత్కృష్ట వస్తు గుణ గ్రహణం వుండదు; మన గ్రంథములు యెంత సొగసుగా నచ్చొత్తించినను కొనువారు గానరారు. జమీందార్లు తమ యుద్యోగస్తుల మేలుకోరి కాపీ లధికముగా గొని, తాము వారికి పంచిపెట్టిన జమీందారీలు బాగగును. దేశములో జ్ఞానాభివృద్ధికి మార్గమును. ఒకమారు వెళ్ళి ఉద్యోగావస్థలో పూర్వపరిచితులయిన వారిని చూడవలె, యెక్కడయినా మంచి సంస్థానంలో దివాన్గిరీని కుదుర్చుకుంటేనే కాని, అధికారం చేసే అలవాటుపోయి యేమీ తోచకుండా వున్నది.

గంగా : ప్రజలికి ఆ అదృష్టం పట్టాలి కదా!

రాజా : దివాన్గిరీ దిస్తే చెన్నపట్టపు వకీళ్ళతో పలుకుబడి కూడా వుంటుంది. కౌన్సిలు మెంబరు పనికి సహాయ భూతంగా వుంటుంది. ఈ జిల్లాలోనే కొంచెం ప్రజలని రంజింప చెయ్యడానికి సంఘ సంస్కారంలో మనంకూడా వేలుపెట్టితేనే కాని, యిక్కడివాళ్ళు మనకు వోట్లు యివ్వరు.

(ప్రవేశం నౌఖరు)

నౌఖరు : గిరీశం పంతులు గారు వచ్చారు.

రాజా : రమ్మను. (గంగాధర శాస్త్రితో) ఇతడు నా బాల్య స్నేహితులయిన యుగంధరరావు పంతులుగారి కొమారుడు. చిన్న నాటి నుంచి యెరుగుదును. బి.ఎ. ప్యాసు అయినాడు. తండ్రి ఆర్జించిన ధనం పెట్టి బ్రతుకుతున్నాడు. ఇతనిని సంఘ. సంస్కారము వారు కెప్టాను అంటారు. సాహసౌదార్యాలు గల మనిషి. కోటి విద్య లున్నాయి. నాటకాలాడుతాడు. పాడుతాడు. గారడీ చేస్తాడు. దొర్లకి ఇతనంటే సరదా. తండ్రి చేసిన మొదటి వివాహం భార్య పోయింది. పిల్లలు లేరు. తిరిగి వివాహం లేదు. చేసుకుంటే మరెవరయినా పిల్లను యిచ్చి వుందురు. అర్ధరాత్రి వేళ యెటువైపున పిలిచినా రెండు వేల మంది వెనుక కూడుతారు. గుణ యోగ్యతలున్నవి గాని, కొంచెం పెద్ద పిన్న తారతమ్యం మరిచి హాస్యరసంగా మాట్లాడుతాడు. తుంటరి... అతను వచ్చేసరికి పుస్తకం చదువుతూ వుందాము. "భీస్మాత్ వాతః పవతే భీషోం దేతి సూర్యః భీదగ్ని దండశ్చ"

గిరీశం : (ప్రవేశించి) ఆ స్వరాన్ని యెందుకు సాగదీస్తున్నారు. శాస్తుల్లుగారిచేత చదివించడం. మీరు అర్థం వ్రాయండి.

రాజా : (మెల్లిగా) డామిట్ ! అప్పుడే ఆరంభించాడు! బి.ఏ, ఆ భాషలో ప్యాసు అయినాడు. మా వాడికి సంస్కృతంలో మంచి ప్రవేశం వుందండి. తండ్రి ఉపనిషత్తులు కూడా చెప్పించాడు.

గిరీశం : మా గ్రామములో ఒక కోమటుండేవాడు. ఆయన పురుష సూక్తం పారాయణ చేస్తూవుంటే సూతులో కప్పలు బుర్ర పైకెత్తి అరచేవి.

గంగా : మండూక ప్లుతం! వేదంలో స్వర్గం కూడా వుంది.

గిరీ : బ్రాహ్మలు సోమపానంచేసి వేదపారాయణ చేస్తే తొలకరి కప్పల అరుపులా వుంటుందని రుగ్వేదంలో ఉపమానం కల్పించారు. తొలకరి వాన కురిసిన తరవాత రాత్రివేళ కప్పలు మేళంగట్టి తరహ తరహాలుగా గానం చేస్తూవుంటే అదివొక ఆనందంగా వుంటుంది:

రాజా : సీరియస్ సబ్జక్టులోనయినా హాస్యం విడనాడజాలవు గదా రావుజీ!

గిరీ : మామ గారు గుడ్లగూబలా గాంభీర్యంగా కూర్చుంటాను; ఏం శలవు!

రాజా : ఉపనిషద్వాక్యము పరిసమాప్తిచేసి మాట్లాడుకుందాము... శాస్తులు గారు! అబ్బీ! నువ్వు కూడా విను నీ బుద్ధిలో ఒరిజినాల్టీ వుంది. "భీషాస్మాత్ వాతః పవతే" అన్నాడు. దేవునికి భయపడి వాయువు వీస్తుంది; సూర్యుడు ఉదయిస్తున్నాడు అని ఈ ప్రకారం చాలామంది తాత్పర్యం చెప్తుతారు. భయమనేది భగవంతునియందు క్రౌర్యం కనపరుస్తుంది. భక్తివల్ల దేవతలు వారి వారి పనులు చేసినారంటే కొంత స్వారస్యంగా వుండును. మావాడు (గిరీశం వంకచూసి) భయంచేత చెయ్యమంటే ఏ పనీ చెయ్యడు. 'భీ' అనే మాటకు మరి ఏదన్నా అర్థం చెప్తితే బాగుంటుంది. యూరోప్షియనులు వ్రాసిన డికషనరీలు చూదాం.

గంగా : నేను కూడా యేకాక్షర నిఘంటు చూసి కొన్ని అర్థాలు మనవి చేసుకుంటాను.

గిరీ : నేను. ఒరిజనల్ అని మామ గారు శలవిచ్చారు గనుక నేనోకొత్త అర్థం చెప్తుతారు. "షా" మీద "కా". యెక్కిస్తే భిక్షా అని అవుతుంది; ఆ పైని అర్థం బహు సులువుగా వస్తుంది. గాలీ, సూర్యుడు వగయిరాలు ముష్టికోసం సంచారం చేస్తారని సమన్వయం అవుతుంది. "భిక్షా" అన్నది "భీ" అనే ధాతువులో నుంచి వచ్చిన పదం కాదు. అది యిండో – ఆర్యన్ మాట! 'వ' 'బ' యోరభేదః అన్న సూత్ర ప్రకారం ఇంగ్లీషులో "విష్" అనే మోస్తరుగా తేలింది, విష్ అనగా యిచ్ఛ. ఇచ్ఛా మాత్రం భోజనం, దేనికోసం ముష్టి అంటే భుక్తికోసం! "భుక్తి భిక్షమీయవే" అని త్యాగరాయలు పాడలేదా ? లోకంలో కూడా మనం చూడమా? గవర్నమెంటు వారు యింత భిక్ష పడేస్తే గదా మామ గారి వంటి గొప్ప గొప్ప ఉద్యోగస్తులు నౌకరీ చేస్తారు.

గంగా : వేదంలో అక్షరాలు మార్చడానికి వీలులేదండి.

గిరీ : అర్థము మార్చడానికి వీలుందండీ?

రాజా : శాస్త్రులు గారూ! మీకు తెలియదండీ, మా వాడు చెప్పింది చాలా సబబుగా వుంది. ఈ వేళకి సమాప్తి చేతాం. శాస్త్రులు గారు మనలోవారే. మనం స్వేచ్ఛగా మాటాడుకోవచ్చును. రావుజీ! నీ హాస్య రసమునకు కొంచెం కళ్ళెంపట్టి ఒక అరనిమిషం సీరియస్‌గా వుంటే చాలా ఒబ్లైజ్ అవుతాను.

గిరి : మామగారి శెలవు శిరసావహించి గుడ్లగూబవలె బుద్ధిగా కూచుంటాను.

రాజా : ఈ విధవా వివాహం తాలూకు హికమత్తు యావత్తూ మీ క్యాప్టెనుగారి చేతిలో వున్నది. గనుక, తూచాలు పోకుండా యావత్తూ పరిసమాప్తి అగుననే నమ్మకము నాకున్నది. నేను నిన్నటి దినం కేశవరావు నాయుడిగారితో మాట్లాడినాను. మాధవయ్యగారిది వరకు చేయుచున్న శాస్త్రోక్త పద్ధతి త్రోసి బ్రహ్మసమాజ మత ప్రకారం యిటుపైని విధవా వివాహములు చేయించుటకు వారిని గట్టిగా పుర్లెక్కించాను. నీ సహాయం కూడా వుంటే పార్వతమ్మ వివాహం మన పట్టణంలో ఫస్టు బ్రహ్మసమాజ విడో మారేజిగా వుంటుంది, చేసుకునే కుర్రాడు బ్రహ్మ సమాజ మతస్తుడు గనుక రేషనల్ కన్సమేషన్ అనేది మనము ప్రతిష్టించినవార మగుదుము.

గిరీ : సందేహములేమయ్యా అడగవచ్చునా !

రాజా : అడుకపోతే యెటులను ?

గిరీశం : ఇదివరకే వ్యవహారం జరిగిపోతూంది. నలుగురూ ఐకమత్యంగా రిఫారం పని చేసుకుపోతున్నారు. ఇప్పుడు నాయుడిని లేవదీశారు. మాధవయ్యగారికి తాను పట్టిన కుందేటికి మూడే కాళ్ళు. ఇప్పుడు మీరు వేసిన దోహదంవల్ల వారుభయులు జుత్తూ జుత్తూ పట్టుకుంటారు. ఈ దేశంలో రిఫారము అమాంతంగా రెండు ముక్కలవుతుంది. అదే నా అభిప్రాయం మామ గారూ! శలవియ్యండి.

రాజా : (ఆత్మగతం) వీడు అసాధ్య పిండం. ఇతడి సహాయం లేనిదీ పని కాదు. మామ అని పిలవడం ఆరంభించాడు, యుగంధరరావూ నేనూ స్కూలులో చదువుకునే రోజులలో అన్నా తమ్ముడూ అని పిలుచుకునే వారము. ఎదిగిన పిల్లలు గల తండ్రులను మామా.అని పిలుచుకునే వారము. ఎదిగిన పిల్లలు గల తండ్రులను మామా అనిపిలుస్తే మనస్సున కించిత్తు అనుమానం తగులుతుంది. యింట్లో చనువుగా తిరుగుతాడు, వద్దంటే బాగుండదు. ఎంతటివాడికైనా వీడిని చూస్తే సరదా, ప్రవర్తన చెడ్డదని వినలేదు గాని వీడి నాటకాలు, గారడీ చూడకుండా పిల్లని ఖాయిదా పెట్లాలి. వెధవ పిల్లని మాత్రం ఈ ఊళ్ళో వుంచితే మాట దక్కదు, అన్న దగ్గరకు పంపించి వేతాము.

గిరీ : మామ గారు యేమిటి! ఆలోచిస్తున్నారు ?

రాజా : మరేమీ లేదు. మీ నాయనే ఈ వ్యవహారంలో ప్రవేశిస్తే నీవు అడ్డుమాని సహాయం చేతువు గద!

గిరీ : మా తండ్రియే వ్యవహారంలో దిగినా ముందూ వెనకా చూడకుండా దిగేవారు తండ్రి గారు దిగినా నాకు తోచిన మాటలు చెప్పవలసిన వాడనే.

రాజా : అయితే నీ వంటి బుద్ధిమంతులు సంఘ సంస్కారమునకు మొనగాళ్ళయి వుండిన్నీ బేసవబయిన మార్గాన్న పని జరుగుతూ మనమంతా అన్య మతస్థులకు హాస్యాస్పదం కావడం నీకు మనస్కరించి యున్నదా ? పెళ్ళాడే కుర్రవాడు బ్రహ్మసమాజ మతస్థుడైనప్పుడు హిందూ శాస్త్రోక్తంగా పెళ్ళి చెయ్యడం నీకు యుక్తమనే తోచిందా ?

గిరీ : పెళ్ళికూతురిది ఏ మతమో ఆలోచించారా ?

రాజా : మనలో స్త్రీలు ఆజ్ఞానులు; అస్వతంత్రులున్ను. వాళ్ళకి "గతానుగతికోలోకః" అన్నట్లు ఆచరణే గాని మతమంటూ వకటున్నదీ ? క్రమంగా ఆ పిల్ల భర్త మతం అవలంబిస్తుంది. ఇన్ యాంటిసిపేషన్ మనం అందులో చేర్చవచ్చును.

గిరీ : కిరస్తానులు, తురకలూ, విధవా వివాహం చేసుకుంటే హిందూ సంఘ సంస్కారానికి ఎంత లాభమో బ్రహ్మ సమాజం వారు చేస్తే అంతే లాభము. ఇంతకంటే సవరలు, కోయలు, గదబలు మొదలయిన కొండ జాతుల ఆచార ప్రకారం వివాహం కొంత వింతగానైనా వుంటుంది. దొరలు సంతోషించటం కద మీకు కావలసినది ? కొండ జాతుల ఆచారాలంటే తెల్లవాళ్ళు చెవికోసుకుంటారు పేపర్లలో వ్రాసినా చదవతగివుంటుంది.

రాజా : (ఆత్మగతం) కర్ణపిశాచ వున్నవాళ్ళదగ్గర కానికీలు దాగవు. (ప్రకాశం) ఒక పాయింటు నీవు మరచిపోతున్నావు హిందూ హిందూ అనే మాట తుడుపెట్టి సంఘసంస్కారమే ముఖ్యముగా ఆలోచించవలసి వుంటుంది. హిందూ అనే మాట చేర్చగానే మన ఉద్యమముల లాభము సంకుచిత మవుతుంది. రాజకీయ వ్యవహారములలో అన్ని మతముల వారమూ కలుస్తున్నామా? లేదా? యౌవనవంతులయిన వితంతువుల బ్రతుకు సుఖరహితము కాకుండా వుండడము సంఘ సంస్కారము యొక్క మఖ్యోద్దేశము గదా, ఏ మత ప్రకారమైతేనేమి ? వారలు పెళ్ళిచేసుకొని సుఖించుట సంఘ సంస్కారము కాదా ? బ్రహ్మ సమాజ మతము కూడా హిందూ మతములలో ఒకటని నా అభిప్రాయము. పుత్రప్రాయుడవు కావలసిన వాడవూ గనుక, నీ అసరామీద కించిత్తు సంఘసంస్కార రూపకమైన లోకోపకారంలో దిగతలంచితిని, నీకు తోడ్పడడముకు యిష్టములేని యెడల యింతటితో విరమిస్తాను.

గిరీ (ఆత్మగతం) బాణం గురి దాటింది. మిగిలిపోనియ్యకూడదు, (ప్రకాశం) నేను చెయ్యబూనుకున్న సహాయము చేసి తీరుతాను. గిరీశం అన్న మాట తప్పినాడన్న మాట యీ సర్కి పుట్టలేదు. భగవదనుగ్రహంవల్ల ముందయినా అలా అనుటకు అవకాశము కలుగు కూడదు. వధూవరులను యిక్కడకు తెచ్చి దిగబెడతాను. కాని మామగారు పెట్టుతూవున్న బ్రహ్మసమాజ హిందూ వివాహ విధానముల కలహంలో నేను చేయిచేసుకోజాలను. సవబు కావలిస్తే నా స్వల్పా నుభవమునుబట్టి చెప్తుతాను. ఎవడి మతం వాడికి సవబు. ఎదటివాడి మతము వాడికి బేసవబు. నిజమైన సవబు స్వర్గంలోవుంటే వుండ వచ్చును. మనిషికి మనసే సవబు, తత్వమాలోచిస్తే మనోవృత్తులు ముందు పరుగెత్తుతాయి. మాటకారి సవబులు కల్పిస్తాడు. నిష్కల్మషమయిన మనస్సు అవ్యాజమయిన భూతదయా వుంటే యే మతమయినా సత్మతమే.

రాజా : మామా! నీ మాటలు లేబరింతుల్లా కనబడతాయి. మాటలను బట్టి నీ మతం పోల్చడం శక్యంకాకుండా వుంది. ఒక మాటు శాస్త్రంలో కఱ్ఱెత్తుతావు. మరుసటి క్షణం శాస్త్రాన్ని తిరగదోసి నవబుకోసం కత్తి తీస్తావు. ఆ వెంటనే లోకంలో నవబు లేదంటావు !

గిరీ : నా మతం నాకే పోల్చడానికి దుస్తరంగా వుందనుకుంటాను. మతం వుపాదివేసి కడతారనుకున్నారు కాబోలు మామ గారు! యెండవేళ ఒక మతం, చల్లనివేళ ఒక మతం, కడుపు కాలుస్తూ వున్నప్పుడు ఒక మతం, కడుపు నిండినపుడు ఒక మతం, అందులో అంబలి మతం, పప్పు నెయ్యి మతం, గోధుమ రొట్టె మతం, మద్య మాంస మతం, ఏడుకు తినే వాకపళ్ళ మతం, డబ్బిచ్చికొనే మామిడి పళ్ళ మతం, గడవడం గడవకపోవడాన్ని బట్టి అంతర్భేదాలు కలవు. అలసి ఉన్నప్పుడో మతం, వంటరిగా వున్నప్పుడో మతం, అతివ చెంత నున్నప్పుడో మతం. లంగరులేని నావలాగ మతం మనస్సు యొక్క శరీరమయొక్క స్థితినిబట్టి చెలిస్తూ వుంటుంది. కొన్ని వెర్రులు మాత్రం నాకు వున్నాయనుకుంటాను, మనసుకు మాటకు విడాకులయినప్పుడు, మాటునున్న మాట మార్కెట్‌లో పెట్టాలనే పట్టలేని ఉత్సాహం ఒకటి, సూదంటు రాయిని యినుమంటినట్లు మంచివాళ్ళు కనిపిస్తే వాళ్ళను ఆనుకొను స్వభావం రెండు; ఎదిరించిన వాడిమీద కయ్యానికి కాలుదువ్వడం మూడు: కష్టసాధ్యమైన పని తటస్థించి ఫలితం మంచిదని తోస్తే ముందు వెనక చూడకుండా అందులో ఉరకడం నాలుగు; లయిఫ్‌లో వుండే చమత్కారాలు వెతుక్కుంటూ పోవడం అయిదు; తమవంటి పెద్దల శలవు ప్రకారం నడచుకోవడం ఆరో మతం. అక్కడికి షణ్మతాలు స్థాపనయినాయి. ఇన్ని మతాలు ఒక్కచోట గూడితే ఒక తెస్సు యెలా వెళతాయి?

రాజా : అందుచేతనే లోకం నువ్వు చెప్పినప్పుడల్లా వింటారు. అటువంటి మనిషిని నాబోంట్లు చెప్పినట్లు వినడమనేది వాత్సల్యసూచకం. ఆ మాత్రం ఆసరా ఇచ్చావంటే నేను కూడా సంఘ సంస్కారానికి కించిత్ సహాయభూతుణ్ణి కాగలను. ప్రస్తుతాంశ మేమిటి ?

గిరీ : మీరు చేస్తాన్న ద్రవ్య సహాయము సెటిల్ కావలెను.

రాజా : రామ్మూర్తికి మూడు వందల రూపాయలు యిస్తానన్నానే!

గిరీ : యెప్పుడు?

రాజా : పెళ్ళి అయిన తక్షణం!

గిరీ : బ్రహ్మసమాజం మత ప్రకారం వివాహంకాక శాస్త్రోక్తంగా అయితే?

రాజా : బేసవబుగా అయిన పనిలో మనం సహాయభూతులం యెలా కాగలం?

గిరీ : ఏ ప్రకారం జరిగినా సరే, ఇప్పుడు ఆ సొమ్ము చేతులో పడితేనే ముందు పని జరగడం, లేకుంటే ఇక్కడితో సమాప్తి.

రాజా : హార్డు టర్మస్ ! యు కెన్ ట్రస్టు మీ టు పే.

గిరీ : ఇమీడియట్ పేమెంటు విల్ అబ్విపేటు ది నెససిటి ఫర్ ట్రస్టు : సమ్ మనీ హేజ్ టు గో యిన్‌టు ది హేండ్స్ ఆఫ్ డైవర్సు పెర్సన్సు ఇన్క్లూడింగ్ ది బ్రైడ్.

రాజా : కంసాలి కూడానా ?

గిరీ : లేదు !

రాజా : నీవు ప్రాజ్ఞుడవు ? నీకు నేను బుద్ధి చెప్పవలసిన వాడిని కానుగాని, అనుభవాన్ని బట్టి చెప్తున్నాను. బ్రాహ్మణ సంఘ సంస్కారంలో కంసాలి వాడు అమాయకంగాను అనపేక్షగానూ కలుస్తాడంటే నమ్మవద్దు. ఏదో ఒక ఘట్టి సామి ద్రోహంచేసి మన పరువు తీస్తాడు.

గిరీ : నేను ఆ జాగ్రత్తపడగలను. అయినా జాగ్రత్త ఈ వ్యవహారంలో అవసరం లేదు. మనం సంఘ సంస్కారమని వీశదు మాట ఉపయోగించి, లోకాన్ని మూరెడెత్తు పెరిగించామని సంతోషిస్తున్నాం. కంసాలి, బాపనోళ్ళు కులం చెడుతున్నారు గదా అని ఆనందిస్తున్నాడు. అది వకటి మనకి సేఫ్‌సైడ్! మరి ఒకటేమిటంటే రామూర్తి పెత్తండ్రి కొడుకు వెంకన్నని వున్నాడు, వారియందు కంసాలికి పుత్రప్రేమ, ఆ వెంకన్నని తిన్నగా పెంచక వారి వంతు భూముల ఫలసాయం పెట్టి కొండుబొట్లు రామ్మూర్తికి ఇంగ్లీసు చదువు చెప్పించాడని, మరి కొన్ని కారణాలచేత కొండు భొట్లుమీద కోపం. తండ్రి రామ్మూర్తికి మేనరికం కుదిర్చివుంచాడు. ఈ విధవా వివాహం అయినట్టయినా మేనరికం తప్పిపోతుంది. ఆ పిల్లని వెంకన్నకి పెళ్ళి చేయించాలని అక్కాబత్తుడు ట్రై చేస్తున్నాడు. గనుక భయపడ్డానికి అవసరం లేదని కుంటాను... పెళ్ళికి తర్లి మూడో రోజు రాత్రి ఈ వూరికి పదకొండు మైళ్ళ దూరముననున్న చెరుకువాడ సత్రంలో దిగుతారు. అప్పట్లో మీ గుర్రబ్బండీ సత్రం పెరటి కొబ్బరి తోటలో వుంచి ఈ కంసాలి హికమత్ మీద వధూవరులను దాన్లో ఎక్కించి రాత్రి వుండగానే తమ ఇంట్లో పెట్టాలి.

రాజా : కొంప తీసి మా యింటికే ?

గంగా : (ఆత్మగతం) అమ్మగారు, పంతులు గారికి, వధూవరులకు కూడా గోమయోదక స్నానం, చీపురుగట్ట ప్రయోగంచేత ఉచ్చాటన వెంటనే చేస్తారు.

గిరీ : మీరు పబ్లీకుకు రాకూడదో? మామ గారు యింత పిరికి అని నేను అనుకోలేదు !

రాజా : పిరికి తనమా ? యుద్ధానికి వెళ్ళమంటే వెళ్లుతాను. సమయోచితమైన జాగ్రత్తలు పిరికితన మంటారా . కుర్రవాళ్ళ బుద్ధి మిల మిల పరుగెత్తుతుంది. ముసలి బుర్రలు కొంచెం పస్తాయిస్తాయి. కార్యం సానుకూలం అయ్యేవరకూ పైకి రాకూడదు. వకటి; రెండవది, నా సహాయం కావలసినది గాని, నా పేరు గొప్ప కావడం నేను విలవగా యెంచను. మూడవది, మా వంటి వాళ్ళం సంఘంలో వుండి, మీ అభిప్రాయములను వ్యాపింప జేస్తే లాభం గాని, అంతా ఏట్లో దిగితే లాభం లేదు. కొంతమంది మన వాళ్ళనిపించుకున్న వాళ్ళం గట్టు మీద వుంటే మనకే లాభం!

గిరీ : దాని పేరు ఇంగ్లీలో టైమ్ సర్వింగు అంటారు.

రాజా : మంచి అభిప్రాయములకు చెడ్డ పేరు మహా సులభంగా ఇస్తావు.

గిరీ : వధూవరులను మా యింట్లో పెట్టనా !

రాజా : (ఆత్మగతం) యితని యింట్లో పెడితె బట్టబయలవుతుంది. నలుగురూ చేరి అంతా క్రెడిట్ కోసం దేవులాడితే మన క్రెడిట్ సన్నగిల్లుతుంది. (ప్రకాశం) మీ ఇల్లు సత్రవు. అక్కడ ఏంజేసినా

చిదంబర రహస్యం. ఈ వ్యవహారం మట్టుకు పెళ్ళి పీటల మీద... లేదు కుర్చీల మీద కూర్చునే వరకూ వధూవర్లు ఫలానా వారని ఎవరికిన్నీ తెలియకూడదు. బ్రహ్మసమాజ మతం ప్రచారం పెళ్ళి కావటమునకు ప్రయత్నం నేను చేసుకుంటాను. ఏదో వక విధవా వివాహం సిద్ధమైనదని నాయుడు గారితో చెప్పుతాను; గాని పేర్లు చెప్పను తెలిసినదా ? బ్రహ్మసమాజ పద్ధతివల్ల మరి ఒక ఉపయోగం కనిపెట్టాను. శాస్త్రప్రకారం అయితే మంచి ముహూర్తం కనిపెట్టి పెళ్ళి చెయ్యాలి. మంచి ముహూర్తం దాకా వితంతవుని దాచి వుంచడం దుర్లభం. ఈ లోగా బంధువులవల్ల చాలా తొందర కలుగుతుంది. బ్రహ్మ సమాజం ప్రకారమయితే పిల్ల వచ్చిన మర్నాదు సాయంత్రమే పెళ్ళి చేసి వేయవచ్చును. నాకు తోచిన సలహా ఏమిటంటే, మా బగీచాలో వధూవరులను ఆ రాత్రి పెట్టి.

గిరీ : బాగుంది ! రూపాయిలో ?

రాజా : ఇవిగో ! (పెట్టె తీసి రూపాయి బిచ్చును)

గిరీ : థేంక్యూ. (నిష్క్రమించును.)

గంగా : (ఆత్మగతం) గాడిద కొడుకు! యిన్నాళ్ళు ఆశ్రయించాను. నాకు నెలకి ఏడు రాళ్ళు యిచ్చేటప్పటికి కళ్ళ నీళ్లు పెడతాడు. ఈ వెధవ పెళ్ళికి మూడు వందలు ఖర్చు పెడుతున్నాడు.

రాజా : శాస్తుర్లు గారూ ! ఈ సంగతి మనవాళ్ళకి తెలియనీకండి. మీరు చెప్పాలి, నేను చెప్పాలి, మరి యెవరూ చెప్పరు.

గంగా : "ఘటర్ణోభిద్యతే మంత్రః" అన్నాడు.

రాజా : గిరీశం చెప్పడు. లోగిట్లో వాళ్లు ఆ సమయంలో వుంటే మట్టుకు అబోరు దక్కదు. వాళ్ళు పుట్టింటికి పంపించమని సంవత్సరమై తొందర చేస్తున్నారు. ముహూర్తం ఈ లోగానే కుదిర్చి, మీరు తీసుకుని వెళ్ళి దిగబెట్టండి !

గంగా : మీరు విధవివాహంలో కలుస్తే బహిష్కారం అవుతుందే !

రాజా : ఇంతేనా నా మంత్రశక్తి శాస్తుర్లు గారు? చూశారూ బ్రహ్మసమాజ మతం ప్రకారం పెళ్ళి అయితే మనం చేసే సహాయ సంపత్తివల్ల బాధకం లేదు. పెళ్ళి సమయంలో వెళ్ళి టిఫెన్ పుచ్చుకున్నా, కిరస్తానులు, తురకల వద్ద పుచ్చుకున్నట్టే గాని అంతకన్న తప్పు పట్టదానికి అవకాశం లేదు. క్షీరం కలిసినందువల్ల కాఫ్యాదులు చెండాల హస్తంలోనుంచి అరగించవచ్చును.

గంగా : బోధపడ్డది !

(తెర)

(తెర)

## తృతీయ రంగం

(కంసాలి దుకాణం అక్కాభత్తుడు వెంకన్న ప్రవేశించును)

అక్కా — వెంకన్నా పంతులు చెడిపోతున్నాడు దాని కాష్టలు బహు అక్రమంగా వున్నాయి మీ బాబు మంత్రాంగంవల్ల యవరు బాగుపడ్డారు ?

వెంక — మా బాబు ఏం చేశాడు ?

అక్కా — ఏం చెయ్యలేదు సానిదానికి సరసుల్ని లార్చి డబ్బు సంపాదిస్తాడు పంతులుకి రత్నంవంటి పతివ్రత అయిన భార్యా వుండగా దీని మాయలలో దింపేశాడు

వెంక — పంతుల్ని మీరు బాగు చెయ్యరాదూ ?

అక్కా — మీ బాబు మంత్రాంగం మీద మన బుద్ధులెక్కవు గాని పంతులు కంటి మసక వదలడానికి వకమందు చెప్పుతాను చెయ్యి

వెంక — నేను వైద్యుణ్ణి కాను

అక్కా — మందనగా ఉపాయము ఈ వేళ పంతులు లండ్రి తద్దినం అంచేత మంజు వాణి ఇంటికి రాత్రి సమయము చూసి కొండుభట్లు తోళ్ళ సాయబుని మంజువాణి ఇంట్లో ప్రవేశ పెట్టబోతున్నాడు నువ్వు తిన్నగా వెళ్ళి ఈ మాట పంతులుగారితో చెప్పి పదకొండు ఘంటలు ప్రాంతాన పెరటి గోడ గెంతి అమాంతంగా లోపలికి వెళ్ళమను నేను వీధి గుమ్మం తలుపు గొళ్ళెం పెట్టుతాను

వెంక — తురుకాడుంటే పంతులుకేమి ?

అక్కా — చూస్తూ గాని నీకే తెలుస్తుంది

(తెర)

## చతుర్థరంగము

(మంజువాణి యిల్లు మంచం మీద కూర్చుని హుక్కా పీలుస్తూ సాహేబు గారు క్రింద తివాసి మీద కూర్చుని కొండుభొట్లు)

సాహేబు — క్యా దేర్ హోరా జీ

కొండు — పోషక్ బనాతే మహరాజ్

సాహే — రాత్ బహుత్ హోగయి తోడా వేదం బోలోజీ

కొండు — (ఆత్మగతం) తురక వెధవ వెదం చదువమంటున్నాడు

(ప్రకాశం) — సాహేబు గారు వచ్చారు

మహదొడ్డవారువై

మడదుక్కలాగ వున్నారు

గొడ్డు మాంసము తిందురు
లెంపకాయ ఆచి కొట్టేను
దవడ పళ్ళూడిపోవును ఇత్యమరః.
సాహేబు గారు వచ్చారు,
మహదొడ్డవారువై
మోటవ్వా రేమి చేస్తారో
భయం వేయుచున్నది
గంజాయి పీల్చు మార్గాన,
వొళ్ళు తెలియక యుందురో ఇత్యమరః

దాసీ (ప్రవేశించి కొండుభట్లు చెవిలో) సాయిబుకు తెలుగు వచ్చునా ?

కొండు వక్క అక్షరం రాదు రెండు నెలలు కాలేదు ఢిల్లీ నుంచి వచ్చాడు

సాహే ఢిల్లీ క్యా భోల్తేజీ.

కొండు ఢిల్లీ చాడ్సాకె ఆఫ్ భాయి బంధుకర్కె దోల్దియా

సాహే (లేచివచ్చి వెన్ను మీద గట్టిగా చరిచి) తుత అచ్చా బొమ్మన్ హై

కొండు చచ్చానురోయి నీ అమ్మాశిగ తరగా

మంజు (తెరవతలనుంచి) సాయిబుని వెళ్ళిపొమ్మను వెధవ కసాయి వాడలా వున్నాడు తోళ్ళవాసన కొట్టుతున్నాడు

సాహే క్యా బో ల్తే జీ ?

కొండు - పేట్మె దరద్ హై కర్కె బోల్తే

సాహే ఝూటా బాత్ దగా కర్తెలో తుమ్కు మార్తై (అని ముష్టి యెత్తును)

కొండు వాణ్ణి పొమ్మన్న మాట
చెప్పజాలనువై
తురకః కరకస్చైవ
ద్వావేతౌ మలమోచకౌ
తురకాడు కరక్కాయ
పేరు చెప్తే విరోచనం
నీవు రాకుంటే వీణ్ణుంచి
యింటికి మెల్లిగానువై
జారిపోతాను లేకుంటే
నా కిక్క డాబోరు దక్కదు

సాహే కంచన్ క్యానై అతే జీ ?

కొండు అభి అతే మహారాజ్

మంజు గదిలో కూచుని తలుపు గడియ వేసుకున్నాములే నేన్నూ వెంకీని

సాయిబుని పైకి గెంటెయ్యి లేకుంటే వాడిచేత తావులు తిను

కొండు ధర్మంకాదిది మంజువాణి వినుమా (శ్లోకంవలె చదువుతాడు)

దాగుంట ధైర్యంబు నీ

నవవలంబించియు పైకి వచ్చి మరియున్

ప్రాణంబు దక్కించుమా

లేకుంటె నిట దీపమార్పి మరియున్

నీ కొంప కగ్దెట్టుదున్

నీవు న్నీ చెలిక త్తె కూడ గదిలో

నిప్పెట్టి చస్తారు వై

సాహే బహుత్ అచ్ఛాగాతేజి (అని తిరిగి కొండుభట్లును తట్టును)

మంజు వెంకి యెవళ్ళ్రో వీధిలోను ? (అని గొంతెత్తి అరచును)

సాహే క్యా గడ్‌బడ్ జీ ?

కొండు యే ఘర్ మే ఏక్ బడా బ్రహ్మరాక్షసి కహతే బడా బొమ్మన్ సైతాన్ హై

సాహే సైతాన్ గియితాన్ మార్దెతే (అని కఱ్ఱ సవరించును)

పంతులు (తల విరబోసుకుని చేతిలో లాఠీ పట్టుకొని కోపముతో) ముండా మంజువాణి (అని తొందరగా ప్రవేశించును) (కొండు భొట్లుని చూసి) వెధవ ఫకీరు వెధవ నువ్వుండేనా ఈ దౌర్జన్యం చేయిస్తున్నావు (అని కొండుభొట్లును కఱ్ఱతో కొట్టును)

సాహే యే బొమ్మన్ సైతాన్ ?

కొండు హై మహరాజ్

సాహే (కఱ్ఱతో రెండు దెబ్బలు పంతుల్ని కొట్టేసరికి పంతులు చతికిలబడును)

కొండు (వీధి తలుపులోపల గడియతీసి తియ్యబోతే రాదు) యెవడో తలుపు గొళ్ళెం వేశాదురోయి పెరటి తోవని పోదామంటే అడ్డంగా తురకాదున్నాడు యిఖనేమి సాధనం (ఆత్మగతం) దీపం ఆర్పేస్తే షంతులు పారిపోతాడు (దీపం ఆర్పేసి సాహేబు మీద పంతులు మీద బిందెతో నీళ్ళు విసురును )

సాహే అరే బహుత్ బడా సైతాన్ హై యహాసె చల్జానా (వీధి తలుపు తియ్యబోగా రాదు తలుపు బలాత్కారంగా తీసి వెళ్ళి పోవును )

(తెర)

(తెర)

## పంచమ రంగము

(అక్కాభత్తుడి యింటి అరుగు  వెంకన్న కొండుభట్లు అక్కాభత్తుడు ప్రవేశించును)

కొండు    సాయిబు పంతుల్ని చావగొట్టేడు

అక్కా    యెక్కడ ?

కొండు    మంజువాణి యింట్లో

అక్కా    మీ రెందుకున్నా రక్కడ ?

కొండు    పంతులుగారింట్లో ఆడవాళ్ళకు పురాణం చెప్పి వస్తూండగా మంజువాణి ఇంట్లో గడబిడ అవుతూవుంటే తొంగి చూశాను

అక్కా    అయితే యేం చెయ్యమంటారు ? కనిష్టిబుల్ని పిల్చుకు వెళ్ళుదాం

కొండు    వొద్దు బాబు  లేనిపోయి అల్లరి చెయ్యకండి  తమరు దయచేస్తే చాలును

అక్కా    తురకాడు నాకు దేహశుద్ధి చేస్తే ?

కొండు    వెళ్ళిపోయినాడు

అక్కా    కొండుభోట్లు గారు ! లాంతరు తెండి  నేను చేతికఱ్ఱ పట్టుకు వస్తాను

(తెర)

## షష్టమరంగము

(పంతులు మంచమును జారబడి జాపోయుచుండును  అక్కాభత్తుడు చేతి కఱ్ఱయు  వెంకన్న లాంతరును పట్టుకొని కొండుభొట్లు ప్రవేశించును )

అక్కా    యేమిటండి పంతులు గారు ?

పంతులు  .  ఏమీ లేదండి   శాస్త్రుల్లూ   వీడ్నెందుకు తీసుకొచ్చావు ?

కొండు    సాయిబు మళ్ళా వస్తాడేమో అని భీతాహంచేత తీసుకొచ్చాను

పంతులు    సాయిబు యింగువ అమ్మకానికి కాదూ వచ్చాడు?

కొండు  ·  వెధవ అందుకే వచ్చానన్నాడు  (మెల్లిగా) సానివాళ్ళమాయలు నాకేం తెలుసును

అక్కా    ఎందుకట్టే చర్చ పంతులు గారు ! ఇక్కడ ఉంటారా ? ఇంటికి వస్తారా ?

పంతులు  ·  యిహెందుకు ఇక్కడ ? ఇంటికి వెళ్ళిపోతాను!

మంజు  ·  (పంతులు వెనుకనుంచి ప్రవేశించి) అక్కాబత్తుడు గారు మీరు వెళ్ళిపొండి

పంతులు    (కుంటుతూ చేతి కమ్చీ తీసి) ఆ యింగువమ్మే తురకాడి కోసమేనా యీ ముస్తాబంతా? (అవి కమ్చీతో మంజువాణిని కొట్టును)

అక్కా    (పంతులు కొరడా చెయ్యి పట్టుక [illegible] గారు

మంజు (చేతిలో కొరడా లాగికొని రెండవ జెబ్బ తన చేత్తో పట్టుకొని) పంతులు గారు కారు వీరు అమ్మవారు ఆడవాళ్ళ మీదికి శూరులు సాయిబు దగ్గిర లేకపోయిందీ పౌరుషం నేను వేశ్యను నా వృత్తి ధర్మం నే మానను మీ ఇంట్లో వున్న సంసారి వేశ్యని ఖాయిదా పెట్టుకొండి

పంతులు యేమిటి పేలేవూ చూడు (అని పెనుగులాడును)

కొండు ఊఁ (ఊరుకొమ్మని మంజువాణికి సౌంజ్ఞ చేయును)

మంజు పంతులుకి ఇంకా గీటణగ లేదు వెంకీ యిక్కడే వీధిలో వుంటాడు తీసుకురా

వెంకన్న పిలవమన్నావా యేమిటి ?

కొండు వెధవాయ వూరుకోవోయి సాయిబు మళ్ళీ వస్తే చంపేస్తాడు పంతులు గారు దయచెయ్యండ ది (అని పంతులు చెయ్యి పట్టుకుని లాగును పంతులు కొండుభట్లు గుమ్మము దాటుతుండగా చుర చుర చూస్తూ మంజువాణి పంతులు వీపు మీద ఒక దెబ్బ తిరిగి చూసిన కొండుభట్లు వీపు మీద ఒక దెబ్బ వేసును )

(తెర)

## సప్తమ రంగము

(కొండుభట్లు యిల్లు అరుగుమీద బిచాణా పరచుకొని కొండుభట్లు కూర్చుని వుంటాడు)

కొండు (పొడుంపీల్చి) ఇవాళ యేమి ప్రమాదాలు వచ్చాయి పంతులు కొట్టిన దెబ్బకి బొటబొట రక్తం కారింది గాడిద కొడుకు నిద్దరపోతే తురకాడు కల్లో వస్తాడేమో అని భయంగా వుంది 'రామం స్కంధం హనుమంతం వైనతేయం వృకోదరం శయనే యస్మరేన్నిత్యం దుస్వప్నం తస్య నస్యతి (నలుదిక్కులా కలయజూచి పడుకొనును )

(ప్రవేశం సాహేబు)

సాహే ఉరో జీ

కొండు (ఆత్మగతం) ఓర్నాయన సాయబు కాబోలు నిజమా కలా ?

సాహే ఉరో జీ (అని గట్టిగా మెన్ను మీద చరచును )

కొండు (లేచి) చంపేశావు

సాహే కంచన్ ఘుర్కు ఫిర్ చల్నా ఆప్

కొండు ఆహా హాహా హ ఖుదా వంద్ కంచన్ ఘుర్మే బడా బొమ్మన్ సైతాన్ హై హమ్ దర్తె

సాహే కూచ్ ఘర్వా నహి బొమ్మన్ సైతా¯ మార్ దేంగే

కొండు హమ్ బొమ్మన్ హై కంచన్ ఘుర్కు చల్నా బహుత్ దోష్ కర్కె అమార శాస్త్రమే హై

సాహే తుమ్‌కు కోన్ శిఖాయ ?

కొండు అమార బాప్ శిఖాయ

| | | |
|---|---|---|
| సాహే | | ఆజ్ తక్ ఆప్ కంచన్కు ఘర్ నై చెల్తే ? |
| కొండు | | కంచన్‌కు ఘర్కు కబీ నై జాయెగ |
| సాహే | | అయిసాతో తుమారీ దేవత్ సే ప్రమాణ్ కరో |
| కొండు | | (ఆత్మగతం) ఘోర ప్రమాణాలు చెయ్యమంటాడు యవరి శక్యం ? కందుల గూనలో కాసులు యెవడు హొదులుకో గలడు ? వీధిలో చడి అవుతూంది ఓ కేక వేస్తునా ? |
| సామే | | పుకార్ కరేతో గలా కాట్ దేంగే (అని గొంతుకు చేత్తో పట్టుకొనును) |
| కొండు | | (ఆత్మగతం) మనస్సులో మాట మనస్సులో వుండగానే పోలుస్తాడు మనిషి కాదు దెయ్యం అనుకుంటామ (ప్రకాశం ) ఇదిగో జందెం పకడ్‌కె శపథం కరేంగె కంచన్కు ఘర్కు నై జాయంగే దేఖోజీ డర్తె హమ్కు బుఖార్ ఆయ (అని చెయ్యి చూపును) |
| సాహే | - | అచ్చా కభీ కంచన్కె ఘర్కు జాయేతొ గల్లా కాటేగా (అని నిష్క్రమించును ) |
| కొండు | - | చలి వొణుకూ వచ్చాయిరా బాబూ పార్వతీ కుంపటి తేవే కుంపటి కుంపటి (అంటూ నిష్క్రమించును ) |

(తెర)

## అష్టమ రంగము

(కొండభట్లు యిల్లు రాత్రి భోజనం చేసి బట్టలు కట్టుకొని పైకి వచ్చి గుమ్మం అవతల నిలిచి)

కొండు - తుర కాడి దెబ్బ పదిహేను రోజులు మంచం యెక్కించింది మంజు వాణి ఫికర్లేదు ఇన్నాళ్ళు ఆశ్రయించి యెంతో సహాయ సంపత్తి చేసినాను శాస్త్రులు గారికి యెలా వుండ. మాట వరసకయినా వర్తమానం పంపించలేదు పంతులు కూడా అదే పద్ధతి అవలంభించాడు మంజువాణ్ణి వదిలివేసి ఏకపత్నీ వ్రతుడయి నాడుట దెబ్బకి దెయ్యం వెరుస్తుందన్నాడు గాడిదకొడుకు నన్ను కొట్టాడయ్యా యీ సర్కిగాయం మానలేదు వీళ్ళు మా గడపలోకి రావద్దంటే మాత్రం కందుల గూనలో కాసులుకీ కామమ్మ సరసాలకీ దూరమై పోతాం? మంజువాణికి యేమిటి అపకారం చేశాను ఒక్క తుమ్మలపాలెం వాడు డబ్బియ్యకుండా ... పోయినాడు అదొకటిన్నీ సాయిబు కొంచం భయోత్పాతం చేశాడు తలుపుకిమాత్రం కించిత్తు మరామ్మత్తు తటస్థించి వుండవచ్చును అయితే ఆ అల్లరి తురకాడు చేసిన దేహశ్శు తోటి పంతులు ప్రపకం పడిపోయిందని కోపంవుంటే వుండవచ్చును పైగా పత్యంలో వున్నాను యింకా దేహానికి జవసత్వం రాలేదు తొందరపాటు మనిషి కమ్చీ తిరగేసిందంటే మళ్ళా మంచం యెక్కాలి కుర్రవాడి పెళ్ళి వ్యవధి లేదు కందుల గూనలో కాసుల చేతికి రావే ... పప్పుడకదు యేమిటి సాధనం మరేమి లేదు తిన్నగా వెళ్ళడం యెవరూ చూడకుండా లోపల ప్రవేశించి తటాలున దీపం ఆర్పి వెయ్యడం కందుల గూన దగ్గరకు ఒక్క దాటు వేసి కాసుల పొట్లాం సంధించుకుని ఆంజనేయులలాగా పైకి లంఘించటం వెళదామా? తురకాడితో సానింటికి వెళ్ళనని చెప్పానే వెధవ చూడొచ్చాడా యేమిటి? వాడి కదే తనుపా? గొడ్డును కోసుకు తినేవాడు సర్వాంతర్యామా యేమిటి? లోళ్ళ కొట్టు మేడ ఆలుపు తాళం వేసి

వుంది. సాయిబు వూళ్ళో లేడు. ఆ చుట్టుపట్ల ఎంతోసేపు నిలబడ్డాను. హుక్కలాగ వాసన రవ్వంతయినా కనబడలేదు. "పర్వతో వహ్ని మన్తమాస్మాత్, ధూమాత్" అన్నాడు. ధూమం లేకపోతే అగ్గిలేదు. అషువలెనే హుక్కా ధూమం లేదనే టటువంటి కారణంచేత అగ్గిరాముడనే సాయిబు కూడా నా స్తిన్నాతి సిద్ధాంతః (కబడ్దార్ అని ఒక కేక వినబడును,) ఓరిదే మిటిరో నాయనా! తురకాడి గొంతుకలాగ వినబడుతూంది. వూళ్ళోలేని తురకాడి మాట యిక్కడికెలా వచ్చింది? 'వందేమాతర' గుంటడెవడో కేకవేసి వుంటారు...... అంతే..... అదే నిజంగా వోళ్ళు.... కొంచెం కంపరం పుచ్చుకుంది. శబ్దం విని భయపడితే మరేం పౌరుషం? శబ్దగుణం ఆకాశం, ఆకాశం. నిరవకాశం. శబ్దం వట్టి మిధ్య..... మిధ్య....... మిధ్య ..... అనగా యేమి లేదన్నమాట! (నాలుగడుగులు నడిచేనరికి కబడ్దార్ అని తిరగి వినబడును.) మళ్ళీ వచ్చిందిరోయ్ ధ్వని. వణుకు పట్లు కుంది. అయితే ఏం చేతాం. ఈ శబ్దానికి భయటపడి రెండు మూడు వందల రూపాయల సొమ్ము వదులుకుంటానా? తురకాడు వస్తే ఏం చేస్తాడు? యింగ్లీషు బావుటా చల్లగా వుండాలి గాని చెయిచేసుకున్నాడంటే తురకాణ్ణి పోలీసు వారికి వప్పచెపుతాను. "కబడ్లార్" అప్పుడు తెలుసుంది. యెందుకైనా మంచిది. ఆంజనేయ దండకం చదువుతూ ఒక్క విసురును వెళ్ళానంటే అన్ని భయాలు పటాపంచలై పోతాయి..... శ్రీ మన్మహా అంజనీ గర్భసంభూత సదా బ్రహ్మచారీ కవీంద్రాది వంద్యా కిరీటోజ్వలద్రత్న.... (మంజువాణి ఇంటిగుమ్మం దగ్గర నిలిచి మెల్లగా తొంగి చూచి) సావిట్లో యెవరూ లేరు. సావిడి గదిలోనూ లేరు! (మెల్లగా దీపం ఆర్పేసరికి గభీమని వీధి తలుపు గడియ వేసిన చప్పుడగును.) చంపేశాడ్రోయి. సాయీబు!.... మంజువాణీ! బ్రహ్మ హత్య జరిగిపోతూంది,

మంజు :- మళ్ళీ సాయిబుని తీసుకువచ్చావు? ఇదిగో కందుల గూనవున్న గది లోనికి పెళ్ళి గడియ వేసుకుంటున్నాను. బ్రహ్మహత్య జరిగితే స్వయం కృతాపరాధం గాని పాపం మాది కాదు!

నాయ :- తురకాడి కమ్చీ దెబ్బల్ను తప్పించుకోవడం కష్టంగా వుంది. బ్రహ్మ హత్య జరిగిస్తే బ్రహ్మరాక్షసినై పీక్కుతింటాను.

మంజు :- కంసాలి వీరనాభాచారిచేత మారణహోమం చేయిస్తాను.

కొండు :- అంతటిదానవగుదువు, (ఆత్మగతం) కిందటి మాటులాగ కేకైై నావేతునా, యెవరయినా వస్తారు!

మంజు :- "ధర్మంకాదిది మంజువాణి వినుమా దాంటా"

కొండు :- వువ్వూ వాడితో కలిశావు. సాహెబ్ అభీ ఛోడేడ్‌తో కభీ ఫిర్ నై ఆయంగే.

సాహె :- బొమ్మన్ బాత్ ఝూటా బాత్ (కమ్చీ చప్పుడు చేయును.)

మంజు :- దీపం యెందుకు ఆర్పేశావు. ఇదిగో దీపం తెస్తున్నాను. ధైర్యం అవలంభించండి.

కొండు :- చీకట్లో కొరడా దెబ్బలు తప్పించుకొంటున్నాను. దీపం మాత్రం తేకు ధర్మాత్మురాలివి వీధి తలుపు మట్టుకు తీసెయ్యి,

మంజు :- (దీపం పట్టుకు వచ్చి సాయిబు వెనక నక్కి) శాస్తుల్లు గారు మంచం క్రిందనుంచి విజయం చెయ్యడి.

కొండు - సాయిబు సైతానా? నిజమైన మనిషా?

మంజు - పైకి వస్తే మాట స్పష్టమవుతుంది

కొండు - సాహెబ్ సాహెబ్ కంచన్ ఘుర్కు కభీ నహీ జాయింగె

సాహె - సాలా ఝూట్ మే తుమ్ రహకర్ మేహెర్ చోడ్డేంగే

కొండు - (ఆత్మగతం) వీడి దగ్గర యక్షిణి వుందిరోయ్ నాయనా అన్ని రహస్యాలూ వీడికి వెల్లడే గూనలో కాసులు దొబ్బింది ఈ గండం గడుస్తే డబ్బు మాట చూసుకుందాం (ప్రకాశం) మహరాజ్ లీజియే ఆఫ్ కా పాం పకడ్తే

సాహె - బొమ్మన్ పాం పకడ్తే

కొండు - సమయం వస్తే గాడిద కాళ్ళు పట్టుకోమన్నాడు ఏం చెయ్యను

సాహె - అచ్చా గులామల్లీ దర్వాజా ఖోలో దేఖ్ కర్కెచెలో

కొండు - (చెవలపిల్లిలాగ మంచం కింద నుండి జరిగి కుప్పించును పరుగెత్తుటలో గుమ్మం తగిలి జారిపడును) కందుల గూనా యెంత చేస్తివే

(తెర)

# ప్రథమాంకము

## ద్వితీయ రంగము

### (మత్రివలస రెయిలు స్టేషను)

(రెయిలు బండి యింటర్మీడియెటు క్లాసులో శంకరశాస్త్రి చుట్ట కాలుస్తూ కూచుని వుండును. కొండుభట్లు యింటర్మీడియెటు దగ్గరకు వచ్చి కిటికిలోంచి తొంగి చూసి)

**కొండుభట్లు** :- ప్రభువ్వారా?

**శంకరశాస్త్రి** :- యేం కావాలి.

**కొండు** :- ([illegible] నటిస్తూ) ప్రభువ్వారి దయా, ప్రభువ్వారి దర్శనమూ, అంతకన్న మా బోంట్ల కేం కావాలి ?

**శంక** :- లోపలికి రండి.

**కొండు** :- మాటలా ప్రభువ్వారు కూచునే బండిలా కూచోడానికి!

**శంక** :- వషట్కారాలు మాని లోపలికి రావయ్యా.

**కొండు** :- ప్రభువ్వారి శలవైన తరువాత రాక తీరుతుందా (ఎక్కికూచుని) "రామహరే కృష్ణహరే, తన నాను వదామి సరా మురహారే ! కృష్ణ కేశవ వాసుదేవ గజేంద్రవంద్య దయానిధే ! కృష్ణ..... చంచలాం." యిటువైపు వేంచేస్తున్నారు? యేదైనా కథ వుందా యేమిటండీ ?

**శంక** :- కథకేంవుంది. నేను మంచి అప్సరసలాంటి విధవను గాని, బుద్ధిమంతు రాలైన బోగంది గాని దొరికితే పెళ్లాడ దలచి వున్నాను. మీ అభిప్రాయ మేమిటి?

**కొండు** :- ఆ రెండు పద్ధతులూ మన శాస్త్రాలూ, పురాణాలూ వొప్పుకున్నవే. ఎంత మంది పరుషులు అప్సర స్త్రీలను వరించి సంతానం పొందలేదు. ఆ సంతానం వంశకర్తలు కాలేదా?

**శంక** :- మీరు యాజ్ఞీకం చేయిస్తారా?

**కొండు** :- ప్రభువ్వారి దయ అంటూ వుండి యీ బీదబ్రాహ్మణ్ణి పోషిస్తే యాజ్ఞీకం తప్పక చేస్తాను.

**శంక** :- పురోహితుడు కుదిరాడు; ఇహ వధువు కుదరవలసి వుంది.

**కొండు** :- అరి కొంచెం చిక్కయిన సంగతె, తమవంటి చదువుకొన్న వారు కొందరు యీనాడు అప్సర స్త్రీలను పెళ్లాడదమును అభిలషించి వున్నారు. తమ రసికత, తమ ప్రాజ్ఞతా వెయ్యినోళ్ళ పొగడవలసి వున్నది; గాని రూపశీ, గుణవంతురాలూ అయిన వేశ్యను పెళ్ళాడడానికి వొప్పించడం అసాధ్యం. "ముక్కిలి రొక్కము లియ్యక చిక్కదురా వారకాంత సిద్ధము సుమతీ" అన్నాడు కురూపులూ, దరిద్రులూ తలపడవచ్చు. తమవంటి రూపజిత మన్మథులకు కోరిన స్త్రీ అంటే యెత్తుకు యెత్తు బంగారవిచ్చి కొనాలి.

శంక - యెక్కడైనా వుందా అలాంటి మనిషి?

కొండు - ప్రభువ్వారి దగ్గర దాచడం యెందుకూ? మా వూళ్ళో వుంది ఒక వేశ్యకన్య రంభా ఊర్వసీ తిలోత్తమా దానికి దిష్టితీయడానికి పనికిరారు పన్నెండేళ్లు వొచ్చేదాక నేనే పెంచి విద్య చెప్పి రామసానికి వప్పచెప్పాను

శంక - మీరా పెంచారు

కొండు - అహఁ అనగా అది వొక సత్శూద్రుల పిల్ల కరువు కాలంలో పోషించలేక తల్లి మా యింట దిగబెట్టి వెళ్ళింది మా యింటి ఆవిడ ఆరు సంవత్సరములు దాన్ని తన కూతుర్లాగ మా పిల్లలతో పాటు పెంచింది ఇంతట్లో కళత్రవియోగం సంభవించగానే యీ పిల్ల యే స్థలంలో వుంటే దేదీప్యమానంగా ప్రకాశిస్తుందో ఆ స్థలంలో వుంచాలి గాని యెవరయ్నా దుక్కిముచ్చుకు కట్టబెట్టడం దున్నపోతుకు పువ్వుల దండ వెయ్యడం అని తలచి రామసాని తరిఫీదులో పెట్టాను తిమరు గాని ఒక్క పూట మా వూళ్ళో దిగివుంటే ఆ చిన్న దాన్ని చూసి ఆనందింతురు గాని ఆ భోగం దానివంటి రూపసిని ప్రభువు వారు యేనాడైనా ఎక్కడైనా చూసివుంటే నేను బుర్ర గొరిగించుకు వెళ్ళిపోతాను

శంక మీ వూ రేవూరు ?

కొండు సీతారాంపురం

శంక సరే గాని వేశ్యా వివాహం శ్రేష్ఠమా విధవా వివాహం శ్రేష్టమా ?

కొండు (పొడుం పీల్చి) గట్టి ప్రశ్న అడిగారు శ్రేష్ఠం అంటే వేశ్యా వివాహమే యేమంటే వివాహ మన్నది శృంగారం అనుభవించడానికి ఆ శృంగారమనే విద్యను కూలంకషంగా నేర్చిన ప్రౌఢలను పెళ్ళాడడం శ్రేష్ఠం కాని పాపం పుణ్యం యెరుగని బాల విధవల్ని పెళ్ళాడడం యేమి స్వారస్యం ?

శంక శాస్త్రులు గారూ మొగలాయి రాజ్యానికి దివాన్గిరీ సేయకలిగిన బుద్ధి మీకుంది

కొండు తమవంటి ప్రభువుల ఆశ్రయంపట్ల యుక్తా యుక్త విచక్షణ కొంచెం నేర్చాను అంతేగాని నే ననగా యేపాటి వాణ్ణి నేను మనవి చేసిన వేశ్య అంటే

శంక యేం లాభం పెళ్ళాడడానికి అంగీకరించదని మీరే శలవిస్తున్నారే

కొండు ఆ మాట నిజం బంగారాన్ని మలామా చేస్తేయేమో శలవైతే ప్రయత్నం సాగిస్తాను మంత్రానికి అసాధ్యం నన్నది వుండగూడదు

శంక అంత సొమ్ము విరజిమ్మనేల అంతంత అసాధ్యం ప్రయత్నించనేల తమ దృష్టిలో గుణవతి రూపవతీ అయిన విధవ యెవరూ లేదా?

కొండు (ఆలోచించి) వుంది అది మాత్రం అనగానే అవుతుందనుకున్నారా ప్రభువ్వారు? అదీ ద్రవ్యసాధ్యమే ప్రభువ్వారు శలవిచ్చిన విషమ షరతులు అలాంటివి

శంక నేనేం విషమ షరతులు కోరలేదే

కొండు రూపం గుణం అవశ్యకం గద బొడ్డూడని పిల్లలకీ, కురూపులకి పురుషసూక్త పారాయణ

అయితే గాని కుదరదు గదా. ఎదిగిన రూపవతి అయ్నా విల్లకు వేలకొద్దీ యిస్తే గాని కుదరదు చూశారా. సద్యోఫలం.

శంక : విధవలకి కూడా శుల్కమే.

కొండు : గుణవతి కావాలి, రూపవతి కావాలి అంటే ఆ మాట మనవి చేశాను. ఆ రెండూ వొదిలేస్తే మీ చిత్తం. కన్ను గీటేసరికి వెంటబడే ముండలు వున్నారు.

శంక : నిజంగా గుణవంతురాలైన విధవ యెవరైనా మీ వూళ్ళో కద్దా.

కొండు : కద్దు, మా బంధువురాలే వొకర్తె వుంది.

శంక : ఎవరు?

కొండు : ప్రభువ్వారి దగ్గిర దాపరికం యెందుకు. నా మేనగోడలే వొక రత్నంలాంటి కన్య వుంది. నాతో మా బసకి దయచెయ్యండి. చిత్తగింతురు గాని.

శంక : అవశ్యం.

*

# ప్రథమాంకము

## చతుర్థ రంగము

**(రెయిలు స్టేషను)**

(రెయిలు వెళ్ళిపోయినది. ఇటూ అటూ ఒకరిద్దరు కళాసులు తిరుగు తుందురు. బెంచీమీద శంకరశాస్త్రీ, రామమూర్తీ కూచుందురు.)

**శంకరశాస్త్రి** :- నన్నెరగనట్టు నటించు రహస్యం భేదించకుండా నటించాలి.

**రామ** :- ఎందుకేవిఁటండి ?

**శంక** :- మీ తండ్రి అసాధ్యుడు. నిన్ను గురించి యెంతో విచారిస్తున్నాను.

**రామ** :- ఆయనతో పరిచయం చేశారా యేమిటి?

**శంక** :- చేశాను. ప్రిన్సిపిల్సు బొత్తిగా లేవు.

**రామ** :- అంచేతనే నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను. తలుచుకుంటే కోపం వస్తోంది. తెగించి దేశాలంట పోదామా అనిపిస్తోది.

**శంక** :- నాతో యెన్నడూ చెప్పకపోతివే.

**రామ** :- యేమని చెప్పడం. సిగ్గుచేత చెప్పలేదు.

**శంక** :- ఒకరి లోపాలకి మనం సిగ్గుపడనేలా ? చేతనయినంత వరకు మళ్ళిద్దాం. మళ్ళకపోతే కనికరిద్దాం. సిగ్గుతోనూ, కోపంతోనూ పనిలేదు.

**రామ** :- నామీద దయచేత మీరు అలా అంటారు. లోకంలో తలయెత్తుకు యెలా తిరగను?

# ప్రథమాంకము

## చతుర్థ రంగము

**(రెయిలు స్టేషను)**

(రెయిలు వెళ్ళిపోయినది. ఇటూ అటూ ఒకరిద్దరు కళాసులు తిరుగు తుందురు. బెంచీమీద శంకరశాస్త్రీ, రామమూర్తీ కూచుందురు.)

**శంక** :- ఆయన మీ తండ్రిగారా ?

రామ :- ఔనని చెప్పడానికి సిగ్గుపడుతున్నాను.

రామ :- సిగ్గుపడవలసిన అవసరం లేదు. నన్నెరగనట్టు నటించు. కారణం వెనకనించి చెబుతాను.

(శెట్టి ప్రవేశం)

శెట్టి :- పంతులు గారూ! బండి కుదిర్చాను. దయచెయ్యండి.

శంక :- రెయిలు సంచీ మా మనిషి పట్టుకుంటాడు. నేడు నడుస్తాను.

శెట్టి :- తమవంటి దొడ్డవారూ, ధనవంతులూ నడిస్తే మరి బళ్ళవాళ్ళు బతకడం యెలాగ?

శంక :- అయితే బండివాడికి అద్దె యిచ్చేసి మనం నడుద్దాం. నడక నాకు యిష్టం.

శెట్టి :- (రామమూర్తిని చూచి) యిదిగో చిన్నశాస్తుల్లు! మన ఇంటికి యీ పంతులోర్ని తీసుకెళ్ళమని అయ్య చెప్పారు.

శంక :- నీతో చెబితే నీవే తీసికెళ్ళు.

శెట్టి :- నిజమే. యెవరితో సెప్పిన పని ఆరే సెయ్యాలి. అదే బుద్ధివంతుడి నచ్చనం. బాబూ! మనం వెళదాం.

శంక :- ఆఁ!

శెట్టి :- (నాలుగడుగులు నడిచి మళ్ళీ వెనక్కి పరిగెత్తికెళ్ళి ఒక మనిషి చెవిలో రహస్యం చెప్పి తిరిగి కలిసి నడుచును) బాబూ! ఒక్క మాట శలవియ్యండి. సమిష్టి కుటుంబం విభక్తమైఁ పోయిం తరువాత అందులో ఒక కుఱ్ఱాడు అప్పులు చేసి రుణాలుచేస్తే తాతలు తండ్రులూ చమటోడ్చి ఆర్జించిన భూవులు అమ్మేస్తాదు గదా! యేటి న్యాయం?

శంక :- నాకు 'లా' తెలియదు.

శెట్టి :- పోనిండి; బాబూ! తమకు తెలియం దేమిటుంది. తమ వంటి ఘనమైఁన ఉద్యోగస్థులు....

శంక :- నేను ఉద్యోగస్తుణ్ణి కాను.

శెట్టి :- తమలాంటి ప్రొప్రయిటర్లకి...

శంక :- నేనేమి ప్రొప్రయిటర్ని కాను.

శెట్టి :- అనగా తమవంటి మొఖాసాదార్లుకి... ఒకరి చేతికింద ఉద్యోగం చెయ్యడం అవసరమేఁవిటి?

శంక :- నేను ఒక చేతికింద ఉద్యోగం చెయ్యలేదు. లోకం అందరి చేతికిందా ఉద్యోగంచేసి సేవ చేస్తున్నాను.

శెట్టి :- జీతం యెంత బాబూ!

శంక :- తలో పావలా, అర్ధ రూపాయి, రూపాయీ, రెండు రూపాయిలూ.

శెట్టి :- నాకేం బోధకాలేదు బాబూ!

శంక :- నేను నాటక కంపెనీ మేనేజర్ని, ఒక స్కూలు మేనేజర్ని. నాటకాలు ఆడుతాను. బడి చదువు చెబుతాను.

శెట్టి :- పరీక్ష యేమైనా ప్యాసైనారా!

శంక :- యెమ్మే ప్యాసైనాను.

శెట్టి :- అబ్బోరి. ఇంగిలీషోడి అమల్లో యే పని చేసినా బంగారం వొలుకుతుంది. అయ్యారు పనిచేస్తే వొందలు జీతాలు. యేటి! నాటకాలాడీ వోళ్ళు పట్టాలు పట్టాలు దోచెయ్యడవేం! ఆ పార్సీవోళ్ళు యేం తమాషా చేస్తారు బాబూ! ఆడపిల్లల వేషాలు ఎంత గుముగుముగా వున్నా యనుకున్నారు! చిన్న శాస్తుల్లులాంటి కుర్రాళ్ళు వాళ్ళ వలలో బడ్డారు.

రామ్మూర్తి :- నోరు ముయ్యి.

శెట్టి :- బాబూ ! సత్యంగానండి; మా సిన్న శాస్తులు గారు మా బుద్ధివంతులు గాని కొంచెం కొస యెర్రుంది.

రామ్మూర్తి :- నోరుముయ్యి.

శెట్టి :- బాబూ ! ఆ గుంటల్ని చూసి... గాని ఆ పారిసీవోళ్ళు దేశమంతా జయించుకొచ్చినారు గాని ఈ వూళ్ళో ఆళ్ళ గర్వం అణిగింది.

శంక :- యెలాగో ?

శెట్టి :- యెలాగనా బాబూ ? ఈ ఊళ్ళో కనకపల్లి అని భోగందుంది. దాన్ని చూసి.....

# ద్వితీయాంకము

## ద్వితీయ రంగము

(తలుపు అవతలకు కనకపల్లి, రామ్మూర్తి, శంకరశాస్త్రి ప్రవేశింతురు, శంకరశాస్త్రి పక్కను వొణకుతూ కనకపల్లి నిలబడును..)

శంక :- యెవరు లోపల ?

రత్నం :- శెట్టి ?

కనక :- శెట్టా ! యెలా వొచ్చాడు.

కనక :- యెలా వొచ్చాడా ? రత్నం రమ్మని ప్రాణం తింటే వొచ్చాను.

# బిల్హణీయము

## మొదటి అంకము

### ఒకటవ స్థలము

అనిహిల్లా పట్టంలో రాజు ఆస్థానము

(వైయాకరణుడు నారాయణభట్టును బిల్హణుని మిత్రుడగు తార్కికుడు కేశవభట్టును ప్రవేశింతురు )

నారాయణభట్టు  మహాభాష్యానికి ఇతని తండ్రి వ్రాసిన వ్యాఖ్యానం ప్రమాణంగా యెవరు వొప్పుతారండీ అలాగైతే నా శిష్యులు వ్రాసిన వ్యాఖ్యానాలు కూడా ప్రమాణవేఁ యేమంటారు?

కేశవభట్టు  - దానికి యుక్తి ప్రధానం గాని పుస్తకాలతో యేం పనండి

నారా  యుక్తిలో నీరస సారసాలు కనిపెట్టే దాతేదండి ? ప్రభువులు నూతన ప్రియులు ఆశ్రయించుకున్న వాళ్ళను క్షూణత పరచడమూ పరాయి వాణ్ణి నెత్తికెక్కించుకోవడమూ వారికి నైజగుణం

కేశ  గొంగళీలో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టాడట యిప్పుడు క్షూణత మనకు కొత్తగా వొచ్చిందా యేమిటండి భోజరాజు కాలంనుంచీ కవిత్వం విలువ హెచ్చింది శాస్త్రాలు అడుగంటాయి నాలుగు శ్లోకం ముక్కలు అల్లుతారనే కదా రామశాస్త్రిని కృష్ణాస్వామిని రాజు యిప్పుడు మన అందరి నెత్తిమీదా కూచోబెట్టాడు

నారా  వెధవ కవిత్వం నా శిష్యులు చెబుతారు అంతకన్న మెరుగ్గాను పరిశీలించేవాడేదండి ?

కేశ  కనక మనకు యిప్పుడు కొత్తగా వచ్చిన క్షూణత లేదని నా మతం బిల్హణుడికి మీకూ స్నేహం కలుపుతాను రండి

నారా  అయితే వాడి కాళ్ళు పట్టుకోమంటారా యేమిటి ?

కేశ  ఏవీఁ బిల్హణుడు రామశాస్త్రీ కృష్ణస్వామీ పాటి పండితుడూ కవి కాడనా మీ అభిప్రాయం ?

నారా ఆ పీనుగులకంటే యెవడైనా నయవేఁ అని నా అభిప్రాయం

కేశ నేను చెప్పవచ్చిన మాటా అచే బిల్హణుడు మహాకవీ ప్రతిభావంతుడున్నూ అప్పుడే రామశాస్త్రుల్లుకి కృష్ణస్వామికి కొన మళ్ళించాడు అది మనకో గొప్ప లాభం కాదా?

నారా ఔను గాని మన కొన కూడా మళ్ళించే ప్రయత్నం చేస్తున్నాడే

కేశ మనకు కొనంటూ వొకటి వుంటే కదూ మళ్ళించడానికి ? మీ నా అదృష్టాలు గిడసబారాయి రాజు మన శాస్త్రాలు అక్కర చెయ్యడమే మానెను మనం సభకు రాకపోయినా యేమైనారని తనుపే లేదు మన పదవి సదక్షిణాకంగా ధారపోస్తే వొల్లడు బిల్హణుడు

నారా అవును మన అవస్థ అలాగే వుంది

కేశ ఈపాటి భాగ్యానికి అతగాడితో వృథావాదం మన కెందుకూ ? కలహం పెంచకండి నిన్న మీ ఉభయులూ వాదిసస్తా వున్న సమయంలో రాజు ఉదయమంత్రితో థాచకార్యాలు ప్రశంసించుచుండెను కనిపెట్టితిరా ?

నారా అలాఁగండి ? అయితే నా వాదనంతా వృథాయే? అవును రాజు మెచ్చుతాడన్న ఆశ చాలా కాలామాయి వొదులుకున్నాను గాని జినచంద్రుడయినా మెచ్చుకున్నాడా ?

కేశ స్తంభాన్ని జారబడి నిద్రపోయినాధు

నారా ఆసి వీడి బొద్దు పొక్కా పాండిత్యం కురిపిస్తూంటే యలా నిద్రపోయినాదయ్యా ?

కేశ ఇక్కడికి సంతుష్టి అయిందా ?

నారా అయితే ముందు యేంజేదాం ?

కేశ ఇటుపైని వాదం మానేసి, బిల్హణ్ణు ఏమన్నా మెచ్చుకుందాం

నారా ఓడిపోయినా వఁసుకొంటాడేమో ?

కేశ బిల్హణుడి యోగ్యత మీ రెరుగరు ఎదుటివాడి సత్తువ యెన్నే ఔదార్యం పండితుల్లోకల్లా అతనియందే కలదు నిజమైన విద్వత్తుకు జోహారు చేస్తాడు అతను వైరులకు పిడుగు స్నేహితులకు చందనము

నారా అయితే నా పాండిత్యం విషయమై అతగాడి అభిప్రాయం యెట్టిదో కనుక్కున్నారా ?

కేశ దిగ్గంతులం మన పాండిత్యం విషయమై ప్రాజ్ఞుడైన వాడికి మరో అభిప్రాయం యెలా కలుగుతుంది ఆయన మనసులో మాట దాచే వ్యక్తి కాదు రేపో నేడో ఆయన ముఖతః మీరే వింటారు అదిగో మాధవ శర్మ వస్తున్నాడు మొహం మంగలంలా వుంది

(యామినీదేవికి విద్యాగురువు మాధవశర్మ ప్రవేశించును )

మాధవ రాజుకు మతిపోయింది

నారా యేవండోయ్ ?

మాధవ యామినీదేవికి బిల్హణుడిచేత విద్య చెప్పిస్తాడష ?

నారా మరి మీరో ?

మాధ కొత్త నీరొచ్చి పాత నీరు కొట్టుకుపోయింది

నారా యేం విద్య చెప్పిస్తారో

మాధ : యేం విద్యో నాకేం కావాలి క్షూణతలో క్షూణత, అతగాడు చదువు చెబుతూవుంటే నేను కూడా వింటూ దగ్గర కూర్చోవాలష ! "విపులాచ పృథ్వీ" అన్నాడు, మరో రాజు కాళ్ళు పట్టుకుంఛాను.

కేశ : బావా తొందరపడకు నీ జీతం నిలుపు కాలేదు కదా ?

మాధ : లేదు గాని పువ్వులమ్మిన వూళ్ళో కట్టెలమ్మ వలసి వచ్చింది గదా ?

కేశ : రాజుల ఇష్టాఇష్టాలు, మనమా.శాసించే వాళ్ళము ? పండితుడన్న వాడికి కాలు కాలిన పిల్లలాగ దేశాలు తిరిగి కష్టజీవనం కల్పించుకోడానికి బదులుగా, గొప్ప ఆస్థానమందు ఉపాధి కలగడం పెద్ద అదృష్టం కాదా ? అది తన్ను కుపోవడం ఉచితం కాదు. మన రాజు రాజర్షి! యిట్టి రాజు యెన్ని రాజ్యాలు తిరిగినా మీకు దొరకదు.

మాధ : రాజర్షయితే ఇలాంటి ఘోరం ఆచరిస్తాడండీ !

కేశ : ఘోరానికీ, ఆఘోరానికీ మీరయినా యామినీదేవికి కలకాలం విద్య చెప్పేది లేదు కదా ? రేపో నేడో ఆమెకు వివాహమైం విద్య కట్టిదుతుంది. ఈలోగా బిల్హణుడు నొల్లుకుపోయింది ఏమీ లేదు.

మాధ : యెవడిదాకా వస్తే గాని వాడికి తెలియదు.

కేశ : ఎవడైనా కాక తీరని పనికి తలవంచక తీరదు. రాజుకు యెవడు మాన్యుడైతే మనకు వాడే రాజు గనక బిల్హణుణ్ణి మంచి చేసుకోవడమే నీతి.

మాధ : మానభంగానికి కారణభుతుడైన శత్రువును బతిమాలు కొమ్మన్నావు. మంచి నీతే.
"రథకారో నిజాం భార్యాం
సజారాం శిరసా కరోత్"
అన్న న్యాయంగా వుంది నీ సలహా !

కేశ : మనిషి దైవసృష్టి, శత్రుమిత్రులు మనుష్యసృష్టి.
"అయం బంధుః పరోవేతి గణనా లఘుచేతసామ్ !
పుంసా ముదార చిత్తానాం వసుధైవ కుటుంబకమ్ !!"

మాధ : చాల్చాలు. నీ కుతర్కం చాలించు.
(కవి కృష్ణస్వామి ప్రవేశించును. మాధవశర్మ అతనికి ఎదురుగా వెళ్ళి)

మాధ : విన్నారా ?

కృష్ణ : చూచాయగా.

మాధ : (నారాయణభట్టుతో) చూశారా, వూరందరికి తెలిసింది !
(కృష్ణస్వామితో) ఆవుత్తరాది వాడు మీకంటే పెద్ద కవిషండీ ?

కృష్ణ : పెద్ద కేంవుంది. అందరికంటే తాటిచెట్టు పెద్ద. కవిత్వం ఒక పాటిగా చెబుతాడు; గాని పండితుడు.

మాధ : పండితుడే కాగట్టండి ! ఒకపాటి కవి కాదు మహాకవే అనండి. రాజపుత్రికలకు తరతరాలనుంచి ఆస్థానం కనిపెట్టుకొని కాలం గడిపిన మీ, నా బోటివారు విద్య చెప్పడం భావ్యం గాని, శీలం

యెట్టిదో, సంప్రదాయం యెట్టిదో తెలియని దిక్కుమాలిన పరదేశిని అంతఃపురంలో ప్రవేశపెట్టడం ఉచితమేనా ?

కృష్ణ : ఆ మాట అన్నారు, ఒప్పుకున్నాను.

మాధ : (మెల్లగా) మాట వరసకు అనుకుందాం. బిల్హణుడు జారుడైతే ?

కృష్ణ : మీ పుట్టేం మునిగింది ? రాజు అనుభవిస్తాడు.

మాధ : ఈలోగా యీ మానావమానవంతా, నేను అనుభవించాలి గదండీ !

కృష్ణ : మానవమానాలు, వకడ యిస్తేనా వస్తవి? రాజుటండీ బుద్ధియొక్కా, విద్యయొక్కా విలువ కొల్చేవాడు? లేకుంటే, ఆ రామశాస్త్రుల్లు సొట్ట కవిత్వం మెచ్చుతాడు గదా, రాజు తెలివి యేమని చెప్పను!

మాధ : అయితే యిప్పుడు మనం యేం జేయడం, మీ సలహా.

కృష్ణ : సలహాకేవుంది? మాట్లాడక వూరుకోవడవేఁ సలహా.

మాధ : ఈ అప్రతిష్ఠ సహించి యెలా వూరుకోవడం ? నాలుగు మాసములు శలవు పుచ్చుకుని తీర్థయాత్రలు చెకుదునా ?

కృష్ణ : వెళ్ళండి.

మాధ : (మెల్లగా) ఆహవమల్ల మహారాజు పట్టపుదేవి తరుచు వర్తమానం చేస్తున్నారు. వస్తే నాలుగు గ్రామాలు అగ్రహారంగా దయచేయిస్తావన్నారు.

కృష్ణ : అలాగైతే, యింకా ఆలోచిస్తారేవిఁ?

జిన : పడపడ వాగితే, యీ రాజులు డంగైపోతారు. నాలుగు పంక్తులు వ్రాస్తే పస బయలుపడుతుంది. పత్రికావాదం పెట్టి, పత్రికలు కాశీకి పంపమనండీ, బలాబలాలు తెలుస్తాయి.

(కవి రామశాస్త్రి ప్రవేశించును.)

గోవింద : అతగాడికి పుపాసనాబలం వుందండీ. వాదన సమయంలో నాకు యెన్నో యుక్తులు స్ఫురిస్తాయి. వాక్స్తంభనవి మాట పైకి రాదు. మనిషిని గెలియడం శక్యం గాని, మంత్రాన్ని గెలియడవేఁలాగ.

రామ : అంత పెనుప్రళయం అతగాడిలో యేమీ కానరాలేదే ?

మాధ : (రామశాస్త్రిని పక్కకు పిలిచి) యేనాటికి యేవొస్తుందో తెలియదు.

రామ : యిప్పుడే వొచ్చింది !

మాధ : యీనాటికి యామినీదేవికి చదువు చెప్పడానికి నేను తగాను కాను.

రామ : యేమండి ?

మాధ : యేమో, రాజుగారికే తెలియాలి. రేపటినుంచి బిల్హణుడిచేత విద్య చెప్పిస్తారట !

రామ : అలాగనా, ప్రభుచిత్తం మనవేఁ చెయ్యగలం ?

మాధ : అంచాతనే దేశాంతరం వెళ్ళడానికి ఆలోచించాను.

రామ : అట్టి ఆలోచన యెన్నడూ చెయ్యకండి. మీరు పిల్లలవాళ్లు, యిల్లూ వాకిలీ; తోటా దొడ్డీ కల్పించుకున్నారు. యెక్కడికి లోకం అంతా ఒక్కతిగానే వుంటుంది. మరి వక రాజ్యంలో

మాత్రం ధర్మం నాలుగు పాదాలా నడుస్తుందనుకున్నారా ? వెఱ్ఱి భ్రమ; ఆకాడికి మన రాజ్యమే నయం. రాజు సత్యసంధుడు. నిలబడి నిర్వహించడం నీతి గాని యెవడో దంబాచారి వచ్చాడని నొగలు విప్పి వెయ్యడం పౌరుషమేనా ?

మాధ : నాలుగు రోజులు జబ్బు పేరు పెట్టుకొని యింట వుండిపోదునా ?

రామ : రాజు పోల్చుకొని కార్పణ్యం వహించగలడు.

మాధ : అయితే యేం జేదాం ?

రామ : (మెల్లగా) యిసుంటారండి (నాలుగు అడుగులు యెడంగా వెళ్ళి) కపట స్నేహం చేసి వాడి లోతుపాతులు కనిపెట్టండి. కర్తవ్యం ముందు ముందు ఆలోచించుకుందాం.

మాధ : మీ సలహా బాగుంది.

రామ : సాయంత్రం కలుసుకు మాట్లాడుదాం. ఇప్పుడు యెడంగా వెళ్ళిపోండి. బిల్హణుడు వస్తున్నట్టుంది.

(బిల్హణుడు, పురోహితుడును ప్రవేశింతురు.)

బిల్హ : బ్రాహ్మణోత్తములకు నమస్కారము.

రామ : (నారాయణ శాస్త్రితో) చూశారా, బ్రాహ్మణోత్తము లంటాడు గాని పండితులనడు.

(బిల్హణుడును సభామంటపంలో నిలుచున్న వారిని చూపు విసురున పరికించ నారాయణభట్టు దగ్గరకు పోయి కౌగిలించుకొనును.)

బిల్హ : పండితోత్తమా, మీరు పతంజలి అవతారము. మీ వాగ్ధోరణి విన్న నాకు అపూర్వ కర్ణానందము చేసినది. నన్ను మెప్పించిన వైయాకరణి కిత్తునని నే ప్రతిజ్ఞ చేసిన యీ రుద్రాక్షమాల మీ కంఠము నలంకరించు గాక !

(తన మెడలోని బంగారు కట్టిన రుద్రాక్షమాల నారాయణభట్టు మెడను వేయును.)

నారా : వద్దు - వద్దు - వద్దు, నేను తగను. మీ వంటి మహానుభావుల మెప్పే పది కోట్లు.

(రుద్రాక్షమాల చేతబట్టి తీయునటుల అభినయించుచు కేశవభట్టు వంక చూచును. నలుగురు పండితులు చుట్టూ మూగుదురు.)

కేశ : మహాపండితుడు చేసిన సన్మానం ప్రభుసన్మానముకన్న దొడ్డది. ఉంపించండి.

బిల్హ : ఈ అపూర్వమయిన మాల రాజపండితుడైన కర్ణ మహారాజు కంఠమును మున్ను అలంకరించెను. ఇప్పుడది పండిత రాజు కంఠము నలంకరించినది.

రామ : (మాధవ శర్మతో మెల్లగా) మహారాజిచ్చిన మాల భట్టు కిచ్చాడు. యేమి యితగాడి పొగరూ !

మాధ : (రామశాస్త్రితో) వీడు యెన్నాళ్ళో దక్కడు.

(పూజా బ్రాహ్మణుడు ప్రవేశించి)

పూజ : మహాప్రభువారు పూజాగృహానికి విజయం చేశారు.

(పండితుడు బ్రాహ్మణుడి వెంట పోదురు.)

## రెండవ రంగము

(కర్ణమహారాజు పూజా మంటపము. రాజు పూజ చేయుచుండును. ఇరు ప్రక్కలనూ పండితులును, ఉద్యోగస్థులును కూర్చునియుందురు.)

కర్ణ మహారాజు : నిన్నటి వాదములో యెవరు గెల్చినట్టు ?

కవి రామశాస్త్రి : గెలుచుటకూ, వీగుటకూ ఏమున్నది మహారాజా !

కేశ : సత్యమే అన్నదాతా ! పూర్వ పశ్చిమ సముద్రములకు వార ఏమిటి ? అసాధారణ ప్రతిభావంతులగు మహా పండితులచేత ఉత్పాదితమైన వాక్పరంపర భగతుత్పాదితమగు సృష్టి పరంపర వలెనే (చెయ్యి రామశాస్త్రి వైపు తిప్పి) అస్మదాదులకు ఆశ్చర్య జనకమై యెన్ననశక్యమై యుండును. విష్ణ్వంశ సంభూతులగుటను వారపారలు, యేలినవారికే తెలియవలయును.

కర్ణ : రామశాస్త్రుల్లు గారు ఏ మంటిరి ?

రామ : మహారాజా ! కేశవభట్టు గారు తార్కికులు గనుక వాదాదర మనుస్కులు. మంచిదేగాని వివాదాంశము వస్తుతత్వమును గూర్చి కాక, పరవస్తుతత్వమును గూర్చి కాక ఒక వ్యాకరణ సూత్ర మందు ఒక మాటకు వినియోగమున్నదా లేదా యను కుశంక ననుసరించియున్నప్పుడు, అట్టివాదము కాలము వెళ్ళపుచ్చునుగాని, తత్వాన్వేషణమునకు కానేరదు. సూత్రములు ఋషి ప్రణీతములు, మార్చబడనేరవు. కాన, వాదమునకు చరితార్థము తక్కువ. వినోదార్థముచేయు ప్రసంగములకు వీగు గెలుపు లెక్కడివి మహాప్రభో !

కేశ : వ్యాకరణము వేదాంగమై, శబ్దబ్రహ్మమును గూర్చిన శాస్త్రమైనపుడు చరితార్థము లేకుండుట యెటులు ?

"అజ్ఞానాంధస్య లోకస్య జ్ఞానాంజనశలాకయా

చక్షురున్మీలితం యేన తస్మై పాణినయే నమః॥"

అనే శిక్షావాక్యము నిరర్థకము కానోపునా ?

విదూషకుడు : వారి వ్యాకరణ శాస్త్రము శబ్ద బ్రహ్మపరము. మీ తర్కశాస్త్రము అర్థబ్రహ్మవరము. అర్థబ్రహ్మన్నే అందరూ ఉపాశిస్తారు. శబ్ద బ్రహ్మంతో సంతుష్టి తక్కువ. అర్థం మాట కొస్తే మంత్రి నానావంతులు, మహాపండితులు, మీరంతా నిరర్థకులే !

రామశాస్త్రి : స్వారస్యం బాగా తీశావు

మంత్రి నానాపంత్ : చుట్టూ తిరిగి ము క్తాయింపు నా మీదే ?

విదూ : నిజం చెబిదే నిష్ఠూరం ! యస్యాస్తివిత్తం సనరః కులీనః సపండితః అనలేదా ?

రామ : అవును, కాకేమి ? అర్థశాస్త్రంలో నానామంత్రులు పండితులే !

విదూ : ఆ మాటే నేనంటే హాస్యం. మీరంటే నిజం.

| | |
|---|---|
| కర్ణమహా | నిజమనేది ఏమిటో ? |
| విదూ | మంత్రులాడే మాటలల్లా నిజం |
| కర్ణమహా | వారు అబద్ధమాడినా నిజమౌతుందా ? |
| విదూ | సాగింది నిజం సాగంది దబ్బర మంత్రులనే మాట సాగుతుంది గనుక వారనేమాటల్లా నిజమే ఇంకా ప్రభువుల మాటే సాగక తరుచు దబ్బరౌతుంది |
| కవి కృష్ణస్వామి | గౌతముడిది ఏదో వినియోగ౯గల వాదం గాని వ్యాకరణ వాదంలాగ నిరర్ధకం కాదు |
| కర్ణమహా | మంత్రివర్య గౌతముల యెడల మనమేమో అపరాధము చేసినట్టుంది |
| నానామంత్రి | మహాప్రభో ప్రభువులకు ధనం కూడికచేస్తే అది అందరికి అపరాధమే |
| విదూ | యెన్ని అక్రమాలు చేసినా మంత్రులకు ఇది వక దాలు దొరికింది నీతినిపుణుడైన మంత్రి స్వప్రతిభవల్ల కొత్త మార్గాలు కల్పించి ధన సంగ్రహం చెయ్యాలిగానీ రాజునూ రాజునాశ్రయించుకున్న వాళ్ళనూ యెందు చాపలవలె యిగరగట్టడమా ప్రయోజకత్వము ? |
| కవి కృష్ణ | మరి వారి జాగ్రత్త ప్రభువులకు వ్యక్తం కావడ మె౯లాగ ? |
| విదూ | గనక ఆస్థానమందు కనిపెట్టుకుని వున్నవాళ్ళకే మొదట తాళం పట్టాలి పయిన యెంత దూబర అయినా చింతలేదు |
| కవికృష్ణ | మహాప్రభో మన ఉద్యోగస్తుల మీద గౌతముడు పద్యం చెప్పాడు చిత్తగించ తగి వున్నది |
| కర్ణమహా | ఏదేదీ ? |
| గౌతముడు | వారి మహిమ అతీతః పంథానం వాఙ్మనసయోః? అయినా చకితమభిధత్తే అన్నట్టు చెప్పాను |

కం దబ్బరలుం గొందెమ్ములు
మబ్బువలెం గమ్ము మాయ మాటల తీపున్
నిబ్బరపు మొండితనమును
నబ్బురమగు విద్య లిచటి యధికారులకున్

| | |
|---|---|
| కృష్ణస్వామి | అక్షరలక్ష ఇయ్య తగి వుంది |
| నానామంత్రి | హాస్యగాణ్ణి అయినా హద్దుమీద వుంచాలి |
| కర్ణమహా | (చిరునవ్వుతో) హద్దుమీరిన మనిషి ఒక్కొక్కడు ఉంటేనే గాని హద్దు యొక్క గుణాగుణములు తెలియవు మనవలె ఉచ్ఛావస్థలో నున్న వారిని స్వేచ్ఛగా తిట్టగలిగిన వారిని వకరిని అచ్చుబోసి వదిలితేనే గాని మనను గూర్చి లోకం ఏమనేది మనకు తెలియబోదు ఏమంటారు ? |
| కృష్ణ | సత్యం సత్యం పునస్సత్యం |
| రామ | మహారాజా ఉచ్ఛావస్థలో నున్న ప్రాజ్ఞులు మంచి చెడ్డలు యెరగకనా సంచరిస్తారు ? మంచిచెడ్డ లన్నవి అంతకన్న లోకులకే బాగా తెలియగలవు |

విదూ : భర్తృహరి ప్రభువులను గూర్చి ఏమో చెప్పాడు. రామశాస్త్రుల్లుగారికి విస్మృతి వచ్చినట్టుంది.

నానామంత్రి : తల్లితండ్రులు ప్రభువులను దిద్దాలి. మాబోటి అధికార్లను ప్రభువులు దిద్దాలి; గాని తిట్టి బతకనేర్చిన కడుపుకూటి బ్రాహ్మడా, మహాప్రభో తప్పొప్పులు కనిపెట్టేవాడూ ? కొందరు మహానుభావులు యితగాడికి విందులు పెట్టి వారి పగలు ఈ వికటకవి ద్వారా తీర్చుకుంటారు. అయినా, సౌఖరుకు విచారం లేదు. ప్రభుసేవా దైవసేవలతో కాలం వెళ్ళబుచ్చే మనిషి దూషణ భూషణ తిరస్కారములు సరకుగొనదు. మనవి చెయ్యవలసిన మాట ఒకటి ఉండి పోయింది మహాప్రభో! మాతా మహారాణీవారి శలవైనది. మహారాజా కుమారికా వారికి విద్యాభ్యాసము ముగించవలసిన కాలము మీరినదని వారి అభిప్రాయము.

కర్ణమహా : అమ్మాజీవారి ఆజ్ఞ మనందరికీ శిరస్సున ధార్యము.

కృష్ణస్వామి : (విదూషకునితో) ఏమి వెన్నుకుప్ప పరిశీలిస్తున్నావు ?

విదూ : ఈ దొడ్డ సలహా మాతా మహారాణి వారికి, యెవరు మనవి చేసి యుందరో అని.

కర్ణమహా : వెన్ను కుప్ప చెప్పునా ?

నానామంత్రి : నేను మనవి చేశానని కాబోలు, ఈ బ్రాహ్మడి మాటల ధ్వని. శ్రీకృష్ణులు సాక్షి నేను మనవి చెయ్యలేదు.

కర్ణమహా : యెన్నడూ వొట్టు వేసుకోకండి. వొట్టు వేసుకోవడం ఇతరులు మన మాట నమ్మరని కదా? నమ్మినా, నమ్మకపోయినా, వొట్టు వల్ల కార్యము లేదు కదా ?

రామశాస్త్రి : సలహా మాటకు వస్తే, ఈ విషయములో ఒకరి సలహాకు యేమి అవకాశం కద్దు ? మహారాజకుమారికా వారికి విద్యాభ్యాసపుటీడు మీరిన దని, ఒకరు విన్నవించిన గాని, మాతా మహారాణి వారికి తెలియదు కాబోలు.

విదూ : కొందరు అధికార్లకు ఆశ్రయగుణమూ పొగడ్తా రుచి. బిల్హణుడు ఉద్యోగస్తులకు కైవారం చెయ్యడు. వారి నోట వచ్చిన మాట కల్లా ఆహా! హా! అని ఆశ్చర్యం నటించడు. ఒచ్చిన ఉపద్రవం యిదీ.

కృష్ణస్వామి : నిజమైన పండితుడికి ప్రభువులయందే లక్ష్యం ఉంటుంది గాని. ఉద్యోగస్తులయందు లక్ష్యం ఏల వుండును ?

రామ : ప్రభు లక్ష్యమే లేని పండితులకు ఉద్యోగస్తుల లక్ష్యమెలా వుండును ?

నానామంత్రి : బిల్హణుడు ప్రభువులను కూడా లక్ష్య పెట్టడా ? మహాప్రభువు వారిని గూర్చి చులకనగా ప్రశంసించెనా ? ఏమిటి ? అంతవాడూ అవును !

మాధ : ప్రశంస అని ప్రశంస కాదు. ప్రభువులు చేసిన సన్మానాన్ని నిరాకరించారని కాబోలు రామశాస్త్రిగారి భావం.

కర్ణమహా : ఆదెలాగ ?

కృష్ణ : మరేమీలేదు. ఏలినవారు దయచేసిన రుద్రాక్షమాల, పదిమంది పండితులలోనూ. నారాయణభట్టుగారి మెడను వేశారు (రామశాస్త్రితో) అదేకదండీ మీరనబోయే మాట ?

కర్ణమహా : (కనుబొమ లెగయ యోచన నటించి) అలాగనా స్వామీ !

కృష్ణ : నా కళ్ళతో చూశాను.

నానామంత్రి : ప్రభువులు వచ్చిన దాసరినల్లా మెచ్చి హారాలూ, అందలాలూ ఇస్తూవుంటే, వాళ్ళు నిరసించడం ఆశ్చర్యమా !

విదూ : ప్రభువుల శలవైనప్పటికీ, ఒక కాచవైఁనా ఇవ్వకుండా మీరు కలకాలం తిప్పుతూవుంటే, ప్రభువులు వొళ్లువొలిచి, హారాలూ, అందలాలూ యివ్వవలసి వొస్తుంది. ఇదే మీలాటి మంత్రులు ప్రభువులకు చేసే కూడిక.

కర్ణమహా : మంత్రివర్య! బిల్హణ కవి ఇటి పనిచేసారని మేము తలచి యుండలేదు.

నానామంత్రి : దేశ దిమ్మరి. తరతరాలనుంచి కనిపెట్టుకున్న వాళ్ళకి వుంటాయి గాని ఏలినవారి యెడల భక్తి విశ్వాసాలు, అట్టివాడికెలా వుంటాయి ?

కృష్ణ : బుఱ్ఱకు విలవ తక్కువ అనండి. స్వదేశి అయితేనేం, పరదేశి అయితేనేం !

నానా : కాకుంటే, తన తలేవిఁటి ప్రభువులు తనకిచ్చిన అమూల్యమైన హారం, తానంటూ మరివక పండితుడికి బహుమానం చెయ్యడవేఁవిటి ?

కర్ణ : ఇంకా బిల్హణులచేత మహారాజకుమారికలకు చదువు చెప్పించవలె ననుకుంటిమి. ఈయన ప్రవర్తనకు తగిన ప్రతిక్రియ యెద్ది ?

విదూ : తన్ని తగిలివెయ్యడం.

నానా : ఉచ్చాటన చెయ్యడమున్నూ అతనివద్ద నున్న ధనము తీసికొని, ధర్మ వినియోగము చెయ్యడమున్నూ ఉచితమని తలుస్తాను.

కేశవ : క్షమాపణకోరి, విన్నవిస్తును. మహారాజాధిరాజా! పండితుడు శిక్షార్హుడు కాడు. "విద్వద్దండమ గౌరవమ్" అదిగాక నేరమన్నది ఒకటి స్థాపించవలసి...

కర్ణ : (కొంచము కోపరసంగా) నేరం లేదనా మీ అభిప్రాయం ?

కేశవ : చిత్తం, చిత్తం, నేను యేమి మనవి చెయ్యగలను.

మాధవ : నేరవేఁ కాకపోతే యెన్నడూ కోపవెఁరగని ప్రభువులకు కోపవెఁందుకు వచ్చేని ?

రామ : (మాధవశర్మతో మెల్లగా) ఊరుకోండి.

కర్ణ : మంత్రివర్య, ఈ బ్రాహ్మణ్ణి అరవై గడియల్లోగా పట్నంలోనుంచి సాగనంపితే ?

నానా : చిత్తం ! యేలిక శాసనము ఈ క్షణమందే అమలు చేస్తాను. (పత్రిక వ్రాసి పంపును,

కర్ణ : మంత్రివర్య, మహారాజ కుమారికావారి విద్యాభ్యాసము విషయమై, మీ అభిప్రాయ మెట్టిది ? మీరు అనుభవ శాలులు, సంప్రదాయజ్ఞులు.

నానామంత్రి : మాతా మహారాణివారి శలవు ఆ ప్రకారం అయినది. నేను ఏమి చెయ్యగలను ?

కర్ణమహా : సంగీత సాహిత్యములూ, కొంత వరకు తర్క వ్యాకరణమూలూ, బావాజీ వారు చెప్పించారు అదంతా మాధవశర్మగారి ఆశీర్వచన ఫలం గాని, ఈ విద్యలు జ్ఞానసాధనములు. ప్రత్యేకం వీటి యందు విలువ తక్కువ. భగద్గీతను ఉపదేశించి మరీ విద్యాభాసము విరమించడము ఉచితమని యిదివరకు అనుకుని వుంటిమి.

నానామంత్రి : ఏలికల వాక్యములు గురూపదేశములు. విద్య అనగా ముక్తి సాధనమైన విద్యే. సందేహ మేమిటి మహాప్రభో !

కర్ణ : మహారాజ కుమారిక భగవద్గీతను పఠించతగ్గదనే మీ అభిప్రాయమా ?

నానా : చిత్తము. నా చిన్నతనంలో మా తల్లిగారు పఠిస్తూ వుండగా నాకు కూడా గీతాశ్లోకములు కంఠోపాఠంగా వచ్చినవి. ప్రాజ్ఞుడనైన తరువాత వారణాసిలో గురుముఖతః గీతోపదేశం అయినాను. దక్షిణ యాత్రలు వెళ్ళినప్పుడు కాంచీపురంలో లక్ష్మణాచార్యుల వారివద్ద కూడా గీతార్థం విన్నాను. నేను అజ్ఞుడనే గాని నేమనని చేసిన స్వారస్యాలు వారు చిత్తగించి ఆశ్చర్యపడేవారు. అది అల్లా అమ్మాజీ మహారాణీవారి శిక్షా ప్రభావం మహాప్రభో !

కర్ణ : సందేహమేమి ? సముద్రమునకైనా మేరకద్దుగాని, మనిషి బుద్ధికిమేర యెక్కడిదీ ? వాఖ్యాన కర్తలూ, మనవంటి మనుష్యులేనా ? గురుబుద్ధికి పై ఆడవలెనని శిష్యుడు ప్రవర్తిస్తేనే గాని విద్య పెరగదు. అమ్మాజీవారికి భగవద్గీతయందు మంచిప్రవేశము కలదు. మీరు మనవి చేస్తే మహారాజకుమారికావారికి కూడా ఆ గ్రంథరాజమును చెప్పినందుకు వప్పుదురేమో !

నానా : శలవయితే మనవి చేస్తాను.

కర్ణ : మీర మనవిచేస్తే, వారు ఆమోదించడముకు అభ్యంతరం వుండబోదు. గాని బిల్హణులు వెళ్ళిపోతే యెవరిచేత ఉపదేశం చేయింతుము ?

నానా : మన పండితులు దిగ్దంతులు, యవరైనా చెప్పగలరు.

కర్ణ : లోకానుభవమూ, బోధకతా శక్తీ కలవారు మీ రేల చెప్పరాదు ?

నానా : ప్రభువుల శలవైతే, తప్పకుండా చెప్పుతాను. మాధవశర్మగారి సహాయం వుండనే వుంటుంది.

మాధవ : ఆహా,

కర్ణ : అయితే అమ్మాజీవారితో మనవిచేసి వత్తురా ?

నానా : చిత్తం మనవిచేసి, యిప్పుడే తిరిగి హాజరవుతాను (నిష్క్రమించును)

విదూ : యేమి చిత్రమైన లోకమూ?

కర్ణ : కొత్త చిత్రం యేమి కనబడ్డది ?

విదూ : నేను ఒక్కణ్ణి తప్ప లోకంలో మరి యెవరికీ తన అవస్థతో సంతుష్టి లేదాయే ?

కర్ణ : యెలాగో ?

విదూ : పండితులకి ఉద్యోగాలు చెయ్యాలని తాపత్రయం. ఉద్యోగస్థులకు పండితు లనిపించుకోవాలని తాపత్రయమూను.

కర్ణ : మా మాటో ?

విదూ : తమ మాట చెప్పనేల ? అంతా యెరిగినదే ! నా పదవి మీద మీరు కన్ను వేశారు.

కృష్ణ : మొదటికే తెచ్చావూ !

విదూ : రామ శబ్దంరాని నానామంత్రిచేత గీత ఉపదేశం చేయించదానికి తమరు తలపడ్డప్పుడు నా బిరుదులు నేను తమకు సమర్పించక తీరదు గదా ? (మహారాజు విదూషకుడి చెవిలో రహస్యము చెప్పును. విదూషకుడు టొంకరి నడకతో నిష్క్రమించును)

కృష్ణ : (మాధవశర్మతో చిన్న గొంతుకతో రహస్యమాడి, పైకి)
"ముఖేహోరావ్యాప్తిః" అన్న శ్లోకము విషయమై మాధవశర్మ గారు ఒక చిత్రకథ చెప్పుతున్నారు.

కర్ణ : యేమిటండి ?

కృష్ణ : మరేమీ లేదు. ఆ శ్లోకం దాహలాధీశుడైన కర్ణమహారాజును ఉద్దేశించి చెప్పినదట.

కర్ణ : యెంగిలి శ్లోకమా మాకు సమర్పణ అయినది !

కృష్ణ : చాలామంది కవులమనేవారు, యెంగిలి శ్లోకాలవల్లనే ప్రతిష్ఠ సంపాదిస్తారు.

రామ : పరదేశికి యేలినవారియందు భక్తి యెలా వుంటుంది ?

కర్ణ : పేరు ఒక్కటయితే యిట్టి తారుమార్లకు అవకాశం వుంటుంది.

కేశవ : యేలినవారికి తెలియనిది లేదు. ఆ శ్లోకము మట్టుకు మిక్కిలి విలవైనది చాలాకాలము కిందటనే రచితమయిన యెడల, ప్రభువుల యొక్కా, పండితులయొక్కా కర్ణగోచరము కాకుండునా? బిల్హణకవి కొత్త శ్లోకం చెప్పే పాటి సామర్థ్యం లేనివాడు కాదు

రామ : మంచి శ్లోకవఁన్నది తలంచినప్పుడల్లా స్ఫురిస్తుందా?

(విదూషకుడు ప్రవేశించును)

కర్ణ : ఈయన కాశ్మీర రాజుల ఆస్థానము యేల విడిచిరో యెవరికైనా తెలుసునా ?

రామ : మనవి చెయ్యడమునకు వీలులేని కారణము చెబుతారు

కృష్ణ : తన్ని తగిలేశారని ఈ మాధవశర్మగారే చెప్పారు.

మాధవ : నేనా చెప్పాను ! తప్పుగా విని వుందురు.

విదూ : ఈ కవిత్వం మాధవప్రణీతవఁయే ఉండాలి.

కర్ణ : (కృష్ణస్వామితో) ఎందుకా ఉచ్చాటన ఐందో ?

కృష్ణ : కారణవంటూ విశేషకారణ మేమీ లేదు. రాజుగారు వుంచిన వేశ్య సౌందర్యమును చూచి మనసు నిలవజాలినాగు కారట.

కర్ణ : ఐతే రసికులే.

విదూ : ఆ మాట కొస్తే, ఇతర మహాకవుల తక్కువ యేమిటో !
కృష్ణమిశ్రి చెప్పినట్టు యెంతటివాడికైనా...

శ్లో॥ సంతు విలోకన భాషణ
విలాస పరిహాస కేళి పరిరంభా॥
స్మరణ మపి కామినీనామ్
అలమిహ మనసో వికారాయ.

కర్ణ : అందరికీ తెచ్చారా !

కేశవ : క్షమాపణ మనవిచేసి ఒక్క సంగతి (శ్రుతపర్చుకుంటాను. బిల్హణుడు మహాపండితుడు, దేశదేశములు తిరుగును. అట్టివాడిని అనాదరణచేసిన యెడల, అపకీర్తి సాటగలదు. పండితులు శిక్షార్హులు కారు. "విద్వద్దండ మగౌరవం" అన్నాడు. నేరం యెంతవరకూ వున్నదో, వారు యెంతవరకు సమాధానం చెప్పుకోగలరో, ఆ తత్వాన్వేషణం కూడా కర్తవ్యమేమో అని సందేహం కలుగుతూంది.

మాధవ : అయితే, తత్వాన్వేషణం చెయ్యనిదే ప్రభువులు శిక్ష విధించారనా, మీ అభిప్రాయం ?

రామ : విష్ణుంశసంభూతలగు మహాప్రభువులు, అన్వేషణం అంటూ వకటి చెయ్యవలెనా నిజమును ?
"సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః॥"

విదూ : ఆ సిద్ధాంతం అందరి మెళ్ళకీ వురి అల్లుకోవడవేఁ. ఇప్పుడు ఒహడి పీకకు తగిలిస్తే. రేపు మన పీకకే తగులుకోగల్దు. ఇదుగో నానా మంత్రి వస్తున్నారు. నిద్రపోతున్న వాళ్ళ పీకలు తెగ్గొయ్యడానికి యింత మహావీరుడు మరి లోకంలో లేడు. ఆ ధర్మ సందేహవేఁదో ఆయన తీరుస్తారు.

(మంత్రి నానపంత్ ప్రవేశించును)

నానా : మహాప్రభో ! మహారాజకుమారికా వారికి భగవద్గీత ఉపదేశం చేయించడపు అభిలాష యేలినవారికి కలదని, శ్రీ మాతా మహారాణి వారితో నవుకరు మనవి చెయ్యగా మిక్కిలి సంతోషముతో వారు ఆమోదించారు.

కర్ణ : మీరు మనవి చేసిన తరువాత మరివకలాగు యేల ఔను !

విదూ : పాం విషం పావేఁ తియ్యాలి.

(నానామంత్రి కోపముతో విదూషకునివైపు చూచుచు)

కర్ణ : అతని మాటలు సరకు చెయ్యకండి.

విదూ : భగవద్గీత కాశీలోనూ, కాంచీపురంలోనూ అభ్యసించిన పంతులు వారికి కోపఁవెందుకు వుంటుంది? అయినా నిజవైన మాటకు కోపఁవెందుకు ?

కర్ణ : నిజమనేది యెట్టిదో ?

విదూ : అనుదినం భగవద్గీత పారాయణం మట్టుకు చేస్తూవుంటే అదే అబద్ధాలల్లా నిజవౌఁతాయి. ఇది వక శుద్ధక్రియ.

నానా : యేమిటీ యీ మాటలకి అర్థం ?

కర్ణ : విదూషకుడి మాటలకు అర్థం ఆలోచిస్తారేమిటి ?

కృష్ణ : కొందఱికి అతగాడి మాటలు ఆలోచించినకొద్దీ అర్థాలిస్తాయి.

నానా : వెట్టికి వెయ్యి అర్థాలు.

విదూ : కేశవభట్టుగారిని ఒక వెట్టి ధర్మ సందేహం బాధిస్తూంది. ఆయన వెట్టి తీర్చి, తరువాత నా వెట్టికి వైద్యం చేతురు గాని.

(కర్ణమహారాజు కనుబొమలెత్తి కేశవభట్టును చూచును)

కేశవ : నిజం విచారించి మరీ శిక్ష విధించిటం ధర్మశాస్త్ర పద్ధతేమో యని సర్వజ్ఞులున్నూ. ధర్మ స్వరూపులున్నూ అయిన యేలికల సమక్షమందు ఎంతో భయంతో మనవి చేసుకుంటున్నాను.

కర్ణ : యెంతమాటంటిరి; భయమేల? నేను రాజు నైననూ, కించజ్ఞుడను. రాజు నౌటనే కించజ్ఞుడను అని అనవచ్చును పండితులు, ప్రాజ్ఞులు వారి వారి నమ్మకములను నా యెదుట ముచ్చటించుటకు వెరచిరేని, నేను రాజ్యమునకు అర్హుడనే కానే ?

కేశ : రాజాధిరాజ ! పండితరాజను శబ్దము యేలినవారికే చెల్లెను ! గ్రంథములు నెత్తిని మోయుటకు అస్మదాదులము కూడా మహాపండితులమే. అయితే, మోతచేతేగాని, వాటి గ్రంథము ఆత్మలకు అంటక చదువులు ఒక తెన్నూ చర్యలు మరివక తెన్నూ అయి కామ లోభాదులచే జ్ఞానాం ధులమైన మా బోట్లకు, పండితశబ్దము యెట్లు చెల్లును ? లోకము పరిత్యజించి అడవుల్లో తపస్సుచేసే మునులకయినా లొంగని క్రోధాదులను నిర్జించిన యేలినవారే పండితులుగాని, ఈర్ష్య తీర్చుకొనుటకు గాను నిజమును కప్పి ధర్మమును దాచి, అల్పమైన ఐహిక లాభములనపేక్షించే మేమా పండితులము మహారాజా ?

కృష్ణ : ఈ ముక్కలేమో యెవరికీ తెలియనట్లు ఉపన్యసిస్తూన్నారు. రెండు కళ్ళతోనూ చూశామయ్యా అని ఘోషిస్తూ వుంటే, అట్టి బలవత్తరమైన సాక్ష్యాన్ని మీ పండిత దూషణ యేలా కొట్టగలదో, నాకు బోధపడకుండా వున్నది ఛాందసానికిన్నీ, రాజ్య తంత్రానికిన్నీ చాలా దూరం వుంది.

నానా : నాతో దోషే వొప్పుకుంటేనే! ఆ తావళ మనేది తాతాజీ మహారాజా వారు నేపాళం మహారాజులవద్ద సంపాదించారు. దీనితో అర్జునుడు జపం చేసేవాడని ప్రతీతి కూడా కద్దు. శివపూజా కాలమందు మహా ప్రభువువారు, నమస్కరించి, కళ్ళ నద్దుకుని మరీ ధరించేవారు. మీ యందు వుండే అసమాన గౌరవముచేత మీకిది అనుగ్రహ పూర్వకంగా దయచేశారు. “అది యెందుకు వక ఆస్థాన పండితుడికి బహుమానంగా యిచ్చావయ్యా ” అని నే నడిగితే, యేమంన్నాడంటే, “యీ కుళ్లు తావళానికి యీ దేశంలో కాబట్టి యింత మాన్యత కలిగింది. మా దేశంలో ప్రతి తుప్పనిండా ఏకముఖీ రుద్రాక్షలే. తెగించి నాకు యింత బహుమానం చేసినందుకు మీ రాజు బెంగ బెట్టుకోలేదు గదా?” అని నిర్మోహమాటంగా అన్నాడు. నా కంటూ ఆ మాటతో వొళ్ళు నీరు విడిచిపోయింది.

విదూ : యెప్పుడు ఈ ప్రసంగం జరిగిందో ?

నానా : నీ ప్రశ్నలకు సమాధానాలు నీలాంటివాళ్ళే చెబుతారు.

కర్ణ : చిత్రం, కొందరికి యెలకంటే బెదురు, కొందరికి పిల్లంటే బెదురు; నానామంత్రిగారికి గౌతములంటే బెదురు

నానామంత్రి : ఆ మాట శలవివ్వవద్దు మహాప్రభో! యేలినవారూ అమ్మాజీ వారూ తప్ప లోకంలో నాకు బ్రహ్మ భయం లేదు.

విదూ : యముడి భయమేఁ లేనివాడికి, బ్రహ్మభయం ఎలా వుంటుంది ?

కృష్ణ : వారు చెబుతూ వున్న సాక్ష్యం అబద్ధవోఁ నిజవోఁ కొసాకూ వినరాదూ ?

కర్ణ : తరువాతండి ?

నానామంత్రి : తరవాతే వచ్చి, మళ్ళీ అన్నాను "నారాయణభట్టుగారి విద్యను మహారాజులు తగినట్టు గౌరవించనట్టున్నూ, ఈ విషయంలో మహారాజుల లోపమును మీరు యెత్తి పొడిచి సవరణ చేసినట్టున్నూ లోకానికి అర్థం కాగలదు. మహారాజులు శాంతులని, యీలాటి నిరాదరణ చెయ్యరాదు" అని వేయి విధాల అతని మేలుకోరి, బోధ చేస్తే "రాజుల కేం తెలుస్తుంది విద్యల విలువ ? రాజులు విద్యాఘూకా" లన్నాడు.

విదూ : ఈపాటికి బిల్హణుడు వూరి పొలిమేర దాటివుంటాడు యెన్ని గోతాలు కోసినా ప్రతిబంధకం లేదు.

నానామంత్రి : అలా అనేట్టయితే, యిప్పుడు అయన్ని పిలిపించండి ఈ ఆస్థానమందు రుజు విప్పిస్తాను.

విదూ : అదుగో నారాయణభట్టుతో కలిసి ఆయనే వస్తున్నారు. మీరు తలచేటప్పటికి బిల్హణుడు ఆకాశాన్నించి వుట్టిపడ్డట్టుంది. కాయసిద్ధుంది కాబోలు.

(నానామంత్రి వెనుకవైపు నిర్ఘాంతపోయి చూచును. అల ఆచూచుచుండగా కర్ణమహారాజు స్వర్ణ పేటికలోని రుద్రాక్షమాల తీసి ధరించును.)

నానామంత్రి : వైదికులు హద్దుమీద వుండరు. ఉచ్చాటనా శాసనమైనప్పటికి యెలా తోసుకు వస్తున్నాడో! (ఉత్సాహముతో) అదిగో నారాయణ భట్టుగారి మెడలో రుద్రాక్షమాల !

విదూ : ఆచిత్రవేఁజూస్తారు, ఈ చిత్రం చూడండి. ఇదుగో ప్రభువుల మెడలో ప్రభువుల రుద్రాక్షమాల!

(నానామంత్రి ఆశ్చర్యముతో మహారాజు వైపు చూచి తిరిగి నారాయణభట్టు కంఠమును పరికించుచున్న సమయంలో బిల్హణుడు దగ్గిర కాగానే మహారాజు నిలుచుండును. అందరూ నిలుతురు. అది చూచి యెందుకో పోల్చుకోలేక, నానామంత్రి కూడా నిలుచును.)

కేశ : బోధపడ్డది "యీ హారము రాజపండితుడైన కర్ణమహారాజు కంఠమును అలంకరించినది" అని బిల్హణకవులు అన్నప్పుడు దాహళాధీశుడగు కర్ణుని ఉద్దేశించి చెప్పివుందురు కానలేకపోతిమి.

విదూ : ఇంతసేపటికి తర్కం పని చేసింది.

కృష్ణస్వామి : అదిటండీ. ఆప్లైతే మనమందరమూ బిల్హణులకు అపరాధం చెప్పుకోవలసి ఉంటుంది.

కేశ : చుక్కానికి న్యాయంగా పోతుంది స్వామివారి మనస్సు కలుషం లేదు.

కృష్ణ : పండితుడికి కలుషంవుంటే, మరి పండితుడేవిఁటండీ. ఆ మహారాజును చూసైనా నేర్చుకోవద్దా ?

కర్ణ : (బిల్హణ నారాయణభట్టులతో) దయ చెయ్యండి. దగ్గరగా కూచోండి. (అందరును యెవరి స్థలములయందు వారు కూర్చుందురు)

నానామంత్రి : (మాధవశర్మ చెవిలో) నా మాటలు గానీ వినివుండరు గద ?

విదూ : అప్పుడు చాలా దూరంగా వున్నారు; విని వుండరు; కర్ణ పిశాచి వుంటే తప్ప.

కృష్ణ : నీకు వున్నట్టుంది కర్ణ పిశాచి, యెక్కడలేని రహస్యాలు యెక్క లాగుతావు.

కర్ణ : (బిల్హణుని ఉద్దేశించి) కవి వర్య ! అజ్ఞానానికి అంజనం యేమిటి ?

బిల్హ : రాజ పదవికి నైసర్గికమైన మహాంధకారమును తొలగించి, నిశ్చలమైన జ్ఞానోదయమువల్ల అరిషడ్వర్గమును తలచూప నివ్వకుండా తరిమిన తమవంటి సత్పురుషుల సహవాసమే. అజ్ఞానాంజనము మహారాజా ! పండిత సామాన్యమునకు విద్యన్నది జ్ఞానసాధకంకాక మాత్సర్యహేతువైయే యుండును.

విదూ : నానామంత్రి గారి అభిప్రాయమూ అదే వారు మట్టుకు సాధనం లేకుండానే సాధ్యం సాధించారు.

కర్ణ : జ్ఞానాలోకమునకు ఉత్పత్తి స్థానము సూరులు. ఆ సూరుల సంసర్గం వల్ల నృపనామక పాషాణములకు కూడా కాంతి ఆపాదన ఔతుంది. నాకు గల స్వల్పజ్ఞానము అమ్మాజీవారి శిక్షవల్లనూ, మహా పండితుల సహవాసమువల్లనే కలిగినది. స్వామి మాకు బాల్యగురువులు ఇప్పుడు తాము అందరూ మాకు గురువులే. (మంత్రితో) మంత్రివర్యా ! రేపటి నుంచి బిల్హణ కవులు మహారాజ కుమారికా వారికి గీతోపదేశం చెయ్యడమునకు అభ్యంతర మేమీ ?

నానా : అభ్యంతరం అనగా అభ్యంతరం యెందుకుంటుంది. మహాప్రభో !

కర్ణ : అయితే అమ్మాజీ వారితో విన్నవించి వస్తాము. (లేచును. అందరు లేచుచుండగా) కూచోండి! పెద్దలకు శ్రమయేల ? (నిష్క్రమించును. పండితులు చెదిరి గుంపులు గుంపులుగా మాట్లాడుదురు.)

నానామంత్రి : (మాధవ శర్మతో) అడ్డంగా తిరిగిందే !

మాధవశర్మ : అదే నేను యోచిస్తున్నాను. ప్రవాహానికి యెదురీది ప్రయోజనం లేదు.

నానామంత్రి : అయితే వాడితో కలిసిపోతానంటారా ఏమిటి ?

మాధవ : అడ్డుకొమ్మా. పట్టుకొమ్మా కనపడనప్పుడు యేం చేయను ?

నానా : మీరు భయపడక నిలబడి మాత్రం వుండండి. వీడికి ఉచ్చాటన మంత్రం మహారాణీ వారితోటి ఉపదేశం చేస్తాను. చూడండీ, ఆ స్వామి వాడితో యెంత ఆసక్తితో ముచ్చటిస్తున్నాడో! మన వాళ్ళలో కట్టులేదు.

మాధవ : పండితులు కుక్కల్లాగ కాట్లాడబట్టేకదండీ పరాయివాళ్ళు డబ్బు తన్నుకుపోతున్నారు. (బిల్హణుడున్న తావునకు వెళ్ళును.)

నానా : (రామశాస్త్రితో) అస్త్రం అడ్డుదిరిగిందండీ.

యెవరూ ఉలకలేదు పలకలేదు

నాంచారమ్మ అందరినీ కలయజూసి పీరు సాయిబు యిక్కడ లేడా? అని అడిగింది పీరు సాయిబు వెంటనే ఎదటికి వచ్చి "అమ్మా యిదిగో దాసుడ ని చెయి జోడించి నిలుచున్నాడు పీరు సాయిబు దూదేకుల సాయిబు అయినప్పటికీ రామభక్తుడు కీర్తనలు చెప్తుతాడు హటయోగం అభ్యసిస్తాడు రోడ్డుపక్క ఏటివొడ్డు తోటలో మఠం యితనిదే ఇతనికి శిష్య బలగం లావు

సాయిబు నువ్వు గుండం తొక్కగలవా?' అని నాంచారమ్మ అడిగారు

మీ శలవైతే అవలీలగా తొక్కుతాను తల్లీ అని అన్నాడు

నాంచారమ్మ ఏడీ మనవాళ్ళయ్య? గరుడుడి అవతారం అంతర్ధానమై పోయింది రామినాయడా పరమ భాగవతోత్తములై యుండిన్ని మీరు యెవరూ గుండం తొక్కజాలినారు కాదుగదా? అట్టి స్థితిలో యీ పచ్చి తురకకీ గుండం తొక్కడానికి భగవంతుడు సాహస ధైర్యాలు యిచ్చాడు గనుక మీ వైష్ణవ మతం గొప్పా అతగాడి తురక మతం గొప్పా? రామినాయడా మీ దేవులాటంతా యీ రాత్రి వైష్ణవులు శైవులికి పరాభవం చెయ్యాలని గదా? అందుకు ఉపాయం చెబుతాను వినండి మతాలు సాత్వికాలూ తామసాలూ అని రెండు విధాలు యీ రెండు విధాల మనుష్యులూ శైవుల్లోనూ వైష్ణవుల్లోనూ కూడా వున్నారు గుండాలు దొక్కడం మొదలైన తామస కృత్యాలు చేసే వాళ్ళని శైవుల్లో శివాచార్లు అంటారు మన వైష్ణవుల్లో అట్టి కృత్యాలుచేసే తెగ కూడా వున్నారు ఎవరో మీకు తెలుసునా?

మనవాళ్ళయ్య గుంపులో మరి వక పక్కనుంచి తన బుఱ్ఱ పైకి పెట్టి ఎవళ్ళమ్మా వాళ్ళు అని అత్యాతురతతో అడిగాడు

మునసబునాయడు మరెవళ్ళు? సాతానోళ్లు అనేటప్పటికి మనవాళ్ళయ్య బుఱ్ఱ మళ్ళీ మందలో మాయమైపోయింది

నాంచారమ్మ ఆ వైష్ణవులు ఎవరా ? మరెవరు తురకలు ? పీరు అనేది ఏమిటనుకున్నారు శ్రీ స్వామివారి తిరునామమే పట్టణంలో మా యింటి పక్కనే ఒక సాతాని పీర్లని నిలిపి గుండం తొక్కేవాడు పట్టణంలో ఎంతో మంది హిందువులే పీర్ల పంజాలు వుంచి గుండాలు తొక్కుతారు గనక శ్రీరామస్వామి వారి నామం తెచ్చి పీరు కట్టి యిస్తాను ఆ పీరు పట్టుకు పీరు సాయిబు గుండం తొక్కుతాడు పీరు సాయిబు యోగ్యత మీ రెరిగినదే అతగాడు కబీరు దాసంత భక్తుడు గనక భయాలు విడిచి అతని వెంట వెళ్ళి జయించుకు రండి వేళకి భక్తి నిలుస్తుందో నిలవదో చేతి కఱ్ఱలు మాత్రం మరవకండి?"

ఆమె విరమించేసరికి పెళపెళమని ఆ మూకలోనుండి మనవాళ్ళయ్య శ్లోక పఠనం ఉపక్రమించి యిటూ అటూ మనుషులను తోసుకుంటూ ఎదటికి వచ్చి సాష్టాంగంచేసి అమ్మా మీరు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి అవతారం వైష్ణవ మతం నిలబెట్టారు మతమే అన్నమాట ఏమిటి ? మా ప్రాణాలుకూడా నిలబెట్టారు ఇహ నా విజృంభణం చూడండి అన్నాడు మనవాళ్ళయ్య పెద్ద హికమద్దారుడు ఆ రాత్రి వైష్ణవతంత్రం తరవాయి కథ అంతా అతనే నడిపించాడు

అంతా చల్లారగానే అటక మీద నుంచి కృష్ణమాచార్యులు దిగాడు కష్టసాధ్యమును సాధించిన సంతోషముతో నాంచారమ్మ కరదీపం తిరిగి చేతపూని యింటికి సవిలాసముగా నడిచి పోవుచుండగా పెనిమిటి ఎదురైనప్పుడు ఆమె ప్రేమ పరిహాసములు పెనగొను దృష్టితో చూసెను ఆ దృష్టి తనకు దేవత్వమిచ్చి తన్ను అవతార పురుషుణ్ణి చేసిందని కృష్ణమాచారి మర్నాడు నాతో చెప్పి ఆ అర్థంతో శ్లోకం రచించాడు తమ రహస్య శృంగార చేష్టలు మిత్రులతో చెప్పితేనే గాని కొందరికి తనివి తీరదు

ఆ రాత్రి శివాచార్లు గుండం తొక్కడం చూడ్డానికి నేను వెళ్ళి వుంటిని. తెల్లవారగట్ల నాలుగు గంటలవేళ చిరి చీకటిలో గుండంలో నిప్పులు కణ కణ లాడుచుండెను. ప్రాతః కాలపు శీతగాలి సాగింది. ఒక్క పెట్టున గర్భ, నిర్భేధ మయ్యేటట్టు శంఖాది వాద్యములు రేగాయి. ఇంగిలీషు చదువుతున్న నాస్తికాగ్రేసరులకు కూడా ఆ కాలమందు బితుకు కలిగిందని వారే చెప్పుకున్నారు.

పందిటిలో నుంచి వీరగంధాలు పూసుకున్న నలుగురు శివాచార్లు గుండం దగ్గరకు వచ్చి నిలుచున్నారు. ఒకడు నెత్తిమీద భీకరమైన రాగి ప్రతిమ పెట్టుకున్నాడు. ఎదురుగా నిలిచి మరి వకడు కత్తి ఝళిపించుచూ వీర వాక్యాలు కొలిపాడు. ఒకడు గుండంలో నెయ్యిపోసి గుమ్మడికాయ తుండలు గుండంలోకి విసిరాడు. వెంటనే శివాచార్లు గుండం జొచ్చినడుచుకుపోయినారు. అవతల వొడ్డు చేరి తిరిగి తొక్కుటకు వారు యిటు అభిముఖులై యుండగా, "అల్లా - రామ్" అని కెవ్వుమని ప్రళయమైన కేక ఒకటి వేసి, తక్షణం శివాచార్లు గుండం దిగిన వేపునుంచి, మూకను చీల్చుకొని ఒక మనుష్య ప్రవాహము గుండము దాటుకుని పోయింది. వారిలో అందరున్నూ ముఖముల మీద ముసుగులు వేసుకున్నారు. ఆ మనుష్య ప్రవాహమునకు అగ్రమందు వెండి పీరు ఒకటి రెండు చేతులా పట్టి ఒక వీరుడు భీమునివలె నడుచుకుపోయినాడు. ఇది అంతా అర నిమిషం పట్టలేదు.

మూక, చకాపికలై చెదిరిపోయినది. కొందరు సాతాన్లకీ, శివాచార్లకీ కూడా యెత్కించిత్ కాళ్ళు కాలాయి. అది భక్తిలోపం కింద కట్టారు. తరవాత శరభయ్యకీ, మనవాళ్ళయ్యకీ రాజీనామా అయినదని అనుకుంటారు. పైకి మట్టుకు దెబ్బలాడుతున్నట్టే వుంటారు.

అదుగో, మా యింటికి యెదురుగా ఆ రచ్చసావిట్లో నిలిపిన పీరు ఆ పీరే. నాటినుంచీ, ప్రతి సంవత్సరం ఆ పీరు పండుగ చేస్తారు. ఊరు ఆబాలగోపాలం శైవ వైష్ణవ భేదం లేకుండా పీరు దేవరకు మొక్కులు చెల్లిస్తారు. త్రిశూలాకారం గనక ఆ పీరు శివపీరే అని శరభయ్య అంటాడు. ఆ వ్యవస్థదో వెంకయ్య పంతులుగారే చెయ్య సమర్థులు.

"శివుడూ విష్ణూ పీర్లే అయినప్పుడు బుద్ధుడు శివుడు కారాదా?" అని శాయన్న భుక్త కథ పరిసమాప్తి చేశాడు.

మా గురువుగారు యీ చరిత్రకు చాలా ఆశ్చర్యపడి అన్నారు. "ఔరా! కలికాలంలో మనుష్యులే కాదు. దేవుళ్ళు గూడా సంకరం అవుతున్నారు."

"అయినా తప్పేమి? శివుడన్నా, విష్ణన్నా, పీరన్నా, బుద్ధుడన్నా, ఆ పరమాత్మ మట్టుకుఒక్కడేగదా!" వెంకయ్య వూరుకుంటాడా, "అందరు దేవుళ్ళూ వక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అన్నాడు.

అంత, గురువుగారు "ఓరి దేవుళ్ళని పీనుగులంటావురా ? నువ్వు వొట్టి కిరస్తానువి - యింకా కిరస్తానుకైనా దేవుడంటూ వున్నాడు, నువ్వు కిరాతుడివి. పీరో, బిత్రో, దెయ్యమో, దేవరో, యీ అజ్ఞులకు మూఢభక్తి అయినా వుంది. నువ్వు అందరు దేవుళ్ళకీ ఒక పెద్ద నామం బెట్టావు."

"ఒక్క మీకు తప్ప శాస్తులుగారూ," అన్నాడు.

"నీ జన్మానికల్లా విలవైన మాట అంటివిరా " అని నే నన్నాను.

**- 'ఆంధ్ర భారతి', 1910 ఏప్రిల్, మే, జూన్ సంచికలు.**

# దిద్దుబాటు[1]

తలుపు తలుపు

తలుపు తెరవఁబడలేదు ఒక నిమిష మతఁడూరుకొనెను

గదిలోని గడియారము టింగుమని ఒంటిగంట కొట్టినది

ఎంత ఆలస్యము చేస్తిని బుద్ధి గడ్డి తిన్నది రేపటినుంచి జాగ్రత్తగా వుంటాను యాంటినాచెల్లా పోఁ సానిదాని పాట సరదాలో మనసు లగ్నమైపోయినది ఒక్క పాట సరదాతో కురదలేదు మనిషిమీద కూడా సరదా పరిగెత్తుతూంది లేకుంటే పోకిరి మనిషివలె పాట ముగిసిన దాకా కూర్చోవడమేమిటి ? ఏదో వక అవకాశమ కలుగఁజేసికొని దానితో నాలుగు మాటలు ఆడడపు ఆసక్తి ఏమి ? ఇదిగో లెంపలు వాయించుకుంటున్నాన రేపటినుంచి మరి పాటకు వెళ్ళను నిశ్చయం నిశ్చయం గట్టిగా పిలిచితే కమలిని లేవగలదు మెల్లిగా తలుపు తట్టి రాముడిని లేపగల్గితినా చడిలేకుండా పక్క జేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును

గోపాలరావు తలుపు చేత నంటగానే రెక్క విడబారెను అరే యిదేమి అనుకొని రెక్క మెల్లన తెరచ నడవలో దీపము లేదు అంగణము దాటి తన పడక గది తలుపు తీయ నందును దీపము లేకుండెను చడిలే అడుగు వేయుచు మంచము దరికి పోయి కమిలిని నిద్రించుచుండెనా మేల్కొని యుండెనా యని కనుగొన యత్నించెను గాని యేర్పరింప లేదయ్యె అంత జేబు నుండి అగ్గిపెట్టె తీసి పుల్ల వెలిగించెను మంచముపై కమ[illegible] [illegible]ానరాలేదు నిశ్చేష్టుఁడై చేతినుండి అగ్గిపుల్ల నేలరాల్చెను గదినీ అతని మనస్సును కూడ చీకటి క్రమ్మెన వెట్టి శంకలును అంతకు వెట్టి సమాధానములును మనసున పుట్టుచు గిట్టుచు వ్యాకులత కలుగజేసెను ఓ[illegible] తక్కువకు తనయందో కానరామికి కమలిని యందో యేర్పరింపరాని కోపావేశమును చీకాకును గలిగెను న[illegible] వాకిటికి వచ్చి నిలువ చుక్కల కాంతిని దాసిగాని దాసుఁడుగాని కనపడలేదు వారికి తగిన శిక్ష వురియే[illegible] గోపాలరావు నిశ్చయించెను

తిరిగి గది లోనికి పోయి దీపము వెలిగించి గది నలుదెసల పరికించెను. కమలిని కానరాలేదు. వీధి గుమ్మము జేరి తలుపు తెరచి చూడ చుట్ట కాల్చుచు తలయెత్తి చుక్కల పరీక్షించుచున్న రాముఁడు వీధి నడుమ కానవచ్చెను. పట్టరాని కోపముతో వానినిఁజూచి గోపాలరావు "రామా! రా!" యని పిలిచెను. రాముఁడు గతుక్కుమని చుట్ట పారవైచి 'బాబు' అని డగ్గరెను.

"మీ అమ్మేదిరా ?"

"మా యమ్మా? యింటున్నది బాబూ."

"మా అమ్మ కాదురా! బుద్ధిహీనుడా! నా భార్య."

"అమ్మగారా ? ఎక్కడుంటారు బాబూ? పడుకున్నారు?"

"యింట్లోనే లేదు."

రాముడి గుండెలో దిగులు ప్రవేశించెను. గుమ్మములో అడుగుపెట్టఁగానే రాముని వీపుపై పీశ గుద్దులు రెండు పడెను. 'చంపేస్తిరి బాబూ' అని రాముడు నేల కూలఁబడెను.

గోపాలుఁడు సదయ హృదయుఁడు. అక్రమ మాచరించితినను జ్ఞానము వెంటనే పొడమి అగ్రహావేశము దిగజారి పశ్చాత్తాపము కలిగెను. రామునిచేత లేవనెత్తి. వీపు నిమిరి పశువు వలె నాచరించితినని యనుకొనుచు గదిలోనికి తీసుకొని పోయెను.

కుర్చీపయి కూర్చుని "రామా, ఏమాయెరా?" యని దైన్యముతో ననెను.

"యేటో మాయలా వుంది బాబూ."

"పుట్టింటికి వెళ్ళియుండునా?"

"అంతవారు కారనా? బాబూ, కోపగించితే చెప్పలేను గాని ఆడారు చదువు నేరిస్తే ఏటౌతది?"

"విద్య విలువ నీకేం తెలుసురా, రామా!" అని గోపాలరావు మోచేతులు బల్లపయినాని వాని నడుమ తలయుంచి యోచించుచుండ కమలిని చేవ్రాత నొక యుత్తరము కానవచ్చెను. దానిని చదువసాగెను.

"అయ్యా!"

"'ప్రియ' పోయి 'అయ్యా' కాడికి వచ్చెనా ?"

"పెయ్య పోయిందా బాబూ!"

"మూర్ఖుఁడా! పూరుకో!"

"అయ్యా! పది దినములాయె. రాత్రులు ఇంటికి మీ రాకయే నే నెరుగను. మీటింగులకుఁ బోవుచుంటిమంటిరి. లోకోపకారములగు నుద్యమముల నిదుర మాని చేయుచుంటిమంటిరి. మా చెలుల వలన నిజము నేర్చితిని, నేనింట నుండుటను గదా మీరు కల్లలు పలుకవలసి వచ్చె. నేను పుట్టింటనున్న మీ స్వేచ్ఛకు నిర్బంధమును, అసత్యమునకు అవకాశము కలుగకుండును. మీచే దినదినమును అసత్యమాడించుట కన్న మీ త్రోవకు అడ్డుగనుండకుండుటయే, పతి మేలు కోరిన సతికి కర్తవ్యము కదా? నే నీ రేయి కన్నవారింటికి జనినయెడ సంతసింపుడు. వెచ్చముగాక ఏపాటి మిగిలియున్నను దయ నుంచుడు."

ఉత్తరము ముగించి "నేను పశువును" అని గోపాలరావు అనెను.

"అదేమిటి బాబూ అలా శలవిస్తారు?"

"శుద్ధ పశువును!"

రాముఁడు అతి ప్రయత్నముచే నవ్వు ఆపుకొనెను.

"గుణవతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు నా చెడుబుద్ధికి తగిన శాస్తి చేసినది."

"ఏటి చేసినారు బాబూ?"

"పుట్టింటికి వెళ్ళిపోయినది - గాని నీకు తెలియకుండా ఎలా వెళ్ళిందిరా?"

రాముఁడు రెండడుగులు వెనుకకు నడిచి "నాను తొంగున్నాను కావాల బాబూ - అలకచేస్తే చెప్పచాల్నుగాని బాబూ ఆడదయి చెప్పకుండా పుట్టినారింటికి ఎల్తానంటే చెంపలాయించి కూకోబెట్టాలిగాని మొగోరిలాగా రాతలూ కోతలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా బాబూ?"

"ఓరి మూర్ఖుడా! భగవంతుడి సృష్టిలోకెల్లా ఉత్కృష్టమైన వస్తువ విద్య నేర్చిన స్త్రీ రత్నమే. శివుఁడు పార్వతికి సగము దేహము పంచి యిచ్చాడు. ఇంగ్లీషువాఁడు భార్యను బెటర్‌హాఫ్ అన్నాడు. అనగా పెళ్ళాము మొగునికన్న దొడ్డది అన్న మాట. బోధపడ్డదా?"

"నాకేం బోద కాదు బాబూ!" రామునికి నవ్వు ఆచుకొనుట అసాధ్యమగుచుండెను.

"నీ కూతురు బడికి వెళ్ళుతున్నది గదా! విద్య విలువ నీకే బోధపడుతుంది. ఆ మాట అలా వుండనియ్యి. కాని, నువ్వో నేనో వెంటనే బయలుదేరి చంద్రవరం వెళ్ళాలి. నేను నాలుగు రోజులదాకా వూరినుంచి కదలడమును వీలుపడదు. నువ్వు తాతలనాటి నౌఖరువి. వెళ్ళి కమలిని తీసుకురా. కమలినితో ఏమి జెప్పవలెనో తెలిసిందా?"

"యేటా? బాబూ! బాబు, నా యీపు పగలేసినారు, రండమ్మా అంతాను?"

"దెబ్బల మాట మరిచిపో. కొట్టినందుకు రెండు రూపాయలిస్తాను. తీసుకో. మరి యెన్నడూ ఆ వూసెత్తకు. కమలినితో గాని తప్పిజారి అనఁబోయేవు సుమా."

"అనను బాబూ!"

"నువ్వు చెప్పవలసిన మాటలు చెబుతాను. బాగా విను. 'పంతులికి బుద్ధి వచ్చింది. ఇక ఎన్నడూ సానుల పాట వినరు. రాత్రులు యిల్లు కదలరు, ఇది ఖరారు. తెలిసిందా ? మిమ్ములను గెడ్డము పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదలచి ఆయన లోపముల బయలు పెట్టక రెండు మూడు రోజులలో వెళ్ళిపోయి రమ్మన్నారు. మీరులేని రోజో యుగముగా గడుపుతున్నారు' అని నిపుణతగా చెప్పు తెలిసిందా?"

"తెలిసింది బాబూ!"

"ఏమని చెబుతావో నాతో వొక మాటు చెప్పు."

రాముఁడు తల గోకుకొనుచు "యేటా - యేటా - అదంతా నాకేం తెలదు బాబూ - నానంతాను అమ్మా! నా మాటినుకొండి - కాలం గడిపినోణ్ణి - ఆడోరు యెజిమాని చెప్పినట్టల్లా యిని వల్లకుండాలి. లేకుంటే మా పెద్ద పంతులార్లాగ అయ్యగారు కూడా సానమ్మ నుంచుగుంతారు. మీ శెవులో మాట. పట్టంలోకి బంగారు బొమ్మలాంటి సానమ్మవొచ్చింది. మరి పంతులు మనసు మనసులో లేదు. ఆ పైన మీ సిత్తం! అంతాను."

"ఓరి వెధవా!" అని గోపాలరావు కోపముతో కూర్చీనుండి లేచి నిలిచెను.

ఊసవలె రాముడు వెలికెగెసెను.

అంతట మంచము క్రింద నుండి అమృత నిష్యందిని యగు కలకల నగవును కరకంకణముల హృద్యారావమును విననయ్యెను.

– 'ఆంధ్ర భారతి' **1910**, ఫిబ్రవరి

# దిద్దుబాటు[2]

"తలుపు! తలుపు!

తలుపు తెరవలేదు.

గదిలోని గడియారం టింగుమని వొంటి గంట కొట్టింది.

"ఎంత ఆలస్యము చేస్తిని! బుద్ధి గడ్డి తిన్నది. రేపట్నుంచి జాగ్రత్తగా వుంటాను. యాంటీనాచల్లా పోయి సానిదాని పాట సరదాలో మనసు లగ్నమైc పోయినది. ఒక్క పాట సరదాతోటి కుదరలేదు. పాడే మనిషి మీదక్కూడా మనసు పరిగెత్తుతూంది. లేకుంటే, పోకిరి మనిషివలె పాట ముగిసిన దాకా కూర్చోవడవేఁమిటి? ఏదో వక అవకాశము కలుగcజేసికొని దానితో నాలుగు మాటలు ఆడడపు ఆసక్తి ఏమిటి? యిదిగో, లెంపలు వాయించుకుంటున్నాను. రేపట్నుంచి మరి పాటకు వెళ్ళితే వొట్టు – (వొట్టు వేసుకోరాదు. అదో నియమం వొచ్చింది కదూ) మరి వెళ్ళను. నిశ్చయం, నిశ్చయం. గట్టిగా గాని పిలిస్తినట్టాయనా, కమలిని లేవగలదు. మెల్లిగా తలుపు తట్టి రాముణ్ని లేపగలిగితినా చడిచప్పుడూ లేకుండా పక్క జేరి పెద్దమనిషి వేషము వెయ్యవచ్చును."

గోపాల్రావు తలుపు చేతనంటగానే, రెక్క విడబారింది. "అరే యిదేమి చెప్మా!" అనుకొని తలుపు మెల్లిగా తెరిచేసరికి, నడవలో దీపం లేదు. నాలుగిళ్ళ వాకిలి దాటి, పడక గది తలుపు తీసిచూస్తే దాన్లోనూ దీపం లేదు. చడీచప్పుడూ లేకుండా అడుగువేస్తూ మంచము దరికిపోయి, కమలిని మేలుకొని వున్నదా, నిద్రించుతున్నదా అని కనిపెట్ట ప్రయత్నించెను గాని, యేర్పరించలేక పోయినాడు. బల్లమీద తడివిc అగ్గిపెట్టె తీసి ఒక పుల్ల వెలిగించాడు. మంచం మీద కమలిని లేదు. నిశ్చేష్టుడైపోయినాడు. చేతినుంచి అగ్గిపుల్ల రాలింది. గదినీ, అతని మనస్సునూ చీకటి కమ్మింది. వెఱ్ఱి శంకలూ, అంతకు వెఱ్ఱి సమాధానాలూ మనసున పుట్టుతూ గిట్టుతూ వ్యాకులత కలగజేశాయి. బుద్ధి తక్కువ పని చేసినందుకు తనయందో, కానరామికి కమలిని యందో యేర్పరింపరాని కోపావేశం కలిగింది. నట్టి వాకిట వచ్చి నిలబడ్డాడు. చుక్కల కాంతిని నౌకరుగానీ, దాసీగానీ కానరాలేదు.

తిరిగీ గదిలోకి పోయి దీపం వెలిగించి, గది నలుముఖాలా పరికించి చూశాడు. కమలిని ఎక్కడా కానరాలేదు. వీధి గుమ్మం దగ్గిరికి వెళ్ళి తలుపు తెరిచి చూసేసరికి, వీధి నడుమ చుట్ట కాలుస్తూ తల ఎత్తి ఆకాశం

మీది చుక్కల్ని చూస్తూ రావుఁడు కనపడ్డాడు! "రామా!" అని గోపా(ల్రావు పిలిచాడు. రావుఁడి గుండె ఝల్లుమంది, నోట్లో చుట్ట జారి కిందపడ్డది.

"రా వెధవా!"

కాలీడ్చుకుంటూ రావుఁడు దగ్గిరకొచ్చాడు.

"మీ అమ్మేదిరా?"

"మా యమ్మా బాబూ? మా కొంపలున్నాది."

"నీ అమ్మ కాదురా! బుద్ధిహీనుడా! నా భార్యరా."

ఆ మాటతో రావుఁడికి మతిపోయింది. ఆలోచించుకుని అన్నాడు -

"ఎక్కడుంటారు బాబూ? అమ్మగోరు గదిలో తొంగున్నారు బాబూ!"

"యింటో ఎక్కడా లేదురా, వెధవా! యిల్లు విడిచి నువ్వెక్కడికి పోయినావురా?"

రావుఁడు మొహం ఓరజేసుకుని "నౌఖరోడికి కాల్నొస్తుంది, కడుపు నొస్తుంది, బాబూ. పెద్దయ్యోరు మరీ మరీ అప్పుసెప్పి ఎల్లినారు గందా, అమ్మగారి నొక్కర్నీ ఒగ్గేసి నిసి రా(త్రేళ సానమ్మగారి – " రావుఁడి వీపుమీద రెండు వీశ గుద్దులు పడ్డాయి. "సంపేసినారు బాబూ" అని రావుఁడు నేలకూలబడ్డాడు.

గోపాలరావు దయగలవాడు. వెంటనే కోపం దిగజారి, పశ్చాత్తాపం కలిగింది. రాముణ్ణి చేత లేవనెత్తి, వీపు నిమిరి, "కోపం పట్టలేక పశువువలె ఆచరిస్తిని" అనుకుంటూ గదిలోకి తీసుకువెళ్ళాడు.

కుర్చీమీద తాను కూచుని "రామా ఏమాయెరా!" యని దైన్యంతోటి అన్నాడు. రాఁవుడు యీ తట్టూ, ఆ తట్టూ, చూసి

"ఏటో మాయలా వుంది, బాబూ." అన్నాడు.

"పుట్టింటిగ్గానీ వెళ్ళి వుందునా?"

"అంతోరు కారనా, బాబూ? కోపగించితే సెప్పజాల్ను గానీ, ఆడోరు సదువుకుంటే, ఏటౌతది బాబూ?"

"విద్య విలువ నీకేం తెలుసురా, రామా!" అని గోపాలరావు మోచేతులు బల్లపైన అన్చి ఆ నడుమ శిరస్సు వుంచి తలపోస్తూ వున్నంతలో, ముద్దు లొలికే కమలిని చే(వ్రాలున వుత్తర వొఁకటి బల్లమీద కనపడ్డది. పైకి చదివాడు, "అయ్యా!"

"' ప్రియుడా!' పోయి 'అయ్యా' కాడికి వొచ్చిందా ?"

"పెయ్య పోయిందా బాబూ!"

"మూర్ఖుఁడా! వూరుకో!"

"అయ్యా! పది దినములాయె. రా(త్రుల నింటికి మీ రాకయే నే నెరుగను. మీటింగులకుఁ బోవుచుంటిమంటిరి. లోకోపకారములగు నుద్యమముల నిదుర మాని చేయుచుంటిమంటిరి. మా చెలుల వలన నిజము నేర్చితిని. నేనింట నుండుటను గదా మీరు కల్లలు పలుకవలసి వచ్చెను. నేను పుట్టింటనున్న మీ స్వేచ్ఛకు నిర్బంధమును, అసత్యమునకు అవకాశము కలుగకుండును. మీచే దినదినమును అసత్యమాడించుట కన్న మీ (త్రోవకు అడ్డుగ నుండకుండుటయే, పతి మేలు కోరిన సతికి కర్తవ్యము కాదా? నే నీ రేయి కన్నవారింటికి జనియెద. సంతసింపుడు. వెచ్చముగాక ఏపాటి మిగిలియున్న దయనుంచుడు."

ఉత్తరం ముగించి "నేను పశువును" అని గోపాల్రావు అనుకున్నాడు.

"అదేమిటి బాబూ అలా శలవిస్తారు?"

"శుద్ధ పశువును!"

రావుఁడు అతి ప్రయత్నముచే నవ్వు ఆపుకొనెను.

"గుణపతి, విద్యానిధి, వినయ సంపన్నురాలు నా చెడుబుద్ధికి తగిన శాస్తి చేసింది."

"అమ్మగారేటి సేసినారు బాబూ!"

"పుట్టింటికి వెళ్ళిపోయింది - గాని, నీకు తెలియకుండా ఎలా వెళ్ళిందిరా?"

రావుఁడు రెండడుగులు వెనక్కివేసి "నాఁ తొంగున్నాను కావాల బాబూ! అలిగితే సెప్పసాల్నుగాని బాబూ, ఆడదాయి సెప్పకుండా పుట్టినోరింటికి ఎల్తానంటే లెంపలోయించి కూకోబెట్టాలి గాని మొగోర్లాగా రాతలూకోతాలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా, బాబూ?"

"ఓరి మూర్ఖుడా! భగవంతుడి సృష్టిలోకల్లా ఉత్కృష్టమయిన వస్తువ విద్యనేర్చిన స్త్రీ రత్నమే. శివుడు పార్వతికి సగం దేహం పంచి యిచ్చాడు కాదా. ఇంగ్లీషువాడు భార్యను 'బెటర్ హాఫ్' అంటాడు. అనగా పెళ్ళాం మొగుడికన్న దొడ్డది అన్నమాట. బోధపడ్డదా?"

"నాకేం బోదకాదు బాబూ?" రావుఁడికి నవ్వు ఆచుకోవడం అసాధ్యం కావచ్చింది.

"నీ కూతుర్ని బడికి పంపిస్తూన్నాం కదా, విద్య యొక్క విలువ నీకే బోధపడుతుంది. మీ వాళ్ళకంటె అప్పుడె దానికి ఎంత నాగరికత వొచ్చిందో చూడు. ఆ మాట అలా వుణ్ణియ్యిగాని, యిప్పుడు నువ్వో నేనో వెంటనే బయల్దేరి చెంద్రవరం వెళ్ళాలి? నే వెళ్ళానికి శలవు దొరకదు. నువ్వు తాతల నాటి నౌఖరివి. నీమీద కమలినికి యిష్టం. గనక నువ్వే వెళ్ళడం మంచిది. వెళ్ళి కమలినిని పిలుచుకు రా."

"శలవైతే యెల్నా, యెలతాను. ఆ(రానంటే-"

"యిందు పది రూపాయలు. బతిమాలి తీసుకొస్తివట్టాయనా, మరి పది రూపాయిలిస్తాను."

"సిత్తం"

"అయితే, యేవిఁటి చెప్పాలో తెలుసునా?"

"యేటా, బాబూ? సెప్పకుండా లేసె రావడం మా మంచి పని సేసి నారమ్మా. బాబు నా యీపు పగలేసినారు రండి రండమ్మా అని సెప్తాను."

"నన్ను క్షమించి దెబ్బల మాట మరిచిపో. కమలినితో ఎన్నడూ దెబ్బల మాట చెప్పబోకు. ఈ మాట జ్ఞాపకం వుంచుకుంటావు గద?"

"సిత్తం"

"నువ్వు కమలినితో చెప్పవలసిన మాట లేవో, చెబుతాను బాగా చెవొగ్గి విను... పంతులికి బుద్ధి వొచ్చిందను...."

"అదేటి బాబు!"

"నీ కెందుకు? నే అన్న మాట గట్టిగా జ్ఞాపకం వుంచుకుని చెప్పు. పంతులికి బుద్ధివొచ్చింది అను. మరి ఎన్నడూ సానుల పాట వినరు. గట్టిఒట్టు వేసుకున్నారు... (మరచిపోయి అన్నాను; ఆ మాట అనకు.) యిటుపైని ఎన్నడూ, రాత్రిళ్ళు యిల్లు కదలరు ఇది ఖరారు. తెలిసిందా?"

రావుఁడు తల వూపాడు.

"ఇంకా ఏవిఁటంటే, గెడ్డం పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదల్చి పంతుల లోపాలు బయట పెట్టొద్దన్నారు. (ఇది ముఖ్యమైన మాట విన్నావా?) రెండు మూడు రోజుల్లో తప్పకుండా వెళ్ళిపోయి రమ్మన్నారు. మీరు దగ్గర లేకపోవడంచేత వెఱ్ఱెత్తినట్టున్నారు. గడియో యేడు లాగ గడుపుతున్నారు. (యీ మాట మరవగలవు జాగర్త) యేం చెప్పాలో తెలిసింది గదా? ఒక్క మాటైనా మరచిపోకు."

"తెలిసింది బాబూ."

"యేం చెబుతావో నాకోమాటు చెప్పు."

రాముఁడు తల గోకుకొనుచు "యేటా – యేటా – అదంతా నాకేం తెల్దు బాబూ. – నేనంతాను అమ్మా! నా మాటినుకొండి – కాలం గడిపినోణ్ణి – పిన్నల్ని సూసినాను. పెద్దల్ని సూసినాను యిన్నారా ? ఆడోరు యజమాని సెప్పినట్టల్లా యిని పల్లకుండాలి లేకుంటే పెద్ద పంతులార్లాగ, సిన్న పంతులోరు కూడా, సెడిపోతారు. మీ శెవుల్లో మాట. పట్టంలోకి బంగార బొమ్మలాంటి సానమ్మ వొచ్చింది. ఆ సానెమ్మోర్ని సూసినకాణ్ణుంచీ పంతులు మనసు, మనసులా లేదు. నా మాటిని రండి. లేకుంటే మీ సిత్తం, అంతాను."

"ఓరి వెధవా!" అని గోపాలుడు కోపంతో కుర్చీ మీంచి వుర్రికాడు. తప్పించుకుని రావుఁడు పూసలాగ గదిపైకి దాటాడు.

అంతలో మంచం కింద నుంచి అమృతం వొలికే కలకల నవ్వూ, మనోహరియైన నూపురముల రొద, విననయ్యెను.

# మెటిల్డా

నేను వృక్షశాస్త్రము యమ్.ఏ. పరీక్షకు చదువుతూ వుండే రోజులలో మైలాపురి పెద్ద రోడ్డున ఒక మిద్దె యింట్లో బసచేసి వుంటిని. నాతోపాటు పది పన్నెండుగురు విద్యార్థులు మనదేశపువాళ్ళు ఆ మేడ యింట్లో వుండేవారు.

నేను వచ్చిన మూడో రోజున రామారావు నన్ను సౌజ్ఞచేసి పిలిచి రహస్యంగా "మెటిల్డాను చూశావా?" అని అడిగాను, "లేద"న్నాను. "అదుగో చూసీ చూడనట్టు చూడు" అని చూపించాడు.

చూశాను.

"చాలు యిక రా" అన్నాడు.

మెటిల్డా వైపు త్రిప్పిన మొహం తిప్పకుండానే "ఎలా రావడం? కళ్ళు భగవంతుడు యిచ్చినందుకు యిదే కదా ఫలం! మనోహరమైన భగవంతుడి సృష్టిలో కల్లా మనోహరమైనది, సొగసైన స్త్రీ. మనస్సులో చెడు చింత లేనప్పుడు చూస్తే తప్పేమి." అన్నాను.

"నీలా శ్రీరంగనీతులు చెప్పిన వాళ్ళని చాలామందిని చూశాను. కొత్త వాడివి, యెరిగివుంటే మంచిదని చూపించాను. మరి యెన్నడూ యిటు కన్ను తిప్పకు."

రెక్క పట్టుకు గెంటుకు పోయినాడు.

"మంచి మనిషా, చెడ్డ మనిషా?" అని అడిగాను.

"మంచయితే మనకేల? చెడ్డయితే మనకేల? ఒకర్ని మంచి కాదందానికి మన మంచేం తగలడుతూంది? మెటిల్డా వైపు చూడవలెనని తిరిగి ఎన్నడైనా చూస్తివా నీకూ నాకూ నేస్తం సరి" అన్నాడు. రామారావు నాకు ప్రాణ సమానమైన మిత్రుడు. ఏం చెయ్యను, మనసు నిరోధించి మెటిల్డా యింటి పెరటివేపు వున్న దాజా పొంతకు వెళ్ళలేదు కొన్నాళ్ళు.

పసుపు రాసుకొని స్నానమాడి పైని బంగారు చాయలుదేరిన మేని సొంపు నెమలి పింఛము వలె ఒడలును కమ్మి చెదరిన తలకట్టూ, బావినుంచి నీరు తోడుతూ వొక్కొకతరి తలయెత్తి యిటూ అటూ చూసిన కన్నుల తళుకూ, మోము అందమూ నా కన్నుల కట్టినట్టు వుండి మరుతునన్న మరపురాకపొయను.

వారం పది రోజులు కట్టమీద వున్నాను. ఆ పైని మనసు పట్టలేక పచారు చేస్తూ చదివే మిషమీద చేత పుస్తకం, దృష్టి పెరటివేపూ వుంచి డాబా మీద గస్తు తిరిగేవాణ్ణి, రామారావు యింటలేనప్పుడు.

ఆ రోజుల్లో రెండుమార్లే పనిమీద పెరట్లోకి వచ్చి వెంటనే యింట్లోకి వెళ్ళిపోతూ వచ్చింది, మెరుపులా.

కాలేజీకి వెళ్ళేటప్పుడు మెటిల్డా యింటి ఎదుట చీమ లాగ నిమ్మళంగా ఆ యింటివేపు చూస్తూ నడిచేవాణ్ణి. అప్పుడప్పుడు చిత్తరపు చట్రంలో ప్రతిమ లాగ, గవాక్షంలోంచి మెడిల్డా కనపడేది.

## 2

మెటిల్డా చరిత్ర అడిగి వారివల్లా వీరివల్లా, అడక్కుండా నా నేస్తులవల్లా గ్రహించాను.

మెటిల్డా పెనిమిటికి మా వాళ్ళు పులి, ముసలి పులి అని పేరు పెట్టారు. అంత ముసలివాడు కాదు యాభై అయిదు, యాభై ఆరు యీడు వుండవచ్చును. కొంచెం తెల్లగా, పొట్టిగా వుంటాడు. పెద్ద కళ్ళూ, కోర మీసాలూ. స్ఫోటకం మచ్చల మొహం, రెండేళ్ళాయ వచ్చి మా ప్రక్క బంగళాలో బసవేశాడు. ఎక్కణ్ణించి వచ్చాడో, ఎందుకు వచ్చాడో ఎవరూ ఎరుగరు. వీధివేపు పెరటిలోకి వొరసుకొని పెద్ద గది వొకటి వుంది. దానిలో మూడు బీరువాలలో పుస్తకాలు వున్నాయి. అమేషా రాస్తూనో, చదువుతోనో కనపడేవాడు. వీధి పెరటిలోనూ, వెనక పెరటిలోనూ పూల చమన్ బహు సొగసుగా వుంచేవాడు. ఉదయం, సాయంత్రం మొక్కలకి గొప్పు తవ్వేవాడు. మెటిల్డా నీరు పోసేది. ఇది యింగ్లీషు పద్ధతి ప్రకారం యిద్దరికీ శరీర వ్యాయామం. అంతేమరి; యిల్లు కదిలి నాలుగు అడుగులు పెట్టడమన్నది లేదు. ఇంటికి చుట్టాలూ, పక్కాలూ రాకపోకలు ఎన్నడూ లేదు. పులి మెటిల్డాని ఎక్కువ కాయిదా పెట్టేవాడు. గుమ్మంలోకి రాకూడదు. అని శాసనం గాని అప్పుడప్పుడు వచ్చేది. ఆ పిల్ల మొఖాన వొక మోస్తరు విచారం కనబడేది. వింతేమి? మొగుడు కంట్రకపెట్టేవాడు. మొగుడు అప్పు ఒక ముదుసలి. చిలిపి జగడాలు పెట్టేది. ఇంటిలో మిగిలినవాళ్ళు ఒక ముసలి వంట బ్రాహ్మణుడు.

మెటిల్డా పెనిమిటిని పులి పులి అనడమేగాని అతని పేరేమిటో ఎవడూ ఎరుగడు; పోస్టు బంట్రోతు ఆయన పేర వచ్చిన ఉత్తరముల పై విలాసం ఎవరికీ చూపకుండా నిర్ణయంట. ఒక్క పోస్టు మాస్టరికీ, పులికీ మాత్రం పరిచయం వుందని అనుకునేవారు.

అది రహస్యం కాపాడడం కోసమై వుంటుంది.

## 3

ఒకనాడు అభ్యంగనమై జుత్తు విరియబోసి షోకుగా టోపీ తల నమర్చి, మల్లిపువ్వులాంటి బట్టలు కట్టి బడికి పోతూ, మెటిల్డా యింటి ఎదుట జాలంగా నడుస్తూ వుంటిని. అంతట గుమ్మం దగ్గిరికి వచ్చి, ఆమెవేపు చూస్తూ నిలిచిపోయినాను. అర మినుటు కావచ్చు. పులి గుహలోంచి పైకి దుమికి, "అబ్బాయీ, యిలా రా" అన్నాడు. తంతాడేమో పరుగుచ్చుకుందావాఁ అనుకున్నాను, కాని అట్టి పని చేస్తే నా యందు నేరం నిలవడం కాకుండా, మెటిల్డా యందు నేరం నిలుస్తుందేమో? నాకు ఏమైతే ఆయను, ఆమెను కాపాడదామని వెళ్లాను.

లైబ్రరీ గదిలోకి తీసుకెళ్లాడు. కుర్చీమీద కూలబడి, రౌద్రాకారమైన చూపుతో యింగ్లీషున అడిగాడు:

"నా పెళ్ళాంవైపు చూస్తున్నావా?"

"కిటికీలోంచి కనపడుతూండే మీ లైబ్రరీ చూస్తూ, మీరు ఎటువంటి మనుష్యులు, ఏమి చేస్తుంటారు అని ఆలోచిస్తున్నాను."

"నా పెళ్ళాన్ని చూడలేదూ?"

"చూశాను, ఎదుట నిలుచుంటే కనపడరా, అంతే". పిడుగులాగ "జానే జానే?" అని పిలిచాడు. మెటిల్డా రాలేదు.

"వొస్తావా రావా, లంజా!" అన్నాడు. ఒణుకుతూ మెల్లగా వచ్చి తలవొంచుకు నిలబడ్డది.

ఇంగ్లీషున నాతో మళ్ళీ అన్నాడు :

"ఓ తెలివితక్కువ పెద్దమ్మా! చూడు. ఎంతసేపు చూస్తావో, యీ ముండమోహంవేపు! [illegible] వేపు చూస్తావేం, దానివేపు చూడక? నా మొహం, దాని మొహంకన్న బాగుందనా?"

నేను మాట్లాడలేదు. కథ బాగుందికాదని, కాలు గుమ్మంవేపు సాగించబోతూండగా, కనిపెట్టి మెల్లగా "వుండు" అన్నాడు.

నిలిచాను.

నిమిషం కిందట కన్నుల రాలిన నిప్పులు చల్లారాయి.

"అబ్బాయి!" అన్నాడు.

"నిజవాఁడ్డం ఎన్నడైనా నేర్చావా? తల్లిదండ్రుల దగ్గిరగాని గురువుల దగ్గిరగాని" నా తల్లీదండ్రీ తలపుకు వచ్చారు.

"నేర్చవలసిన అవసరం లేకుండా, నిజాయితీ నాకు పుట్టుకతోనే వొచ్చింది" అన్నాను.

"అయితే, పుట్టుకతో పుట్టిన ఆ నిజాయితీ చూద్దాం. చెప్పు, నా పెళ్లాం అందంగా వుందా లేదా?"

"ఆమె అందంగానే వున్నాదనుకుంటాను."

"సంశయవేఁవైనా వున్నదా?"

"లేదు."

"తోవంట వెళ్లేటప్పుడు రోజూ, దానికోసం యీవేపు చూస్తూ వుంటావా లేదా?"

"నిజమాడమన్నారు గనుక వొప్పుకోక విధి లేదు. చూస్తున్నాను గాని, చెడ్డ తలపు మనసులో యీషత్తువుంటే దేవుడు సాక్షి!"

"దాని మాటకేం; అది కంటిక్కనపడితే నీకు ఆనందం, అవునా కాదా? నిజవన్నదేదీ?"

"అవును"

"అయితే ఈ ముండని తీసుకుపో; నీకు దానం చేశాను. తీసుకుపో! నాకు శని విరగడై పోతుంది."

నేను మాటడకుండా కదలి పైకొచ్చాను. ఇళ్లు కనపడలేదు. మనుషులు కనపడలేదు. శృంగభంగమై నన్ను నేను దూషించుకుంటూ బరికి పోయినాను.

అక్కడ బస ఎత్తేయడానికి నిశ్చయించాను. బస ఎత్తేసి, మరి ఆ వీధి మొహం చూడకూడదనుకున్నాను.

నా కళ్ళకి కట్టినట్లు ఆ వొంచిన మొఖం బిందువులుగా స్రవించిన కన్నీరు; ఆచుకొన్న నిట్టూర్పుల చేత కంపించిన రొమ్ము. ఏ మహాకవి రచనలోనూ లేదనగలను. అగాధమై ప్రౌఢమైన కరుణ రసం, ఆ సరిలేని సొగసున్ను.

## 4

నే బస వున్న యింటి గుమ్మం దగ్గిరికి వచ్చేసరికి పులి యింటి ముసలి బ్రాహ్మణుడు సన్న సన్నగా నా చేతులో ఒక చీటీ పెట్టి జారిపోయినాడు ఇందాకటి కథతో దీనికేదో సంబంధం ఉందని తలచి నా గదిలోనికి వెళ్ళి లోపల గడియ వేసుకుని చీటి చదువుకొన్నాను దానిలో ఏముందీ?

కుదురైన అక్షరాలతో -

మీరూ మీ నేస్తులూ నా కాపరం మన్న నివ్వరా? మీకు నేనేం అపకారం చేశాను? తల వంచుకు మీ తోవను మీరు పోతే నే బతుకుతాను లేకపోతే నా ప్రారబ్ధం

ఏమి చెయ్యను? అక్కడ బస విడిచి మరి వక చోటికిపోతే నా మట్టుకు చిక్కువొదులుతుందనుకొంటిని గదా? ఇప్పుడు మెటిల్డా చేసిన విన్నపం యెలా తొంగి వెళ్ళిపోదును? నా స్నేహితులవల్ల ముప్పు కలక్కుండా ఆమెను కాపాడవద్దా కాపాడగలనా?

మెటిల్డాను కాపాడకపోతే బతుకేవిటి? పౌరుషమేవిటి? ఈ మనోజ్ఞమైన స్త్రీ రత్నం యొక్క చిత్రకథలో దుఃఖ భాజన కథలో నేను కూడా చేరానా? దుఃఖం మళ్ళించి యీ అంతకత్తె మనసులో మెప్పుకొంటే జన్మ సార్థకమవుతుంది ఈ సొగసైన లిపి మెటిల్డా రాసినదా ? ఏమి అదృష్టవంతుణ్ణి? మెటిల్డా ఏమి రాస్తే చెయ్యను - త్రైలోక రాజ్యం నాకుండి యిమ్మ అంటే పట్టం గట్టనా ?

గాని యిప్పుడు ఏం చేతును? నాకు లోకజ్ఞానం తక్కువ వినాయకుని చెయ్యబోయి కోతిని చేస్తానేమో? రామారావు అనుభవజ్ఞుడు గుణవంతుడు నేర్పరి చెప్పిన మాట విననందుకు చీవాట్లు పెడితే పడతాను నా ఉద్యమంలో సాయం చెయ్యమని కాళ్ళు పట్టుకుంటాను

అని ఆలోచించి రామారావుకు పూసగుచ్చినట్లు కథంతా చెప్పాను నా నిశ్చయం యిదని తెలియచేశాను మళ్ళించ ప్రయత్నించవొద్దని గెడ్డం పట్టుకు బతిమాలాను రామారావన్నాడు "మళ్ళించగలనని నమ్మకం వుంటె మళ్ళించజూతును మళ్ళవని ఎరుగుదును చూడవద్దంటే చూడడం మానితివా?

గాని నాకు తోచిన మాటా నాకు తెలిసిన మాటా నీకు చెప్పకపోతే నేను అపరాధిని అవుతాను స్నేహాన్ని తప్పినవాణ్ణి అవుతాను

ఆలు మొగళ్ళ దెబ్బలాటల్లోకి వెళ్ళవద్దని మన పెద్దల శాసనం అవి అభేద్యాలు అగమ్యగోచరాలు మధ్యవర్తులు కాపరం చక్కచేదావంని చెక్కలు చేసి వెళ్ళిపోయి వస్తారు ఒకటి పులి పులి అని మనం యెంత పేరుపెట్టినా పాపం యీ పులి అరుపే కాని కరుపు లేదు మెటిల్డానీ ఎన్నడైనా ఒక్క దెబ్బ కొట్టానని విన్నామా? లేదు తిండికి లోపం లేదు గుడ్డకి లోపం లేదు అతను చెప్పినట్లు మెసులుకుంటే నెమ్మదిగా కాలం వెళ్ళడానికి అభ్యంతరం లేదు రెండు ఇక మూడోది నీకు మెటిల్డా మీద మనస్సు గట్టిగా లగ్నం అయింది అది కూడని పని చెడ్డ తలంపు లేనప్పుడు ఏమి ఫర్వా అని అనగలవు చెడ్డ తలంపు చెప్పిరాదు ఎక్కణ్ణించో రానక్కర్లేదు కంటిక్కనపడకుండా మనసులో ప్రవేశించి పొంచి వుంటుంది చూసీ చూడనట్టు మనం పూరుకొని అది పైకొచ్చే ప్రయత్నాలు బాహాటంగా చేస్తూ వుంటాం చెడ్డ తలపులకి గుర్తు ఎవరైనా వుండాలి కదూ అడవిలో వొంటరిగా వున్న వారికి స్త్రీల విషయమై చెడ్డ తలంపులు వుండవు సొగసైన స్త్రీల పొందు కోరేవాడికి అవకాశం తటస్థించినప్పుడు చెడ్డ తలపు వస్తుందా రాదా అని ఆలోచన - ఆ అవకాశానికి అవకాశం ఇవ్వనివాడే ప్రాజ్ఞుడు "

5

"నాకు నీవూ, నీ స్నేహితుడు రామారావూ మరొక గొప్ప వుపకారం చేశారు. మీ మాటలవల్లా, చేష్టలవల్లా నా భార్య యోగ్యురాలని తెలుసుకొన్నాను. ఆలోచించుకోగా ఆనాటినుంచి కళ్ళెం వొదిలేశాను. నా పెళ్ళాం బహు బుద్ధిమంతురాలు. ఇచ్చిన స్వేచ్ఛనైనా పుచ్చుకోలేదు. ఎక్కడికి కావలిస్తే అక్కడికీ వెళ్ళమన్నాను. ఎవరిని కావలిస్తే వారిని చూడమన్నాను. ఎక్కడికి వెళ్ళకోర లేదు. ఎవర్నీ చూడకోరలేదు. నాకు నీతో లోకం మరి ఎవరితో ఏం పనంది. అలాగే సంచరించింది....

"దాని చెర వొదిల్చావు. అది నా చెర కూడా వొదలడానికి కారణమైంది, హయ్యరు మాథమిటిక్సు చదువుకున్నావా? లేదా, పోనియ్యి."

కాల్‌బెల్ టింగ్‌మని వాయించాడు. కీలుబొమ్మలాగ మెటిల్డా ప్రవేశించి గుమ్మం లోపున నిలబడింది.

"కాఫీ యియ్యి."

బల్లమీద రెండు గిన్నెలతో కాఫీ అమర్చింది.

"నీక్కూడా పోసుకో."

మొగుడు కేసి "కూడునా యిలాంటి పని" అనే అర్థంతో చూసింది.

"ఫర్యాలేదు, నువ్వు కూడా తాగు, మన స్నేహితుడు" అన్నాడు. కాని ఆమె తనకు కాఫీ అమర్చుకోలేదు. ప్రక్కను నిలుచుంది.

"పోనియి, కూచో" అన్నాడు. కూచోలేదు. నేను భార్యాభర్తల సరాగానికి సంతోషించాను. నేను అందుకు కొంత కారణభూతుణ్ణి కదా అని మెచ్చుకున్నాను.

కాఫీ పుచ్చుకున్నంతసేపూ, అతను చెప్పిన మాటలు, తన భార్యకు చదువు చెపుతున్నాననీ అమేషా రామాయణం, భారతం చదువుతున్నట్టుందనీ, తను ఫలానా చోటికి తీసుక వెళ్ళాననీ, కులాసా చూపించానని, అంతట నా చదువు మాట కొంత. చాలా విద్వాంసుడని కనుక్కున్నాను.

వెళ్ళిపోయే ముందు "మరి నువ్వు వెళ్ళిపో."

# సంస్కర్త హృదయం

గత శతాబ్దపు చివరిరోజుల మాట. పడుపువృత్తి నిర్మూలింపబడాలని ఒక ఉద్రేక భావం సమాజాన్నంతటినీ ఆవరించింది. చెన్నరాష్ట్ర మంతా యిదే ఉద్యమం: కెరటంలా దేశమంతా ముంచెత్తి తగిన అదను చూసుకుని మరీ వచ్చి పడింది. ఎమ్ అనే పట్టణానికి. ఎమ్. అనేది జిల్లాకు ప్రధాన నగరం. . ఈ నాచ్ సమస్యను 'కాలేజ్ యంగ్‌మెన్స్ యూనియన్' వారు వారాల తరబడి తీవ్రంగా చర్చిస్తూ వుండేవారు. వాద ప్రతివాదనలు, ఖండన మండనలు యితోధికంగా సాగిపోతూ వుండేవి: తుట్టతుదకు పట్టం నుంచి ఎవరో ఒకరు మహావక్త, ఉద్రేకి వచ్చి అనర్గళంగా ఉపన్యసించి, యీ రంధీ తేల్చివేసేవాడు. ఆయన ఉపన్యాసం విని ప్రతిపక్షంవారి గుండెలదిరేవి; స్వపక్షంవారు బలపడేవారు. నాచ్ సమస్యకు వ్యతిరిక్తమైన సిద్ధాంతాలన్నీ పూర్వపక్షం చేయబడేవి. అంతటితో యువకులకు ఎక్కడలేని ఉత్సాహం పొంగుకువచ్చి, నాచ్ సమస్య అంటేనే చాలు చెవి కోసుకొనేవారు.

యువకులకు కుదిరినంతటి ఏకాభిప్రాయం, పెద్దలకు మాత్రం కుదరడం లేదు. హిందూ కాలేజీ ప్రిన్సిపాల్, అంతటి విద్యాసంపన్నుడవునా! మర్యాదా, మప్పితం, సరళ స్వభావం, గొప్ప హోదా, హోదాకు తగిన దర్జా అన్నీ ఉన్నవాడేను. ఆయన నడవడి చూసి అంతా గౌరవిస్తారు, శీల సంపన్నుడని మన్నన చేస్తారు; కానీ ఆయనకీ ఉద్యమం దూరంగానే ఉండిపోయింది. యాంటీ నాచ్ అనేది వుండతగిన సెంటిమెంటే. దానిలో ఆక్షేపణేమీ లేదు. కాని అందుకోసం ఏవేవో నియమాలు, ప్రతినలు చేయబూనడమంటే ఆయనకు పరమ అసహ్యం. సెంటిమెంటు మంచిదే అంటూ ఇదేమిటీ వేషం! విచిత్రంగా వుండే యీ ధోరణి అని చెప్పి సంస్కర్తలు ప్రిన్సిపాల్ గారిని తమ వర్గీయుడుగా జమ చేసుకోలేదు, పైగా ఖర్చు రాసుకున్నారు.

ప్లీడర్లలో కొంతమంది ఈ ఉద్యమం ఎంతో గొప్పదనే చెప్పారు. ఆశయాలెంత మహత్తరమైనవయినా, తాము మాత్రం, ఈ వాదన పట్ల సుముఖత చూపించలేమని సెలవిచ్చారు. అదేమంటే 'మాకు వచ్చే క్లయింట్లలో అత్యధిక భాగం ఈభోగం పడుచులే కదోయ్! అలాంటపుడు ఈ సమస్కరణకు పూనుకోవడమంటే, ఆ అమ్మాయిల పీకలు తడిగుడ్డతో నులిపెయ్యడమే కదూ!" అని జవాబిచ్చారు.

సీతాపూర్ బారులో సందడి చెలరేగింది. బార్ లీడరు కొంచెం తగుమనిషే. ఉన్నది ఉన్నట్టు మనసులోని అభిప్రాయాన్ని చెప్పగలిగే అతని ధైర్యాన్ని అంతా మెచ్చుకుంటారు. ఒకనాటి సాయంకాలం టెన్నిస్ క్లబ్బులో యీ

విషయం ప్రస్తావనకు రాగా, పగలల్లా తాను యాంటీనాచ్‌నని, రాత్రిళ్ళు మటుకే ప్రోనాచ్‌నని, అరమరికలులేక ఖండితంగా చెప్పివేశాడు. ఇరుపక్షాల వారికీ, యిది గౌరవమైన రాజీ అని, మిత్రులంతా అభిప్రాయపడ్డారు. బార్ లీడరు తెలివితేటల్ని అభినందించారు.

ఆ ఊరి కాలేజీలో రంగనాథయ్యగారు ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు. మంచి సంస్కారి, ఉన్నత భావోద్రేకి, సంఘ సంస్కరణోత్సాహి. మానవునిలో శారీరక మానసిక దౌర్బల్యాలు వున్నాయని వింటేనే అతనికి జుగుప్స. అన్యాయాన్నీ, అవినీతినీ ఏ రూపంలో ఉన్నాసరే, ఏరిపారవేయాలనే పట్టుదల అతని అణువుణువునా కనిపిస్తుంది. ఊళ్ళో కొంతమంది విద్యాధికులే, ప్లీడర్లే ప్రోనాచ్‌వాదులని వినగానే, అతని ప్రాణం చివుక్కుమంది. ఇది సహజమే మరి...వకీళ్ళ నైతిక పతనావస్థ చూచి హృదయం కల్లోలపడింది. వెంటనే క్లాసు రూములో నీతి నియమాలు లేని వకీలు వృత్తిమీద తుపానులా పడి విమర్శించసాగాడు. తన క్లాసురూములో నీతి నియమాలు లేని వకీలు వృత్తిమీద తుపానులా పడి విమర్శించసాగాడు. తన క్లాసురూములో రంగనాథయ్యరు తమను దుయ్యబడుతున్నాడనే వార్త పైకి పొక్కింది. జిల్లా మున్సబుగారి చెవికి సోకింది. ఆయనకి అరికాలు మంట నెత్తికి ఎక్కి చిందులు తొక్కడమారంభించాడు. అర్థం పర్థం లేని వాగుడురాయుళ్ళు, స్కూలు గుంటలు, ఎంతో ప్రాముఖ్యతగల సాంఘిక సమస్యలమీద తగుదునమ్మా అని అభిప్రాయాలు ప్రకటించబూనడం ప్రమాదకరం. స్కూలు పుస్తకాల పొలిమేరలైనా దాటని వీళ్ళు యిల్లాటి సమస్యలలో వేలుపెట్ట బూనడం దేనికి చెప్మా అని ఆశ్చర్యం ప్రకటించారు. ఆశ్చర్యం క్రోధంగా మారింది. ఇందుకు తగిన కారణం లేకపోలేదు. ఆయన భార్య ఎంతో మంచిది, నెమ్మదైనది. పరదాను తీసి బయటకు తొంగిచూసి ఎరగని మానవతి. ఆమె జనానా జీవితంలో యింతటి నిస్తబ్ధత పేరుకుని వుండడం మునసబుగారికేమీ మనస్కరించలేదు. అందుకు విరుగుడుగా, నాజూకు భోగంపిల్లను సంపాదించి, కాలక్షేపం కోసం తన భార్య చెంత వుంచుకున్నారు. ఒకానొక జిల్లా మునసబుగారి మూఢాభిప్రాయాలంటూ తీవ్రమైన విమర్శనావ్యాస మొకటి ఆ మర్నాటి స్థానిక దినపత్రికలో వెలువడింది. జిల్లా మునసబే కాక, ప్రోనాచ్ వకీళ్ళ నందరినీ, మాతృదేశ విద్రోహులుగా ఆ పత్రిక చిత్రించడం మొదలు పెట్టింది. వ్యాసకర్త ప్రొఫెసరుగారే!

ఈ వ్యాసం పెద్దలలో సంచలనం కలిగించింది. ఊళ్ళో గొడవ హెచ్చింది. ఎక్కడ చూసిన యిదే ముచ్చట వినిపించసాగింది; ఇదే చర్చతో సందడిగా వుంది ఊరు. మున్సిపల్ కౌన్సిల్‌లోను, దేవస్థానం బోర్డులలోను సభ్యుల మధ్య వాదోపవాదాలు పెరిగి రెండు ముఠాలుగా చీలిపోయాయి. కొందరు ప్రోనాచీయులు, మరి కొందరు యాంటీనాచీయులు, ఇరుపక్షాలకు వాదన ముదిరి, చిట్టచివరకు చేతులు కలపడందాకా వచ్చింది. కేకలు వేసుకోడంతో ఆరంభమయిన యీ వ్యవహారం పీకలు పిసుక్కునేవరకూ పెరిగింది. ఈ ఉద్రిక్త పరిస్థితులకు తాళలేక, ఊళ్ళోవున్న ఆ ఒక్కక్లబ్బూ, రెండు క్లబ్బులై డబ్బు లేకపోవడం చేత, దివాలా తీస్తాయా అని భయపెట్టసాగాయి. భోగం పడుచులకు ప్రోనాచ్ వకీళ్ళంటే వొళ్ళుకోసి యిచ్చేటంతటి అభిమానం పుట్టుకొచ్చింది. తమ కోసం, తమ పరువు ప్రతిష్ఠల్ని నిలబెట్టడం కోసం, రెండు పక్షాలుగానైనా చీలిపోయి, ఎంతైనా సాహసం చూపిస్తున్నారు. తమ ప్రియురాళ్ళ మీద వారి కెంతటి దయాభిమానాలో! దీనికి ప్రతిఫలంగా, యథోచితమైన ఆనందాన్ని ప్రోనాచ్ వారికి భోగం పడుచులు అడపా దడపా అందిస్తూనే వున్నారు కాని సంస్కరణవాదుల పేరు చెబితే, సానిపిల్లల వొళ్ళు గంగవెర్రులెత్తుతోంది. వాళ్ళలో వాళ్ళు సంస్కర్తలను గురించి ఎకసక్కాలాడుకుంటున్నారు; తట్టాబాజా కడుతున్నారు; యాంటీనాచీయులు, సరసం తెలియని మోటు మనుషులు. ఇదేమిటీ ఖర్మ! వీళ్ళ మొహం కాని, భోగం వృత్తి అరికడతామంటా రేమిటి? శృంగార రసాస్వాదన చేయలేని పరమ బ్రహ్మజమానులే వీళ్ళు! 'దుర్మార్గులమ్మా, దుర్మార్గులు వీళ్ళు' అనే ప్రచారం విరివిరిగా సాగిపోజొచ్చింది.

ఈ ప్రచారాన్ని రంగనాథయ్యరు సుతరామూ లెక్క చెయ్యలేదు. ఎలాగో అవకాశం చేసుకుని, పాఠం మధ్యను ఆగి, విద్యార్థుల మనస్సులను 'సాల్టు సొల్యూషన్స్' నుండి మరల్చి, సరాసరి పదుపువృత్తిని చేటలతో చెరుగుతూ విమర్శించేవాడు. సమాజంలో భోగం పదుచులు 'సేప్టి వాల్యూస్' వంటివారు. ప్లేగులా వ్యాపించిన యీ అవినీతి రూపు మాసిపోక తప్పదు. ఇందుకు యువకులు సంసిద్ధులు కావాలి. నైతిక పతనావస్థ నుంచి దేశాన్ని విద్యార్థు లుద్ధరించాలి. ఇదీ అతని ప్రబోధ సారాంశం.

ఆయన ప్రబోధాన్ని క్లాసులోని విద్యార్థులు జాగ్రత్తగా వినేవారు. కాని 'చందర్' అనే విద్యార్థికి మాత్రం యిది రుచించలేదు. చందర్ గొప్ప భూస్వామి బిడ్డడు. ఎప్పుడూ చేతి ములాగ్గా దబ్బు ఆడుతూ వుండేది. గుడ్డెద్దు చేలో పడ్డట్టు ప్రొఫెసరు చెప్పే ప్రతి మాటకూ బుర్రూపుతూ క్లాసులో కూర్చునే విద్యార్థి అంటే అతనికి తలనొప్పి. ఆయన చెప్పే ప్రతి విషయాన్ని తూచి, పరీక్షించి నిగ్గు దేల్చుకోవాలి. ఇది ఎంతవరకు ఆచరణయోగ్యం? ఏయే భాగాలలో అనంగీకారమో, ఒక భోగం పదుచును, మైక్రోస్కోపుముందు వుంచి ఎనలైజ్ చేసి చూస్తేనే తప్ప అమీ తుమీ తేల్చుకోరాదు. ప్రయోగం, పరిశోధన, ఋజువు సాధ్యపడనిదే ఏదీ సిద్ధాంతంగా చెప్పకూడదు. ఈ పట్టుదలతోనే, కంటికి యింపుగా కనిపించిన సరళ అనే పిల్లను చేరదీశాడు. సరళ ఊరందరి మనసులోనూ పడిన పిల్ల; చక్కని మనిషి; తీయని కంఠస్వరం; శాస్త్రీయ సంగీతాన్ని చక్కగా అభ్యసించింది. తన నాజూకు కొనవేళ్ళతో వీణను మీటుతుంది ఏయే సమయాలలో, ఉత్సవాలలో, ఏయే పాటలను, పద్యాలను పాడాలో నేర్పుగా నేర్చుకుంది. ఎవరికీ రానన్ని సంస్కృత శ్లోకాలు, తెలుగు పద్యాలు, కృతులు నోటికి ధారాళంగా వచ్చును. ఈ పిల్లపై చందర్, మానవ పరిణామ శాస్త్ర పరిశోధనకై ప్రయోగాలు చేస్తున్నాడు. పరిశోధన యింకా పూర్తికాలేదు. దిక్కు మాలింది. ఎప్పటికప్పుడే సరికొత్త విషయాలు, సమస్యలు వరస వరసగా పుట్టుకురావడంతో పెద్ద యిబ్బంది కలిగింది. శాస్త్ర తృష్ణ జాస్తీ కాజొచ్చింది.

సరళతో తమ క్లాసుమేటు ఎక్స్‌పెర్‌మెంట్సు చేస్తున్నాడనే సంగతి కొంతమంది విద్యార్థులు పసికట్టారు. వీరిలో కొంతమందిని చందర్ తన అనుయాయులుగా మార్చగలిగేడు. కొందరు పెద్దలు అతని ప్రయత్నాలను అభినందించారు. లేబరేటరీలో పరిశోధనకు తగిన వాతావరణం లేదు; ఈ వాతావరణంలో అన్నీ సదుపాయాలే అని, స్నేహితులు ఎంతో యిదిగా అతన్ని మెచ్చుకుంటున్నారు. ఈ నూత్న పరిశోధన కోసం చందర్ రచించిన సూత్ర వివరణ అమోఘమయినదనీ, లేబరేటరీలో దుర్వాసన కొట్టే సల్ఫ్యూరిక్ యాసిడ్, హైడ్రోజన్లకంటే, అగరు అత్తరుల వాసనలు సరికొత్త మార్పులని అంగీకరించారు. కాని క్లాసులో మాత్రం పెద్ద ప్రమాదం వచ్చిపడింది. నీతివాదులకు వీరి పద్ధతి నచ్చలేదు. మధ్యను కాళీగా ఒక బెంచి విడిచివేసి, దూరంగా వేరే ఒక మూలను చేరిపోయారు. క్లాసులో రెండు వర్గాలు ఆరంభమయినాయి. దీనికి కారణం బోధపడక మొదట ప్రొఫెసరు కంగారుపడ్డాడు. చివరికి తెలుసుకొని మండిపడ్డాడు. వేశ్యల మీద సాధారణంగా అతనికుండే క్రోధం, అసాధారణమై స్త్రీలలోని అలసత్వాన్ని చూసి ఉపయోగించుకుంటోన్న ప్రోనాచ్ వాదుల మీద అగ్గి కురిపించేవాడు.

**2**

రంగనాథయ్యరు గ్రీకులవంటి సౌందర్యారాధకుడు. ప్రతీ రోజూ స్వర్ణలేఖా నదీ తీరాన షికారు తిరిగేవాడు. లోయ చుట్టూ చిందరవందరగా గడ్డితో పచ్చగా రాలిబండలు వున్నాయి. అక్కడే గున్నమామిడి తోపులు, చింత చెట్లూ భీతాహంగా కనిపిస్తున్నాయి. తోట దాటిన తరువాత ఏపుగా పచ్చిక బయలు సముద్రంలా కనిపిస్తున్నది. దాని చివరను నావలా ఒక పెద్ద కొండ, కొండమీద పురాతన దేవాలయం, గాలి గోపురాలతో, ఎన్నో శిఖరాలతో,

విమానాలతో వెలిసింది. ఈ వాతావరణం ప్రొఫెసరు నాకర్షించింది. ప్రతీ సాయంకాలం అక్కడనే తచ్చాడుతూ, స్నేహితులతో పిచ్చాపాటి చెప్పుకునేవాడు. కవిత్వం, విజ్ఞానం మున్నగు విషయాలను శిష్యులతో చర్చిస్తూ వుండేవాడు. తన భార్యకు తను తలపెట్టిన గృహ సంస్కరణలు నచ్చలేదు; నచ్చక ఊరుకుంటే బావుణ్ను. లేనిపోని బెడదలకు తన మగడు పోతూన్నడని ఆవిడ చిర్రుబుర్రు లాడేది; సాధించేది. ఇంటికి యిప్పుడప్పుడే పోయి, గయ్యాళి భార్యతో గిల్లికజ్జా తెచ్చుకోడ మెందుకని, ప్రొఫెసరు బాగా చీకటి పడేవరకు, అక్కడనే షికారు తిరిగేవాడు. ఈ సమయంలోనే ఒక నిండు జవ్వని, అదే దేవాలయానికి వచ్చి స్వామిని దర్శించుకొనేది. ఆ పిల్ల సరళేనని తెలుసుకుని సంస్కర్తలంతా సంబరపడ్డారు. ఆ పిల్లలో యింతటి హఠాత్పరిణామం కలగడానికి హేతువు తమ ఉద్యమ ప్రభావమేనని గర్వించసాగారు. అనుమానమేమీ లేదు. తను చేసిన పాపాలకా అమ్మాయి పశ్చాత్తాప్పడుతోంది. వచ్చే జన్మలోనైనా సరళ, గౌరవప్రదమైన గృహిణిగా పుడుతుందని ఆశించారు కాని... హరి హరీ!... సరళ కెన్నటికీ ఆ తలంపే లేదనీ, ఆవిడ దేవాలయానికి రావడం ప్రొఫెసరును, అతని స్నేహితులను ఆకర్షించడానికేననీ, నేను చూచాయగా చెప్పవలసి వస్తున్నందుకు పాపం శమించుగాక!

ఒకనాటి సాయంకాలం, సూర్యుని బంగారు కాంతి చుట్టూ పడుతోంది. అందమైన మొఖమల్ వంటి ఊదారంగు చీరె కట్టుకుని, పసుపుపచ్చ సిల్కు ముసుగుతో, తళ తళ మెరిసే జరీ అంచుల మధ్య చూడ చక్కని చిన్నది దేవాలయానికి వచ్చింది. వచ్చి కొండ మెట్లు దాటుతూ, కిందకు చూసింది. "ఓహో! ఏ మా సౌందర్య రాశి!" ప్రొఫెసరుగారి ఆశ్చర్యం చూసి అంతా మౌనం వహించారు. "ఆహా! ప్రేమతో తొణికిసలాడే ఆ దృశ్యాన్ని రంగులలోకి మార్చాలంటే చిత్రకారుని కెంతటి ప్రతిభ కావాలి? అతని ఊహకు అందని దృశ్యమిది!" రంగనాథయ్యరు ఆనందం పట్టలేకపొయ్యాడు, ఉద్రేకం ఉప్పొంగుకు వచ్చింది. కూడా వున్న పండిత మిత్రులను ఉత్సాహపరచాలనే సంతోషంతో నాలుగు శ్లోకాలు చదివి వినిపించేడు; వన దేవతల, నదీ కన్యల సౌందర్యాన్ని అభివర్ణిస్తూ వారిని ఆహ్లాదపరిచాడు. అతనేమో రసాయన శాస్త్రజ్ఞుడు. కెమిస్ట్రీకి సంబంధించిన పడికట్టు రాళ్ళవంటి సిద్ధాంతాలు ఏవేవో అంకెలు, లెక్కలను అంటిపెట్టుకోలేక అతనిలాటి విషయాలలో దిగకూడదని నా అభిమతం. కాని ఆకర్షించే సౌందర్యరాసి, ఎదుట మసలుతోన్నపుడు కవి హృదయం వున్న ఎంతటి ఆజన్మ వేదాంతికయినా మనసు చెదరక తప్పదు.

ఇంతటి అందమైన మనిషి సంగతి పూర్తిగా తెలుసుకోవాలనే కుతూహలం రాను రాను అతనికి మిక్కుటమయింది. కుతూహలం కోరికగా మారింది. మనసు మనసులో లేదు. అతని అంతరాత్మ యిలా ప్రశ్నించింది

'ఆవిడ ఎవరో తెలుసుకుందుకు నీ కెందుకా ఆరాటం?'

'ఎందుకేమిటి! సౌందర్యమన్నది స్తుతించతగ్గదే. ఇందులో వచ్చే ప్రమాదమేముంది?' తనను తాన సముదాయించుకున్నాడు. అంతరాత్మ మళ్ళీ ఏమీ ప్రశ్నించలేదు. ఆ సాయంకాలమల్లా అక్కడే వుండిపోయాడు గుడిలో స్వామివారికి పవళింపు సేవ అయిపోయిన తరువాత గుడి తలుపులు మూసి వేస్తారు. అంతవరకు ఆమెన చూద్దామనే ఆశతో అక్కడనే మాట్లాడుతూ వుండిపోయాడు. కాని ఆవిడ కనిపించలేదు.

నిరాశతో యింటివైపు దారితీశాడు. అంతా నిశ్శబ్దం. ఎవరు ఏమీ నోరు కదపడం లేదు. నడుస్తూ దా మధ్య యిలా ప్రశ్నించుకున్నాడు: 'మళ్ళీ సోమవారం, ఆ పిల్ల కోవిలకి వస్తుందంటావా? రాదంటావా?'

'కబడ్దార్! పాపం పుణ్యం ప్రపంచంలో వున్నాయనే సంగతి స్మరించుకో' అంటూ అతని హెచ్చరించినట్లయింది, గద్దించినట్టయింది అతని అంతరాత్మ. ఎక్కడలేని ఆత్మాభిమానం ముందుకు వ 'రంగనాథయ్యరు, [illegible] చాంచల్యాల కతీతుడు!' అని సమాధానమిచ్చాడు.

మళ్ళీ సోమవారం వచ్చింది. మిత్రులను వెంటబెట్టుకొని ప్రొఫెసరు కొండమీదకు షికారు వెళ్ళేడు. ప్రకృతి నిశ్చలంగా వుంది. కళకూ, శిల్పానికీ గల భేదాలను వివరిస్తూ మాట్లాడుతున్నాడు. ఎదుట కొండ, దాని శిరస్సున కిరీటం వుంచినట్లున్న దేవాలయం ఎంతో కన్నుల వైకుంఠంగా వున్నాయి. "తిరిగీ ఆ సౌందర్యరాశి కంటికగుపిస్తే ఎంత బాగుండు"నని దేవాలయం వంక రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. కాని వెంటనే అతని ఆత్మాభిమానం గాయపడ్డట్టయింది. మనోగర్వం అతిశయించింది. ఇలాంటివేవీ నేను లెక్కచేయమన్నా చేయననుకున్నాడు. "ఆమె ఎవరో తెలుసుకోవాలనే ఆసక్తి తప్ప దీనిలో దోషమేముంది?" అని ఎదురు ప్రశ్న వేసుకున్నాడు. కాస్సేపు అటూ ఇటూ చూచేసరికి సరళ ప్రత్యక్షమయింది. గుండెలదురుతున్నాయి. రెండు నిమిషాలపాటు కొండ శిఖరాన నించుని, సరళ అటూ ఇటూ చూచింది. దిగువను స్వర్ణలేఖా నది ప్రవహిస్తూ వచ్చి ఒక బండరాయి చుట్టూ సన్నగా చీలిపోయింది. ఆ బండిరాతి మీద మాట్లాడుతూ కూర్చున్న ప్రొఫెసరు, అతని మిత్రులు సరళకు కనపించారు. సరళను చూసి అతనిక ఉండబట్టలేక పోయాడు. "ఆ చిన్నది ఎవర్తై వుంటుందయ్యా?" అని బైటకే అనేశాడు. అర్థవంతమైన దృక్కులతో ఒకరినొకరు చూసుకుని మిత్రులు మౌనం వహించారు. కంఠం సవరించుకుని అయ్యరు వర్డ్స్ వర్తు గీతం పాడుతూ ఉదహరించాడు.

*"తొలుత నామె నా చూపుల దొరలు నపుడె*

*మగువ ఆనంద దివ్యమూర్తిగ స్ఫురించె!"*

కన్నులు మూతలుపడి యోగనిద్రలో వున్నట్లనిపించింది. బౌద్ధ దేవాలయాలు ఆరామాలను గురించి ముచ్చటిస్తున్న వ్యక్తి హఠాత్తుగా ఆగిపోయాడు. ఎదురుగా నిలబడ్డ ఆ అందాల బరిణ ఎవరో తెలుసుకుంటేనే గాని ప్రాణం కుదుటపడదు; మనశ్శాంతి లేదు. మళ్ళీ ఉపన్యాసం సాగేటట్లు లేదు. అందువల్ల స్నేహితుడొకడు సాహసించి "అదా? అది వొట్టి వ్యభిచారిణి! పేరు సరళ." ఈ మాట విని గుండె నీరసించిపోయింది. "అంతటి అందమైన సూర్యతేజస్సు వెనక ఎంతటి అంధకారం?" అతని విభ్రాంతికి మేరలేదు. "పాపపంకిలమైన ఆ స్త్రీ పట్ల తన అమూల్య సౌందర్య సంపదనంతా వినియోగించే ప్రకృతి ఎంత అసంబద్ధం!"

హృదయం ఎందుకో నీరసించినట్లయింది. అతనిలో యేదో అస్పష్టమైన భావం ఉదయించింది. దూరంలో వినిపించే ధ్వనిలా వినిపించసాగింది. తలుచుకుంటే యీ భావం రమ్యంగా వున్నట్లుంది. మనసు కదో తృప్తినిస్తోంది. ఆశను కల్పించి ఉన్మాదిని చేస్తోంది. తనకు సరళ సునాయాసంగా లభిస్తే!... ఈ భావం తనలో జనించి క్రమేపి జయిస్తున్నట్లు అతనికే తెలియడం లేదు.

### 3

సరళ! ఎంత అందాలరాశి! ఎవరో కాదు ప్రతిరోజూ విద్యార్థుల తీవ్ర విమర్శకు గురవుతోన్న పిల్ల. ఆ పిల్లను చూసినప్పట్నుంచీ, విశేషించి ఆవిడ సరళేనని తెలుసుకున్నది మొదలు, ప్రొఫెసరు మనసు అల్లకల్లోలమయింది. హృదయంలో సంఘర్షణ ప్రారంభమయింది. గతించిన తన పసితనపు రోజులు చదువుకునే నాటి స్మృతులు జ్ఞప్తికి వచ్చాయి.

ఇల్లు విడిచి, పుట్టిన ఊరు వదలి, దూరంగా ఎక్కడో చదువు; ఏకాకి జీవితం; తెరిచింది మొదలు, మూసేవరకూ పుస్తకం మీదనే ఏకాగ్రత. తన చదువూ, తనూ తప్పిస్తే మరో ప్రపంచం కనిపించలేదు; వినబడలేదు. అయితేనేమీ, పరీక్షలలో క్లాసులు వచ్చాయి. జీవితంలో మంచి ఉద్యోగం లభించింది. నిక్షేపంలాంటి జీవితం.

విద్యార్థిగా ఉంటున్నప్పుడు జీవితంలో ఒక్కొక్కసారి ప్రకృతిలో తన్మయీ భావం కలిగేది; ప్రకృతీ, జీవితం శృంగారమయంగా గోచరించేవి. ఈ శృంగార భావం యిట్టే పుట్టి అట్టే మాయమయేది. విజ్ఞాన శాస్త్రపాఠాల రోకటి పాట, ఉత్సాహం ఉడిగిన జీవితం, యీ తన్మయిభావాన్ని నశింపచేశాయి. సంఘ సంస్కరణ పోరాటాలను వేదికల మీదను, పత్రికలలోను కొనసాగిస్తూ ఖ్యాతినార్జింప జూచే హిందూ విద్యాధికుల ఆలోచనలనే అతని బుద్ధి నేటికీ అంటిపెట్టుకొని వుంది. గురువుల బోధలను యథాతథంగా నిజాలుగా స్వీకరించాడు. మద్రాసులో తనతో తిరిగే స్నేహితుల భావాలన్నీ అతనికి పథ్యంగా కనిపించసాగాయి. పుస్తకాలలోని 'రెడీమేడ్' అభిప్రాయాలను సిద్ధాంతాలుగా స్వీకరిస్తూ, ఆ ఆలోచనల వాతావరణంలో మసలుతున్నాడు. ఇంతకు భిన్నమైన అభిరుచులను అతని జీవితం చవిచూడలేదు. కొన్ని సిద్ధాంతాలు, నమ్మకాలు ప్రొఫెసరనుకున్న మాట నిజమే. కాని అవి అనంతమైన జీవిత సంఘర్షణ నుంచి జనించినవి కావు. అందువ్ల బలీయమైనవి కావు. లేకుంటే భోగంపిల్ల సరళ కనిపించగానే, యిట్టే అతని మనస్సుకు 'ఎర' వేసినట్లవుతుందా! జీవితంలో సంఘర్షణ ప్రారంభమైంది. ఇది సంఘర్షణ మాత్రమే కాదు. నువ్వా, నేనా అని తేల్చుకోవలసిన పరీక్ష!

ఆమె మూర్తి కన్నులకు కట్టినట్లయింది. సరళ కోమల శరీరం క్షణ క్షణం అతని మనస్సును పీడిస్తున్నది. ఆలోచనలను వేధిస్తోంది. విశ్వాసాలను వమ్ము చేస్తోంది. 'సుందరమగు వస్తువు సతత మానందదాయకమగును' అని తను ఎక్కడో చదివిన రసాత్మక వాక్యం జ్ఞప్తికి వచ్చింది. ఈ ఆనంద జనక హేతువు, వొక భోగంపిల్ల అయితేనేమి? తను అనుకోకుండా, ఒక పిల్ల భోగం కులంలో జన్మించినంత మాత్రాన, మానవులు ఆమెను ఏవగించుకుని, నేరస్థురాలికి మల్లే శిక్షించవచ్చునా? లోకంలో అనేకమంది దురదృష్టవంతులున్నారు కదా, వారిని మనం కనికరిస్తున్నామా, లేదా? పోనీ వారికి మల్లే భోగంవారిని మానవులు ఎందుకు దయతో చూడకూడదు? అందులోనూ సరళ వంటి పిల్లను! ఇంతటి అందగత్తెను విచ్చలవిడిగా విహరించనిస్తే సంఘమూ పాడవుతుంది; ఆవిడా చెడిపోతుంది. అలాంటప్పుడు ఆమెను నిర్లక్ష్యం చేయకూడదు. ప్రేమను, కరుణను, తెలివిని చివరకు ధనాన్నయినా సరే ధారపోసి ఆమెను ఉద్ధరించాలి. భోగం పదుచుతో మాట్లాడితేనే మహా పాపం అనుకోవడం ఎంత తప్పు! సమాజ రుగ్మతలకు చికిత్స చేయవలసిన డాక్టరు సంఘ సంస్కర్తే!

ఈసారి మళ్ళీ కనిపించింది సరళ. తెల్లని చీర కట్టుకుంది. చేతిలో వెండి పూల సజ్జ పట్టుకుంది. గుడిలోనికి వయ్యారంగా నడుస్తూ వెడుతోంది. కోవెలలో సరళ పూజ చేయించడం కోసం వెడుతోందని అతను ఊహించాడు. విగ్రహం దగ్గర యీపాటికి నిలబడి వుంటుందని భావించాడు. నిజంగా ఆమె ఎలా వుంటుందో! దూరపు కొండలు నునుపు. దగ్గిరకెడితే సరి మనిషి తోలుపాతులు, లోటుపాట్లు తెలిసి వస్తాయి. ఆమె కురూపి కావచ్చునేమో! ఆమె ముఖ భంగిమలు వికృతంగా కనిపించవచ్చును. దూరం అనేది వీటిని కప్పిపుచ్చుతుంది. ఆమె అందవికారంగా వుంటే తను చేయగలిగేదేమీ లేదు. అలా కాక అందంగా వుంటే!.... ఆహా! ఆదర్శప్రాయమయిన అందం భోగంపిల్లలో వుండడం అసంభవం! అందమైనదనే సత్యం, మరుగుపరచలేనిది. ఇంతకీ ప్రయోజనమేమిటి? ఏది ఏమైనా యీ భోగం పదుచును సంస్కరించి తీరాలి.

భావాలను తరచుకుంటూ రంగనాథయ్యరు కొండమీదకు దారితీశాడు, దగ్గర దారిని కోవెల లోనికి అడుగుపెట్టాడు. భక్తులతో గుడి కోలాహలంగా వుంది. చోటు చేసుకొని, సరళకు కొంచెం పక్కగా నిలబడి చూస్తున్నాడు.

జీవితంలో ఒక భోగంపిల్ల పక్కను తను నిలబడడం యిదే తొలిసారి. మొహంఎత్తి సరళను చూసేసరికి చటుక్కున మూడు విషయాలు స్ఫురించాయి. మొదటిది : దేవతా స్త్రీల అందాన్ని సరళ పుణికి పుచ్చుకుంది.

రెండోది : ఆమె దైవభక్తి అపారం, మూడో విషయం : మహాశివుడు అర్ధనారీశ్వరుడై స్త్రీ పురుష సమాన హక్కులను లోకానికి చాటుతున్నాడు. స్త్రీలూ, పురుషులూ సరిసమానమే! అందుకు అర్ధనారీశ్వరుడే సాక్షి. సరళ సహచర్య భాగ్యం లభిస్తే ఎంతో బాగుండును. ఆ ఆనందం అనుభవించాలనే కోరిక అతనిలో ఆశగా పరిణమించింది. ఆత్మను లతవలె అల్లుకుంది. అటువంటి మనోహర విగ్రహంలో ఏ క్రూరత్వమూ యిమిడి వుండదు. సరళలోనే దుష్టస్వభావం వుంటే ఆకాశంలో మెరిసే నక్షత్రాలలో కూడా స్వచ్ఛత లేదన్నమాట! సూర్యుని తేజస్సు చీకటి కావాలని దాని అర్థం! ఉదారతాజనకమైన ఆమె సౌందర్యం నిర్మలానందమయం, దాని నింకా ఉదాత్తంగా గంభీరమైనదిగా మార్చడమే మానవ కర్తవ్యం.

నాటి రాత్రి అతనికి నిద్రపట్టలేదు. రాత్రంతా శివరాత్రిలా గడుపుతూ ఎన్నెన్నో ఊహాలతో, భోగం పిల్లలను ఎలా సంస్కరించాలనే ఆలోచనలతో పథకాలనువేస్తూ బిత్తరపోయాడు. నిజపత్నిజ్ఞప్తికి వచ్చింది. ఆమెను ప్రేమించడం అతని ధర్మం. పుట్టింటికి పంపించమని తనను ఎంతో యిదిగా కోరుతూంది. ఎన్నాళ్ళయింది పాపం, ఆవిడ పుట్టింటికి వెళ్ళి! పంపిద్దామంటే దూరం కదా! దూరమయినా, భారమైనా సరే, ఈ సారి పంపించివేయాలి. తప్పదనుకున్నాడు.

ఆ మర్నాటి ఉదయం కాలేజీలో ప్రిన్సిపాల్‌గారిని కలుసుకున్నాడు. ఆయనతో మాట్లాడుతూ, 'పడుపు వృత్తిని ఆరికట్టడ మెలాగ' అనే విషయం ప్రస్తావించాడు. బస్తీలో తన తమ్ముడున్నాడు. అతనికి యీ విషయమై ఒక సభను ఏర్పరచవలసినదిగా ఉత్తరం రాద్దామన్నాడు. ఆ సభలో 'విముక్తి సైన్యాన్ని' దళాలుగా నిర్మించుకోవచ్చును. ఈ లోపున కొన్ని ప్రయోగాలు, పరిశోధనలు స్థానికంగా చేసి చూసుకోవచ్చును.

"సమాజానికి అతి ప్రమాదకరంగా పరిణమించిన భోగం పిల్లను చూసి కొంత పరీక్షిస్తాను."

"ఎవరినీ? భోగం పిల్లనా" గతుక్కుమని ప్రిన్సిపాల్ ప్రశ్నించారు.

"అవును."

"సరళనేనా?"

"పోనీ ప్రయత్నించి చూస్తాను!"

"మనోవికారాలకు లోను కాకూడదు ప్రొఫెసర్! మనలాటి వాళ్ళు ఆకర్షణల దరిదాపులకైనా పోరాదు. మంచివాళ్ళ కీ పద్ధతి మరీ మంచిది."

ప్రొఫెసరు గారి మోము వివర్ణమైపోయింది. రోషం గొంతుకలో ప్రతిధ్వనించింది.

"నా దారిని ఎంతటి విషయలోలుడు అనుసరించినా మారక మానడు."

ఇంతకాలం నుంచీ ఆయనను ప్రిన్సిపాల్‌గారు, తన సోదరునివలె అభిమానిస్తున్నారు. కన్న కొడుకులా ప్రేమిస్తున్నారు. ప్రొఫెసరుది రసార్ద్ర హృదయం. ఏం ప్రమాదం కొని తెచ్చి పెడుతుందోనని ప్రిన్సిపాల్‌గారి భయం.

"ప్రమ్మాదాలేమీ రాకూడదని ఆశిస్తున్నాను. నీ ప్రయత్నం సఫలమగుగాక!"

రంగనాథయ్యరుకీ ఆశీర్వచనాలు, హెచ్చరికలుగా కనిపించి, మనసు గిల్లినట్టయింది. చికాకు పుట్టుకొచ్చింది! ఆత్మగౌరవం గాయపడ్డట్లు ఫీలయాడు. పతితుల నుద్ధరించాలనే పై పై ఆలోచనల మధ్య నిగూఢమైన ఒక కోరిక అతనికి తెలియకుండానే పుట్టుకొచ్చింది! ఆ యిచ్ఛ బలంగా పెరిగి సరళవైపు ప్రవాహంలా పరుగులు తీసింది.

తనకు ప్రత్యామ్నాయంగా ఎవరినైనా యీ సత్కార్య సాధనకు వినియోగించుకోవాలి.

ఈ తలంపు అతని కెంతో ఊరట కలిగించింది.

## 4

ఈ రాచకార్యాన్ని చదరంగంగా నడిపించగల యుగంధరులెవరు? వరస వరసనే మిత్రులను స్మరణకు తెచ్చుకోగా, విశ్వనాధశాస్త్రి మనసుకు తట్టేడు. అతను మంచి పండితుడు. సమయా సమయాలనుబట్టి జాగ్రత్తతో మెలగవలసిన మనిషి ఎదుటవారి అభిప్రాయాలు, అవి ఎంత అవకతవకగా వున్నాసరే - ఇట్టే ఆమోదిస్తూ తెలివైనవాడని ప్రఖ్యాతిని సంపాదించాడు. ఆంగ్ల విద్యాధికులతో సరిసమానంగా మసలుతున్నాడు. అన్నింటికీ అవునంటూనే, తన పని కొనసాగించుకో గల ఘనాపాఠి. ఇతనే తన "విముక్తి సైన్యానికి" ప్రప్రథమ సైనికుడు. విశ్వనాధశాస్త్రిని రిక్రూటు చేస్తే తన పని సుగమమవుతుందని ప్రొఫెసరు ఉబలాటపడుతున్నాడు. కాని యిదంతా విన్న శాస్త్రికి యీ ప్రణాళిక ఎందుకూ కొరగాదనిపించింది. రంగనాధయ్యరు వంటి వెర్రిమాలోకపు మనిషి ఎక్కడైనా వున్నాడా! అయితే చేజిక్కిన వ్యవహారమా, చేజిక్కని వ్యవహారమా అని శాస్త్రి ఆలోచించుకోసాగాడు. డబ్బుతో కూడిన వ్యవహారం. డబ్బు చేదా? గలగలమంటూ అది చేతిలో పడితే శాస్త్రి సాధించలేని పని లేదు. ఎంతటి విరుద్ధ మతమైనా శాస్త్ర సమ్మతమేనని సమర్థించగల పండితుడు. గ్రంథాల నుంచి అనేక సూత్రాలను, యుక్తులను ఎత్తి చూపిస్తూ ప్రమాణంగా తన వాదనను నిరూపించుకోగలడు. వేదాలు బ్రహ్మ సృష్టికాదనీ, కేవలం మానవ ప్రోక్తములేననీ ఏనాడో అంగీకరించాడు. పురాణాలు వట్టి అభూత కల్పనలేనని తేల్చివేశాడు. మానవ పరిణామవాదంలో తనకు గల నమ్మకాన్ని నలుగురిలోనూ ప్రకటించుకున్నాడు కాని మనిషినీ, కోతీని ఒకే వంశ వృక్షాని కెక్కించడం అతనికి వింతనిపించి, తనలో తాను నవ్వుకున్నాడు.

భోగం వృత్తి నిర్మూలింపబడాలనే వాదన ఎలాగో ఒక లాగ అతనికి నచ్చింది. ఉద్యమం నలుమూలలా విస్తరించవలసిందే. దేశంలో సానివాళ్ళుండకూడదు. ముందుకు ఉరకలు వేసిపోతున్న నాగరికతకు, వేశ్యల ఉ[illegible] ఆటంకం. ఈ ఆటంకాన్ని తొలగించేందుకు, ప్రచారం అవసరం.

ఒక శుభదినాన్న ఈ పవిత్ర ప్రచార భారం శాస్త్రి మీదకు వచ్చిపడింది. అంతటితో సంఘ సంస్కరణ కుపక్రమించాడు. నవజీవిత గృహ ప్రవేశం చూస్తూనే, ఏభయి రూపాయిల సంభావన పుచ్చుకున్నాడు. తనకు ప్రొఫెసరెందుకింత మొత్తం యిస్తున్నాడనే సంశయం శాస్త్రికి కలగక పోలేదు. సంఘ సంస్కరణకంటే యిందులో ఏదో స్వార్థం వుండకపోతే యింత పెద్ద మొత్తం ఎందుకిస్తాడు!

రెండు వారాలపాటు సరళకు శాస్త్రి భగవద్గీత చదివి వ్యాఖ్యానం చెప్పాడు. స్త్రీల పాతివ్రత్యాలను చాటే పురాణ ఘట్టాలను యిద్దరూకలిసి చదివారు. కాని యీ రెండు వారాల శ్రమ వట్టి నిష్ఫలమైంది. భోగం సమస్య మీద జరిగే చర్చలలో ఆమెదే పైచేయిగా కనిపించింది.

"ఆవిడవన్నీ యక్ష ప్రశ్నలండీ! 'చంద్ర వంశపు రాజుల నెత్తురు, సానివాళ్ళదే కదటండీ' అని ఆవిడడిగే సరికి నా నోరు మూత పడిపోయిందంటే నమ్మండి."

"అయితే ఏం జవాబిచ్చారు?"

"పురాణాలన్నీ అబద్ధాలనీ, మర్కటాల నుంచి మానవులు కలిగేరనే పరిణామ వాదమే నిజమనీ, చెప్పేద్దామనుకున్నాను! కాని ఊరుకున్నాను."

కొంచెం తటపటాయించుకుని శాస్త్రి, ప్రొఫెసరు కేసి చూస్తూ :

"ఆ పరిణామ వాదం ప్రకారం వార కాంతలకు సమాజంలో స్థానం లేదని రుజువు చేద్దామని నా తాపత్రయం."

"దాని జోలికి ఇప్పుడప్పుడే పోకండి, కోతులతో ఉపన్యాసం ప్రారంభిస్తే అల్లరి పాలవుతుంది వ్యవహారం."

"అయితే ఏమిటి సాధనం?"

"కాస్తైనా లోకజ్ఞానం వుంటేనే తప్ప పరిణామవాదం సులువుగా బోధపడదు. ముందు కాసిన్ని పిట్ట కథలు చెప్పి ఆకర్షించరాదూ?"

"ఆ పని చెప్పడానికి సులువే. చేయడం కష్టం. మీలా నేను యింగ్లీషు చదువుకోలేదాయె! సరళతో మహా చిక్కు. ఆవిడ తలలో అన్నీ సందేహాలే, సరస్సులో వికసించే వసంతకాలపు పద్మాల్లా."

కొన్ని వారాలు గడిచిపోయాయి. సరళకు తనవల్ల పాండిత్యమే అబ్బుతున్నది కాని, అన్యథా మార్పేమీ కలగడం లేదు. శాస్త్రికిది మనస్తాపం కలిగించింది. ఈమెను ఎవరు మార్చగలరు? ఒకే ఒకడు, యీమెను మార్చగలిగే వాడున్నాడు. అతనే పవిత్రురాలినిగా చేయగలడు. కాని యీ పనిని చేసేందు కతను జంకుతాడా? సరళ అతనిని గౌరవిస్తున్నది. ప్రేమిస్తున్నది. సరళపట్ల ఎవరూ లోకంలో తీసుకోని ఆసక్తిని అతను ప్రదర్శిస్తున్నారు. అందుకే అతనంటే ఆమెకు ప్రేమ, అతని పెదవుల నుండి ఒక మాట జారిపడితే చాలును, ఆమె మారిపోతుంది. తప్పదు!

విశ్వనాథశాస్త్రి సరళ యింటికి వెళ్ళినప్పట్నుంచి ఆవిడ కోవెలకు రావడం మానివేసింది. ఇది రంగనాథయ్యగారుకు విచిత్ర మనిపించింది. నది ఒడ్డుకు వారం వారం షికారుకు వెడుతున్నాడు. సరళ దర్శనం దుర్లభమయింది. ఇదంతా శాస్త్రి గురుత్వ ప్రభావమే ననుకున్నాడు. ఇక శాస్త్రి ఆమెను మార్చేదేమిటి, వున్న ఆ కాస్త భక్తి సరళలో పోతోన్న తరవాత! తనే స్వయంగా వెళ్ళి బుజ్జగించి లోకపు తీరూ తెన్నూ బోధించి ఆమె నొక హిటిగా ఎందుకు మార్చకూడదూ? అతనిలో ఈ ఆలోచన లేచేసరికి, ఎదురుగా శాస్త్రి వచ్చి, 'చేయవచ్చును కాని నువ్వు నైతికంగా పిరికివాడివి!" అన్నట్లయింది. ఉద్యమమే ఉదాత్తమైన దయినపుడు, జంకుదేనికి? రహస్యం ఎందుకు? సోక్రటీస్ నిర్భయంగా స్త్రీలతో మాట్లాడేవాడు కాదా? వెలయాలు కదా అని చెప్పి, ఆమె ఆహ్వానాన్ని బుద్ధుడు తిరస్కరించేడు కనుకనా! మానవుల అవస్థలను తెలుసుకోవాలంటే వారితో లీనమైపోవాలి. కవులు కలిసి పోవాలి. కవులకీ విశేషాధికారం వుంది. జీవితాన్ని పరిపూర్ణంగా పరిశీలించాలనే కోరిక న్యాయమైనది.

ఇంతవరకూ అతను సంశయవాదే; దేవుడు వున్నాడా లేదా అనే తర్కంతో పరిశోధిస్తున్నాడు. కాని ఈసారి దేవుడున్నాడనే నమ్మకం కొద్దికొద్దిగా కలగనారంభించింది. పూర్వపు నమ్మకం మెల్లిమెల్లిగా సడలిపోతూంది. ఆత్మ, పరమాత్మ, జీవుడికి వేరే లోకం వున్నాయి. సాజాత్యంవున్న జీవుళ్ళ మధ్య అద్భుతాకర్షణ వుండి వుండాలి. మహా ఉద్రేకం, ఈశ్వర ప్రేరేపితమైన ఉద్రేకం, బ్రౌనింగ్ మహాకవిని ఆవేశించింది! అందుకే నిజమైన ప్రేమ ఎన్నటికీ వ్యర్థం కాబోదని అలాపించాడు. ఇది గంభీర సత్యమే.

రంగనాథయ్యరు విచిత్రమైన మనస్తత్వంలో పడి కొట్టుకుంటున్నాడు. విజ్ఞాన శాస్త్రాభ్యాసం, సంశయ నివృత్తికి మారు, సందేహాలను కలిగిస్తోంది. సంశయాల మబ్బు తెర కళ్ళకు కమ్ముకు వస్తోంది. కూడని అనుభవాల ఆనందం కోసం తాపత్రయ పడుతూ, మోసగిస్తోంది. ప్రతిఘటింప వీలులేని, అత్యంత ఆకర్షణీయమైన వస్తువేదో తనను దగ్గరకు లాగుకుంటున్నది. దీనికి గల హేతువేమిటి! ఆలోచించి చూస్తే ఆకర్షణ అర్థం లేనిదికదా! అడుగడుగునా యిదే తర్కం అతన్ని పీడిస్తోంది, దుఃఖ పెడుతోంది, విసిగిస్తోంది.

## 5

క్రిస్టమస్ సెలవులు వచ్చాయి. 'పీ' అనే పట్టణంలో సంఘ సంస్కారులు సభ జరుపుకుంటున్నారు. అందులో రంగనాధయ్యార్ పడుపు వృత్తి మీద, ప్రధానమైన తీర్మాన మొకటి ప్రతిపాదించవలసి వుంది. కానైతే ఆయన యీ మీటింగులకు హాజరు కాలేకపోయాడు. కేలం లేబరేటరీలో కూర్చుని ఏకాంత వాసం చేస్తున్నారు. ఎలక్ట్రిసిటీ మీద ప్రయోగాలు చేస్తూ తనను తానే మరచిపోతున్నాడు. రోజుల తరబడీ యిదే పరిశోధన.

ఒకనాటి సాయంకాలం, చేసిన ప్రయోగం చూసుకుంటూ, సంతోషం పట్టలేకపోయాడు. అతని వదనం ఉజ్జ్వలంగా వుంది. కనులలో సంతృప్తి వెల్లివిరుస్తోంది. అందరూ కోరదగిన పరిశోధన విజయవంతంగా ముగియవచ్చింది! ఆనందంతో, ఆవేశంతో, కుర్చీ మీద చతికిలపడ్డాడు. ఎదురుగా బెంచీ మీద ఒక చక్కని ముద్దులొలికే పిల్ల కూర్చుని వుంది. ఆ పిల్లవి నల్లని కళ్ళు, గాలి కెగిరే ఉంగరాల జుత్తు, అప్పుడే కనుచీకటి పడుతోంది, ఎదురుగా వున్న దెవరని చూశాడు. ఏదో భ్రమ తప్పితే మరేమీ లేదు. కళ్ళు నులుపుకుని మళ్ళీ చూశాడు. భ్రమ కాదు, నున్నగా జారిపడుతూ ఉంగరాల జుత్తుతో వున్న అతి చక్కని చిన్నది! ఆ పిల్లను చూడగానే, కవితావేశం ఉప్పొంగి యింగ్లీషులో పాడడ మారంభించాడు :

"ప్రేమయన్నది అసలె తెలియదు
ముద్దులొలికే పసిపాపకు!
చావె, మేలని ప్రేమ కన్నను
కొంచెమైనను తెలియదాయెను!"

పాట ఆపి బాలికను సమీపించి యీ యింగ్లీషులోనే, ఆమె కర్థమవుతుందనే కాబోలు, ప్రశ్నించాడు:

"ఇక్కడ నీకున్న పనేమిటి పిల్లా?" ఆ పిల్ల బిత్తరపోయింధి. ఇదేమీ పట్టించుకోకుండా "ఇంద్రలోకం నుంచి అమృతం తెచ్చావా? నరకం నుంచి యమపాశం తెచ్చావా?" ఆ చిన్న పిల్ల మరీ గాభరా పడసాగింది. వణకుతూ అతని చేతికొక ఉత్తరం అందిస్తూ "ఇది మా అక్కయ్య...." అని ఆగింది. ఉత్తరం అందుకుని చూసుకున్నాడు.

"నువ్వు సరళ చెల్లెలివా?"

"అవును."

"పేరూ?

"తరళ."

"తరళా?"

రంగనాథయ్యరు ఉత్తరం లోలోపలే చదువుకోసాగాడు. దస్తూరీ ముత్యాల సరాల వలె వుంది. ఉత్తరంలో సరళ రెండు సంస్కృత శ్లోకాలను రాసింది. రమ్యార్థ ప్రతిపాదకాలయిన ఆ శ్లోకాలు అగాధాలలోనికి దారి చూపిస్తున్నాయి. చదువుకొన్నాడు. మళ్ళీ మళ్ళీ. అర్థం చెమత్కారంగా వున్నట్టు తోచింది. "చంద్ర కాంతిని ఆస్వాదించే చకోరం యితరమైన ఖాద్యాలను తిరస్కరిస్తుంది. కాని అయ్యో మేఘ పంక్తులు రేరాజును కప్పివేశాయి. మిణుగురు పురుగు 'నేనే నీకానంద మిస్తాను, ఇక్కడే వున్నాను' అని నిశతో చెపుతున్నది కాని రాత్రి ఓదార్చబడలేదు. ఆమె చంద్రుని కోసం నిరీక్షిస్తోంది. చంద్రుడొకడే ఆమె చీకటులను తరిమి కొట్టగలదు."

ఈ శ్లోకాలలో వున్న తాత్పర్యం అతని హృదయాన్ని కరిగించివేసింది. సరళ ఆత్మ ఈ లేఖలో యిమిడి వుంది. ఆమె ఆత్మ, ఆమె దేహం కంటె సుందరమైనది, నిర్మలమైంది, ఉజ్జ్వల తేజోమయం. ఒక నీచ కులంలో జనించిన స్త్రీలో యింతటి దేవతా స్త్రీల లక్షణాలుండడం ఆశ్చర్యం!

"నీ పేరెవరమ్మా? తరళే కదూ! తరళా! నీ కింగ్లీషొచ్చునా?"

"కొద్దిగానండీ!"

"స్కూల్లోనే చదువుతున్నావా?"

"అవును"

ఈ సమాధానం విని రంగనాథయ్యరు మొదట కొంచెం ఆశ్చర్యపడ్డాడు. సాని పిల్లలకు గరల్స్ స్కూల్లో ఎలా ప్రవేశం కలిగిందని అతని సంశయం! అహః! యిందులో ఏముందీ, తను గర్భగుడిలా చూసుకుంటూన్న లేబరేటరీ లోనికి ఆ పిల్ల ఎంత నిర్భయంగా దాడి చేసింది? ఇంక స్కూల్లో ప్రవేశించడమంటే వింతేముంది! సరళ చిట్టి చెల్లెలు యిక్కడికి రావడమే గొప్ప! ఆ పిల్లకు స్వాగతం! తను ఇంగ్లీషులో మాట్లాడితే ఆ పిల్లకు అర్థం కాకపోవచ్చును. తెలుగులోనే ప్రశ్నించాడు.

"ఈ రహస్యం ఏ మాత్రం బయట పొక్కనీయకేం?"

"అలా అనే చెప్పి నన్ను పంపించారండీ!"

"చాలా మంచి పిల్లవి! మీ అక్కతో ఈవాళ వస్తానని చెప్పేం, వచ్చి నాలుగు విషయాలూ బోధిస్తానని చెప్పు."

"అలాగే సార్!"

"అచ్చా! మీ అక్కతో నాకు పనుంది. ఎవర్నీ రానీయవద్దు, ఆఖరికి మీ అమ్మను కూడా."

"ఎవర్నీ రానీయంవండీ! మీరొక్కరే మాట్లాడుదురుగాని."

"అదేమరి! నువ్వూ సరళా తప్ప మరెవ్వరూ వుండొద్దు."

అలాగేనని తరళ బుర్రూపుతూ వెళ్ళిపోయింది. ఆ సాయంకాలం రంగనాథయ్యరుకి సంతాపమూ కలిగింది ఉల్లాసమూ పుట్టింది. సరళ యింటికి వస్తానని వాగ్దానం యిచ్చేటంతటి అలసత్వం ఎందుకు కలిగింది? ఏమిటీ దౌర్భాగ్యమని కాస్సేపు చికాకుపడ్డాడు. తానొక ఘనకార్యార్థం ప్రాణాలను అర్పించే మహా త్యాగిగా భావించుకున్నాడు సరళతో ఐక్యత కోసం, స్వర్గానందం కోసం, దేనినైనా సరే త్యజించాలి. జీవితంలో ఏది శాశ్వతం? నిర్మలమైన ప్రేమ పవిత్రమైనది. ప్రేమికుల హృదయాలమధ్య తన క్రూర సంప్రదాయాలతో, ప్రపంచం అడ్డుగా నిలబడుతోంది సమాజం పుట్టిన దాది, ఇదే పద్ధతి, సాటి ఆత్మకోసం, హృదయం పరితపిస్తుంది! పెరిక్లెస్సు పాపం! ఎస్పేసియ వంటి దేవత కోసం పరితపించిపోయాడు. కాని ప్రపంచం, ఆహా! ఆ ప్రేమికుల హృదయాలను వేరు చేసింది మానవుల ఆనందాన్ని చూసి గ్రీకు దేవతలకంటె కూడా, అధికంగా యీ లోకం కళ్ళు కుట్టుకుంటున్నది. ఎం చూడలేనితనం!

## 6

చీకటి పడింది. చిన్నచిన్న తుంపరులు పడుతున్నాయి. మాటు మణగింది. వీధులు నిశ్శబ్దంగా వున్నాయి సందులన్నీ దాటి చుట్టు దారిని అయ్యరు సరళ యింటికి వెడుతున్నాడు. ఆవిడ యింటిముందు ప్రత్యేకంగా చైర్మ స్నేహితుడు వేయించిన వీధిలాంతరు వెలుగుతోంది. ఆ ఇంటి క్రీనీడలో నించున్నాడు. ఎవరైనా చూస్తారేమోన

గుండె బితుకుబితుకులాడుతోంది. నరాలు జివ్వుజివ్వున లాగివేస్తున్నాయి. వీధిలాంతరు గెయ్యంలా చూస్తోంది. ఎన్నడూ దేనికీ అదరని గుండె ఝల్లుమంది. తొందరగా యింటికి పోవడం మంచిదేమో అనుకున్నాడు. ఎందుకొచ్చిన గొడవ, హాయిగా యింటికి పోయి పడుకోక?.... ఇంత దూరమూ వచ్చాక తీరా చేసి, యింటికి రిక్తహస్తాలతో వెళ్ళిపోవడమా? ఇంట్లోకి వెళ్ళి ధైర్యంగా ఆమెతో మాట్లాడితే వచ్చే ప్రమాదమేముంది?

అతని హృదయం ఉయ్యాలలా అటూ ఇటూ ఊగుతోంది. చీడీ మెట్లు గబగబ ఎక్కి, సంశయంతో గిరుక్కున వెనక్కి తిరిగి దిగిపోతున్నాడు. ఇంటికి తిరుగు మొహం పట్టాడు. నాలుగడుగులు వేసేసరికి వెనక ఎవరో పిలిచినట్లయిండి. అవును, ఆ గొంతు సరళ చెల్లెలు తరళదల్లే వుంది. అతన్ని పిలుస్తూ చనువుగా వచ్చి దగ్గరగా నిలబడింది. ఇంతసేపూ పడ్డ గాభరాను చూసి యీ చిన్నది తన నొక పిచ్చివాడి కింద జమకట్టదు కదా! ఆ పిల్ల చలాకీగా మాట్లాడుతూ లోనికి తీసుకెళ్ళింది. మేడమెట్లు చూపించింది. ప్రొఫెసరు మేడమెట్లు ఎక్కుతూంటే, గదిలోంచి గుప్పున పూల వాసన కొట్టింది. అగరు ధూపం అలముకుంది. వింత వింత పరిమళాలు స్వాగతమిస్తున్న[illegible] మందుకుని, రెండవ అంతస్థులోనికి వెళ్ళేసరికి పుగాకు వాసన, సారాయి కంపు ముక్కు పుటాలు [illegible] సాగింది. శరీరమంతా వణుకుతోంది. హాలులో ఒకమూల ఆయిల్ లాంపు వెలుగుతోంది. [illegible]లు, [illegible]లు, కుర్చీలు గదికి నిండుగా వున్నాయి. అలంకరణ కొంత పాతకాలపుది. మరికొంత [illegible]. [illegible]వర్మ రంగు రంగుల పటాలు, తంజావూరు నాయక రాజులనాటి పౌరాణిక చిత్తరువులు గోడకు వ్రేల్లాడుతున్నాయి. ఈ ఆధునాతన శతాబ్దంలో వుండతగని అవి ఎంతో అనాగరికంగా వున్నాయి. గోడల పొడవునా అక్కడక్కడ నగిషీ చెక్కిన గూళ్ళు వున్నాయి. వాటిలో కర్ర, లక్క పోర్సిలీను బొమ్మలు, వస్తువులు చిందరవందరగా పడివున్నాయి. మచిలీలో తయారైన సన్నని తెల్లని బట్ట సీలింగులు కప్పబడివుంది. దానిమీద కృష్ణుని రాసక్రీడ చిత్రితం; రంగురంగుల గ్లోబులు, జిగజిగమనే గాజు వస్తువులు సీలింగు నుంచి వేల్లాడుతున్నాయి. పెద్ద చందనపు పందిరి పట్టె మంచం హాలులో ఒక మూలను ఆక్రమించుకుంది. దాని మీద విలువైన దుప్పట్లు, పరుపులు పరిచి వున్నాయి. నేలమీద అరిగిపోయిన ఏలూరు తివాసీ వుంది. తివాసీ మీద గీసిన అగ్గిపుల్లలు, సిగరెట్టు పీకలు, గ్లాసులు, హుక్కాగొట్టాలు, కిల్లీ ముక్కలు, పీకదానలు చిందరవందరగా కనిపిస్తున్నాయి. ఏహ్యమైన ఈ గది వాతావరణం అతనికెంతో జుగుప్సను కలిగించింది. 'తరతరాల నుంచీ, పాప పంకిలమైన అతి నీచపు కామకృత్యాల కిది నిలయం, లెక్కలేని జీవితాలను నాశనంచేసి పొట్టను పెట్టుకున్న ఈ గది కంటె అపవిత్రమైన స్థలం యింకొకచోట వేరే వుంటుందా? ఇక్కడ జీవిస్తూనే సరళ ఉదాత్తతను ఎలా కాపాడుకోగలిగింది? ఇంతకీ నేను దుస్సాధ్యమైన కార్యాన్ని సాధించ బూనడం లేదు కదా!"

రంగనాధయ్యరు సరళ చెల్లెల్ని "ఈ నరక కూపంలో మీరెల గడుపుకొస్తున్నారమ్మా!" అని అడిగేడు.

"కాదండీ! ఇది మా అమ్మ పడక గది!" అమాయకంగా తరళ జవాబిచ్చింది.

"ఇందులో ఆశ్చర్యం లేదు! ఈ మురికి కూపంలోంచి త్వరగా అవతలకి తీసుకెళుదూ తల్లీ!" ఈ మాట విని ఆ పిల్ల చర చర హాలులోంచి నడిచి వెళ్ళి తలుపు తెరిచింది. "ఇలా రండి. ఇటే ఇటే."

## 7

సరళ గదిలోనికి వెడుతూ రంగనాధయ్యరు "హమ్మయ్య! నరకంలోంచి స్వర్గానికి" అన్నాడు. అతను చూసిన మొదటి గదికీ, దీనికీ ఎంతో వ్యత్యాసముంది. గోడలు అందంగా అద్దంలా మెరుస్తున్నాయి. గదికి నాలుగు గాగాలు ఆరు పెద్ద కిటికీలు వుండడం వలన గాలి విసారంగా లోనికి వీస్తోంది. దోమ వేసిన పెట్రోమాక్సులైటు,

వెన్నెలలా గది నిండా కాంతి వెదజల్లుతోంది. ద్వార బంధాలకు మామిడి తోరణాలు, బంతిపూల దండలు వింత శోభనిస్తున్నాయి. గదిలో తెల్లని మార్బుల్ బల్ల వుంది. దాని మీద అప్పుడే ఎగిరి వచ్చి వాలిందా అన్నట్లు ఒక ఎనామిల్ నెమిలి విగ్రహం. పింఛం విప్పుకొని, పింఛంలో నుంచి పూదొత్తుల వాసనలను గదంతా నింపుతోంది. పెయింటింగులు, రామాయణ, భారత కథలకు చెందిన చిత్రాలు, ప్రపంచ ప్రముఖుల, సంఘసంస్కర్తల, కాంగ్రెసు నాయకుల ఫోటోలు గది నలంకరించాయి. గోడలకు రెండు నిలువుటద్దాలు అమర్చబడి గది శోభను ద్విగుణీకృతం చేస్తున్నవి. గది మధ్యను పెద్ద సోఫా, దాని చుట్టూ కుషన్ కుర్చీలు, పడుకునే మంచాలు వున్నాయి. ఓక్ కర్రతో చేయబడి పాలిష్ చేసిన రివాల్వింగ్ బుక్కు కేసొకటి వుంది. దాని మీద మహా మేధావుల, ప్రపంచ వీరుల బస్ట్‌లు వున్నాయి. కిటికీ వద్ద నల్లని బల్ల వుంది. దాని మీద ఒక వీణ, గులాబీ పూల మధ్యను వుంచబడింది. రంగనాధయ్యరు అటు చూశాడు. ఆశ్చర్యం! తన ఫోటో, బల్ల మీద కనిపించింది. 'ఈ సొగసులాడి మనసును వశపరచుకునే ఆకర్షణ ఈరంగనాథయ్యరులో ఏమున్నదనీ?" అని ప్రశ్నించుకున్నాడు. 'నాలో వున్న అందం కాదు. కాని నాలో మేధాశక్తి ఆవిడ మనసును పట్టుకుని వుంటుంది. ప్రేమ ద్వారాలను ప్రేమే తెరవాలి. పాపం! సరళ వెర్రిపిల్ల. ఒకరి అభిమానాన్ని ఎరగదు. ప్రేమను కూడా...'

ప్రక్క హాలులోంచి ఎవరిదో బరువైన పాద ధ్వని వినిపించి అటు తిరిగి చూశాడు. ఎవరూ రావడం లేదు. తలుపులు చప్పుడు కాకుండా మూసి వేశాడు. 'అవతల హాలులో అనాగరికత, వికృతం, జుగుప్స; ఇవతల గదిలో సౌందర్య కళామయ నైర్మల్య వాతావరణం; ప్రకృతిలో ద్వంద్వ శక్తుల సంపుటీకరణ యిక్కడే గోచరిస్తోంది' అనుకుంటూ తరళను పిలిచాడు.

"ఆ తలుపులు వేసేద్దూ. నీకు పుణ్యం వుంటుంది. కంపు చంపుకు తింటోంది."

"సృష్టిలో అనాది నుంచీ పాపం, పుణ్యం ఒక దాని ప్రక్క యింకొకటి వుంటూనే వున్నాయి" అనే జవాబు వినవచ్చింది. అయ్యరు నిర్ఘాంత పడ్డాడు. చిన్న పిల్లలకు యింతటి బరువైన మాటలే!.... కొంచెం ఆగి చూసేసరికి సరళ ప్రత్యక్షమయింది.

తగు మాత్రపు అలంకారాలు ఆమె అభిరుచిని గొప్పదని వ్యక్తం చేస్తున్నాయి. వస్తూనే సరళ నమస్కరించి, కూర్చోండని అతనికి కుర్చీ చూపించింది. అతను కూర్చోగానే తరళ బయటకు వెళ్ళిపోయింది. సరళ ముందుకు వచ్చి, ఎదురుగా వున్న బల్లమీదకు వంగి, మోచేతులాన్చి, చేతులమీద మొహం పెట్టుకుని నిలబడి చూస్తోంది. ఆవిడ అందాన్నే తాగేస్తున్నాడా అన్నట్లు ఆతనూ తదేక దీక్షతో ఆమె వంక చూస్తున్నాడు. సరళ సిగ్గుతో తల వొంచుకుంది. కాలి బొటనవేలితో నేల రాస్తోంది. తను అలా చూడడం మొరటుతనమని అతనికి గుర్తింపుకు రాలేదు. సరళ కనిపించగానే, యింతకు ముందు తాను తయారుచేస్తున్న ఉపన్యాసం మర్చిపోయాడు. ఇపుడాతనికి ఒక్కటే కోరిక. లలితమైన ఆమె పెదవుల మీద అచ్చు వేసినట్టు ఒక ముద్దు పెట్టుకుంటే, ఎవరడ్డుతారు?

ఎంతో కష్టం మీద కోరికను లోపలనే అణచుకున్నాడు. సరళ అనిన ఆఖరు మాటలకు జ్ఞప్తికి తెచ్చుకుంటూ "అదంతా నిజమే! కాని అవినీతి కోరదగినదేనా? మీరు చెప్పినట్లు నీతి పక్కనే అవినీతి నిల్చివున్నదీ అంటే, దాన్ని చూసి సహించమని కాదు. పూర్తిగా నిర్మూలించమని."

"మీ వంటి విజ్ఞానుల ముందర, మాబోటి అజ్ఞానులం నోరు మెదపగలమా?"

"నోరు మెదపలేరు. కాని మీ వంటి శిష్యురాళ్లు మావంటి గురువులచేత నానా అసందర్భాల్నీ మాట్లాడించగలరు!"

"చెడు పెరుగుతోన్న కొద్దీ మంచి క్షీణిస్తూనే ఉంటుంది. లోక సహజమే మరి!"

"అందుకే అవినీతిని మటుమాయం చేయాలి!"

"ఎలా పారద్రోలడమో చెప్పండి! విజ్ఞానం వుదయించే వరకూ, మంచీ చెడ్డా, ఒక సరసనే పెరిగాయి కదా! మాయ అనేది ఒకటుందంటాన్నేను. ఆ మాయకి, నీతి అవినీతి అనేవి రెండూ రెండు కవల పిల్లలు. మరి మాయలేని సృష్టే లేదు!"

సరళ చెప్పిన యీ మాటల అర్థం తెలియక రంగనాధయ్యరు తికమక పడ్డాడు. ఒక క్షణం నిశ్శబ్దంగా గడిచాక, అతను సరళ నుద్దేశించి "దేవతా స్త్రీలా కనిపిస్తున్నావు సరళా! నేను సోక్రటిస్‌నని చెప్పుకోబోడం లేదు. కాని నువ్విప్పుడు చెప్పినదంతా, కేవలం వేదాలలోని మిస్టిసిజం. అది వేద పండితులకే అర్థం కాదు. ప్రత్యక్ష జీవితంలో మనం ఎదుర్కొంటున్న విషమ సమస్యలను పరిష్కరించుకుందుకు యీ వేద విజ్ఞానం ఒక్క పిసరు అక్కరకు రాదు. ఏ జ్ఞానం గురించి పండితులు మాట్లాడుతున్నరో, ఆ విజ్ఞానం అందరికీ అందేది కాదు. కొంతమందికే సాధ్యం. అదైనా నాకు సందేహమే!"

"అయితే మనకు పనికివచ్చే జ్ఞానమెలాటిదంటారు?"

"అది ఒకే ఒకటి. యుగయుగాల జీవితానుభవం! ఈ విజ్ఞానమే మన దైనందిన జీవితానికి సహాయకారి; చీకటిలోంచి వెలుగులోకి తెస్తుంది."

"మీలాటి గురువుల ఉపదేశం పొందుతూ, యీ జీవితాన్ని వెళ్ళబుచ్చుకుంటాను."

"నేనేమీ మహానుభావుణ్ణి కాను. నామీద అభిమానం కొద్దీ నువ్వలా అనుకుంటున్నావు కాని, నేనా పొగడ్తలకు తగను సరళా! నేనో కాలేజి మాష్టర్ని. కాని నీ మనో నిశ్చయం గొప్పది. ఈ జీవితం నుంచి, బయటపడు. అందుకు నా చేతనైన సహాయం చేస్తాను."

"ధన్యరాలిని. దేవుడి దయ నా మీద వుంది. లేకుంటే మీరు నా దగ్గిర కెందుకు వస్తారు చెప్పండి! నాది అపవిత్రమైన జీవితమని మీవల్ల యిప్పుడిప్పుడే తెలుసుకుంటూన్నాను. నా జీవితం మీద నాకే అసహ్యంగా వుంది. ఛీ, ఛీ! నన్నీ మురికికూపం నుంచి బయటకు తీసుకుపోరూ? నన్ను కనికరించి, ప్రబోధించండి. మీతో ప్రపంచపు చివరికైనా పయనించి వస్తాను. రక్షించండి."

'ప్రపంచపు చివర వరకూ' ఆమె తనతో పయనించడం! ఇది కాదు ప్రొఫెసరు వాంఛించినది.

"నా ఉద్దేశం అది కాదు సరళా! నువ్వీ జీవిత పద్ధతిని విడిచిపెట్టాలని నా కోరిక. విడిచిపెట్టి..."

"ఏం చేయమంటారు?"

"నిన్నెవరూ ప్రేమించడం లేదూ?"

"నన్నా? ప్రేమించడమా? ప్రేమించడం! ఎంత వింతమాటలండీ మీవి."

"ఏమీ?"

"మీరు తీసుకుంటోన్న యీపాటి శ్రద్ధ ఎన్నడూ ఎవరూ తీసుకోలేదు. మా అమ్మ వుందీ అంటే అది నాకు అమ్మేకాదు. పోనీ, మా యింటికొచ్చే మనుష్యులో అంటే వాళ్ళు ప్రేమనేది ఒకటుంటుందనే మాటే విని వుండరు!"

ఆమె నల్లని కనురెప్పల నిండా నీరు నిండుకుంది. కన్నీటిబొట్లు జలజల రాలిపడుతున్నాయి. హృదయం

ద్రవించసాగింది. ఆవిడ స్థితిని చూసి ప్రొఫెసరు జాలి గుండె కరిగిపోతున్నది. కాని ఆమెను ఏమీ చేయడం! తన వెంట లోకం మధ్యకు తీసుకువెళ్ళే ధైర్యం అతనికి లేకపాయె!

"ఎవరినైనా వివాహం చేసుకుంటే బాగుండును సరళా!"

"అంటే ఎవడో ఒక ఛండాలుడికి నేను కలకాలం పూర్తిగా బానిసనై పడివుండాలని మీ తాత్పర్యం!" సరళ మందహాసం చేసింది. కొంచెంసేపు ఊరుకుని మళ్ళీ అంది. "నాబోటి భోగం పిల్లలను ఏ మర్యాదస్థుడు పెళ్ళాడతాడో చెప్పండి మీరే!"

సరళ వేసిన ప్రశ్న రంగనాధయ్యరుకు యింతకు ముందెన్నడూ తట్టి వుండలేదు. ఈ సమస్యను సంపూర్ణంగా ఎన్నడూ చర్చించలేదు. వ్యభిచార నిర్మూలన ఎలా సాధ్యమో, ఎలా అసాధ్యమో అతనాలోచించలేదు. పుస్తకాలలోని సిద్ధాంతాలు వల్లెవేయడం తప్ప, అవి జీవితంలోనికి పరివర్తింప చేయడమెల్లానో ఊహించుకోలేదు. భోగం పిల్లలంటే ఒకటే నిర్వచనం. వాళ్ళు జీవితంలో ఓడిపోయిన స్త్రీలు! పడుపు వృత్తికి వ్యతిరిక్తమయిన వాదనలను పోగుచేసుకోవడంతోనే కాలం గడిచిపోయింది. సైనికుడిలా ఈ పుస్తక విజ్ఞానం మధ్య కవాతు చేస్తున్నాడు... ఇప్పుడు అతని అలసత్వం అతనికే తట్టి ఒళ్ళు నీరు విడిచిపోయింది... చిట్టచివరకు అతననుకున్నాడు కదా, 'నేనే రాజునైతే డబ్బు చూపించి అన్నీ గెల్చుకొద్దును. సరళను చదువుకున్న కుర్రవాడిని చూసి, ధనాశ చూపి, పెళ్ళిచెద్దును.. పోనీ, మాట వరసకు తనొక రాజుగా పుట్టాడనుకుందాం. అప్పుడు మాత్రం సరళను పెళ్ళాడగలిగే విద్యావంతుడు, యువకుడు, అందగాడు దొరకాలి కదా?' తనకు పెళ్ళి కాకుండా వుంటే ఎంత బాగుండును. ప్రపంచాన్ని ధిక్కరించయినా, సరళను పరిణయమాడేవాడు.

ఇద్దరి మధ్యను సంభాషణ ఆగిపోయింది. మౌనంగా అతను కూర్చున్నాడు. మొహం వివర్ణమయింది. నిశ్చలమైన ఈ నిశ్శబ్దత ఎంతో చికాకు కలిగిస్తోంది. సరళ యధాలాపంగా బల్లమీదను వున్న వీణ తీసింది. సోఫా చివరకు వెళ్ళి చతికిలబడి, మధురమైన కృతిని కిన్నెర కంఠంతో పాడసాగింది. అతనికి సంగీతమంటే ప్రాణం. కృతి ఎంతో బాగుంది. రాగం హాయిగా వినవస్తోంది. పాము పడగవిప్పి ఆడినట్లు, లేడి గంతులు వేసినట్టు, అతని హృదయం ఆనందించసాగింది. నాజూకైన వేళ్ళతో వీణను మీటుతుంటే, సరళ అప్సరసలా స్ఫురించింది. వీణ మెట్ల మీద ఆడే ఆమె వేళ్ళు ఎంత అందంగా వున్నాయని! నిస్తబ్ధతగా వున్న ఆ వాతావరణంలో వినిపించే సంగీతం అతన్ని బాహువులతో బంధించినట్లనిపించింది. నిస్సహాయురాలైన ఒక పిల్లను ఉద్ధరించడమెలాగనే అతని ఆలోచనా హారం తెగిపోయింది. మునిగిపోతున్నాడు. ఆత్మను కరిగించే సంగీతంలో మునిగి పోతున్నాడు. మునిగిపోతూ ఊహా ప్రపంచంలో తిరుగుతున్నాడు! 'దీనికంటె వేరే స్వర్గం ఎక్కడో వుంటుందా? అర్థం లేని పురాణ కల్పనలు! దేవతలకు మల్లే వున్న ఆమె పెదవులను ముద్దు పెట్టుకోవడమే నిర్వాణం. చిదానందమనే వెర్రి వేదాంతంలోపడి మహర్షులు యీ నిర్వాణాన్ని పొందలేకపోయారు.'

సరళ వేళ్ళు వీణ మీద యింకా నృత్యం చేస్తున్నాయి. జావళీ రసవత్తరంగా ముగియబోతూ వుంది. సన్నగా, తీయగా సంగీతం గదినంతా ముంచెత్తుతోంది. "నిజంగా ప్రపంచపు చివరలవరకు నాతో రాగలవా సరళా?" ప్రొఫెసర్ లేచి గబుక్కున ముందుకు వెళ్ళాడు. ఆమె పెదవులను ముద్దు పెట్టుకున్నాడు. సరళ చేతిలోని వీణ జారిపోయింది.

బయట వరండాలోంచి వికటాట్టహాసం వినిపించసాగింది. రంగనాధయ్యరు గాభరాపడి బెదురుతో చూశాడు. "సంస్కరణంటే యిదే! ఒకరిని లేవనెత్తబోయి మనమే కింద బడ్డం" అనే మాటలు వినిపించి, ప్రొఫెసరు

కంగారు పడుతున్నాడు. పళ్ళన్నీ బయటకు కనిపించేటట్టు నవ్వుతూ "దగాలో పడ్డాను. మోసం మోసం" అని వికృతంగా అరిచాడు. 'దగాలో పడ్డా'ననే మాట విని సరళ సిగ్గుపడిపోయింది. ఆశ్చర్యపడింది. అమాయకంగా నవ్వింది. తెల్లబోయి చూసింది. ప్రొఫెసరు మెల్లగా మేడ దిగి ఇంటికి పరుగెత్తసాగేడు.

తొందరగా అంగలు వేసుకుంటూ వీధిలోనికి వెళ్లేసరికి మేడ మీద నుండి 'దొంగ దొంగ' అనే కేక వినిపించింది. పోలీసుల లైట్లు అతని మొహం మీద పడబోతూ వుంటే తప్పించుకుని రంగనాధయ్యరు యింటికి దారితీశాడు.

కొంతదూరం నడిచేసరికి పరిచయస్తులు ఎదురై "ఇంత రాత్రివేళ ఎక్కడనుంచి ప్రొఫెసరు?".. ఆ రాత్రి అర్జెంటుగా ఏదో స్వంత పని మీద రంగనాధయ్యరు ఊరు వదలి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

మర్నాటి ఉదయం, అమిత గౌరవనీయులు, సహచరుడు, ప్రొఫెసరు రంగనాధయ్యరు పంపిన రాజీనామా లేఖను, ప్రిన్సిపాల్‌గారు చూసి, కంట నీరు పెట్టుకున్నారు. తను పడిన దురవస్థను వివరిస్తూ ప్రొఫెసరు, ప్రత్యేకించి ప్రిన్సిపాల్‌గారికి రాసిన ఉత్తరంలోని పంక్తులను చదువుతున్నప్పుడు, ఆయన కళ్ళు నీళ్ళతో గిర్రున తిరిగాయి.

# మతం : విమతము

(గోలకొండ పాదుశాహి ఫర్మానుల సీలు ఇచ్చట విప్పబడుటంజేసి దీనికి సికాకోల్ లేక చికాకోల్ అను పేరు కలిగెనని యిచ్చటి వారందురు గాని అది నిజము కాదు. ఈ పట్టణము బహు ప్రాచీనమైనది. దీని పేరు శ్రీకాకుళం, ఒకప్పుడిందు శ్రీకాకుళేశ్వరుని క్షేత్రముండెను. దానిని పడగొట్టి షేరు మహమ్మదు పెద్ద మసీదును కట్టెను. నిజమిది)

ఒక సంవత్సరమున కార్తీక శుక్లపక్ష దశమినాటి సాయంత్రము ఇద్దరు బ్రాహ్మలు, ముప్పది యేండ్ల ప్రాయపు టతడొకడును, యిరువది యేండ్లలోపు వయస్సుగల యతడొకడును తూర్పున నుండి పట్టణము దరియ వచ్చుచుండిరి.

నారాయణభట్టు మోము అత్యంత సంతోషముతో వికసితమై యుండెను.

"పుల్లా! మా వూరొచ్చాంరా, యిట్టి వూరు భూ ప్రపంచంలో వుండబోదురా. కాళిదాసు అవంతిని ఉద్దేశించి చెప్పిన మాటలు దీనియందు వర్తిస్తున్నాయిరా, యేమి నది ! యేమి వూరు: యేమి పాడి పంటలు: ఇక శ్రీకాకుళేశ్వరుడి క్షేత్రము. ఎట్టి మహాక్షేత్రమని చెప్పను, అదుగో!"

నారాయణ భట్టు నిశ్చేష్టుడై నిలిచి, కొంత తడవు మా వాడకుండెను.

"యేమి స్వామీ! యేమి స్వామీ!" అని పుల్లం బొట్లు అడుగ" యే మి చెప్పనురా. పుల్లా! కోవిలె గోపురం మాయమైపోయిందిరా!" అని నేలపై కూలబడెను.

చెట్ల చాటున ఉందేమో స్వామీ!"

"యే చెట్లు కమ్మగలవురా, పుల్లా! ఆకాశానికి నెత్తంటిని ఆ మహా గోపురాన్ని! మనస్సు చివుక్కుమని పోయిందిరా పుల్లా. యీ పట్నానికీ మనకీ రుణస్య యిక చెల్లిపోయింది. రా తిరిగీ కాసీ పోదాం."

"గోపురం కోసవాఁ యిక్కడికి వచ్చాం స్వామీ? ఎడతెగని మార్గాయాసం పడి యీ నాటికి దేసం చేరాం గదా. మళ్ళీ వెంటనే కాసీ పోవడానికి యినప కాళ్లు కావు గదా? లెండి, నా మాట వినండి! దాని సిగ్గోసిన గోపురం గోపురవఁన్నదే మీకు కావలసివుంటే మా వూరు రండి."

"ఓరి వెఱ్ఱి వాడా! మీ వూరి గోపురం యెవరిక్కావాలిరా! నీకు బోధపడదు. చిన్నతనంలో యెన్నడూ ఆ గోపురం మీదే ఎందుకా తీపులు. మా గోపురం కథా విశేషమైంది."

లేచి "శివ శివ! ఒరే. మీ వూరి గోపురం కూడా యీ మ్లేచ్ఛులు పడగొట్టి వుంటార్రా!"

"మీకు యేమి ఉపద్రవం వచ్చింది. పడగొడితే ఆ పాపం వాళ్ళకీ కొడుతుంది. ఆకలేస్తూంది. పెందరాళే వూరు చేరుదాం! లేచి అడుగెయ్యండి."

"వూరు – చావడం! ఆకలంతా పోయిందిరా !"

నారాయణ భట్టు లేచి మౌనం వహించి కొంత తడవు నడిచెను. అంతట తలయెత్తి చూడ సంజ చీకటిలో నెలి వెలుగు కమ్మిన పడమటి ఆకాశమును దూసి రెండు మసీదు స్తంభముల కళ్ళ యెదుట నిలిచెను. నారాయణ భట్టు మరల నిలిచిపోయి స్తంభముల పరికించుచు :

"కాకుళేశ్వరుడి గుడి పగులగొట్టి మ్లేచ్ఛుడు మసీదు కట్టాడు" అనుకొనెను.

"దేవుఁడెందు కూరకున్నాడు, స్వామీ."

"ఆ మాటే యే శాస్త్రంలోనూ కనబడదురా పుల్లా. మసీదువేపు పోదాంపద."

"మసీదు గానీ సత్రం అనుకున్నారా యేమిటి? పెందరాళే భోజనం మాట ఆలోచించుకోకపోతే ఉపవాసం తటస్థిస్తుంది."

"అంత మహాక్షేత్రం పోయిన తరువాత తిండి లేకపోతే వచ్చినలోటేమిటి?"

కాలుకు కొత్త సత్తువ పుట్టి గురువును, కాలీడ్చుచు శిష్యుదును గట్లంట, పుట్టలంట బడి మసీదు ద్వారం చేరిరి.

"ఏమి తీరుగా కట్టాడు స్వామీ, మసీదు!"

"వాడి శ్రాద్ధం కట్టాడు!"

గడ్డము పెంచి యాబది సంవత్సరములు ప్రాయము గల ఒక తురక చిలుము పీల్చుచు కూర్చునియుండ నారాయణ భట్టు 'సలా'మని ఇట్లడిగెను.

"భాయీ! ఇక్కడే కదా పూర్వం శివాలయం వుంటూ వచ్చింది."

తురక ఒక నిముష మూరుకొని నోటిలో పొగ నెగనూది "హా సైతాన్కాఘర్" అని యుత్తర మిచ్చెను.

"ఏం పాట్కొచ్చాయీ దేవుఁళ్ళకి!"

"దేవుళ్ళకి యే పాట్లూ లేవు, మన సాపాటు ఆలోచించరేం?"

"కుఱ్ఱవాళ్లకి ఆకలి లావు సాయిబు గారూ! యీ వూళ్ళో చేబ్రోలు వారుండాలి. వున్నారా? యీ దేవాలయం దగ్గిరే వారి బస వుండేది. అనగా యిప్పుడు మీ మసీద్దగ్గిరే!"

ముసల్మాను స్వచ్ఛమనె తెనుగు నవలంబించి "లేద"గును.

"అయ్యో! మా పెదమావఁ రామావధాన్లు, చినమావఁ లక్ష్మణ భట్టు దేశాంతర గతులైనారా? మృతులైనారా?"

సాయిబు చేత నుండి చిలుము నేలరాలి ముక్కలై నిప్పులు నలుదెసల చెదర, "నారాయణ" యని సఖేదముగా పిలిచెను.

"అయ్యో! నువ్వా మావాఁ!"

# సౌదామిని

(ఒక నవలకు స్థూల రూపం)

కవిగారు బాగా ఆమె మోజులో పడ్డారు. ఆయన ఆమెను అయిదు క్షణాల్లో పరిచయం చేసుకుంటాడు. నాకు బాధా ఈర్ష్యా పొంగుకొచ్చాయి. అందులో సగం వ్యవధిలో ఆయన ఆమె బిడ్డల స్నేహం సంపాయించాడు. ఆయన వారికి ఆపిల్ పళ్లు యిచ్చాడు. బొమ్మలు చూపించాడు. రైలు పెట్టె కిటికీలో నుంచి బయటకు చూస్తే నీలగిరి అడవుల సుందర చిత్రం కదలిపోతుండగా, ఆయన కుతూహలంతో కూడిన వారి జ్ఞానాన్ని శోధించసాగాడు.

ఆమె యిదంతా మౌనంగా గమనిస్తున్నది. అందులో కొంత కుతూహలం లేకపోలేదు. అయితే ఆయన ఆమెను అలా ఎంతోసేపు మౌనంగా పరిశీలిస్తూ ఉండనివ్వలేదు. అప్పటికప్పుడు ఏదో అంశం గురించి 'ఆమె అభిప్రాయాన్ని అడిగాడు. ఆమెకు ఆసక్తిగల అంశాన్ని కనిపెట్టేదాకా ఆయన అలా ఏదేదో అడిగాడు. అటు పిమ్మట మేము కూనూరు చేరేదాక వారి సంభాషణ అవిచ్ఛిన్నంగా సాగింది. నాలోని ఘర్షణ తత్త్వం పైకి ఉబికింది. ఒకటి రెండు పర్యాయాలు ఆయన చెప్పినది కాదన్నాను. ఆమె నావేపు చూచి ఔను అన్నట్లు తలూపింది. అయితే అతడు ఊరుకోలేదు. ఒకటి రెండు మూడు అలా వంద వరకు అంకెలు లెక్కపెట్టి నేను పూర్తిగా పొరపడ్డట్లు నిరూపించాడు. అంతేకాదు, ఆమె తల వూపడం నేను చెప్పిన దానికి ఆమోదంగా కాదనీ, నేను చెప్పిన విషయం సజావుగా తాను బోధపరచుకున్నట్లుగా తెలపడానికే ఆమె తల వూపిందని కూడా ఆయన నిరూపించాడు. రైలు ఆగగానే కొంతమంది మిత్రులు ఆమెకు స్వాగతం పలకడానికి వచ్చారు. ఆమె మాకు వీడ్కోలు చెప్పి, దగ్గరవున్న బంగళాకు తన స్నేహితులతో కలిసి వెళ్లుతున్నది. కవి గాఏమో తన ప్రయాణపు సంచీని తీసుకొని ఆమె వెంటబడ్డాడు, మీరు మా వెంట రావడం లేదా అని నేను ఆయనను అడిగాను. పిల్లల విద్య విషయంలో తనకు మిక్కిలి ఆసక్తి కలదనీ, విద్యాబోధనకు సంబంధించిన ఒక నూతన పద్ధతి ఆమెకు కొట్టిన పిండి అనీ, ఆ నూతన పద్ధతిని బోధపరచు కోవాలనుకుంటున్నాననీ ఆయన చెప్పాడు. నేను నివ్వెరపోయాను. కవిగారు తన సొంత విద్యపట్ల తప్పితే, విద్య గురించి ఆసక్తి కనబరచడం అదే మొదటిసారిగా నాకు తెలియడం. ఆయనగారి విద్యేమో కేవలం పత్ర.

ఆమె స్వరూపంలో గొప్ప ఆకర్షణ వుందని చెప్పక తప్పదు. ఎంత వద్దనుకున్నా ఆమె పై నుండి మనసు మరల్చుకోడం నాకు కష్టమే అయింది. ఆమెకు వీడ్కోలు చెప్పాడు.

అక్కడున్న పోర్టరుతో మాటాడుతున్నట్లు నటిస్తూ ఆమెకు దగ్గరగా నిలబడ్డాను ఆమె వెళ్ళిపోతూ వుంటే ఆమె వేపు చూస్తూ ఆమె కనుచాటయ్యే వరకూ అలాగే నిల్చున్నాను ఆ తరువాత నేను తిరిగి రైలు పెట్టెలోకి వెళ్ళాను కవిగారు తన సామాను నాకు అప్పగించాడు నేను దానిని నా సేవకులకు అప్పగించి వారిని ఎద్దుల బండిలో వెళ్ళమన్నాను తొందరగా మేడపైకి వెళ్ళి ఫలాహారశాలలో కాఫీ తీసుకున్నాను అక్కడనుండి బయటకు వచ్చేసరికి ఎక్కడా ఎలాంటి బండీలేదు ఊటీ రోడ్డు వెంట వెళ్ళగా వెళ్ళగా ఒక జట్కా కనిపించింది అది కీళ్లు సడలిన జట్కా తన నెవరో బాడుగకు పిల్చారని ఆడు చెప్పాడు "డబ్బెంత? అని అడిగాను.. అయిదు రూపాయలు జట్కాబండికి అది పెద్ద మొత్తమే కాని నేను ఆరిస్తానన్నాను చెల్లించండి అన్నాడు నేను డబ్బు యిచ్చేసి జట్కాలో కూచున్నాను కూచుని నా తారా బలాన్ని అభినందించుకున్నాడు కవిని గురించి - ధ్వనినీ లక్ష్యం చేయని కవిని గురించి - ఆలోచించాను ఆయన ఏ పెద్దింటావిడ భవనంలోనో దర్జాగా కూర్చుని మెరుస్తున్న కళ్ళతో ఖామ్యాకాశాల గురించి పెళపెళని వాగేస్తూ వుంటాది మరి నేనేమో యిలా కుదుపుల జట్కాలో కూలబడ్డాను తెరిపిలేని పని భారంతో కుంగిపోతున్న గుర్రం దానిని లాగుతున్నది దాని యజమాని మానవత్వపు చిహ్నాలు దాని వీపుమీద కనిపిస్తున్నాయి అంత మొండి జంతువుని నేనెన్నడూ చూడలేదు దానిని తోలేవాడు మహాక్రూరుడు కడుపునిండా తిండి లేని ఆ జీవిపై అతడు చెళ్ళుమని కొరడా తగిలించాడు నేను వచ్చీరాని హిందుస్థానీలో మందలించ నారంభించాను అతడు నా వేపు చురచుర చూచి గుర్రానికి మరింతగా తగలించాడు అందులో ప్రయాణించడానికి నేను నిరాకరించాను నా కోరిక ప్రకారం అతడు జట్కా ఆపాడు నేను సంగతి సందర్భాలు ఆలోచించాను నేను అందులో పోనంతమాత్రాన ఆ గుర్రానికి విశ్రాంతి చిక్కదు కదా అందువల్ల అందులోనే వెళ్ళాను మేము గుర్రాలు మార్చే స్థలం చేరేసరికి బాగా పొద్దుపోయింది చివరకు యిక్కడ ఆ గుర్రం సమ్మెచేసి ఇక కదిలేది లేదని మొండికేసింది దెబ్బ దెబ్బకూ అది వెనక్కు నడవ సాగించింది నేను దిగిపోయాను మరొక గుర్రాన్ని తెస్తానని బండివాడు మాటిచ్చాడు

## జట్కా

ఈ గుర్రం సరిగ్గా ముందరి దానికి వ్యతిరేకం ఇది బొత్తిగా లక్ష్యపెట్టని జంతువు సమతలంపై అది బాణంలాగా దూసుకుపోయింది

మళ్ళీ కొత్త బేరం

కొత్త బండి ముందే చెల్లింపు అంతలోనే వాన జల్లు ఒక మిత్రుని దుకాణం వద్దగా దిగడం అపవలసిందిగా బండివాడిని ఆడగడం నేను దిగీ దిగగానే మహావేగంగా బండివాడి పోక

బండివాడి మీద నాకు చెడ్డ కోపం వచ్చింది ముక్కు మొహం తెలియని ఒక స్త్రీ గురించి అంత ఆసక్తి కనబరచి టాంగాలు బళ్ళు దొరకకుండా చేసుకున్నందుకు నన్ను నిందించుకున్నాను

ముస్లిమ్ దుకాణదారుల్లో నాకు మిత్రులున్నారు నేను తడిసి ముద్దయి ఒక దుకాణంలోకి చొరబడ్డాను దుకాణం యజమాని నా వేపు ఆశ్చర్యంతో చూశాడు నన్ను దుస్తులు మార్చుకోవలసిందన్నాడు నా కోసం పైజామా ఫ్లానెల్ చొక్కా, బనియన్ ఓవర్ కోటూ రగ్గూ టోపీ తెచ్చిచ్చాడు నేను నా ఘనకార్యాలు వర్ణిస్తూ వుండగా అతడు పొయ్యిమీద వేడివేడి కాఫీ తయారు చేశాడు అతడు స్థూలకాయుడు కవిగారి ప్రవర్తనకూ నా జట్కా బేరానికి అతడు నవ్వాడు డబ్బా పాలతో తయారుచేసిన కాఫీ పుచ్చుకున్నాను దుకాణం యజమానికి హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకున్నారు వాన ఇంకా కురుస్తూనే వుంది నేను నా బసకు వెళ్ళడానికి నాకు

తోడుగా దీపంతో మనిషిని పంపుతానన్నాడు. అయితే ఆ ఇల్లు ఎక్కడుందో ఒక్క కవిగారికే తెలుసును. నేనది అడుగ మరిచాను. ఎక్కడకెళ్ళాలో నాకు తెలియదాయెను. దుకాణం యజమానికి ఏమీ పాలుపోలేదు. స్నోహౌస్ కొండపైన నా కొకరిద్దరు మిత్రులున్నారు. ఇంకా చాలామంది నేస్తాలున్నారు కానీ, వారెక్కడ నివసిస్తున్నదీ నాకు తెలియదు. నేనలా దీర్ఘయోచన సాగిస్తూ వుండగా, జోడు గుర్రాల బగ్గీ ఒకటి వచ్చి దుకాణం వద్ద ఆగింది. తెల్లని, ముసల్మాన్ తరహా తలపాగా ధరించిన ఏభైయేళ్ళ ఆయన లోపలికి వచ్చాడు. అతడిలా అన్నాడు : 'ఒక మిత్రుడి ఇంటికి వెళ్ళి వర్షంలో చిక్కుకున్నాం. నా కూతురుకోసం ఒక శాలువా, మా ఆడమనిషి కోసం ఒక రగ్గూ ఇవ్వండి. నాకేమో ఒక పెగ్గు విస్కీ. "వద్దు" "ఫర్వాలేదు. ప్రవక్త బోధలను మీరింత గట్టిగా ఆచరిస్తే మనకు ప్రాపంచిక సుఖాలు దొరకవు" అప్పటికే అతడు హుషారులో వున్నాడు. నన్నతడు గమనించి, "ఇదేమిటి?" అన్నాడు. ముసల్మాన్ వివరించాడు.

"మీ స్నేహితులు ఎవరైనా సరే మా ఇంటిలో ఉండవచ్చు. వివేకం ఉంటే భోజనం కూడా చేయవచ్చు". నన్ను ముసల్మాన్ అంగీకరించమన్నాడు. కొంచెం సేపు తటపటాయించి ఒప్పుకున్నాను. మేము బండి దగ్గరకు వెళ్ళగానే అతడు యేదో జ్ఞాపకం చేసుకుని తటపటాయించి ఇలా అన్నాడు. 'ఫర్వాలేదు. బండెక్కవయ్యా. ఆడాళ్ళున్నారు. నువ్వు గనక దగుల్బాజీవైతే వాళ్ళను తాకొద్దు. కాకపోతే చింతేలేదు!" "ఇదిగో ఆ ఎదుటి సీట్లో కూర్చో" "దేవుడు మనకొక అతిథిని పంపాడు." అతడు బండి తలుపు తెరిచినప్పుడు ఒక మెరుపు మెరిసింది. దాని కాంతి బండిలో పడింది. ఒక యువతి వంటిమీదున్న రత్నాలు జిగేల్మన్నాయి. ఆమె కళ్ళు తళతళా మెరిశాయి. ఆ కాంతి మెరుపు తీగకు సమానంగా వుంది. మళ్ళీ చీకటి. నేను నా స్థలంలో ఒదిగి కూచున్నాను, దేవతను తాకి అపచారం చేస్తానేమోనని. బండి అనేక మలుపులు దాటి వెళ్ళింది. వర్షం జోరుగా పడుతూనే ఉంది. చివరికి దీపాలతో మెరిసిపోతున్న ఒక భవనం ఎదుట ఆగాము. మేము ముందు దిగాము. తరువాత ఆడవాళ్ళు. వారు అప్పచెల్లెళ్ళలాగా కనిపించారు. ఒకామెవి నిరాడంబరమైన దుస్తులు, కొద్దిగా ఆభరణాలున్నాయి. చిన్నామె నఖశిఖపరయంతమూ తళతళలాడి పోతూవుంది. నే నొక్కసారి ఆమెను ఎగాదిగా చూచి వెనువెంటనే దృష్టి మరల్చుకున్నారు. అందుకు కారణం అల్లా చూడడం మర్యాద కాదనా, లేక కళ్ళు జిగేలుమనడమా? మోహం యొక్క చంద్రకాంతిలో కలిసి రెండు వజ్రం దుద్దులు ధగద్ధగాయమానంగా మెరసిపోతున్నాయి. ఆమె బండి వేపు ముఖం తిప్పుకొని ఉంది. అంతసేపూ గాజు కిటికీగుండా చూస్తూనే ఉన్నాను.

2

మబ్బులు చెదరి పడమటి దిశగా కదిలాయి. దూరాన ఉన్న పర్వత శ్రేణిపై ఇంద్రజాలపు తెర కప్పిన వెన్నెల. కప్ప బెకబెకలతో ఉండి ఉండి నిశ్శబ్దాన్ని భంగపరుస్తూంది. నేను కుషన్ కుర్చీలో కూలబడి మనోజ్ఞమైన వెన్నెల దృశ్యం పరిశీలిస్తూ వున్నాను. అప్పుడప్పుడూ మబ్బు తునకలు చంద్రబింబం మీదుగా పోతున్నాయి. పల్చటి చీకటిలో ఆ దృశ్యాన్ని అలుముకుంటున్నాయి. కొండపైన భవనాల దీపాలు మిలమిల మెరుస్తున్నాయి.

మంచి నుండి చెడ్డకూ, చెడ్డనుంచి మంచికీ ఎంతలో ఎంత మార్పు. చెడ్డనుంచి మంచి రావడం చూశాను. నేను జట్కాలో వున్నప్పుడు ఎంతగా చీదరించుకున్నాను. ఇంతలోనే సౌందర్యవంతులూ హాని కలిగించని దయాళుడైన ఒక వృద్ధుడూ వుంటోన్న భవనంలోకి, ఆ తరువాత ధన్యులైన స్త్రీలు నివసిస్తూన్న మహాసౌధంలోకి రావడం ఎంత గొప్ప మార్పు! తమరెవరని నే నడుగ సాహసించలేకపోతిని. అయితే అతడు నాయుడు కావచ్చునని నా కనిపించింది. నేను ఇది అని చెప్పజాలనిదేదో అతని మాటలో యాసలో ఉంది.

కాని, వర్షాన్ని కాదనడమా(?) పుష్కలంగా వస్తుజాలం అమర్చిన గదిలోకి ఆయన అందరినీ తీసుకొని వెళ్ళాడు. "విశ్రాంతి తీసుకోండి. దేనికీ మొగమాటం పడకండి. నేను శూద్రుణ్ణేకానీ, నాకొక వంట బ్రాహ్మడున్నాడు. "నాకు పూరీలు, పాలు కావలన్నాను. కాసేపు హడావుడి. (ఆయన పేరు బాలయ్య అనుకుందాం.) ఇరవై మంది పేర్లు పెట్టి పిలిచాడు. ఒక్కరు కూడా రాలేదు. అదే పనిగా బెల్లు నొక్కాడు. ఆఖరుకు తనే వెళ్ళాడు. బండివాడు హావభావాలతో చెప్తున్నది సేవకులంతా వింటుండడం చూశాడు. వెనక్కు వచ్చి చెప్పాడు. వంట బ్రాహ్మడు జబ్బు పడ్డాడన్నాడు. నాతో తానే స్వయంగా ఏవో కొన్ని ఫలహారాలు తయారు చేయిస్తానన్నాడు. ఆశాభంగం కలిగినందుకు విచారం తెలిపాడు. నాకేమి ఇష్టమో చెప్పామన్నాడు. ఏదైనా సరేను అన్నాడు. పూరీ వగైరా కావాలా అన్నాడు. ఏదైనా సరే అన్నాను. బయటకు పరుగెత్తి తన కూతురుతో, శుద్ధమైన నీ హస్తాలతో కాఫీ చెయ్యమ్మా అన్నాడు. "పని వాళ్లని దాన్ని తాకనివ్వద్దు" తన ఫలహారానికీ వడివడిగా వెళ్ళిపోయాడు. పావుగంట గడిచాక కూతురు వెండి పళ్ళెంలో కాఫీ, బిస్కట్లు తీసుక వచ్చింది. ఆమె తలుపుగుండా తొంగిచూసింది. నేను ఒక్కణ్ణే ఉండడం చూసి వెనక్కు జారుకుంది - మెరుపు తీగలాగే మళ్ళీ. ఆమె పేరు "సౌదామిని" అని నాకు తర్వాత తెలిసింది. ఆమె ఆ తరవాత తన పనికత్తై ద్వారా లోనికి కాఫీ పంపింది. పాతికేళ్ళు. చక్కగా ఉంది. శుభ్రమైన దుస్తులు. (బాలయ్య లోపలికి వస్తాడు) మీ ఫలహారాలు తయారవుతున్నాయి. నా కొక ఒరియా వంట బ్రాహ్మడు కూడా వున్నాడు. అతనే ఫలహారాలు తయారు చేస్తున్నాను.

బాలయ్య - నువ్వు కాఫీ పట్టుకొస్తున్నావా? తెలివిమాలినదానా. దాన్ని శూద్రులెవ్వరూ తాకరాదన్నాను. తీసుకెళ్ళిపో. అమ్మగారితో మళ్ళీ చేయించు, కులం నియమాలు నీకెప్పుడూ బోధపడవు ఆచారం. నేను శూద్రుణ్ణే కాని దక్షిణాదిన కొన్ని పాలక కుటుంబాలకు చెందిన వాణ్ణి. నా పూర్వీకులు బ్రాహ్మణుల పంక్తినే భోజనం చేశారు. ఆ రోజులు గతించాయి. నేను శూద్రుణ్ణి తక్కువ జాతికి చెందిందయినా స్త్రీ రత్నం పవిత్రమైంది. మాది తక్కువ జాతి. దీని గౌరవాన్ని నేను చివరిదాకా కాపాడతాను. ఎవరండీ ఆమె ? రుషిని వివాహమాడిన జాలరి అమ్మాయి? నాకీ పేర్లు జ్ఞాపకముండవు. నా కూతురు కన్నీ తెలుసు. సంస్కృతం వచ్చు. మొత్తం అధ్యాయాలే అప్పజెబుతుంది.

పరుగున సౌదామిని దగ్గరకు వెళ్ళి రెప్పపాటులో కాఫీ తయారు చెయ్యమని చెప్పు.

నన్ను ఉద్దేశిస్తూ - వంట గదిలో ఎప్పుడూ వేడి నీళ్ళుంటాయి. ఒక్కక్షణంలో అన్నీ సిద్ధమౌతాయి. పరుగెత్తు.

పనికత్తై - ఇది తయారు చేసింది సౌ....

బాలయ్య - అయితే తానే ఎందుకు పట్టుకురాలేదు? నీ చేతులు దాన్ని మైలపరచాయి.

నేను. ఫర్వాలేదు లెండి నేను పట్టించుకోను. మీ అమ్మాయిని ఇబ్బంది పెట్టకండి. (నేను ఆమె చేతిలోని కాఫీని తీసుకున్నాను)

బాలయ్య - ఓ - మీరు ముందున్న వారన్నమాట. మరైతే నాతోపాటు ఎందుకు భోంచెయ్యకూడదు?

నేను - నేను ముందున్న వాణ్ణే. కానీ సన్నని విభజనరేఖ గీస్తాను. కాఫీ ఎండు తిండి పదార్థాలు ఎవ్వరి చేతినుండైనా పుచ్చుకుంటాను. కాని, అన్నం మాత్రం బ్రాహ్మల చేతినుండే.

బాలయ్య - మీకు కులాన్ని గౌరవిస్తున్నందుకు సంతోషం. అందుకు మీ యెడల నాకు గౌరవం. కులాన్ని గౌరవించేవాడు తన్ను తాను గౌరవించుకుంటాడు. సమాజాన్ని గౌరవిస్తాడు. అలాటి మనిషిని మీరు నమ్మవచ్చు.

నేను - నేను దాన్ని ఒక సూత్రంగా పాటిస్తానని చెప్పను నా ఆచరణ కంటే నా సూత్రాలు చాలా ముందుంటాయి

బాలయ్య - నావి కూడాను నేను ఇంకా అధికం చెప్పగలను నా సూత్రాలకంటే నా ఆచరణే నా ముందున్నది కానీ సూత్రాన్ని గుర్తించక తప్పదు ఆ మాటకే వస్తే నా కొక ముసల్మాను ఖాన్‌సామా ఉన్నాడు నేను మాత్రం కులాన్ని సమర్ధిస్తాను కాలం కంటె ముందున్న వ్యక్తులు ప్రపంచంలోని అంశాలను తిరస రించలేరు వాళ్ళు కులం సూత్రాలను ధిక్కరించి ఆ పని చేయరాదు కులం యొక్క అన్ని అంశాలను గ్రహించి వాటిని చాటిచెప్పేవారు నియమాలన్నిటినీ అధిగమించే స్వేచ్ఛను జ్ఞానం ప్రసాదించే స్వేచ్ఛను పొందుతారు అట్టి వ్యక్తి నియమానికి మినహాయింపు అవుతాడు రుషులనే చూడండి వాళ్ళు శాసనాలు చేశారు వాటిని ఉల్లంఘించిందీ వారే మహా వ్యక్తి తనకు తానే శాసనం అయితే అట్టి మహా వ్యక్తి ఇతరులకోసం - సామాజిక శాసనాలను వాటి కారిన్యాన్ని ఏ మాత్రం సడలించకుండా విధిగా - విధిగా నిలబెట్టాలి నేను సేవలు చేస్తున్నట్టి మహారాజా గారి తాత్విక సూత్రం ఇదే

పనికత్తెతో - నువ్వెంత దద్దమ్మవు చిన్న కప్పుతో పట్టుకొచ్చావు ఇంకొకటి పట్టుకురా అమ్మగారిని పట్టుకురమ్మను అపవిత్రమైన నీ వేళ్ళతో దాన్ని మైల చేయకు అమ్మగారిని కొంచెం బిస్కట్లు కూడా తెమ్మను

ఆయన విస్కీ గుణగణాల గురించి ఉపన్యాసం సాగిస్తున్నాడు నేను మద్యం ముట్టనని చెప్పాను అందుకు మీరంటే గౌరవం అన్నాడాయన మిమ్మల్ని మెచ్చుకుంటాను నియమం వంటిది మరేదీ లేదు మరెవ్వరూ లేరు కదా అని ఆయన అటూ ఇటూ చూశాడు బీరువా తెరచి ఒక సీసా గ్లాసు బయటికి తీశాడు ఒక పెగ్గు వంపుకొని దాని కింత సోడా కలిపి గబుకున్న మింగేశాడు

మరో కాఫా కప్పు తీసుకుని సౌదామిని వచ్చింది తల వంచుకొని గుమ్మం దగ్గర ఆగింది

బాలయ్య - లోపలకురా మీకు బ్రాహ్మలు పవిత్రమైనవారు నా మిత్రుడు

ఆమె తల వంచుకొని అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి కాఫీ ఉన్న పళ్ళెం బల్లమీద ఉంచింది పెద్ద వెండి పాత్రలో కాఫీ ఉంది

బాలయ్య ఆమెను పిలిచాడు ఆమె దగ్గరకు వెళ్ళి ఆయనవేపు చూసింది జాలరి కన్యను వివాహమాడిన రాజు పేరు చెప్పమంటాడు ఆమె సమాధానం చెప్పకుండా వెనక్కి తిరిగి గదిలోనుండి వెళ్ళిపోతుంది

బాలయ్య - మానవ స్వభావంలో ముఖ్యంగా యవ్వన స్వభావంలో వికారం ఉంది స్త్రీలలో అది మరీ అధికం వెళ్ళిపోమ్మా అన్నాను అనుకోండి ఆమె ఉండిపోతుంది ఉండమన్నాను అనుకోండి వెళ్ళిపోతుంది

నాకు గడ్డు రోజులు ఆమె అందం పరికించాలని కుతూహలంగా ఉంది కానీ తండ్రి దగ్గిరే ఉన్నాడు నేను అతిథిని కదా అలా చూస్తే ఏమనుకుంటాడో నేను మర్యాదగా వుండి వెళ్ళిపోవడం మంచిది ఇంతకంటే మంచి అవకాశాలు లభించవచ్చు

ఆయన హుక్కా తెచ్చుకొని గది అంతా ఘుమఘుమలాడే ధూమంతో నింపివేశాడు ఆ హుక్కా టిప్పుసుల్తానుంది

అద్దాల గదినుంచి ఆ అమ్మాయి సౌందర్యం కొండలపైకి వ్యాప్తి చెందినట్లు కనిపించింది ఆ భవనం ఒక దేవాలయం ఆమె అందులో దేవత ఆమె ఊటీకి ప్రాణం పల్లపు మైదానాలకు దూరపు కొండలకు ప్రకృతికీ హెలియ ట్రోప్ దేవదారు చెట్ల సుగంధ పరిమళ భరితమైన వాయువులతో ఆమె సౌందర్యం తేలిపోయింది ఆమె స్ఫూర్తి సమస్త విశ్వాన్నీ అపరించింది నక్షత్రాలు ఆమె ఆభరణాలు ఆమె వెన్నెల వెలుగుల రాత్రి

గమనిక : ఉత్కృష్ట సౌందర్యమూ, యౌవన పరిమళమూ నిండిన దశలో ఆమె స్ఫూర్తి జాజ్వల్యమానంగా ఉంది. అవును. అట్లాగే ఉండక తప్పదు. ఆ తర్వాత అది తగ్గిపోవచ్చు. గులాబీ పువ్వు కొన్నాళ్ళకు వాడిపోవచ్చు. కానీ, పూర్తిగా వికసించిన దశలో దానికి అందమూ ఉంటుంది. పరిమళమూ ఉంటుంది.

వయసుతో చిన్నదైనప్పటికీ ఆమె భావాలు ఉన్నతమైనవి. మనుషులను జయించినవాడికి ఉన్న గొప్ప గర్వభావం ఆమెకున్నది. ఆమె ఒక నెపోలియన్. ఆమెకు గొప్ప సంపద ఉన్నది. ఏ రాజుకంటే, చక్రవర్తికంటె మిన్నగా ఆమె ఇవ్వగలదు. ఇవ్వకుండా ఆపగలదు. తరచుగా జరిగేటట్టు రాచరికంతోగాక, ప్రేమతో కూడుకొన్న అధికార చైతన్యం ఆమెది.

ప్రేమ, తనకంటే అధికమైన దానితో మార్పిడి చెందుతుంది. అది తన ప్రమాదాలను గుర్తిస్తుంది. దోషాలు సైతం అందాన్ని పొందుతాయి. అజ్ఞానం కూడా సుగుణమే. లైంగిక ప్రేమ సుఖాలు ఏమిటో బోధించనటువంటి, నేర్చుకున్నటువంటి సంతృప్తి ఉంటుంది. జీవితం బోధించేదేమిటో స్త్రీకి తెలిసి వుండవచ్చు. కానీ పురుషుడు మాత్రం తనకు తెలియని, లేదా లీలగా మాత్రమే తెలిసిన జీవితాన్ని మొదట నేర్చుకుని, అంతట స్త్రీచేత దాని రేకులను ఒక్కొక్కటే ఆవిష్కరింపజేయడానికి ప్రయత్నిస్తాడు. ఇంటి వెలుపల పురుషుడు సాగించే కార్యకలాపాల్లో ఆమె పాలు పంచుకోలేదు. ఆమెకొక ఆస్తిద్వాన్ని ప్రసాదించేదే నిజమైన జీవితం. ఆమె జీవితానికి, ఆమె కుటుంబ జీవితానికీ వ్యత్యాసం ఉన్నది. ఇవన్నీ సోదరుడికి ఎంత మాత్రం పట్టవు. కానీ భర్త దృష్టిలో చాలా ముఖ్యమైనవి....వగైరా, వగైరా.

3

నేను : మీకెంతో ఋణపడి వున్నాను. మీ దయార్ద్రతకు బదులు చెల్లించలేను.

బాలయ్య : మీరు చెల్లించగలరు.

నేను : మీరేమీ చెప్పినా చేస్తాను.

బాలయ్య : పనిమీద వచ్చారా? సరదాగా వచ్చారా ?

నేను : చెప్పుకోదగిన పనేమీ లేదు. సరదాగానే మైదాన భూముల్లోని ఎండవేడి నుండి తప్పించుకోడానికి, నీలగిరిలోని సుందర దృశ్యాలను చూడ్డానికి, ఆహ్లాదకరమైన ఇక్కడి గాలిని అనుభవించడానికి.

బాలయ్య : అయితేఓ నాతో వారం రోజులపాటు వుంటానని వాగ్దానం చేయండి.

నేను : చాలా సంతోషంగా.

బాలయ్య : చాలా మంచిది. అంత వేగంగా వద్దు(?) వాగ్దానంలో ఇబ్బందులున్నాయి. మీ రెవ్వరినీ చూడరాదు. వీధుల్లోకి (?) వెళ్ళరాదు. ఈ ఇంట్లోనూ, అంతగా ఎవరూ తిరగని ఈ యింది పరిసరాల్లో తిరిగే స్వేచ్ఛ మీ కుంటుంది. అతిథిగా ఒక (?) వాగ్దానం చేయండి. మా కుటుంబం గురించి ఎవ్వరికీ ఒక్క మాట కూడా చెప్పకూడదు. మేమిక్కడ పూర్తిగా ఏకాంతంలో జీవిస్తున్నాము. ప్రపంచం దుర్మార్గమైంది, దీనికి కుతూహలమూ, కిరాయి తత్వమూ మెండు. నా కూతురు అవివాహిత. ఆమె పెళ్ళి చేసుకుని బాహ్య ప్రపంచంలోకి వెళ్ళిపోతుంది. అంతవరకు నేను అనుకుంటే తప్ప, ఆమెను ఎవ్వరూ చూడకూడదు. తెలుసుకోకూడదు. ఈ రోజుల్లో యిది తండ్రి బాధ్యత. నా కూతురుకు బాల్యంలోనే వివాహం చేశాను కాదని విచారిస్తున్నాను. ఆమెకిప్పుడు సొంత ఆలోచన ఉంది. అయినా చిన్న పిల్లకేం తెలుస్తుంది. తనకు తెలుసునని ఆమె అనుకొంటుంది. నాకేమో సందేహాలున్నాయి. నేను ఇతరులపై ఆధారపడక తప్పదు. నా బంధువుల సలహాను నేను నమ్మలేను. వారి సలహాల్లో స్వార్థం

వుంటుంది. యువకుల సలహాలూ అంతే. మీకు యిక్కణ్ణుంచి వెళ్ళే లోపలే నేను ఈ సలహా అడగవచ్చు. నేను అనుకుంటే, ఆమెను, ద్రౌపదిలాగా ఒకేసారి డజన్ మంది జమీందార్ల కిచ్చి పెళ్ళి చేసెయ్యగలను. ఆమె కడగంటి చూపుకోసం వారేమైనా చేయగలరు. ఆమె సౌందర్యానికి నేను గర్విస్తున్నాను. వయసులో వున్నప్పుడు ఆమె తల్లిని మీరు చూడవలసింది. అది మరో కథ అనుకోండి.

నెల్లూరు బ్రాహ్మడు కాఫీ తీసుకొచ్చాడు. ఆయన శుభ్రంగా స్నానం చేసి పూజా అవీ చేశాడు. జుట్టులో పూవు దోపాడు, (భంగు, మతం, స్త్రీ) భంగు పుచ్చుకున్నప్పుడు తూలుతూ నడుస్తాడు. మహాత్ములు చేసిన అతడి గురువు రాసిన జాబులు, ఊటీ పుట్టు పూర్వోత్తరాలు గురించీ కాకమ్మ కథలు, పౌరాణిక ఆసక్తిగల, కల్పనాశక్తి వున్న బుద్ధి అతనిది. అనుభవాల (?) గురించి చెప్పాడు. కొన్ని విషయాలున్నాయి. కానీ వాటి గురించి చెప్పకూడదట. జీవితం మహా విలువైంది! నాయుడు మంచివాడు, అతడు తనను ఎప్పుడూ వదలడు. అయితే నాయుడు వుంచుకున్న ఆమె మాత్రం గయ్యాళి. పిసినిగొట్టు. ఆమె గుండె రాయి. ఆ అమ్మాయి దేవత. అరగంటలో అన్ని విషయాలూ సంపూర్ణంగా రేఖా చిత్రంలోచూపాడు. ఆయన అసలు భార్య, కుటుంబం షాక్లేరులో వున్నారు.

4

కవి : స్త్రీ లేచి తిరగబడాలి, మనుషుల్లో మేలైనది. ఆమె అబల అని పిలుస్తుంటారు. అర్థంలేని మాట. మన దేశంలోని రైతు కుటుంబం స్త్రీ, పొలంలో కునుకుపాట్లుపడే పురుషుడి కంటె బలమైంది, గట్టిది, ఓపిక గలదీను. నాట్లు వేసేది ఎవరు? చెప్పు దద్దమా, పత్తి ఏరేది ఎవరు? చింతపండులోని పిక్కలు తీసేదెవరు? అన్ని పనులకూ పనిమనిషి ఎవరు? వడ్లు దంచేది ఎవరు? యిత్యాది.

ఇక మన స్త్రీల గురించి, ఉన్నత కులాల స్త్రీల గురించి, ఆమె నీళ్ళు తోడుతుంది. వంటా వార్పూ చేస్తుంది. నాగరికత గల స్త్రీ – దైవసృష్టిలో ఉత్కృష్టమైనదయినా ఈమె శారీరకంగా బలహీనురాలని నేను ఒప్పుకుంటాను. కానీ, పాశవిక శక్తిని ఎందుకూ పనికిరానివిగా చేసే పరికరాన్ని ఆమె చేతుల్లో పెడదాం. ఖడ్గవిద్య స్త్రీ మాత్రమే నేర్చుకోవాలి.

నేను : వారి కది బాగా తెలుసు.

కవి : మీకు ఎప్పుడు హాస్యమాడాలో తెలీదు. పురుషునికి బుద్ధిమాంద్యం, క్రూరత్వం వున్నాయి కాబట్టి స్త్రీ కత్తిసాము చేస్తుంది.

బయటకు వెళ్ళే సబయంలో ప్రతి స్త్రీకి ఆయుధం వుండాలి. (రివాల్వరూ, బాకు)

నేను : చంపడానికి ఆమె కళ్ళు చాలుననుకుంటా.

కవి : అవును. అవి అయిదు హృదయాలను జయించగలవు. కాని, బుల్లెట్లూ, కత్తి అవసరమయ్యే ఆటవిక మనుషులున్నారు.

అప్పుడు మాత్రమే క్రూర పురుషుల దారినుంచి స్త్రీ తన్ను తాను రక్షించుకోగలదు.

వంట చేయడాన్ని నిషేధించి పారేయాలి. దుకాణం నుంచి ఆహారం తెచ్చుకోవాలి. దాన్ని వెచ్చపెట్టడానికి అవసరమైన సామగ్రి ఉంచుకోవాలి. దుకాణంలోనే వంట బాగుంటుంది. ప్రతి వీధికి ఒక దుకాణం వుండాలి. కుటుంబం అక్కడకు వెళ్ళి భోంచేస్తుంది. ఇక వంటా వార్పూ చింతే వుండదు. ఇట్లా శక్తి ఎంతగా పొదుపు అవుతుందని!

నేను : కాని పేదవాళ్ళు ఆ విధంగా ఆహారం కొనుక్కోలేరు.

బాలయ్య : అతని వూహా స్వర్గంలో పేదలే వుండరు.

కవి : ఊహాస్వర్గమా! నేను వాస్తవమైన యీ ప్రపంచం గురించే మాట్లాడుతున్నా. కవీ, ప్రవక్తా ఎల్లప్పుడూ కాలం కంటే ముందు వుంటారు.

ఖడ్గ విద్యాభ్యాసం విషయం బాలయ్యకు నచ్చింది.

కవిగారు ఖడ్గవిద్య నేర్పడానికి పూనుకుంటాడు. ఆమె నేర్చుకోవడం ప్రారంభిస్తుంది. పెత్తనం అంతా అయనదే. ఆమెకు కవిత్వం కూడా నేర్పుతారు. ఆమె పద్యాలు చదవడం ప్రారంభిస్తుంది.

5

ఒక జమీందారు ఆమెను ఎత్తుకుపోవడానికి ప్రయత్నిస్తాడు. ఆమె అతన్ని కత్తితో పొడిచేస్తుంది. కవి దెబ్బతింటాడు. రక్తం కారుతుంది. లేడి లాగా, కొండల మీద గంతులేస్తూ ఆమె తిరిగి వస్తుంది. కవి గారిని రిక్షాలో పడేసి తీసుకొస్తారు. కొండల్లో గుర్రపు స్వారీ చేస్తుండగా జమీందారుని ధగ్గులు (సోదరుడు?) పొడిచి చంపినట్లు మరుసటి రోజు విన్నాం.

కవి ఆమె సోదరుణ్ణి కత్తిసాములో కింద పడేస్తాడు. అతనిని నరుకుతానంటాడు. ఆమె జోక్యం చేసుకుంటుంది. అతను లేస్తాడు. వాళ్లు పక్కకుపోయి మాట్లాడుకుంటారు. మౌనంగా ఉండమని ఆమె ఆదేశిస్తుంది.

వారి మనో ప్రవృత్తుల మధ్య, నైతిక దృక్పథాల మధ్య తేడా వుంది. మతపరమైన అభిప్రాయలు వగైరా ఒకటి మాత్రం ఇద్దరికీ ఉమ్మడి లక్షణం ఉంది. తమకు ఎలా తోస్తే అలా చేసే తత్వం (?) ఎవరి పద్ధతిలో వారు గట్టివాళ్లే. సౌదామినికి తన తల్లి పుట్టుక గురించి తెలుసు. ఆమె హృదయాన్నీ అది పురుగులాగా తొలుస్తూంది.

6

ట్యూడర్ హాలు వద్దకు కవిగారు (?)

సౌందర్యం.

నా ప్రియా ! కంగారుపడకు. నా ప్రియా అని నేనంటే నీకు కలిగే హాని ఏముంది? నేనా మాటను ఒక అర్థంలో, చాలా సముచితమైన అర్థంలోనే వాడుతున్నాను. నిన్ను ప్రేమిస్తున్నాను. అయితే నా ప్రేమ నీ కెలాంటి హానీ కలిగించదు. నాకు నీ స్నేహం కావలెను. అంతకంటె ఎక్కువ నేనడగలేను. నిన్ను చూడడమే నాకు అమితానందం. నీ మాటలు సరస సంగీతం. నీ మాటలు నిత్యమూ నవనవోన్మేషం. శృంగార ఇంద్రధనుస్సుతో నీవీ వాతావరణాన్ని ఏలుతున్నావు - తేజోవలయంతో అని అననా? సరే, దానితోనే. నేనే గనక.. ధనవంతుడినై వుంటే, రావణుడు సీతను ఎత్తుకెళ్ళినట్లు నేను నిన్ను సముద్రం మధ్య గల ద్వీపానికి ఎత్తుకెళ్ళి వుండేవాడిని, అక్కడ నిన్ను సౌందర్య రాజ్యానికి పట్టపురాణిని చేసి వుండేవాడిని.

స్త్రీలు పుష్పిస్తున్న వృక్షాల వంటివారు. మేము అక్కడ చేరుకోడానికి ముందే కొన్ని వృక్షాలు పుష్పించాయి. గన్నేరు మొక్కలు నిశ్చలంగా వున్నాయి. అలాగే కమేలియా మౌనంగా వుంది. ఏవేవో స్థితుల్లో వున్నాయి. మనం చికాకుపడే ఛిర్ప్ కొన్ని బంగారు కాంతులతో పుష్పించి, పూలూ పుప్పొడులతో విలసిల్లుతున్నాయి.

నా లైంగిక దృష్టి కళ్ళు తెరిచేసరికి కొంతమంది స్త్రీలు సంపూర్ణంగా వికసించారు. మూడు తరాల స్త్రీల పుష్పాలు నా ముందు వెళ్ళిపోయాయి. నీవు నాలుగవ తరం దానవు. స్త్రీలు ఎందుకు పెళ్ళి చేసుకోవాలి. అంటే పరుల దృష్టిలో స్త్రీ తన సౌందర్యాన్ని, సౌకుమార్యాన్ని కోల్పోవచ్చు. కాని, హృదయమూ, మెదడూ గల భర్త దృష్టిలో మాత్రం భార్య సౌందర్యం ఎన్నటికీ తరగదు. ఒక యువకుడు ఒక యువతిని వివాహమాడినప్పుడు ఆమె

అందం కేవలం శారీరకమైనది. అయితే కాలచక్రం కదిలేకొద్దీ కలయికలు, దైనందిన జీవిత బంధాలు, బిడ్డలు, ఉమ్మడి ఆనందాలు. దుఃఖాలు, ప్రేమ అధికంగా లేకపోవచ్చు. కాని, ఆమె భర్త యెడల చూపే సహజమైన అపేక్ష – ఇవన్నీ తరిగిన స్థానాన్ని భర్తీ చేస్తాయి. కళ్ళల్లో తగ్గిన కాంతి స్థానాన్ని పూరిస్తాయి – యిత్యాది.

కానీ, కొంతమంది స్త్రీలకు సౌందర్య పోషణ గురించి తెలుసు. వారు తక్కిన వారికంటె తమ సౌందర్యాన్ని ఎక్కువ కాలం భద్రంగా కాపాడుకుంటారు. వీరు శ్రమ చేసేవారు. వీరు ఆనంద ప్రవృత్తి కలిగినవారు - తత్వజ్ఞులంటాను. కాబట్టి నువ్వు నీ అందాన్ని కాపాడుకోవాలనుకుంటే – అది నిజంగా కాపాడుకోతగిన సంపద – శ్రమించు, శ్రమించు. ఆరుబయట గాలిలో నడు, సైకిల్‌తొక్కు, గుఱ్ఱపు స్వారీ చెయ్యి, తత్వవేత్తగా జీవించు, ఈ ప్రపంచపు కష్టాలు నీ నుదుటిపై ముడతలు పడెయ్యకూడదు.

కథానాయకుడు – జన్మతః నీలో స్వేచ్ఛా సాంప్రదాయాలున్నాయి. నువ్వు వివాహం చేసుకుని, నిన్ను నువ్వు మరొకరికి ఎందుకు అమ్ముకోవాలి?

అయితే శారీరక సౌందర్యం కంటె నీ కళ్ళల్లో నీ జీవితంలో ఎక్కువ సౌందర్యం చూడగల పురుషుని నువ్వు వివాహ మాడాలి. అందం నశిస్తుంది.

అయితే,ఈ సమస్యకు మరో పార్శ్వం కూడా వున్నది. నేను అసహ్యించుకునే మనిషితో శాశ్వతంగా ఎలా కాపురం చేసేది ? ఈ సమస్యపై నేను సాధికారంగా ఏమీ చెప్పలేను. స్త్రీ ఏమనుకుంటూ ఉంటుందో నే నెలా చెప్పగలను? నా దేశంలో ఎక్కువమంది స్త్రీలు ఏమీ అనుకొనేటట్టు లేరు. అది తమ ఆచారం. తాము పుట్టిందే అందుకని వారు అనుకుంటారు. ఆడ పుట్టుక అధ్వాన్నం అన్న లోకోక్తి వున్న మాట వాస్తవం. అవును నిస్సందేహంగా పురుషుడు కురూపిగా తయారయ్యేసరికి స్త్రీ మరణిస్తుంది (?) ప్రేమ లేదు. కేక (?) వచ్చిన చిక్కేమిటి ?

ఉదాహరణకు మగవారికి కుష్ఠురోగం సంభవిస్తుంది. లేక అతడు శాశ్వత అశక్తుడుగా తయారవుతాడు. అప్పుడు కూడా అతని భార్య అతనిని ప్రేమిస్తే.. లేక అతడికి బిడ్డలు ఉండి, వారు అదంతా సహిస్తూ ఉంటే, ఉపాధి కోల్పోయిన భర్తకు కాని, భార్యకు కానీ ప్రభుత్వమే ప్రత్యేక వనరులు కల్పించాలి. పనికిమాలిన వారయితే అని నా ఉద్దేశం. ప్రస్తుతం ఉన్న బంధం మరీ బిగుసుకునిపోయి వుంది.....నిస్సందేహంగా.

(అసంపూర్ణం)

# కావ్యాలలో శృంగారం

కావ్యములలో శృంగార మెంతవరకు వర్ణనీయమను చర్చ తెనుగు పత్రికలలో జరుగుచున్నది ఒక్కొక్క పుస్తకమునుబట్టి దానిలో పదిపంక్తులుతీసి వాటిని పచ్చి శృంగారంగా యెంచి పుస్తకమును గ్రహించుటన్నది అల్పదృష్టి గత కాలములోను అన్యదేశములలోను కళలస్థితిని కానక చేయు సిద్ధాంతములుట్టి సిద్ధాంతములు కాని గట్టి సిద్ధాంతములు కానేరవు

పాశ్చాత్య కవులలో శృంగారము మెండా మనలో మెండా అను విషయమున పండితులు భిన్నాభిప్రాయులయి యున్నారు పాశ్చాత్యులు మన కావ్యములందు పచ్చి శృంగారము మెండని అనాలోచితముగా వ్రాయుట కలదుగాని వారింటిమంటికుంపటిని వారు చూచుకున్నచో వారు నోరెత్తరని నా నమ్మకము

గ్రీకుదేశమున శిల్పకారుల కళ దిశిమొల బొమ్మలతో నారంభమై యీనాటి ఫ్రెంచి యకాడమి బొమ్మలుగ పరిణమించినది ఒంటినత్తి యవయవముల బయటబెట్టు పుట్టముల గట్టి వేలకొలది పెద్దమనుష్యులమను మగవారియెదుట నాటలాడి వారి నానందమగ్నులను జేయు కౌశలము పాశ్చాత్యులదేకదా పదుగురియెదుట స్త్రీని ముద్దుపెట్టుకొనుట ఆలింగనము చేసికొనుట వారిలో సర్వసామాన్యమేకదా

మతగ్రంధములటుండగా బొకాషియో వ్రాసిన డికామిరన్ మొదలగు యూరోపు భాషలలోని పచ్చి శృంగార గ్రంధములమాట చెప్పనవసరము లేదు అందులో ఫ్రెంచికవుల మాట లోక ప్రసిద్ధమేకదా

ఇంగ్లీషు కవులలో వాల్మీకి యగు చాసరు కథలందలి పచ్చి శృంగారమునకు యీనాడు సమాధానము కల్పించుకోవలసివచ్చినది మార్లో అను కవికృతమగు హీరో అండ్ లియాండర్ అను కావ్యమును ఆవిడ్ అను రోమను కావ్యముల భాషాంతరీకరణమును షేక్స్పియరుని "రేప్ ఆఫ్ లుక్రీస్ వీనస్ అండ్ యడొనిస్ అను కావ్యములను మెర్రీవైవ్స్ ఆఫ్ విండర్సు హెన్రీ ది ఫోర్తు" అను నాటకములును మన ప్రబంధములకు తీసిపోవు

మన దేశమున వేదము మొదలుకొని సంస్కృతములో యీనాటివరకును రచితములయిన అనేక గ్రంధములలో పచ్చి శృంగారమున్నదే సంస్కృతకవుల త్రోవను బోయిన ప్రాచీన ఆంధ్రకవులమాట అటుంతము

ఈనాటి కవులలో మొనగాండ్ర కొందరినెంచి వారిసరణిని పరీక్షించినచో కూడినదెద్దియో కూడనదెద్దియో బయలుపడగలదు

అందు భాషాసంస్కర్తలలో మొనగాండ్రు శ్రీ రాయబహద్దర్ వీరేశలింగము పంతులుగారు వారిమార్గమును ముందు విచారించిచూచెదను గ్రామ్యభాషకు ప్రాణముబోసిన వారు వీరేశలింగము పంతులుగారు వారు తమ గ్రంధముల నన్నిటిని జేర్చి అనేక సంపుటములుగా నచ్చోత్తిరి తెనుగుభాషకు వారు మహోపకారము చేసిరనుటకు సందియము లేదు అట్టి సంపుటములలో నగ్రస్థానముపొంది ప్రథమసంపుటములో జేరినవి గ్రామ్యభాషలో వ్రాయబడిన కొన్ని ప్రహసనములు

వీరేశలింగము పంతులుగారు ఆంగ్లేయనాటక మహాప్రపంచములోనుండి తెనుగుచేసిన ప్రహసనములు చాలమట్టుకు విషయవినోద సాఫల్యములే చుంబనాలింగనములను గూర్చి మొదటి సంపుటము 10 15 34 41 పుటలను జూడుడు

లాక్షణికులలో బ్రహ్మశ్రీవేదము వెంకటరాయశాస్త్రులవారు అగ్రగణ్యులుకదా వారు రచించిన ఉషయను నాటకమున 13 25 27,28 37,38 68 69 పుటలీవిషయమున చూడతగ్గవి.

శ్రీ పంతులుగారు భాషాసంస్కరణకర్తలును సంఘసంస్కర్తలునునైనను రక్తబలముచేత మన ప్రాచీన కవుల శృంగారము వీరికి ఆమూలాగ్రముగా నబ్బినది అందుకు నిదర్శనము, ప్రథమసంపుటములో నగ్రాసనమునకు బూనిన అపూర్వ బ్రహ్మచర్యమను ప్రహసనమే

పచ్చిశృంగారము రెండు రీతులుగా నుండును రత్యాది వర్ణనమును స్త్రీల అవయవములను వర్ణించుటయునందొకటి నిజమయిన పచ్చిశృంగార మన్నది పరకీయ శృంగారము ఈ శృంగారమే అపూర్వ బ్రహ్మచర్య ప్రహసము" నందు వర్ణింపబడినది

ఈ నాటక కథానాయకుడు రమాకాంతము పంతులు ఇతనియోగ్యత భృత్యుడగు కరకటరెడ్డి యీ రీతిని వర్ణించుచున్నాడు

"రెండు సంవత్సరములనుండి నాభార్యను యజమానుని కంటపడకుండా కాపాడుకొని వచ్చినాను అతనికంట బడితే యిక నాకు భార్యఆశలేదు పెళ్లాలువున్న యీ వీధివారంతా ఆయన జీవానికి వుసూరుమని యేడుస్తూ వున్నారు ఆయన మునిసిపల్ కమీషనరు లోకల్‌ఫండ్ మెంబరు బెంచి మేజస్ట్రేటు డిస్ట్రిక్టుకోర్టు ప్లీడరవడంచేత యెప్పుడు యేమి చేసిపోతాడో అని అందరు జడుస్తూవుంటారు వాసుదేవరావు పంతులుగారి భార్య పుట్టింటికి వెళ్ళిపోవడంచేత ఆవిడనిమిత్తం మా పంతులుగారు యీవాళ స్టీమరుమీద కొవ్వూరు వెళ్ళుతారు"

ఈ నాటకమునందు కథ యేమనగా రమాకాంతం పంతులు భార్య పుట్టింటికి వెళ్ళియుండును పట్టుమని పదిరోజులు అయినను తన్నువదలి పుట్టింట నామె యుండదనియు వర్తమానమందగనే బండిచేసికొని దుడుంగునవచ్చి తనస్వేచ్ఛా ప్రవర్తనను భంగము కలుగ చేయుననియు, రమాకాంత పంతులుకు విచారము మెండు వాసుదేవరావు పంతులు పెండ్లాము పుట్టింటికి పోవుచుండ నామెను తగిలిపోవుటకు రమాకాంతము కొవ్వూరుకు ప్రయాణమయి వెడలును ఈ పంతులుగారి భృత్యుడు కరకటరెడ్డి అనునతడు రెండు

సంవత్సరములకుముందే రూపవతి యగు భార్యను పెండ్లాడియున్నను తన భార్యను యజమానుని కంటి యెదుట బెట్టవెరచి తన పెండ్లికథనే యజమానునికి జెప్పకుండెనుగాని ఆనాడు యజమానుడు పొరుగూరు పోయెనని యెంచి తన భార్యనుతెచ్చి యజమానునియింట ఆమెతో సుఖింపతలచును. అంతలో యజమానుడు పొరుగూరుకుపోక యింటికి మరలివచ్చి, భృత్యుని భార్యయగు మోహినినిజూచి అతని భార్యయని యెరుగక మగని యెదుటనే ఆమెతోడ సరసమాడ నారంభించును

అదిచూచి భర్త దిగులొందును ఇంతలోయజమానురాలగు శ్యామలాంబకూడా యింటికివచ్చును ఆమెరాగానే రమాకాంతంపంతులు మోహినిని వసారాలోనికి పంపివేయును యజమానురాలు కూడ ఒక మల్లి చెట్టును చూచుటకు, ఆ వసారాలోనికి పోవనుంకించును అట్టి చిక్కు సమయములో నేదైన ఒక పెద్ద బొంకుబొంకి తనమానము దక్కించుమని రమాకాంతము కరకటరెడ్డిని రహస్యముగ వేడును మోహిని తనభార్యయనియు పంతులుగారు యజమానురాలు నిమిత్తము మంచి దాసీని కుదర్చమనియు చెప్పియుండుటకు తానామెను అటకు తెచ్చితి ననియు కరకటరెడ్డి యజమానురాలితో చెప్పెను

శ్యామలాంబపోయి మోహినినిచూచి దానిరూపమునకును మాటలకును సంతసించి తిరిగివచ్చి మగనితో తన సంతోషము నీ రీతి చెప్పెను "వాళ్ల అనురాగమూ ఐకమత్యమూ చూస్తే నాకు ముచ్చటవుతూ వున్నది గాని రమాకాంతమునకు సంతోషములేదు మోహినిని తన వస్తువుగా నెంచి అతడేమనుకొనెను వాడు యెంతసేపటికీ కదలిరాకుండా వున్నాడు దొడ్లో దానితో యేమిచేస్తూ వున్నాడో భార్య భర్తతో యిలాగున అనెను

ఈ అద్దంలో వాళ్లు కనపడుతున్నారు మన రెడ్డి పెళ్ళామును యేలా ముద్దుపెట్టుకుంటూ వున్నాడో

"పట్టపగలు ఆడదాన్ని వాడలా చెయ్యడం నీకు యిష్టముగా వున్నదా?

"మొగుడు పెళ్లామును ముద్దుపెట్టుకుంటే అందులో తప్పేంవున్నది?

"తప్పిదంలేదుగాని నేను వక్కమాటు కరకటరెడ్డిని కూకలు వెయ్యవలెను నీ వవతలకుపో

ఆపైని యజమానునకును భృత్యునకును జరిగిన సంభాషణలోని రెండు ముక్కల నుదహరింతును

"మీ కోసమే ముద్దుపెట్టుకున్నాను అమ్మగారి మనస్సులో మీయందు వుండే అనుమానం పోగొట్టడానికి నే నా పనిచేసినాను

"ఆ ముద్దు నా కోసం కాకుండా నీ కోసమే పెట్టుకున్నావని నాకు యిప్పటికీ అనుమానము బాధిస్తూనేవున్నది

"అయ్యా మోహిని వక వేళవచ్చి మోహించి నన్ను యేమయినా చేస్తే అది నా తప్పేనా? ఆడవాళ్లువచ్చి యెదుట నిలవబడ్డప్పుడు మగవాళ్ళు మనసు పట్టలేరు"

తుదకు కరకటరెడ్డియు మోహినియు దంపతులని క్లర్కిమేను రుజువిచ్చును కథ కంచికి వెళ్ళినది మన మింటికి వచ్చితిమి కాని యీ గొప్ప కథవలన వ్యక్తమగు నీతి యెద్దియో? శ్రీ రాయిబహదర్‌గారు దెలుపవలసియున్నది దుష్టవర్తనునకు తగినశిక్ష జోడుకంచుకాగడాలువేసి వెతకినను గానరాదు ఇది పచ్చి బూతుశృంగారమునకు గొప్పనిదర్శనము

బ్రహ్మ వివాహమను ప్రహసనాంతమున, భానుమూర్తి అనునతడు పాపావధానులతో నిట్లుపలికెను. "యీ రోజంతా రంకు పురాణములతోనే కాలక్షేపము చేసినాము" యిట్టిరంకుపురాణములు బ్రహ్మశ్రీ వీరేశలింగము పంతులుగారు తాము కల్పించిన ప్రహసమునందు నిండియున్నవి.

దానినెత్తి వ్రాయుట తగదుకాని సత్యమరయగోరిన వారి కొరకు కొన్ని పట్లు సూచించెదము.

| పుట సంఖ్య | పంక్తులు |
|---|---|
| 310 | 15, 17, 23, 24, 25 |
| 312 | 26 |
| 313 | 14 |
| 318 | మూడవరంగము |
| 368 | 2, 6, 7, 11, 12 |
| 370 | 12, 13, 14, 15, 16 |
| 372 | 12, 13, 14, 15, 16, 27, 2౮ |
| 402 | 13, 15, 16, 25 |
| 415 | 21, 22 |
| 462 | 29, 30, 31 |
| 463 | 8, 9, 10 |
| 464 | 5 |
| 467 | 16 |
| 468 | 7 |
| 522 | 16, 17, 18 |

రెండవ సంపుటములో బ్రహ్మవివాహము నందలి సప్తమాంకము రెండవ రంగము. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము ప్రథమాశ్వాసమునందలి 33 వ పద్యమును, అభాగ్యోపాఖ్యానము నందలి 52 మొదలు 84 వ పద్యమువరకును ప్రాచీనుల వ్రాత అణగ ద్రొక్కబడినది. ఇక రసికజన మనోరంజనము చతుర్థాశ్వాసమున 114 వ పద్యమునుండి స్త్రీ పురుషుల సంపర్కము తెరమరుగు లేక వర్ణింపబడినది.

ఇట్టి గ్రంథ రచన లోకమునకు హానిచేయును. దీనిని నిలుపవలయునని మా మతము.

# కవిత్వము : వర్డ్సువర్తు

వర్డ్సువర్తు కవిత్వమునకును, అంతకుపూర్వము కవిత్వము వ్రాసిన యింగ్లీషుకవీశ్వరుల కవిత్వమునకును చాల భేదముకలదు. అతనికి ముందు పదునెనిమిదవ శతాబ్దమున నుండిన కవులు రెండు నిశ్చయములు చేసికొని యుండిరి. అవి యెవ్వియన్గిన (అ) కావ్యమున నుపయోగించుమాటలు నాజూకుగను లలితముగను నుండవలయుననియు (ఆ) కవిత్వమున వర్ణించ తగిన వస్తువులుకూడ సామాన్యమైనవికాక నాజూకుగాను, లలితముగాను, గొప్పవిగాను నుండవలయుననియు.

మనలోకూడ కావ్యములు లోకములో వాడుకలోలేని గ్రాంథికభాషలోనే వ్రాయవలయునని లక్షణములు వ్రాసిన కవులనిర్ణయము.

అటులగాక, సామాన్యమగు వస్తువులనుగూర్చి, వాడుకలో నుండుమాటలలో కవిత్వముచెప్పి కవితాసామర్థ్యమువలన వానికి సొంపుతెచ్చి చదువరుల మనసుల రంజింపచేయవచ్చునని వర్డ్సువర్తుని అభిప్రాయము. అట్లని నాజూకుమాటల నతడు ఉపయోగించక పోలేదు. నాజూకగు సంగతులగూర్చి కావ్యములు వ్రాయకపోలేదు. ఇతని కాలమునుండి ఇంగ్లీషు కవిత్వము తోవయే మారి మిక్కిలి గొప్పస్థితికి వచ్చినది.

మనదేశపు కవులు కావ్యములలో వర్ణించు పాత్రములు, దేవతలు, దేవతాస్త్రీలు, రాజులు, రాజకుమారికలు, పెద్దయింటి పురుషులు, స్త్రీలు, వీరిచర్యలు అవస్థలనే వర్ణింతురు. అందులో కథానాయకులకు లోకములో కానరాని గుణసంపత్తి, పరాక్రమాదులు, సౌందర్యమును ఆరోపింతురు. తక్కువజాతి వారిని గూర్చి వర్ణించి వ్రాయరు. కవిత్వమున వ్రాయతగిన చర్యలు అట్టితక్కువ మనుష్యుల బ్రతుకులలో నుండనేరవని మనదేశపుకవుల అభిప్రాయము. వర్డ్సువర్తుకు పూర్వపుకవుల అభిప్రాయముగూడ కొంతవర కట్టిదియే.

ఆధునిక కవులు అటుగాక మనుష్యుల సుఖదుఃఖములు అన్నియును వొక్కలాటివేయనియు, మనిషి అయివుండుటలో వకనితక్కువ, వకని హెచ్చులేదనియు, సుగుణములు సత్ప్రవర్తన గొప్పఅవస్థలో నుండువారికిని తక్కువ అవస్థలో నుండువారికి సామాన్యములనియు, కావ్యములను రసమయం చేయుటకురాజుల రెడ్ల బ్రాహ్మణుల

చర్యలవర్ణన యెటుల తగియున్నదో రయితుల తక్కువజాతులవారి చర్యలుకూడ నటులనే తగియున్న వనియు నభిప్రాయపడి, ఇంపయిన కావ్యములు తక్కువస్థితిలో నుండు మనుజుల సుఖదుఃఖములగూర్చి వ్రాసిరి. వర్డ్సువర్తు అందుచేతనే ఒక గొల్లవాడి బ్రతుకునుగూర్చి కావ్యము వ్రాసెను.

మన పండితు లీ కావ్యమును జూచినచో ఇదియా కావ్యము ; ఒక గొల్లవాడు కొండలంటదిరిగెనట. వాని కుమారుడు చెడుతిరుగులు తిరిగి దేశాంతరగతుడాయెనట. తండ్రి మందకు పాకకట్టి నారంభించి దుఃఖముచే గాంచలేకపోయెనట. ఇదియా కావ్యమునకు తగిన కథ ? అని నవ్వుదురు !

పుట్టుకవల్ల గొప్ప రానేరదు. గుణయోగ్యతలవలననే గొప్ప వచ్చును. పెద్ద యవస్థలోనుండు దుర్జనునికన్న తక్కువ స్థితిలోనుండు సజ్జనుడు నిజమైన గొప్పవాడు కాడా ?

టెన్నిసన్ అనెను :

Kind hearts are better
Than coronets and served
Faith than Norman blood

పెద్ద ప్రభువులై యుండుటకంటె దయగలహృదయము కలిగియుండుటే శ్రేష్టము. రాజరక్తముకన్న నమ్మిన నీతియే శ్రేష్టము. బర్న్సు అనెను :

"Rank is but the guenea stamp
The man is the gold for al'l this"

లోకములో యెక్కువ అవస్థ అనునది తెచ్చిపెట్టు కున్నది. నాణెముపై ముద్దరవంటిది. మనిషే బంగారము. అనగా గుణయోగ్యతలనుపట్టి మనిషికి విలువ కలుగును. గాని ఉద్యోగములవలన ధనధాన్యములవలన పెద్దింట పుట్టుటవల్ల కలుగనేరదు.

మైకేల్ అను గొల్లపిల్లవాడు అట్టి బంగారము. గుణ సంపదచే ఎన్నికైన మనుష్యుడు.

పెద్ద పెద్ద పరుగులు పెట్టకూడదు. ఇవన్నీ మనం గ్రహిస్తే అప్పుడు మనదేశంలో ఉన్నతవిద్యను బోధించే బాధ్యతను స్వీకరిద్దాం. విద్యను చెప్పేటపుడు సిద్ధాంత ఆచరణల్లో ఆధునిక పద్ధతులువున్నాయి. నాగరిక దేశల్లోని జాతీయ విద్యాసంస్థలు అవలంభిస్తున్న మార్గాలూ సూత్రాలూ నిజంగా గొప్పవి. ఈ విద్యారహస్యాల నన్నిటినీ మనం గ్రహించి ఆధునిక పద్ధతుల్ని మన విశ్వవిద్యాలయంలో ప్రవేశ పెడదామంటే తొడతొక్కిడిగా ఛాందస పండితులువచ్చి అడ్డుతగుల్తారు కదా ! ఎవరో కొందరు తెలివైనవాళ్ళుతప్ప మిగిలిన వాళ్ళందరూ దీనికి అభ్యంతరవేం ! ఇదిమాత్రం నాకెంతో బాధగావుంది".

ఇక్కడా బెంగాలులోనూ సంస్కృత భాషలు ఆకర్షించక పోవడానికి అసంబద్ధమైన బోధనా పద్ధతులను అవలబించడమే ప్రధాన కారణం. కావ్యభాషల్ని మాతృభాషల్ని చెప్పడానికి అధ్యాపకులకు "తగినంత రీసెర్చిజ్ఞానమూ విమర్శనాజ్ఞానమూ ఆధునిక యూరోపియను పద్ధతులలో వుండాలనీ" మద్రాసులో యీమధ్య పదేపదే చెప్పబడుతోంది. కాని తీరాచూస్తే యివన్నీ వట్టిమాటలుగానే మిగిలిపోతున్నాయి. కాని ఆచరణలో ఎట్టికృషీ కనిపించదు. ఉత్తరసర్కారు జిల్లాలలో ప్రత్యక్ష బోధనా పద్ధతుల్ని అవలంబించడంతో యేట్సుదొర విద్యావిధానంలో ఆధునికతను ప్రవేశపెట్టే ప్రయత్నాలు చేశాడు. పర్లాకిమిడిలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు యేట్సు ప్రభావప్రోద్బలాల వలన చెప్పుకోతగ్గ సత్ఫలితాలను యిందులో సాధించారు. అయితే ఉపాధ్యాయులకు తగిన శిక్షణయివ్వందే ఆధునిక పద్ధతుల్లో అభివృద్ధినీ అభ్యుదయాన్నీ సాధించడం దుస్సాధ్యం. యింతకంటె ప్రధానమైన విద్యాసమస్య మరొకటిలేదు. కలకత్తా ప్రెసిడెన్సీకాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ హెచ్.ఆర్ జేమ్సు "1797 - 1910 మధ్య భారతదేశంలో విద్యారాజకీయజ్ఞత" అనే తన గ్రంథంలో యిలా రాశారు : "మరుగున పడిపోయివున్న ప్రాథమిక విద్యను ఉద్ధరించడానికి యోగ్యత కలిగిన మంచి ఉపాధ్యాయులు అవసరం. ఏదైనా మంచి సాధించాలంటే, నమ్రత కలిగిన విద్యా సేవలకులు ఎంతో మంది ఉత్తేజంతో, కృషి చేయవలసి వుంటుంది. నమ్రత, శిక్షణ కలిగివున్న, అధ్యాపకులు చాలమంది 'నా బొందో' అని సేవచేస్తే గొప్ప ఫలితాలు చేకూరుతాయి. విద్యా వేత్తలు వీరికి శిక్షణ యిచ్చి నిర్మాతలుగా తయారు చేయాలి" 1897 లో ప్యాసుకాబడిన తీర్మానం. "ఉపాధ్యాలకు శిక్షణ" యీవలసిన ఆవశ్యకత యెంతో వున్నదని నొక్కినొక్కి చెప్పింది. "ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చే స్కూళ్ళకు కాలేజీలకు ఎంత డబ్బు యిచ్చినా దండుగ లేదు. తరిఫీదులేని యోగ్యతలేని ఉపాధ్యాయులు నడిపే గ్రాంటు స్కూళ్లకు డబ్బు పెట్టడమంటే కేవలం ఆ సొమ్మును వృధాచేయడమనే అర్థం. సరియైన ఉత్తేజంతో ఆదర్శంతో ట్రెయినింగు కాలేజీలు కృషి సల్పితే ప్రతి సంవత్సరం మంచి మంచి ఉపాధ్యాయులను హైస్కూళ్ళకు పంపించగలుగుతాయి. ఉన్నత ఆదర్శాలంటే ఉత్సాహం, పట్టుదల మొత్తం సెకండరీ విద్యావిధానాన్ని విప్లవాత్మకం చేయగల నూతన బోధనా పద్ధతులపట్ల శ్రద్ధావున్న ఉపాధ్యాయులను ఈట్రెయినింగు కళాశాలలు హైస్కూళ్లకు పంపించగలిగితే ఎన్నో సత్ఫలితాలు కలుగుతాయి. యిదివరకు యింగ్లీషును పాఠశాలలలో చెప్పే పద్ధతులు బహుచెడ్డవి."

ఇంగ్లీషుభాషనుగురించిన ఆఖరి వాక్యమే యదార్థమైనట్లయితే అది సంస్కృత మాతృభాషల పట్ల మరీనిజం. ఈ రాష్ట్రంలో వీటిని బోధించే విధానమున్నదే అది ఎంతటి దోషభూయిష్టమైందో మాటలతో వర్ణించి చెప్పలేం. వీటిని చెప్పే పండితులు మృతజీవద్భాషల్ని రెండింటిని వొకేలాగున చెపతారు. వ్యవహారంలో వున్న అర్థాలకు మారుఅర్థాలీయబడిన అనేక పర్యాయపదాలుగల నిఘంటువులు, ప్రామాణికంకాని వ్యాకరణాలూ వల్లెవేసి వాటిసహాయంతో భాషల్ని బోధిస్తూ వుంటారు. యీరొడ్డకొట్టుడు చదువులు విద్యార్థులకు విసుగునీ విముఖతనూ కలిగిస్తున్నాయంటే ఆశ్చర్యం దేనికి !

ప్రభుత్వమిచ్చిన గ్రాంటును యూనివర్సిటీ చక్కగా వినియోగించదలుచుకుంటే సంస్కృతం చెప్పడానకు విశ్వవిద్యాలయంలో వొక జర్మనుపండితుణ్ణి ప్రొఫెసరుగా నియమించడం మంచిది. మృతజీవద్భాషలను ఆధునిక పద్ధతులలో బోధించగల సామర్థ్యం వున్న పండితుణ్ణి మాత్రమే విద్యాలయంలో ప్రొఫెసరుగా వేయాలి. ప్రొఫెసరుగా యెవర్ని వేసినా అతనికిమాత్రం నిర్దుష్టమైన పాండిత్యం వుండాలి. అతను విద్యావేత్తగా మన్ననలు పొందినవాడై వుండాలి. యింతటిపేరు ప్రఖ్యాతలున్న పండితుడు మనకు దొరకాలంటే అతనికిచ్చే జీతం హెచ్చుగా వుండకతప్పదు. డబ్బును పొదుపుగా వాడుకోవాలని చెప్పడం యీ విషయంలో వొక నేరమే. హైస్కూళ్ళలో ఆధునికపద్ధతుల ననుసరించి భాషల్ని బోధించడానకు ఎలిమెంటరీస్కూళ్ళల్లో పండితులకు ఉపాధ్యాయులకు శిక్షణయిచ్చేందుకు పట్టభద్రులను నియమించవచ్చును. పట్టభద్రులను శిక్షణయిచ్చేందుకు గవర్నమెంటు ట్రెయినింగు కాలేజీలలో పైనచెప్పిన యోగ్యతలుకల ప్రొఫెసరును నియమించవచ్చును.

మహారాష్ట్ర బెంగాలులలో ఉన్నతమైన పాశ్చాత్య సంస్కృతిని అలవరుచుకున్న పండితులువున్నారు. ఎంతో పట్టుదలతో ఆసక్తితో తాము మాతృభాషలలో కృషిచేయగలమని వారు పూనికవహించారు. గత అర్ధశతాబ్ది కాలంలో బెంగాలు భాష సాధించిన అభ్యుదయం అద్భుతమైనది. దక్షిణ దేశంలోని మాతృభాషలు సాధారణంగా సంస్కృతిలేని మిడిమిడి జ్ఞానంగల మహామహుల చేతుల్లోపడ్డాయి. సారస్వతకళలేని కొరత స్పష్టంగా కనిపిస్తూనేవుంది. మాతృభాషలు విఫలమెందుకయినవో అని విచారణచేసే వారిదృష్టినుంచి కారణాలన్నీ తప్పించుకు పోయాయి. వారిదృష్టికి మూల హేతువులు కనిపించనేలేదు. అయినప్పటికీ దీనిక్కారణం అన్వేషించడానకు మనం ఆట్టేదూరం పోనక్కర్లేదు. దుస్సాధ్యమైన కృతక భాషను విద్యావిధానంలో ప్రవేశపెట్టడమే యీ అనర్ధానికి కారణం ; ప్రాచీన గ్రాంధికాన్ని కావ్యభాషగా స్వీకరించడమే యిందుకు హేతువు.

1912 అక్టోబరు నెలలో వెలువడిన “ఏషియాటిక్ క్వార్టర్లీలో” వొక రచయిత యీజిప్టులో అరబిక్ భాషల స్థితినిగురించి బహుచక్కని వ్యాసం రాశాడు. ఆయన చెప్పిన మాటలు దక్షిణ భారతదేశ మాతృభాషలకు సాధారణంగా వర్తింపజేసుకోవచ్చును. విశేషించి తెలుగుభాషకు ఆయన వాక్యాలను అన్వయింప జేసుకోవచ్చును : “జనులు మాట్లాడే భాష వొకటీ, కావ్యాలలో ఉపయుక్తమౌతున్న దింకొకటీ. రెండూ రెండు వేర్వేరు భాషలుగలదేశం వొకయీజిప్టు మాత్రమే కాదు. భాషలను యిలాగ వుపయోగించడమనేది తదితర దేశాలలోకూడా కనిపిస్తున్నది. ఈ విధంగా యెందుకు జరుగుతున్నదో తెలుసుకోవాలనే కుతూహలం మనకు జనించడం సహజమే. వాడుకభాష వొకరీతిగను కావ్యభాష మరో రీతిగను వుండడమనే ద్వంద్వ స్వభావం వొక చెడుగుకు కారణమయింది. ప్రతిభ సన్నగిల్లింది. బుద్ధి వికసించక కుంటుపడి సాహిత్యం మందగించింది, ప్రాచ్యదేశాలలో చాలావాటికి, పాశ్చాత్య దేశాలలో కొన్నిటికి యిదే స్థితి. ఈ దేశాలలో మాతృభాషలవిద్య యెందుకూ పనికిరాకుండా పోతున్నదని గాభరాపడ్డ పెద్దలకు ముమ్ముందు వొక విషయం తెలిసివస్తుంది. తమ దేశంలో వాడుకభాష కానిదానిని, కావ్యభాషగా అంగీకరించడంవల్ల ఆకృతక భాషా సంప్రదాయం అభివృద్ధికి ఆటంకం కలగజేస్తున్నదని త్వరలోనే వీరు గ్రహించక తప్పదు.”

నేడు వున్న తెలుగు వ్యాకరణం అచ్చంగా 11వ శతాబ్దంలో రాయబడ్డ కావ్యభాషకు చెందినది. వ్యవహారంలో భ్రష్టమయిన శబ్దాలతో ప్రాచీన రూపాలతో వ్యాకరణం నిండివుంది. సంస్కృత శబ్దాలనుంచి తత్సమతద్భవాలను చేయడమెలాగునో, సమాసం కట్టడమెలాగునో యీ వ్యాకరణం సూత్రీకరిస్తుంది. దీనికీ ప్రస్తుతభాషకూ సంబంధమేమీ కనిపించదు. గత శతాబ్దపు చివరి అర్ధకాలంలో కావ్యభాషలో ఆధునిక వచనరచనను సృష్టించడానికి పాశ్చాత్య

సంస్కృతితో చాలీచాలనితగుమాత్రం సంబంధం కలిగిన కొందరుపెద్దలు ప్రయత్నాలు చేశారు. తమ ప్రయోజనసిద్ధికోసం వ్యాకరణసూత్రాలను వుల్లంఘించారు. యిప్పుడు వ్రాస్తున్న తెలుగువచనం చాలా భాగం బూతులబుంగ. కృతకమైన తప్పులతడకలతో నిండిన దోషభూయిష్టమైన పడికట్టురాళ్లవంటి యీ తెలుగు భాషనే ప్రాథమిక ఉన్నత పాఠశాలలోని పిల్లలకు నూరిపోస్తున్నారు. వాడుకభాష కొక నిఘంటువనేదిలేదు. పోనీ, మృతజీవద్భాషల వ్యవస్థలను తెలిపే శాస్త్రీయపద్ధతులలో తయారు చేసిన వ్యాకరణం అంతకుముందేలేదు. భాషంటేనూ, వ్యాకరణ మంటేనూ పండితులనబడే వారికి అసలు సిసలు అభిప్రాయలు లేవు. చాలామందికి వాటినిగురించి వున్న జ్ఞానం ఆశాస్త్రీయమైనదీ ; ఆధారాల్లేనిదీ.

తెలుగు భాషాధ్యయనంలో అభివృద్ధి సుతాలాం కనిపించదు. అలాంటప్పుడు తెలుగుభాష కొక ప్రొఫెసరును వేసి డబ్బు దండుగపెట్టడం అనవసరం. వొక ప్రొఫెసరు యూనివర్సిటీలో కూచుని పనిచేయతగ్గంత విషయసంపత్తి తెలుగులో యింకా జతచేయబడి వుండలేదు,

తెలుగుభాషను శాస్త్రీయ పద్ధతులమీద పరిశీలించానని యిప్పుడు చెప్పుకోగల పండితుడు భారతీయుడుకానీ, లేదా యూరోపియను కానీ మనదేశంలో కనిపించదు. వొకే వొక శ్రీ గిడుగు రామమూర్తిపంతులు తప్ప యీ విషయంలో నిర్దుష్టమైన ప్రామాణిక శాస్త్రపద్ధతులలో కృషి చేసిన పండితుడంటూ యింకొకడు లేడు. ప్రొఫెసరు పదవిని పొందడానికి తెలుగుభాషా సాహిత్యాలపై పరిశీలనచేసి చక్కని గ్రంథాలను వ్రాసి అర్హత సంపాదించుకున్న భారతీయుడు కానీ, లేదా యూరోపియనుగానీ యింతవరకు ఎవరూ లేరు. పదవిని పొందిన తరువాత మెల్లమెల్లగా ప్రొఫెసరుగిరీకి కావాలసిన నేర్పూ చాకచక్యంవూ అతనే సంపాదించుకుంటాడని అనడం కేవలమసంగతం.

గత సంవత్సరం విజయనగరంలో జరిగిన సమావేశ వివరాలను తెలిపే పత్రాన్ని యిందుతో జతపరచి వుంచుతున్నాను. తెలుగును ఏయేపద్ధతులలో బోధించాలనే విషయం చర్చకువచ్చి ఆ సమావేశం వొక తీర్మానాన్ని చేసింది. అనేక శతాబ్దాలనుంచీ వివిధదశలలో ప్రజలు మాట్లాడుకుంటూ వుండే తెలుగు ఏలావుండేదో తెలిపేసరియైన దాఖలాపత్రాలు కనిపించడంలేదు. కనుక శాస్త్రీయపద్ధతులలో అధ్యయన మనేది జీవద్భాషలతోనే ప్రారంభించవలసి వుంది. కావ్యభాషనుగురించి ఎవరైనా నాలుగు విషయాలు తెలుసుకుందుకు పూనుకుంటాడనుకుందాం. అప్పుడతనికి అడుగడుగునా, కాలుజారిప్రమాదాల్లోకి తీసుకుపోతూనే వుంటుంది. గట్టితనమేమీలేని జారుడునేల మీద తాను కాలుమోపితినని అతను భయపడవలసివస్తుంది. పద్యరచనలో లాఘవంలేనందువల్ల దీర్ఘసమాస రచనవల్ల పాదపూరణార్థమై శబ్దాలుమారిపోవడంవల్ల కావ్యభాషలో యేది కృతకమో యేదికాదో తెలియని దిక్కుమాలిన అవస్థయెదుర్కొంటున్నది. ఈ కావ్యభాషలో యెంతమటుకు జీవద్భాష వున్నదో దానిని యేయేజిల్లాలలో యేయేకాలాలలో జనులు వాడుతూవుండేవారో, పోల్చుకోవడం కష్టమైనపని. కావ్యభాషలో ప్రయుక్తంకాని కొన్ని ధ్వని యుచ్చారణలు వాడుకభాషలో కనిపిస్తున్నవి. భాషలో కలిగిన యీస్థితికి ధ్వనియుచ్చారణ వలన కలిగినమార్పు యెంతమటుకు కారణమో, నిర్ధారించడం కష్టం. అదేవిధంగా తెలుగుభాషలోని ధ్వనులను యథాతథంగా రూపకల్పన చేయుటకు, ప్రాకృత అక్షరసమామ్నాయానికి యేయేచోట్ల తగినంత సామర్థ్యం లేదో తేల్చిచెప్పడంకూడా తేలికైనపనికాదు. జనులు మాట్లాడుకునే మాండలిక భాషలను వొకదానితో వొకటి సరిపోల్చి జాగ్రత్తగా తారతమ్య పరిశీలనచేసిన తర్వాత కాని ప్రాచీన కావ్యభాషను సమగ్రంగా తెలుసుకోవడం సాధ్యపడదు.

గ్రాంటులో కొంతభాగం తెలుగురీసెర్చికి పండితులకు శిక్షణ యిచ్చేందుకుపయోగించవలసివుంది. తెలుగు భాషను శాస్త్రీయపద్ధతులలో పరిశీలించి తగినవిషయసంపత్తిని సేకరించేందుకుగాను, వీరుకృషి చేయగలరు. వ్యాకరణాలు, భాషా నింఘంటువులు ప్రాచీనకవులనుగురించిన సమాచారం శాసన పరిశోధనలు యెన్నోజరగవలసిన ఆవశ్యకతవుంది. శిష్టవ్యావహారిక భాషానిఘంటును తయారుచేసినట్లయితే అది భారతీయులకీ విదేశస్థులకీకూడా ఉపయోగపడుతుంది. మాతృభాషలను గట్టి పునాదులమీద విద్యాలయాలలో బోధింప దలుచుకుంటే ప్రభుత్వం జాప్యమేమీ చేయకుండా వెంటనే ద్రావిడభాషల పరిశీలనకు పూనుకోవలసి వుంటుంది.

ఈ పని మానుకుని వ్యక్తుల స్వంతలైబ్రరీలలో వున్న వ్రాతపత్రులను సేకరించి లాభంలేదు. వ్యాఖ్యానసహితంగా ప్రాచీన కావ్యాలను అచ్చువేసే కార్యం ప్రైవేటు కంపెనీలకు వొదిలిపెట్టడం మంచిది. స్వతంత్రమైన తెలుగుకావ్యరచన యితర భాషలలో సరిపోల్చి చూసినట్లయితే మొన్నమొన్నటిదే అనిపిస్తుంది. కృతకంగానూ కవిసమయాలతోనూ నిండి వుండడంచేత యీ కావ్యాలు అంత అభిరుచిని కలిగించడం లేదు. స్వతంత్రప్రాచీన తెలుగుకావ్యాలలో మనకు ఆసక్తిని పుట్టించేవి గ్రంధావతారికలలో వర్ణించిన కవివంశావళుల కవిపోషకుల చరిత్ర. కానీ యివికూడా పైపై మెరుగులేకాని నిజమైన చారిత్రకజ్ఞానాన్నీయవు.

తెలుగులో రీసెర్చి చేయడానికి విశ్వవిద్యాలయంలో రెండు ఫెల్లోషిప్పులు, మూడుస్కాలరు షిప్పులు వుండాలని నా ప్రతిపాదన. అవి ఎన్ని సంవత్సరాల కాలంవుండాలో వాటికి నెలకు యెంత ధనాన్ని వినయోగించాలో సిండికేటు నిర్ణయించుకోవచ్చును. వీటిని పొందుతున్న పండితులు ఆధునిక పాశ్చాత్య పద్ధతులలో శిక్షణ పొందవలసి వుంటుంది. తెలుగు భాషను మాత్రమేకాక అధమపక్షం ద్రవిడభాషలలో ప్రధానమైన వొకభాషనైనా వీరు చక్కగా పఠించాలి. ఇదే విధంగా తమిళ, మళయాళ భాషలలో పండితులను నియమించడంమంచిది. మళయాళీ కన్నడుల జనాభా మనరాష్ట్రంలో తక్కువ. యీభాషల అభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధతో తిరువాంకూరు కొచ్చినులు పాటుపడుతున్నవి. మంగళూరులోవున్న బేసిక్ మిషను పండితుల సహాయాన్నీ సేవను కన్నడభాష పొందుతున్నదంటే అది నిజంగా కన్నడుల అదృష్టం.

ఇండియా ప్రభుత్వ మిచ్చిన గ్రాంటు విశ్వవిద్యాలయ ప్రత్యేకావసరాలకే ఉద్దేశింపబడిందని నా ఊహ. మాతృభాషలను శాస్త్రీయపద్ధతులమీద ఉద్ధరించడమనేది అత్యవసరమైన కార్యం. విద్యా స్వరూప స్వభావాలకు యివి ప్రాతిపదికలను చేకూర్చగలవు. వీటినిబట్టే సాహిత్య సృష్టిలో గుణం నిర్ధారింపబడుతుంది; వీటి ప్రోత్సాహంమీదనే సాహిత్యరచన బహుళంగా జరగడమో, లేక జరగకపోవడమో సంభవిస్తుంది. ప్రజలందరినీ విద్యావంతులను చేయడమనేది మాతృభాషల అభివృద్ధిమీదనూ, వ్యుత్పన్నమౌతున్న సారస్వతం మీదనూ ఆధారపడి వుంటున్నది. మాతృభాషలను బోధించే వారి రూపొందించేవారి భుజస్కంధాలపై నేడు మహత్తరమైన బాధ్యత వుంది. ఈ సత్యాన్ని వారు గ్రహిస్తారనినే నాశిస్తున్నాను.

ఇప్పుడు అమలులోవున్న దోషాలను రూపుమాపాలంటే అతుకులబొంతలను వాటిపై కప్పి ప్రయోజనంలేదు. ఆధునిక పద్ధతులలో మాతృభాషలను బోధించడానికి ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చే ప్రణాళికలను జాగ్రత్తగా రచించి తీరాలి. వాటిని విస్తృతంగా ధారాళంగా ఆచరణలో సాధించాలి. ఏ పని చేయదలచుకున్నా దానిని సమగ్రంగా పరిపూర్ణంగా చేయవలసివుంటుంది. వొకదానికొకటి పరస్పర విరుద్ధమైన ప్రణాళికలను ఊహించివున్న ఆ కాస్త సొమ్మును ఎందుకూ పనికిరాకుండా వెచ్చించరాదు. అలా అయితే ఏ ప్రణాళికా నెరవేరదు. వేసిన అన్ని ప్రణాళికలూ ధ్వంసమౌతాయి.

భారతదేశ ఆర్థికశాస్త్రాన్ని విషయాలను పఠించవలసిన ఆవశ్యకత యెంతో కలదని నేను పూర్తిగా గుర్తిస్తున్నాను. అది చాలా ప్రధానమైనదని నా నమ్మకం. ఇది వొకేవొక రాష్ట్రానికి సంబంధించినదికాదు. ఇంతవరకూ జిల్లా సంఘాలు స్థానిక ఆర్థిక విషయాలపై పెద్ద పెద్ద ప్రసంగాలు చేయదపు ఉత్సాహంతో అదైనా యేదాది కొక్కసారి సమావేశాలు యేర్పాటు చేస్తున్నవి. ప్రజలు ఆర్థిక విషయాల పఠనమునకు గల ఆవశ్యకతను ప్రాధాన్యతను గ్రహించి మేలుకొంటారని ఆశిద్దాం. మద్రాసు ఆర్థిక సంఘం యేర్పడడం యెంతో శుభసూచన. ఈ సంఘానికే ప్రస్తుతం ఆర్థిక శాస్త్రాధ్యయనమనే కార్యభారం వొప్పగించవచ్చునేమో ?

సంస్కృత పాళీ ద్రావిడ భాషలలో ఆధునిక విద్యాబోధనా పద్ధతులను ప్రవేశపెట్టే ప్రణాళికకు ఇండియా గవర్నమెంటు ప్రోత్సాహమిచ్చే సూచనలు కానవస్తున్నవి. శిక్షణా పాఠాశాలలను నెలకొల్పడానికి హెచ్చుగ్రాంటు కావలెనని విశ్వవిద్యాలయం రాష్ట్ర ప్రభుత్వంద్వారా ప్రభుత్వాన్ని అడగవలసివుంది.

మాతృభాషల్లో ఉపాధ్యాయులను తరిఫీదు చేయడమనేది విశ్వవిద్యాలయాల విద్యుక్తధర్మం. ఎలిమెంటరీ, సెకండరీ తరగతుల ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చేందుకు ఆక్సుఫర్డు యూనివర్సిటీకి చక్కని సంస్థ వొకటి కలదని నేను వేరే మీకు చెప్పనక్కరలేదనుకుంటాను.

# ఆధునిక ఆంధ్ర వచన రచన

శ్రీకట్టమంచి రామలింగారెడ్డి వాదనల ధోరణినీ సారాంశాన్నీ నేను సమంగా బోధపరచుకున్నట్లయితే అవియివీ ఈ ప్రతిపాదనల్ని చేయడంలో ఆయనడద్దేశం తెలుగు ఉపయుక్తమైన జీవద్భాషగా సరియైన దారిలో పెంపొందున ని మాతృభాషలకు భౌతిక ప్రకృతిశాస్త్ర గ్రంధాలయ పరనమునకూ వొకవిధమైన సంబంధము కుదిరినపుడు యీ లక్ష్యం నెరవేరగలదు ఇటువంటి సంబంధాన్ని కలగచేయడముకు ఆధునిక అభిరుచులుగల విషయాలపై రాశిన వచన గ్రంధాలను హెచ్చుగా పాఠ్యభాగాలుగా నిర్ణయించాలి ఇది ఒక సాధనమనిన్నీ యిలా చేసినట్లయిన గ్రంధకర్తలను ప్రోత్సహించినట్టవుతుందనిన్నీ ఆయన అభిప్రాయం

ఇందుకుగాను ఇంటర్మీడియటు పరీక్షలకీదిగువ విధంగా పుస్తకాలుండాలని శ్రీ రెడ్డిగారు ప్రతిపాదిస్తున్నారు (అ) ఆధునిక విషయాలపై ఆసక్తిని కలిగించే వచన గ్రంధాలు మొత్తము పాఠ్యభాగంలో సగానికి సగం వుండవలె (ఆ) పుస్తకాలలో కొన్ని భాగాలనుగాక పూర్తిగ్రంధాలనే నిర్ణయించాలి ఆరువందలపేజీల వచనం విద్యారుత్థులు చదవడానికి భారమైనట్టిదని అనుకోరాదు (ఇ) వొక సంవత్సరానకు వేసిన టెక్స్టు బుక్కులు తిరిగి వేయగూడదు

బి ఏ పరీక్షకులకు వెళ్ళే విద్యార్థులమీద ఉదహరించిన వచనగ్రంధములవంటివి మూడింటినైనా చదువుకోరాదు ఇంటర్మీడియటు నందువలెనే ఆరువందలపేజీల వచనమునుపాఠ్యభాగముగా నిర్ణయిస్తూ ఒకసారివేసిన పుస్తకమును మళ్ళీ టెక్స్టు బుక్కుగా నియమించరాదు

ఇవీ శ్రీ రామలింగారెడ్డిగారు చేసిన ప్రతిపాదనలు ఆధునిక అభిరుచులపై ఆసక్తికలిగించే వచనగ్రంధాలను పాఠ్యభాగాలుగా వేయాలని ఆయన అంటున్నారంటే పోనీ అవి తెలుగులో నవలలనబడే పుస్తకాలైనా కావు సైన్సు పుస్తకాలను పాఠ్యగ్రంధాలుగా విద్యార్థులకు నియమించాలని ఆయన సూచన విద్యార్థుల భాషాభివృద్ధికి మనం కోర్సులను పెట్టేటపుడు ఆ పుస్తకాలు మంచి సాహిత్యం కలిగినవైనా వుండాలి లేదా భాషాచరిత్ర సాహిత్యచరిత్రలపై విద్యార్థులకు కొంత విషయజ్ఞానం బోధించేవిగానైనా వుండాలి టెక్స్టుబుక్కులకు యీ నియమాలు

వుండాలనే విషయం శ్రీ రామలింగారెడ్డిగారు విస్మరించినట్లు ఎవరికైనా బోధపడక మానదు. కాని శ్రీ రెడ్డిగారు మాత్రం తన జాబితాలోవున్న గ్రంథాలు ఉదాత్తమైన సాహిత్యలక్షణాలు కలిగినవని అంటున్నారు. అందులో కొన్ని పుస్తకాలు ఆయన మాటల ప్రకారం "స్వకీయ ప్రతిభకు ఉపజ్ఞకు పరిశోధనకు మహత్తరమైన దృష్టాంతాలు ; దుష్టమైన పాండిత్య ప్రకర్షనుచాటే భాష వీటిల్లో మృగ్యం. మధురమైన సరళరీతిని సొగసైన శైలిలో యీ గ్రంథాలు రచింపబడ్డాయి."

తమ జాబితాలోవున్న గ్రంథాలకు శ్రీ రామలింగారెడ్డిగారు చెబుతున్న యీలక్షణాలేవుంటే, ఆయన సూచించిన రీతిలో కొంత ప్రయత్నంచేయ తగును. వెంటనే ఆ మార్గాలను ఆచరింపకతప్పదు. కాని ఆ పుస్తకాలను పఠించినతరువాత నాకు కలిగిన అభిప్రాయాలు శ్రీ రెడ్డిగారి ఊహలకు భిన్నములు. ఇలా చెప్పవలసి వస్తున్నందుకు విచారంగానేవున్నది. కొంత వివరణలతో యీ గ్రంథాలను సమాలోచిస్తాను.

శ్రీ రెడ్డిగారి జాబితాలోని పుస్తకములను మూడు విధాలుగా విభాగింపవచ్చును. (అ) సైన్సు టెక్స్టుబుక్కులు లేదా ఏదోవిధాన సైన్సుకు సంబంధించిన గ్రంథాలు (ఆ) చారిత్రక (ఇ) కల్పనా గ్రంథాలు.

సైన్సుకు సంబంధించిన గ్రంథాలపై శ్రీ రెడ్డిగారు వొత్తి వొత్తి చెప్పడమువలన ముందుగా వాటినిగురించే తెలియచేస్తాను. విజ్ఞానచంద్రికామండలివారి 3, 6, 7,11,12, 14 18,22, 23, ,25,26,27 నంబరుగల ప్రచురణలు ఎలిమెంటరీ సైన్సుకు చెందిన టెక్స్టుపుస్తకాలు. ఇందులో రెండు వైద్యగ్రంథాలు ; వొకటి కలరామీదను, మరొకటి మలేరియా మీదను వ్రాయబడ్డాయి. ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం వారచ్చొత్తించి ప్రచురించిన గ్రంథాలలో వొకటి ఆరోగ్యశాస్త్రానికి సంబంధించినదీ, మరొకటి పశువైద్యానికి సంబంధించినదీ ! ఆంధ్రప్రచారణీసభ సీరీసులో సైన్సు గ్రంథాలు లేవు. కేవలం అవన్నీ నవలలే కొవ్వొత్తులను తయారుచేయడము గురించి వొక గ్రంథరాజమూ, అగ్గిపెట్టల ఫ్యాక్టరీల గురించి యింకొక పుస్తకమూ మానవసేవా సమాజంవారు ప్రచురించారు.

శ్రీ రామలింగారెడ్డిగారు రాశిన అర్థశాస్త్రమనే గ్రంథం తప్ప, మిగిలిన యీ సైన్సుపుస్తకాలన్నీ స్వకీయ ప్రతిభతో కూడివున్నవీకావు ; స్వతంత్రమైనవీకావు. అక్కడవీ యిక్కడవీ తెచ్చి ఏర్చి కూర్చిన గ్రంథాలు యివి. ఇస్కూలుపిల్లలకు జనులకు సైన్సును గురించిన కొన్ని ప్రాథమిక విషయాలను తెల్పేటందుకుగాను వీటిని ప్రచురించారు. అదే ప్రచురణకర్తల ఉద్దేశం. యీ ప్రచురణలను సాహిత్య గ్రంథాలుగా ప్రచురణ కర్తలుగాని లేదా రచయితలుగాని చెప్పుకోవడంలేదు. ఇంగ్లీషు టెక్స్టుబుక్కులకు యివి అనుసరణములు ; లేదా యింగ్లీషు వ్యాసాలకు తెలుగుకూర్పులు. యింతకంటె మరేమీకావు !

తాము అలవాటుపడని భాషలోని సైన్సువిషయాలను తెలుగులో రాస్తున్నప్పుడు రచయితలు సమానార్థక శబ్దాలకు, సాంకేతిక పదాలకు ఎంతో అవస్థపడ్డారు ; కాని వారిచ్చిన పారిభాషిక పదాలు సులభద్యోతకములు కాకపోతేమానె, వాటికి అర్థమేమో తెలియని తికమకావస్థలో మనంపడతాము. తామీ పనికి కొత్తవారమని రచయితలు పీఠికలో చెప్పుకొన్నారు. విజ్ఞాన చంద్రికా మండలి సంపాదకులు తమ ప్రచురణాలయపు ప్రకటనలోనూ, సాధారణ పీఠికలోనూ యీ విధంగా శెలవిస్తున్నారు : "మా గ్రంథాలన్నీ జనోపయోగమునకై వ్రాయబడినవి. ఇంగ్లీషుభాష తెలియనివారికి ఇంగ్లీషున వ్రాయబడిన విషయాలను తెలియచెప్పి జ్ఞానమును కలిగించు ఆశయముతో ఈ ప్రచురణములను ప్రారంభించితిమి."

"భౌతికశాస్త్ర ప్రాథమికవిషయాల"నే గ్రంథపీఠికలో రచయిత యిలాగున వ్రాసినారు. "ఇటువంటి

విజ్ఞానశాస్త్రవిషయములను గురించి వ్రాయుట నాకిదే ప్రథమప్రయత్నముగాన, యిందు స్ఖాలిత్యములుండిన నుండవచ్చును .... క్రిందితరగతుల జదువువిద్యార్థుల యవసరములను దీర్చుటకై వారి కుపయోగపడునట్లీ గ్రంథమును రెండు భాగములుగ విభజించుట జరిగినది." ప్రకృతిశాస్త్ర విషయాలపై రాసిన ప్రైమరులను చిన్నపిల్లలకు పనికివచ్చేవిధంగా అచ్చొత్తించామని వారేరాస్తున్నారు.

తమకు పుస్తకాలను రాసేవారికి సాహిత్యరచనలో చెయ్యి తిరగవలెననికానీ, లేదా వారు విషయమెరిగిన పండితులు కావలెననికానీ, విజ్ఞానచంద్రికామండలి సంపాదకులు కోరడములేదు. మాన్యుయల్ ఆఫ్ బయాలజీని కూర్చినది శ్రీ లక్ష్మీపతిగారు. అప్పుడు ఆయన, యం.బి.సి.యం.పైనలు క్లాసును చదువుతూవుండిరి. "తమకు తీరికచిక్కిన వేళల్లో" ఆయన యీ గ్రంథమును రాశారట ! ఇదేవిధంగా మాన్యుయలాఫ్ కెమిస్ట్రీని జతకూర్చిన శ్రీవిశ్వనాధశాస్త్రిగారు ఆ గ్రంథమును సమకూర్చునప్పటికి ఎం.ఏ క్లాసును చదువుతూ వుండిరి.

యీరకమైన గ్రంథాలను "నిర్దుష్టమైనవిగానూ, అనవసర పాండిత్య ప్రకర్షను చూపేభాషలో కాకుండా నాజూకైన మధురభాషలో రాయబడినవిగానూ" శ్రీ రామలింగారెడ్డిగారు ఉదహరిస్తున్నారు. యీ గ్రంథాలకు కలవని శ్రీ రెడ్డిగారు చేస్తున్న క్లెయిమ్ను వాటి ప్రచురణకర్తలే చేయడము లేదు. మీదను రెడ్డిగారు పేర్కొంటున్న లక్షణాలు తమ గ్రంథాలకు పట్టవలెనని రచయితలను సంపాదకులే కోరివుండలేదు. దానిమాటకేమి, గ్రంథకర్తలకు వ్యాకరణ పరిజ్ఞానము చక్కగ కుదరవలెననే కోరికనుసైతం సంపాదకులు కోరివుండలేదు. 'భౌతికశాస్త్రము' గ్రంథపీఠికలో సంపాదకులు యిలా శెలవిచ్చి యున్నారు : "రచయితలు పంపిన గ్రంథములలోని వ్యాకరణ దోషములను యితర స్ఖాలిత్యములను సరిదిద్ది గ్రంథకర్తలకు ఉదాహరణ రూపముగ వారిదోషములను వారికి జూపి సర్వవిధముల వారికి సాహాయ్యము జేయుటయే మా మండలి ఆశయము."

మీది పేరాలలో నేను ఉదాహరించిన వారి వాక్యాలను పరిశీలించినట్లయితే యీ సైన్సు గ్రంథాలవిలువ, స్వభావము, తత్వము ఏలాటివో అర్థమవుతాయి. వెర్నాక్యులరు టెక్స్టుబుక్కుల బాగాలుగా యీసైన్సుపుస్తకాలను భావించుకుని, వీటిని చదవమని విద్యార్థులను కోరడం ఏమాత్రమూ న్యాయంకాదు. యీ సైన్సు విషయాలను తెలుగుపండితుడు క్లాసులలో విద్యార్థులకు ఎలాగున బోధించగలడు?

యీ పుస్తకాలు దేశంలో విరివిగ చెల్లిపోతున్నవని శ్రీ రెడ్డిగారంటున్నారు. ఇవి శాశ్వత పోషకుల అభిమానంపై చందాదారుల పోషణపై ఆధారపడి వున్నవని నేనంటున్నాను.

ఇక చరిత్ర గ్రంథాలను గురించి కొంత ముచ్చటిస్తాను. రచయితలు అద్భుతమైన తెలివితేటలతో పరిశీలనకావించి తమ స్వకీయ ప్రతిభను ఉపజ్ఞను ప్రదర్శించారని శ్రీ రెడ్డిగారు యీ చరిత్ర గ్రంథాలను దృష్టిలో పెట్టుకొనే అని వుంటారనుకుంటాను. నేనీ పుస్తకాలను జాగ్రత్తగా చదివాను. యివి శాస్త్రీయ ప్రామాణిక పద్ధతులకూ విషయాలకూ దూరంగావుంటూ వీటిల్లో వొక్కొక్కచోట కల్పితకథలను నిజమైన చరిత్రగా చెప్పడం కనిపించింది. 'ఆంధ్రులచరిత్ర' మినహాయించి, మిగిలిన చరిత్ర గ్రంథాలన్నీ క్లుప్తీకరింప బడిన కూర్పులు ; చారిత్రక గ్రంథాలను రాశేటప్పుడు ప్రామాణికమైన మూల ఆధారాల జోలికి రచయితలుపోలేదు. శాసన ఆధారలేవీ వున్నట్లు సాధారణంగా కానరావు. భారతదేశ సంక్షిప్త చరిత్రలోని ఉదయపూర్ రాజపుత్రులను గురించి రాశిన ప్రకరణమొకటి యిందుకు వుదాహరణ. ఈ గ్రంథంలో వర్ణింపబడిన పృధ్వీ రాజు రాణీసంయుక్తల చరిత్రవొకపరి తిలకించవలసినదిగా కోరుతున్నాను. శ్రీ లక్ష్మణరావుగారు రాశిన చరిత్ర గ్రంథం నుండి కొన్నిభాగాలను మెట్రిక్యులేషను పరీక్షలకు పాఠ్యవిషయాలుగా వేయడంకూడా తటస్థించింది.

సాహిత్య లక్షణమేమీ పట్టని గ్రంథాలను విద్యార్థుల మెడకు తగిలించడం వొట్టి దురన్యాయమని నాదృఢవిశ్వాసం. విశ్వవిద్యాలయమూ, విద్యాశాఖా తెలుగు రచయితలకు ప్రోత్సాహం కలుగచేయవలెననే సిద్ధాంతం యిదివరకు తెలుగు సాహిత్యానికీ, తెలుగున విద్యా పఠనానికీ ఎంతో హాని కలగచేసింది. చెడ్డపుస్తకాలను విద్యార్థుల మొహాన కొట్టడం వలన తక్కువ జాతి సాహిత్యం దేశంలో విరివిగా పుట్టి పెరగజొచ్చింది. యెట్టి సాహిత్యశాఖకు చెందిన యే మంచి పుస్తకాన్నైనా రాయాలంటే ప్రత్యేకమైన సాధన శిక్షణ అవసరం. రచయితలలో చాలామందికి యీ గుణసంపత్తి కొరవడింది. సాహిత్య కళా రచనా భ్యాసమనేది యీ దేశంలో ఎరగని మాట ; తెలిసీ తెలియని పాండిత్యంతో యువకులు గ్రంథాలను రాసి అందులోని భాషను పండితులచేరి దిద్దించుకుంటూ గ్రంథ రచయితల మనిపించుకుంటున్నారు. వీటిని దిద్దే పండితులు నిర్లక్ష్యంగా యీ భాషను పరిశీలించి తప్పులతడకలతోనే దేశంలోనికి వొదులుతున్నారు. నేను ఈ దిగువ కొన్ని గ్రంథాలను పేర్కొంటున్నాను. వీటిల్లోని భాష శుద్ధ తప్పులమయం. కాస్త తెలివితేటలున్న కాలేజీ విద్యార్థిసైతం యిల్లాంటి తప్పులు రాస్తాడని నే ననుకోను.

శ్రీ రామలింగారెడ్డిగారు తమ జాబితాలో పేర్కొన్న విజ్ఞాన చంద్రికామండలి ప్రచురణ 'ఢిల్లీ దర్బారనే' గ్రంథం; మహాభారతకథ ; శ్రీకృష్ణుని జీవితం అనే పుస్తకాలు.

మనదేశంలో దురదృష్టవశాత్తూ సాహిత్యంపై విమర్శనము కొనసాగడమేలేదు. సారస్వత విమర్శనా సహాయం పొందకుండానే, దాని అజమాయిషీ లేకుండానే, సాహిత్యం మనదేశంలో ఎదుగుతూ వున్నది. గ్రంథకర్త తనకుతాను అభివృద్ధిపొందనిదే విశ్వవిద్యాలయం అతనికి ప్రోత్సాహమీయలేదేమోనని నా అభిప్రాయం.

అయితే కొంతమంది రచయితలు ప్రచురణకర్తలు కావిస్తున్న దేశభక్తిపూరిత కృషికి నేను తక్కువ విలువకడుతున్నానని ఎవరూ ఎప్పుడూ అనుకోరాదు. శ్రీ రామలింగారెడ్డిగారి జాబితా ఆఖరు పేరాలో కన్నడులకంటె తెలుగులు ఎంతో హెచ్చు సాహిత్య కృషిని చూపించారని వొకమాట వున్నది. అయితే తెలుగున సైన్సు రచయిత, చారిత్రక గ్రంధకర్తా హక్సలే భండార్కర్లకు కొన్నిమైళ్లదూరం వెనుకపడివున్నారని సరిపోల్చి నేనుచెప్పడం, తెలుగు గ్రంథకర్తలను కించపరచడానికికాదు.

తెలుగులో వెలువడుతున్న సైన్సు గ్రంథాలను ప్రోత్సహించవలసినది మనదేశ ప్రజలు. వీటిని హెచ్చుగా ఆదరించవలసినదిగా విశ్వవిద్యాలయాన్నేకాక దేశీయులకు శ్రీ రెడ్డిగారు విజ్ఞప్తి చేయవలసి వుంటుందనుకుంటాను. వెర్నాక్యులరు టెక్స్టుబుక్కులద్వారా ఇస్కూలు విద్యార్థులకు సైన్సును బోధించడంవల్ల అవి ఎంతవరకు ఉపయోగకారి అనే విషయమై దేశభక్తులకూ విద్యావేత్తలకూ మధ్య తీవ్ర అభిప్రాయభేదాలున్నవి. అయినప్పటికీ వాటి నా విధంగా పిల్లలకు బోధించవలెనని శ్రీ రెడ్డిగారు వాదించవచ్చును. అందులో తప్పేమీ కనిపించదు.

తెలుగులో మంచి ఆధునికవచన పుస్తకాలకు కరువుగానే వున్నది. అందువల్ల నే యూనివర్సిటీ కోర్సులలో ఎక్కువభాగం ప్రాచీనకవుల గ్రంథాలనే పెట్టడం సంభవిస్తున్నది. ఈ గ్రంథాలు కొంత గద్యములోను మరికొంత పద్యములలోను రచింపబడ్డవి. ఇవి చంపూకావ్యములు.

ప్రాచీన చంపువులలోని వచనం కొంత చెప్పుకోతగిన లక్షణాలతో వున్నది. నేటి కాలపు గద్యరచనలో ప్రాచీన సాహిత్యరకళాచాతుర్యము కానరాకపోతే, పోనీ ఆధునిక సాహిత్య కళా విన్యాసమూ అవుపించదు.

విద్యాలయాలలోని యిప్పటి పాఠ్య ప్రణాళికలలో ప్రాచీన సాహిత్యమే వుంటున్నది ; ఆధునికవిషయాలపై ఆసక్తి పుట్టించే సాహిత్యం యీ పాఠ్యప్రణాళికలో కనిపించనిమాట నిజం. ప్రాచీనపద్యాలలో వర్ణింపబడిన కావ్యవస్తువు పౌరాణికములే. ఎపిక్‌లే. అయితే యీ ఎపిక్కులూ పురాణాలూ విశేషసంఖ్యాకులుగల భారతదేశప్రజల మతానికి

సంబంధించినవి. చాలామంది విద్యార్థులు ప్రచారంలోవున్న యీ మత నమ్మకాలను అధిగమించి అభివృద్ధి అవుతున్నారు. అయినప్పటికీ యీ నమ్మకాలవలన రాజ్యం చేస్తున్న అధిపద్యం వహిస్తున్న సమాజంలో విద్యార్థులు జీవిస్తున్నారు. యీ సామాజిక ఆచారాలకు మత సంప్రదాయాలకు వారు లోబడుతున్నారు. సమాజంలోని సమస్యలను పరిష్కరించడములో యీ నమ్మకాలు తమ ప్రభావాన్ని కలిగివుంటున్నవి.

ఆధునిక విషయాసక్తిని కలిగించే గ్రంథాలంటే తమ జాబితాలో పేర్కొన్న విజ్ఞానశాస్త్రగ్రంథాలనే దృష్టిలో మాట్లాడారే తప్ప శ్రీ రెడ్డిగారు ఆ పరిమితులను దాటడంలేదు. కాని యూరపులో, మేధస్సును వికసింపచేసే ఆలోచనలను రేకెత్తించే పుస్తకాలు అనేకం వెలువడుతున్నవి. మేధస్సును వికసింపచేసే వాతావరణాన్ని కలిగివున్న యూరోపుపైపునకు శ్రీ రెడ్డిగారిదృష్టి వెళ్ళడములేదు. అటువంటి సాహిత్యం తెలుగులో జోడుకంచుకాగడాలు పట్టుకుని వెతికినాకానరాదు.

యిప్పుడు శ్రీ రామలింగారెడ్డిగారు తమ జాబితాలో పేర్కొన్న నవలల నొకసారి పరికింతాము. సమకాలిక తెలుగు సాహిత్యంలో యెవరైనా యేమి కావలెనని కోరుతారు? యే నవలలోనైనా ఆధునికసమాజంలోని సమస్యను యితివృత్తంగా తీసుకుని సాహిత్యరీతిలో దానిని చక్కగా రచయితలు వొప్పించారాలేదా అని ఆలోచిస్తారు. కాని తెలుగు నవలారచయితకు వర్తమానకాలం తెరవరాని తాళంవేసిన వొక గ్రంథంవంటిదాయె ! అతనికి చారిత్రక నవలలను రాయడమంటే విపరీతమైన మోజు. యీ మోజువలన ఎంతటి ముప్పుకలిగినా ఆ గ్రంథకర్త లెక్కచేయడాయె !

యిది చరిత్రలో జరిగిందా లేదా అనే మీమాంస అక్కర్లేదు. అనుమానాస్పదమైన విషయాలను సైతం తమ చిత్తమొచ్చినరీతిని తనవితీరా వర్ణింపవచ్చును. ఆకుకు పోకకు పొందని సన్నివేశాలతో కట్టుకథలు అల్లుకుపోవచ్చును. చరిత్రలో హిందూరాజుల సేనానాయకుల లేనిపోని వీరత్వాన్ని పొగడుతూ ముస్లింలు విశ్వాసఘాతకులని పిరికి [illegible] వొక్కొక్కపుడు ముస్లింలు వర్ణించవచ్చును. విజ్ఞానచంద్రికా మండలి ప్రచురించిన చారిత్రక నవలలన్నీ [illegible] యిలాటివే. యీ నవలలు రాశినవారిలో కొంతమందికి చారిత్రక నవలారచనకు కావలసిన విషయప[illegible]లేదు. యింగ్లీషు సాహిత్యంతో వీరికి సంపర్కంలేదు. నవలలో వర్ణించిన కొన్ని చారిత్రక విషయాలు ఎన్నడూ దేశం[illegible] చారిత్రక పరిశోధనలకు వలసినంత శాసనాది ప్రమాణాలు లేకపోవడంచేత చరిత్రలకు రాసేవారే ఇదమిద్ధమని కొ[illegible] చెప్పలేకపోతున్నారు. ఇంక చారిత్రక నవలాకారుల మాటా, వారికి చారిత్రక పరిశోధనలు పద్ధతులు తెలియ[illegible] అభూతకల్పనలను నవలలోనికి జొప్పించి వాటిని వ్యాపింపజేస్తూ సంఘానికి చెప్పరాని అపకృతిని చేస్తున్నారు.

విజ్ఞానచంద్రికామండలి వెలువరించిన చారిత్రకనవలల్ని స్థూలంగా చూసినా, నేను వీటిని గురించి [illegible]న అభిప్రాయాలు నిజమైనవి బోధపడగలదు. ఇందుకొక వుదాహరణగా యీ మధ్యనే బహుమతిపొందిన "విజయనగర సామ్రాజ్యమనే" నవలను పరిశీలిద్దాము. ఈ నవల ఎంతో గొప్పదని దండోరావేసి మరీ చెప్పుకుంటున్నారు.

యిది యెంతో అసంగతమని సంకోచించకుండా "విజయనగర సామ్రాజ్య" నవలారచయిత పీఠికలోనే వొక వొక విషయం పేర్కొంటున్నారు. (1913 ఏప్రియలు 28వ తేదీన కథ) అందులోనూ చారిత్రక నవల రాద్దామనే కుతూహలం కలిగి భారతదేశ చరిత్రను చదువనారంభించిరట! అదేసంవత్సరం మే నెల మొదటి తారీఖున నవలారచన కుపక్రమించి, అదే నెల 26 వ తేదీనాటికి నవల ముగించెనట ! తమ నవలలోని కథాపీఠికకు వలయు చారిత్రక విషయాలను లక్ష్మణరావుగారి మహమ్మదీయ మహాయుగము నుండి నవలాకారుడు సేకరించితినని చెబుతున్నారు. అయితే యీ నవలారచనకు కావలసిన సమాచారం శ్రీ లక్ష్మణరావుగారి మొత్తం పుస్తకములో పన్నెండు పేజీలకు మాత్రం కుదించబడింది. ఇంత కుద్దింపుకల చాలీచాలని చారిత్రక విషయాలను మాత్రమే ఆధారంగా తీసుకుని రాసిననవల ఎలావుండవలెనో అలాగునేవున్నది. తాము ఏ చారిత్రకదశయందలి ఘట్టాలను నవలగా రచింపపూనుకున్నారో, ఆ చారిత్రక దశను గురించి "నవలిక" జరిపిన పరిశోధన యింతస్వల్పం ! ఇట్టి స్వల్పపరిజ్ఞానంతోనే నవల మొదటి

ప్రకరణం ఆరంభమవుతుంది సివెల్సు రాసిన విస్మృత సామ్రాజ్యము అనే ఆంగ్ల గ్రంధం చదవడానికి కూడా రచయిత పూనుకోలేదు నలుగురికీ తెలిసిన చారిత్రక విషయాలు కూడా నవలాకర్తకు తెలియకపాయెను తాళికోట యుద్ధవర్ణన నవలలో విచిత్రం తిరుమలరాయడు రామరాజు సోదరుడు మూడవ రాజవంశములో మొదటిరాజు ఇతణ్ణి నవలారచయిత నిష్కారణంగా తాళికోట యుద్ధంలో చంపివేస్తున్నాడు తాళికోట యుద్ధానంతరం తిరుమలుడు కన్నడ రాజ్యాన్ని పరిపాలించాడు ఈ చిన్న విషయం శ్రీ లక్ష్మణరావుగారి గ్రంధాన్ని కొంచెం జాగ్రత్తగా చదివివుంటే నవలా రచయితకు తెలిసివుండేది ఆయన యింతటి పొరపాటుపడేవాడుకాదు తాళికోట యుద్ధానంతరం తిరుమలుడు వొక ప్రబంధాన్ని అంకితం పుచ్చుకున్నాడు యీ ప్రబంధం వొకరకపు పద్ధతికిదోవతీసి కృత్రిమమైన అనేక ప్రబంధాలకు మాతృకవంటిదయింది ఆంధ్రసాహిత్యంలో ఆమాత్రపు యీ మాత్రపు పరిచయమున్న పిల్లవానికిసైతం తెలిసే యీ విషయం చారిత్రకనవలను రాశేవారికి తెలియక పోవడం క్షంతవ్యంకాదు

ఈ నవలలో పరిపోషితమయిన రెండుసంగతులను గురించి మాత్రమే ముచ్చటించి యిది యెంత అసంగతమైన రచనో చూపిస్తాను నాటి రాజకీయ మహారూపకంలో ప్రధానమైన ముగ్గురు వ్యక్తులను నవలారచయిత యేవిధంగా పాత్రీకరించాడనే విషయం తాళికోటయుద్ధాన్ని యేవిధంగా వర్ణించగలిగాడనే సంగతి ఈ రెండూ చరిత్రకు సన్నిహితంగానైనా నవలలో పోషింపబడినవా అనే ప్రశ్నను కొంచెంతీసుకుందాము ముందు యుద్ధఘట్టవర్ణనను పరిశీలిద్దాము

నవలలో వర్ణితమైన యుద్ధవృత్తాంతం అబద్ధాలకు పెట్టిందిపేరు నవలిక చెప్పే విషయాలు చాలా తమాషాగా నవ్వును పుట్టిస్తున్నాయి ఫెరిష్తా అనే చరిత్రకారుడు రాసిన విషయాలు నవలాకారునకు యెలాగూ తెలియవు దానికేమి ఇంగితజ్ఞానంకూడా ఎరుగని వ్రాతలను ఏమి అనవలె ? పౌరాణిక యితిహాసాలలోలాగున యిందులోని రాజులు సేనానాయకులు వొకే యుద్ధరంగంలో పాల్గొంటారు సేనానాయకులు తమతమ కావలాస్థలాలను విడిచిపెట్టిన నవలాకారుడు ఎక్కడకు రమ్మంటే అక్కడికి ఎప్పుడుపిలిస్తే అప్పుడు ప్రత్యక్షమౌతూవుంటారు నవలలో నాటకీయతకోసం రచయిత వీరిని చీటికీమాటికీ తన చిత్త మొచ్చిన రీతిని అటుయిటూ తిప్పుతూనేవుంటాడు సైనిక శ్రేణులు చిందరవందరగా చెల్లాచెదరై వొక వరసావాడీ లేకుండా యుద్ధరంగంలో పాల్గొంటాయి ఫెరిష్తా గ్రంధాన్ని అనుసరించేనని చెప్పుకున్న సివెల్సుకూడా యీ విషయం తప్పుగానే పేర్కొన్నాడు విజ్ఞానచంద్రికామండలి సంపాదకులు ఫెరిష్తా యేమివ్రాశాడో చూడకుండానే సివెల్సుపై ఆధారపడ్డారు యిక నవలారచయితమాట చెప్పేదేముంది? సైన్యం యుద్ధరంగంలో యెలాగున తీర్చివున్నదో విడిచిపెట్టి రచయిత తన ఊహలతోపాటు సైన్యాన్ని పరుగులెత్తించాడు యుద్ధరంగాన రామరాజు ప్రధాన సైన్యం మధ్యభాగంలో వుండవలసివుండగా దానిని రచయిత కుడి భాగాన నియుక్తపరచి వర్ణనలకుదిగాడు వేంకటాద్రిసైన్యాన్ని యుద్ధరంగ మధ్యభాగాన వుంచి చిలవలూ పలవలూ అల్లుకుపోయాడు

ఈ యుద్ధంలో యిరుపక్షాలతరఫున అనేక వేల లక్షల మంది పోరాడారు యింతమందిలో వున్న యుద్ధరంగంలో ఆదిల్షా యెక్కడవున్నదీ చటుక్కున పోల్చుకొని ఆ తిరుమల రాయుడు అతనిమీదకు హఠాత్తుగా లంఘిస్తాడు ప్రమాదంలో చిక్కుకున్న ఆదిల్షా ప్రాణరక్షణార్థం ముస్లింసైనికు లనేకమంది హుటాహుటీవచ్చి అక్కడ వాల్తారు వేంకటాద్రి యిది గమనించి తన శ్రేణిని వ్యూహాన్నీ వొదిలేసి అదిల్షాపై విరుచుకుపడతాడు యికనేముంది ఆదిల్షా యేనుగును తిరుమలరాయుడు నేల కూలుస్తాడు ఆదిల్షా యేనుగుమీంచి కిందకురికి ప్రాణం దక్కించుకుందుకు పలాయనం చిత్తగిస్తాడు తిరుమలరాయుడు ఆదిల్షాను పట్టుకొని వెంటనే చేంతాండంత

ఉపన్యాసం ఆరంబిస్తాడు. యిదంతా నవలలో వర్ణించిన చరిత్ర. యిక తిరుమలరాయుడి ఉపవ్యాసం ఉదహరించి చూపుతాను. "ఓరీ! పాపాత్ముడా! హీనుడా! కుక్కా! నిన్నమొన్నటి వఱకు తండ్రీ! తండ్రీ!యని మా యన్నగారిం బిలుచుచు శత్రువులతోఁ గలిసి నేడు యుద్ధమునకు వచ్చితివా? నేఁటితో నీ పాపములు సర్వము తగిన ఫలము నందుచున్నవిలే. నీవంటి పితృద్రోహులకు .... మాతృద్రోహీ!" ఈ ఉపన్యాస మిలాగ కొనసాగింతరవాత గ్రంథకర్త వర్ణిస్తున్నాడు. "ఆదిల్ శాహీనీకనులనుండి నీరు స్రవించెను. ప్రాణముపోవునని యతఁడు లోలోన నేడ్వసాగెను. ఏమీ చేయుటకును దోచలేదు. అతఁడు చేసిన ద్రోహములను, పాపములను నతండు స్మరించెను. దుఃఖించుచుండెను ... అతని సైన్యము లన్నియు నా వఱకే పాఱిపోయెను. కాని యింతలో నొకతురుష్క వీరుండచ్చటికి పురుగెత్తివచ్చి యా తిరుమలరాయని హస్తమును హఠాత్తుగా తెగనఱికెను. అతడు వ్రేటుతిన్న పెద్దపులివలె రెండవచేతంగత్తింగైకొని యా తరుష్కుంబొడిచి విజృంభించెను. ఇంతలో, ఆదిల్ శాహ్ పాఱిపోయెను."

రామరాజు మరణవార్త వినగానే వికలాంగుడైతేనేమి, తిరుమలుడు హుటాహుటీ అక్కడకు పరుగెత్తుకెళ్ళాడు. కాని ముస్లింలు వంచనచేసి అతణ్ణి చంపివేశారు !

వేంకటాద్రిసైతం యిదేవిధంగా "చనిపోయిన తన అన్నగారిని" చూసేందుకు వెళ్ళాడు. ఒక ముస్లిం సైనికుడు అతణ్ణి ఎదుర్కొని అతనితల రెండుముక్కలయేటట్లు సరికి వేశాడు. ప్రాణంపోతున్నపుడుకూడా, గిలిగిల కొట్టుకుంటున్నప్పటికీ, వేంకటాద్రి తనపైన పడిన ముస్లింయోధుణ్ణి చంపివేశాడు. ముస్లింల చేతులో మరణించడం అవమానకరమని వేంకటాద్రి చివరకు తానే ఆత్మహత్య చేసుకున్నాడు.

నవలలో వర్ణించబడిన యుద్ధ ఘట్టాలలో కొన్ని మచ్చుతునకలను మాత్రమే నేనుమీద నుదహరించాను.

దక్కనును పాలించిన యిద్దరు అతిసమర్థులైన ముస్లిం రాజులను తన నవలలో వట్టిపిరికిపందలుగా చిత్రించడమే రచయిత చేసిన అపరాధం. కుత్సితమైన ఈ ముస్లిం ఏలికల దుష్టపన్నాగాలకు రామరాజు మోసపోయాడని చూపడం రచయిత ఉద్దేశంవలె కనిపిస్తున్నది. కనక నవలారచయిత రామరాజును వొట్టితెలివితక్కువ దద్దమ్మగా, చిత్రించాడు. నిజంగా రామరాజు తన జీవితకాలంలో అనేక అంతర్యుద్ధాలు, కలహాలు చవిచూసినట్టి పురుషుడు. విజయనగర సామ్రాజ్య సింహాసనంమీద నామమాత్రమైన వ్యక్తిని అధిష్టింపచేసి వాస్తవానికి తానే రాజరికాన్ని నడిపాడు. చరిత్రలో కనిపించే రామరాజువేరు ; నవలలో చిత్రింపబడే రామరాజువేరు; ఇద్దరికీ యేకోశానా పోలిక కనిపించదు !

బీజపూరు సుల్తాను ఆదిల్షా, రామరాజుతో అతిధైర్యమైన రాజకీయ విధానాన్ని చేపట్టి స్నేహం సంపాదించాడు. ఈ విషయాన్ని ఫెరిష్తా తన గ్రంథంలో పేర్కొన్న విధం గమనించతగ్గది. రామరాజు కొడుకు మరణించగా అతనికి తన సానుభూతి తెలిపే నిమిత్తం ఆదిల్షా స్వయంగా వందగుర్రాలపై భృత్యులువెంటరాగా, విజయనగరం బయలుదేరేడు. రామరాజు భార్య ఆదిల్షాను తనకుమారినిగా సంభావించేదని ఫెరిష్తా తన గ్రంథంలో పేర్కొంటాడు. ఆదిల్షా రామరాజులమైత్రి కేవలం రాజకీయమైనదికాదని అంతకుమించినదని దీనిని బట్టి నాభావం. బ్రిగ్స్ అనే చరిత్రకారుడు ఆదిల్షా, రామరాజుకు "దత్తుడ"ని పేర్కొంటున్నాడు కాని దానికి మూల గ్రంథాలలో ఆధారం కనిపించదు. ఆదిల్షా తనవద్దకు రాగా రామరాజు సగౌరవంగా ఆదరించాడు కాని, లాంఛన ప్రకారం ఆదిల్షా వెళ్ళిదుతున్నపుడు అతణ్ణి కాస్తదూరమైనా సాగనంపలేదు. ఈ మాత్రపు లాంఛనాన్ని పాటించకపోవడఁ ఆదిల్షా తనకు అవమానకరంగా తలపోశాడు. రామరాజు చేసిన యీ అవమానం అతనెన్నడూ మరిచిపోలేదు.

యీ సంఘటననుబట్టి ఆదిల్షా పౌరుషం ఆత్మాభిమానం కల పరిపాలకుడనీ, తన వ్యక్తిత్వంమీద తనకెంతో గౌరవం కలవాడనీ స్పష్టపడుతున్నది. ఏదో వొక రాజకీయ ప్రయోజనంకోసం రామరాజు ముందు తననుతానేక్షూ ణతపరుచుకునే వ్యక్తిత్వం కలవాడుకాదు ఆదిల్షా

కాని నవలా రచయిత ఆదిల్షాను రామరాజుకొక తైనాతీగానూ యిచ్చకాలాడి ఆత్మగౌరవాన్ని అమ్ముకునే వాడుగానూ చిత్రించాడు. రామరాజు చూస్తూండగానే అతని యెరికలోనే ఆదిల్షా విజయనగరంవచ్చి స్థిరపడిపోయి, యథేచ్ఛగా అసహ్యకరంగా రాచకార్యాల్లో వేలుపెడతాడు. లావాదేవీల్లోకి దిగుతాడు.

అంతఃపురమందిరంలోనికి సైతం తనరాక ముందు తెలియచేయకుండానే రామరాజువద్దకువెళ్ళి సలాములు చేస్తాడు. రామరాజు, ఆదిల్షా పెట్టిన సలామునైనా అందుకోడు. కాని కుర్చీలో కూర్చోమని సౌజ్ఞమాత్రం చేస్తాడు. రామరాజును ఆదిల్షా తన యజమానిలా భావించి యెంతో వినయవిధేయతలతో సంబోధిస్తాడు. రామరాజుమాత్రం ఆదిల్షాను సేవకుణ్ణి పిలిచినట్టు యేకవచనంలో సంబోధిస్తాడు.

ఆదిల్షా రామరాజుల మధ్య జరిగిన సంభాషణలో ఆదిల్షా యిలా చెప్పుకుంటాడు : "అవును. శాంతస్వభావులగు హిందువులు మహమ్మదీయులవలన జాలబాట్లు వడినారు. ఆ పాపఫలమును వీ రనుభవింపక తీరదు – దేవుని యవతారములు తమవంటివారే. తప్పక తమరే ధర్మరక్షణకుఁ బూను కొనవలయును. నేను మహ్మదీయుఁడనయినను నాకు హిందూమతమునందు బ్రీతి చాలఁగలదు. ధర్మమెచటనుండునో అచట జయముగూడ నుండును".

నవలలో చిత్రీకరించబడ్డ యిబ్రహీం పాత్రకు తాను ఆదిల్షాకు వ్రాస్తున్న ఉత్తరం ఎవరికంటైనా పడుతుందేమోననే సంకోచంలేదు – ఎవరైనా దారిలో అడ్డగిస్తే తన ఉత్తరం పట్టుపడుతుందనే భయంలేకుండా యిలాగున రాస్తున్నాడు: ".... ఆ విజయనగర సామ్రాజ్యము పేరు విన్న గుండెలు పగిలిపోవుచున్నవి. ఎంత సామ్రాజ్యము ! ..... అది మనకు ! బ్రక్కలోని బల్లెము ... కాని మీరన్నట్లు వారిని యుద్ధములో జయింపలేము. స్నేహము నటించుచునే వంచించి విజయ మందవలెను. ఆ యాంధ్రవీరుల పేర్లు తలపగనే గుండెలు వ్రక్కలగుచున్నవి! అట్టి సామ్రాజ్యముతోడను, ఆ సైనికులతోడను మనమెల్లరమునుగూడ గలసి యెదుర్కొనినను జయింపజాలము ....."

ఆలీఆదిల్షా, యిబ్రహీం ఆదిల్షా లిద్దరూ సాహిత్యాన్నీ కళలనూ పోషించినవారు. అనేక కట్టడాలతో శిల్పాలతో బీజపూరు నగరాన్ని అలంకరింపచేసిన మొట్టమొదటి సుల్తాను ఆదిల్షా. అతనివద్దకు అక్బరు రెండు రాయబారవర్గాలను పంపించాడు. అతని ఉత్తరువులపైననే జుమ్మామశీదు, హౌజీషాపూరు నిర్మింపబడ్డాయి. నగర అగడ్తలను కట్టించినది యితనే. నగర అన్నివీధులకు నీరు అందేటందుకుగాను అక్విడేట్లను నిర్మించాడు.

ఆదిల్షా తన తండ్రినిసైతం లెక్కచేసేవాడుకాదనీ, మాటకుమాటా వొప్పగించి విమర్శిస్తూ వుండేవాడనీ మత విషయాల్లో మూర్ఖపు పట్టుదలలుగల తన తండ్రిని నిర్మొహమాటంగా ధైర్యంగా యెదిరించేవాడనీ ఫెరిష్తా వర్ణించిన కథలవల్ల మనకు స్పష్టపడుతున్నది.

దక్కను పాలించిన ముస్లిములలోకల్లా బహుశా ఇబ్రహింకుతుబ్‌షా గొప్పవాడని చెప్పవచ్చును. విద్యలమీద అతనికి ఆదరణ హెచ్చు. అందులోనూ ప్రాచ్యదేశాల సాహిత్య మంటే మరీ అభిమానం. ప్రసిద్ధిగాంచిన యిద్దరు తెలుగుకవులు తమ కావ్యాల నీ సుల్తానుకు అంకితమిచ్చారు. హిందువులపై తమ పోషకులు జరిపిన దండయాత్రలను,

విజయాలను యీ కవులు స్తుతిస్తూ హిందూదేవుళ్ళతో వీరిని సరిపోల్చి వర్ణించారు. ఇబ్రహీం కుత్‌బ్‌షాగురించి ఫెరిష్తా తన గ్రంథంలో యిలాగున వ్రాశాడు : "కుత్‌బ్‌షా తాను స్వయంగా యుద్ధంలో సైన్యానికి నాయకత్వం వహించినప్పుడు తనసైన్యం ఓటమి ఎరుగున్నట్లు చరిత్రలో యెక్కడా చెప్పబడలేదు. అతని విడిదెలో ఆలోచనా శీలురయిన చతురతగల ప్రసిద్ధులుంటూండేవారు. సుల్తాను వీరిసలహాలను పాటిస్తూవుండే వాడు. న్యాయధర్మంనుంచి అవసరమైనపుడు సుల్తానుకు వీరు సలహాలిస్తూవుండేవారు. ఇతని అధికారం చెప్పుకోతగ్గది. రక్షక భటుల నిఘా దేశంలో హెచ్చుగా వుండేది. తలమీద బంగరుపళ్ళెంతో నగలను పెట్టుకుని వొక ముసాలిముద్ద గోలకొండనుండి బెంగాలుకు, లేదా బీజపూరుకో అహమ్మదు నగరుకో యెట్టి దొంగల భయం లేకుండా ప్రయాణం చేయవచ్చును. ఆమె సొత్తుకు యెట్టి అపకారమూ జరిగేదికాదు. తెలంగాణాలో యీ కాలంలో దొంగలభయం విపరీతంగావున్నా యిట్టి భద్రతను సుల్తానురక్షకభటులు కలిగించేవారంటే సుల్తాను పరిపాలనాయంత్రం యెంతటిదో వూహించుకో వచ్చును. దండయాత్రలలో యితను జయించినవీ ప్రధానమైనవీ కశింకోట, రాజమండ్రి, కాన్పుబీర్‌లు, దానధర్మాలకు పౌరకార్యలయాలకు, రాజవంశస్థు లుండేందుకు, సుల్తాను అనేక కట్టడాలను నిర్మించాడు.

గోలకొండ శిఖరంచుట్టూ ప్రాకారాన్ని నిర్మించాడు. ఇబ్రహీంతోటలు, గుల్షన్, అన్నసత్రవులు, ఇబ్రహీం పట్టం వద్ద చక్కని కోనేరు, హుస్సేన్‌సాగర్ మొదలైనవి ఇతను కట్టించినవే. మశీదులు, కళాకాలలను అనేకం నిర్మించాడు. కుతుబుషా న్యాయపరిపాలనలో తెలంగానా యీజిప్టువలె ప్రపంచాని కొక అంగడిగా రూపొందింది. తుర్కిస్థాన్, అరేబియా, పెర్షియాలనుండి వర్తకులు యిక్కడకు వచ్చేవారు. ఇక్కడ దొరికే వస్తువులకు ఆకర్షింపబడి తరుచు వా రొచ్చేటట్టు అంగడి కళకళలాడుతూ వుండేది."

తాళికోట యుద్ధంలో ముస్లిం పరిపాలకు లందరూ యేకంకావడానికి రామరాజు పూర్తిగా బాధ్యుడని చరిత్రలో స్పష్టంగా వ్రాయబడింది. తాళికోటయుద్ధంలో నవలాకారుడు వర్ణించినట్లు ముస్లింలు కుట్రలూ కుత్సితాలూ పన్నేరనే కథకు చారిత్రక ఆధారమేమీలేదు. రచయిత తన నవలలోని 209, 210, 211 వ పుటలలో వర్ణించిన దానినిబట్టి కూడా రామరాజు అహంకారాంతో తలబిరుసుతో ప్రవర్తించాడు. అతనిసైన్యం అహమ్మదునగరాన్ని ముట్టడించేటప్పుడు చాలా అసహ్యకరంగా నడుచుకుంది. మశీదులను పడగొట్టి ముస్లింలను అవమానపరిచింది. ఆదిల్షాకు రామరాజుకు జరిగిన సంధిషరతులకు యీ చర్యలన్నీ పూర్తిగా విరుద్ధం.

నవలా రచయితకు చరిత్రలో యేది జరిగినదో జరగనిదేదో తెలియదు. ఆయన అజ్ఞాన మపారం. ఈ విషయానికి ఆయన నవలే దాఖలా ! ఇది కూడునా కూడదా అనే సంకోచమైనా లేకుండా నవలా రచయిత కేవలం తనఊహలతో వొక దానిమీద యింకొకటి కట్టుకథలను పేర్చుకుపోయాడు. వివాద మేమీలేని చారిత్రక సత్యాలనుకూడా మార్చివేశాడు !

తెలుగుదేశంలో విజ్ఞాన చంద్రికామండలి ఎన్నో పుస్తకాలను ప్రచురిస్తున్నది. తమ కృషిని విజయవంతం చేసేటందుకు సంపాదకుడూ మేనేజరూ శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. అయితే, వారి ప్రచురణమండలి బహుమతియిచ్చిన 'విజయనగర సామ్రాజ్యమ'నే నవలను పరికిస్తే దేశంలోగల అభిరుచులు యెలా వున్నవో తెలుస్తాయి. ఇదే యింగ్లండులో అయితే ఈ నవలకు ప్రచురణ కర్త అంటూ వొకడు దొరకక పోను ! ప్రచురణకర్త దొరకకపోవడంమాట అలా వుంచండి. అసలు యిలాటి నవలను యోచనగల ఏ ఇంగ్లీషువాడూ వ్రాసివుండడు. 'విజయగర సామ్రాజ్య' నవలా రచయితకున్న పరిజ్ఞానంకంటె కా స్తంత హెచ్చుపరిజ్ఞానం తనదేశం గురించి మామూలు యింగ్లీషువాడికి, బడిపిల్ల వాడికి వుంటుంది.

నవలలో చారిత్రక యితివృత్తం యెంత బాగున్నదో భాషకూడా అంతేబాగుంది. సంప్రదాయసిద్ధమైన గ్రాంధికమైనా కొంచెం సొగసులుతీరివుంటే బాగుండేది. పైగా నవలలో భాషాస్ఖాలిత్యాలనేకం. ఇలాంటిభాషను అవలీలగా యెవరైనా వ్రాయవచ్చును.

శ్రీ రామలింగారెడ్డిగారు తమ జాబితాలో మరికొన్ని నవలల్ని చేర్చారు. కాని మొత్తం తెలుగునవలాసాహిత్యంపై శ్రీ రెడ్డిగారికి సదభిప్రాయం కుదరనట్లే కనిపిస్తున్నది. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి "రాజస్థాన కథావళి"ని గురించి చెబుతూ (ఇది కాల్పనికమైనదికాదు ; లేదా చారిత్రక గ్రంథమైన కాదని రెడ్డిగారు దానిని కొట్టిపారేశారు. శ్రీలక్ష్మీ నరసింహముగారిని యీనాటి ప్రసిద్ధరచయితగా అందరూ పరిగణిస్తూవుంటారు. ఆయన్ని బహుళ ప్రచారంగల రచయితగా అందరూ గుర్తిస్తారు. అలాంటపుడు శ్రీ రెడ్డిగారు ఆయననే కాదన్నట్లయితే దాని అర్థం ఆధునిక తెలుగు సాహిత్యాన్నే విముఖతతో త్రోసిపుచ్చుతున్నట్లు కాదా ! ఈ గ్రంథాన్ని యింటర్మీడియటు పరీక్షలకు పెట్టారు. విద్వాన్‌పరీక్ష కింతకన్నా మంచిపుస్తకం దొరకడం లేదన్నట్లు దీనినే నిర్ణయించారు.

రాజస్థాన కథావళి ఇంగ్లీషులో వున్న "ఫ్రందీ లేండాఫ్‌దీ ప్రిన్సెస్సు" అనే గ్రంథానికి అనుసరణ. ఆసంగతి రచయిత యెక్కడా చెప్పలేదు. దీనిని చిన్నపిల్లలకోసం ఫెస్టింగ్సు అనే ఆయన వ్రాశాడు. మూలగ్రంథాన్నీ తెలుగు పుస్తకాన్నీ సరిపోల్చి చూసినట్టయితే ఆంగ్లరచయితకున్న కళావిదగ్ధత తెలుగు రచయితకు కొరవడిందని బోధపడుతుంది.

శ్రీ లక్ష్మీనరసింహముగారు రాసిన "హేమలత"ను యింటర్మీడియటు విద్యార్థుల 'నాన్డిటైల్డుస్టడీ' కోసమని పెట్టినారు. ఇది రాజస్థాన కథావళికంటె యేమీ మెరుగుకాదు.మెడోసుటైలరు నవలనుండి కొన్ని సంఘటనలు పాత్రలు సంగ్రహించి వొక దారీతెన్నూ లేకుండా యీ నవలను లక్ష్మీనరసింహంగారు అల్లారు. ఫలానా పాత్రను సన్నివేశాన్ని ఫలానాగ్రంథంనుంచి తీసుకున్నామనైనా వారు గుర్తించి నారుకారు. ఢిల్లీ పాదుషాకు వ్యతిరేకంగా హిందూరాజుల్ని యేకం చేద్దామనే రాజపుత్రవీరుని సాహసకృత్య వర్ణనలతో నవలమొదటి ప్రకరణం ఆరంభమౌతుంది. దౌలతాబాదు రాజదూతగా అతిముఖ్యమైన రాజకీయవార్తను పట్టుకుని ఉదయపూరునకు బయలుదేరుతాడు. ఆగ్రాకు సమీపంలో వున్న తన ముసలితండ్రినీ, తన కూతురును చూసివెడదామని కూడ సంకల్పిస్తాడు. దౌలతాబాదునకు ఉదయపూరు ఉత్తరాన వున్నది. ఆగ్రా మరివొక వందమైళ్ళ దూరాన యీశాన్య మూలను వున్నది. కొద్దిగా వివేకమున్నవా డెవడైనా ముందు తనకు అప్పగించిన రాచకార్యం ఉదయపూరులో పూర్తిచేసుకుని అటుపిమ్మట ఆగ్రావైపుకు బయలుదేరతాడు. కాని యీ రాజపుత్రుడు ఉదయపూరుకు వెళ్ళకుండా దాన్ని దాటి ఆగ్రావైపుకు దారితీస్తాడు. దారితీసి ఉన్మత్తునిలాగ ఆగ్రా దాటి దారి తప్పుతాడు. యిద్దరు పెద్ద రాక్షసుల వంటి మనుష్యులు యెదురయితే వారిని చూసీచూడగానే మూర్ఛపోతాడు. యింత పిరికితనం రాజపుత్రుడైన వీరుడని పేర్కొన్న యితనికి అంటగట్టడం యేమి సమంజసమో అవగాహన కావడంలేదు. అతను రాజపుత్రసైనికుడు. వెడుతున్నదా రాచకార్యం నిర్వహించడంకోసం. దూరమాహెచ్చు. ఐనా అతనిచెంత వొక ఖడ్గమైనా వుండదు! రాజపుత్రవీరుడు తనతో తీసుకువెడుతున్న రహస్యపత్రాలను శత్రువులుచేత చిక్కించుకోగలిగారనే విషయాన్ని చెప్పడంకోసం యిలాటి అసందర్భసన్నివేశాలను నవలా రచయిత సృష్టించాడు. నవలలో తరువాత యీ రాజపుత్రుడు సన్యాసివేషంలో ఉదయపూరువద్ద ప్రత్యక్షమౌతాడు. ఈ సన్యాసికి దేశభక్తి చెప్పలేనంత. కొన్ని వందలమంది గూఢచారులు యితని చెప్పుచేతలలో మెలుగుతూ వుంటారు. పరిస్థితులను తన అదుపాజ్ఞలలో పెట్టుకోగల సమర్థతగల యంత్రాంగాన్ని కలిగివుంటాడు. టయిలర్ ... లోంచి బంకించంద్రుడు ఈ రాజకీయ ఆచార్యులను ఎరువుతెచ్చుకుని తన నవలలో చిత్రీకరించాడు. సన్యాసుల వేషంలోవున్న రాజకీయజ్ఞులను బంకిం పాశ్చాత్యపద్ధతులలో చిత్రించాడు.

బంకించంద్రుణ్ణి అనుకరించడం తెలుగునవలా రచయితలకొక అంటువ్యాధి అయింది. దేశభక్తిని ప్రదర్శిస్తూ యతి వేషంలో వున్న రాజకీయపురుషపాత్రలేని చారిత్రకనవల ఒక్కటికూడా కనిపించదు.

బహుమతిపొందిన "విజయనగరసామ్రాజ్యము" యిటు వంటి యోగి పశ్చాత్తాపంతోనే ప్రారంభమవుతుంది.

వ్రాయబడ్డ ప్రచురింపబడ్డ చారిత్రక నవలలో "ఆంధ్రుల చరిత్ర" కొంత మెరుగైనది. స్వతంత్రమైన పరిశోధనలను చేసి దీనిని వ్రాశారు. అయితే యిదీ వొట్టి రాజవంశావళిని యేకరువుపెట్టి ఆసక్తిని కలిగించదు. రాజులు మతసంస్థలకు ఎంతెంత ధనమిచ్చిందీ, యే యే దానధర్మాలను చేసిందీ, యీ పుస్తకమంతా వర్ణింపబడింది. కులాలనుగురించి స్పష్టంగా ఎటూ తేలని వివాదగ్రస్త విషయాలను ఈ గ్రంథం వివరిస్తుంది.

ఇప్పుడు మరొక విషయాన్ని గుర్తుకుతెస్తాను. యింపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో మాతృభాషల విద్యాబోధనం మీద వొకతీర్మానాన్ని శ్రీ రామారాయణంగారు ప్రతిపాదించారు. ఆ తీర్మానంపై ప్రసంగిస్తూ శ్రీ సురేంద్రనాథ్ బెనర్జీ యిలా అన్నాడు. "భారతీయ భాషలలోనికి బెంగాలీ అభివృద్ధి అయిన భాష అయినప్పటికీ గణిత భూగోళశాస్త్రాలను చక్కగా తెలియపరిచే సరియైన పుస్తకాలు ప్రస్తుతం మృగ్యం"

ఇదే అభిప్రాయాన్ని కొన్నేళ్ళక్రితం వంగీయసాహిత్య పరిషత్తు విచారణకమిటీముందు అనేక విద్యావేత్తలు వెలిబుచ్చారు.

బెంగాలీభాషకంటె తెలుగుభాష స్థితి మరీ అధ్వాన్నంగా వుందని వేరే మనం చెప్పనక్కరలేదు.

యింటర్మీడియటు విద్యార్థులకు ఆరువందలపుటలు వచనమైనా చదవడానికి విద్యాలయాల్లో పెట్టాలని శ్రీ రెడ్డిగారంటున్నారుగాని యిది అతి భారమైనదని నా అభిప్రాయం. ఈ మధ్యనే యింటర్మీడియటు విద్యార్థులకు నాన్డిటైల్డుస్టడీ పేరుతో కొన్ని పుస్తకాలను వేశారు. యివి తప్పనిసరిగా చదవాలని వొక నియమం విధించారు. దానికితోడు యీ ఆరువందల పుటల వచనం పెడితే పిల్లవాళ్ళు గుక్కతిప్పుకుందుకు కూడా వీలుండదు. నాన్డిటైల్డుస్టడీ అనే పదంలోనే శ్రమయేమీ లేకుండా చదువుకు పోవచ్చుననే అర్థంవుంది, కాని తెలుగుకు మాత్రం. అర్థం అన్వయించదు. ఏమీ అంటే వీటి పేరున తెలుగులో పెట్టిన గ్రంధాలు కొరక రాని కొయ్యలు చదవాలంటే అంతా శ్రమే. ఈ పేరుతో పెట్టిన పుస్తకాలలోని భాష రెండురకాలుగా వుంది. ప్రాచీన గ్రాంథికం ; ఆధునికమనే పేరుతో వ్రాసిన నేటి గ్రాంథిక. వ్యాసాలు వ్రాసే విద్యార్థులు ప్రత్యేకంగా ప్రాచీన వ్యాకరణాలమీద కృషిచేయవలసి వస్తున్నది. ఈ పేరుతో యింటర్మీడియట్ విద్యార్థులు పుచ్చుకుంటున్న "మోతాదు" చాలునని నా అభిప్రాయం. నేను యిదివరకు చెప్పిన ప్రాచీన మిశ్రమకావ్యాలను యింటరు విద్యార్థులకు వేస్తే చాలును. అంతకు మించి వారిని గ్రాంధికభాషా మోతాదు విద్యార్థులను పుచ్చుకోమనడం మంచిదికాదు.

ఇప్పుడు తెలుగు విద్యార్థికి కావలసినవి యివి : కావ్యభాషను శైలిని సశాస్త్రీయ పద్ధతులమీద పరిశీలించడం; ఆధునిక వచనరచనను గురించి చక్కగా తెలుసుకోవడం; సాహిత్యాన్ని విమర్శనాత్మకదృష్టితో అధ్యయనంచేయడం. వీటివలన విద్యార్థులకు సారస్వతాభిలాష హెచ్చుతుంది. ఆధునిక వచనం తెలుగు విద్యార్థుల మనోవికాసానికి ఉపకరించడం లేదు.

తెలుగులో సొగసైన ఉత్తమవచన రచనలు వెలువడే వరకూ యిప్పటివచన గ్రంథాలను చదవమని బి.ఏ. తరగతుల వారిని యిబ్బందిపెట్టక పోవడమే మంచిది. మంచివచన పుస్తకాలు వచ్చేవరకూ కాస్తఆగితే మనకొంపేమీ ములిగిపోదు !

# మద్రాసు కాంగ్రెసు మహాసభ

ఈ సంవత్సరం మద్రాసుకాంగ్రెసురుతువు వేడుకలతో చూడతగ్గ దృశ్యాలతో నిండిపోయింది. ఆర్గస్‌కున్నట్లు నాకూ అన్నోటికళ్ళు వున్నవనే అనుకుందాం. పురుకూసకున్న కాళ్ళు నాకూ వున్నాయనే తలుద్దాం. అయినాసరే నేనీ కాంగ్రెసు వేడుక దృశ్యాల్లో సగం వాటినైనా చూడలేకపోయేవాణ్ణి.

మొట్టమొదటి నేను చూసిన ప్రదర్శనం భారతజాతీయ కాంగ్రెస్సేనని వేరేచెప్పనక్కర్లేదు. ప్రదర్శనగాయిది నాకు ఆశాభంగమే కలిగించిందని చెప్పక తప్పదు. మనం పదిరూపాయల రుసుం చెల్లిస్తిమా వెంటనే మనల్ని బెల్టుతోవున్న వొకవలంటీరు 'జె' అనే బ్లాకుకు తీసుకువెడతాడు. యింత కంటె యీ వలంటీరు మరేమీచేయడు. మనం యే భోగట్టా అడిగినా మూతి బిడాయించుకుంటాడు. నాకొక వలంటీరుతో చిన్న చర్చపడింది :

"మిస్టర్ వలంటీర్ ! ఆహఁ! మాటవరసరకే అనుకుందాం. మరి యీ టిక్కట్టుమీద 'జె' అనే అక్షరంవుందికదా; దీన్ని దాని పక్కనేవున్న అక్షరం 'K' గానో లేదా 'I' గానో మనం మార్చేస్తేనో?"

"అక్షరాలు యెన్నటికీ మారవు !" ఈ విషయం తనకెంతో సూక్ష్మంగా తెలుసున్నట్టే చెప్పేడు వలంటీరు.

"అంటే దబ్బున అనేయకు అక్షరాలు మారుతూంటాయి. అందులోనూ గ్రామరులో"

"గ్రామరూలేదు గ్రీమరూలేదు యిక్కడ ; కాంగ్రెసు 'చరిత్రను' నిర్మిస్తోంది."

అతనీ మీట అనేసరికి నాకు నోరుమూతపడింది. అతని మనోగతమైన యీ ఆలోచన, యీ వాక్యం, నిజమేనా అనే సంశయం పుట్టింది. చరిత్రను నిర్మించడమనే ప్రయత్నం కాంగ్రెసు యెప్పుడైనా చేసిందీ అంటే అది వొకేవొకసారి ; సూరత్‌లో శ్రీ బాలగంగాధరతిలక్ కుర్చీలను గాలిలో యెగిరేటట్టు చేసినపుడు !

భూమికి అవతలప్రక్క యేముందో మనం చూడనట్టు, బ్లాకు'జె'లో కూచుంటే యేదీ మనకు కనపడదు. ప్రదర్శనాన్ని చక్కగా చూడాలంటే ఆహ్వానసంఘ సభ్యత్వం యెలాగో వోలాగ సంపాదించడంమంచిది. కాదూ, కష్టమేకాని, మరి వీలుంటూవుంటే మనం ఆడవాళ్ళలాగ మారిపోవడం మరీ మంచిది. యిందులో నీకేదిష్టమైతే అది చేస్తేచేయ్ ; కాని, నీ పుణ్యమాయెను, బ్లాకు 'జె'లో మాత్రం అడుగుపెట్టకు. టిక్కట్టువృధా. వొకళ్ళకివ్వడానికి

చీల్లేదు. కనుక మక్కువమక్కువగా వింటానైనా వింటుకోవాలి బ్లాకు 'జె' లోకి మాత్రం ప్రవేశించకు. దబ్బాదండుగయిందని విచారించకు. ఏమంటే యాదేశ్శానైనా నీదబ్బు వొకళ్ళకి దానం జేశావు. లోకోపకారివయ్యావు.

బ్లాకు 'జె'లో నువ్వు కూచొనిచూస్తే సభలో నీకు కనిపించేదేదీలేదు; వినిపించే దంతకన్నాలేదు, పక్కవీధుల్లో పోతున్న బండ్లమనేవాళ్ళవ్వనితప్ప ! చెప్పొద్దూ, నాకుకోపం లావయింది. వలంటీరు ఎవరైనా కనిపిస్తే నాలుగూ అడిగేద్దామనుకున్నాను. అయితే వొకటి. అతను మాత్రం యిందాకటి వలంటీరంత జట్టీకోరు కాకుండావుంటేనే. అంతజట్టీకోరయితే నేనడిగేదిలేదు.

వలంటీరుకోసం అటుయిటూ చూస్తేదా బ్లాకు మొదట అతను కూర్చునేకుర్చీ కాళీగా వుంది. కాస్సేపుపోయాక మళ్ళీచూశాను ; యింకా కాళీగానేవుంది యింక అదెప్పుడూ కాళీవే ! పక్కబ్లాకులోనూ యింతే. వలంటీరుండాలికదా యిక్కడ. యేమయినట్టు? కొంచెంసేపు పోయాక లేడీసు బ్లాకువద్ద వలంటీర్లు అదావుడిగ అటుయిటూ తిరుగుతున్నారు కుర్చీలూ బెంచీలు సర్దుతున్నారు !

బహుశా పాదుం పట్టుకోసం కాబోలును, వొక వలంటీరు నన్ను తోసుకుని పోతుంటే అడ్డేశాను. "చూడండీటూ; అహా మాటవరసకే అంటున్నాను, నన్ను ఆహ్వాన సంఘంలో పారేస్తేనో అని ?" ఆహ్వానసంఘం సభావేదికకు వొక భాగమంతా ఆక్రమించుకుని కూర్చుంది. నా ప్రశ్నకు వలంటీరు నోరు తెరచి ఆశ్చర్యం వెళ్ళబుచ్చాడు.

"అది నావల్ల కాదు!"

"ఎందుకాదూ ! మీరు తలుచుకుంటే ?"

"అహా"

"అక్కడ కూచుని వాళ్లంతా యేమిటి చేస్తున్నట్టు? నాక్కాస్త చెబుదురూ!" చిన్న రంధీ ఆరంభించాను.

"యేం చేస్తున్నారా? వచ్చేవాళ్ళని ఆహ్వానిస్తున్నారనుకుంటాను."

"భేషైనమాట. సరిగ్గా మీరు చెప్పిందే వాళ్ళు చేయడంలేదు. రింగురంగాని రీవిజీ వేసుకుని కూచున్నారు. ఒక్కరుదుంలాటి రూపాయలు వొకటా రెండా .... యిచ్చు కున్నాను. వొక్కరూ వచ్చి నన్ను రిసీవ్ చేసుకోందే ! మీరేం మాట్లాడరేం ? బాబ్బాబూ .... వాళ్లని బ్లాకు 'జె' కి వెళ్ళమని పంపు. యిపుడొచ్చేవాళ్ళని రిసీవు చేసుకుందుకు అదే తగిన బ్లాకు."

"నా కిదంతా గొడవగొడవగా వుంది సార్ ! నన్ను మీరు అన్యాయంగా చట్టవ్యతిరేకంగా అడ్డగిస్తున్నారే! అవతలకి పోనీయండి నన్ను" కాంగ్రెసు ప్రెసిడెంటు దగ్గర నుంచి వలంటీరుదాకా, వీళ్ళల్లో చాలామంది చట్టానికి విధేయులని సూటిగా నాకు బోధపడిపోయింది. సరేనని వలంటీరును వెళ్ళిపోనిచ్చాను.

సభావేదికమీద యెవరో నించున్నట్టు పించింది. కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. "ఆయనే కృష్ణస్వామిరావుగారంటే" అనే గుసగుసలు వినవచ్చాయి. నా సంతోషానికంతులేదు. వ్రాసుకున్న కాగితాల్ని చేత్తోపట్టుకుని అదేపనిగా ఆయన వొక్కొక్కటీ తిప్పుకుపోతున్నాడు. వొక్కొక్క పేజీ అయిదేసి నిమిషాలు - నాకు కనిపించినదల్లా యింతే ! అప్పుడప్పుడు వొక్కొక్క అక్షరం యేకాకిగావచ్చి నా చెవిదగ్గర వాలడం కద్దు. ఆయన ఉపన్యాసంలో పోనీ వొక్కొక్క అక్షరమే ; వింటున్నప్పుడల్లా 'శభాష' ందామని మనసుపుట్టింది. అయితే నా కొకటే భయం. 'శభాష్ శభాష'ని అరిచానా, స్త్రీల బ్లాకు దగ్గరున్న వలంటీర్లపనీ చెరిపినవాణ్ణీ అవుతాను ; వేదికమీద

కునుకుపాట్లుపడుతున్న ఆహ్వానసంఘ సభ్యులనిద్రచెరిపినవాణ్ణిఔతాను. పోనీ ఏమీ కనిపించకపోతే మానె, నిద్రయినా వస్తుందా అంటే నకాకదీ రావడంలేదు! ఊసుపోక బ్లాకులో వున్నవాళ్ళం కబుర్లు చెప్పుకుంటున్నాం. గంభీరమైన అధ్యక్షోపన్యాసం కూడా మాకు వినిపించి మా సంభాషణకి అంతరాయం కలిగించదలుచుకోలేదు. మధ్యమధ్య కరతాళధ్వనులు మాత్రమే మా దృష్టికంతరాయం. మాట్లాడినవారిలో వొక్క ఉపన్యాసకుడుమాత్రమే ధాటీగా ఉపన్యసించాడు. ఇంత ధాటీగా ఉపన్యసించడనే కాబోలును ; ఆయన్ని అంతా "మధోల్కర్" అన్నారు. ఇంతకుమించి మాకేవీఁ వినిపిస్తే మీరు వేసినవొట్టు. మిగిలినదంతా నిశ్శబ్దం. కవిహృదయాన్ని పరవశంచేసే, మౌనిని మైమరిపించేటంతటి నిశ్శబ్దం. ఈ నిశ్శబ్దంలో అధ్యక్షుని ఉపన్యాసం దూరానపారే సెలయేరులాగ వినిపించేది. వినిపించడమంటే ఉపన్యాసంలోని మాటలుకాదు ; గౌణగౌణ ధ్వని !

నాటి సమావేశం ముగిసేసమయానకు మా సంభాషణ రసకందాయంలో పడింది. బ్లాకు 'జె'లో మనం యింతసేపూ కూర్చున్నందుకు రేపట్నుంచైనా ప్రత్యేక రుసుం మనమే వాళ్ళ దగ్గర్నుంచి వసూలు చేసుకోవలసుంటుందని నేను ప్రతిపాదించాను. అందరూ యిళ్ళకు వెళ్ళిపోతున్నారు. స్త్రీలనందరినీ కాస్తదూరం సాగపంపి అంతా వెళ్ళింతరవాత వలంటీర్లు "ఫైల్లో" నుంచున్నారు. నేనొక వలంటీరును మెల్లగా సమీపించాను. ఇతను అందర్లోకీ దాబుగా కనిపిస్తున్నాడు. తానొక పెద్దలాగ వ్యవహరిస్తున్నాడు. ముఖ్యుల్లాగ అవుపిస్తున్నాడు. ఆయన్ని నాసందేహ నివృత్తికోసం యిలా అడిగాను; "ఈవ్యవహారమంతా మీచేతులమీదే నడుస్తోందనుకుంటాను."

"నో, నో"

"సరే ; అయితే దీన్ని నడుపుతున్నవాళ్ళెవరో వారికి యీ చీటి యివ్వండి" "ప్రదర్శనా వ్యవహారంలో ఆరితేరిన వొక స్నేహితుడి సూచనలు" అని వ్రాశి ఆయన చేతిలో వొక కాగితం వుంచాను.

"ఎవరయ్యా ఈ 'డీ' అంటే, నువ్వా నేనా ? అసలు మీ రెవరు?"

"నేనా ? నేను అమితమైన మితవాదిని. మితమైన తీవ్రవాదిని."

నే నంటున్న మాటలు ఆయన అర్థం చేసుకోలేదు.

ఇక యెవరు అర్థం చేసుకుంటారు?

కాంగ్రెసు ప్రదర్శనాన్ని చక్కగా నడిపేందుకు నిపుణుడైన వొక స్నేహితుని సూచనలు :

(అ) ఈ ప్రదర్శనాన్ని యేర్పాటు చేయడంలో మీ ఉద్దేశం. దీన్నొక ప్రహసనంగా లేదా వొక వ్యాపారంగా నిర్వహించాలనా ? దీన్ని మీరు ప్రహసనంగా, నడపదలుచుకుంటే, వోయస్, యిప్పుడున్న యేర్పాట్లు పకడ్బందుగా వున్నాయి. ఉన్నవి సరిపోతాయికానీ అయినా వొక సలహా. పెండాలకు అవతల ప్రేక్షకుల్ని కూర్చోబెట్టి పెండాల్ కప్పుమీద ఆహ్వానసంఘాన్ని హాయిగా కూర్చోమనండి. మరో చోటకంటె వారు అక్కడుంటేనే తాము చేయవలసిన పనిని సక్రమంగా చేయగలుగుతారు.

(ఆ) ప్రహసనంగా కాకుంటే కేవలం దీనిని వ్యాపారసరళితో నడపదలుచుకున్నారా ! యేముందీ, యింతకంటె రుసుములను హెచ్చించండి. తక్కువధరలకు అమ్మకండి. యిది నాసలహా. మొట్టమొదట అధ్యక్షుడితోనే యీ వ్యవహారం ఆరంభించండి, పదివేలకు తక్కువేతే అధ్యక్షుని హోదాకు నామర్దాయే. విహారీబాబు ఆమాత్రం చెల్లించుకోగలరు. పదివేలరూపాయలు యిచ్చుకోగల తాహతువున్నవాడు పదివేలనూ చెల్లించడమంటే అతనికి

దేశంలో ప్రతిష్ఠాహెచ్చుతుంది. ప్రదర్శనానికా, డబ్బువస్తుంది. స్త్రీలకు సభావేదిక ఉచితం. మిగిలిన వారికి పదేసి వేలురుసుము. అలాఅయితే ఆహ్వానసంఘ సభ్యులు వేదికమీద క్రిక్కిరిసలాడరు అధ్యక్షుడికి ఉక్కపోయదు. హాయిగా గాలిపీల్చుకుంటాడు. ఫేను అక్కరలేదు. అప్పుడు ఆహ్వానసంఘసభ్యులు అన్ని అక్షరాలుగల బ్లాకుల్లోనూ సద్దుకుంఆరు. పదవులకు ఉద్యోగాలనుబట్టి టిక్కట్లను తరగతుల వారీగా విడదీయండి. మొదటితరగతి టిక్కట్టు ఏభైరూపాయలు. మూడోతరగతిది యిరవై. దీనికొక్కదమ్మిడీ తగ్గించకండి. ధరపడిపోతుంది. కానీ మీకు పుణ్యముంటుంది. ఆ బ్లాకు "జె" మాత్రంవద్దు జేసేద్దురూ!

(ఇ) సభావేదికమీద చిన్నచిన్న తోలుబొమ్మలాటలాడి ప్రయోజనంలేదు. ఊపిరితిత్తులు బలంగావున్న సురేంద్రనాథ్‌బాబు వంటి ప్రదర్శకులనే ఎన్నికచేసి తమ ఉపన్యాసాలను అనర్గళంగా చదవమనండి. గ్రీకు నాటకాలలో పాత్రధారులు ధరించే మాస్కులను వీరుధరించవచ్చును. (ఈ) స్త్రీలబ్లాకువద్ద వలంటీర్లను గుమిగూడనీయక వెళ్ళిపొమ్మనండి.

మర్నాడు నేను కాంగ్రెసు సభాప్రాంగణంలోనికి అడుగుపెట్టగానే వొక వలంటీరు సరాసరి వచ్చి ఉద్యోగ అధికారంతో "ఆ కాగితము వ్రాసిన 'గ్రంథకర్త'వు నువ్వేనా? అని ప్రశ్నించాడు. యిక నేను కాస్త 'నిఘా'గా వుంటేనే కాని లాభంలేదనుకున్నాను. "జేబులో మీరు కొబ్బరికాయ పెట్టుకొనిరాడం మెచ్చుకోతగ్గ ఐడియా!"

"కొబ్బరికాయా యిదీ ! హఁ ! యిలాటి చిలిపిప్రశ్నలు. అడగడానికి నీకు నోరెలావచ్చిందయ్యా ? ... ప్రోగ్రాం కాయితాల్ని చూసి కొబ్బరికాయంటాడూ ! ఆహాఁయ్ ! కొబ్బరికాయ ! కొబ్బరికాయ !

"అచ్ఛే ! వాతావరణం పసందుగావుందేమో, కొబ్బరి కాయ కొట్టుకొచ్చిందేమో అనుకున్నాను ; ప్రోగ్రాములు మా ప్రేక్షకులకు, సామాన్యులంకదా మరి, అందుబాట్లోలేవు. వేదికమీద జరిగే తమాషాల్ని తలుచుకుని అనందించడమే మా ప్రోగ్రాంలు. ఎంత ఆనందం కావాలంటే అంత సరదాగానూ ఊహించుకోడమే మాపని."

"ఈమాటలకేంగాని .... ఆ మెమో రాశిన గ్రంథకర్తవు నువ్వేనా ?"

"నేనే అనుకుంటా మాటవరసకి ! అయితే జరిగేదేమిటి?"

"ఏమీజరగదు. నాతో నవ్వు రావడమే జరుగుతుంది. మా కెప్టెన్దగ్గిరకి పద !"

ఆయనవెంట బయలుదేరివెళ్లాను. కెప్టెను ఆఫీసులో నిశ్చలంగా యేదో ధ్యానిస్తూ కూచున్నాడు. నామట్టుకు నాకు ఆలోచనన్నా, ధ్యానమన్నా యెంతోప్రేమ. నన్నుచూసి కెప్టెను ఏమీ మాట్టాడకుండానే కూర్చోమని సౌజ్ఞచేశాదు. ఏదో కాగితంతీసి నా ముందరికి విసరిపారేశాడు. తెరిచి చూస్తునుకదా, కాగితంమీద యీ క్రింది 'పేరడీ' కనిపించింది.

"Tell me not in scornful numbers
Congress is an 'empty' show
For though many a delegate slumbers
Seats are 'full' in every row.

Congress is earnest ! Congress is real !
Self - Government is its goal ;
Action said, a high ideal
Is always good for the human soul !

In the Congress field of battle,
In constitutional strife,
Indulge internal rattle,
Never lift a chiar for tife.

Lives of Moderates all remind us
We should wisely keep from crime;
Open sedition only finds us,
Shelter in a far - off clime!

Let us then lie up and Speaking,
Speaking at a furious rate;
Not always some benifit Seeking,
Learn to be loyal and to wait."

దీనికి తెలుగుగీతం :
పాడకోయ్ కవీ ! కాంగ్రెస్ ఒక
భజనసమాజం మాత్రమే అనీ !
ప్రతినిధులంతా నిద్రపోయినా
భవనం క్రిక్కిరిసిన సత్రమే సుమీ !

కాంగ్రెస్ నిత్యం, కాంగ్రెస్ సత్యం !
స్వపరిపాలనం కాంగ్రెస్ గమ్యం !
ఆత్మ అనే దీపం వెలిగేందుకు
ఆదర్శమనే తైలం ముఖ్యం !

కాంగ్రెస్ యుద్ధం - రూల్సు ప్రకారం
కాగితాలతో - నామకార్థకం
అడపాదడపా అంతఃకలహం !
అయితే బిల్‌కుల్ అహింసాత్మకం !

మితవాదులు నేర్పే గుణపాఠం
ఏయే ఎండల కాయా గొడుగులు !
కాదని బరిదిగి తిరగబడేవో
ద్వీపాంతరమే ! లేదిక తిరుగుడు !

కావున జోరుగ కంఠశోషగా
వుపన్యసిస్తూ నుంచుందాం !
అస్తమానమూ లాభంచూడక
రాజభక్తితో పొంచుందాం !

నామానాన నేనీపద్యం చదువుకుంటున్నాను. కెప్టెను చెవిలో వలంటీరు యేదో గుసగుసమంటున్నాడు.

సందేహం లేదు; యేదో పెద్ద రాజ్యాంగవిషయమయ్యే వుంటుంది. ఆ గుసగుస !

పద్యం చదువుకోడం అయింతరవాత అన్నాను కదా, "ఈ పద్యంలో ఆఖరి రెండుపాదాలూ సాటిలేనివండీ! మీ హృదయౌన్నత్యానికీ బుద్ధిబలానికీ, కీర్తి తెచ్చేటట్టుగావున్నాయి. దీనికోసమే కాంగ్రెసువారు పాటుపడాలి."

"నిజం ; నిజం" అంగీకరించాడు కెప్టెను. దీనితో మే మిద్దరం నేస్తులమయిపోయాం. యెంతో మర్యాదా మప్పితంతో కెప్టెను చుట్టలపెట్టె అందించాడు, చెప్పొద్దూ మరి నాకు పొగచుట్టమీదకు మనసుపోయింది. చుట్టయితే తీసుకున్నాను కాని వెంటనే మళ్ళీ దాన్ని చుట్టలపెట్లో పెట్టేశాను.

"అదేమిటదీ ! తీసుకున్న చుట్ట వొదిలిపెట్టేశారు"

"చుట్టలకి మీరేమైనా చార్జీచేస్తారేమోనని పస్తాయించాను."

"అతిధులుకి చార్జీలేదు."

"అతిధులకి లేకపోవచ్చు. చుట్టలలి కుండొచ్చునేమోననీ! మీరుకూడా వో చుట్ట ముట్టించకూడదూ? పదిమందిలోనూ కాలిస్తేనే చుట్టసొగసు!"

"సొగసే కానీ నా కలవాటులేదు."

"అవున్లెండి. మన బ్రామ్మలకి దక్షిణాదివాళ్ళకే అనుకోండి చుట్టపొగ కిట్టదు."

"అయితే మరి, నన్నెలా కాల్చమంటున్నారు మీరు?" చుట్ట కాల్చేవాళ్ళంతా పిచ్చివాళ్లన్నట్లు కెప్టెను నాకేసి చూశాడు.

చుట్టలు దిండిగల్లువి. కమ్మనివి. స్పెన్సురుచుట్ట దొరికితే దాని మజాచూడక విడిచిపెట్ట బుద్ధయిందికాదు. పొగతాగడంలో నా నేర్పరితనమంతా చూపించాలనిపించింది. చాలా అమాయకంగా చూస్తున్న మంచి పసందయిన చుట్ట యెంచుకున్నాను. తీసి బల్లమీద కెప్టెనుకు దగ్గరగా జేరబడ్డాను. అతనికేదో గొప్ప సలహాయిస్తున్నట్టు యెంతో హుందాగా నుంచుని చుట్ట వెలిగించాను : "వీరులైన నేస్తులారా ! పరిపాలనే మీకు చేద్దామని వుంటే పొగతాగడం ఆరంభించండి. తూర్పుదేశాల్ని పరిపాలించిన యేదేశం పొగతాగకుండా పాలించింది? తమ వుచ్ఛదశలో ముసల్మానులు హుక్కాపీల్చేవారు. యిప్పుడింగిలీషులు చుట్ట కాలుస్తున్నారు. చుట్ట ఘాటుగావుంటే, సిగరెట్టు మొదలెట్టండి" నా సీటులో నేను చతికిలబడి మళ్ళీ ఆరంభించాను. "కాంగ్రెసు సభా ప్రాంగణం పొగతో చూడ ముచ్చటగా వుంది. చుట్టపొగ సున్నాలుగా తిరుగుతూ వేదకాలంలో ఆర్యుల యజ్ఞధూమంలాగ స్వర్గం వంక ప్రయాణంచేస్తోంది. ఈ పొగచూస్తుంటే వేదకాలంనాటి ఋషులు జ్ఞాపకమొస్తున్నారు. చరిత్ర పునరావృతమౌతోంది. లెండి ... యిందాకటిపద్యం బహుసొగసుగావుందే! నామిత్రుడు లాంగ్ ఫెలర్ పద్యాలు దీనికి బలాదూరు,"

ఆయనేమన్నా తీవ్రవాదా?"

"కాదు. తనకాలంలో ఆయన తగుమాత్రం పేర్ల కొచ్చాడంతే. అయితేమితవాదినీ తీవ్రవాదినీ దేన్ని బట్టి పోల్చుకోవడమో చెబుతారూ?"

"నాకీభేదాలేమిటో దేన్నిబట్టి చెబుతారో తెలియదండోయ్!"

"మర్మంవిడిచి మనసులోవున్నమాట చెప్పినందుకు సంతోషం. సోల్జర్లా మాట్లాడేరు ! మీ మనుష్యుల్ని బాల్కన్ల కెందుకు పంపించకూడదూ? అక్కడ అన్ని అవకాశాలున్నాయికదా!"

"ఆయుధచట్టం అమల్లోవుందికదూ!"

"ఆయుధాలకు బదులు కొబ్బరిబొండాలు తీసుకెడితే సరి కొబ్బరికాయలకు మనదేశం ప్రసిద్ధి"

"నీవరసచూస్తే డిటెక్టివ్‌లా వున్నావే! కాదూ మరి పిచ్చివాడివో ! ఎవరివయితేనేం హజనరల్ దగ్గర కోసారిరా" కూచున్న చోట్నించి గభాలునలేచి కెప్టెనుకోపంగానే అన్నాడు. అంటేనేమి, నాకతనిచ్చిన కితాబుకు నాకే సంతోషంగా వుంది. అయిదునిమిషాలు పోయాక జనరలు రానే వచ్చాడు. మనిషి సరసత తెలిసినవాళ్ళాగే వున్నాడు. ఠీవిగా హుందాగా వుందినడక. ముఖంలో ఔదార్యం వుట్టిపడుతోంది. ఆప్యాయంగా కరస్పర్శచేసి యిలా అన్నాడు. "మీరు స్నేహపూర్వకంగా పంపిన సలహాలందాయి. మీ సలహాలకెప్పుడూ స్వాగతమే ! మీరొక భావుకులు. మాకింకా యిలాటి 'భావుకులు మరోపదిమందుంటే బావుణ్ణు .... అబ్బబ్బ ! చచ్చిపోతున్నానంటే నమ్మండి ; యీ మహాసభావ్యవహారాలు వొకంతకి తెమలవ్, మీరే దీనికి అజమాయిషీ చేయండి. నాకంటే మీరేనయం. బాగానిర్వహిస్తారు. తీసుకోండిక, అంతా వొదిలిపెట్టేస్తాను మీమీద .... లోటుపాట్లు యేం జరుగుతున్నాయో నాకుతెలియదనా మీ ఊహ! అన్నీ తెలుసు. అందుకే మీరే యీ భారం వహించండి. అలసిపోయిన చిన్నపిల్లవాడిలా చూస్తూకూచుంటాను."

కెప్టెను ఈ మాటలకి విస్తుపోయాడు. నేను నిర్విణ్ణుడనయాను. నిరాయుధుణ్ణయిపోయాను. జనరల్ అంటే నాకెంతో గౌరవం కలగజొచ్చింది. "మనుష్యులంటే నిజంగా మీరే. దేశ ప్రజల్ని ఉద్ధరించేందుకు మీరు పడుతున్న శ్రమ యెవరు హర్షించకుండా వుండగలరు? బ్రహ్మాండమైన క్రేన్ వున్నదీ అంటే అది ఘనపదార్థాలనే మీదకు యెత్తగలుగుతుంది. అటుయిటూ చల్లిన కుప్పగా పోయని యిసకను యెత్తలేదుకదా !

మహత్తరమైన మీ నేషనల్ ఎసెంబ్లీనుంచి ప్రదర్శనమనే కార్యక్రమం తొలగించివేశారా డబ్బుకుడబ్బూ మిగుల్తుంది శ్రమా తగ్గుతుంది. ప్రతినిధులు యెందుకలాగ సభలో నిద్రపోతూ గుర్రులు తీస్తారు? విచిత్రాన్ని చూద్దామని వచ్చేవారినీ, సభ వొదిలి యిళ్ళకుపోగానే పోలార్ భల్లూకల్లా "రాజకీయ సుషుప్తి"లో మునిగిపోయేవారినీ ప్రతినిధులుగా చేర్చుకోకండి. అలాంటివాళ్ళకు జిల్లా సభలు రాజకీయ సమావేశాలూ చాలును. అవి వాళ్ళ ఉత్సాహాన్ని తీరుస్తాయి. కావలసిన రాజకీయ విద్యను బోధిస్తాయి. యింత పటాటోపం లేకుండా చిన్నదైతేనేం కాంగ్రెసును, పకడ్బుంద్‌గానే వుండనీయండి. భారతదేశ నగరాల్లో వున్న యే పబ్లిక్‌హాలులోనైనా సభలు జరుపుకోవచ్చును. అలా అయితే ఖర్చులు బాగాతగ్గుతాయి. అవసరమైనవాళ్ళనందర్నీ ఆహ్వానించే శ్రమ తప్పుతుంది. మద్రాసునుంచి నాలుగువందల మంది, యితర రాష్ట్రాలనుండి రెండువందలకు పైగా ప్రతినిధులు వస్తే చాలును. మీ విషయనిర్ణయ సంఘసభ్యులకు సంఖ్య మరి మూడు నాలుగు రెట్లు పెంచండి. కాంగ్రెసు సమావేశానికి ప్రస్తుతం యీ సంఖ్య చాలుననుకుంటాను. జాతీయ వాదులనీ, తీవ్రవాదులనీ మితవాదులనీ పేర్లుపెట్టి వాటివల్ల మోసపోవద్దు. పేర్లుపెట్టు కున్నంత మాత్రాన వొకడు, యేవాదీ కాలేదు. వొకవ్యక్తియేవాదో అనతు చెప్పేకబుర్లను బట్టికాదు మనం నిర్ణయించేది. అతను యేమిటి ఆలోచిస్తున్నాడు యేమిటి చేస్తున్నాడు అనేవాటిపై అతను యేవాదో ఆధారపడివుంటుంది.

మీరు గతరాత్రి జరిగిన "ఆల్ థియిస్టు కాన్ఫరెన్సుకు" రాలేకపోవడం యెంత దురదృష్టకరం ! సభలో శ్రీమతి సరోజని ఉపన్యసించింది. ఆమె ప్రసంగం మంత్రించిన సంగీతంలా వుంది. యిలాంటి వంద కాంగ్రెసు సమావేశాలకంటె ఆవిడ బోధన యెంతో అమూల్యమైనది. హితమైనది. మాట వినపడని బ్రహ్మచెవుడుతో బాధపడుతున్న మద్రాసుకు ఆమె నాగస్వరం పట్టింది. సంగీతం వినిపించింది. పెద్ద పెద్ద పగిడీల వారూ, రాళ్ళుపొదిగిన వజ్రాల తమ్మెట్లుకలవారూ సభలో యెక్కడా కనిపించలేదు. ఆమె పెదవులమీద ఉత్సాహం యువకత్వం తొణకిసలాడాయి. తనదేశ ప్రజల యెదుట ఆమెవొక మహోన్నత ఆదర్శాన్ని వుంచింది. రాజకీయ విముక్తికి యేది వాస్తవికమైన ప్రాతిపదికో, ఆ ఆదర్శాన్ని ఆమె విప్పి చెప్పింది. అదే సోదరత్వమనే ఆదర్శం !

ఆమె ఉపన్యాసం పత్రికలలో సమగ్రంగా అచ్చుకాలేదు. అయితేనేమి, ఆమె ప్రసంగ మొక వేకువ. చేయవలసిన విద్యుక్తధర్మాన్ని తెలిపే కోడికూత. ఆమె తన ప్రసంగంలో కాంగ్రెసును తీవ్రంగానే విమర్శించింది. కాని కాంగ్రెసుకు చీమకుట్టినట్లయినాలేదు!

కాంగ్రెసు సమావేశం ముగియగానే ప్రతినిధుల్లో చాలామంది ఎవరిపనుల్లో వారు, మామూలు జీవితంలోని స్వలాభంతప్ప యిక ఏమీలేని సాధారణ నిత్యకృత్యాల్లోకి ప్రవేశిస్తారు. ఆహ్వానసంఘం వచ్చిన సొమ్మును లెక్కచూసుకుంటుంది.

అయితే యిందుకోసమేనా మనం జీవించి వుండేది?

# ఆంధ్ర సాహిత్య పరిషత్కార్య నిర్వాహక సభ

"ఆంధ్ర సాహిత్య పరిషత్కార్య నిర్వాహక సభ 1915 సం॥ ఫిబ్రవరి నెల 20 వ తేదీ శనివారము నాడు ఉదయము 8 గంటలకు బెజవాడలో సోషలు క్లబ్బులో సమావేశమగును."

నిద్రపోతున్నావా? అనుకున్నాను. కళ్ళు నలుపుకొని, తిరిగి నిదానించి చూశాను. కార్డుమీద అచ్చు అక్షరాలు స్పష్టంగా కనబడ్డాయి. షేక్స్పియర్ అన్నట్లు కలనైనా యెరగని కార్యాలు యెన్నో వున్నాయి. అందులో ఇది వొకటి కావొచ్చును అనుకొన్నాను.

అయితే చెన్నపట్నం రాజధానిలో జరుగుతూ వచ్చిన సభ రెండు వందల యాభయ్ మైళ్ళు ఉత్తరానికి యెలా దేకిరిందని శంక పొడిమింది. కారణం వినాకార్యం వుండబోదు. ఆలోచించిన కొద్దీ కారణాలు శరపరంపరగా స్ఫురించాయి.

1. ఆంధ్ర దేశానికి ఒకప్పుడు బెజవాడ రాజధానిగా వుండేది.
2. (సా) ర్వభౌముడైన కృష్ణరాయలు పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేస్తూ బెజవాడలో కొన్ని దినములు ఉన్నాడు.
3. (హి)యం
4. (త్) సాంగ్ అనే చైనా దేశపు బౌద్ధయాత్రికుడు బెజవాడలో కొన్ని దినములు గడిపాడు.
5. (య)లో నెటాపల్ సెయ్ అనే పరాసు యాత్రికుడు కూడా బెజవాడలో కాలు ఊనాడు.
6. (పరిషత్తు)కు కొంతకాలం సెక్రటరీగా ఉండిన మ.రా.రా. హనుమంతరావు పంతులు గారు బెజవాడలో యిప్పుడు చెయిర్మాన్గా వున్నారు.

యింకా కారణాలు కావాలా? బెజవాడ దగ్గిర యెన్నో రెయిళ్ళు కలుస్తాయి. బెజవాడ చెన్నపట్నానికి విజయనగరానికి మధ్యనుంది.

ఇంద్రకీలాద్రిమీద అర్జునుడు తపస్సు చేశాడు. యుద్ధమల్లుడి శాసనం -

"ఆగు ! ఆగు ! యిన్ని కారణాలు చెబుతున్నావు గాని, ఆంధ్రసాహిత్య పరిషత్తుకు యీ కారణాలకూ సంబంధమేమిటి? ఆంధ్ర వాఙ్మయానికి చక్రవర్తి తిక్కన సోమయాజి గదా? అట్టి తిక్కయజ్వ ఉత్తర రామాయణంలో

'సార కవితాభిరాము గుంటూరి విభుని మంత్రి భాస్కరు మల్లికామహుని దలతు' అన్నాడు. "అంత వాడి ఏలి పాలించిన గుంటూరులోనే యేల సభ జరగకూడదు?" అని ఒక నవ నాగరికుడు అన్నాడు.

"చేసిన దానికల్లా అడ్డు చెప్పడమేనా తెలివికి చిహ్నం? బెజవాడలోనో, ఆకాశంమీదో, యెక్కడో ఒక సభ చేస్తున్నారని సంతోషించరాదా? ఇది చేయకపోతే మీరు చేసేదేమిటి? ఇన్నాళ్ళూ సభ చేయకపోతే చేయగలిగారు? అని సమాధానం చెప్పాను.

మోడ్రన్ పిల్లకాయలకు పెద్దల యెడల ప్రపత్తి తక్కువ. "మహాజనో యేనగతస్స పంథా" అను వా అడుగుజాడల్లో అడుగువేసి నడవరు. ఎంతటి వార్నీ తప్పులు పడతారు. వాళ్ళ కుశంకలకు సమాధానం చెప్పడ యెంతటి వాడికైన ఒకప్పుడు కష్టసాధ్యమవుతుంది. మరి వక బుద్ధిమంతుడు అన్నాడు. బెజవాడలో సభ చేయడ పద్ధతి కాదట. ఏమి అనాలోచితమయిన మాట ! కాంస్టిట్యూషన్‌లో విద్వాంసులైన సెక్రటరీలు చేసే పని దే మూలనైనా యిమడక పోతుందా?

"సరేనయ్యా ! ఇమిడిందనుకుందాం గాని హటాత్తుగా బెజవాడకు దేకించిన వారు రేపు ఉత్తర ధ్రువానికి దేకిస్తారు. చెన్నపట్నంలో సభ చేస్తే అక్కడ నివసించి ఉన్న మెంబర్లు మీటింగుకు రావడానికి వీలు వుంటుంది అక్కడైన మీటింగులకే కొంతమంది అక్కడి వారు రారు. అలాటి స్థితిలో వ్యయ ప్రయాసల మీద బెజవా మీటింగుకు వెళ్ళబోతారా? ఆ చెన్నపట్నంలోనైనా పై జిల్లాల పెద్ద మనుష్యులు వచ్చే రోజుల్లో అనగా లెజిస్లేటి కౌన్సిల్ మొదలయిన మీటింగుల కాలమునకు సామీప్యంలో పరిషత్కార్యనిర్వాహక సభ చేస్తే నలుగురు రావడాని అవకాశం కలుగుతుంది. అదంతా మాని తోచినప్పుడు, తోచిన చోట అవాయిదాసుగా సభలు చేయడమేమిటయ్యా?" అని ఉపన్యసించాడు ఇంకొక బుద్ధిమంతుడు.

కొంచెం ఆలోచించినపై బలవత్తరమైన సమాధానం తోచింది. యెందుకు తోచదూ? మాట్లాడడానికీ పనిచెయ్యడానికి చాలా దూరం. పదిమంది చేరితే మాటలు మెండవుతాయి. పన్లు పాడౌతాయి. కాడొకడు తీస్తే కొమ్మొకడుతీస్తాడు. ఒకడౌనంటే ఒకడు కాదంటాడు. అందులో హిందూ దేశానికి పార్లమెంటరీ గవర్నమెంటు యెంత మాత్రం పనికిరాదు. గనుక పనులన్నవి, ఒకరిద్దరు మీదనే జరుగవలసినది. కడం మెంబర్లందరూ హాయిగా పడుకొని నిద్రపోవచ్చును. పనితో వారికేమీ పనిలేదు.

కారణం లేకనేనా అనుకున్నారు? ఆంధ్ర మహాజన సభకు అంటకుండా సాహిత్య పరిషత్తులు యెలా కాపాడుకు వస్తున్నారో? ఈ జ్ఞానం అప్పుడు నాకు లేక తొలి సంవత్సరం ఆంధ్ర సాహిత్య పరిషత్తుయొక్క సాంవత్సరిక సభ ఆంధ్ర మహాజన సభతోపాటు బాపట్లలో జరుగవలసిందని, యీ సంవత్సరం విశాఖపట్నంలో జరగవలసిందని నొక్కి చెప్పాను. నా మాటగా నా మిత్రులు విని అలా చేసివుంటే ఆంధ్ర మహాజన సభలో వుండే నవ దేశాభిమానులు ధోకాకు సాహిత్య పరిషత్తు మూడు ముక్కలయిపోయి యుండదా?

పోతే నిన్నగాక మొన్ననే ఆంధ్ర మహాజనసభ కూడినది గదా? ఆ స్థలంలోనే పరిషత్కార్య నిర్వాహక సభ యెల చేయతలచేరు?

ఫర్వాలేదు. కృష్ణ వరదలకి దాని వాసన యావత్తూ కొట్టుకపోయింది.

# విద్యా సమస్యలు

కాస్మ పొలిటను క్లబ్బుకు వెళ్ళితిని. క్లబ్బులో మద్రాసు గ్రాద్యుయేట్ల ఎసోసియేషన్ వారొక సమావేశము ఏర్పాటు చేశారు.

దాబామీద జట్టులు జట్టులుగా కూడి వారు కొంతసేపు అటూ ఇటూ కొంత సేపు పచారుచేస్తూ కాలం గడిపిరి. కాఫీ, నారింజ, ద్రాక్ష మొదలైన పానీయాలు సోడాలు త్రాగిరి.

అనంతరం సభ – శ్రీ రంగాచారి తమ ఉపన్యాసమును చదివిరి. ధోరణి యేమీ బాగులేదు. అవసరం ఉన్నా లేకున్నా ప్రతి వాక్యమునూ నొక్కి నొక్కి పలుకుతున్నారు. చెప్పిన అభిప్రాయములలో ప్రాముఖ్యత లేనేలేదు. ఆచరణ యోగ్యతా లేదు ! సభకు అధ్యక్షులు శ్రీ మణి అయ్యరు. నా చెంత శ్రీ సుందరశాస్త్రిగారు కూర్చుని ఉండిరి. రంగాచారిగారు ఉపన్యసిస్తుండగా సందర్భానుసారముగా శాస్త్రిగారు విమర్శిస్తూ రిమార్కులు చేస్తూ ఉండిరి. ఆచారిగారు వెన్లక్‌నూ ఆయన సతీమణిని పొగుడుతూ ప్రసంగిస్తూ వుండగా శాస్త్రిగారు నాతో మెల్లగా యిలా అన్నారు : "మనవాడు సబ్‌జడ్జి కావాలని ప్రయత్నాలు చేస్తున్నాడు."

ఉపన్యాసకుడు ఛాందసత్వాన్ని ఎడాపెడా విమర్శిస్తుంటే ఆయన మళ్ళీ యిలాగున వ్యాఖ్యానించారు : "అదంతా బాగానే వుంది. మరి దీనికి ప్రత్యామ్నాయంగా మన విద్యావంతులయిన యువకులు యేం చేసినట్టు? విద్య అనేది మన యువకులకు తగని గర్వం, నిరంకుశత్వం తెచ్చి పెట్టడం లేదూ?"

ఆయన తరువాత శ్రీ బాలాజీరావుగారు ప్రసంగించారు. రావుగారి ఉపన్యాసములో సబబులకన్న నవ్వించు హెచ్చు. సందర్భశుద్ధి కంటె హాస్యం లావు. ఆ నవ్వుతాల మాటలైనా ఆయనవి కావు. ఎరువు తెచ్చుకున్న మాటలు. ఏదో ఒక నెపంతో పట్టభద్రులను ఆయన దుమ్మెత్తిపోశాడు. పట్టభద్రులకు స్వయం ప్రతిభ లేదట. విషయసేకరణ. పఠనాసక్తి మృగ్యమట. చెన్నపురిలో వున్న పట్టభద్రులకంటె యితర పట్టణాలలో వున్న పట్టభద్రులు మరీ ససవలట ! కాలేజీ చదువులు ముగిసిన తరువాత యింక పుస్తకాల జోలికే పోరు; డిగ్రీ తీసుకున్న పిమ్మట చదువులకు స్వస్తి. అరడజను పుస్తకాలైనా చదవరట: సామాజిక సంస్కరణ గురించి వక్త చాలా చాలా చెప్పినాడు.

ఈయన ప్రసంగానంతరం వొక డిస్ట్రిక్టు మునసబు లేచి నించున్నాడు. విదేశ భాషను అభ్యసించడం యెంత కష్టమో వివరించాడు. కాలేజీలో పనికిరాని విషయాలనే హెచ్చుగా బోధిస్తారు. ఉదాహరణకు మాథమేటిక్స్ వట్టి నిరుపయోగం. ఈయన ప్రసంగంలో సబబూ, సందర్భమూ వున్నాయి కాని, ఒకంతకు తెమిలిందికాదు లేదు."

శ్రీ సుబ్రహ్మణ్యంగారు యిలాగ చెప్పారు : "స్త్రీ విద్య అంటే మీరేమీ పట్టించుకోవడం లేదు. మనము మన కుమారుల చదువుకు మాత్రము బోలెడు డబ్బు వెచ్చిస్తున్నాము; కాని మన కుమార్తెల చదువు నిమిత్తం మనం ఖర్చు చేసేది యేమీ లేనేలేదు."

సుబ్రహ్మణ్యంగారి ప్రసంగమయిన తరువాత మరివొక ఉపన్యాసకుడు లేచాడు; పట్టభద్రులు చేసిన కృషి తనకు ఎంతో సంతృప్తికరంగా వున్నదని ఆయన చెబుతూ, "పట్టభద్రుల కృషి ప్రశంసనీయంగా వుంది; ఇందుకు కీర్తి ప్రతిష్ఠలార్జిస్తున్న పరమేశ్వర పిళ్ళై, కళ్యాణ రామయ్యరు ప్రభృతులే వారి ప్రతిభయే ఉదాహరణ" అని పేర్కొన్నాడు.

అయితే ఈ సమావేశానికొక నిర్దిష్ట కార్యాచరణ కుపయుక్తమయే కార్యక్రమమేమీలేదు. పట్టభద్రులు కనుక వారికొక కర్తవ్యం వుంది కదా. విద్యా విషయక సమస్యలను చర్చించడం పట్టభద్రుల ప్రప్రథమ కర్తవ్యం. నిజంగా ఆలోచిస్తే విద్యా సమస్యలపై యిపుడు మనకు ప్రతిభావంతమైన 'పబ్లిక్ ఒపేనియనే' లేదు. చరిత్రను యెలాగున బోధించాలి మొదలైన విషయాలపై ఎట్టి ఊహ కానరాదు. సాహిత్య కృషి సరేసరి. స్వతంత్ర యోజన 'లేదు లేదు' అని చెప్పడమే కాని ఎందుకు లేదో ఎవరూ చెప్పరు.

మదరాసు నాటకరంగ స్థితి సిగ్గుపడవలసిన పరిస్థితులలో వుంది.

ఇక పాఠశాలలో మాతృభాషలు అధ్వాన్నంగా వున్నవి. వస్తు విన్యాసంలోను, శైలిలోను శిల్పం అనేది హుళక్కి. ఒరిజినాల్టీ లేదు. దారిద్ర్యం, తక్కువ స్థితి; ఉన్నత స్థితికి వచ్చుటకు ప్రయత్నములు అవసరం. గర్వపడుటకు కారణములే కనిపించవు. విద్యా విధానమే దుష్టము; లోప భూయిష్టము. అభిరుచి అన్నదే కలిగించడం లేదు. దీనికి నాయకత్వము వహించు వ్యక్తులు లేకపోవడం దీనికి తోడు ఇంగ్లీషుతో పోటీ.

మైక్రోస్కోపులో పొడగట్టుతున్న విప్లవం, దాని నైతిక స్వభావము.
పట్టభద్రులు సంస్థలను నెలకొల్పుకోవడం లేదు.
మహిళలకు ఇంగ్లీషు విద్యను బోధించడం లేదు.

మెట్రిక్యులేషనుకు పాఠ్యపుస్తకాలు; ఆంగ్లదేశ చరిత్రను, భారతదేశ చరిత్రను బోధించడం.

మెట్రిక్యులేషను క్లాసు.
మోడరన్ ఇండియన్ హిస్టరీ.
యూరపు : ఇంగ్లీషు పీరియడు.

కళాశాలలో సాహిత్య పాఠాలను యింతకంటే మిన్నగా చక్కగా చెప్పవలెను. మాతృభాషలలో ప్రొఫెసరుషిప్పులు. మదరాసు తెలుగు.

ప్రాదేశిక విభేదాలు, వైమనస్యాలు. ఐకమత్యం అవసరం. జాతిభేదం అనేది కూడదు. వీడు ఈ జాతివాడు. ఆ జాతి అనే భావం కూడనిది. విద్యా రంగములో కృషి చేయుటకు, సేవ చేయుటకు కాంపిటీషను యేర్పరచి అర్హులకు స్థానమీయవలెను. ఇంతకంటె జీతం హెచ్చు చేయవలె. ప్రతిభావంతులను ఆహ్వానించుటకు విద్యా సంస్థలలో వారికి యింతకంటె హెచ్చు సదుపాయములు అవకాశములు కలుగజేయవలెను.

ప్రైవేటు మేనేజిమెంటుకు సంస్థలను అప్పగించడమనేది చేయరాని ఒక మహాదోషం; ఇంతకంటె హానికరమైన పని మరివొకటి లేదు. నగరాలలో వున్న పాఠశాలలు కళాశాలలు యెంత అవకతవకగా, బేసబబుగా నిర్వహించబడుతున్నాయో వాటికి అజమాయిషీ వహించే కమిటీలు యెంత అరాచకంగా ప్రవర్తిస్తున్నాయో ఊహించలేం. కమిటీలకు వున్నదల్లా అహంకారం వొకటే. బాగుపడే విధానమేదో వారింకా గ్రహించినట్టు లేదు.

పచ్చయ్యప్ప కాలేజీ ఎందుకంత వెలుగులోకి వస్తున్నదో అర్థం చేసుకోవడం సులభం కాదు.

ఉపాధ్యాయులు ఆదర్శప్రాయులుగా వుండాలి. మహోన్నత శీలము, వ్యక్తిత్వము, గుణసంపద అవసరము. సాహిత్యాభినివేశము కలిగించాలి. ఇప్పుడు బి.ఏ., జనరలు ఇంగ్లీషు వట్టి అరాచకమయం.

మన విశ్వవిద్యాలయాల పరిస్థితి వేరు. ప్రాదేశిక ఇంగ్లీషు యూనివర్సిటీల తీరు వేరు. ప్రాదేశిక విస్తీర్ణము. మెట్రోపాలిటను మనుషులే సెనేటు సభ్యులు. మిగిలినవారికి యేమీ లేదు. ఇతర నగరాలలో వున్న పరిస్థితులు సాధారణంగా యేమీ తెలియదాయెను.

యువకులు కొంతకాలం బ్రహ్మచారులుగా వుండడం అవసరం. ఆ పని ఉపాధ్యాయుల కళాశాలను యిప్పటికంటె మంచి పద్ధతులపై 'నిర్వహించాలి. ఇంగ్లీషులో పట్టభద్రుడైనంత మాత్రాన, అతను యేపనిబడితే ఆపని నెరవేర్చగలడా, ఏ విషయాన్నైనా బోధ చేయగలడా ఏ పరీక్షకయినా సరే అతడు పరీక్షాధికారిగా వుండగలడా?

స్వదేశీయులకు ఒరిజినాలిటీ లేదని స్వతంత్ర యోచనాశక్తిని కనబరుచుట లేదని చాలామంది పదేపదే అంటున్నారు. అయితే నాదొక ప్రశ్న. ఈ దేశంలో వున్న ఈ ఉపాధ్యాయులు, యేమి స్వతంత్ర యోచనాశక్తిని ప్రదర్శిస్తున్నారు? వీరికి వున్న ఒరిజినాల్టీ యేమి? కేవలం టెక్స్టు బుక్కులను ఎడిటు చేసుకోవడం; మిస్టర్ థాంప్సన్ అందు కాంపొజిషను పేపర్లు (?) తయారు చేసుకోవడం తప్పితే వారు వెలగబెడుతున్నదేమిటో మరి?

భారతీయ విద్యార్థులకు వారు ఎడిట్ చేస్తున్న పాఠ్య పుస్తకాల పద్ధతి యేమిటో నాకేమీ బోధపడడం లేదు అంతా దురవగాహంగా వుంది. వారు చేస్తోన్న పని యేమీలేదు. మాతృభాషలోనూ, నుడికారపు సొంపుతోను కాంపొజిషను పుస్తకాలు రచింపబడాలని మనం ఆశించడం సహజం. ఈ ఆశయం ప్రతివారికీ వుంటుంది. కాని వాటి ప్రసక్తి యిక్కడా అక్కడా కానరాదు కదా!

ఎఫ్.ఎ. క్లాసులో చెప్పే హిస్టరీ సంగతి మరి చెప్పనెక్కరలేదు. భయంకరంగా కర్ణకఠోరంగా వినిపించే తప్పుల తడక యింగ్లీషుతో, అంతకంటే ఘోరమైన ఆ చెప్పే పద్ధతితో విసిగెత్తిపోయి కుర్రవాళ్ళు క్లాసులో కూచుండుకే హడలెత్తుతున్నారు.

కొందరకి తాము చెప్పే విషయమేమిటో బాగానే వచ్చును. విషయం తెలిస్తే లాభం యేముంది? దానిని చక్కగా బోధించవద్దూ? అదే వీరికి కొరత !

(1895 మే 2)

# హండె అనంతపురం చరిత్ర

తెలుగు వచన సాహిత్యంలో, "రాజుల యుద్ధాలు" అన్న మిస్టర్ బ్రౌన్ ప్రచురణకు ప్రముఖస్థానం వుంది. ఇప్పటిదాకా దీన్ని ఏ పండితుడూ పట్టించుకోకపోవడం, గమనించవలసిన విషయం. బ్రిటిష్ పాలన స్థాపనతో వచన సాహిత్యం వస్తున్నదే మరి.

సాహిత్యోత్పత్తి, వ్యాప్తి విషయం చూస్తే, యీ దేశంలో వున్న పరిస్థితులకు, యూరప్ దేశాలలో వున్న పరిస్థితులకూ పెద్ద తేడా వుంది. గ్రంథ కర్తృత్వం, ఇంగ్లాండ్‌లో ఒక వృత్తి; కిట్టుబాటయ్యే వృత్తి; జయప్రదంగా రచన సాగించే గ్రంథకర్త, త్వరత్వరగా రాసే రచయిత విషయంలో. సాహిత్యం నీరస స్థితిలో వున్నందువల్ల, గ్రంథకర్త దానిని జీవనాధారం చేసుకోలేదు. సాధారణంగా పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తినో, లేదా యింకో ఉద్యోగాన్నో జీవనాధారం చేసుకుంటాడు. ఇంగ్లీషు విద్యాభ్యాసం చేసినవారు, ఆధునిక ప్రపంచంలో, బాగా నెగ్గుకొస్తారు. వకీళ్ళు, ప్రభుత్వ కార్యాలయాల్లోని అధికారులు తమ మాతృభాషలో సృజనాత్మక రచనవేపు మొగ్గ చూపరు. ఇంగ్లీషు విద్యలో ఆరితేరినవారు మాతృభాషా సంబంధంవున్న సృజనాత్మక రచనకు సమర్థులై వుండకపోవడం యిందుకు కారణం.

మన కళాశాలల్లోకి దిగుమతి అయిన ఇంగ్లీషు విద్య సాహిత్యకళనో, లేదా సాహిత్య విమర్శనో, తన విద్యార్థుల్లో యింకా ప్రవేశపెట్టలేక పోతూవుంది. ఇంగ్లీషు సారస్వతం పరీక్షల్లో అర్హత సంపాదించడానికి చదవడం జరుగుతూ వుంది; సాహిత్యాభిరుచిని కలిగించడానికి కాదు. వర్తమాన ఆంగ్లసాహిత్య పరిచయం వున్న పట్టభద్రుల్ని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చును. విశ్వవిద్యాలయంలోని సగటు ఇంగ్లీషు భాషా విద్యార్థి తన మాతృభాషలో రమ్యంగా రాయాలని ఆశిస్తాడు; ప్రతిభవున్న విద్యార్థి సాహిత్య రంగంలో ప్రవేశించాలని ఆశిస్తాడు. సగటు భారతీయ విద్యార్థి ఇంగ్లీషు బాగా రాయగలనని ఎన్నడూ ఆశించలేదు. తెలివైన విద్యార్థి సైతం ఇంగ్లీషు రచయితల శ్రేణిలో చేరగలనని కలలోకూడా అనుకోలేదు.

భారతదేశంలో సాహిత్య విమర్శ అన్నది లేదు. గడిచిన యిరవయ్యేళ్ళుగా వున్న విమర్శ, పూర్వ కవుల ప్రయోగాల గురించీ వారి పదగుంభనం గురించీ తలమునకలవుతూవుంది.

ఈ పరిస్థితుల్లో సాహిత్య కళ మార్గ దర్శకత్వం కాని, సాహిత్య విమర్శ అజమాయిషీ కాని లేకుండా తెలుగు పత్రికలు మొదలవడమూ, పెరగడమూ జరుగుతూ వుంది. తెలుగు పత్రికల మనుగడ పండితుల చేతుల మీదుగానూ, అరకొరగా ఇంగ్లీషు విద్యాభ్యాసం చేసిన వ్యక్తుల చేతుల మీదుగానూ సాగుతూ వుంది. మహత్తరమైన యూరప్ భాషలలో వున్నట్టుగా - తెలుగులో ఆధునిక పత్రికా రచనను రూపొందించడానికి పూనుకున్న వారికి ఇంగ్లీషు సాహిత్యంతో సన్నిహిత పరిచయం తప్పని సరిగా వుండాలి.

# కవిత్వం శ్రాద్ధ మంత్రం కాదు

ఆరు మాసములై నా వంట్లో అస్వస్థతగా వున్నది  ఇప్పుడు కొంచెం నింపాదిగా ఉంటున్నది  మీ ఉత్తరములకు వెంటనే జవాబు వ్రాయకపోతే మీరు చేస్తున్న ఉద్యమములకు భంగం కలుగబోవునన్న భయముచేత యిందుక్కు వెంటనే జవాబు వ్రాస్తున్నాను

నే వ్రాసే పద్యములలో మాత్రా గణముల మీద ప్రస్తరించి చూస్తే ఇది నడక అని పోల్చవచ్చును  అయితే అర్థం యివడనప్పుడు కొన్ని అవసరమయ్ని మాత్రలు చేర్చుకోవలెను  అర్థానికి మాత్రలు మీరినప్పుడు మాత్రలు తగ్గించుకోవడము నా నిర్ణయము  ఇది కొంతవరకు ఇంగ్లీషు కవుల పద్ధతి  మన ఛందస్సుకూ యింగ్లీషు ఛందస్సుకూ భేదమున్నది  వృత్తాలలో నియమాన్ని దాటి వొక అక్షరం అటుగాని  యిటుగాని వెళ్ళడానికి వల్ల కాదు  యింగ్లీషులో వొక గణాన్ని కవిత్వం వ్రాస్తూ తెలివైన కవి యితర గణాలను అక్కడ కూడ విశేష నిపుణతతో తగిలిస్తాడు  ఇందువల్ల తూగుకూ వైచిత్రి (Variety) కలుగుతుంది  పద్యాలు సువ్వి పాట లాగ మొహం మొత్తవు  యింగ్లీషు ఛందస్సులో కొంత నియమాతిక్రమణము (Irregularity) వొప్పుకుంటారు  అందులో Ode మొదలయ్ని వృత్తములలో శ్రుతి సుఖం చూసుకొని తోచిన గణాలన్నీ వేస్తారు  ఛందశ్శాస్త్రమంతా శ్రుతి రంజనమునకు సాధన భూతమయ్యిండి గాని శ్రాద్ధ మంత్రము లాగు మారుదలకు వీలులేనిది గాదు  ఇదివరకు మీరు వ్రాస్ని ముత్యాల సరములు అమృతవల్లిలోవి  మార్చుకోవలస్ని అవసరము లేదు

తరచు మీ క్షేమం వ్రాయించగోరుతాను  చిత్తగించవలెను

– గురజాడ వేంకట అప్పారావు

# అపరిశోధిత శాసనం-1

మే 26వ తేదీ సంచికలో పైశీర్షికతో ప్రచురింపబడిన ఒక వ్యాసంలో డి.వి. ప్రకాశరావుగారు తూర్పు చాళుక్యరాజు ఐదవ విష్ణువర్ధనుని (క్రీ.త. 843-844) దానం ఒక దాన్ని గురించి సమాచారం తెలుపమని కోరారు. ఈ దాన శాసనాన్ని డాక్టర్ బుర్గెస్, పండిత నటేశ శాస్త్రి ఆర్కిలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా 4వ సంపుటంలో ప్రచురించారు. ఈ శాసనం "ఇండియన్ ఆంటి క్వరీ" పదమూడో సంపుటంలో డాక్టర్. ఫ్లీట్ ప్రచురణ చేశారు. ఈ శాసనం అచ్చులను 86వ పుటకు ఎదురుగా చూడవచ్చును. ఈ శాసనంలోని దానానికి సంబంధించిన భాగం తెలుగులో వుంది. దీనికి అనువాదాన్ని డాక్టర్ ఫ్లీట్ సంపాదించలేకపోయారు. కారణాలు స్పష్టమే. డాక్టరు ఫ్లీట్ తెలుసుకున్నది తూర్పు చాళుక్య వంశపారంపర్యం గురించి ఆయన రాసిన వ్యాసంలో వుంది. ("ఇండియన్ ఆంటిక్వరీ", సంపుటం 20 పుట 102). ఈ శాసనం గురించి "కృష్ణాపత్రిక"లో నేను రాయబోతోన్న వ్యాసావళిలో వివరించదలచుకున్నాను. బెజవాడలోని యుద్ధమల్లుని శాసనం కాలాన్ని గురించి రెండో వ్యాసం వుంటుంది. అది నన్నయ భట్టు కాలానికి ముందరి దనడానికి సందేహించనక్కరలేదను కుంటాను. "నన్నయ భట్టుకు పూర్వపు ప్రామాణిక తెలుగుభాష" అని చెప్పడంలో ప్రకాశరావుగారి ఉద్దేశమేమిటో నాకు సరిగా అర్థమవడం లేదు. "తెలుగు కావ్య భాష" అని ఆయన ఉద్దేశమా? అదే ఉద్దేశమయినట్టయితే, అది వుండడం తథ్యం. నన్నయ భట్టు రచనలో లేని రూపాలు బెజవాడ యుద్ధమల్లుని శాసనంలో కనిపిస్తాయి. ప్రకాశరావుగారిని గందరగోళంలో పెట్టిన, చాళుక్య శాసనానికి యింకా మనం వెనక్కి వెళ్ళినట్టయితే, అదే విధంగా యిటువంటివీ, యింతకంటె చిన్నవీ అయిన శాసనాలను మనం గమనించినట్టయితే కన్నడ భాషలో వున్నట్టుగానే తెలుగు భాషలోనూ పాత కావ్యభాషలున్నాయని మనం అంగీకరించక తప్పదు. ఈ యథార్థానికి సంబంధించిన నిజమైన ప్రాముఖ్యమేమిటంటే-ప్రథమ కవి లభ్య రచనస్థానం గురించి పండిత చర్చలు కావు - దక్షిణ భారత కావ్యభాష చరిత్రపైనీ, ప్రాచుర్యం పొందగల తెలుగు కావ్యశైలి నిర్మాణ సమస్యపైనీ అది ప్రసరించే వెలుగు.

# అపరిశోధిత శాసనం-2

మీరు ఒకటవ తేదీన ప్రచురించిన నా లేఖలో నన్నయభట్ట అనే పదము 'రామయ్యభట్ట అని పొరపాటున అచ్చుపడింది బట్టరువర్తు నెల్లూరు శాసనముల సంపుటములలోని ఈ దిగువ ఉదాహరించిన వాటిని శ్రీ ప్రకాశరావు గారు చూడవలెనని కోరుతున్నాను

నెల్లూరు శాసనములు · రెండవ సంపుటము

| పుట | ఊరు | సంఖ్య |
|---|---|---|
| 544 | కందుకూరు | 31 32 |
| 606 | | 67 |
| 609 | | 69 |
| 676 | కనిగిరి | 25 |
| 896 | ఒంగోలు | 3 |
| 966 | | 39 |
| 967 | | 40 |

మూడవ సంపుటము

| పుట | ఊరు | సంఖ్య |
|---|---|---|
| 1151 | పొదిలి | 1 |
| 1152 | | 2 |
| 1201 | | 38 |

ఈ శాసనములన్నీ అతి ముఖ్యమైనవి నన్నయ కాలం కంటె ప్రాచీనమైనవి నాటి తెలుగు కావ్య భాషా చరిత్రమును అవగాహన చేసుకుందుకు యివి తోడ్పడతాయి బట్టరువర్తు సంపుటాలలోని శాసనముల ఫోటోలు

సంతృప్తికరంగా లేవు. ఆ శాసనాలకు తిరిగి ఫోటోలను ఎత్తి గవర్నమెంటు శాసన పరిశోధకుడు వ్యాఖ్యానంతోనో, వ్యాఖ్యానం లేకనో చక్కగా ఎఫిగ్రాఫికా ఇండికాలో అచ్చువేయవలసి వుంటుంది.

ఉత్సాహవంతులైన యువ పరిశోధకులను గురించి శ్రీ కృష్ణశాస్త్రిగారు కొన్ని అభిప్రాయాలను వెలిబుచ్చారు. అవి బట్టరువర్తు శాసన సంపుటములకు సైతం వర్తిస్తాయి. అయితే అవి విలువైనవి కావని నా అభిప్రాయం కాదు. పైగా ఆ సంపుటములవల్ల ఎంతో ప్రయోజనం వుందని నా ఉద్దేశం. నమ్రతవల్ల తన పీఠికలో బట్టరువర్తులింత తక్కువ చేసి చెప్పుకొన్నప్పటికీ, అవి అంతకంటె ఉపయోగకరం. పదమూడు శతాబ్దాల భాషా స్థితి. లిపి స్వభావం, దక్షిణ దేశపు అనేక రాజుల చరిత్ర వాటివల్ల మనకు కొంత తెలుస్తుంది. శాసనాల నకళ్ళు అచ్చులో యథాతథంగా అసలు శాసనాలవలె వుంటాయని మనం ఆశించలేం. వాటిని ప్రచురించేటపుడు కొన్ని పొరపాట్లు జరగవచ్చును. కనక ఆశించలేం. వాటిని ప్రచురించేటపుడు కొన్ని పొరపాట్లు జరగవచ్చును. కనక పరిశోధకులు ముఖ్యమైన నిర్ణయాలు చేయవలసి వచ్చినపుడు అసలు శాసనాలపై ఆధారపడవలసి వస్తుంది. రెండవ అమ్మరాజు మల్లియపూడి శాసనాన్ని డాక్టరు హేల్ట్సు పునః పరిశీలించి ప్రచురించాడు. బట్టరువర్తు సంపుటాలకు యివ్వదగిన ప్రాముఖ్యము కంటె అధిక ప్రాముఖ్యం మివ్వకూడదు.

ప్రభుత్వ ఉత్తరువును నేను చూడలేదు. కాని దాన్ని గురించి మీ పత్రికలో శ్రీ యం.కె. నారాయణ అయ్యంగారు కావించిన విమర్శనను చదివాను. శ్రీ వెంకయ్య, కృష్ణశాస్త్రిగారల పట్ల ఆయన వెల్లడించిన అభిప్రాయాలు ఎంతమాత్రం సబబుగా లేవు. ప్రభుత్వ శాఖలో ఉద్యోగులుగా పనిచేస్తున్న శాసన పరిశోధకుల కంటె, ఉత్సాహవంతులైన యువ పరివోధకులకు తెలుగో తమిళమో ఎక్కువ రావచ్చును. కాని ఒక సంగతి మటుకు నిజం. పరిశోధనమే జీవిత ధ్యేయముగా అనేక సంవత్సరాల అనుభవంతో బాధ్యత కలిగిన పండితుల సంపాదకత్వాన ప్రచురితమయే శాసనపు ప్రతులు, ఉత్సాహవంతులైన యువ పరిశోధకుల ప్రచురణలకన్న ఎక్కువ ప్రామాణికం.

మహా పండితులు సైతం పొరపాట్లు చేయకపోలేదు. చరిత్రతో అనుసంధించి చెప్పడానికి తగినన్ని ఆధారాలు దొరకనపుడు, శోధించవలసిన అనేక విషయాలు యింకా మిగిలి వుంటున్నపుడు, పరిశోధనా రంగంలో పొరపాట్లు రాక తప్పవు. దొరికిన శాసనాలను ఆధారాలను బట్టి అప్పటికొక విషయం ప్రామాణికం కావచ్చును. కాని అందుకు భిన్నమైన రుజువులు లభించినపుడు వెనుకటి విషయం అప్రమాణిక మౌతుంది. నూతన ఆధారములనుబట్టి నిశ్చయజ్ఞానాన్ని అన్వయించుకోవలసి వుంటుంది. భారత దేశములో పరిశోధనా రంగమున యిప్పటి పరిస్థితులలో యిట్టివి తప్పవు. మనం యింకా అనేక ప్రధాన విషయాలను పరిశోధించవలసి వుంది. కొన్ని ప్రాచీన తమిళ శబ్దములను శ్రీ వెంకయ్యగారు తప్పుగా అనువదించి వుండవచ్చును. అందులో వైపరీత్యం లేదు. బహుభాషా రాష్ట్రములో శాసన పరిశోధకుడు అనేక చిక్కులు ఎదుర్కొనవలసి వస్తుంది. తమిళ తెలుగు భాషలు ప్రాచీనమైనవి. ఆ భాషల ప్రాచీన కావ్య భాషా పదములు సులభ ద్యోతకములు కావు; ద్రావిడ భాషలను శాస్త్రీయ పద్ధతులపై పరిశీలించి వాటి తత్వమును నిరూపించడం అవసరం. ఇది యూరోపియనులతో ఆరంభమయింది. అయినా నేటికీ మన దేశీయుల కృషి అంతంత మాత్రం. భాషా పరిశోధనా రంగంలో వీటి స్థానం మరుగున పడిపోయింది. దేశీయుల దృష్టి వీటి పైకి అంతగా మళ్ళడం లేదు. ప్రాచీన భాషను, మాండలిక భాషలను పరిశీలించడం ఎంత ఉపయోగమో తెలుగు రచయితలు గుర్తించడం లేదు. దురదృష్టవశాత్తు తెనుగున ఈ కృషికి, సి.పి. బ్రౌను మొదటివాడు; ఆఖరువాడు. తమిళమున అలాగా కాదనుకుంటాను.

శ్రీ వెంకయ్య, కృష్ణశాస్త్రిగారలు శాసన పరిశోధన విషయంలో అవసరం వచ్చినపుడు తెలుగు పండితుల సహాయం తీసుకునేవారు. ఎవరు ఏ సలహాల నిచ్చినా, వాటిని శ్రద్ధగా పరిశీలించేవారు. ఇది నా అనుభవం. కొన్ని శబ్దముల పట్ల పొరపాటు పడినంత మాత్రం చేత, వారు శాసన పరిశోధకులుగా అనర్హులని ఎలా భావించగలమో నాకు అర్థం కావడం లేదు. అంతమాత్రాన వారు నిష్ణాతులు కాకపోరు. నిఘంటువులను తలలోయిముద్దుకొనడము కంటె, అనేక ఉన్నత అర్హతలు ఒకనిని శాసన పరిశోధకునిగా తయారు చేస్తాయి. మన శాసనములను పరిశోధించిన యూరోపియనులకు మన భాషలలో పాండిత్యము తక్కువ. తగు పాటి భాషా పరిజ్ఞానంతో, వ్యాకరణ పరిచయంతో, వారు మన ప్రాచీన శాసనాలను పరిశోధించి అత్యద్భుతమైన సేవ చేశారు.

శాసన పరిశోధక శాఖవారు కావించిన కృషిని అంచనావేస్తూ శ్రీ నారాయణస్వామి అయ్యంగారు వ్రాసిన వాక్యాలు చదివినపుడు నాకే కాదు, ఎవరికైనా నవ్వు వస్తుంది. డాక్టరు హుల్ష్, ఆయన సహాయకులు కావించిన కృషి తక్కువది కాదు. నిజంగా వారికి మనం ఋణపడివున్నాం. పరిశోధక శాఖలో వారు శాస్త్రీయ పద్ధతులను ప్రవేశపెట్టారు. ప్రామాణికమగు స్థాయిని నెలకొల్పారు. దక్షిణ భారత దేశపు ప్రాచీన చరిత్ర పరిశోధనతో పరిచయమున్నవారికి ఈ విషయం తెలుసును. ఊటీలో నేనుప్పుడల్లా, ప్రభుత్వశాఖ కావిస్తున్న కృషిని, ఏళ్ళకు తరబడి పరిశీలించాను. కార్యాలయంలో పనిచేస్తున్న వారు సమర్థులు. అంతకంటె హెచ్చు ఉత్సాహంతో పట్టుదలతో పని చేస్తున్నవారిని నేను చూడలేదు. శ్రీ నారాయణస్వామి అయ్యంగారు కుశాగ్రబుద్ధి కలవారు, పండితులు సందేహం లేదు. కనక శాసన పరిశోధనమనేది ఎంత కష్టమైన పనో, శాసన పరిశోధక రిపోర్టులను తయారుచేసి ముద్రించి ఉన్నతస్థాయిని సాధించడం ఎంత శ్రమో, పరిశోధన ఎంత మేధాశక్తిని హరిస్తుందో శ్రీ అయ్యంగారు ఊహించుకోగలరు. బహుశా తమిళ శాసనములను పరిశోధించడము యింతకంటె తేలిక కానవచ్చును. కాని, తెలుగు శాసనముల పరిశోధనము వేరు అతికష్టమైన తెలుగు శాసనములను శ్రీ కృష్ణశాస్త్రి, వెంకయ్యగారలు పరిశోధించారు. కొన్ని సంవత్సరాల క్రితం, యుద్ధమల్లుని బెజవాడ శాసనాన్ని గొప్ప పండితులనుకునే అనేకులు కొన్ని నెలలపాటు పరిశీలించారు. కాని దాన్ని వారు పోల్చుకోలేక పోయారు. చివరకు శ్రీకృష్ణ శాస్త్రిగారు ఆ శాసనము ఛందోబద్ధముగా వుందని, దానిని దిగువనుండి మీదకు చదువవలెనని పోలికపట్టి నిర్ధారణ చేశారు.

శ్రీ నారాయణస్వామి అయ్యంగారు తన విమర్శనములో మార్షల్ వాక్యాలను కొన్నింటిని ఉదహరించారు. అవి ఈ రాష్ట్రానికి వర్తించవు. శ్రీ వెంకయ్యగారు ప్రతి సంవత్సరం ఆసక్తికరమగు విపులమైన శాసన పరిశోధన రిపోర్టులను వెలువరిస్తున్నపుడు మార్షల్ రిమార్కులతో అసలు పనిలేదు. ఎపిగ్రాఫిస్టుగా ఆఫీసులో రికార్డులను ఎవరినీ చూడనీయడం లేదనడం భావ్యం కాదు. ఏ అర్థములో ఈ మాటను అంటున్నారో నాకు దురవగాహం. వాటిని అర్హతలు వున్న ఏ పరిశోధకుడైనా పరిశీలించడానికి అతి సులువుగ అనుమతిని పొందవచ్చును. పరిశోధన శాఖపట్ల విద్యావంతులు తగిన ఉత్సాహాన్ని కనబరచడం లేదు. దానిని అన్ని విధాల అభివృద్ధి చేయడానికి ప్రభుత్వం వెనకాడుతోంది, ఎక్కువ డబ్బు ఖర్చుచేసి అమూల్యమైన ప్రచురణలను వెలువరించడానికి జంకుతోంది. ఉత్సాహవంతులైన యువ పరిశోధకులకు అందుబాటులో వుండేటందుకు డూప్లికేటు కాపీలను శాసనపు నకళ్ళను మద్రాసు మ్యూజియమ్ములో పదిలపరచవలెనని నా సూచన. అందువల్ల విద్యావంతులకు ఆసక్తి కలుగవచ్చును. ఇపుడు ఈ రంగములో కృషి చేస్తున్న ఉత్సాహవంతులైన యువ పరిశోధకులు తక్కువ. వీరు చేస్తున్న కృషి పరస్పర

సంప్రదింపులవల్ల సమన్వయం చేసుకోవాలి. యువ పరిశోధకులను గురించి శ్రీకృష్ణశాస్త్రిగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు అభ్యంతరకరమైనవని అనుకుందాము. అయినప్పటికీ, ప్రభుత్వశాఖలో పనిచేస్తున్న శాసన పరిశోధకులు అసమర్థులనీ, ఆ శాఖ కావిస్తున్న కృషి అల్పమని మనం అనలేము. నాకు తమిళ భాషాజ్ఞానము తక్కువ. అందువల్ల శ్రీ గోపీనాథరావుగారు నిష్ణాతులో కాదో నేను చెప్పలేను. కాని ఈ విషయం శ్రీకృష్ణశాస్త్రిగారిని అడిగితే, శ్రీ గోపీనాథరావుగారు చాల తెలివైనవారని, అన్ని విషయములు తెలిసినవారని ఆయన సంతోషముతో అంగీకరిస్తారని నా నమ్మకం.

# మృతభాషా? సజీవభాషా?

తెలుగు వ్యావహారిక భాషపైని సాధారణంగా చేయబడే ఫిర్యాదు అది వ్యాకరణబద్ధంగా లేదని దీనిని నిరూపించడానికి రచయితలు ప్రామాణిక గ్రంధకర్తల రచనలనుండి తప్పుగా ఉదహరణలిస్తారు తప్పుగా వ్యాఖ్యానాలు చేస్తారు` వ్యావహారిక తెలుగు వ్యాకరణబద్ధంగా లేనట్టయితే ఆ దోషం వ్యాకరణ వేత్తలది యదార్ధ ప్రకటనలుగా తప్పితే వ్యాకరణ సూత్రాలకు విలువలేదు సాధారణ ప్రయోగంలో వున్నట్టయితే మన్నించవలసి రచనలు వ్యాకరణ విరుద్ధాలు కావు

ప్రాచీన తెలుగుభాష యించుమించుగా ఛాసర్ ఇంగ్లీషు భాష వంటిది ఈ శతాబ్దపు ఇంగ్లీషు రచయిత ఛాసర్ భాషను అవలంబించినట్టుగానే 20 శతాబ్దంలో ప్రాచీన తెలుగు భాషలో రాయడం అసంబద్ధంగా వుంటుంది నిజానికి తెలుగులో మాటాడే భాష రాసే భాష యదార్ధ స్థితిలో రెండు భిన్న భాషలు ఇందువల్ల తెలుగు సారస్వతం పెరుగుదల ఆగిపోయింది భారతీయ విద్యావంతులు తెలుగులో పుస్తకాలు రాయడానికి పూనుకోవడం లేదు మృతభాషకు సజీవ భాషకు మధ్య పోటీ జరుగుతోంది తెలుగు ప్రజలలోని విద్యావంతులు పక్షపాతం లేకుండా సహేతుకంగా వున్నట్టయితే వారు రెండో దానిని స్వీకరించాలి

# భట్టకలంకుడు

భట్టకలంకుడు జైనుడు. కర్ణాటక శబ్దానుశాసనమనే గొప్ప కన్నడ వ్యాకరణం రాశాడు. 1604 సంవత్సరంలో గ్రంథం పూర్తి అయినట్లు కనపడుతుంది.

యీనాటికి నిలిచిన కన్నడ వ్యాకరణములలో మొదటివి, రెండవ నాగవర్మ రాసిన కర్నాటక భాషాభూషణము, కావ్యాలోకములో మొదటి అధికరణమును. రెండవ నాగవర్మ పన్నెండవ శతాబ్ది మధ్య కాలంతో వుండెను. భాషా భూషణము ఆధారంగా చేసుకొని, పదమూడో శతాబ్దంలో, కేశిరాజు శబ్ద మణిదర్పణం అనే వ్యాకరణం వ్రాశాడు.

డాక్టరు బర్నలు శబ్ద మణిదర్పణమును గురించి యిలా రాశినారు : "The great and real merit of Sabdamanidarpana is that it bases the rules on independent research and the usage of writers of repute: in this way it is far ahead of the Tamil and Telugu treatises which are much occupied with vain scholastic disputations."

శబ్ద మణిదర్పణములోని సూత్రాలు ప్రత్యేక స్వతంత్ర పరిశోధన మీదనూ, గొప్ప ప్రాచీన కవుల ప్రయోగాల మీదనూ ఆధారపడి రచింపబడినవి. నిరర్థక పాండిత్య ప్రకర్షమైన వివాదగ్రస్త విషయాలతో నిండిన తెలుగు తమిళ వ్యాకరణాలకంటే శబ్ద మణిదర్పణం ఎంతో మెరుగైనది అని దీని భావం.

భట్టకలంకుల శబ్దానుశాసనమనే గ్రంథాన్ని మైసూరు ప్రభుత్వము వారు 1890వ సంవత్సరములో బెంగుళూరులో అచ్చువేయించినారు. యిప్పుడు ప్రతులు దొరకవు. మైసూరు గవర్నమెంటు లైబ్రరీలో వున్న పుస్తకాన్ని నేను అరువు తెచ్చాను. అది తిరిగీ యిచ్చివెయ్యవలసిన కాలం వచ్చినందున అందులో నుంచి తెలుగు వారికి తెలియతగిన భాగాలు కొన్ని యెత్తి రాస్తున్నాను. ఈ గ్రంథాన్ని గురించి రైసు దొర యిట్లు రాసినారు :

"It is .... not an antique treatise dealing with archaisms and obsolete terms, interesting as a literary monument though of little practical value now, but has the advantage of treating of the whole range of the language down to the modern period and its rules are such as apply to the present time." (preface P.4)

ప్రాచీనమైనవీ యిప్పుడు వాడుకలో లేకుండా నశించినవీ ఆయిన అనేక శబ్దప్రయోగాల సరళిని తెలిపే వ్యాకరణాలు వున్నాయి. ఇవి ప్రస్తుత కాలానకు ఉపయోపడక పోయినప్పటికీ ప్రాచీన భాషా ప్రయోగ సంప్రదాయాలను గ్రహించడానకు ఉపకరిస్తాయి. అయితే శబ్దానుశాసనమనే వ్యాకరణం ప్రాచీనమైనది; కాని ప్రాచీన కాలంనుంచీ ఆధునిక కాలం వరకూ గల భాషార్ణవాన్ని గురించి ప్రస్తావించే అవకాశాన్ని యీ శబ్దానుశాసనం కలిగివున్నది. శబ్దానుశాసనంలోని సూత్రాలను ప్రస్తుత కాలానకు కూడా అనువర్తింపజేసుకోవచ్చును అని పై వాక్యాల తాత్పర్యం.

"Some what curious statements are made in works that have come to hand regarding the constituent parts that combine to form Kannada. Thus the unknown author of Subhashita or Neetikanda an old Jain work, says:

ఒళుగన్నడ బెళుగన్నడ
తెళుగన్నడ అచ్చుగన్నడం సక్కజముం
ఎళగన్నడ హాళగన్నడ
పలెదేశియ కెనెయగుణ్టె కన్నడికిళె యోళ్

"Local (or home) Kannada, white Kannada, clear Kannada, and derivaties from Sanskrit young (or new) Kannada, old Kannada, being combined in the language of the country, is there any equal to Kannada in the world?"

ఏ అంతర్భాషల వలన కన్నడ మేర్పడినదో వాటిని గురించి తెలుసుకోదగ్గ కొన్ని వింత సంగతులు యిప్పుడు మనకు లభించిన గ్రంథాలలో కనిపిస్తున్నవి. సుభాషిత అనే ప్రాచీన జైన గ్రంథకర్త పేరెవరో తెలియదు కాని, ఆయన యిలా వ్రాస్తున్నారు:

"ఒళు, బెళు, తెళు, అచ్చు, ఎళ, హాక... మొదలైన కన్నడములు దేశభాషతో కలిసిపోయినవి. కన్నడ భాషకు సరితూగ గల మరి వొక భాష లోకమున కలదా?" లేదని పైవాక్యముల సారాంశము.

హాళ గన్నడమనగా పాత కన్నడమనీ తెళుగన్నడమనగా తేట అయిన కన్నడమనీ అర్థము.

ఇదే విధముగ యీ శతాబ్ద ఆరంభమున దేవచంద్రునిచే రాయబడిన "రాజావలి కథై" అను గ్రంథమున యిట్లు కలదు. దేవచంద్రుడు జైనుడు.

హాళగన్నడ బెళుగన్నడ
వళగన్నడ పొసతెంబుదుం
తెళుగన్నడ మిశ్రదినిద
నిళెయోళు సత్పురుష రోడి కేళ్వుతు సతతం.

This, in which old kannada, white kannada, local kannada, pure kannada and that called new, are mingled in to clear kannada, may good men in the world ever read and listen to."

పాత కన్నడము ప్రాదేశిక, కొత్త కన్నడాదులు తెలు గన్నడ భాషలో కలిసిపోయినవి. దీనిని లోకములోని మంచి మనుష్యులు సదా చదువుతూ వింటూ వుండెదరుగాక! అని దీని భావము.

హళగన్నడ or హళకన్నడ is the early form of the language, Belu kannada or white kannada, seems to refer to a belief of the Jains, who artribute substances to sound and say that it is white. Thus Kesiraju in his grammer sobdamani darpana has the following:

1. శబ్ద ద్రవ్యం జనియిసుగుం స్వేతం

2. శబ్దం జనియిసుగుం ధవళ వర్ణం అక్షర రూపం

బెళు కన్నడ లేక తెలు కన్నడ అనే దానికి ప్రాచీన రూపం హళ గన్నడము లేదా హళ కన్నడము, శబ్దాన్ని ద్రవ్య రూపముగా జైనులు భావిస్తూ వుండేవారు. మఠి కొంతమంది దానిని అక్షర రూపంగా భావించారు. జైన సంబంధమైన శబ్ద ద్రవ్యం శ్వేతరూపంగా పరిగణింపబడినది. మరివొక చోట జైన సంబంధమైన శబ్దము అక్షర రూపమునూ, ధవళ రూపముగానూ తన శబ్ద మణిదర్పణములో కేశిరాజు పేర్కొన్నాడు. ధవళమంటే స్వేచ్ఛమైనదని అర్థము.

వళగన్నడ లేదా ఓళ దేశ కన్నడ, refers to the world called దేశ్య, the native tongue including local peculiarities and dialects - అచ్చు గన్నడ is the universal term of pure కన్నడ, తెళ్ళు గన్నడ means clear, transparent కన్నడ and from the same root derieved the name Telugu, the other language which has so close an affinity to kannada and wich is written in the same characters."

వళగన్నడము లేదా ఓళదేశ కన్నడమనేది దేశ్యమనే శబ్దానికి చెందుతున్నది. దేశ్యమనగా మాతృభాష. యిందులో మాండలిక భేదాలు భాషలు చేరివున్నవి. శుద్ధ కన్నడమనే దానిని విశాలమైన అర్థంలో అచ్చగన్నడ మందురు. తెలుగన్నడమంటే తేట అయిన కన్నడమని పలుచనిదని సన్ననిదని అర్థం. స్ఫటికమువంటి స్పష్టమైన భాష తెళుగన్నడము. తెలుగన్నడమనే పదమునుంచే, మరివొక భాషా వాచకమైన "తెలుగు" అనే మాట పుట్టినది. కన్నడమునకును తెనుగునకును ఎంతో దగ్గర సంబంధము కలదనీ తెలుగు అక్షరములు వ్రాత కన్నడ లిపిని పోలియుందుననీ రెయిసు దొరగారి వ్యాఖ్యానమునకు అర్థము.

పైది రెయిసు దొరగారి పీఠికలోనిది. ఈ కిందిది గ్రంథారంభ మంగళ శ్లోకము :

"నమశ్రీ వర్ధమానాయ విశ్వ విద్యావభాసినే
సర్వ భాషామయీ భాషాప్రవృత్తాయన్ముఖాంబుజాత్."

యే వస్తువు నుండి అన్ని భాషలకూ సంబంధించినటువంటి భాష కలిగినదో సంపత్తును కలుగజేసేటటువంటిన్నీ అన్ని విద్యల్నీ తెలియజేసేటటువంటిన్నీ ఆ వస్తువుకు ప్రణామములు.

ఈ శ్లోకము పై వ్యాఖ్యానంలోని కొంత భాగమిది. "శబ్దాను శాసనంహి ప్రస్తుతమ్। తత్రచ అనుశాసన విషయ భూతాః శబ్దాః కర్నాటకా ఏవ। తేచ సంస్కృత శబ్ద వత్సకల దేశ ప్రసిద్ధాః సకల శాస్త్రోపయోగితయా సకల మహాజన పరిగ్రాహ్యాశ్చ నభవంతి। భాషా విషయత్వాత్। భాషాయాంచ పామరాణామేవాధి కారోన పండితానామేతి

శాస్యాః ప్రయోగానర్హత్వాదితి। కేషాం చిత్సంస్కృతాగ్రహి గ్రస్తానాం పండితమ్మన్యానామ్ మనసి ప్రఖ్యాతా మన్యథా ఖ్యాతిం ప్రత్యాఖ్యాతిమేత దేవ విశేషణ ముపవర్ణి తవాన్ గ్రంథకారః ఇదమత్రా కూతమ్। యథా సంస్కృత శబ్దాః సాధ్వసాధువివేచన విషయ తయాను శాసనార్హాః తథాభాషాశబ్దా అపి। యది నామీనానుశాశ్యాః కథంతర్హి భగవద్భాషా తన్మయీస్యాత్। నహ్యపశబ్దమయీసా."

శబ్ద మేరీతిగా ఉపయోగింపబడుతున్నదో యిప్పుడు మనం చెప్పుకుందాము. అందులో ముఖ్యంగా యిప్పుడు మనం తెలుసుకోవలసినది కన్నడ శబ్దాలు యేలాగున ప్రయోగింపబడుతున్నవనే విషయం. సంస్కృత శబ్దాలు అందరిచేతా పరిగ్రహింపబడుతున్నట్లు, అన్నిచోట్లా ప్రసిద్ధమైనట్లు, అన్ని శాస్త్రాలకు సమన్వయించినట్లు కన్నడ శబ్దాలు పరిగ్రహింపబడడం లేదు. యిక భాషను గురించి ముచ్చటించుకుందాము. జనుల వాడుకలో వుంటున్నది కనుక పండితులకు గ్రంథాలలో వుపయోగార్హమైనది కాదు కనుక పండితులకు భాష వుపయోగపడక జనులకు మాత్రమే మిక్కిలి వుపయోగపడుతున్నది. అందులోనూ సంస్కృతం తెలియని కొందరు తాము పండితులమనుకుంటూ కొన్ని అనుకూల శబ్దాలను అననుకూలమైనవిగానూ మరికొన్ని అననుకూల శబ్దాలను అనుకూలమైనవిగానూ పొరపాటుపడుతున్నారు. అటువంటి పండితమ్మన్యులను గురించి మాత్రమే మేమిక్కడ ప్రస్తావిస్తున్నాము. సంస్కృత శబ్దాలను అవసరా నవసరాలనుబట్టి యెలాగున ప్రయోగించుకుంటున్నామో అలాగునే యీ భాషా పదాలు కూడా వుపయోగించుకోవచ్చును. అన్ని విధాలా యీ భాషా శబ్దాలకు సంస్కృతంతో సంబంధమున్నది. కనుక యివి సర్వదా ప్రయోగార్హములే. వీటిని అపశబ్దాలని యెంతమాత్రం పేర్కొనడానికి వీలులేదు. ఇది వ్యాఖ్యానం.

పై వ్యాఖ్యానమును మన తెలుగు భాషా పదాలకు కూడా అనువర్తింప చేసుకొనవచ్చును.

# శాకుంతల నాటక పఠనం

శ్రీనివాసాచారి గారితో కలిసి అభిజ్ఞాన శాకుంతలము చదవడాని కుపక్రమించితిని నాటకారంభమున తపస్వికన్యల సంభాషణము అభ్యంతరకరము కాదా? కాళిదాసునకు అనాఘ్రాత పుష్పముల వంటి కన్యల సౌందర్యమును వర్ణించుట ప్రీతి వల్కలములను ధరించిన శకుంతల పుష్పాలంకృత పార్వతి వర్ణనములు

వనజ్యోత్స్న నవమాలిక ఈ రంగము మహాసౌందర్యమైన కవితా రూపకల్పనతో అలరారుతున్నది కథా నాయకుడు మాటున దాగి ఇతరుల మాటలను వినడమనేది నాటకాలలో తరచు కనిపిస్తూ వుంటుంది ఇది సాధారణమైన కల్పనే

ఉపభోగక్షమ అనే ప్రయోగము అర్థవంతమైనది సాభిప్రాయము క్షత్ర పరిగ్రహక్షమా యదార్యమస్యా యధిలాషియే మనః

తుమ్మెద నిన్ను బాధిస్తూవుంటే మేమేం చేయగలం? నిన్ను రక్షించడానికి మేమెవరమి? ఈ తపోవనాలు రాజుచేత సంరక్షింప బడుతున్నాయి నిన్ను రక్షించడానికి దుష్యంతుణ్ణి పిలు

ఎంత చక్కగా వుంది

రాజు అడిగిన ప్రశ్నకు శకుంతల ప్రత్యుత్తర మీయక పోవడం ఎంతో స్వాభావికముగానూ సహజముగానూ వుంది

ఈ కథలోని సంఘటనలు జరుగుతుండగా విశ్వామిత్రుడు యేమి చేస్తున్నట్టు పురాకిల అంటే యెన్ని సంవత్సరాలు? దేవతలకీ పరతపోభయ శీలత యెప్పుడూ వున్నదే అనే రాజు మాటలు అనవసరం ఇలా అనడంవలన ఆ పిల్లకు తన మీద నమ్మక విశ్వాసం యేర్పడుతుందని దుష్యంతుని ఉద్దేశం

వైఖానసం దీనికి వివిధ విధములగు అర్థములు అన్వయములు కలవు

శకుంతల అసంబద్ధ ప్రలాపినీ ఎంత సొగసుగా వున్నది వృక్షములకు కలశములతో నీరు పోయుటవలన శకుంతల అలసిపోయింది అలసిన శకుంతలా వర్ణనం మనోహరం

అనసూయా ప్రియంవదలకు చదువు వచ్చును. ప్రియంవద తెలివైన పిల్ల.

అబ్బో ! "మేము మేము" అని ఏమి రాచతీవి ! (1895 ఏప్రిల్ 16)

*   *   *   *

శాకుంతల నాటక పఠనము తిరిగి సాగించితిని.

విదూషకుడు తక్కువ జాతి బ్రాహ్మణుడగుట స్పష్టం. మాటాడే భాష ప్రాకృతము. మాంసం భుజిస్తాడు.

'కిం మోదక ఖాదనే'? విదూషకుడి కిది మామూలే. హాస్య మేమంత గొప్పగా చెప్పుకో తగింది కాదు.

శరీర వ్యాయామమును కాళిదాసు కీర్తిస్తాడు. వేట దోషమే. అయినా అది శరీరానికొక వ్యాయామం, కనుక దానిని సమర్థిస్తాడు.

తపోవనాన్ని విడిచి తన సైనికులను దూరముగా వుండేటట్లు కట్టుదిట్టం చేయమని దుష్యంతుడు సేనాపతికి ఆజ్ఞ యివ్వడం, ఇది తపోజనులపై రాజునకు గల గౌరవం తెలుపుతుంది.

ద్వితీయాంక ప్రారంభంవలన, శకుంతల యెడల రాజునకు కలిగిన ప్రేమాతిశయం వలన అతనికి వేటయందు విముఖత కలిగిందని చెప్పడం తప్ప మరొక ప్రయోజనం కనిపించదు.

"సఖే,న పరిహార్యే వస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే."

ఈ మనోభావము వాస్తవిక విషయాలను నిజంగా తెలుపుతున్నదా? అలాగున తెలుపక పోయినప్పటికీ కాళిదాసు తన కాలంలో వున్న రాజులకీ ఆదర్శం వుండవలెనని అభిలాషిస్తున్నాడా? అతనలాగున అభిలషించడం అర్థమే. గతకాలపు రాజుల ఆదర్శాన్ని తన కాలపు రాజులకు కాళిదాసు ఆపాదిస్తున్నాడు కాబోలును!

"వశినాం హి పరపరిగ్రహ సంశ్లేష పరాఙ్ముఖీ వృత్తి"

"యదార్య యస్యా మభిలాషియే మనః"

"ఇంగుదీ తైల చిక్కణ శీర్షస్య"

తెలుగున 'చిక్కు' అనే శబ్దము "చిక్కణ" అనే సంస్కృత శబ్దము నుండి పుట్టినదా? "చిక్క" సంస్కృత భావమా? గురువులగు కాశ్యపులు ఆశ్రమంలో లేరు కనుకనే బహుశా దుష్యంతుడు తనను వివాహం చేసుకోవలసిందిగా శకుంతలను అడిగివుంటాడు.

రాజు, నీవార ధాన్యములలో ఆరవ వంతు భాగము యిమ్మని వొత్తిడి తేవచ్చును. రాజుకు పుష్కలంగా ధనము వస్తోంది. కోశాగారం నిండుగానే వుంది. దుష్యంతునిలో కొంత హాస్య చమత్కారములున్నవి. "తపములో ఆరవ వంతు."

అహోదీప్తి మతోఽపి విశ్వసనీయతా వపుషః! అథవా

ఉపపన్న మేత దృషిభ్యో నాతి భిన్నే రాజని

ఇటువంటి గుణములు కల రాజులను కాళిదాసు శ్లాఘిస్తాడు. తనకు ఆశ్రయమిచ్చిన కవి పోషకుడైన యేలిక నుద్దేశించి కాళిదాసు యీ పొగడ్తలను బహుశా చేసి వుంటాడు.

"కతిపయ రాత్రం సారధి ద్వితీయే నాయుధ సద్రీచా

భవతాసనాధీ క్రియతా మాశ్రమ ఇతి

సరే అందుకని రాజు ఆశ్రమంలో కొన్ని రోజుల వున్నాడు

మొదట్లైతే కుతూహలం పైకుబికిన మాట నిజమే కాని ఇప్పుడీ రాక్షసుల కథ వినగానే ఒక్క పిసరంత మిగల్లేదు హాస్య సంభాషణము

రాజధాని నుండి కరభకుడు రాణి ఆజ్ఞను దుష్యంతునికి తెలిపాడు

ఆగామిని చతుర్థే దివసే నిర్వృత్త పారణ ఉపవాసో మమ భవిష్యతి తస్మిన్ దివసే దేర్ఘాయుషాఽవశ్యం సన్నిహితేన భవితవ్యమితి

'త్రిశంకు రివాంతరాళే తిష్ఠ త్రిశంకుని కథ యెప్పుడు జరిగింది? శకుంతలా వృత్తాంతానికి పూర్వమా కాక తరువాతనా? ఇది ఎనక్రానిజమ్ కాదా?

ముందు కాలంలో ఎప్పుడో జరిగిన త్రిశంకు వృత్తాంతాన్ని శకుంతలా వృత్తాంతానికి పూర్వమే జరిగినట్టు ఇక్కడ కవి చెబుతున్నాడేమో?

"మా ఖలు మాం రక్షా భీరుకం గణయసి?

మహాబ్రాహ్మణ కధయే తద్భవతి సంభావ్యతే?

హాస్య సంభాషణము

రెండో అంకంలో చివరి శ్లోకం వలన దుష్యంతుడు భయంతోనూ గౌరవంతోనూ శకుంతలను చేపడుతున్నట్లు తెలుస్తున్నది (1895 ఏప్రిల్ 19)

* * *

శాకుంతల నాటకం మళ్ళీ తెరిచాడు

యజ్ఞకర్మ అయిపోయింది కనక సదస్యులు నాకు వీడ్కోలిచ్చారు విరహంతో బాధపడుతున్న నేనింక యేమి చేయుదును? అని దుష్యంతుడు "శక్యమరవిన్దసురభిః కణవాహీ మాలినీ తరంగణామ్ అజ్గై రసజ్గతప్తై రవిరళ మాలిజ్గతుం పవనః భైరవి

మేఘ సందేశము భవభూతి ఉత్తరరామ చరితములతో సరిపోల్చి చూడవలెను

'వేత సపరిక్షిప్తే లతామణ్టపే సన్నిహితయా శకున్తలయా భవితవ్యమ్ దుష్యంతుడు శకుంతల అడుగు జాడలను పరిశీలించుట సొగసుగా వుంది

"అభ్యున్నతా పురస్తాదవ గాధా జఘన గౌరవాత్పశ్చాత్

ద్వారేఽస్య పాండు సికతే పద పజ్త్తిర్దృశ్యతేఽభినవా

చెట్ల చాటున పొంచుండి శకుంతలను చూడడం ఆ పిల్లల మాటలు దొంగచాటుగా వినడం రాజునకు గౌరవప్రదమా? దుష్యంతుని ఉదాత్తతకు అర్హమైనదా?

"ప్రథమ దర్శనాదారభ్య పతత్సుకా ఆపన్నేవ శకుంతలా"

శకుంతల దుష్యంతుణ్ణి వొక్కసారే చూసి వుంటుందా యేమిటి? 'పర్యుత్సుకా' ఎంత సొగసుగా వుంది!

'పూర్వార్ధేన పున్నశయనా దుత్థాయ' ఆహా! సహజంగా వుందీ భంగిమ!

సరిగా దుష్యంతుడు లతా మండపం చెంతకు వెళ్ళేసరికి అనసూయా ప్రియంవదలు శకుంతల మదన బాధను గురించి యెందుకు ప్రసంగించాలో? వారి సంభాషణ కొంత జరిగిన తరువాత మధ్యలో రాజు లతా మండపం చెంతకు వచ్చినట్టు చూపిస్తే బాగుండును!

– (ఏప్రిల్ 21)

* * *

జి.సి.వి. శ్రీనివాసాచారితో కలిసి అభిజ్ఞాన శాకుంతలాన్ని చదవడం మొదలు పెట్టినట్టుగా తన డైరీలో గురజాడ రాశారు. 1895 ఏప్రిల్ నెలలో 16, 19, 21 తేదీలలో యీ చదవడం జరిగింది. చివరి రెండు రోజులా గురజాడ వంటరిగా చదివారు. ఇది మంచి విమర్శ, ప్రశంస, వ్యాసాల సంపుటంలో వుండతగ్గది. 1954లో ప్రచురింపబడిన "గురజాడ డైరీలు" సంపుటంలో యిది వుంది. దీని పాద పీఠికలు కొన్ని దానిలోనివి. సంస్కృత శ్లోకాలకు తెలుగు పద్యాలు వీరేశలింగ అనువాద గ్రంథంలోనివి.

శ్రీనివాసాచారి, గురజాడ మిత్రుడు, తమిళుడు, ఆనంద గజపతి విద్వాంసులలో ఒకరు, నటుడు, నాటక ప్రయోక్త, గాయకుడు. ఆయన ఇంగ్లీషులో రాసిన హరిశ్చంద్ర నాటకానికి గురజాడ ఇంగ్లీషులో రాసిన పీఠిక అనువాదం యీ సంపుటంలో వుంది. (సం).

# శాకుంతల నాటక ప్రదర్శనం

ఒక రోజున శ్రీనివాసాచారిగారిని వారి బసలో కళ్యాణ రామయ్యరు కలుసుకొని నాటక ప్రదర్శనాల గురించీ, రంగ భూమిని గురించీ కొంచెంసేపు ముచ్చటించాడట. ఆనాడు తాము ప్రదర్శిస్తున్న నాటకాన్ని చూడరమ్మని ఆహ్వానించగా శ్రీనివాసాచారి గారు నేను వూళ్ళో లేకపోవడం వల్లనూ, ఆయనకు తదితర పనులు వుండడం వల్లనూ నాటకాలకు వెళ్ళలేకపోయినారట. ఈవేళ వస్తామని కళ్యాణ రామయ్యరుకు వాగ్దానం చేశారు. వాగ్దానం చెల్లించుకుందుకు మేం ప్రదర్శనానికి చూడవెళ్లాము. దారిలో శ్రీ సూర్యనారాయణ పంతులునూ మా కవి మిత్రుణ్ణీ కలుసుకుని వారిని కూడా వెంట తీసుకువెళ్ళాం; ప్రదర్శనం, ఏమీ బాగుండలేదు. హాలు నిండలేదు. నాటక ప్రదర్శనం జరుగుతున్న స్థలం టౌను హాలు; హాలులో చాలా కుర్చీలు ఖాళీగానే పడివున్నవి. టిక్కెట్ల రేట్లు రెండు; రూపాయిన్నర, రూపాయి; రేట్లు తక్కువగా లేకపోవడంవల్ల ప్రేక్షకులు పల్చబడి వుంటారు.

హాలులో చూడదగిన, ఆసక్తి కలిగించే దృశ్యం అనరబుల్ శంకర నాయరుగారి కుటుంబం. మొదటి వరుసలో ఒక పెద్ద బెంచీ మీద ఆయన కుటుంబీకులు రీవిణీ వేసుకు కూర్చున్నారు. నలుగురు కూచోదగిన బెంచీ! కూచున్న స్త్రీలలో ఒకావిడ అందరికంటె వయసులో పెద్ద, స్థూలకాయం, మనిషి నాజూకుగానే వుంది. వొళ్ళో బిడ్డణ్ణి పండబెట్టుకొని హాయిగా కూర్చున్నది. ఆవిడ ప్రక్కనే యింకొకామె. వయస్సులో కొంచెం చిన్నదే. చతికిలబడింది. తరువాత కూర్చున్నామె అందరికంటె చిన్నపిల్ల. మళయాళీ పద్ధతిలో చక్కని చీరెలు ధరించారు. దుస్తులు చాలా ఖరీదైనవే ధరించిన నగలు సైతం ఎంతో విలువైనవి; అలంకరణ ఎబ్బెట్టుగాలేదు. మధ్యన కూర్చున్న ఆవిడ చెవులకు కుట్టుపోగులు లేవు. కాని మిగిలిన యిద్దరి చెవులకూ ఎన్నో పోగులు. చూడడానికంత నాజూకుగా లేవు. చెవులకున్న పోగులు చాలా వలంగా వున్నవి. స్త్రీలను, వారి ఆచార పద్ధతులనుంచి మళ్ళించడం కష్టమేకాని, చెవులకు అన్నేసి కుట్టు పోగులు, ఆభరణాలు పెట్టుకోవడమనే అలవాటును మాన్పించవలసివుంది. ఈ కాలంలో కూడా యీ అలవాట్లేమిటో? ఈ పద్ధతులను త్యజించవలసినదిగా గట్ట కృషి చేయాలి. వారిలో అందరికంటె చిన్నపిల్ల చాలా బక్కపల్చగా వున్నది. కళ్ళు చేప కన్నులను పోలివున్నవి.

నాటక ప్రదర్శనం పాడుగా వుంది. దీనిని యీ మహిళలు ఏ విధంగా అనుభవిస్తూ ఆనందిస్తున్నారో గమనిద్దామని నాకు కుతూహలం కలిగింది. చిన్నపిల్ల అమాయిక. ఎంతో వినయ విధేయతలుగల పిల్లవలె

పొదకట్టింది. రంగభూమి మీద వొక అసంబద్ధ సన్నివేశం తరువాత యింకొకటి అలాగున ప్రదర్శింపబడుతూనే వున్నది. ఈ అసంబద్ధ సన్నివేశాలను, దృశ్యాలను, నటనను చూసి యీ చిన్నపిల్ల ఏ విధంగా భావిస్తున్నదీ, ప్రతిచలిస్తున్నదీ గమనించవలెనని ప్రయత్నించాను.

సీనులు పాడుగా వున్నాయి. తెర గుడ్డలు మరీ అసహ్యం. అభినయం! దానిని యేమనాలో నాకే బోధపడడంలేదు ఈ దుర్భర పరిస్థితిని వర్ణించడానికి తగిన విశేషణం భాషలో అగోచరం.

మొట్టమొదట అనుసూయా, ప్రియంవదల సంగతి, తాటకిలాటి శరీరాలు, చెప్పలేనంత మోటుతనం అనాగరికత హెచ్చు. సొగసైన లాలిత్యంగల శకుంతల చెలికత్తెలుగా వీరు తయారయినారు. సున్నితమైన హృదయభావాలనూ, మార్దవమైన అభిప్రాయాలనూ ఠీవినీ హుందాతనాన్ని కలిగివున్న చెలికత్తెల వేషాలు యీ 'కోమలాంగులు' వేస్తే నాటకం ఎలాగున వుండవలెనో అలాగునే వున్నది!

శకుంతల పాత్ర ధరించిన కల్యాణ రామయ్యరు కన్యవలె కనిపించక పోతే మానె! మంచి నడి వయస్సులో వున్న స్త్రీవలె చూపరులకు దిగ్భ్రాంతి కలిగించాడు. అతని ముఖ లక్షణాలు అతనికే లొంగకుండెను. గుండ్రని కన్నులు, మొహానకు అతికించినట్లు పెద్ద గ్రుడ్లు; ఆట బొమ్మలకున్నట్లు మీదకు యెక్కొచిన్నట్లు వున్నవి. కోపమూ, చికాకూ, రుసరుసలు బహుశా ఏదో అవ్యక్తమయిన అనుకంపమూ తప్పితే అతని నేత్రాలు మరొక భావాన్ని అభివ్యక్తీకరింపజాలవు. మర్యాద, లజ్జ, ప్రేమ, గౌరవము, వినయశీలత, విచారము, విషాదము మొదలైన ఉదాత్తభావాలను వ్యక్తీకరించుటకు అతని కన్నుల తీరు సరిపడదు. ఈ గుణములేవీ అతని నేత్రాలలో మచ్చుకైనా కానరావు. భావ ప్రకటనకుగల యోజన అతని కనులకు మృగ్యం; నుదురు కిందకు అణిగిపోయివుంది; చిన్నది; లొత్త, చివరి భాగాలు మరీ చిన్నవి. కనుబొమలు వొకతీరున లేవు. పెదిమలు సన్ననివీ కావు; పోనీ కుదురుగా వున్నట్టూ కనిపించవు. మీది పెదవి గుండ్రన. పెదాలూ నోరూ ముందుకు పందెం వేసుకున్నట్టు తోసుకువచ్చాయి. స్తనములు చాలా పెద్దవి. పాపం, అతను వాటిని సరిగ్గా అమర్చుకోలేదు. అయ్యరు ఆకారానికి సంబంధించినంతవరకూ యివీ విశేషాలు, ఇక అతని వాచికం సంగతి. నోరు తెరచి అతను మాట్లాడబోయేసరికి థియేటరు విడిచి వెళ్లిపోదామన్నంత దుర్భర మనిపించింది. గొంతుక వింటే కప్పలు బెక బెక లాడినట్లే ఎంత పెళుసు! మగవారి కంఠమని యిట్టే తెలిసిపోతున్నది. సంగీత వాయిద్యాలు మహా భయంకరం; మార్దవం పిసరంత లేదు. కర్ణకఠోరమైన సంగీతం! ఈ దుస్సహమైన దిక్కుమాలిన సంగీతాన్ని అతను యెందుకు మానుకోడు? ఊహుఁ అలాగ వినిపించి ప్రేక్షకులను రంజింపచేయాలనే అతని అభిమతం!

ఈ మదరాసీలు కల్యాణరామయ్యరు పేరు చెబితే పొంగిపోతారు; ఉబ్బితబ్బిబ్బవుతారు. బాగులేదన్న వాళ్ళకు బహిష్కారమే. ఇతడు మంచి వ్యాపారస్థుడు. ముందుగా తాను వెళ్ళే స్థలములలో తగు మనుష్యులను కలుసుకుని వారిని ఆశ్రయించి ఆదరణ సంపాదించుతాడు. చెన్నపట్టణం విడిచి దక్షిణానికి పోతూవుంటే యితని ప్రసిద్ధి మరీ ఎక్కువగా కనిపిస్తుంది. దీనినిబట్టి మదరాసిలకు 'విచక్షణ', సరియైన విలువలను పోల్చుకునే దృష్టీ లేదని తేలుతున్నది. విజయనగరం జట్టు నాటకములలో అభినయం యింతకంటే బాగా వున్నది. బుచ్చిశాస్త్రి కంపెనీ వారు కల్యాణ రామయ్యరు జట్టుకంటే అన్నివిధాలా ఎన్నోరెట్లు మెరుగు. అయితే వారికి శ్రీనివాసాచారి తరిబీమ వుందని చెప్పక తప్పదు. కల్యాణ రామయ్యరువలె రంగ భూమి మీద వెంకయ్యగారు అవకతవకగా ఎన్నటికీ అభినయించరు. అయ్యరు చేసిన మోటు పనులు కొండయ్య చేస్తాడంటే కలలో కూడా నమ్మజాలను. అసలు యితని నాటకపు నోటీసులే అవకతవకగా వున్నవి. ఈతని ప్రకటనలకొక అర్థంపర్థం లేదు. తానొక

అసాధారణ ప్రజ్ఞావంతుడనని ప్రకటించుకుంటాడు. ఈ నోటీసులను అచ్చముగా అలాగే "పంచ్" పేపరులో అచ్చొత్తిస్తే హాస్యపు ప్రకటనలుగా చలామణీ అవుతవి. "నమ్రత" అంటే అయ్యరు ప్రకటనలలోనే కలదు గదా మరి! ఈ నాటకపు వాళ్ళకు ఆత్మశ్లాఘన అలవాటు అయినది.

ఇది యీనాడు వారికొక ఫేషను తమిళుల పద్ధతులు బహు తమాషా అయినవి. అవకాశము కలిగిన చోటల్లా తమవాళ్ళను తామే పొగుడుకుంటూ ఆకాశానికెత్తుతుంటారు కళ్యాణ రామయ్యకు ప్రసిద్ధి యిలాగే కలిగివుంటుంది. అతని రూపు, సందేహం లేదు. చలాకీ అయిన డాన్సింగ్ గరల్‌వలె వుంది. ఇంత కంటె తక్కువ వయసులో చిన్నతనంలో అయ్యరు కంఠమూ, రూపు కాస్త బాగా వుండేవేమో! యిప్పటికి కూడా తాను తగుదునని ఆడ వేషాలు ధరించడం ఎంత మూర్ఖత! అతని వక్రబుద్ధిని యేమనగలం!

దుష్యంతుడు వేషం కట్టిన బుద్ధిమంతుడు. బహుశా యీ ట్రూపుకు నాయకుడు కాబోలును, ఈ వేషమునకు ఇతనిని యెంచుకోవడంలో కల్యాణ రామయ్యరు ప్రాజ్ఞతను యేమని పొగడగలను! పాదు మోహం, మట్టి బుర్ర, డోకువస్తూ రాక్షసుడిలా దూసుకువచ్చాడు. దయ్యంలాంటి మనిషి, నల్లగా లేదు కాని, వేషధారణ రోత కలిగిస్తున్నది. వేషంమీద రూపం అందంగా కనపడేటట్ట చేసుకోవడం కూడా యెరిగినట్టు తోచదు. సాక్సు, నల్ల ట్రౌజరు, కోటూ వేసుకొని మిలిటరీ ఆఫీసరులాగ దిగబడ్డాడు. దీనికి తోడు తల మీద టోపీ కూడాను. మీసాలు పల్చగా సన్నగా వున్నాయి. వేషానికి తగిన మీసకట్టు కాదు. నుదుట తిరుచూర్ణము; మొత్తం మీద మనిషిని చూసీ చూడగానే, మావేపు సాతాని భిక్షువు జ్ఞాపకం వచ్చాడు మూతి కొంచం ముందుకుంటుంది. మీది పెదవి గుండ్రము; పెదవులలో యిమడని పొడుగు పళ్ళు ఇట్టి ముఖములో లావణ్యము గాని చురుకుతనము గాని యేలాగు కనబడగలవు?

పాపం, అందు కతనేమి చేయగలడు! ధీమాగాని, చలాకీతనంగాని, రాజపౌరుషంకాని జోడు కంచుకాగడాలు పట్టుకుని వెతికినా అతని ముఖంలో కానరావు వేషము సరే సరి! అంతా మోటుతనమే; యుక్తత అన్నది పూజ్యం. వెంట్రుకలు కొప్పుగా ముడుచుకొని దాని మీద టోపీ వొకటి పెట్టుకున్నాడు. తలవెనుక ముడి! ఆహా! వాళ్ళెంత మోటు మనుషులు! కించిత్తు దర్జా కూడా లేదు; పోనీ ఔచిత్యం అంతకంటే కనిపించదు! దుష్యంత మహారాజా వారు లేచినిలుచుంటే తలముడి ముందుకు పడుతూ వుంటుంది. బోర వెనక్కు వేదుతూ వుంటుంది. ఆరి వాడిసి గతరగా! ఏమి వేషం! ఏమి లోకం! దుష్యంతుడు ఎంత మూర్ఖుడు! ఎంత జడ్డి పీనుగ!

మిగిలిన పాత్రధారుల వేషధారణ యేమీ చెప్పుకో నక్కరలేదు. ఇంచుమించు వారికి మంచి దుస్తులు లేనట్టే, ఏ పనులయితే చేయకూడదో, ఏ మాటలను పలక కూడదో అవన్నీ చక్కగా చేసి, పలికి, రంగభూమి అంతా కంగాళీ చేసి విడిచిపెట్టారు. ఇదివరకొకసారి నేను చెప్పినట్టుగానే, రంగభూమి మీద కనిపించిన ప్రతి నటుడూ ఏదో సణుగుడు ప్రారంభించాడు. మంత్రాలు, జపాలు, పాటలు; సంభాషణ మట్టుకు లేదు నోరువిప్పి మాట్లాడ్డం తప్ప మిగిలి హంగామా కావలసినంత.

రంగభూమి మీద ఒక నటుడు విశాఖపట్టం చేంతాడంత స్వగతం చెప్పుకుపోతున్నాడు. పక్కనున్న మిత్రుణ్ణి "ఏమిటి నేస్తం యీ తరగని దుంప! ఎప్పుడైనా హనుమంతుడి తోక చూశావా? అన్నట్టు ఇందులో నీకేమైనా బోధపడ్డదీ?" అని అడిగాను. ఎవరయితే అనర్గళంగా ఉపన్యాస ధోరణిలో మాట్లాడుతారో వారు గొప్ప తెలివైన వాళ్ళని, గొప్ప నటులని మనవాళ్ళ అభిప్రాయం. ఇది మరాటీ కంపెనీల బాటీ; దానినొక సూత్రంగా యీ కంపెనీలు పరిగణిస్తున్నాయి. నటులు పలికే మాటలు కేవలం పాఠం వప్పగించినట్లే విసుగు కలిగిస్తూ కృతక మనిపిస్తున్నవి. ఎంతో కష్టం మీద వొక్కొక్క మాటనే అంటున్నారు. ఈపాటి మహాభాగ్యానికి, కల్యాణరామయ్యరు

చంగా బజారు సందుగొందుల్లో ప్రదర్శనాలీయక, ఎందుకీ టౌను హాలులో నాటకాలు వేయాలని సహజంగా ఎవరైనా ప్రశ్నించవచ్చును; దీనికి నేనేం సమాధానమీయగలను? పాపం, అయ్యరు వొట్టి వెర్రికుట్టె! తాను శకుంతల భూమికను అత్యద్భుతంగా నిర్వహించగలనని భావిస్తున్నాడు. నటులకు వేషం చక్కగా కుదిరేటట్టు చేశానని, కాళిదాసు శ్లోకాలు అమోఘంగా భట్టీ వేయించాను కదా! అని అతని ధీమా. వీటికే అతను హెచ్చు ప్రాధాన్యత యిస్తున్నాడు. శ్లోకములన్నీ అభాసుపాలు చేసినాడు శ్లోకం తరువాత శ్లోకం. ఎక్కడా ఎడతెరిపి లేదు; నించున్న పాటున మనిషిని గొంతుక నులిపి హత్యచేసినట్టు శ్లోకాలను ధ్వంసంచేసి విడిచిపెట్టాడు. దారుణమైన హత్య! ఇక నా ఓర్మి సన్నగిల్లింది.

"కిం శీతలై ః క్లమ వినోదిభిః" అనే శ్లోకం దుష్యంతుడు నాటక రంగం మీద యీడుస్తూ చదువుతూ వుంటే యిక భరించలేకపోయాను. నా తీవ్ర అసమ్మతిని తెలియ చేసేటందుకో అన్నట్టు కాలి బూటుతో వొక్కసారి నేలను కొట్టి "దురన్యాయం, దురన్యాయం" అనుకున్నాను. నేను చేసిన యీ అసమ్మతి సూచక ధిక్కారం హాలంతా ప్రతిధ్వనిస్తున్నదా అనిపించింది. హఠాత్తుగా శకుంతల దుష్యంతుడి చెంత చేరుతూ గునుస్తూ సానిపిల్లలాగా టక్కరితనంతో వగలు కరిపిస్తూ తెలుగులో "ననుగూడరా నాథా" అని జావళీ అందుకుంది! ప్రాణం విసిగెత్తిపోయి పాపం, శ్రీనివాసాచారి గారు దిగ్గున లేచిపోయారు. యిదేమిటీ దిక్కుమాలిన శకుంతల!

ఇదివరకు వొకసారి కల్యాణరామయ్యరు ప్రదర్శనం మీద నేను తీవ్రంగా జడ్జిమెంటు చెప్పానని శ్రీనివాసాచారి గారికి బాధనిపించింది. ఆనాడు ఆయన కల్యాణరామయ్యరు నాటక ప్రదర్శనాలను సమర్థిస్తూ వాదించారు.

నా చెంతనే కూచున్న మిత్రుడు వెనక్కి తిరిగి "ఇప్పుడీ నాటక ప్రదర్శనానికి కాళిదాసు వచ్చి వుంటే ఏమనుకునేవాడో!" అన్నాడు.

"మారు మాటాడక యీ పాటికి ఏ నుయ్యో, గొయ్యో చూసుకుని వుండును."

ఒక్కచోట మాత్రం అయ్యరు అభినయం బాగున్నది. దుష్యంతుడితో తన చెలికత్తెలు ప్రసంగిస్తున్నప్పుడు శకుంతల మౌనంగా నిలబడి వుంటుంది. ఇలా తానేమీ మాట్లాడకుండా నించున్నపుడే అయ్యరు నటన ఫరవాలేదనిపించింది.

శకుంతల, దుష్యంతుడితో "ఇక్కడేమిటి అల్లరి చేస్తావు. అంతా చూస్తారు. బహిరింగం" అంటున్నది. సైడు కర్టెను పక్కకు తప్పుకొని. కాస్సేపు అచట నక్కి, మళ్ళీ యింకొక సైడు కర్టెనులోంచి తలపైకెత్తి తొంగి తొంగి ముందుకు చూస్తూ మునికన్య శకుంతల "అక్కడకు మళ్ళి నేనెటుల పోగలదానను? నా పూలదండ పోయినది. కదా!" అని వాపోతున్నది. వెదుక్కుంటూ యింకొకతె రంగం మీదకు ప్రవేశించింది. దుష్యంతుడు శకుంతలను "నీకేమి కావలె?" అని ముచ్చటగా అడిగాడు.

"అయ్యో ! నా పూల చెండును పోగొట్టుకొంటినే!"

"ఊరడిల్లు మూరడిల్లుము. అద్దానిని నేన కొసంగెదను. కాని నీవు నాకొక వాగ్దాన మీయవలెను."

"ఇచ్చెదను!"

"ముందు మాట యియ్యి."

"యిచ్చితిని!"

"అటులైన యిటువచ్చి కూర్చో, పూల చెండును నీ జటయందల కరించెద!"

దుష్యంతుడు, శకుంతలకు పూలదండను యిచ్చి ఆమె చేతిని పట్టుకున్నాడు. పట్టుకుని లాగుతూ "నీ కరమెంత మెత్తగా నున్నదో!" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు! శకుంతలా దుష్యంతుల ప్రేమాభినయమును చూసి హాలులో కూర్చున్న స్త్రీలు ఫక్కున నవ్వడ మారంభించారు.

ఇప్పుడు యింక దుష్యంతుడు రంగ భూమిమీద శకుంతల చెంత అభినయిస్తున్నాడు. వివాహిత స్త్రీని మానభంగం చేసేటంత దూకుడుగా శకుంతలతో పెనుగులాడుతున్నాడు!

(1895 ఏప్రిల్ 13 డైరీ)

# బాలామణి జట్టు నాటక ప్రదర్శన

చంగాంగడి వద్దనున్న థియేటరులో బాలామణి జట్టు నాటక ప్రదర్శనం. రమ్మనమని శ్రీ బాలస్వామి నాయుడుగారు నన్ను, శ్రీనివాసాచారిగారిని ఆహ్వానించారు. ఇక వెంకటరావు పంతులుగారు సరేసరి. రానంటోన్న బలపంతంమీద కిందటి శనివారం రోజున నన్నక్కడికి లాక్కుపోయారు. జింకు షీట్లతో కట్టిన హాలు. మధ్య మధ్యన యినప వాసాలు థియేటరున్న సందు మురికి వాసనతో అడుగు పెట్టడానికే రోతగా ఉండెను.

పోయిన శనివారం ప్రదర్శనానికి బోలెడంత మంది జనం వచ్చారు. హాలు క్రిక్కిరిసిపోయింది. హాలు వెలుపల తొడ దొక్కిడి లావుగా వుండెను. లోపల కూచుందుకు జాగానే దొరికింది కాదు.

'మాస్కాను' తోటలో బాలామణి ప్రదర్శించిన శకుంతల నాటకం కూడా చూస్తిమి. మేం వెళ్ళేసరికి తృతీయాంకం ప్రదర్శింపబడుతున్నది. శకుంతలను విడిచి దుష్యంతుడు తన నగరుకు వెడలిపోతున్న దృశ్యం అభినయిస్తున్నారు. బాలామణి చెల్లెలు దుష్యంతుడు పాత్ర ధరించింది. ఆమె రూపం వికారంగా వుంది. నడకలో రంగేలా, కంఠం విప్పితే ఆడదని యిట్టే తెలిసిపోతుంది. బాలామణి తప్ప ఆ జట్టులో చెప్పుకోతగ్గ మరివక మనిషి కనబడదు. మిగిలిన వాళ్ళంతా పనికిరారనే చెప్పవచ్చును.

బాలామణి రూపం ఠీవిగా వుంది. మనిషి నాజూకుగా దర్శనీయంగా వుంది. ముఖంలో కొంత యౌవన లోపం కనబడుతున్నా లావణ్యం కలదు. వాచికం మధురంగానే వుండెను కాని, కొంత యాస లేక పోలేదు. కంఠం మార్చగల శక్తి వున్నట్టు నాకు తోచదు. శాంతము, ఓరిమికల విషాద భూమికలను నేర్పుగా అభినయించగలదు. కరుణరసం వొప్పించడం అంత సహజంగా వుందన జాలను. కొంత "అతి" వున్నది. అభినయించేటపుడు అనవసరంగా చీటికీ మాటికీ దుఃఖిస్తూ వుంటుంది. శకుంతల యీలాగున తరుచు దుఃఖిస్తూ వుండాలని మూర్ఖతతో నాటకపు జట్టు నాయకుడు శాసించేడో, ఏమో మరి! మొత్తంమీద బాలామణిని చక్కని 'విషాద నటి' అని చెప్పలేను. విషాదనాయిక పాత్రను రమ్యంగా నటించగలదో లేదో నాకు సందేహమే కాని మనిషి బాగున్నది. వేషము ధరించడంలో మంచి అభిరుచి వున్నట్టు తోచింది. అలంకరణ సొగసుగా కనిపించింది. పాత్రోచితమైన ఆహార్యము.

మద్రాసులో వున్న మోటు మనుష్యులను మెప్పించడం కోసమే కాబోలును; యీ జట్టులు ఆడే నాటకాలలో బండ హాస్యమూ, మోటు శృంగారమూ వుత్పన్నము లవుతూవుంటవి. మంచి రసవత్తరమైన ఘట్టములలో కొసరు

విషాద సన్నివేశాలలో సైతం విదూషకుడు, సహజంగా నడిచిపోతున్న కథకు అడ్డు తిరిగి అసంబద్ధ ప్రలాపాలతో రసాభాస చేస్తాడు.

బాలామణి జట్టులో మిగిలిన వాళ్ళ వేషధారణ చాలా హీనంగా వున్నది. పాపం, మదరాసీలలో తక్కువ కులస్థులని చెప్పబడే వాళ్ళు అంత అందంగా వుండరు. అందుచేత నాటక రంగం మీద కాస్త కంటికింపుగా కనిపించేందుకు ఆర్భాటమైన అలంకరణ వీళ్ళకు అవసరం కాబోలు!

నాటక ప్రదర్శనలో సంగీత వాయిద్యాలు లెక్కకు మించినన్ని. సంగీతం అంతా వొట్టి అల్లరి. గడబిడగా తేలింది. ప్రహ్లాద నాటక లక్షణం బాలామణి జట్టు యిక్కడ కూడా పోనిచ్చుకోలేదులా వుంది.

పంచమాంకంలో దుష్యంతుడి దర్బారు దృశ్యం వొకంతకి తెమిలింది కాదు. శకుంతలా దుష్యంతుల సమావేశం గంటల తరబడి నడిచింది. ప్రశ్న మీద ప్రశ్న. ప్రశ్నల వర్షం! సమాధాన పరంపర! ఈ పంచమాంకాన్ని కాళిదాసు యెంతో నేర్పుతో నిర్వహించాడు కదా! అంత రసవత్తర ఘట్టాన్ని అవలీలగా పాడుపాడు చేసి విడిచిపెట్టారు.

అన్నట్టు యింతసేపూ యీ విషయమే మరిచాను. భరతుడు వేషం వేసిన గుంటడు కొండముచ్చులా వున్నాడు!

పోయిన శనివారం బాలామణి జట్టు ప్రదర్శించిన నాటకం కొంతసేపు చూశాక కల్యాణ రామయ్యరు నాటకానికి వెళ్ళాం. అతని జట్టు ఆడుతున్న ద్రౌపదీ వస్త్రాపహరణంలో చీర వొలుపు సీను చూద్దామని కుతూహలం. బాల్కనీకి అవతల ప్రక్క దూరాన ఆఖరు క్లాసులో కొన్ని నిముషాల పాటు నిలబడితిమి. ఈ నాటకపు జట్టుకు విలువైన దుస్తులే వున్నవి. కాని వేష రచన అసంబద్ధము గానూ, వికారముగానూ కనిపించింది. తలవెంట్రుకలు ముడిచి పెద్ద కొప్పుగా చుట్టుకొని, నెత్తిని టోపీ పెట్టుకుంటే రాచఠీవి కనబడదు. రాజవేషము వలె బొత్తిగా వుండదు. ఇక దుశ్శాసన వేషము! పెద్ద మీసాలు, గడ్డము, వింత తలపాగా, ఇత్తడి బెల్టులు; మా ప్రాంతపు పాములవాడి వేషమును తలదన్ను తున్నది. దీనికి తోడు మరాటీ కంపెనీలలోని రాక్షస వేషముల వలె. దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ పీండ్రించుకొని గావు కేకలు పెట్టారు.

బాలామణి తప్ప యీ మదరాసు నాటక కంపెనీలలో సహజంగా వచనం చెప్పగల నటిగాని, నటుడుగాని వొక్కడూ కనబడలేదు. వచనం సరసంగా, సహజంగా, పాత్రోచితంగా యాసలేకుండా చెప్పడము వీళ్ళెవళ్ళకీ తెలియదు. స్కూలు పిల్లలు పరీక్షాధికారి యెదుట యేకరువు పెట్టినట్టు అనవలసిన ఆ నాలుగు మాటల్నీ గబగబ, తరుముకు పోతారు. ఉచ్చారణలో నిలుపులు సక్రమంగా వుండవు. ఎవరికేది తోస్తే అది; ఎంత తోస్తే అంత. మాట యాస. ఇదివరకు కల్యాణరామయ్యరు జట్టు నాటక ప్రదర్శనాన్ని యింత పరిశీలనగా చూడలేదు. గత శనివారం కొద్దిసేపే వుండి యింటికి వెళ్ళిపోయినాను. ఆవేళా యింతే! దుశ్శాసన పాత్రధారి గుక్క తిప్పుకోకుండా పీంఢ్రిచుకుని గగ్గోలు పెడుతూ నానా రభసా చేశాడు. ద్రౌపది ముందు కుప్పిగంతులు వేస్తూ భయంకరంగా పులి గాంఢ్రుపెట్టినట్టు ఊరికే అరుపులు!

ఈ మదరాసీలకు దీర్ఘోపన్యాసములు, వందలకొద్దీ పాటలూ, హోరెత్తించే సంగీతమూ తప్ప మరేవీ రుచించవనుకుంటాను. కేవలం వచన నాటకమంటే వీరాస్మరంతికే పోరేమో!

ఈవేళ తన చాకచక్యమంతా చూపి కల్యాణరామయ్యరు అభినయిస్తున్నాడు. మనిషి వొడ్డూ పొడుగూ బాగానే వున్నాడు. ముచ్చట గొలుపుతున్నాడంటే పొరపాటు కాదు. వేషధారణ ఆకర్షణీయంగా వుంది. వేసుకొన్న తెల్లని సిల్కు దుస్తులు, సన్నని జరీ నాకు నచ్చినవి. బట్టరంగు, కంటికి యింపుగొల్పుతున్నది. కాని వచ్చిన చిక్కల్లా

అతని కళ్ళతోనే; కళ్ళూ, ముక్కూ తీరుగా లేకుండుటచేత వేషానికి లోపం కలుగుతున్నది. కళ్ళు బండి చక్రాల్లా గుండ్రన, ముక్కు చప్పిడి. దూరంనుంచి చూస్తే విగ్రహం కంటికి కాస్త నజరుగానే కనిపిస్తుంది. అయ్యరు కంఠంలో మృదుత్వం లేదు. పాట సున్నితమూ కాదు; రెండుకు రెండే!

చెపితే విచిత్రంగా తోచునేమో కాని, అతని నటన అంతా మంచి చలాకీ అయిన పడుపు కన్య రకముగా వుంది. బాలామణి శకుంతల వేషంలో బిడియం, నమ్రత కనిపిస్తాయి.

నాటకపు జట్టులలోనికి పడుపు కన్యలను చేరదీయుట హానికరమనే నా ఊహ. అందకత్తెయై తెలివైన నటి పడుపు కన్యయైతే, సంఘమునకు చాలా ముప్పు తెస్తుంది. ఆమెకే కనక యెన్నికైన సౌందర్యం, లావణ్యం వుంటే ఆమె చేసే అల్లర్లకు హద్దూ పద్దూ వుండదు.

కళ్యాణరామయ్యరు నాటక ప్రదర్శనం కొంచెంసేపు చూసి, అక్కడ నుంచి బాలామణి ప్రదర్శిస్తున్న నాటకం చూడవలెనని బయలుదేరాం. వెళ్ళినవాళ్ళం బాలయ్యానాయుడి గారితో పన్నెండు మందిమి. హాలు క్రిక్కిరిసి వుంది. కూచుండుకు ఒక్కడికి కూడా సీటు లేకపోయింది. నించోడం అసాధ్యం. ఈ అసాధ్యాలను యిట్టే సాధించగల వాళ్ళెవరైనా వున్నారా అంటే ఆయన బాలయ్య నాయుడుగారొక్కరే! మహారాజా వారి ఉద్యోగులలో యింకొకరికి యీ చాకచక్యం లేదు. ఆయన పేరు చెబితేనే చాలును, కూచుండుకు చోటుతో పాటు ఆదరణ కూడా లభిస్తుంది. ఆయన పేరు వింటే అందరికీ ఆకర్షణ కలుగుతుంది.

స్త్రీలు కూచున్న తట్టున వెనుక భాగంలో మాకు చోటు దొరికింది. రిజర్వుడు క్లాసుకు వెళ్ళాం. టిక్కెట్ల ఖర్చంతా నాయుడుగారే పెట్టుకున్నారు.

బాలామణి 'దంబాచారి విలాస' ప్రదర్శనానికి చాలా ప్రసిద్ధి కలదు. నాయిక పాత్రధారిణి హోషుగ్గా వుంది. గొప్ప ఆట బాలామణి ఎంతో నేర్పుతో సున్నితంగా ప్రదర్శించింది. ఇందులో ఒక దృశ్యంలో ఆమె యించుమించు దిగంబరిగా వచ్చి దంబాచారికి అభ్యంగనం చేయిస్తుంది. ఇది చూడడానికి చాలామంది వస్తారు. ఇంగ్లీషు బ్యాలటు వనితవలె బనియనులు వేసుకొని రంగంమీదకు దూసుకొని వస్తుంది.

ఆమె ముఖవర్చస్సు బాగున్నది. తల నున్నగా నాజూకుగా దువ్వుకొని సింగారించుకొంది. తలమీద సూర్యచంద్రుల ఆభరణాలు. ఇవి లేకుంటే యింతకంటే నయమనిపించును. నగ్నంగా యింగ్లీషు బ్యాలటు వనితవలె బనియనులు ధరించి యీమె రంగం మీదకు రావడం నచ్చలేదు. వేషధారణ సహజంగా లేదు. పాత్రోచిత వేషధారణ అనజాలను. శృంగార విలాస విజృంభణ మృగ్యం. చలాకీతనం కనపడదు. మదన సుందరిగా అంతకంటే స్ఫురించదు. అభినయంలోను నడకలోను ప్రశాంతత, ధీమా, సొగసూ వున్నవి. చిత్రమేమింటే, యే మదరాసీ బంగారు పిచికనో యే చెట్టియారునో సర్వనాశనం చేసిన యీ భోగం పడుచు యీ 'దంబాచారి' నాటకంలో అట్టి సర్వనాశనము చేసే పడుపు కత్తె వేషం అభినయించి తన జీవితమునే గర్హింపజేసే నీతిని బోధించుట !

అయితేనేమి పేర్కొన తగిన స్త్రీలలో వొకతె !

– (1895 మార్చి 23 డైరీ)

## మరికొన్ని నాటక ప్రదర్శనలు

షేక్స్పియరు సీనులు. ప్రదర్శకులు మిస్టర్ అండ్ మిసెస్ బి. క్రాఫ్టన్, విల్మర్. హాలు కిటకిటలాడుతూ వుంది. మన చెన్నపురి పెద్దలు, భారతీయులు, యువకులు, వకీళ్ళు, పలువురు విద్యార్థులు ప్రదర్శనానికి హాజరయిరి.

ఫాల్‌స్టాఫ్ వేషం బాగులేదు. వుండవలసినంత పెద్దవాడుగా గాని, లావుగా గాని లేదు. వైఖరి యేదో వొకలాగ వున్నది. వాచికము "వప్పగింత" వలె వున్నది తప్ప "అభినయముగా" తోచలేదు.

మర్చంటాఫ్ వెనిస్‌లో నటించిన సూయలు దొరకు పోర్షను నోటికిరాదు. టేబిల్ మీద పుస్తకాన్ని చూసో, మరి పోర్షను కాయితం చూసో చెప్పలేను కాని, దానిని చదువుతూ అభినయించాడు. షైలాక్ వేషము 'ఫరవా లేదులే' అనిపించింది. కాని పోర్షియో పాత్రధారిణి విల్మర్ సతి 'వోహో' అనిపించింది. అభినయం ప్రశంసనీయం. ఆమె అసలు చాలా సొగసైన మనిషి. వేషధారణము యుక్తము. అభినయం సహజముగానూ, భాసమానముగానూ వుంది. వాచికం స్ఫుటముగానూ, గణనీయముగానూ వున్నది.

ఒథెల్లో వేషం పరమ దౌర్భాగ్య మనిపించింది. వికారమైన వేషధారణ. నటన పాడుపాడు! డెస్డిమోనా అంత బొత్తిగా బాగులేకపోలేదు!

మళ్ళీ విల్మర్ సతి ఎమీలియా వేషంలో కనిపించింది, అత్యద్భుత మనిపించింది. ఎమీలియా ఆహార్యము ఎంత సొగసుగా వున్నదో వర్ణించి చెప్పడం కష్టం. దుస్తులు, అలంకరణ బాగుబాగు అనిపించినవి. విల్మర్ సతి తప్ప యీ జట్టులో చెప్పుకోతగ్గవారెవరూ లేరు. ఆమె ఒకర్తె మాత్రమే చక్కగా నటించగలదు. మిగిలినవారి ప్రసక్తి అనవసరం.

ఇంటికి వెడుతూ వెడుతూ ఒకసారి ట్రిప్లికేసు థియేటరుకు పోయి తొంగి చూశాము. హాలులోకి అడుగుపెట్టీ పెట్టగానే, శ్రీనివాసాచారిగారి పరిచయస్తులొకరు మమ్మల్ని మర్యాదగా పలకరించి, మొట్టమొదటి సోఫా చూపించి అక్కడ కూర్చోండని కోరినాడు. శ్రీనివాసాచారిగారికి అన్ని నాటకపు జట్టులతోను మంచి పరిచయం కద్దు. నాటక కంపెనీలవారు యీయన పేరు చెబితేనే మన్నన చేస్తారు. మేము సొమ్మేమీ చెల్లించనక్కర్లేదని ఆ కంపెనీ మనిషి

అన్నాడు అతను కోరిన ప్రకారం ముందు వరసలో సోఫాలమీద కొంతసేపు కూచుని యింటికి వెళ్ళిపోయాము వెళ్ళిపోతూ టిక్కెట్టు సొమ్ము ఇచ్చివేశాం

భవనము చాలా పొడుగా వుంది తెరలు అంతకన్నా పాడు వేషములూ అభినయమూ మరీ దరిద్రం అందరి దుస్తులూ పాడుగానే వున్నవి చెప్పుకుంటే సిగ్గు సిగ్గు హిరణ్యాక్షుడి వేషంకన్న చెన్నపట్టణంలో యే ముష్టివాడి వేషమేనా బాగుంటుంది తగిన తరిబీదు వుంటే ప్రహ్లాద వేషం నటించిన పిల్లవాడు పనికి రావచ్చును

ఉత్తరదేశపు బాణీలో నటి వికారంగా పరమ రోత పుట్టేటట్టు పాడుతూ డ్యాన్సు చేసింది ఉత్తరదేశపు పాటలకు నృత్యాలకు యిది ఒక పేరడీవలె కనిపించింది సూత్రధారుని విగ్రహం పుష్టిగా వుంది పాట కొంతవరకు నయం గొంతుక ఫరవాలేదు నటీ సూత్రధారుల సంభాషణ మొదట తెలుగు పద్యాలలో కొనసాగింది పద్యాలు భాగవతంలోనివి పద్యాలు పాడిన తరువాత వాటి అర్థం తెలుగున వివరించి చెప్పారు ఇంచుమించు ఇది కళ్యాణ రామయ్యరు తమిళ సంస్కృతముల కలగలుపువలె వుండెను

ప్రహ్లాద నాటక ప్రదర్శనంలోని నటుల అభినయమును ఏదైనా వొక 'స్కెచ్'లో వర్ణించవలెను

((1895 మే 11 డైరీ

* * *

నాటక రచనకు సూచన ది యూరేపియను డ్రామా ఒక గొప్ప సివిలియను కొండ జాతి స్త్రీని వుంచుకొంటాడు అతనికి ఇద్దరు సంతానం ఆ ఇద్దరూ ఇంగ్లండులో పెరిగారు పరిస్థితుల ప్రభావం వలన తల్లి పిల్లలూ ఒకరికొకరు దూరమౌతారు అతను ఆమెతో సంబంధాలను తెంచుకుంటాడు అతను ఎక్కడ వున్నాడో అతని ఆనుపానులేమో ఆమెకు తెలియదు ఒక ముసల్మాను వర్తకుడు ఆమెకు ధనం యిస్తూ వుంటాడు ఇంటికి కావలసిన వస్తువులు తెచ్చి పడవేస్తూ వుంటాడు ఇతను మొదట బట్లరు తర్వాత వర్తకుడైనాడు కొంతకాలానికి ఆమె కొడుకూ కూతురూ తిరిగివస్తారు కొడుకుకు తన తల్లి కొండజాతి స్త్రీ అని మొదట తెలియదు తన తండ్రి చనిపోయాడని అనుకుంటాడు కాని అతను యిండియాకు రాగానే పరిస్థితులన్నీ అవగాహనవుతాయి ఇంటికి వచ్చే సప్లయిలు కొన్ని రోజుల నుంచి ఆగిపోతాయి కూతురు పనిచేస్తూ వుంటుంది ఆమెకు చదువు వచ్చును సప్లయిలు బంద్ అయినప్పుడు అట్టి సన్నివేశంలోనే పిల్లలిద్దరూ ఇండియా చేరినట్లు చిత్రించేదా?

ఆ యూరోపియను వొక పిల్లను పెళ్లాడతాడు అతనికి పిల్లలు కలుగుతారు దగుల్బాజీ ఇంకొక పిల్లను ప్రేమిస్తాడు

(1895 మే 11 డైరీ)

* * *

నిన్నరాత్రి నేషనలు థియేటరునకు వెళ్ళితిని థియేటరు జనంతో కిటకిట లాడుతూ వుండెను అరు౯౦ మనుషుల నిలబడడానికి మాత్రం జాగా వుంది

నటుల వేషధారణ యెంతో వాస్తవికముగానూ సహజంగానూ వుంది దుస్తులలో ఆడంబరమూ లేదు సంగీతము లేనేలేదు రంగము ముగిసిన తరువాత మాత్రము సంగీతము వినిపిస్తూ వుండెను నటన అత్యద్భుతముగా సొగసుగా వున్నది బఫూనరీ తప్పించి మిగిలినదంతా సహజసిద్ధమైన పాత్రోచితమైన అభినయము విషాదాంత నాటకములలో మధ్య మధ్యన బండ హాస్యము చాలా అసంగతంగా వుంటుంది

నిన్న ప్రదర్శించిన నాటకము విషాదాంతము.

బెంగాలీ థియేటరునకు కూడా నేను వెళ్ళి చూస్తిని. ఇది మిగుల చిన్నది. నేను వెళ్ళేసరికి వొక ప్రేమ ఘట్టము ప్రదర్శితమౌతూ వున్నది. వొక అమ్మాయికీ, మరివొక నిద్రభంగికీ జరుగుతున్న ప్రేమఘట్టం. యువకుడు చాలా దృఢకాయుడు. పగడపు రంగు దుస్తులు ధరించి వున్నాడు. పిల్లయితే మధురముగా మాటలాడుతూ, చక్కగా నటిస్తున్నది. కాని, చూడదానికి నాజూకుగా కనిపించలేదు.

మిగిలిన రంగములన్నీ బవూనరీలే! ఒక బ్యాలటు మాత్రము బహు బాగున్నది. ట్యూనులు చక్కగా వీనులవిందుగా వున్నవి. కాని వాద్యసమ్మేళనము మాత్రము ఘోరాతిఘోరం!

(1898 డిసెంబరు 1 డైరీ)

# హరిశ్చంద్ర నాటక పీఠిక

విజయనగరం "జగన్నాథ విలాసినీ నాటక సమాజం" వారి అభ్యర్థనను పురస్కరించుకొని రచయిత యీ నాటకాన్ని రచించగా, 1898వ సంవత్సరం మధ్యకాలంలో తొలిసారి యిది ప్రదర్శితమయింది. అటు పిమ్మట అనేకసార్లు రాష్ట్ర నగరాలలో వివిధ నాటక సమాజాల వారు దీనిని అభినయించారు. జయప్రదమైన యీ ప్రదర్శనలు రచయితను తన నాటకాన్ని ప్రచురించేటట్లు ప్రోత్సాహపరిచాయి.

అయితే సాహిత్య ప్రమాణాలు కలవని అనుకునే యిలాంటి నాటకాలను విదేశ భాషలో ఎందుకు రచించవలసి వచ్చిందో, అందుకు సబబు యేమిటో చెప్పుకోవలసిన అగత్యం వుంది. ఇప్పుడు ఆంగ్లం భారతదేశంలో ప్రభుత్వ భాషగా, స్థిరపడిపోయి అందరినీ ఆకర్షిస్తోంది. ఉన్నత తరగతుల వాళ్ళు తమ యవ్వన దశలో అమూల్య కాలాన్ని ఆంగ్లాన్ని అభ్యసించడానికి, ఆ భాషాజ్ఞానాన్ని పెంపొందించుకోడానికి వినియోగిస్తున్నారు. అలాంటపుడు యే కొద్ది మంది పండితులు మాత్రమే ఆనందించే అతి కఠిన కృతక ద్రావిడ గ్రాంథిక భాషలలో రచించడం కంటె, హెచ్చు మందిని మెప్పించే ఆంగ్లభాషలలో తమ కావ్యాలను రచించి వారిని ఆకట్టుకొని అధిక ప్రయోజనాన్ని పొందుదామని రచయితలు ఆశపడవచ్చును. ఆంగ్ల భాషలలో రచన కొనసాగించే యిటువంటి ప్రయత్నం హర్షణీయం కాకపోయినా, పోనీ అభ్యంతరకరం మాత్రం కాదు. భారతదేశంలో వివిధ రాష్ట్రీయుల భావ ప్రకటనకు ఆంగ్లభాష వొక సాధనంగా ఉపయుక్త మౌతూ, సంస్కృత హిందీ భాషలను అవతలకు నెట్టి అధిగమిస్తోంది. అంతేకాక, ప్రతి సంవత్సరం అధిక సంఖ్యాకులౌతున్న విద్యార్థికులలో, నూత్న భారతదేశ స్వరూపాన్ని సాక్షాత్కరింపచేస్తూ నిద్రాణమైవున్న జాతీయ భావాన్ని, చైతన్యాన్ని మేలుకొలుపుతోంది. నిరవధికోత్సాహాన్ని కలిగిస్తూ కొత్తకొత్త ఆలోచనలను రేకెత్తిస్తూ కాల్పనికతను పెంపొందిస్తోంది. పురాతన ప్రపంచ భావాలకు నూత్న ప్రపంచపు భావాలకు సంబంధం యేర్పడినపుడు, యిటువంటి పరివర్తన కలగడం సహజం.

సహజంగా భారతదేశం పట్ల ఆసక్తివున్న పాశ్చాత్యులెవరికైనా మన దేశపు భూత వర్తమాన కాలాల జాతీయ జీవితాన్ని తెలుసుకోవాలనే కోరిక వుంటుంది. మన మేధావులు రచించిన కావ్యాలను పరిశీలించి భారతదేశ జాతీయ జీవిత స్వరూపాన్ని అవగతం చేసుకోవాలనే కాంక్ష వుంటుంది. అలాంటపుడు మన జీవితంలో

ఆకర్షవంతమైన సంఘటనలను అన్యదేశీయులకు చూపుతూ, ఆంగ్లభాషలో రచనలు సాగించే భారతీయులు తమ మాతృదేశానికి అపారమైన సేవ చేసిన వారౌతారు.

భారతీయ సాహిత్యంలో పాశ్చాత్యులను రచింపచేసేది. సత్యహరిశ్చంద్రుని జీవితచరిత్ర. అందుకు యింత చక్కగా కుదిరిన కథ యింకొకటి లేదంటే అతిశయోక్తి కాదు.

సత్యహరిశ్చంద్రుని జీవిత కథను ఇతివృత్తంగా స్వీకరించి దానిని రసవత్తరంగా పరిపోషించడం కోసం కథా సన్నివేశాలను రచయిత మలచుకొన్నాడనేది స్పష్టం. కొన్ని సంఘటలను యిలాగ మలచుకోవడమేగాక, కథాగమనానికి పాత్ర నిర్మాణానికి అనువుగ మరికొన్ని సన్నివేశాలతు రచయిత కల్పించుకున్నాడు.

ఈ నాటకంలో కొన్ని ప్రకృతి కతీత శక్తుల లక్షణాలు గర్భితమై వున్నప్పటికీ, అవి మానవ జీవితానురక్తికి భంజకములు కావు. అవి, ఈశ్వరేచ్ఛ అలాంటిదనే భావాన్ని కలిగిస్తాయే తప్ప జీవితంపై విరక్తిని కలిగించవు. హరిశ్చంద్రుని కుటుంబీకులకు అన్ని విపత్తులు కలగడం, ఆ విధంగా ఊహాతీతమైన కష్టపరంపరను చిత్రించడం అసహజమని కొందరు అంటున్నారు. వారిలా అంటున్నప్పుడు వొక విషయాన్ని విస్మరిస్తున్నారు. మానవ శ్రేయస్సు కోసం ప్రొమెథియస్ ఎన్నో కష్టాల పాలయాడని, కాన్‌కనిస్ పర్వతానికి బంధింపబడ్డాడని, అతని శరీరాన్ని పేగులను గద్దలు తిన్నా భరించాడని, అతని విపత్తులు సత్యహరిశ్చంద్రుని కష్టాలకంటె అధికతరమైనవని జ్ఞాపకం పెట్టుకోవలసి వుంటుంది. ఒక గుణం అది మంచిదైనా, చెడ్డదైనా హెచ్చుస్థాయిలో వున్నపుడు కలిగే ఫలితాల దృష్ట్యా గ్రీకులు తమ నెమిసిస్ దేవతను ఊహించుకున్నారు. ఈ భావమే క్రైస్తవ నాటక సాహిత్యంలో సైతం ప్రస్ఫుటమై తన ప్రభావాన్ని నెరపుకుంది. ఈ సందర్భంలో నేను మర్చంటాఫ్ వెన్నిస్, ఒథెల్లో నాటకాలలోని ఆంటోనియో, డెస్టిమోనాల ఉదంతాన్ని ఉదహరించదలచుకున్నాను. అయితే అతి మంచికోసం ఎంతటి దురవస్థలనైనా అనుభవించాలనే భావం ఎవరినీ సంతృప్తిపరచదు. న్యాయమంటే వారికిగల అభిప్రాయాన్ని ఆ భావం తృప్తిపరచదు. అదీగాక లోకంలో ఏ వస్తువూ సర్వమూ సుగుణోపేతంగా, ఆద్యంతమూ ఉత్తమోత్తమంగా వుండబోదని ఎవరికైనా తోస్తుంది. వాతావరణ వంశ పారంపర్య ప్రభావాలు శీలప్రభావ స్థితిగతులను నిర్ణయిస్తాయనే ఇబ్సన్ సిద్ధాంతం యింతవరకూ పెంపొందిన జ్ఞానదృష్ట్యా యెంతో హేతుబద్ధంగా కనిపిస్తుంది. అయినప్పటికీ జీవితంలో హెచ్చు తగ్గులు ఎందుకు కలుగుతున్నవో కర్మ సిద్ధాంతం సమాధానపరిచినంతగా మరి యేదీ, అది ప్రాచీనమైనదైనా, ఆధునికమైనదైనా జవాబు చెప్పడం లేదు. అన్ని విశ్వాసాలకంటె, సూత్రాల కంటె కర్మ సిద్ధాంతం జీవిత వ్యత్యాసాల హేతువులకు బలమైన సమర్థింపు.

కేవల విషాదాంతాలను భారతీయుల ఉపజ్ఞ సహించలేదన్న మాట వాస్తవమే అయినా, ఉత్తర రామచరితము, నాగానందము ఇత్యాది సంస్కృత నాటకాలలో ఆ లక్షణాలు బహుళంగా స్థానం కల్పించుకున్నాయి. ఈ నాటకాలన్నిటా యీ నాయకులు పడే అనంతమైన దురవస్థలకు హేతువులేమో తెలుసుకోవాలంటే వారి ప్రస్తుత జన్మలను కాక మరొక చోట పరిశీలించవలసి వుంటుంది. కనుకనే 'హరిశ్చంద్ర' నాటకకర్త తగు రీతిని నాయకుని చేత యీ మాటలను పలికించారు. :

"This sage was saviour of my sire
Nor my... son can harbour ire
From sins of bygone births by troubles feigned
He purged this wrethed soul and fame attained.

భారతీయ సాహిత చరిత్రలో హరిశ్చంద్రకు గల స్థానం అద్వితీయం ఆత్మత్యాగంలో వున్న ఉదాత్తత నాటకీయ చాతుర్యంతో అత్యంత గంభీరవంతంగా చిత్రింపబడింది సత్యంపట్ల హరిశ్చంద్రుని విశ్వాసం అచంచలం సత్యభాషలణలు ఆచరణలు జీవిత ధ్యేయాలుగా ఉపలక్షించుకొని వొక ఉత్కృష్ట ధర్మంకోసం హరిశ్చంద్రుడు తన జీవిత సర్వస్వాన్ని త్యజించాడు సత్యంపట్ల భారతీయ మేధ ఆ విధంగా భావిస్తున్న కాలంలో అతని కథ ఊహింపబడింది ఆనాటి జాతీయ మేధకు అది వొక అభివ్యక్తీకరణ భారతీయు ఆదర్శాలు యెట్టివో ఇతర దేశాల కారుణ్యవాదులకు హరిశ్చంద్రుని జీవిత కథ విశదపరుస్తుంది అదే విధంగా అది భారతీయులకు వొక విషయాన్ని తేటతెల్లం చేస్తుంది శతాబ్దాల తరబడి రాజకీయ బానిసత్వం వలన మరుగుపడివున్న ఉదాత్త జాతీయ మన ప్రవృత్తిని విద్యావంతులైన హిందువులకు బహిర్గతంచేసి వారిలో వారి ప్రభావానికి లోనౌతున్న వ్యక్తులలో అట్టి ప్రవృత్తిని కలిగించడానికి ఇది దోహదపడవచ్చును

ఈ నాటక ప్రదర్శనాన్ని అనేక మంది పాశ్చాత్యులు తిలకించి యెంతో శ్లాఘించారు విక్టోరియా హాలులో ఓరియంటల్ డ్రమెటిక్ కంపెనీ వారు తన కోసం ప్రత్యేకంగా యేర్పాటు చేసిన ప్రదర్శనానికి మద్రాసు గవర్నరు లార్డ్ వెన్లక్ విచ్చేసి పైనాటక కంపెనీ స్థాపకుడు అధ్యక్షుడూ అయిన ఈ నాటక రచయితను అభినందిస్తూ యీ సెగువ ఉదహరించిన విధంగా వొక లేఖను వ్రాశారు

గవర్నంట్ హౌస్
మద్రాసు
6 మార్చి 1896

ప్రియమైన అయ్యా

మీరు ఆంగ్లంలో రచించిన హరిశ్చంద్ర అనే ఉత్తమ నాటక ప్రదర్శనాన్ని చూసినపుడు నాకు కలిగిన ఆహ్లాదాన్ని తెలియచేయాలని భావించాను మీరు అభినయించవలసిన భాగం అధికంగావున్నా అది ఆంగ్లంలో అభినయించవలసివచ్చినా యెంతో శ్రమపడి మీ భూమికను మీరు నిర్వహించారు. నాటక ప్రదర్శనం విజయవంతం కావడానికి మీ సమాజం పడిన శ్రమకూ తీసుకున్న శ్రద్ధకు మిమ్మల్ని అభినందించవలసి వుంది మీ నటనా కౌశలాన్ని అద్భుతంగా మీరు నిర్వహించిన భూమికను చూసి నేనెంతో ఆశ్చర్యచకితుణ్ణయాను నేను అలసిపోయి వుండడంవల్ల నాటకం చివర వెళ్ళిపోవలసి వచ్చినందుకు విచారిస్తున్నాను

# శ్రీరామ విజయ వ్యాయోగ నాటకానికి పీఠిక

ఉపోద్ఘాతం స్థానంలో నేను ది తెలుగు హార్ప్ 1894 డిసెంబరు 21వ తేదీ సంచికలో వెలువడిన దిగువ నున్న సవిమర్శక వ్యాసాన్ని ఉల్లేఖిస్తే సరిపోతుంది.

దివ్య సామ్రాజ్య తీరంలో యుద్ధ మేఘాల ఫెళఫెళార్భటులు మోగుతూన్న సమయంలో, ప్రాచీన కళింగ రాజధానిలోని విద్వత్సంపన్నమైన ఒక పండితుని హృదయంలో వీరావేశం పొంగులు వారటం ఆసక్తికరమైన విశేషం. విజయనగరం మహారాజా కళాశాలలో సంస్కృత అధ్యాపకులైన బి. లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, లంకపై రాముని దండయాత్రను గురించిన పురాతన కథను నాటక రూపంలో ప్రపంచానికందించారు. ఆ కథ సాహిత్య ప్రక్రియకు యితివృత్తం కావటం బహుశా యిది వేయిన్నొకటవసారి. కాని ప్రస్తుత ప్రయత్నం, నాటకంగా విశిష్టతకన్న దానిపైగల సమకాలిక ప్రభావం దృష్ట్యా, చెప్పుకోదగినదే.

నాటకాన్ని పరిచయం చేసే సంభాషణలు, నాటక ప్రదర్శన గురించిన సాంప్రదాయిక ప్రస్తావనను మరిచిపోలేదు. మన ప్రాచీన భాషలోని యిటీవలి నాటకాలు చాలా వాటిలో లాగానే, యీ ప్రథమ ప్రదర్శన సందర్భం కూడా ఊహా కల్పితమే అయినప్పటికీ, దీనిలో కనీసం సంభావ్యతా బీజాలున్నాయి. అన్ని రుతువుల్లోనూ శరదృతువు దండయాత్రలకు ఉత్తమమైనదని, పూర్వకాలం నాటి మన యోధుల అభిప్రాయం. ఆ రుతువులో, కళింగ దేశాధీశుడైన మహారాజా ఆనంద గజపతి రాజులుగారు వంశధార నదీతీరంలోని ప్రాచీన ముఖలింగ దేవాలయం వద్ద తన పదివేల రసపుత్ర వీరులను సమావేశపరుస్తారు. సుప్రసిద్ధుడైన తన మిత్రుడు ఫీల్డ్ మార్షల్ లార్డ్ ఫ్రెడరిక్ రాబర్ట్స్ వున్న వాయవ్య సరిహద్దు రాష్ట్ర శిబిరానికి బయలుదేరేందుకు ముందు సన్నాహమిది. సమావేశమైన యోధులకు యేదో ఒక వినోదం చేకూర్చాలని సూత్రధారుని కోరిక. ఒక మహావీరుడు నాయకుడుగా గల నాటకాన్ని ప్రదర్శించాలని వారు కోరుతారు. సూత్రధారుడు అటువంటి నాటకంకోసం తీవ్రంగా ఆలోచిస్తాడు. ఆ సమయానికి సరిపోయే శ్రీరామ విజయ వ్యాయోగం అతనికి జ్ఞాపకం వస్తుంది. వెంటనే దాని ప్రదర్శనకై ఏర్పాట్లు చేయడానికి ఉపక్రమిస్తాడు.

కాని, అలా చేయడానికి ముందు, సూత్రధారుడు తన మిత్రుడయిన నాటక కర్త పూర్వీకులను వర్ణిస్తాడు. వారిలో ఒకరు మాత్రం ముసలాయుధుడుగ (?) పేరు పొందినా, వారంతా విద్వాంసులు, శౌర్య ప్రదర్శనల

జోలికి వెళ్ళినవారు కాదు. కవి పూర్వ వంశీకుల్లో ఆరవ తరానికి చెందిన ఒకరు ఎంతగా దైవానుగ్రహం పొందిన వాడంటే, ఆయన దైవ విగ్రహ పేటిక ప్రమాదవశాత్తు గోదావరి నదిలో పడిపోగా, ఆ విగ్రహాలు అత్యద్భుతావహంగా తిరిగి ఆయన వద్దకు వస్తాయి.

జయప్రదమైన సీతాన్వేషణనుంచి హనుమంతుడు తిరిగి రావటంతో నాటకం ప్రారంభమవుతుంది. కవి సాంప్రదాయిక పద్ధతులను తుచ తప్పకుండా పాటిస్తున్నాడనీ, కథను సంభావ్యతా పరిమితుల్లోకి తీసుకురావడానికి ప్రయత్నించలేదనీ వేరే చెప్ప నవసరంలేదు. వాస్తవంలో, మానవాతీత శక్తికి చోటు లేకుండ చేయడం దైవ దూషణగా, చారిత్రక సత్యానికి ఘోరాపచారంగా పూర్వాచార పరాయణులైన ప్రజలు భావిస్తారు. ఐతే మన కవి, వాల్మీకి కథన క్రమాన్ని చాలా సందర్భాల్లో అతిక్రమించాడు. ఈ నాటకంలోకల్లా పేర్కొనదగిన లక్షణం ఆధునిక భావాలను, కల్పనలను ప్రవేశపెట్టడం. ఇవి ఈ నాటకాన్ని ఒక కలగూర గంపగా చేస్తున్నా, పాశ్చాత్య నాగరికత ఒక వృద్ధ పండితుని మనసుపై వేసిన ప్రభావాన్ని తెలుపుతూన్నందువల్ల చాలా ఆసక్తి దాయకమైనది. ఈ రచయితకు ఆధునిక యుద్ధ పద్ధతులు తెలియనవి కావు. నాటకంలో ప్రవేశపెట్టిన విచిత్రమైన హాస్యరసం ఈ నాటకానికి అనిర్వచనీయ ఆకర్షణను సంతరిస్తోంది.

హనుమంతుడు సీతాన్వేషణ కథను ఒక్క ముక్కలో సమాహరించిన శ్లోకంలో చెబుతాడు. అతని విజయ వార్తను, సీతాదేవి క్షేమ సమాచారిన్న ఒక్కపాదంలో స్ఫురింపజేసే ఆ పదాల పొందిక అద్భుతమైనది.

"దృష్టా సీతా ప్రాణితీ సింహలే సా"

రాముడు క్షణ కాలం ఏదో ఆలోచనలో మునిగిపోవడ మొక్కటే అతని హృదయోద్వేగ సూచన, తప్పనిసరిగా పాటించవలసిన ఇండో-ఆర్యన్ల నాటక కళా లక్షణానికి యిదొక ఉదాహరణ. వ్యాయోగంలో ప్రధాన రసం తప్ప యితర భావోద్వేగాల నన్నింటిని వారు నిషేధించారు. ప్రాచీన సంప్రదాయ సిద్ధమైన ఏకతా నియమాలను తాను కచ్చితంగా పాటిస్తున్నాననే విషయమై ఎలాంటి సందేహం లేకుండా చేయడానికి కవి, వృద్ధ మంతి జాంబవంతుని నోట యిలా పలికిస్తాడు :

సీతోదన్తవశా ద్దయార్ద్రహృదయః కిఞ్చి చ్చలచ్చేతనః
తామ్య న్మోహ ముపాగతఽపి సహసా ధైర్యా న్ని రున్ధ న్మనః
రక్షః కక్ష దిధక్షు రక్షియుగలా ద్రోషాగ్ని ముజ్ఝమ్భయన్
క్షిప్రం న్యక్షసదృక్ష రూక్ష విభవే క్షిప్తోరసే రాఘవః

తరువాత అతిథేయులైన వానరులు లంకా దండయాత్రకు సన్నాహాలు చేస్తారు. కాని వానర వీరుల్లో అగ్రగణ్య నిర్ణయ సమస్య చర్చకు వస్తుంది. సైన్యాధ్యక్షుడైన నలుడు పోటీ పరీక్షల్లోని చెడుగులను ఒక్క ముక్కలో చెబుతాడు! పరీక్ష మరీ కఠినమైనదైతే, అర్హులు ఓడిపోయి, వారిని అనర్హులకింద లెక్క గట్టవలసి వస్తుంది; పరీక్ష మరీ తేలిగ్గా వుంటే, అనర్హులు నెగ్గి అర్హుల సరసన కూర్చుంటారు. సుగ్రీవుడు, ఈ సమస్యకు పరిష్కారమేమిటని జాంబవంతుని అడుగుతాడు. కాని ఆ భల్లూక మంత్రి ఆధునిక సలహాదారునిలాగ ఈ సమస్యను వోటుద్వారా పరిష్కరించడం మంచిదంటాడు. సుగ్రీవుని అభిప్రాయమిది : "మహా సముద్రాన్ని ఒక్క గెంతులో దాటగలవారు అర్హులు, మిగతావారు లెక్కలోకి రారు." పాంబన్ సింధుశాఖను (పాంబన్ మార్గాన్ని) మురుగుకాల్వలాగా దాటటం చిన్నతనంలోనే పెద్దలనుంచి నేర్చిన వానర యోధులకు ఇది మరీ తేలికైన పరీక్ష అని మంత్రి దాన్ని కొట్టిపారేస్తాడు.

ఇక్కడ హనుమంతుని అభిప్రాయాలు అతని స్వభావాన్ని తెలుపుతాయి మృగ సహజమైన అమితోల్లాసంతో పలుసార్లు నింగికెగిరి బ్రహ్మాండ భాండ కరిన తలం తాకిడికి తలలు బొప్పికట్టిన వారిపైనే తాను రానున్న యుద్ధంలో నమ్మకం వుంచుతానని ఆయన అంటాడు వృద్ధ భల్లూకం బుద్ధిబల ప్రదర్శనల్లో ఓడిపోయే రకం కాదు ఆయన హనుమంతుని వాదనను చిత్తు చేస్తాడు నక్షత్రాలనీ గ్రహాలనీ యూరోపియన్ హిందూ ఖగోళ శాస్త్రజ్ఞులు పేర్కొంటున్నారు నిజానికి తెలివి తక్కువ వానర బాలురు అప్పుడప్పుడు ఆటవిడుపు రోజున విడగొట్టిన బ్రహ్మాండ భాండ శకలాలు తప్ప మరొకటి కాదని జాంబవంతుని జవాబు సమస్త వానరులు శౌర్యంలో సమానులన్న ఆయన నిర్ధారణ తుదకు అందరూ అంగీకరించి అగ్రగణ్యులను నిర్ణయించే తీవ్ర యంత్రం మానుకొంటారు అది ఎంతో వివేకవంతమైనది కూడా ఎందువల్లనంటే, అసంఖ్యాక వానర సమూహాల్లో క్రమపద్ధతిని అమలు పరచడం జయప్రదమయ్యే ప్రయోగమా అనేది సందేహాస్పదమే

ఈ భూప్రపంచంలో యేదీ కొత్తది కాదని పూర్వాచార పరాయణులైన హిందువులందరి నమ్మకం నేటి అంగుష్ఠ మాత్రుల దృష్టిలో అద్భుతమైనవిగా కనిపించే నూతన కల్పనలన్నీ ఎంతో మౌలికమైనవిగా అగుపించే భావాలన్నీ మన ప్రాచీనులకు తెలుసునని వారి అభిప్రాయం కాబట్టి రాముడు తల ఎత్తి చూచి పొగలేని రైలింజన్ల లాగా నిర్భయంగా తిరుగాడేవారంతా ఎవరు? అని విస్తుపోవటం కాలవ్యతిక్రమ దోషం కాదు

దానికి వానర రాజు ఇలా సమాధానమిస్తాడు ·

ఉద్వృత్త రాక్షస కలత్ర గలత్రిసూత్రీ
చ్ఛేత్తుః ప్లవఙ్గమ గణాః తవ భృత్యభృత్యాః

వానర సైన్యం ఈ కోస్తానుంచి ఆ కోస్తాదాకా వ్యాపించి వుందని తనకు నివేదించగా రాముడు ఆ మహాసైన్య విస్తృతికి ఆశ్చర్యపడతాడు అప్పటికే ప్రథమశ్రేణి లంక చేరుకుంది సైనికులు యేమిచేస్తున్నారని రాముడు సుగ్రీవుణ్ణి అడుగుతాడు వారు లంకలో తమ నివాసం కోసం గుంటలు తవ్వు కున్నారని తవ్విన మట్టితో లంకకూ భూ ఖండానికి మధ్య వారధి నిర్మిస్తున్నారనీ సుగ్రీవుడు తెలియజేస్తాడు సముద్రాన్ని బురదనీటి గుంటను దాటినట్టుగా దాటిన వీరులకు ఈ అల్పకార్యం యివ్వతగునా అని సందేహిస్తున్న రామునికి సుగ్రీవుడు సాధారణ మానవులకు వంతెన నిర్మాణోపయోగాలను గురించి వివరిస్తాడు నాయకులు సమాలోచనలు జరుపుతున్న ప్రస్రవణ పర్వతానికి కొన్ని కర్ర పెట్టెలలో ఒక సైనికుడు వస్తాడు వాటిని తెరిచి చూడగా వాటిలో వివిధ దళ నాయకులకు పంచిపెట్టడానికి సేనాధిపతి పంపిన గడియారాలు భూగోల పటాలు వుంటాయి వీటిని చూచిన రాముడు సహజంగా సంభ్రమాశ్చర్యభరితుడై యిలా అంటాడు

అహో చిత్రలేఖణ కౌశలం చిత్రకారస్య తదాహి
రేఖా బిన్దు విరామాశ్చ దైర్ఘ్య స్థౌల్య విశాలతాః
సదృశా ఎవ దృశ్యన్తే సర్వచిత్రపటే ష్వహో
కిఞ్చ తత్త త్ప్రదేశ బోధికా వర్ణపఙ్క్తయో నీలపీతాది వర్ణాశ్చ సమ్యగ్ లిఖితాః అపిచ
బ్రహ్మాణ్డోదరమధ్యవర్తిన ఇమే ద్వీపస్సప్తలోకాః క్రమా
దృశ్యన్తేఽత్ర సముద్రసప్తక మరుత్ స్కంధర్క్ష గోలాదయః
కిఞ్చాబ్దాయన మాస పక్ష ఘటికా కాష్ఠా నిమేషాదయో

జ్ఞాయన్తే ఖలు కాలబోధక మహాయన్త్రే త్వహో సాम्प्रతమ్."

చిత్ర పటాల సంఖ్యను బట్టీ అవన్నీ ఒకే విధంగా వుండటాన్ని బట్టీ, అవి యంత్రాలు తయారు చేసినవని రాముడు సరిగానే ఊహిస్తాడు. భూగోళ చిత్ర పటాలూ, గడియారాలను కోతు లేమిచేసుకొంటాయని పాఠకునికి సందేహం కలగవచ్చు. కాని రాముడే వాటి ప్రయోజనాన్ని యిలా వివరిస్తాడు :

"సఖే వానరరాజ! అచిర ప్రవర్తిష్యమాణ రక్షో వానర మహావీర వ్యతికరే పరస్పర సమ్మర్ద వశా దన్దకారిణే భూనభోఽన్తరాలే రాత్రిందివ విభాగ పరిజ్ఞానార్థ మపేక్షితం కాలయన్త్ర నిరీక్షణం. చిత్ర పటానాం ప్రయోజనం తావ ద్విజ్ఞాతవ్య మస్తి."

సుగ్రీవుడు ఇలా అంటాడు :

"లఙ్కా యాత్రాయాం ప్రసక్తాయాం యది కదా బిత్ సమ్మర్దవశా న్మార్గ నిరోధే సత్యుపర్యుపరి గచ్ఛన్తః కపివీరా స్తత్తన్నానాపరిజ్ఞానా త్సఞ్జాత విభ్రాన్తయః ప్రతీపం గచ్ఛేయు, రథవా విస్ఫోటితబ్రహ్మాణ్డ భిత్తయో బహిర్నిర్గచ్ఛేయు, స్తతశ్చ సజాతీయే ష్వనేక కోటి బ్రహ్మాణ్డే ష్విదమేతద్ బ్రహ్మాణ్డ మితి కోవా విజ్ఞాతుం శక్నుయాత్? పశ్చాల్లఙ్కా యాత్రావ్యగ్రమనసా ఏకైకం బ్రహ్మాణ్డం విస్ఫోట్య విజేతుం యద్యారభేరన్ అకాణ్డే సర్వసృష్టి విలయః ప్రకృత కార్య విలమ్బశ్చ ప్రసజ్యేత. ఏతన్మూలకో జగత్స్రష్టుః పరమేశ్వరస్య విజిగీషో ర్దేవస్య వా వ్యాకోపో మాభూదితి మహదస్తి ప్రయోజనమ్"

జ్యోతిష్కులు నిర్ణయించిన శుభ ముహూర్తాన సేనావాహిని వాయుమార్గంలో పయనమవుతుంది. అప్పుడు హనుమంతుడు రాముణ్ణి ఒక విచిత్రమైన కోరిక కోరుతాడు. రామలక్ష్మణులిద్దరినీ తన భుజాలపై సముద్రం మీదుగా మోసుకెళ్ళడానికి అనుమతించాలని అతని ప్రార్థన. కాని ఆ మహావీరుని ఒక మామూలు వాహనంగా ఉపయోగించుకోవడమన్న భావమే రామునికి సహించరానిది. అదే సమయంలో హనుమంతుని కోరికను నిరాకరించడమూ అతనికి ఇష్టం లేదు. అన్ని ఉత్సవ సందర్భాల్లో క్షత్రియులకు ఆయుధం సంకేతంగా గుర్తించబడుతున్నందు వల్ల రాముడు తన ఆయుధాన్ని ఆ వానర నాయకునికి యిచ్చి, ఈ సందిగ్ధావస్థ నుంచి బయటపడతాడు. కాని యిది అవిశ్రాంతుడూ, మహా సాహసీ అయిన వాయు పుత్రునికి తృప్తి నివ్వదు. మొరటు యోధుడు కాబట్టి, నాయకులు సమావేశమై వున్న మొత్తం పర్వతాన్నే తన తలపై మోసుకొని పోవడం ద్వారా నరనాథ పుత్రుని యెత్తును వమ్ముచేస్తాడు.

ఈ కదలికను అందరూ గమనిస్తారు. ఇది కొందరు నాయకుల హృదయంలో భయాందోళనను కలిగిస్తుంది. కదలికకు కారణాలను గురించి వారు ఆందోళనతో పాటు, పాండిత్య ప్రకర్షతో చర్చిస్తారు. కొద్దిసేపటిలో వారు సూర్యమండలాన్ని సమీపించడంతో, సూర్యకిరణాల వేడిమి దుస్సహ మవుతుంది. సౌరమండలానికి దగ్గరలోవున్నా తన ప్రశాంతత కోల్పోని జాంబవంతుడు విశ్వచిత్ర పటాలను పరిశీలించి, తాము సూర్యునికి కేవలం రెండున్నర మైళ్ళ [illegible]ంలోనే వున్నామని ఆశ్చర్యంతో ఎల్గెత్తి చెబుతాడు. వానర ముఖ్యుల ధైర్యం సన్నగిల్లుతున్న సమయంలో, హనుమంతుడు హఠాత్తుగా కిందికి దిగి, కొండను లంక గట్టున జాగ్రత్తగా ఉంచుతాడు. కాబట్టి సింహళ ద్వీపంలో ఒక కొండ ఉనికికి మూలం ఒక కోతి చిత్త చపలతే తప్ప జలప్రవాహాలూ కాదు, భూగర్భ ద్రవాల ఘనీభవమూ కాదు అని ఆధునిక భూగర్భ శాస్త్రజ్ఞులు గమనిస్తారు. ఇప్పుడు ఇరుపక్షాల సేనలు ముఖాముఖి మోహరింపబడుతాయి. శత్రుశిబిరంలోని యోధాగ్రేసరుల పేర్లు ఇక్కడ మనం వింటాము. వీటి అనువాదం ఆసక్తికరం కాకపోదు. ఇవి, "స్థూలహస్తుడు, మహోదరుడు, మహాపార్శ్వుడు, వజ్రదంతుడు, విద్యుజ్జిహ్వుడు, వికృతాక్షుడు, జ్వాలాక్షుడు."

సుగ్రీవుడు రాముని సమీపించి, సైనికుల, సేనాలను "సమరోత్సాహాన్ని" అదుపులో వుంచడం కష్టమైపోతున్నందు వల్ల పోరుకు ఉత్తర్వు లివ్వవలసిందిగా అభ్యర్థిస్తాడు. కాని రాముడు తన కాలంకన్నా ముందున్న వ్యక్తి. సేనాధిపతులు మామూలు సైనికుల సరసన, సంకుల సమరంలో పాల్గొని, తమకు ప్రమాదం తెచ్చుకోవటాన్ని ఖండించడంలోప్లూటార్క్‌తో ఏకీభవించేది ఆయన ఒక్కడే. కాబట్టి వానర ప్రభువు సుగ్రీవుడు, ఆయన వృద్ధ సచివుడు జాంబవంతుడు, శత్రుపక్షంలో చేరిన విభీషణుడు, వైద్య శిఖామణి సుషేనుడు. అరివీర భయంకరుడైన హనుమంతుడు వారందరితో ఒక పర్యవేక్షక సమితిని యేర్పాటు చేయాలని రాముడు ప్రతిపాదిస్తాడు. వీరు కొండపై కూర్చుని, దుర్బిణులతో పోరాటాన్ని గమనిస్తూ, అవసరమైనప్పుడు తగు ఆదేశాలివ్వాలని రాముని సూచన. సుగ్రీవుడు "చిత్తం ప్రభూ!" అని గొణుగుతాడు. కాని, తాను క్రియాశూన్యుడుగా వుండవలసిన స్థితి అతని మనసుకు కష్టం కలిగిస్తుంది. హనుమంతుడు మాత్రం తన మనసులోని మాట ఇలా చెబుతాడు : ప్రభూ, పరిశీలనకు, సలహాలకు గురుపాదుడు, జాంబవంతుడు చాలు. చపలచిత్తుడనైన నేను చేయగలిగిన మేలేమీ లేదు." సమరోత్సాహులైన సేనానాయకుల తరఫున విభీషణుడు కూడ ప్రార్థించడంతో రాముడు, అప్పుడప్పుడు మాత్రమే వారు పోరులో పాల్గొనడానికే అంగీకరిస్తాడు. ఆ విధంగా పని విభజన సూత్రాన్ని ఆయన తెలిసే ఉల్లంఘిస్తాడన్న మాట.

రావణుడు కోట ఉత్తర ద్వారంనుంచి బయటికి వచ్చినప్పుడు, పరాక్రమ శాలి అయిన శత్రువుని గురించిన రాముని ప్రశంస కవి ప్రతిభకు ఉదాహరణ. పరస్పరం తలపడే ప్రత్యర్థులు ఒకరిపై ఒకరు దెబ్బలకన్న ఎక్కువగా తిట్లను కురిపిస్తున్నట్లు రణరంగాన్ని చిత్రించే దేశీయ కవి బాహుళ్యం నుంచి మన కవిని వేరుచేసి చూపుతున్న విశేషమిది.

అహో పౌలస్త్యస్య వీరగోష్ఠీలోలుపతా! అహో బ్రహ్మవర్చసమ్! అహో సామ్రాజ్యవైభవః! తథాహి :

తప్త్వా తపాంసి సుమహన్తి మహానుభావః

సంతోష్య శంకర మవాస్య దయాం తదీయామ్,

త్రైలోక్య మేకధృత చారు సితాతపత్ర

మాక్రమ్య మోద ముపయాతి నహీదృగవ్యః

రావణుడు మానవులైన తన శత్రువుల పట్ల యేమాత్రము గౌరవం చూపకుండా మాట్లాడుతూ రాముణ్ణి వాగ్యుద్ధంలోకి లాగడానికి ప్రయత్నిస్తాడు. ఐతే అది విఫలమవుతుంది. కాని లక్ష్మణుడు రావణునికి అదే వరసలో మారు వడ్డిస్తాడు. ధైర్యశాలినని నిరూపించుకొన్న శత్రువుతో మరింత మర్యాదగా మాట్లాడాలని రాముడు తన సహజ లక్షణమైన ఔదార్యంతో తమ్మునికి హితము చెబుతాడు. ఇక్కడ యుద్ధవర్ణన ఉత్తేజకరమైనదీ. సరికొత్త సన్నివేశాలుకలదీ. రాక్షసుని పది తలలపై సుగ్రీవుని సమర నృత్యం కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది.

ధిం ధిం ధిం ధిం ధణం ధాం దణత ఝణత ఝం

ఝంత ఝం ఝం ఝణంతే

త్యుచ్చార్యోచ్చార్య శబ్దా న్నటతి హి నటవ

న్మూర్ధ్ని మూర్ధ్ని ప్లవంగః,

ధిత్తా ధిత్తా తధిత్తా గధిత గధిత ధీ
ధిత్త ధిత్తేతిరీత్యా
వక్త్రా ద్వక్త్రా త్కదుష్ణం వమయతి రుధిరం
రక్షసా రూక్షసారః

రచయిత వీరరస కావ్యశైలికి కింది శ్లోకాలు ఉదాహరణ :

మౌర్వీజ్కార ఘోషాః చిపురతి పరితో
రోదసీ గహ్వరాన్తః
కర్ణాన్తాకృష్ణ ముక్తా గరుడ గురు గరు
త్స్వర్ణపుఙ్ఖా హ్యసఙ్ఖ్యాః,
ఛిత్త్వా ఛిత్త్వా నిశాటాన్ రఘుపతి విశిఖా
శ్చణ్డవేగాః ప్రచణ్డాః
బ్రహ్మాణ్డాఖణ్డభిత్తీ ర్విదధతి సహసా
రుద్ధ నీరన్ధ్ర రన్ధ్రాః

ద్వన్ద్వీభూతాః ప్లవఙ్గా నిశిచరసుభటా
శ్శైల పాషాణ హస్తాః
కున్తాసిక్షేపణాది ప్రహరణ కరణా
యుద్ధ్యమానా నదన్తః
భిన్ధి ఛిన్ధీతి రున్ధి ప్రజహి జుహుధి హుం
ద్విడ్ఢి పిణ్డీతి తృణ్డీ
త్యన్యోన్యం చాజఘాతం సమరసమరసాః
కోటిశో ఘ్నన్తి వీరాన్.

ముష్టీముష్టి కచాకచి ప్రకుపితా స్తే వజ్రదన్తాదయో
దణ్డాదణ్డి నఖానఖి ప్రచలితా స్తే వాలిపుత్రాదయః
బాహూబాహవి భల్లుకాశ్చ మిలితాః కల్పాన్తకాలోపమాః
యుద్ధ్యన్తే ఘనగన్ధసిన్ధురఘటా హర్యక్షయూథా ఇవ.

మేఘాస్త్రం మారుతేన క్షపయతి కుపితో
మారుతం పార్వతేన
ప్రత్యక్షైప్సీ త్సుమిత్రాసుత ఇవ హరిజి
చ్ఛాజ్కరం వైష్ణవేన,
ఆగ్నేయం వారుణేన ప్రతిహత మకరో
త్తామసం తైజసేన

బ్రాహ్మం బ్రాహ్మేణ రామ శ్శమయతి సహసా
సాహసా ద్రావణోపి.

యుద్ధానంతరం రాముడు సతీ సమేతంగా, కుబేరుని అంతరిక్ష వాహనమైన పుష్పక విమానంపై అయోధ్యకు తిరిగివస్తాడు. ఇక్కడ విమాన ప్రయాణం వర్ణనలో కొంత కొత్తదనం వుంది. అయోధ్యలో భరతుడు ప్రవాహితుల రాకకై ఆందోళనతో వేచివుంటాడు. స్వాగతమివ్వటానికి జరిగిన సన్నాహాలు గవర్నరు ఇటీవలి కళింగ రాజధాని సందర్శన స్మృతులను స్ఫురింపజేస్తుంది :

కస్తూరీ ఘనసార చన్దనరసై ర్గోరోచనాకర్దమై
రథ్యా చత్వర రాజమార్గసరణీ స్సిఞ్చన్తు పౌరాః పురే,
ద్వారేషు ప్రతిమన్దిరం బహువిధాః స్థాప్యాః పతాకాః పునః
సౌధాగ్రేషు తథా సురాలయ మహాహర్మ్యేషు చైత్యేషు చ.

చాలా రోజుల యెడబాటు తరువాత కలుసుకున్న సోదరుల సమావేశ కథనం అత్యంత కరుణారస భరితమైనది. ఇది వీర రసేతర తంత్రులను మీటడంలో కూడ కవి మంచి నేర్పరి అని స్పష్టం చేస్తుంది. రాముడు పట్టాభిషిక్తుడవుతాడు. కాని ఇక్కడ తన రాజధానిలో సైతం, ఆయన్ను యుద్ధం వెంటాడుతుంది. యమునా తీరంనుంచి కొందరు మునులు వచ్చి, ఒకానొక రాక్షసుని దుష్కృత్యాలను గురించి రామునికి ఫిర్యాదు చేస్తారు. మళ్ళీ దండయాత్రకు రాముడు సిద్ధమేకాని, పట్టాభిషేక మహోత్సవం తరువాత మూడు రోజులు తన రాజభవనాన్ని వదిలివెళ్ళడం నిషిద్ధం కాబట్టి, అతడు ఎంతో అయిష్టంగానే ఈ కర్తవ్యాన్ని ఇతరులకు అప్పజెప్పవలసి వస్తుంది. వెంటనే సైన్య సమేతంగా తరలవలసిందిగ శత్రుఘ్నుణ్ణి ఆజ్ఞాపిస్తాడు. అతని సైన్యం మానవ సైన్యమే కాబట్టి కవికి ఆధునిక యుద్ధపు సరంజామాను వర్ణించేందుకు ఇక్కడ మంచి అవకాశం దొరుకుతుంది.

సన్నహ్యన్తాం తురఙ్గాః సమదకరిఘటా
శ్చోద్ధ్రియన్తాం పతాకా
ఉద్ఘోష్యన్తా ఇచ్ఛ భేర్యో జయగతిపిశునా
స్సర్వత స్సైన్యమధ్యే,
తన్త్రీవార్తా స్సమన్తా త్ప్రహిణుత శకటా
న్ధూమయంత్రానువిద్ధా
న్పర్యాప్తం చాగ్ని చూర్ణం బిభృత రణముఖే
గోలజాలం సమగ్రమ్.

కిఞ్చాసేతు హిమాలయ మధ్యవర్తినో యే తుపాయనపాణయో ద్వారి వర్తన్తేతే సర్వేపి :

దిగ్దన్తావల దన్తకన్దకషణ ప్రోచ్చణ్డ దోర్మణ్డలాః
కున్తాసి చ్ఛురికా ద్వినాలనళిక వ్యాయామ పారఙ్గతాః,
భేత్తుం మస్తక మన్తకస్య సహసా దక్షా మహా క్షత్రియాః
నాసీరం పరిపూరయన్తు సహసా శత్రుఘ్న సఞ్చోదితాః.

ఈ నాటకకర్త దేశంలోకెల్లా గొప్ప పండితుల్లో ఒకరు. ఇటీవలి మన కవుల్లో జీర్ణించుకుపోయి, వారి రచనలను పాడుచేస్తున్న పాండిత్య ప్రకర్ష ప్రలోభంనుంచి ఈ పండితుణ్ణి రక్షించింది - ఈయన ప్రతిభ, పాశ్చాత్య సాహిత్య విమర్శ సూత్రాలతో ఈయనకు గల పరిచయమే. శ్లోకాలు ధారాశుద్ధితో సాగిపోతాయి. శైలి రమ్యమైనది. ఈయన వాడిన కొద్ది ఉపమలు సముచితమైనవి. ఉపమల మూలాల సంగతికి వస్తే, ఈ వృద్ధపండితుడు బ్రాహ్మణ భోజ్య పదార్థాలను సైతం - నిజం చెప్పాలంటే, అవి నిస్సారమైనవైనా వదలి పెట్టలేదు. ఉదాహరణకు, వాలాలుగల అసంఖ్యాక వానరవీర సమూహాలను —"గుడ మిశ్ర ధానా సంసృష్ట భర్జిత చణకాన్" వతుగా నమిలి మింగుతానని కుంభకర్ణుడు బెదిరిస్తాడు. రావణుని పది తలలను రాముడు పెరుగు కుండల్లాగా బద్దలు గొట్టాడట. కొన్ని పట్టుల్లో కవి తెలుగు సామెతలను చక్కగ సంస్కృతీకరించారు :

శునో దంశస్యోపానహా తాడనమ్.

గన్తవ్యః తీర్థ విశేషస్స్వయమేవాభ్యుప గతః

కిమితి కలవిజ్కే చన్ద్రహాస ప్రక్షేపః!

రచయిత ప్రసిద్ధ వ్యాకర్త. ఈ నాటక అధ్యయనం పాఠశాల విద్యార్థులకు వ్యాకరణంలో భట్టికావ్యమంత గట్టి శిక్షణనిస్తుంది. పైగా, దీని కొక అదనపు ఆధిక్యం వుంది. అది రచయితలోని వైయాకరణుని కన్న కవే పైచేయిగా వుండడం. నేటి పండితులనుంచి మనం ఆశించలేని ప్రశంసనీయమైన అభిరుచిగల ఈ కవి పాండిత్య ప్రదర్శనకు పూనుకోలేదని మేము చెప్పాము. కాని, ఈ రచనలో అరుదుగా యేదో ఒక శాస్త్ర ప్రస్తావనవున్న సందర్భాలను ఉదాహరించకపోతే, ఈ పండితునికి మేము న్యాయం చేకూర్చినవారం కాబోము.

ఖగోళ శాస్త్రం—

అయే జరఠతాపసః త్రిస్థాన స్థిత శనిగ్రహ ఇవా స్మాకం ప్రతిబధ్నాతి సజ్జరోదర్కమ్!

పూర్వ మీమాంస

ప్రధాన ఫలేనాఙ్గానాం ఫలవత్త్వ మితివత్ ప్రధాన దీక్షయా అఙ్గానాం దీక్షావత్త్వం కుతో న భవతి?

తర్కశాస్త్రం—

దేవ స్వమహిమా త్ర కారణం వయం తు అన్యథా సిద్ధాః

తత్త్వశాస్త్రం—

నృఘానిషాతాం రఘుపుఙ్గవాభ్యాం

రణాజిరే రావణమేగనాదౌ,

ప్రారబ్ధభోగా త్మ విలోకనాభ్యాం

విక్షేప సాక్ష్యావరణే యథైవ.

నాటకాంత మంగళాశీస్సుల్లో కవిత్వ తాత్త్వికతలు సమ్మిళితం అయాయి. నాస్తికత్వం నామావశిష్టం కావాలన్న మనఃపూర్వక ఆశాభివ్యక్తితో నాటకం ముగుస్తుంది. ఈ ఆచార్యుని శిష్యుల్లోని నాస్తికత ధోరణులే దీనికి ప్రేరణ అయి వుంటాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

పుష్యన్తు లతికాః కాలే ఫలన్తు తరవ స్సదా,
కుణ్డోధో ధేనుకం భూయాత్ వాస్తు వాతా స్సుగన్ధయః.

మాయావీ కురుతాం ప్రపంచరచనా
ముచ్ఛృంఖలం మాయయా
తజ్ఞ స్తాం శశశృఙ్గకల్పకలనాం
బోధేన బాబాధ్యతామ్,

ఆధ్యాత్మం స్ఫురతా న్న దుఃఖ ముదియా
దధ్యాసజన్యం క్వచిత్
ప్రాజ్ఞానాం మననా దఖణ్డ సహజా
నన్ద స్సదా భాసతామ్.

వర్తన్తాం విప్రముఖ్యా శ్శ్రుతి విహిత పథే
నాస్తికా నామమాత్రా
లీయన్తాం క్వాపి కాలే దిశిదిశి జలదా
వారిధారాః కిరన్తు,
రాజానో నీతిమార్గ స్ఖలన విరహితాః
పాలయంతు ప్రజా స్స్వాః
పుత్రైః పౌత్రైః ప్రపౌత్రైః ప్రముదితమనసో
మానవా స్సన్తు సర్వే.

# యిద్దరు రాజులు

రారాజు బంగాళాకు వచ్చి, చేసిన చనువూ, చూపిన నెనరు కాంచితిని; కంటిని పట్నం పల్లె విరగబడి ప్రేమార్ద్రములైన చూపుటురుపులతో రేనిని పూజించడం. వారి వారి సరాగం పొలయల్క తీరిన ఆలు మగల కలయికను పోలినది.

మన ఆంగ్లేయుల రాజు, ఒక చిన్న కరణం మొదలు వైసరాయి వరకూ, అధికారములకు, చిన్నె. ఊరి నాయుడు మొదలు మేటు తీర్పరివరకూ, పద్ధతికి చిన్నె. ప్రజలను పీడిస్తూ, కాపాడే కానిష్టేబు మొదలు దండనాయకుడి వరకూ మగటిమికి చిన్నె. గాని యీనాడు జార్జి ప్రభువు, మన పాటి మీద చిన్నెలు దాల్చి, దయా ధర్మముల అవతారమై నిలిచాడు. బంగాళా విరాళి కొనడము ఆశ్చర్యమా?

**ఇది వొక రాజు కథ :**

కవి రాజైన రవీంద్రునికి బంగాళా చూపిన మిక్కుటపు పేరూ, పొరలేని భక్తీ, యేనాడే రాజెరుగును? ఆ మహా కవి భాషను యెత్తాడు. తలపుల నెత్తాడు. చెయ్యుల నెత్తాడు. కీర్తి వెన్నెలల దిక్కులు నింపాడు. అది తన కీర్తి అని వంగ దేశము గుర్తెరిగినది. అతడు తన సిరియని గర్వించినది. దేవుఁడని పూజించినది.

చిత్పూర్ రోడ్డులో చిన్న సందొకటి మళ్ళితే యెదుట పొయి పొక్కిళ్ళవలె మూడు మేడలు కనపడతవి. అందులో మధ్యది, కలకాలమూ దేశచరిత్రములో వన్నెకెక్కి వుండగలదు. అది రవీంద్రునిది.

బ్రహ్మ సమాజ మహోత్సవం రోజున, చీకట్లు కమ్మే వేళపుడు నేను వెళ్ళాను. గుమ్మందాటితే బ్రహ్మాండమైన అంగణం. ఆ అంగణం చుట్టూ ఉన్నతమైన యెట్టిటికల మేడ. మేడల చూర్లంటి మెరుగు దీపాలు వెలుగుతుండినవి. అంగణమంతా సామాజికులతో నిండి వుండెను. చూడబోయిన మా బోట్లమూ, టాగూరు కుటుంబము వారూ, దక్షిణ ప్రక్క మేడ మీద నిలుచుంటిమి. మా కెదురుగా సారసనునాదుల పూజాభవనం వుండినది. లోపం దీపములు లేమిని, వెలుగు చీకట్లు పెనుగులాడుతున్న ఆ పూజా మందిరంలో బ్రహ్మ సుందురులు ఆకులలో పండ్లవలెనూ, చదువు చీకట్లు మరుగున ముక్తి కాంతవలెనూ, కానీ కానరాక వుండిరి.

అంగణంలో దక్షిణం వేపు సామాజికులకు యెదురుగా వొక మంటపం యేర్పరిచారు. ఆ మంటపం మీద ముందుకు రెండు యెఱ్ఱ గాజు దీపపు చెట్ల నడుమను రవీంద్రుడు, వొక పండితుడూ, ధోవతి అంగ

వస్త్రములతో కూచున్నారు. వారి యిరు ప్రక్కలనూ, వెనుకనూ, సామాజికులలో పేరుపడ్డవారూ గాయకులూ కూచున్నారు. వారిలో పండిత శివనాథ శాస్త్రిగారినీ, హేరంబ చంద్ర మిత్రగారినీ పోల్చగలిగితిని.

నేను వెళ్ళేసరికి రవీంద్రులు మేఘ గర్జనమును పోలిన కంఠంతో భగవంతుణ్ణి కొనియాడుతుండెను. సామాజికులకు జ్ఞానోపదేశము చేస్తుండెను. మధ్యమధ్యను రవీంద్రుడూ, గాయకులూ భక్తిపారవశ్యం వుండేటట్లు కీర్తనలను వాడుతూ వచ్చిరి.

అప్పుడప్పుడు మెరుపు దీపాలు గప్పు గప్పున ఆరి వెలుగుతూ వచ్చినవి. అలా ఆరినప్పుడు భవనంమీద రాలిన చీకటియొక్క రెక్కలమీద భగవంతుడు సన్నిహితుడయినట్టు మనస్సుకు తోచేది. కాదా? చీకటే వెలుతురు. మరుపే జ్ఞానము.

చిన్ననాటి మాటయేమో యిప్పుడు రవీంద్రుడు ఉత్కృష్టమైన బతుకు బతుకుతున్నాడు. శాంతుడు; భక్తుడు; దయాపరుడు; పరోపకారమే బతుకునకు వినియోగమని నమ్మినవాడు; మంచివాడు ఇట్టి మహాత్ములు వుండబట్టే బంగాళా బాగై వన్నె కెక్కింది.

బ్రహ్మమతం బంగాళాకు చాలా మేలు చేసింది. కొందరికైనా స్త్రీలకు చెర వొదల్చింది. బంగాళాకూ, సీమకూ, బాట వేసింది. ఆ సుందరులు దీపమువలె దేశమునకు, వెలుతురు నిస్తున్నారు, ఆ బాటను సీమనుండి నాగరికత ఆ దేశానకు దిగబడ్డది.

రవీంద్రుని వాఙ్మాధుర్యంను క్రోలి క్రోలి ఉత్సవం ముగిసేవరకూ వుంటే, తొడ దొక్కిడి లావగునని యెంచి, నా మిత్రులను వీడ్కొని చిత్పూరు రోడ్డుకు వచ్చితిని. అక్కడ అంతకంటె తొడదొక్కిడి కానవచ్చింది. ఆ రోజు మాఘ పంచమి. బంగాళీలు సరస్వతి పూజ చేస్తారు. రాత్రి ఉత్సవంలో సరస్వతీ ప్రతిమల్ని ఊరేగిస్తారు. ఆ పట్నంలో సామంతులు యిసక పాతర. ప్రతి సామంతుడు తన యింట సరస్వతిని నిలిపి పూజిస్తాడు. ముచ్చి పనితో ధగధగలాడే వాహనాలతోటి, రథాలతోటి, జన ప్రవాహం, ఆ వీథిలో అడ్డు కలిగిన నీటి ప్రవాహంవలె పొంగి వెనకాడుతూ కొంత సాగుతూ, యెడతెగక కనబడినది.

ఉపాధి కల ప్రతి బంగాలీ యింట్లోనూ, మొదటి అంగణంలో రమ్యమైన పూజా మందిరం వుంటుంది. కాళీ, సరస్వతీ మొదలైన దేవతల వుత్సవములు ఆ మందిరంలో విశేషమైన వైభవంతో చేస్తారు. ఆ పూజలు ఆబాలవృద్ధులకు స్త్రీ పురుషులకు, ఇంటిల్లిపాదికీ పనులు కల్పిస్తవి. మందిరమును అలంకరించడం, పూజా ద్రవ్యములను సమకూర్చడం, స్త్రీ బాలుల వేడుక. యీ రీతిని ఇంటిలిపాదీ కలిసి చేసే పూజలు మన దేశంలో తక్కువ. నలుగురికి వినబడే దేవతార్చన గల వక్కటే కొన్ని యిళ్ళలో మిగిలింది. అదయినా దేవుణ్ణి జ్ఞాపకం చెయ్యదు. భోజనపు గంట అయ్యింది. మిగిలిన ఇళ్ళలో ఆ గంట మేజా బల్ల మీద యెక్కింది.

* * *

1912వ సంవత్సరం, డిసెంబరు నెల, రెండవ తేదీన కలకత్తాలో రవీంద్రుణ్ణి చూశాను. ఆయన ఒక పెద్ద టేబిల్ ముందు కూర్చుని వున్నారు. గది అలంకరణతో వస్తు సామగ్రితో ఏమంత తీర్చిదిద్దినట్టు లేదు. భవంతి మొదటి అంతస్తులో పశ్చిమ దిశగా వుంది ఆయన గది. రవీంద్రుడి కుడి భాగాన యువకుడొకడు ఆసీనుడయి వున్నాడు.

టాగూరు సాధు స్వభావి. మాట పొందిక మహామెత్తన. నాజూకైన ముఖలక్షణాలు. తేటగా, సున్నితంగా నవ్వుతారు. మాటలాడేటపుడు పురుషత్వం తొణికిసలాడుతుంది. ఒక విధమైన ప్రశాంత మనోనిశ్చయం

ప్రస్ఫుటమౌతుంది మన వీరేశలింగం పంతులుగారి మనఃప్రవృత్తికిది పూర్తిగా విరుద్ధం ఆయన వలె రవీంద్రుడు గడబిడగా మాట్లాడరు సంభాషిస్తున్నప్పుడు సజీవత్వం వెల్లడి అవుతుంది అయితే ఆయన ప్రార్థన చేస్తున్నప్పుడు ప్రవచిస్తున్నపుడు కంఠం సంగీత శ్రావ్యంగా వుంటుంది వినసొంపైన గొంతుక రవీంద్రునిది

బెంగాల్‌లో నాటక రచన నీరసావస్థలో వుందని ఆయన అభిప్రాయం షేక్స్పియర్‌నో లేదా మరొక ప్రఖ్యాత ఆంగ్ల నాటక రచయితనో వంగ దేశ కవులు లనుసరిస్తున్నారని చెప్పలేం కొంతమంది రచయితలు మాత్రం పాశ్చాత్య సాహితీపరులతో సంపర్కం పెట్టుకుంటున్నారు కాని వారి రచనా ప్రభావం వీరి నాటకాలను సోకడం లేదు రంగభూమి శిధిలావస్థలో వుంది ప్రేక్షకులను ఆకర్షించడానికై యధేచ్ఛగా పాటలను పదాలను నాటకాలలో తెచ్చిపెడుతున్నారు మొదట ఈ నాటకాలు చారిత్రక యితివృత్త జనితాలు వీటిలో చాలామటుకు రాజపుత్ర కధలతో నిండినవే ఇప్పుడిప్పుడు పౌరాణిక గాధలలోనికి దిగజారిపోయాయి

గేయ కవిత్వంలో బెంగాల్ ముందంజ వేసింది రవీంద్రుడు వాడే భాష వ్యావహారికమే అంటే అందరూ మాట్లాడుకొనే భాష ప్రామాణిక గ్రంధ ప్రయోగాలకు విరుద్ధమైన భాష వ్యాకరణ సూత్రాలు కాదంటూ ఈ రకమైన బెంగాలీ భాషను ప్రయోగిస్తాడని ఆయనను పండితులు నిందిస్తారు

ఇప్పుడు మద్రాసు యూనివర్సిటీ గ్రాంధిక భాషను సంరక్షించాలని చేస్తున్న ప్రయత్నమే నాడు కలకత్తా విశ్వవిద్యాలయమూ చేసింది

కలకత్తాలో జనులు మాట్లాడుకునే భాషలో తప్పిస్తే ఇంకొక భాషలో మనకు వ్యాకరణ గ్రంథం ఎక్కడ లభిస్తుంది?

తెరకొరి తెచ్చె అనే పద ప్రయోగము మీద రవీంద్రునికీ నాకూ సంభాషణ జరిగింది ఆయన కొద్దిసేపాలోచించి పూర్వ కవుల ప్రయోగాలలో వుందని చెప్పారు తె అనేది జానపదుల భాషలో కనిపిస్తున్నదని నేను సూచించాను

ఆంగ్ల పారస్వత బోధనా పద్ధతులు చాలా లోపభూయిష్టంగా వున్నాయని వారి అభిప్రాయం ఆంగ్ల సాహిత్యంపై హెన్రీ మోర్లే యిచ్చిన ఉపన్యాసాలను రవీంద్రుడు ఎంతో ఆహ్లాదంతో విన్నారు విద్యార్థులకు పరీక్షలు చాలా ఆవశ్యకాలని వారి మతం

సిస్టర్ నివేదిత ఆయన కధలను కొన్నింటిని అనువదించింది కాని ఆమె చనిపోయిన తరువాత ఆ వ్రాత ప్రతులు కనిపించలేదు

మైకేల్ ను రవీంద్రుడు అనుసరించారు ఆయన గీతంలోని పాదాలు ఏ పాదానికాపాదం అంతం కావు ప్రయోగాలనూ వ్యాకరణ నియమాలనూ కాలదన్ని సరికొత్త శబ్ద రూపాలను కల్పించినా ఆయన సృష్టించిన శబ్దాలు చలామణిలోకి రాలేదు అందుచేత మన వెనకాల ఒక టిప్పణి వుంటే కాని కావ్యం అర్థం కాదు భాష బలి అయిపోతున్నా సరే ఆయన "మైకేల్ అనే కావ్యం శబ్దాలంకారాలనే దృష్టిలో పెట్టుకుంది ఈ విషయాన్ని నేను రవీంద్రునికి సూచించాను

రవీంద్రునికొక పాఠశాల వుంది ఆ స్కూలులో తనకు తానై సహాయం చేసుకోవడమెలాగో చెబుతూ ఆయన ఉపజ్ఞావంతమైన విద్యను ప్రసాదిస్తూ వుంటారు మెట్రిక్యులేషను విశ్వవిద్యాలయ పరీక్షలకు కూర్చునే విద్యార్థులు ఎన్నెన్నో విషయాలను అధ్యయనం చేయవలసివుంటుంది

తన పక్కనే కూర్చున్న యువకుణ్ని "కావ్యభాష"పై ఒక వ్యాసం వ్రాయమని రవీంద్రుడు ఆదేశించారు. అరుణాస్పదమనే నగరాన్ని వర్ణిస్తూ పెద్దన్నగారు "అచట బుట్టిన చిగురు కొమ్మైనఁ జేవ" అన్నారు. అదే విధంగా కలకత్తా పట్టణంలో చిట్టచివరికి దోమలు సైతం పొలిటిషయన్సే!

రాంఘర్<br>
కుమోన్ కొండలు<br>
మే 24, 1914

ప్రియ మిత్రమా!

దయతో ఉత్తరం రాసినందుకు మీకు కృతజ్ఞత. చాలా కాలంగా ఎంతగానో మనోవైకల్యానికి నేను గురికావలసివచ్చింది.— అంచేత చెల్లాచెదరైన నా శక్తుల్ని కూడగట్టుకొనేందుకు, తిరిగి మనశ్శాంతిని పొందేందుకు నేను హిమాలయాలలో ప్రశాంతవాసం చేస్తున్నాను. ఇది నాకు అత్యంత ముఖ్య విషయమని, కొంతకాలం వరకు యింకే విషయం మీదా నా మనస్సును తిప్పలేననీ మీరు సులభంగానే గ్రహించగలరు. అర్థం చేసుకొని, కనీసం ప్రస్తుతానికి మీ కోర్కెను నెరవేర్చలేకపోతున్నందుకు క్షమించగలరని నా విశ్వాసం.

గౌరవాదరాలతో

మనఃపూర్వకంగా<br>
రవీంద్రనాథ్ టాగూర్

# ప్రఫుల్ల లేక రాణి చౌదరి

ఒకరి వెనకొకరు ఆడపిల్లలీ గ్రంథమును చదువుచున్నారు. ఈ మాట వొక్కటియే దీని విలువను తెల్పజాలును. శ్రీ సుబ్బారావుగారు ఇంగ్లీషునుండియో కన్నడమునుండియో తెనిగించిరని నా జ్ఞాపకము. మన తెనుగు దేశమున కెంత దురవస్థ! బంగాళీ గ్రంథముల చదువు నేర్చిన కవి మనలో వొక్కడు లేడు కదా! నూరు సంవత్సరముల క్రిందట బంగాళీ విద్వాంసులు, బంగాళీభాషలో వ్యాకరణముగాని, నిఘంటువుగాని లేకుండుట గని గత యాభై, అరవై సం॥లలో ప్రాజ్ఞులగు (వారు) వాడుకభాషనుండి ఒక సులభమైన గ్రాంథిక భాషను కల్పించుకొని లోకములో యెన్నికకెక్కిన గ్రంథ ప్రపంచమును కల్పించిరి. ప్రక్కనున్న వారిని చూచి నేర్చుకొను నేర్పయినను మనకు లేదాయె. ఇక నైనను మనలో బుద్ధిమంతులు బంగాళీభాష నేర్చి దానగల మంచిని తెనుగునకు కూర్పుదురు గాక. సుబ్బారావుగారి శైలి చిన్నయ్యసూరిగా రేర్పరిచిన త్రోవ నున్నది. ఆ శైలిని వీరి రచన మిక్కిలి రసవంతముగా నున్నది. అసమానమే అనవచ్చును. 45వ పుటలో "ప్రఫుల్లముఖి దిగ్భ్రమము జెంది" అని ఆరంభమైన వాక్య కదంబమును చదివిన శ్రీ సుబ్బారావుగారి రచనా సామర్థ్యము తెలియును. వారి శయిలిలో రెండు దోషములు నాకు కనబడ్డవి. అనవసరమైన సంస్కృత శబ్దములును, వాడుకలోలేని తెనుగు మాటలును గ్రంథమందు నిండియున్నవి. సంస్కృత వ్యాకరణమును నేర్చకుండా పాత గ్రాంథిక శయిలిలో వ్రాయబూనువారికి కలుగు స్ఖాలిత్యములు శ్రీ సుబ్బారావుగారికి కూడ కలిగినవి. మొదట అధ్యాయముల సంఖ్య వీరు సంస్కృత పదముల నిచ్చిరి. అందు షష్ట మాధ్యాయము, చతుర్దశ మాధ్యాయము, ఏకాదశమాధ్యాయమను ప్రయోగములు దొర్లినవి. అది తెలిసికానోపును. రెండవ భాగములో అధ్యాయముల సంఖ్య తెనుగు పదముల నిచ్చియు, అందులో సప్తమాధ్యాయమునకు మాత్రము తత్సమము వుంచిరి. వీరు కొన్నిచోట్ల వాడుకలోనున్న తత్సమదేశ్య శబ్దముల విడిచి అంతరించిన తద్భవ శబ్దములను వాడియున్నారు.

రెండవ దోషము : అక్కడక్కడ అనుప్రాసమును వొత్తుగా తగిలించుట 1) "ఇంక నేమేమిం బెట్టుకో, తిట్టుకో, భూషించుకో, దూషించుకో," 2) "కెంపు పెంపుగల కెంపు సొంపు నధరంబు, కుందముల యందము డిందుపడంజేయు ద్విజాలియు, 3) "అత్తెరుణీ తరుణుల మనముల గలిగిన దలపులు వలపుల పొలుపులు దెలుపవశమగునె," 4) "పెచ్చుపెరిగి విచ్చలవిడి పచ్చవిల్తు డొచ్చము లేక." ఇప్పుడు మన పత్రికలలో రెండు విమర్శన మార్గములు కనబడుతున్నవి. ఇష్టులైన కవులను పొగిడి వారి గ్రంథములందు తప్పులెన్నకపోవడము,

ఆయిష్టులగు కవుల గ్రంథములయందు వున్నవి లేనివి తప్పులే యెన్ని గుణములను మరుగుపరచడం. ఇంతకన్న భాషకు కీడు ఉండబోదు. తప్పులని నాకు తోచినవి కనపరచినందుకు శ్రీ సుబ్బారావుగారు నన్ను క్షమింతురుగాక. కథ యొక్క గుణదోషములు బింకించంద్రులవి. కీర్తిశేషులైనవారి తప్పులెన్నినను చిక్కుకలగబోదు. బతికివున్న కవులకు శ్రాద్ధము పెట్టడము, చచ్చిన వారికి వర్ధంతులు చేయడము యీనాడు మనవారి కలవాటైన ఈ పద్ధతి తలకిందులు చెయ్యడము వల్ల భాషకు కొంత మేలు కూడునని నా యభిప్రాయము. బంకిముల కథలు తెనుగైనవి నా యెదుట మూడున్నవి. శ్రీ సుబ్బారావుగారి ప్రఫుల్ల యొకటి. శ్రీ ఓ.వై. దొరసామయ్యగారు కన్నడమునుంచి తెనిగించి శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ అచ్చొత్తిన ఆనంద మఠ మొకటి. అటులనే శ్రీ దొరసామయ్యగారు ఆంధ్రీకరించి కలారత్నాకర ముద్రాక్షర శాలలో అచ్చుపడిన కపాల కుండలము యొకటి. ఇంతకు మున్నింగ్లీషున బంకిము కథలనే రెండు మూడు చదివియుంటిని. బంకిము వ్రాసినట్లే తాము తెనిగించితిమని శ్రీ సుబ్బారావుగారు వ్రాసిరిగాని, కొన్నిచోట్ల ఆంధ్ర లోకోక్తులును, లోకోక్తుల వంటి ఆంధ్ర పద్యములును వారి తెలుగులో కానవచ్చుచున్నది. ఇవిగాక బంకియుల రచనా మార్గమునకు పొందిన (చెందిన?) వర్ణనాంశముల పెంచుట కూడ, కొన్నిచోట్ల కలదు. బంగాళీ నేరని వాడనౌటచేత, దీని నిజమును కనిపెట్టజాలను. ఈ మూడు గ్రంథములు, ఇంగ్లీషులో "రొమాన్స్" అను జాతిలో చేరును. దేశ కాలములను పట్టి జరగరాని సంగతులు జరగ తగిన సంగతులు వుంటవి. జరగతగిన సంగతులను వర్ణించునది ఉత్కృష్ట కథ; జరగనేరని సంగతులతో నిండి వుండినది రొమాన్స్. అందులోను అంతరులు కలవు. బంకిముల రొమాన్సులు, యింగ్లీషు నవలియగు "స్కాట్" తోవను కొంతవరకు అనుసరించి పోవును. దేశ కాల భేదములను మన్నించక స్కాటు నవలలోని కొన్ని అంశములను బంకిములు తమ నవలలో చేర్చిరి. సీమలో మొదటి రిచర్డు అను రాజు కాలమున రాబిన్ హుడ్ అను బందిపోట్ల మొనగాడొకడుండెను. వానికి స్కాట్ గుణ సంపత్తిని కల్పించెను. ఇది స్కాటునందే కావ్యదోషమై వుండెను. రాబిన్‌హుడ్‌నకు ప్రతిగా, బంకిములు ప్రఫుల్లలో, భవానీ ఠాకూరను వాని నమర్చియున్నారు. ఈ భవానీ ఠాకూరు దొంగల మోసగాడైనను శౌర్యౌదార్య దేశాభిమానాది గుణ సముద్రుడు; "సంపూర్ణ ధిషణాధురంధరుడు." ఆనందమఠములో కూడా గుణ సంపత్తికల బందిపోట్లు కలరు. సన్యాసుల దేశాభిమానము యింతంత కాదు. అట్టి బందిపోట్లును, యిట్టి సన్యాసులును, మనసు కల్పించిన మాయా ప్రపంచములోనే వుందురు. గాని లోకములో వుండివుండలేదు. దేశోద్ధరణమును భవానీ ఠాకూరునకు దొరికిన సాధనము ప్రఫుల్లముఖియను, ఒక మగడు విడనాడిన పేద బ్రాహ్మణ స్త్రీ. రూపసి; బుద్ధిమంతురాలు. అడవిపట్టి పోవుచుండగా ఆమెకు నట్టడివిని వొక గాజు యిల్లు కానవచ్చెను. ఆ యిల్లు అంతటను అద్దములు కూర్చి కట్టిరి గాన అడవి ఆ అద్దములయందు ప్రతిఫలించి అంతా యేక అడవిగా కనపడునట! ప్రఫుల్లముఖి ముఖము అద్దములో ప్రతిఫలించగా అది అద్దమని యామె పోల్చుకొనెనట. ఆ అద్దపు టింటికింద నొక నేల మాన్యములో లెక్కలేని ధనరాసులు పడియుండెను. ఆ ధనముతో సైన్యమును గూర్చుకొని భవాని ఠాకూరు, ప్రఫుల్లముఖికి రాణి పదవినిచ్చి పట్టాభిషేకము చేసెను. చెప్పన్న విద్యలు ఆమె అవలీలగా నేర్చెను. ప్రఫుల్లముఖి నేర్చిన శాస్త్రములు కళలపట్టీ 60-70 పుటలో నీయబడినది. ప్రఫుల్లముఖి గారడివాడు అరగడియలో పుట్టించి, పూపించి, కాపించిన మామిడిని పోలియున్నది. ఇట్టి అసందర్భమును బంకిములు కల్పింతురాయని నాకు శంక కద్దు. ప్రఫుల్లముఖిని తల్లి ధనహీనురాలైనను గొప్పవారితోడి సంబంధము కలిగెనని వారితో దులతూగు ప్రయత్నంబున తన సర్వస్వమును వమ్ముచేసెను. ఒకనాడూరు బంతి పెట్టినపుడు తమకు మనసుదీర భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్య పానీయంబులెల్ల సమకూర్చరాయెననుచు నా యూరిలోని యెందుకు గొఱగాని దుష్టులు కొందరు భోజన మధ్యమున లేచిపోయిరి. ఆ యవమానమునకు గినుక యొదవ ప్రఫుల్లముఖి తల్లి వారిని నిందించెను. అందుల కాగ్రహమ గదురకొని హరవల్లభుడు తన చుట్టములతోడం గూర్చుండియుండ,

నా యూరిలోని వారెవరు లేకుండ జూచుకొని, వారొకరొకరుగ సభలోన గూర్చుండిరి. అందొకడు హరవల్లభుడు వినుచుండ "ఆహా! యేమి సంబంధము!" అనుచు దనలోదాను గొణిగెను. ఆ మాటకు దత్తరపడి "ఏమేమ"నుచు హరవల్లభుడు ఆతురత నడుగ "మాకెందుకండీ? ఎవరెట్లుపోయిన నేమ"నియెను. అందులకు మరింత మనంబున దొందర గలుగ హరవల్లభుడు వేడుకోలుగ నడుగ "ఏమోనండి, కులభ్రష్టులట!" అనుచు జివాలున లేచిపోయెను. అంత విషాదకులిత చేతస్కుండై హరవల్లభుడప్పుడే సభలో ప్రవేశించిన మరియొకని నా యూరివాని సత్యాతురతతో "నే జేసిన సంబంధము మంచిది కాదా" అని యడిగెను. "కుట్రలో షేరిన వాడగుటం జేసి యా దుష్టుడు పెదవి విఱుచుచు నూరకుండెను." 7వ పుట.

ఇటులనే మరికొందరు గ్రామస్థులు అనుమానమును బలపరుతురు. అంతట హరవల్లభుడు తనకు కూడ లోకము కులభ్రష్టత్వ మాపాదించునేమోయని భీతిల్లి తనవారినెల్ల బిలిచి స్థితిగతులను వివరించి చెప్పి "యీ యూరికి మనము వచ్చిన సంగతిని గుఱించిగాని, మనము చేసిన సంబంధ విషయమైగాని యెవరితోడను మాటాలాడకుండ భద్రముగా నుండుడు. మన గ్రామమున నెవ్వరికైన నీ మానహీనమగు వృత్తాంతము దెలియవచ్చునేని, మనకు జేటుమూడును. కావున నత్యంత జాగ్రత్తతోడ రహస్యమును గాపాడు" డనుచు నొక్కిచెప్పి యా రేయి యెవరికిని దెలియకుండ మూటలను గట్టుకొని సందడిగాకుండ పయనమై తెల్లవారకమునుపే యిల్లు చేరెను.

ఈ చరిత్రము, చిన్నపిల్లలు చెప్పుకొను కాళ్ళూ చేతులూ లేని కథలను పోలియున్నది. మామగారు ధనవంతుడట. పరమ లౌక్యుడు. మొదట కుల గోత్రములు తెలుసుకొనకనే వివాహమును నిశ్చయించెనో? కులగోత్రము లెరుగకనే, తన ఆప్త బంధువులు సమ్మతించిరో? అప్పుడు సభలో నుండిన బంధువులలో మొదట సంబంధము కుదిర్చిన రాయబారులేమయిరి? గ్రామమునందలి పెద్దలిట్టి దుర్నయములకు దిగియుందరు గదా! మామగారు వారి నడిగి నిజము తెలుసుకొనకనే కులభ్రష్టులని నిశ్చయించెనో? యిందరు బ్రాహ్మణులు భ్రష్టుల యింట యెటుల భుజించి యుందురను శంకపొడమలేదో? నమ్మె పోనిండు. సంబంధము జరిగిన మాట దాచుటెట్లు? తరలిపోయినపుడు లోకమెల్ల నెరిగి యుండలేదో? అందరు బంధువుల నోళ్ళు కట్టుబడునని మామగారెట్లు నమ్మిరి? ప్రఫుల్లముఖి భ్రష్టయైన, తానుకూడ భ్రష్టాయెనే? అజ్ఞానకృత దోషము ప్రాయశ్చిత్తము వలన నివర్తించునే! అది అటుండ ప్రఫుల్ల కుటుంబమునకు భ్రష్టత యెటుల వచ్చెనో గ్రంథకర్త చెప్పలేదు. రైలు బయలుదేరి తెల్లవారకమునుపే యిల్లు చేరినంత దగ్గరనుండెను మామగారి యిల్లు! ప్రఫుల్లముఖి శైశవ వృత్తాంతముగాని, ఆమె కుటుంబముయొక్క పూర్వ వృత్తాంతముగాని, యీయబడి యుండలేదు. నాయిక యెవరి నడుమ యెటుల పెరిగెనో తెలియక, ఆమెను తెలియనేరము. చిత్రరచనా కళలో సెటింగ్ అని ఇంగ్లీషువారనునది, ప్రఫుల్లముఖికి లేదు. సెటింగ్ అనగా ఒక ప్రతిమ యే వస్తుజాలము నడుమ నిలిచి యుండునో అట్టి వస్తు ప్రపంచము. సెటింగ్ అను మాటకు తెనుగు భాషయందు పర్యంత ప్రపంచమని వాడుదుము.

ఈ జాతి నవలలు ఉత్కృష్టమైనవి కావు. లోకములో నున్నట్టే వ్రాయవలెనని నా అభిప్రాయము కాదు. ఇంగ్లీషువారు ఐడియల్ (యేది యెలా వుంటే బాగుండునో అలా భావించుట) అను లోకోత్తర కల్పనలుండక, లోకోత్తరమైన రచన యుండనేరదు. గాని మనుష్య జాతము యొక్క మనోధర్మములను, వస్తుతత్వము ననుసరించి కథ నడుపవలెను. కల్లెము వదిలి, చిత్తమును పరుగిడనిచ్చిన నవలలు జ్ఞానదాయకములు కానేరవు.

# బాలికా పాఠశాల

కలకత్తాలో దాజరు కుటుంబమువారి యింట సమావేశము జరుగుతున్నది. రమ్మని మిత్రులు శ్రీ దుబిన్ బాబు నన్ను పిలిచారు; ఆహ్వాన పత్రికను యిచ్చారు. కలకత్తాలో మహాకాళి పాఠశాల కలదు. దానికొక శాఖగా, బాలికా పాఠశాలను నెలకొల్పవలెనన్న తలంపుతో, ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. సనాతన హిందూ ధర్మముల ప్రకారం బాలికలకు విద్యను బోధిస్తూ, పాఠశాలను కట్టుఖాయిదాలతో నిర్వహిస్తారని నాకు తెలియవచ్చింది. బాలికలు బడి వున్నపుడు లేనపుడు ఏయే విధులను పాటించవలెనో వాటిని ఒక జాబితాగా వేయవచ్చును. పెద్దలు చాలా ధర్మ సూత్రాలను తయారుచేసినారు.

పొద్దున్నే లేచిన వెంటనే, పరగడపున ఆవురావురమంటూ బాలికలు దేవతా ప్రార్థన చేయవలెనట. శ్లోకములను పఠించి ఇష్టదేవతా ప్రార్థన ముగించి, ఇంటవున్న పెద్దలకు పేరుపేరునా మ్రొక్కవలెనట. ఇది మంచి వ్యాయామమే. పిమ్మట 'ఆయా' వెంట బాలికలు బడికి వెడతారు. పాఠశాలలో మళ్ళీ యింకొక డోసు దేవతా ప్రార్థన శ్లోక పఠనం. ఇంతా చేసి, పాఠశాలలో చెప్పే విద్యలు : కుట్టు పని, అల్లిక పని, వంట వండడం ఎక్‌స్ట్రాలు. వాటికి మించిన విద్య యింకొకటి వున్నది. పెద్దలు యెడల వినయవిధేయలతో మసలుకోమని, ముఖ్యంగా భర్తపట్ల భయభక్తులతో మెలగవలెనని బోధిస్తారు. బాలికలకు రోజూ యింటా, పాఠశాలా, డిటోగా యిదే కార్యక్రమం.

చిన్నప్పుడు నా భార్య ఇలాంటి బడిలో తగిన తరిఫీదు పొందివుంటే ఎంత బాగుండును! ఆవిడకు వందలకొద్దీ శ్లోకాలు నోటికి వచ్చును. దబ్బున వంట చేస్తుంది. వంట బాగుంటుంది ఇస్కూలులో చదువుకోకుండానే, ఆవిడకు యీ విద్యలన్నీ పట్టుబడ్డాయి. పూజా పురస్కారాలంటే ఆవిడకు ప్రీతి ఎక్కువ. అందువల్ల నాకు డబ్బు అంతో యింతో ఖర్చవుతూనే వుంది. అంతో యింతో ఏమి, ఊరుకుంటే అంతా ఖర్చు పెడుతుంది. ఇలాంటి విధులు నిర్వర్తించడంలో ఆవిడ కావిడే సాటి. ఇంకొకరితో పోల్చడానికి వీలు పడదు. కనక ఆవిణ్ణి ఈ బాలికా పాఠశాలలో పంతులమ్మగా వేస్తే బాగా రాణిస్తుంది.

దైవభక్తి, మతభక్తి ఎంత ఎముకలకు పెట్టినా, మా ఆవిడకొక ముఖ్యబోధన తలకెక్కినట్లు కనిపించదు. మన చెప్పన్న శాస్త్రాలూ, భార్య భర్త పట్ల భయభక్తులతో మెలగాలని బోధిస్తున్నాయి; అవునా మరి, అయినా సరే, ఆవిడకీ సూత్రాలు, గుణమిచ్చినట్లు దాఖలా ఏది! భయభక్తులు లేకపోతే మానె; పైపెచ్చు తన భర్త వొట్టి తెలివి

తక్కువవాడని ఆవిడ నమ్మకం. అడుగడుక్కీ తన సలహా లేనిదే, వొక్క అడుగు ముందుకు వేయలేదని ఆవిడ ఉద్దేశం. అలా అని ఊరుకున్నా బాగుండును, తన భర్త తన తలలో నాలుకలాగ వుండాలట, వినయ విధేయతలతో మెలగాలట! అలాంటప్పుడు భార్యలు భర్తలపట్ల భక్తి ప్రపత్తులతో సంచరించాలని, ఉపదేశిస్తున్న వారిని చూసి, నేనేకాదు, ఎవరు మాత్రం సంతోషించరు? ఇలాంటి స్కూలుకి వెంటనే పర్సుతీసి ఎంత వుంటే అంతా, విరాళమివ్వడం ఉచితం కాదూ? ఎంత యిచ్చినా అది దండుగ కాదు. దురదృష్టవంతులైన భర్తలు ఈ స్కూలు నీడను బతకవచ్చును!

సరే; మేం సమావేశానికి వెళ్ళాం. చాలామంది బెంగాలీలు, నేల మీద బాసిన మఠం వేసుకొని కూచున్నారు, నలుగురి మొహాలు పరికించాను. అందులో కాస్త మెత్తటి మనిషి ఎవరా అని ఆలోచించాను. ఒకాయన కనిపించాడు. ఆయన సభ్యులందరిలోకీ పెద్దవాడు. మొదటినుంచీ మంచి సభ్యుడుగా వుంటున్నాడు. వయోవృద్ధుడు. ఎందుకైనా మంచిదని, ఆయన చెంత చతికిలబడ్డాను. నాకు నాలుగు విసుర్లు విసరాలనిపించింది. ఒడుపు చూసుకున్నాను కదా, ఈ ముసలాయన ఏల చేయగలడు? అని ఇంగ్లీషులో దండయాత్ర కుపక్రమించాను : "నిజవాఁడితే నిష్ఠూరం; మీరు సరసులు కనక నిష్ఠూరవాడరు. మీ బెంగాలీలకు కొన్ని కొన్ని సందర్భాల్లో చొరవ జాస్తీ. అది మంచి లక్షణమే కాని... సామాజిక వ్యవహారాలలో మీ వాళ్ళు వొట్టి బార్బరస్. గాలీ వెలుతురూ సోకకుండా మీ ఆడవాళ్ళను జనానా కొట్లల్లో ఎందుకలా బందిస్తారు? కోళ్ళ గంపల్లో కుక్కితే, కోళ్ళు సైతం ఉక్కిరి బిక్కిరవుతాయే! మరి మనుష్యుల మాట చెప్పేదేమిటి? స్వేచ్ఛ లేకపోతే ఎలాగ? ముందు తరాల వాళ్ళు గొప్పవాళ్ళు కావాలంటే, ఇప్పటి ఈ ఆచారాలు మారవద్దా? మీ బెంగాలీలు కబుర్లు చెప్పమంటే చెబుతారు. కడుపునిండా కబుర్లే. పంజరంలో చిలుకల్లాగ, అన్నీ చిలక పలుకులే. మా తెలుగు వాళ్ళు అలా కాదు. మేం కార్యశూరులం. మా తెలుగు స్త్రీలు హాయిగా అటూ ఇటూ మసులుతారు. స్వేచ్ఛగా వుంటారు."

నా వుపన్యాసం విని, యింత వొలంపాటి బెంగాలీ బాబూ, కంగారెత్తిపోయాడు. మొహం నల్లబడింది. నా వాగ్ధాటికి నేనే పొంగి పోయాను. మళ్ళీ నాలుగింతలుగా, విరుచుకు పడ్డాను: "మీరు సబబైన మనిషిలా వున్నారు; తెలియక అడుగుతున్నాను; మరొకలా అనుకోకండి. స్త్రీలను అలాగ బంధించడానికి కారణం ఏమిటి? మీకు విద్యా సంపత్తి కొరవడిందా? వాళ్ళను నేరస్థుల వలె దండించడం దేనికి?

ఆయన తన ప్రక్కనేవున్న ఒక పండితుని వంక చటుక్కున తిరిగి, నా ఉపన్యాసాన్ని ఖాతరు చేయనట్లు బెంగాలీ భాషలో ఏదో సణగడ మారంభించాడు. నాకు చిర్రెత్తుకొచ్చింది. ఏమిటో నిర్లక్ష్యం. పరువు నష్టం కింద అతన్ని జైలుకి పంపించాలన్నంత కోపం వచ్చింది. వొక తగు మనిషి, అపరిచితుడు, ఎదుట వున్నపుడు అతనికి తెలియని భాషలో తమలో తాము మాట్లాడుకోవడం బెంగాలీల కొక దురలవాటు. ఇంతకీ నాతో మాట్లాడడానికి ఎవరికీ నోరాడింది కాదు. బహుశా, నా రాక, వాళ్ళని హడలెత్తించి వుంటుంది.

సమావేశం ముగిసింది. అలికిడి లావయింది. నా మిత్రుడు దుబిన్ బాబు ఆ అలికిడిలో తన్మయుడైపోయాడు. తన స్నేహితులతో ఏదో హుషారుగా ముచ్చటిస్తున్నాడు. నేనిక్కడ వున్నట్టు చివరికి జ్ఞాపకం వచ్చింది కాబోలు, గబగబ నా వద్దకు వచ్చాడు. "మన్నించండి. స్నేహితులతో మాట్లాడుతూ వుండి పోయాను."

తర్వాత ప్రసంగవశాత్తు దుబిన్ బాబు అసలు విషయం చెప్పాడు: "ఆయనకి ఇంగ్లీషు రాదు!"

ఇంతసేపూ యిచ్చిన నా ఉపన్యాసం బూడిదలో పోసిన పన్నీరు!

# వంటలక్క చెప్పిన ముచ్చట్లు

మా వంటలక్క చెప్పుకోతగ్గ మనిషే; శరీరం నలుపు. మొదటిలో ఆవిడ చాలా మంచి మనిషి అనీ, శీలవంతురాలనీ, భక్తురాలనీ, తోచింది. ఇట్టి శాంతతగల మనిషి చెన్నపురిలో యిన్నాళ్ళూ వంటలక్కగా వుండి, పట్నవాసపు ఫక్కీ యేమీ అలవరచుకోలేదే అనీ - వితర్కమూ, సంతోషమూ కూడా కలిగాయి; గాని యీ సదభిప్రాయమెంతో కాలం నిలవలేదు.

కంఠం ఎంతో బాగుంటుంది. పాటలు చాలా మధురముగా పాడుకుంటూ వుంటుంది. కేవలము భక్తి గీతములే కావు అప్పుడప్పుడు అడపా తడపా కొన్ని ప్రేమ గీతాలు కూడాను. కొంత వర్ణనా చాతుర్యము, కథా కౌశలమూ కలవు. తాను యెరిగిన భోగట్టాలు చిలువలు పలవలూ పెట్టి విన సొంపుగ చెపుతుంది. చాలా తమాషా అయిన మనిషి. గుణం మంచిదో కాదో నాకు తెలియదు; మంచిదనే అనుకుందాం.

ఆమె కొక సోదరుడు వున్నాడు. కరణీకం కోసం కోర్టుల్లో లావాదేవీలు పడుతున్నాడు. శ్రీ వి.యస్. పంతులును కలుసుకుని ఆయనతో తన సోదరుని గొడవ చెప్పుకున్నదట! ఆ కరణీకపు సూటు తన సోదరుని పక్షమయ్యేటట్టు చేస్తానని మా వంటలక్కకు ఆయన వాగ్దానమిచ్చాడట. ఆయన కిపుడు నెల్లూరు బదిలీ అయింది. మాటలుంటే మా వంటలక్క మనువు మరిచిపోతుంది. మాట లాడడమంటే చెవికోసుకుంటుంది. వి.యస్.ఆర్. కుటుంబాన్ని బాగా ఎరుగును. వి.యస్.ఆర్.గారు వొక మధ్వులమ్మాయిని పెళ్ళిచేసకున్నారు. ఆ పిల్ల మిగుల అందగత్తె. యూరోపియనులలో గాని, స్వదేశీయులలో గాని అంతటి అందగత్తె లేదు. ఆమె 'శ్రీర' జమిందారుని కుమార్తె. ఆమెకు పెద్ద మనిషి అయిన పదహారోనాడు శోభనమయింది. ఆనాడే భర్త ఆమెను కాపరానకు యిక్కడకు తీసుకు వచ్చేశాడు.

మా వంటలక్క యీ ముచ్చటలను చెబుతుండగా నేను "ఆమె యిప్పుడు వుందా?" అని ప్రశ్నించాను; "ఉహు! చనిపోయింది!"

వొకసారి ఆమెను పెనిమిటి బొంబాయి నగరము తీసుకువెళ్ళాడు. రోజుకు వందరూపాయల అద్దె యింటిలో కాపరమున్నాడు. వొకనాడు ఆమె వొక నిలువుటద్దములో ముఖము చూసుకుంటూ ఉండగా అందు వొక పెద్దపులి ఆకృతి కనిపించి భయము గొలిపినది. అద్దములో కనిపించే ఆ పెద్దపులి మీదకు దుముకుతూ

మింగవస్తున్నట్లు అనిపించింది. తన మెడ వరకూ భుజాలను సైతమూ పెద్దపులి మింగివేసింది. వెంటనే తెలివి తప్పిపోయి, పిల్ల కింద పడిపోయింది; ఎంత సేపటికీ స్మారకానకు రాకుండెను భర్త భూతవైద్యము తెలిసిన వొక ముసల్మాను మంత్రగానిని రప్పించాడు. నూరు కడవల చల్లని నీరు ఆమె మీద ధారాప్రవాహంగా గుమ్మరించమని భూతవైద్యుడు భర్తను ఆదేశించాడు. ఆ విధంగా స్నానం చేయించగా, కొంతసేపటికి ఆ పిల్లకు స్పృహ వచ్చింది. తదుపరి, బొంబాయి నుంచి దంపతులు యిక్కడకు వెళ్ళిపోవచ్చారు. ఇప్పుడిక ఆమె 'ఆమె' కాదు. పూర్వలావణ్యమూ సౌరూ, సౌందర్యమూ నశించిపోయినవి.

ఆమెను, 'శ్రీర' గ్రామమునకు వచ్చివుండమని కన్నవారు, చాలా పర్యాయములు కబురు పంపుతూ వచ్చిరి గాని, ఆ పిల్ల పుట్టింటికి వెళ్ళలేదు.

"దంపతులిద్దరూ ప్రేమతో అన్యోన్యంగా యిష్టాపత్తుగా వుండేవారా?"

"ఉహూ! వుండేవారు కాదు; అహ! వుండేవారు; అవునూ కాదూ అని చెప్పలేను."

అతని భుజములపై ఆమె ఎప్పుడూ పడుతూ వుండేది. అతనొకనాడు కృష్ణాజిల్లాలో వున్న తన తోబుట్టువును చూడడానికి వెళ్ళాడు. ఇలావుండగా వొక రోజున, ఆమె వంట్లో యేమీ బాగుండగపోయెను. మనసుకు చికాకు హెచ్చసాగింది. ఇంత మజ్జిగా అన్నమూ పెట్టమని అయిదారుసార్లు అడిగింది. అలాగున రోజల్లా అడుగుతూనే వుంది. భర్త గ్రామాంతరము నుండి తిరిగి వచ్చాక తనకు వంట్లో యేమీ బాగులేదనీ చికాకుగా వుందనీ చెప్పింది. తాను లోపలకు రాకూడదనీ, 'వెలపల' వుంటిననీ తెలియచేసింది.

తన వొంటిమీద వొక్కసారి చెయ్యివేసి చూడమని భర్తను అడిగింది. భర్త, భార్యను స్పృశించాడు. తన మెడను రెండు చేతులా దగ్గరకు తీసుకొని, తనను అక్కున జేర్చుకోవసినదని వేడుకొంది. భర్త భుజములపై తన తలను వాల్చుకొని భార్య యీ అప్పగింత మాటలను చెబుతూ మరణించింది. "యక్కడ శ్రీర. యక్కడ ఈ వూరు. నేను మీ పిల్లను మీతో సంబంధము రావడము, మీ తొడలపైని కాలము చేయడము....."

నాటినుండి ఆయనకు మనోధైర్యము సడలిపోయింది. పట్టు తప్పి మనసు చంచలం కాజొచ్చింది. ఎప్పుడు ఏది మాట్లాడినా ఆమెను గురించే, వొకే విధమైన కలవరింత, వొకటే పలవరింతచె ఆమె మూర్తి అతనిని వదలకుండెను. ఇది యించుమించు వొక ఉన్మాద అవస్థ. తన భార్యను గురించి కథా రత్నాకరం అనే గ్రంథాన్ని మరి వొక నవలనూ రచించాడు. ఆయన యెప్పుడూ యేదో పుస్తకము పఠిస్తూనే వుంటాడు.

ఈ విషాద గాథను విన్నంతనే నా హృదయ భారము మిక్కుటమైంది. మనసులో ఏవేవో ఆలోచనలు చెలరేగి గుండెలలో చేయిపెట్టి కలచినట్లయి, కొంతసేపు మౌనముగ అలాగునే నిలబడిపోయాను. భరించలేని విషాదానుభూతి కలిగింది. బహుశా యీ హృదయ విదారక దృశ్యమును మా వంట మనిషి తన కళ్ళారా చూసింది కావోలును!

వి.యస్.ఆర్. మొదట ఉపాధ్యాయ వృత్తిని చేపట్టి తరువాత కొన్నాళ్లకు ప్లీడరయినాడు. వకీలు వృత్తిలో చక్కగా రాణించి చాలా ధనం ఆర్జించాడు. మంచి వక్తి, తెలివితేటలు గలవాడు. "పి.హెచ్.యస్."ను ప్రారంభించాడు. కాని లాభించలేదు. తరువాత స్పెక్యులేషను ఆరంభించాడు.

పైన చెప్పిన విషాద గాథను మరికొందరు యింకొక విధంగా చెబుతారు : ఆ యువతి అనుమానింపబడి హత్య చెయ్యబడ్డదట! హరి హరీ! ఇదే యదార్థమైతే! కాదనే హృదయపూర్వకంగా నమ్ముతున్నాను. అతనే యీ అకృత్యం కావించిన నరపిశాచి అయి వుండాలి! ఎంత మూర్ఖాతిమూర్ఖుడు!

ఒక కుమారుడు, ఒక కుమార్తె గల వయసు మళ్లిన వొక పురుషుడు తన శాఖ కాని సుందరాంగి, నవజవ్వని యెడల వెర్రి వ్యామోహములో పడిపోయి, ఎంతో శ్రమపడి పెండ్లాడి, మితిమీరిన వైభవంతో విరగబడుతూ త్యాగ భోగరాయుడులాగ వెలుగుతూ వుంటే, అతనికి ఆమెను గూర్చి యెన్నైనా అనుమానాలు లోలోపల పీడిస్తూ వుంటవని యితరులకు తోచడములో యేమీ ఆశ్చర్యమూ లేదు; ఇది అసంభవమూ కాదు. నాలుగయిదు రోజులీ మధ్య తప్పక అతని నొకసారి నేను చూసి తీరవలెను.

ఈ గాథను వి.యస్.ఆర్. యింకొక విధముగా చెప్పాడు: చాలా రొమాంటిక్ కథలవలె వర్ణించాడు: స్పెక్యులేషనులో తన ధనమంతా పోయింది. ఇక బతుకు మీద ఆశ లేక తానూ తన భార్య ఆత్మహత్య చేసుకుందామను కున్నారట! అలుపులు బిడాయించుకొని రెండు విషపాత్రలను యెదుట పెట్టుకొని వొక గదిలో కూచున్నారు. ముందు ఆమె విషం తాగింది. కాని యితను తాగే లోపుననే దంపతుల ఆత్మహత్యా ప్రయత్నం నలుగురికీ వెల్లడి అయిపోయింది. అతని ఆత్మహత్యా ప్రయత్నం విఫలమయింది.

# భ... గారబ్బాయి

రూపం : చామన చాయ చూపులలో అసంతృప్తి; నిష్పూచీ, కిందకు చూస్తూ వుంటాడు. ముసిముసి నవ్వులు; నవ్వులో కిలాడీతనం, తాహతుకు మించిన వేషాడంబరం. నోరు కొంచెం వెడల్పు, పెదవులు దళసరిగా వుంటాయి. పెద్ద మాటలాడేటపుడు తడబడతాడు. మామూలు మనుష్యులతో మాట్లాడుతున్నపుడు నిర్లక్ష్యంగా వుంటాడు; డాంబికానికి పోతాడు; తన సర్వజ్ఞతను చాటతాడు.

నటన : ఎపుడూ ఏదో ఒక పుస్తకం పట్టుకుని తిరుగుతూ వుంటాడు. చిన్నమెత్తు పని చేయకుండా, తానేదో అయిపోవాలని అతని కోరిక; ఒళ్ళు కదపడు; ఒళ్ళో అన్నీ పడిపోవాలి. ఎక్కే గుమ్మం; దిగే గుమ్మం. అక్కడి మాట లిక్కడ; ఇక్కడి మాటలు అక్కడ. కబుర్లు చెబుతూ కులాసా రాయుడిలాగ బతకాలని అతని భ్రమ. ఏ వ్యవహారంలోనైనా సరే, తనకు కాస్త లాభసాటిగా వుంటుందని తోస్తే, అదురూ బెదురూ లేకుండ తల దూరుస్తాడు.

మనిషిని పెద్దంత్రం చిన్నంత్రం లేదు. కొత్త పాతా అన్న మొహమాటం లేదు. చదువుకున్నవాళ్ళూ, చదువుకోనివాళ్ళూ అంతా వొకటే. ఎవర్నయినా సరే, అబద్ధమో, సబద్ధమో ఆడి బుట్టలో వేసుకోవచ్చునని చొరాయించుకు పోతాడు. నూరబద్ధాలడైనా సరే. తన పని తానుచేసుకుపోవాలనుకుంటాడు.

లోకం తన గొప్పతనాన్ని గుర్తించినట్లూ, తృణీకరిస్తున్నట్లు, ఎవరో తనకు అపకారం చేస్తున్నట్లూ వాలకం పెడుతాడు. ఉపకారం పొందడం కోసం, మనుష్యుల్ని యిట్టే ఉబ్బిస్తాడు. తాను మాత్రం ఏ పనీ చేయడు. అంతా ఇతరులు తనకు అమర్చి పెట్టాలి. జంకుగొంకూ లేదు. సిగ్గూ బిడియమూ సున్నా. నిలువు నిలుపాదం మోసం!

ఒకసారి నన్ను మోసగించి, బయట పడిపోయాడు. అది మోసమేనట; కాని అతన్ని నేను క్షమించాలట. టక్కరితనం వల్ల, బతుకు బాగుపడుతుందని అతని నమ్మకం. నిజాయితీపరులు చేయవలసిన పెద్దపెద్ద పనులు సైతం తాను చేస్తానని బయలుదేరుతాడు.

తల్లితండ్రుల్ని బొత్తిగా ఖాతరు చేయడు. వాళ్ళ గతి వాళ్ళది. కన్నతల్లి నానా కష్టాలు పడుతూవుంటే ఆవిణ్ణి చూడడు. హాయిగా తాను మదరాసు పోయ విద్యార్థి దశలో తెగతిరిగి చదువు పాడుచేసుకున్నాడు. యింగ్లీషన నాలుగు పంక్తులు వ్రాస్తే, అన్నీ తప్పులు తడకలు. స్పెల్లింగ్ ఘోరం. ఎవరి సలహా చెవికెక్కదు. బాగుపడే గుణం ఒక్కటీ కనిపించదు. తన బాగు కోరుతున్న వాళ్ళ మీద సైతం గౌరవం పూజ్యం.

సుందర్రావు పంతులు, వెంకటేశ్వర్రావు మొదలైన వాళ్ళ వితరణ వల్ల జీవితం నెట్టుకువస్తున్నాడు మహారాజా వారు, మద్రాసు నుంచి వెళ్ళిపోతూ, అతన్ని అడ్మిరాల్టి హౌసులో వుండనిమ్మన్నారు. అలాగే వుండనిచ్చాను. ఒక రోజున, వున్నట్టుండి, వెర్రెత్తినట్లు వెంకటేశ్వరావు మీద కలియబడ్డాడు. అప్పటి నుంచి, అతనంటే నాకు దురభిప్రాయం ఏర్పడింది.

నేను మెత్తమెత్తగా వుండడం కనిపెట్టి బాగుందనుకున్నాడు కాబోలు, ఇక్కడకు వచ్చిన కొత్తలో, మహాచనువుగా మసలడ మారంభించాడు. అసలే అతనికి బొరాయింపు ఎక్కువ. అందులో నేను మెత్తగా కనిపిస్తున్నాను; చనువు దొరికింది. అనువుగా వుంది. ఇకనేముంది; నెత్తికెక్కి పిండి దంప వచ్చుననుకున్నాడు. ఇట్టే జోస్తీ కలిపేవాడు; సాయిలా పాయిలాగా నాతో తిరగాలని ఉబలాటపడ్డాడు. బండిమీద నేనెక్కడి కెడితే, అక్కడకు తానూ తయారు. రోజూ పొద్దున్నే హాజరు. భుజం భుజం రాసుకు తిరగడం; నేను ఎక్కడ కూర్చుంటే తానూ అక్కడ చతికిలబడడం, మాటల్లో మాట కలపడం. ఇంటికి వస్తే వచ్చాడు; వచ్చినవాడు తిన్నగా కూర్చుంటాడా; అన్ని భోగట్టాలూ అతనికే కావాలి. ఎవర్నీ అడక్కుండా పుడక్కుండా ఎకాఎకీ మెట్లు ఎక్కి మేడమీదికి వచ్చి రోజూ నా పీకలమీదకి అవాలా అయేవాడు.

వాళ్ళ నాన్న నాకు కొన్ని చరిత్ర గ్రంథాలు యిస్తానంటూ కొన్నాళ్ళు నన్ను ఊరించారు. అవి నా కవసరం. 'మీ నాన్న ఊరించడంతోటే సరిపోతోంద'న్నాను. 'నేను తెస్తానెండి' అన్నాడు. తెచ్చిపెట్టమన్నాను. పట్టుకువచ్చాడు. ఆ మొగమాటంవల్ల అతనెంత అతిగా ప్రవర్తించినా, పోనీలెమ్మని ఊరుకున్నాను. పుస్తకాలు పొరుగూరులో వున్నాయి. డబ్బు కావాలన్నాడు-సరే అని రానూ పోనూ ఖర్చులు చేతిలో పెట్టాను. కాని ఆ పుస్తకాలు వాళ్ళ ఇంటనే వున్నాయని కరవాత చూచాయగా తెలిసింది. ఒకసారి గొప్ప గొప్ప పుస్తకాలు తన దగ్గర వున్నాయన్నాడు. పేర్లు చెప్పమన్నాను. జ్ఞాపకం లేవన్నాడు. "ఇదివరకు మీ నాన్నగారు మహారాజువారికి చూపించినవేనా?"

"కాదు, ఇవి కొత్తవి." ఏదో ఊరు వెళ్ళి పట్టుకువస్తానన్నాడు. అన్న ప్రకారం పట్టుకువచ్చాడు. [illegible] తీరాచూస్తే అవీ ఇవీ ఒకటే. ఇదివరకొకసారి వాళ్ళ నానగారు మహారాజావారికి యీ పుస్తకాలను యివ్వగా, పండితులు పరిశీలించి పనికిరావని, వాటిని తిరిగి యిచ్చివేశారు.

"అవీ ఇవీ ఒకటేనోయ్!" అన్నాను.

"కావండీ! ఇవి మొన్ననే సంపాదిస్త" అని అతను ఒకటే మొరాయింపు.

సరే, నాతో అబద్ధాలాడితే ఆడాడు. బాధలేదు. మహారాజావారితో తాను మెట్రిక్యులేషను ప్యాసయినానని చెప్పాడుట. ఈ సంగతి విని, అబద్ధాలాడకూడదని మందలించాను. పెద్దల చెంత జాగ్రత్తగా మసలి ముందు ముందు అభివృద్ధికి రావాలని, అబద్ధాలవల్ల అనేక అనర్థాలు వస్తాయని హితబోధ చేశాను. జీవితాన్ని చక్కదిద్దుకొని బాగుపడమన్నాను. ఆత్మవంచనవల్ల అపకారం జరుగుతుందని, తాను ప్యాసవని మెట్రిక్ ప్యాసయినట్టు అందరికీ నమ్మించచూడడం తగదని, అందులోనూ మంచిని ప్రేమించే మహారాజావారివంటి సత్పురుషుల చెంత అసలే అబద్ధమాడకూడదని అతనికి అనేక విధాల నచ్చజెప్పాను. నేను చెబుతున్నదంతా వింటూ [illegible] ఊపాడు.

కాని అవతలికి వెళ్ళి, తనంటే నాకు అయిష్టంగా వుందని అందరితోనూ చెప్పుకోవడం మొదలుపెట్టాడు. నాకు ఎన్నడూ రానంత కోపం వచ్చింది. అతన్నెపుడూ 'డి.జి.'గారు దగ్గరకు రానిచ్చేవారు కాదు. పెద్ద 'అరిస్టాక్రాటు' వలె అతను అభినయించడం. అరత లేనిదే గొప్ప గొప్ప అవమానాలు. సదుపాయాలు పొందాలని [illegible]

ఆయన లాగ, నేను మాత్రం అతన్ని ఎడబెట్టలేక పోయాము. ఇలా వుండగా, ఒకనాడు తెలుగు పుస్తకాల పెద్ద జాబితా నొకటి తీసుకవచ్చి నాకు చూపించాడ జాబితా బావుంది. కొన్ని పుస్తకాలు ఎక్కడా దొరకవు. మరికొన్ని అరుదు. జాబితా అకారాది వర్ణక్రమాన్ననుసరించి తయారు చేశాడు.

ఈ పుస్తకాల విషయం యల్.యల్. గారు విన్నారు. విని మహారాజా వారికి చెప్పారు. అతను ఆ జాబితా ప్రకారం శ్రీ నిడదవోలు సుందర్రావు పంతులుగారి పుస్తకాలను తీసుకు వచ్చి, అవి తనవేనని చెప్పి, మహారాజా వారికి సమర్పించాడు. ఎంత సాహసం, ఎంత అబద్ధం !

సుందర్రావు పంతులు, యల్.యల్. గార్ల వద్దకు వెళ్ళి తన తప్పు మన్నించమని ప్రాధేయపడమన్నాను. చేసిన తప్పు సరిదిద్దుకోమన్నాను. ఉహుఁ, వాళ్ళ నాన్నగారు వారిద్దరి చెంతకు పోయి, ఈ వ్యవహారం సర్దుబాటు చేయాలట! పై పెచ్చు తనకి అవమానం జరిగిందట! "ఏమిటీ వెర్రి మొర్రి వేషాలు; వెళ్ళి, యల్.యల్. కి, క్షమాపణ చెప్పుకో"మన్నాను. అబ్బే; తాను తప్పు చేసినా, ఇతరులను క్షమించమని అడగడం అతనికి చిన్న తనం. దర్జాకు లోపం!

అతను తప్పులే చేస్తాడు. ఇతరులు ఏమీ అనుకోకూడదు. అనకూడదు. అనుకున్నా అతనికి ఫరవాలేదు. అన్నా అతనికి లెక్కలేదు. పరువు తక్కువ పనులు చేసి, మన్నించమని ఒకర్ని అడగడం అతనికి పరువు తక్కువ!

* * *

మహారాజా వారు : చూశారా మరి; ఈ కుర్రవాని సంగతి ఎలా వుందో! కొంత సొమ్ము యిచ్చి అతనికి సహాయం చేతామనుకున్నాను. కాని అతనివన్నీ అబద్ధాలే కదా!.... ఆయన, అతన్ని ఆ పని చేయమని అడగలేదు. ఆయనకీ అతనికీ దీనితో పేచీ. ఇవి క్షుద్రమైనవి. జరిగినదేదో జరిగింది. ఇక కావేషీ ఎందుకు?

యస్.హెచ్ : ఇంతకీ తప్పు మీది - ఇవ్వకూడని చనువు ఇస్తే యిలాగే యుంటుంది. అది మీ ...లసత్వంగా ఇతరులు భావిస్తారు.

మహారాజావారు : దానికేమి? వాళ్ళిద్దరూ మంచివాళ్ళే. కాని, అప్పుడప్పుడు తప్పు చేస్తూ వుంటారు. వాటిని మనం చూసి ఆనందించవలె.

యస్.హెచ్ : ఆనందించడానికి ఇది తమాషానా?

మహారాజా వారు : కోపగించడ మెందుకు? జీవితమే ఒక తమాషా కాదా?

యస్.హెచ్ : ఇలాగ మీరంటూ వుంటే, వాళ్ళకది అమృతం లాగ వుంటుంది. కనుకనే, అలా తయారయ్యారు. మీ కేదో నచ్చచెబుతారు. వాళ్ళు మీతో చెప్పినట్టే చేస్తారని మీరనుకుంటారు. కాని, వాళ్ళు చెప్పేదొకటి, చేసే దింకొకటి.

మహారాజా వారు : పోనిద్దురూ. ఇంతలో పుట్టకేం మునిగిపోయింది!

# తాత్త్విక చింతన

పరిస్థితుల సామాన్య జ్ఞానంతో నడుచుకునే తాత్వికుడు. సులభంగా పేరు గడించుకుంటాడు. అతని పేరు పదిమందిలోను వ్యాపిస్తుంది. కేవలం హేతువాదంమీద ఆధారపడిన తాత్వికుడు అలాగ కాదు. అతని పేరు సులభంగా పదిమందిలోనూ వ్యాపించదు. ఒక విషయాన్ని చర్చిస్తున్నపుడు సూక్ష్మాంశ విచారణలో సున్నితమైన కొన్నిచోట్ల అతను యిట్టే పొరబడదాని కవకాశం వుంది. ఒక పొరపాటు ఇంకొక పొరపాటుకు తప్పక దారి తీస్తుంది; అది మరి వక పొరపాటుకు కారణమవుతుంది. సూక్ష్మాంశ విచారణలో చేసిన పొరపాటును కేవల హేతువాది అయిన తాత్త్వికుడు పోల్చుకోలేక తన చర్చలను కొనసాగించే అవకాశం వుంది. చర్చల ఫలితాంశం విపరీతంగా కనిపించినా, బహుళవ్యాప్తి పొందుతున్న అభిప్రాయాలకు విరుద్ధంగా ఉన్నా, దానిని స్వీకరించడానికి అతను సంకోచించడు. మానవుల సామాన్య జ్ఞానాన్ని కనుగుణంగా ఆలోచిస్తూ ఆకర్షవంతంగా సొగసుగా వ్యక్తం చేస్తున్నాననుకునే తాత్వికుడి సంగతి వేరు; తప్పి జారి అతను పొరబడినపుడు, యిక ముందుకు వెళ్ళడు తన ధోరణి సామాన్య జ్ఞానానికి నప్పి వుండడం లేదని, సహజ అనుభవాలకు విరుద్ధంగా వుంటూ మానవ హృదయాన్ని మేధను మెప్పించ లేకపోతున్నదని గ్రహించిన వెంటనే అతను సర్దుకుంటాడు. పొరపాటున సవరించుకొని సరియైన దారికి చేరుతాడు. ప్రమాదకరమైన భ్రమలలో పడిపోకుండా, తనను తాను కాపాడుకుంటాడు.

మానవుడు స్తబ్దుడు కాదు; చైతన్యవంతుడు. ఆలోచనా శూన్యుడు కాదు; హేతువాది. అతని స్వభావంలో ఈ రెండు లక్షణాలు సమ్మిశ్రితమై వున్నాయని లోకపుటభిప్రాయం. అతను వ్యవహార ధర్మాన్ని నెరవేరుస్తూనే హేతువాదాన్ని పాటించవలసి వుంటుంది. ఏ విధంగానూ ఆచరణ సాధ్యం కాని నిరుపయోగమైన కేవల ఊహాగానాన్ని మనం త్రోసి పుచ్చుతాము.

అయితే ఒక విషయంలో హేతువాద బద్ధమైన తత్వం సామాన్య జ్ఞానమాత్రమైన తత్వం కన్న మిన్న. దీనికి లేని వొక విధమైన అవకాశం దానికి వుంది. దార్శనిక పద్ధతులలో మీమాంసలో అనుభావ వ్యక్తీకరణలో తగినంత నిశ్చయ జ్ఞానాన్ని ప్రదర్శించడానికి హేతువాదం అవసరం. అది లేనప్పుడు సామాన్య జ్ఞాన మాత్రమైన తత్వం తగినంత నిశ్చయ జ్ఞానాన్ని వ్యక్తంచేయలేదు. ఈ నిశ్చయ జ్ఞానం మానవ విగ్రహానిన మలచే శిల్పికి అవయవ శాస్త్రం తెలియడం వంటిది. అవసరమైన అన్నిచోట్ల నిశ్చయ జ్ఞానం కలిగినపుడు అది సౌందర్య సృష్టికొక వీలును

కలిగిస్తుంది. అదే విధంగా తూచినట్టు చర్చించే శక్తి సుకుమార అనుభావ వ్యక్తీకరణకు ఉపకరిస్తుంది. ఈ రెండు తత్వాలలో మనం వొకటి మహత్తరమైనదని పొగుడుతూ యింకొకటి ఎందుకూ అక్కరకు రానిదని తెగుడుతూ వుంటాము; కాని అది వృధా. కేవల వేదాంతి నిత్య వ్యవహార సంబంధాలతో నిండివున్న గడుపుతూ వుండవచ్చును; అయినప్పటికీ, అటువంటి అనేక మంది వేదాంతుల భావాలు సమాజంలో బాగా వ్యాపించి, భావానుభావాలు మరింత నిర్దుష్టంగా వుండేటందుకు సహాయ పడవచ్చును. ఏదో వొకటి ఆధారంగా తీసుకుని 'ఇది కావచ్చు'నని ఊహిస్తూ పోవడం సాధారణంగా చాలమందికి అనవసర శ్రమగా తోస్తుంది. చికాకనిపిస్తుంది. ఆ ఆనందోత్సాహాలను పొందడానికి వారిని అభ్యంతర పెట్టకూడదు. అందుకు అనుమతించవచ్చును. అస్పష్టత చిరాకు కలిగించే మాట నిజం; కాని ఆ అస్పష్టత నుంచి స్పష్టతను గ్రహించడానికి పడే శ్రమ అత్యంత ఆనందోత్సాహాలతో కొనసాగవలసి వుంటుంది; ఊహలకు పోయే వేదాంతం అనిశ్చయానికి దోషానికీ అస్పదమని కొందరు ఆక్షేపిస్తారు. ఈ వేదాంతం నిజమైన అర్థంలో సరియైన శాస్త్రం కాదన్న ఆక్షేపణ ఎంతో న్యాయమైనది; హర్షించతగింది. కాని యిది, మానవ మేధకు అర్థం కాని వేవీ లేవని, అన్నింటిని తెలుసుకోగలమని అనుకునే కొందరి దర్పం వల్లను, బహుళ వ్యాప్తిలోవున్న ఛాందస భావాలను సమర్థించాలనుకునే కొందరి కోరికవల్లను ఉత్పన్నమౌతూ వుంటాయి. అయితే ఈ చిక్కులను మనం తొలగించుకోవచ్చును. మానవ అవగాహనను కూలంకషంగా ప్రాథమిక విచారణ చేసి ఏది అసత్యమైనదో నిర్ధారణ చేసి సత్యమైన వేదాంతానికి హద్దులు గీయవచ్చును. మానవ మేధ పనిచేసే తీరు అతి విచిత్రమైనది; అద్భుతమైనది. అయినప్పటికీ దాని పోకడను గమనాన్ని ఎక్కడికక్కడ దేనికది విభాగించవచ్చును. ఆలోచనలను సాధారణీకృతి కావించి ప్రత్యేకమైన వాటిని సాధారణమైన వాటితోనూ వాటిని మరింత సాధారణమైన వాటితోను అనుసంధానించి సూత్రబద్ధం చేయవచ్చును. అన్ని కర్మలను సాధారణ సూత్రాలకు అన్వయించడంలో నైతిక, రాజకీయవాదుల కృషి చక్కగా ఫలించింది. కనుక, యీ విషయంలో ఎవరూ నిరుత్సాహపడనక్కరలేదు. అయితే వాటినన్నిటిని వొక విశ్వజనీన సూత్రానికి కుదించడంలో వారు కృతార్థులు కాకపోవచ్చు గాక. కాని అది వక లెక్కలోనిది కాదు మేధకు సంబంధించిన శాస్త్ర పరిశోధన అతి క్లిష్టమైనది, ఈ శాస్త్రాన్ని ఎంతో శ్రమపడి పరిశోధించిన పిమ్మట సైతం అన్నిటా 'యిది యింతే' పని తూచినట్టు చెప్పడం సందేహాస్పదమన్న మాట నిజం. కాని అంత మాత్రం చేత దీనిని కాదని ఖండించకూడదు; 'ఇది యింతే'నని అన్నిటా తూచినట్టు నిశ్చయాన్ని ప్రకటించే వేదాంతాన్ని అవునని స్వీకరించడం ఎంత పొరపాటో, దీనిని కాదని ఖండించడం అంత పొరపాటు.

* * *

మనం వొకదాన్ని వింటున్నపుడు, చూస్తున్నపుడు, వాంఛిస్తున్నపుడు, ప్రేమిస్తున్నపుడు, ద్వేషిస్తున్నపుడు మన మనో ఫలకం మీద కొన్ని ముద్రలు చిత్రితమౌతాయి. ఇవి ఆలోచనలకంటె, అభిప్రాయాలకంటె ఎక్కువ శక్తి కలవి.

ఆలోచన కొక అవధిలేనట్లు అనిపిస్తుంది. ఇంద్రియాలు అనుభవమూ మనకు సంపాదించి పెట్టిన విషయాలను మేధ వివేచిస్తుంది. నిగ్గు తేలుస్తుంది. ఇంకొక దానితో అనుసంధానింప చేస్తుంది, అన్వయిస్తుంది, పెంపొందజేస్తుంది. ఇది మేధకు సహజ లక్షణం. ఇంతకు మించిన దాని స్వేచ్ఛా విహారం సాధించేదేమీ వుండదు.

మన భావాలన్నీ మన అంతర బాహ్య అనుభవములనుంచి ఉత్పన్నమౌతూ వుంటాయి. ఒక భావం పుట్టినప్పుడు అది అనేక భావాలతో మిళితమౌతుంది. లేదా అది మథింపబడి నిగ్గు తేలుతుంది. వాటిని మనం

దేనికది విడదీసి చూస్తున్నప్పుడు అవి ఉత్పన్నం కావడానికి కారణమేమిటో అవగతమౌతుంది. అవి దేనిని పురస్కరించుకొని ఉత్పన్నమైనవో ఆ అనుభవము, ఆ అనుభావమూ తేటపడుతుంది. ఒక భావం దేనిని పురస్కరించుకొని కలిగిందో దానిని వెతకి పట్టుకోవడం సులభం కాదు. ఒక భావానికి కారణమైన మూల శక్తులు దానికి వెనకవున్న అనుభవంలో యిమిడి వుంటాయి. గతించిన ఒక అనుభవంలోని మూల శక్తులను వెదకి పట్టుకోవాలంటే మనకి కలిగిన భావాన్ని వెంటనే మనం వ్రాసి వుంచడం మంచిది.

దైవమనే భావం... అంధుడికి రంగులంటే ఏమిటో తెలియదు; ఏ అభిప్రాయమూ వుండదు. కాని అతనికి మనం దృష్టిని కలిగించినంతనే, అనేక కొత్త కొత్త భావాలు ప్రవాహంవలె అతనిని ముంచెత్తుతాయి.

# పిల్లలు

పిల్లలకు నీళ్ళంటే సరదా. ప్రవహించే నీళ్లన్నా, ఆటలాడు కొందుకు వీలిచ్చే నీళ్ళన్నా మరీ సరదా.

*　　*　　*

పెళ్లిళ్లు, పేరంటములు, ఉత్సవాలు, ఊరేగింపులు, విందులు, వినోదాలు, తీర్థాలు, రథయాత్రలు అంటే పిల్లలకు ఆనందం. ఆ వేడుకలన్నీ చూసి సంబరపడతారు. సంబరాలయిపోగానే బిక్కమొహం వేస్తారు. కళ్ళ నీళ్ళు పెట్టుకుంటారు.

*　　*　　*

పువ్వులు పిల్లలకు ఎంత ఆనందమిస్తాయనీ! పదిమంది ఎదుట, కొమ్మలు వొంచి, రెమ్మలు పట్టుకొని, ఆకుల సందుల్లో వెలికి వెతికి పూసిన పూలను ఏరుకుంటూవుంటే, పిల్లలకు అదేదో వింతగా, గొప్పగా విజయం సాధించినట్లుగా అనిపిస్తుంది. ఒక రంగు తరవాత యింకొకటిగా, రంగురంగుల పూలను రకరకాల దండలుగా గుచ్చుతూవుంటే, వాళ్ళకెంతో ఆహ్లాదంగా వుంటుంది!

*　　*　　*

చితుకులు పోగుచేసి చలి మంటలు వేసుకుని చుట్టూ కూచిని చలి కాగడం అరచేతుల్ని చాపి, బుగ్గలు వొత్తుకోవడం పిల్లలకాహ్లాదం. భోగి మంటలు సరే సరి... దిబ్బు దిబ్బు దీపావళి దబ్బు దబ్బున రావాలి.

*　　*　　*

మా చిన్ననాడు మాంచస్టరు బట్టకుండే రెయిలు, స్టీమరు బొమ్మలు చూడడం అదొక సరదా.

అనుకరణ పిల్లలకు ఎక్కువ.

*　　*　　*

పిల్లలు కనిపించకపోయేసరికి తల్లిదండ్రులు కంగారు పడతారు. దిగులు పడతారు. భయపడతారు. అటు యిటు పరుగులు పెడతారు. తీరా కనిపించే సరికి పిల్లల మీద మండిపడతారు.

*　　*　　*

పరాయి యింటికి వెళ్ళినపుడు పిల్లలకు అంతా కొత్తే. కొత్త చోట మసలడం ఎబ్బెట్టుగా వుంటుంది. ఎప్పుడు యింటికి వెళ్లిపోదామా అని ఎప్పుడూ యింటి మీదనే ధ్యానం.

లేనివాళ్ళ పిల్లలకు పాపం అన్నీ యిబ్బందులే. జీవితంలో వున్న వ్యత్యాసాలను అసమానతలను చూసి పిల్లలు యేమని తలపోస్తారో కదా! పిల్లలకు యిందువల్ల చెప్పలేనంత మనస్తాపం, దుఃఖం కలుగుతుంది కదూ! తోటి పిల్లలకువలె తామూ ఉన్నత స్థితి పొందేవరకూ, పిల్లల మనఃక్లేశం పోదు కాబోలు!

*　　　*　　　*

తల్లిదండ్రుల పలుకుబడిని, అధికారాన్ని, ఐశ్వర్యాన్ని చూసి, గారాబంగా పెరిగే పిల్లలు తమకు సంపద కలదనే భావం కలగగానే, తమ దాబు దర్పాలను యితర పిల్లల చెంత చూపిస్తారు. అధికారాన్ని చెలాయిస్తారు. ఇలాగే వాళ్ళని పెరగనిస్తే, తాము పిల్లలు కనక, గొప్ప యింటి బిడ్డలు కనక తాము ఏం చేసినా చెల్లుతుందనుకుంటారు. పెద్దల పట్ల సైతం దురుసుగా ప్రవర్తిస్తారు. చివరకు చెడి వూరుకుంటారు.

*　　　*　　　*

"అలా వున్నాడు కానీ, అబ్బో! మా వాడిది మహా తెలివైనా బుర్ర! మీరు చెబితే నమ్మరు కానీ...."

నమ్మడం మాటకేం కాని, అలా అని మీ పిల్లల్ని చెడగొట్టకండి!

*　　　*　　　*

చిన్నప్పటినుంచి నాకు కొత్తది యేది కనిపించినా, దాని తత్వము తెలుసుకోవాలని ఆసక్తిగా వుండేది. వింతలు నాకు యిట్టే పొడకట్టేవి.

*　　　*　　　*

చిన్న తనంలో బొమ్మలాట నేర్చివుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుష్యులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది. సొగసులేని మనిషే వుండదు.

# తనలో తాను

**ఆలోచనలు :**

ఆలోచనల విలువ, వాటిని పురస్కరించుకుని వచ్చే నిర్ణయాల మీద నిర్ణయాల మంచి చెడ్డలమీద ఆధారపడి వుంటుంది. ఆలోచనను తరచి చూడనిదే, ఒక నిర్ణయానికి రాకూడదు. ఆలోచించేటపుడు పొందికా, పొదుపు అవసరం. వ్యర్థముగా ఆలోచించరాదు.

ఆలోచనలు చిత్రమైనవి. ఇవి విచిత్రముగా పుడుతూ వుంటవి. కొందరు మనతో మాట్లాడుతున్నపుడు, సరదా పుట్టదు. వారి ప్రసంగము మనకు చికాకు కలిగిస్తుంది. అయినా వారు మనలను వొదిలిపెట్టరు. అలాంటప్పుడు, మన ఆలోచనలే మనలను ఆదుకుంటవి. ఏ మాత్రం మర్యాదకు లోపం రానీయకుండా వారు చెబుతున్నది వింటున్నట్లే కనిపిస్తున్నా, మనం మన ఆలోచనలను మరొక దిక్కుకు మళ్ళించ వచ్చును.

భావించడం నా ముచ్చట. ఆలోచన నా బలం. ఏదో ఒక దానిని దృష్టిలో పెట్టుకుని, ఎడతెరిపి లేకుండా ఆ రోజులలో సరదాగా ఊహించేవాణ్ణి. పచారు చేస్తున్నపుడు, నడిచి వెడుతున్నపుడు, ఏకాంతముగా వున్నపుడు, భోజనం చేస్తున్నప్పుడు, పరుపు మీద వాలినపుడు, సగం రాత్రి మెలకువ వచ్చినపుడు, పొద్దున్న షికారు వెళ్ళినపుడు, అపుడూ యిపుడూ అననేల, ఎప్పుడూ ఏదేదో వూహించేవాణ్ణి. ఏమేమో భావించేవాణ్ణి, మధుర స్వప్నాలతో కొన్నాళ్ళు కొన్నేళ్ళు గడిచిపోయాయి.

ఆలోచనలను ఊరికే పరుగెత్తించడం మంచిది కాదు. అందులో ఆనందమున్నా, మేధస్సుకు శ్రమ, కరములకు బలహీనత, ఇపుడిపుడు అట్టేసేపు ఆలోచించకుండా వుండాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఎంత పొదుపుగా వుందామన్నా నాకు ఆలోచనలు రావు.

**ప్రకృతి అనే పుస్తకం :**

ప్రకృతి దృశ్యములను వస్తుసముదాయమును అవలోకించినపుడు అనిర్వచనీయమైన ఆనందము కలుగుతుంది. సౌందర్యమును చూసి మనం ముగ్ధులమౌతాము. దివ్యాంశగల ప్రకృతిలో, చేతనాచేతన వస్తుసముదాయములో, మానవునిలో మనోహరమైన కాల్పనికత గోచరిస్తుంది.

వరసలు వరసలుగా దగ్గర దగ్గరగా వున్న తాటి వనము ఎంతో ఆహ్లాదమును కలిగిస్తున్నది. హృదయమును పల్లవింపచేస్తున్నది. తాటి పెండె యింటి పైకెప్పు వలె వున్నది. జల్లులు జల్లులుగా కురిసినట్లు వెన్నెల. చక్కని చిక్కటి తోట. అనేక ఫలజాతుల మొక్కలలు మొక్కలకు నీళ్ళు పోస్తూ దోహదము చేస్తూ పెంచి పెద్ద చేస్తున్న తోట మాలీలు. "వాళ్ళ జీవితం" మన జీవితముతో వాళ్ళ జీవితమునకు సంపర్కము లేదు. తోట అవతల పొలిమేర, పొలిమేరలో పల్లకీ బోయీల కేకలు. పల్లెటూరి వాతావరణం; గుడి. గుడిలో పూజారులు; గ్రామస్థులు, వాళ్ళ కొడుకుల, కూతుళ్ళు, అనేక కుటుంబాలు. వీళ్ళ జీవితమేమో, ఆశలేమో!

సరుగుడు చెట్లు గాలికి కదలాడుతున్నవి. నిటారుగా నిలబడి తలలు ఆడిస్తున్నవి. సరుగుడు తోటల సంగీతము. ఉండి వుండి మూలుగుతున్నట్లు వింత వింత ధ్వనులు!

* * *

విషాద రేఖావృతమైన మనః ప్రవృత్తిపై, కరుణరస శబలితమగు సంగీత ప్రభావము యెటులుండును? ప్రాచీన స్మృతులు ఉయ్యాలలూపినట్లు ఊపి మనసును అనునయించి మార్దవమును కలిగించును.

* * *

ప్రకృతి వర్ణనములున్న కవిత్వము సంస్కృత సాహిత్యములో అధికము. వేదములు. ప్రకృతి ఆరాధనము. గార్లయిలు అభిప్రాయములు, ప్రకృతి పట్ల క్రైస్తవ మతదృష్టి; ఇతర మతముల దృక్పథము.

రామయణము ఉత్తరరామచరితము.కాళిదాసుని రఘువంశము. "అము పురః పశ్యసి దేవదారుం....."

ప్రకృతి సానుభూతి. మానవ మానసిక అవస్థలో ఏకత్వము. కుమార సంభవము, మేఘసందేశము, శాకుంతలము.

భయంకర ఆరణ్యక ప్రకృతిపట్ల ప్రేమ, లేదా మనోహర ప్రకృతి అంటే ప్రేమ. ప్రాక్తన వాసనలను తెలియపరుస్తుంది. ప్రకృతి బిడ్డగా ఆదిమానవుడు గడిపిన స్వేచ్ఛాజీవితము.

* * *

వాన వెలిసెను. నీటి బింగువులు ఆకులనంటి చెట్లను ముత్యములతో గప్పియున్నటుల జేసెను. వెలగాడ కొండపై వొక నల్లని మేఘపు శకలము చందురునిపై సన్నని బట్టవలె కమ్మి మళ్ళీ అంతలోనే పక్కకు వొత్తిగలిగినది. పొన్నాకులపై చంద్రకాంతి ప్రతిఫలించి ఆకులకు తళతళ మెరుగులు పెట్టినది.

వెలగాడ కొండమీద నిలబడి చూసినపుడు విజయనగరము మనోహరముగా అవుపిస్తుంది. నాలుగువైపుల ఎటుచూసినా, సముద్రమువలె పచ్చని చెట్లూ చేమలు తోటలు వనములు. సముద్రమున పడవలవలె తెల్లని మేడలు భవనములు. ఆకాశమును అంటుకొని వున్నట్లు దూరమున వున్న పర్వత శిఖరములతో ప్రకృతి మనోజ్ఞముగ వున్నది. చెరువులు వెండి తీగలవలె, ఏరులు వాగులు, నీటిగీతల వలె మెరుస్తున్నవి. ఉత్తరమున రోడ్డు; రైలు స్టేషను.

*　　　*　　　*

మంచు వొత్తుగా కురిసినది. పొద్దు పొడుస్తున్నపుడు అంతా అందము. ఎర్రని రేఖలు; సూర్యుని దెస మెల్లమెల్లన మంచు విడిపోతున్నది. సెలయేళ్ళు మంద మందముగ ప్రవహిస్తున్నవి. కొన్ని పంట పొలములు, మరికొన్ని బంజరులు. కొన్నిచోట్ల సస్యములతో, మరికొన్ని చోట్ల ఖాళీలతో నేల, గడులతో వున్న చదరంగపు బల్లను పోలివున్నది.

పలచని మంచు పొరలలోనుంచి అన్నీ స్పష్టముగా కనిపిస్తున్నవి. పడమట కొండమీద ఏటవాలుగా లోయ. ఉత్తరము వైపు వరండా, ఇటు ఒక గది. అటు వొక గది. గుమ్మమునకు యెదురుగా వొక జామిచెట్టు; పది గజముల వరకు చతురము – అటుపైని కిందకు నిటారుగా దిగిన లోయ. రాళ్ళు విరిగిపడి వున్నవి. చెదురు చెదురుగా ఎన్నో రక్కసి తుప్పలు.

ఒక డేగ కొండ శిఖరముమీద రివ్వున ఎగిరి రింగటాలు కొట్టి కొండ దిగువకు దూసుకుపోయినది. డేగ గిరగిరలతో నల్లని రేఖలతో దారులు ఏర్పడినవి.

దూరమున వున్న ఎత్తయిన ఘాటీలు పలురకములు నీలిమబ్బుల రంగుల వలె కనిపిస్తున్నవి. దూరదూరముగ వున్న కొండలు లీలగా పొడకట్టుతున్నవి. తూర్పుదిశ నిర్మలముగా వుంది. మన్ను అక్కడక్కడ ఎరుపు. చెరువుల నీరు ఎర్రన. దున్నిన భూములు మిగిలిన భూములకన్న నలుపు. నల్లరేగడి భూములు యినుమారు దున్నినారు కాబోలు!

నెల్లిమర్ల ఏరు కోరుకొండ వద్దనుండి పోవు తోవ ఎర్రని కంకరనేల బయలుపడెను. ఆ కొండను వెదురు డొంకలు. కొండ పూచినట్లు కొంచెము పసుపు పచ్చగా కనపడుతున్నవి. రామతీర్థపు కొండలు, భోగాపురం కొండలు చిన్న చిన్న వెన్నెల కుప్పలవలె వున్నవి. కొండల చుట్టూ, మట్టము వరకు సేద్యము.

తూర్పు ఉత్తరముల వైపు విశాలమగు మైదానములు. కొండలు. భవనము. అవతల భాగమున కొండ వొంపు తిరిగి ఏనుగు తలవలె వుంది. ఈస్వరను ఘాట్సు.

గాలి యీలలు వేస్తూ తలుపులు సందుల దారి చేసుకొని ధ్వని చేస్తున్నది. పడమట ఒక చింతగున్న, దక్షిణమున జీడిమామిడి చెట్లు గుంపులు గుంపులుగా సైనికులవలె నించున్న తాటి చెట్లు, నవనవలాడే తుప్పలు,

పసుపు పచ్చని పూలతో మొక్కలు, గన్నేరు గాలికి కదలాడుతున్నది. రామభజన చెట్టుకు వుండే ప్రమిదలతో కత్తిమంది చెట్టు, చిన్న చిన్న మేఘములు అభ్రకమువలె తెల్లగా వున్నవి. గాలికి దూది పింజలవలె మబ్బులు తేలి పోవుతున్నది. సిందూరపు రంగుతో అందమైన ఆకాశం. దిఙ్మండలం తెల్లన. మీద నీలం.

* * *

ఆకాశమున వొక మబ్బు తునక యించుమించు పడమటి దిక్కున వుంది. మెల్లమెల్లగా చిన్న చిన్న మబ్బులు దిఙ్మండలానికి చేరుకుంటున్నాయి. వలయాకారముగా మబ్బులు అలముకుంటున్నవి.

గాలి వీచింది. దిఙ్మండలము వెండి కరగించి పోసినట్లు వున్నది. తూర్పున తెల్లని కాంతులు చినుకుల వలె చిమ్ముతున్నవి. కొండలకు అవతల దూరాన మీదను ఉత్తరంగా కొప్పుల వలె పర్వత శిఖరములు వొప్పుతున్నాయి. ఆకాశం అటు నిర్మలముగా ధూమవర్ణముతో తేలికగా వుంది.

* * *

కళింగ పేట కొండ, కొండ చిలవవలె భయంకరమైన కళ్ళు పెట్టుకొని కోట వద్దనుంచి రైటు వస్తోంది. అక్కడక్కడ మిణుగురులు వెలుగుతున్నవి; ఆరిపోతున్నవి.

* * *

చదవాలి, చదవాలి; గాని చదువుకంటె యెక్కువగా చూడాలి, చూడలి; చూసి కనిపెట్టాలి. వొట్టి చదువు వృధా. ప్రకృతిని పరిశీలించాలి. ప్రకృతి అనే పుస్తకం అన్ని పుస్తకాల కంటె గొప్పది. అది చదివిన వాడి ఆనందానికి అవధి వుందా? జ్ఞానానికి అవధి వుందా?

ఆ ఆనందం ఆనందం ఔను. ఆ ఆనందం నిండా గొప్పది.

**మనోభావాల దౌడు :**

అందమైన ఆడపిల్లలను చూడడం కొందరికి సరదా. ఆ పిల్లలను మనసులో ఊహించుకొని సన్నివేశాలను కల్పించుకుని భావాలను గుర్రాలవలె దౌడు తీయించ వచ్చును. కాని యిది ఎంత త్వరగా మానితే అంత మంచిది.

ఒక అందగత్తె కంట పడినపుడు, కొన్ని ఉద్రేకాలు శృంగార ప్రియత్వం కలగడం సహజం. అలాంటి ప్రమాదం తప్పించుకుందుకు ఆమెను నువ్వు నీ సోదరిగా భావించు.

**మోయలేని బరువు :**

మోయలేని బరువును తలకు ఎత్తుకొని యీడిగలబడినట్లు, స్వతంత్రంగా యోచించలేనివాడు ఇతరుల అభిప్రాయాలను తలకెక్కించుకొని యీడిగిల బడతాడు.

ఒడ్డుబాటులు :

మానవుడు పరిస్థితులకు కేవలం బానిస అని, తన ప్రవర్తనను తాను నిశ్చయించుకోలేని నిస్సహాయుడని అనుకోవడం పొరపాటు. శారీరక, మానసిక ధర్మమును నిర్ణయించడంలో అనువంశిక, పరిసరాల ప్రభావాలు ...తంగా వున్నా, వాటిని మానవుని మేధాశక్తి సరిదిద్దగలుగుతుంది. మానవునికి కావలసినది సంకల్ప బలం. ...యితే యీ ఒడ్డుబాటులు, శక్తియుక్తులను బట్టి, అవకాశములను బట్టి, తరతమ భేదములనుబట్టి జరుగుతవి. కొందరు తమ అవలక్షణములను పూర్తిగా పోగొట్టుకోవచ్చును. మరికొందరు క్రమక్రమముగా తగ్గించుకోవచ్చును.

ఒక వ్యక్తి శీలమును, అప్పటికిని, యిప్పటికిని అతను సాధించిన దానిని బట్టి తారతమ్య దృష్టితో ...వేచించి నిర్ధారించవలెను.

దురవస్థ :

భారతదేశములలో సామాన్య సాహితీపరునకు, స్వతంత్ర రచనాశక్తి కొరవడి ఇతరుల గ్రంథాలను అనుకరించడమో, అనువదించడమో తప్ప అతనికి గత్యంతరము లేకపోతున్నది. ఈ దురవస్థ తొలగిపోధానికి చాలాకాలం పదుతుంది కాబోలు.

మాటలు, మనుషులు. మనసులు :

కొందరితో మాట్లాడుతున్నపుడు కొందరు తమ మనోవ్యధ తీరినట్లు 'ఫీ'లవుతారు. అలాంటపుడు వారిని చివరివరకు మాట్లాడనీయడం మంచిది. వారి హృదయం తేటపడి, ఉల్లాసము కలగడం సంతోషమే కదా!

* * *

కొందరి ప్రసంగము ప్రసన్నముగా వుంటుంది, వారి మాటలు వినసొంపు; అనుభవములు తెలుసుకోవడానికి ఉత్సాహము.

* * *

కొందరు ఎదటవాని మాటల తీరును సరిగా గ్రహిస్తారు. తెలివైనవాళ్ళు యితరుల మనసును తూచినట్టు గ్రహించి, తాము తూచినట్లు మాట్లాడతారు. కొందరు తూచి గ్రహించి గ్రహించినట్లు పైకి కనబడరు. కొందరు గ్రహిస్తారు; గ్రహించినట్లు కనబడి పోతారు. ఇతరుల మనసును తూచినట్లు తెలుసుకోవడం మంచిదని తెలిసి, ప్రయత్నించి విఫలులై గొప్పవాళ్ళను మెప్పించాలనే తాపత్రయంతో మరికొందరు, తమ అవివేకాన్ని వెల్లడించుకుంటారు.

* * *

సమయస్ఫూర్తి లేకపోవడం మనిషికి చిక్కే. ఒకడు మనతో ప్రసంగిస్తూ మాటల చాటున తేలులాగ నక్కి చటుక్కున కుడతాడు. కుట్టినట్టు కనిపించడు. ఏవేవో తమాషాగా నాలుగు విసుర్లు విసురుతాడు. అపుడు అతనికి

నాలుగింతలు చమత్కారంగా సమాధానం యివ్వాలి వెంటనే మాటకు మాటా చమత్కారంగా సమాధానం యివ్వాలి వెంటనే మాటకు మాటా చమత్కారంగా జవాబు చెప్పే నేర్పు కొందరికి వుండదు ఎదుటివాటి విసుర్లకు తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరౌతారు తామేదో తప్పుచేసినట్లు ఒక్కొక్కపుడు అనుకోవడం కూడా కద్దు

సంభాషణానంతరం తనకు చురుక్కున తగిలిన మాటల విసుర్లకు తగిన సమాధానం తోచవచ్చును ఆ సమాధానం తన నడవడికను సమర్థించేదీ కావచ్చును కాని సద్యః స్ఫురణ లేనపుడు ఏమి లాభం అరరె అని విచారించడం తప్ప

* * *

ఇతరులు తన మాటలను అతి శ్రద్ధగా వినాలని అవి అంత అమూల్యమైనవని కొందరు అనుకుంటూ వుంటారు అలాంటి వ్యక్తిని సంతోష పెట్టవలసిన దురవస్థ నీకు తటస్థ పడినపుడు అది తప్పనిసరి అయినపుడు అతనేం చెబుతున్నా నువ్వు శ్రద్ధగా విను విని అతను చెబుతున్న ప్రతీదీ చాలా సబబుగా వున్నట్లు సూచించు అతనన్న ప్రత్యక్షరం అక్షరాలా నిజమని నువ్వనుకుంటున్నట్లు తల వూపు ఆ వ్యక్తి తాను చెప్పిన విషయం నీకు క్షుణ్ణంగా అర్థమయిందనుకుంటాడు నువ్వెపుడూ పొరపాటుగా ఆలోచింపవని తెలివైన వాడవని భావిస్తాడు

కాని ఒక వ్యక్తి సబబుగా మాట్లాడుతున్నపుడు అతని మాటలు యితరులకు ఉపయుక్తమౌతున్నపుడు లోకానుభవాన్ని వ్యక్తము చేస్తున్నపుడు వాటిని నువ్వు శ్రద్ధగా వింటూ అతన్ని యింకా మాట్లాడనీయడం మంచిది ప్రేమ పెన్నిధి .

ఒకరిని యింకొకరు మనసిచ్చి ప్రేమించినపుడు అదే విధముగ తిరిగి ఆ వ్యక్తి తనను ప్రేమించనపుడు మనిషి దుఃఖపడతాడు ప్రేమించిన వ్యక్తులకు అపచారం చేయకూడదు అపుడు ప్రేమ దుఃఖ భాజనమౌతుంది తిరిగి ప్రేమను పొందని ప్రేమ భేదకారణము కాదా

* * *

నాగరికతతోపాటు ప్రేమ భావము పెంపొందుతూ వుంటుంది ఆటవికుని ప్రేమ తక్కువ స్థితిలో వుంటుంది కపట వేదాంతులు స్వార్థప్రవృత్తిని ప్రోత్సహిస్తారు ప్రేమ మానవ జాతికి స్వేచ్ఛను ప్రసాదిస్తుంది దోషములు ప్రేమారాధనవల్ల క్షాళితమౌతవి షెల్లీ ప్రేమతత్వము వేదాంత దృష్టి ప్రేమ అనే ధర్మమునకు కట్టుబడిన సమాజము మాత్రమే ఆనందమును ప్రసాదించగలదు

* * *

స్వార్థాన్ని విడిచి పెట్టాలి పరులకు ఉపకారం చేయాలి మనిషిని ప్రేమించాలి ఇది నిజమైన తాత్విక దృష్టి లోకంలోవున్న అన్ని తత్వాలు దీనిని బోధిస్తున్నాయి ప్రేమ వ్యక్తి స్వార్థాన్ని పోగొడుతుంది ప్రేమకన్న పెన్నిధి యింకేముంది,

*　　　*　　　*

ప్రేమ హృదయమున పుష్పించిన ఒక కోమల పుష్పం అది అజ్ఞానమనే అంధకారాన్ని పోగొట్టి ఆత్మను తేజోవంతము చేస్తుంది ఇది ఉన్మాదావస్థను తెచ్చిపెట్టే మోహము మటుకు కాదు మనం స్వచ్ఛమైన నిర్మలమైన లలితమైన పవిత్రమైన ఆత్మలను ప్రేమించడము అలవరచుకోవాలి ఆత్మ సౌందర్యమును అవలోకించి ఆనందించే స్వభావమును పెంపొందించుకోవాలి స్వార్థ ప్రవృత్తిని విడనాడాలి వాత్సల్యము దయ కరుణము అనునవి ఆత్మానందమునకు హేతువులు

మంచి అన్నది పెంచుమన్నా .

మంచితనమే దైవము మంచిని పెరగనివ్వాలి మంచిని ప్రేమించడమే దైవమును ప్రేమించడము దుర్గుణములను రోసి ఆత్మ సుగుణ సంపత్తిని పెంపొందించుకొంటున్న కొద్దీ అది దివ్యత్వమును పొందుతుంది

*　　　*　　　*

ఆచరణ యోగ్యమైన వేదాంతమునకు పరీక్ష కార్యావలంబనం. సిద్ధాంతాల అర్థం ప్రాధాన్యం గుర్తెరుగక కేవలం వాటిని వల్లెవేస్తూ మనుష్యులు పొద్దుపుచ్చుతున్నారు క్షుద్ర దేవతారాధన ఉపాసన అనే మూఢ విశ్వాసాలను కలిగించి కొందరు దొంగ వేదాంతులు చేసే ఘోర కృత్యాలకు లెక్కలేదు వేదాంతులొస్తున్నారు చెంబులూ ముంతలూ జాగ్రత్త' అన్న సామెత ఊరికే పుట్టలేదు

*　　　*　　　*

మంచి పని చేసేటపుడు కంటె చెడ్డ పని చేసేటపుడు వివేచన అవసరం ఒకరికి సాయపడడం ధర్మం హాని చేయడం అధర్మం ధర్మంగా నడవలేనపుడు అధర్మంగా నడుచుకోకపోవడం మేలు ఒకరి మనసు నొప్పించకుండా వుంటే పోనీ అదే చాలు ఉపకారం చేసినట్టే

**కావ్యసృష్టి :**

అభిరుచి గుణ దోష నిశ్చయ జ్ఞానమువున్న రచయిత ఒక కావ్యాన్ని రచియిస్తున్నపుడు అతని సృజన విమర్శనాత్మక శక్తులు రెండూ కుడి ఎడమలుగా ఆ కావ్య సృష్టిని కొనసాగిస్తాయి భావ భావోద్వేగ పాత్ర సన్నివేశాదులను మేధ సృష్టిస్తూవుంటే వాటికి విమర్శనాశక్తి గీటు పెట్టి కొన్నిటిని స్వీకరిస్తుంది కొన్నిటిని తిరస్కరిస్తుంది

ప్రతిభాక్షేత్రం ఒక టంకసాల వంటిది రచయిత సృష్టించేవి అందు తయారయే నాణెముల వంటివి టంకసాల తయారు చేసే నాణెములు చెల్లునో చెల్లవో మోగించి చూసినట్లు వీటిని విమర్శనాత్మక శక్తి ఉపాధేయములగునో కావో పరీక్షిస్తుంది

రచయిత తాను రూపొందించే పాత్ర లన్నింటిని జీవితం నుంచి పరిగ్రహించడు. పరిగ్రహించిన పాత్రలను అచ్చంగా పరిగ్రహించినట్లుగానే చిత్రించడు. వెనకటి కవులు నిర్మించిన భావనాత్మక మూర్తు లక్షణములు, అతనికి తెలియకుండానే, అతనిలో ద్యోతకమౌతాయి.

ప్రాచీన శిథిలాలు :

ప్రాచీన శిథిల భవనాలను, శిల్పాలను, అవశేషాలను చూసినపుడు మనం వ్యాకులపడతాము. వ్యాకులముతోపాటు మనకు ఆసక్తికలుగుతుంది. ఆ వస్తువుల చుట్టూ జాలీ, ఆసక్తి గొలిపే వాతావరణం అలముకొని వుంటుంది.

రూపు చెడని కోటకన్న రూపు చెడిన కోట, విశేషించి దానికి చరిత్రతో అనుబంధము వున్నపుడు, మనకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తుంది. ఊహించుకుందుకు వీలున్నపుడు మన ఆసక్తి మరీ ఎక్కువౌతుంది. సహజంగా మనకు కొన్ని ఊహలు పుడతాయి.

కొన్ని వందల సంవత్సరాల క్రితం ఈ కోటలో కొందరు నివసిస్తూ వుండేవారు. అనేకుల జీవితాలు వింత వింత అభిరుచులతో, అనుభవాలతో, అనుభూతులతో, ఆశలతో, నిరాశలతో అక్కడ గడిచిపోయాయి. వాళ్ళ కష్టసుఖాలు, సుఖదుఃఖాలు ఎటువంటివో?

ఇక్కడి వాళ్ళు ఒక్కొక్కపుడు అత్యంత ధైర్యోత్సాహాలతో ఇంకొకపుడు మహాభయాలతో కాలం గడిపివుంటారు. జీవితంలో అనేక జయాపజయాలను చవిచూసి వుంటారు. వీళ్ళ ఆశలతో నిరాశలతో, ఆనందంతో విచారంతో ఈ వాతావరణం ఒకప్పుడు నిండి వుండేది. ముఖ్యంగా యిక్కడ నివసించిన చివరి తరం మనుష్యులు ఎక్కువ ఒడిదుడుకులను ఎదుర్కొని వుంటారు. అనేక కష్టాలు పడివుంటారు.

చారిత్రకంగ వీటి ఉనికి ఏమిటో!

* * *

ఒక ప్రదేశంనుంచి ఇంకొక ప్రదేశంలోవున్న వస్తువులను చూస్తున్నపుడు, ఆ వస్తువుల ఆకార పరిమాణాలను గురించి మనకు సరియైన దృష్టి ఏర్పడదు. అవి స్థలముల దూరమును బట్టి మనకంటికి అనుతూవుంటాయి.

కాలం గడిచిన కొద్దీ వస్తువుల మూల్యములను గురించి మనకు ఎక్కువ ప్రామాణిక దృష్టి ఏర్పడుతుంది. అలాంటి అవకాశం కాలవ్యవధి వల్ల మనకు కలుగుతుంది. సమకాలిక నిర్ధారణలు కొన్ని అపోహలతో కూడుకొని వుంటాయి.

బుద్ధిని స్మృతియందు లగ్నము చేసినపుడు ప్రజ్ఞాత్మక దృష్టి ఏర్పడుతుంది. అపుడు వస్తువు ప్రత్యక్ష వీక్షణలో వలె, స్వస్వరూపముతో సాక్షాత్కరిస్తుంది. అనవసర వివరణలు చెదిరిపోతాయి. ఇదివరక రెండింతలుగా కల్పించుకున్న అభిప్రాయాలు తొలగిపోతాయి.

అయితే, దీనికి వాస్తవికతను తగ్గించే లక్షణం వుంది. అపుడు సత్యము దూరంగా తొలగిపోతుంది. ఒకరు చేసిన దోషాలు అవి ఏనాటివో కదా అనే భావం పుట్టి, వాటిని మనం నిర్లక్ష్యం చేస్తాము.

ఏ వస్తువునైనా, దాన్ని దాన్నిగా, వస్తుపరంగా వీక్షించి విలువలు కట్టవలెను.

**శక్తికి మించిన పరుగులు**

యవ్వనంలో ఉత్సాహం అధికం. అప్పుడు ఏ కార్యాన్నైనా యిట్టే చేయగలనన్నధీమా కలుగుతుంది. ఆ ఉత్సాహంలో శక్తికి మించిన పని అంటూ ఏదీ వున్నట్లు అనిపించదు. ఏ అవరోధాన్నైనా అవలీలగా దాటగలనన్న ధైర్యం వస్తుంది. కాని ఒక కార్యాన్ని నెరవేర్చాలంటే సాధన అవసరం. పరిస్థితులు అనుకూలించాలి. అమితోత్సాహి వీటిని లక్ష్యపెట్టడు. కార్యస్థ సాధనలో తటస్థపడే కష్టాలవల్ల వ్యక్తికి అనుభవం కలుగుతుది. ఒక కార్యం విఫలం కావడంతో ఏ కార్యం తలపెట్టినా అది దుర్ఘటమనే నిస్పృహ పుడుతుంది. అందువల్ల శిక్షణ లేని ఉత్సాహం వ్యర్థం. వెనకా ముందూ చూడకుండా, పరిస్థితులు అనుకూలమో కావో ఆలోచించుకోకుండా కేవలం ఉత్సాహాన్ని పురస్కరించుకొని శక్తికి మించిన పరుగులు పెట్టకూడదు. తలకు మించిన బరువును మోయాలని ఆశించి నిరాశపడకూడదు. ఈ అనుభవం దుఃఖపూరితమైనది. సమర్థులకు ఆ బరువును ఒదిలిపెట్టడం మంచిది. కొందరు తమకు దుర్ఘటమైన కార్యాలను తలపెట్టి, మరికొందరు వ్యసనాలను అలవర్చుకొని తమ శక్తిని, కాలాన్ని వృధా పుచ్చుతున్నారు. శక్తిని, కాలాన్ని దండుగ పెట్టకూడదు.

**ప్రవర్తనలో పల్టీలు :**

కొందరు తమ ప్రవర్తన కొన్ని ప్రత్యేక సూత్రాల మీద ఆధారపడి వున్నదంటూ గర్వపడతారు. అదే స్థిరమైనట్టు వాటిని దృష్టిలో పెట్టుకొని ఏది ధర్మమో ఏది అధర్మమో సిద్ధాంతాలు చెబుతారు.

కొంతకాలం గడిచిన పిదప అదే వ్యక్తుల ప్రవర్తన, తామిది వరకు చెప్పిన మాటలకు భిన్నంగా వుంటుంది. ఈ భేదం క్షణిక మనోవికారాల వల్ల కలిగివుండవచ్చును. లేదా ఇది వరకటి తమ ప్రవర్తన, ప్రస్తుతం తమ అభిరుచులకు ఎంతమాత్రం సరిపడదని వారు గుర్తించడం వల్ల వచ్చి వుండవచ్చును. కాదా అప్పటి ప్రవర్తనకన్న యిప్పటి ప్రవర్తన వల్ల సుఖము కలగవచ్చునని వారు భావించి వుండవచ్చు.

తాము చెప్పిన దానికి, చేస్తున దానికి సంబంధం లేదని మనం అనేసరికి వారు బాధపడతారు. తమ గౌరవ మర్యాదలకు హాని జరిగినట్లు భావిస్తారు. తమలో కలిగిన ఈ మార్పును సమర్థించుకుందుకు ప్రయత్నిస్తారు. వాదిస్తారు. లేదా అలాంటి మార్పు రానే రాలేదని బుకాయిస్తారు.

'అది నా యిష్టం; అది చేస్తే లాభం' అన్నవి అందరు చెప్పే సమర్థింపులు. దేనినైనా సమర్థించుకుందుకు తెలివితేటలు వుంటే, వాదనలకేం కొదవ; అంతా తర్కబద్ధముగా వాదించవచ్చును!

ఒక విషయాన్ని ఆలోచించేటపుడు అనుకూలముగాను, ప్రతికూలముగాను, కొన్ని వాదములుంటవి.

మూర్ఖుడు తనకు అనుకూలముగా వున్నవాటిని పట్టుకుని అననుకూలమైన వాటిని అవి యదార్థమైనవయినా వొప్పుకోడు సబబయిన మనిషి తన వాదములో అర్థం లేదని తెలుసుకోగానే దాన్ని ఒదులుకుంటాడు

**నొప్పించక తానొవ్వక .**

ఒకరు మనల్ని అప్పు అడిగినపుడు యివ్వడానికి మనదగ్గర డబ్బు వుండదు డబ్బు వున్నపుడు కొందరు అడిగితే, యిచ్చినా మరి చేతికి రాదు రాకపోగా అన్నీ చిక్కులే

ఒకరు మనల్ని అవాంఛనీయమైన ఏదో ఉపకారమో సదుపాయమో చేసి పెట్టమంటారు అది చేసిపెడితే మనకీ బాగుండదు విన్నవాళ్ళకీ బాగుండదు ఆ పని చేయటం న్యాయవిరుద్ధం అలా చెప్పడానికి మనకు మొగమాటం

అలా అడిగినవాళ్ళ మనసు నొప్పించకుండా మర్యాదగా వ్యవహరించాలంటే వాళ్ళ కళ్ళలోకి చూస్తూ అడుగుతున్నది శ్రద్ధగా వింటూ అలా చేయడం అసాధ్యమని అవాంఛనీయమని మన చూపులతో సూచించి తెరపిన పడాలి మన చూపే మనకు శరణ్యం

**చాడీల పర్యవసానాలు**

'ఇ అనే ఆవిడ ఆ అనే ఆవిణ్ణి నానా మాటలు ఆడిందని అ అనే ఒకతె ఆ తో చెపుతుంది ఇలా చెప్పడం అ కు ఆ మీద అభిమానం వల్ల కాదు ఇ అంటే అ కు కడుపుమంట పోనీ కడుపుమంట లేకపోయినా పుల్లింతలు చెప్పడం ఆమెకు సరదా జట్టీలు పెట్టడం ఒక వేడుక కాదూ తనకు ఆ మీద ప్రేమవున్నట్లు ఆవిడ అనుకోవాలని అ తాపత్రయం అందుకే యిచ్చకం

అ ఇ మీద చెప్పిన మాటలను ఆ వింటుంది విని ఊరకోదు ఆ చాడీలను నిజమని నమ్ముతుంది నమ్మి తానే చెవులారా విన్నట్లు ఇ తల్లి వద్దకు పోయి నిలదీసి అడుగుతుంది ఇప్పుడు ఈ అనే ఆవిడ రంగం మీదకు క్రొత్తగా వస్తుంది దానితో అఆ ఇఈ ఉఊ లకు సిగపట్ల గోత్రం .

**కాపరాలలో చిచ్చు .**

మానవుల జీవితంలో దాంపత్యం ప్రధానమైనది జీవితాంతం దంపతులు అన్యోన్యంగా వుండడం ఆనందదాయకం భార్యాభర్తల సంబంధం చెడిపోతే అది సమాజానికి అనర్థ హేతువు ఇప్పటి సమాజం అనేక అనర్థాలతో కూడుకొని వుంది

ఒకరి కాపరం విడదీయడం మహాదోషం ఒకనిపై యీసుకొద్దీ కొందరు అతని భార్య గుణశీలములను ఎన్నుతారు అత్తవారి వంశం మంచిది కాదంటారు లోపాలేమైనావుంటే గోరంతలు కొండంతలు చేస్తారు లేని లోపాలు వున్నవని పుట్టిస్తారు ఇది కేవలం దుర్మార్గం

భార్య వద్ద భర్తను, భర్త వద్ద భార్యను చులకన చేస్తూ మాట్లాడకూడదు. అపుడు వారు ఒకరికొకరు హృదయమిచ్చి ప్రేమించుకోలేరు. అలాగే తండ్రిని కొడుకు చెంత, కొడుకును తండ్రి వద్ద తేలిక పరుస్తూ ప్రసంగించకూడదు. బంధువులు, స్నేహితులు ఈ విషయంలో మెలకువతో వుండాలి.

అసిధారా వ్రతం :

ఇరు పక్షాలతోనూ స్నేహంగా వుండాలనుకున్న వ్యక్తికి ఎంతో ఓర్పూ, నేర్పూ అవసరం. ఎంత కార్యదీక్షతో వ్యవహరించినా, అలాంటి స్నేహితుణ్ణి ఎవరూ సరిగా అర్థం చేసుకోరు. అలా చేసుకోవడం అరుదు. చివరకు ఇరు పక్షాలతోనూ స్నేహం చెడుతుంది; లేదా ఛాయామాత్రంగా మిగులుతుంది.

అయితే ఇలాంటి స్నేహం నెరుపుతున్న వాళ్ళల్లో బలహీనుడు వుంటే, అతనొక పద్ధతిని అవలంబిస్తాడు. ఎవరి దగ్గర వాళ్ళ మాట మాటాడి ఆఖరికి దొరికిపోతాడు.

ఏ రోటి పాట ఆ రోటి దగ్గర పాడేవాడు ఆత్మవంచకుడు, పరవంచకుడు, తనలో లేనిది వున్నదని భ్రాంతి కలిగించే ఒక నటుడు. కాని అతనికి ఒక చిక్కుంది. తాను ఏ మాటలు మాట్లాడాలో, ఈ నటునకు ముందు వ్రాసి పెట్టి వుండవు. అందువల్ల చివరకు తాను వెల్లిపడిపోతాడు. వంచకుడు ఎంత నేర్పుగా నటించినా, ప్రజ్ఞావంతులకు యిట్టే తెలిసిపోతాడు. అన్నమంతా పట్టుకు చూడనక్కరలేదు!

విచిత్రమైన అవస్థ

ఒకడు ఉన్నత స్థితిలో వున్నాడనో, తాము తక్కువ వాళ్ళమనే ఆత్మ నిరసన భావం వల్లనో, అతనంటే భయగౌరవాల వల్లనో, అతనికి తాము అపచారం చేశామనే ఎరుక వల్లనో, కొందరు వ్యక్తులు ఆ మనిషి తారసిల్లగనే విచిత్రమైన అవస్థలో పడిపోతారు. అతనితో మాట్లాడుతున్నప్పుడు స్థిమితం కోల్పోయి, ఒక విధమైన మనోవికారాన్ని పొంది, బిడియపడుతూ చేతిలో పెన్సిలో, పెన్నో, ఏదో ఒక వస్తువును పట్టుకొని తిప్పుతూ వుంటారు. ఇలాగ చేయడంవల్ల ఉక్కిరిబిక్కిరి తప్పి ఊపిరి పీల్చుకుందుకు వాళ్ళకు కొంచం వ్యవధి చిక్కుతుంది. అవతలి మనిషి మొగముతో కనిపించే వ్యతిరేకభావాలకు తాము కన్నెత్తి చూసే అగత్యం తప్పుతుంది.

కొంతమంది ఉత్తినే మెటికలు విరుచుకుంటూ ముక్కు సాగదీసుకుంటూ వుంటారు. వేళ్ళు చాపి చూసుకుంటూ వుంటారు. ఇవి బిడియంవల్ల పుడతాయి కాబోలు !

గుడ్డినమ్మకాల ఫలితాలు

అంధ విశ్వాసాలు ప్రమాదకరమైనవి. ఇవి వ్యక్తుల కార్యాలను, కార్యవిధానాలను తరచు నిర్దేశిస్తూ వుంటాయి. ప్రశ్నించే స్వభావం లేనపుడు గుడ్డి నమ్మకాలు కలుగుతూ వుంటాయి. మనల్ని ఛాందసత్వం ప్రశ్నించనీయదు. సంశయాలతో ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. అణకువతో పడివుండమంటుంది. ఈ అణకువ పిరికితనానికి లక్షణం. కార్యకారణ సంబంధ జ్ఞానం శూన్యమైనప్పుడు ఏది జరిగినా, అది కాకతాళీయం, వేళావిశేషం, విధికృతం, యాదృచ్ఛికం అని వ్యక్తులు ఊహించి సంతృప్తిపడతారు. ఆలోచనకు చోటివ్వరు.

# కన్యాశుల్కము : ప్రదర్శన : ప్రశంస

ప్రియమైన మహారాజాసాహేబ్,

దయతో మీరు పంపిన ఆహ్వానం అందింది. అందుకు నా ధన్యవాదాలు. మీ కోరికలు నాకు ఆజ్ఞలే, కాని జరూరు పనులవల్ల యిక్కడ వుండిపోవలసివస్తోంది.

జగన్నాథవిలాసినీ డ్రమెటిక్ కంపెనీ వంటి ఎన్నికైన ఎమెచ్యూరు నటసమాజంవారు నా నాటకాన్ని అభినయిస్తున్నారంటే అమితానందభరితుణ్ణయాను. ఇలాంటి ప్రోత్సాహకర పరిస్థితి కారణంగా నా నాటకాన్ని రెండోసారి ముద్రించాలని నిశ్చయించుకున్నారు. ఎన్నడో పన్నెండేళ్ళ క్రితం ప్రతులన్నీ చెల్లిపోయిన నా నాటకాన్ని యీ నాటికీ నా మిత్రులు జ్ఞాపకం పెట్టుకున్నారంటే అందులో కొంత మేలిమి తప్పక వుందన్నమాట. నా నాటకం ప్రచురితమౌతున్నపుడు దానిపట్ల మిత్రులు చూపిన ఆదరణ, ఉత్సాహాన్ని కలగచేసింది. విశేషించి పత్రికలు దానికి యిచ్చిన స్వాగతం అపూర్వం.

నా నాటకానికింతటి విజయం చేకూరినప్పటికీ మళ్ళీ దానిని ముద్రించాలనికాని లేదా కొత్తవి రచించి అచ్చు వేయించాలని కాని అప్పట్లో నేను అనుకోలేదు. అందుకు కారణాలు రెండు. తెలుగున గ్రంథప్రచురణమనేది పీకులాట పంచాంగం. కృత్యాద్యవస్థ. యూరపులోనో లేదా కనీసం బెంగాలులోనో వున్నట్లు తెలుగుదేశంలో పుస్తకవ్యాపారమనేదిలేదు. గ్రంథకర్త తనపుస్తకాన్ని తానే అచ్చొత్తించుకోవాలి. ముద్రాపకుడు ప్రకటనకర్త ప్రచురణకర్త అన్నీ అతనే! అచ్చొత్తించిన పుస్తకాన్ని అభివందనలతో బహూకరించమని పరిచయస్థులైన మర్యాదస్థులు గ్రంథకర్తను అర్థిస్తారు; దీనితో గ్రంథకర్త లాభం గూబల్లోకి వస్తుంది. అతని పని కుదేలు!

దేనికైనా నా మదరాసు ప్రచురణకర్తలు అచ్చువేసే అవకాశమంటూ వుంటే దిక్కుమాలిన మదరాసు తెలుగులో రాసిన స్కూలు పుస్తకాలకు మాత్రమే ఆ అదృష్టం పడుతుంది. ప్రాచీన కావ్యాల విషయంలో గ్రంథవిక్రేతల మధ్య వస్తుమారకపు వ్యాపారవిధానం కొనసాగుతూవుంది. మొత్తం చెన్నపట్నం పేరుచెప్పి వొక్క మంచి ఆంధ్రగ్రంథవిక్రయశాల వుంటే వొట్టు! ఇపుడున్న చోటునుంచి ముప్ఫైమైళ్ళ ఉత్తరాన మదరాసు వెలసివుండెనా తెలుగుభాష బతుకు యింతకంటె

బాగుండేది. ముప్పైమైళ్ళ దక్షిణాన వెలసివుండెనా తమిళభాష బతుకు అంతకంటె బాగుండేది. ప్రస్తుతంవున్న మదరాసు తెలుగుభాషకు సవతితల్లి.

అప్పట్లో నా నాటకాన్ని పునర్ముద్రించకపోవడానికి కొత్తవి రాసి ప్రచురించక పోవడానికి మీద చెప్పిన పరిస్థితి వొక కారణం. రచయితల కోవలోనికి చేరాలని ఆనాడు నేను కాంక్షించకపోవడం రెండవకారణం. పాండిత్యాన్ని పెంపొందించుకుంటూ యితరులకావ్యాలను చదివి ఆనందిస్తూ సంతృప్తి పడేవాడిని. వొక ప్రయోజనాన్ని కాంక్షించి వొక మార్గాన్ని నిర్దేశించడంకోసం నేను కన్యాశుల్కాన్ని వెలువరించాను. రచయితలు ముఖ్యంగా నాటకకర్తలు తప్పుదారులుబట్టి పట్టాలు తప్పి సాహిత్యకృషి సల్పుతున్నారని నేను గమనించాను. తెలుగున కావ్యభాష యెలాగున వుండవలెనో దానిని యే విధంగా సంస్కరించవలసి వుంటుందో యీ విషయమై నా అభిప్రాయాలు ఏమిటో మీకు తెలుసును. దీనినిగురించి నా నాటకఉపోద్ఘాతంలో క్లుప్తంగా ముచ్చటించాను. నిత్యజీవిత కార్యకలాపాలలో గ్రాంధిక భాషను వ్యవహరిస్తే ఎంత కృత్రిమంగా వుంటుందో దానిని రంగభూమియందు ప్రయోగించినా అంత కృత్రిమంగానూ వుంటుంది.

పుష్కలమైన అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించక ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనికకథలనుంచి రచయితలు యితివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంకాక నాకు ఆశ్చర్యం వేసింది. ఈ కారణాలవల్ల నేను వాస్తవిక జీవితం నుంచి సమకాలికయితివృత్తాన్ని స్వీకరించి దానిని తెలుగున వాడుక భాషలో నాటకంగా రూపొందించాను.

నే నాశించిన దానికంటె అధికంగా నా నాటకానికి విజయం సిద్ధించింది. అంతటితో నే ననుకున్న ప్రయోజనం నెరవేరింది. నేను పండితుణ్ణి; అయితే అందువల్లనే నేను కవిని ఆయానని దాని భావం కాదు, ఏ కుర్రవాడైనా పాండిత్యాన్ని ఆపేక్షించవచ్చును. ప్రతిభావంతుడుమాత్రమే కవి కాగలడు. కాని తెలుగున యీ తారతమ్యం కానరాదు. ఇక్కడ పండితుడైనంత మాత్రంచేత ఎవడైనా కవే. భాషను రూపుమాపి వీరు తాము రాసిన పుస్తకాలను నోరువాయిలేని స్కూలు పిల్లల నెత్తిని రుద్దుతున్నారు. మనకు చెప్పుకోతగ్గ విమర్శ మృగ్యం. చదువరుల సంఖ్య స్వల్పం. నాకు యిలాంటి పండితుల వర్గాన్ని అనుసరించడానికి మనస్కరించలేదు. కళాశాలలోని పండితులుకాక సమర్థులైన రచయితలు నామార్గాన్ని అనుసరిస్తారని నేను ఆశించాను. కాని నా ఆశ నెరవేరిందికాదు. సమకాలిక జీవిత సంఘటనలను యితివృత్తాలుగా పరిగ్రహించి ప్రతిభావంతులైన మీవంటి రచయితలు వాడుక భాషలో మాత్రమే వచన నాటకాలను రాయాలని నా అభిలాష.

వచననాటకాలను అభినయించడం బహుకష్టం. దోష భూయిష్టమైన అభినయాన్ని సాహిత్యాన్ని మన దృష్టిలో పడనీయకుండా గానమూ ఛందస్సూ మరుగుపుచ్చుతాయి; దృష్టిని చెదరగొడతాయి. మనకు సంగీతనాటకాలు కొల్లలు. రంగ భూమి మీద వీటి విజయం సాధారణంగా ప్రేక్షకుల తెలియని తనంమీద ఆధారపడి వుంటోంది. సైడుకర్టెను చెంత అపశ్రుతులతో హార్మోనియం మోగుతున్నంతసేపూ ఆనందిస్తూ కూర్చునే ప్రేక్షకులున్నంతకాలం యీ నాటకాలు రక్తికడుతూనే వుంటాయి. వీటికేమీ ధోకా వుండదు.

సంగీత పరిజ్ఞానమున్న నటులు అరుదు. కర్ణకఠోరంగా పాడుతూ మన నటులు ప్రేక్షకులను ఉక్కిరి బిక్కిరి చేస్తారు. ఓర్పుపట్టి తగుశిక్షణ పొందితే అభిరుచిగల ఎవరైనా నటించి పరవాలేదనిపించుకోవచ్చును. కాని అధ్యయనమూ అభ్యాసమూ అవసరం లేదనే దురభిప్రాయం మన నటులలో ప్రబలంగా వుంది. నటుల దృష్టిలో అభినయం వొక

కూసువిద్య. విజయనగరంలో పద్దెనిమిదివందల డెబ్బై ఎనభైల మధ్య కొందరు బ్యాంకులను స్థాపించారు. బ్యాంకుల నిర్వహణకు ప్రత్యేకమైన తరిఫీదు అనవసరమని వారి అభిప్రాయం. అందుకని వారు నెలకొల్పిన బ్యాంకులన్నీ దివాలా తీశాయి. మంచి గుణపాఠమే మరి. అయితే నాటక ప్రదర్శనం విఫలమైతే దొద్దమున్న ముల్లెపోతుందని భయపడేందుకు అది బ్యాంకువంటిది కాదుకదా! కనక ఆ భయం మన నటులకు లేదు.

ఎమెచ్యూర్ నటులకు తీరికవుండదు. వృత్తిగా నటించే నటులకు తీరికవున్నా వచననాటకమంటే నిర్లక్ష్యం. పాత్రను క్షుణ్ణంగా అర్థంచేసుకుని నటించడమనేది మొదటేలేదు. నోటికి రావలసిన ఆ నాలుగుముక్కలూ కంఠస్థం చేస్తారా అంటే అదీ కనబడదు. మొత్తంమీద అటు వాళ్లు యిటు వీళ్లు వచననాటకాలను అలక్ష్యం చేస్తున్నారు. ఇది నా అనుభవం.

చాలాకాలమై మీ పోషణలోవుంటూ చక్కని కృషి కావిస్తూ గౌరవ ప్రతిష్ఠ లార్జించుకున్న జగన్నాథవిలాసినీ నాటకసమాజం, ఉన్నతఆదర్శాలను ఉపలక్షించి వాటిని సాధిస్తుందని నా దృఢవిశ్వాసం. అనుకోకుండా ఉత్తరం ఊరికే పెరిగిపోయింది. ఆ యా విషయాలపై నాకున్న ఉత్సాహమే అందుకు కారణం. మన్నించండి. జగన్నాథవిలాసినీడ్రమెటిక్ కంపెనీవారి ప్రదర్శనలను చూసే అవకాశం యింకొక నాడు లభిస్తుందని ఆశిస్తున్నాను. 1906 వేసవిలో నేనింకొక వచన నాటకాన్ని ఊటీలో వుండగా రచించాను. కాని వ్రాత ప్రతి ఎంత వెదికినా కనిపించడం లేదు.

ఎక్సహిల్‌హౌసు
ఉదకమండలం
7.5.1909

ప్రియమైన కవిరాజా,

కన్యాశుల్కము అచ్చుఫారములను మీకు పంపమని, ప్రచురణకర్తలకు జాబువ్రాశాను. దయవుంచి నాటకముపై ఒక సమీక్షను వ్రాసి ప్రముఖ తెలుగు పత్రికలలో ప్రచురింపించండి. ఇతివృత్తస్వీకరణలో, నిర్వహణలో, హాస్యరసపోషణములో, పాత్రోన్మీలనములో, తెలుగు సాహిత్యములో ఇది అత్యుత్తమనాటకమనే విషయాన్ని మరవకండి.

మీరూ అమ్మాయి కులాసాగా వున్నారని తలుస్తాను. మీ నాటకసమీక్షను ఆంధ్రప్రకాశికకు పంపమని నాకోరిక.

స్టోన్‌హౌసు పేట
10 మే 1909

ప్రియమైన మహాశయా,

అతిదయతో మీరు వ్రాసిన ఉత్తరం నాకిప్పుడే అందింది. మీరు ఉదకమండలంలో వున్నారనుకున్నాను. ఎక్కడ వున్నదీ నిర్ధారణగా తెలియకమీకింతవరకు ఉత్తరంవ్రాయలేకపోయాను.

నేను కులాసాగా వున్నాను. నావృత్తి వొక సమస్యగా పరిణమించి నన్ను వేధిస్తోంది. ఈ ఉపాధ్యాయవృత్తిమీద నాకు వుండే వ్యామోహం తీరిపోయింది. ఇక యీఉద్యోగం చేయడానికి నాకు మనస్కరించడంలేదు. వీలయితే వొదులు కుందా మనుకుంటున్నాను. ఉపాధ్యాయుడికికష్టమెక్కువ; ఫలితంతక్కువ ఇప్పుడు నాజీతం ముప్పై అయిదు రూపాయలు. వచ్చే యేడు నేను ట్రెయినింగుకు పోవలసివుంది. నన్ను యేంచేయ మంటారో తగిన సలహా యీయమని నేను మిమ్మల్ని చాలా కాలంక్రితం కోరాను. కాని మీరింతవరకు ఏమాటా చెప్పారు కాదు. మా తల్లిదండ్రులు వంగోలులో క్షేమంగా వున్నారు. వేసంగి సెలవులు నేటితో ప్రారంభం. స్కూలు మూసివేశారు, వొకటి రెండు రోజుల్లో వంగోలు వెళతాను.

ముద్రాపకులు కన్యాశుల్కము మొదటి 128 పుటలు నాకు పంపించారు. దాన్ని నేను జాగ్రత్తగా చదివాను. ఇది వరకటికంటె నాటకం గొప్పగా మారిపోయింది. హాస్యరసం చక్కగా పరిపోషితమయింది. నాటకఉదాత్త లక్షణాలను నేను బాగా అనుభవించగలిగివున్నాను. నా మిత్రుడు సహాధ్యాయి శ్రీ యం. శివకామయ్య, బి.ఏ., దీన్ని చదివి పరమానందభరితుడౌతున్నాడు.

ఉపాధ్యాయునిగా, విటునిగా, సంఘసంస్కర్తగా, రాజకీయజ్ఞునిగా నేటికాలపు వాచాలునిగా యువకుడు గిరీశం తన నిరుపమాన సామర్థ్యంతో మనల్ని నిరంతరం ఆనందింపచేస్తూవుంటాడు. మన సమావేశాల్లో సంభాషణల్లో జీవిత ఘట్టాలలో అన్నిట అతని స్మృతి మనల్ని విడనాడక ముగ్ధుల్ని కావిస్తుంది. అగ్నిహోత్రుడు లుబ్ధుడు పూర్వాచార పరాయణులైన ఛాందసబ్రాహ్మణుల మనస్తత్వానికి ప్రతిబింబాలు. ఈ ఇద్దరూ విభిన్న ప్రవృత్తులు గల సమర్థులైన యిద్దరు వంచకుల చేతుల్లో పడి మోసపోతారు. ఈ నాటక ప్రధానకథా సూత్రాల్ని, నామౌచిత్యాన్ని పరిపోషిస్తున్న పాత్రలు బుచ్చమ్మ, మీనాక్షి. బాల వితంతువులకు ప్రతిబింబా లనదగిన వీరి స్వభావం విభిన్నం. ఒకతె నిర్వ్యాజమైన ప్రేమస్వభావం గల అమాయిక. ఇంకొకతె తాను పట్టిన పట్టు సాధించాలనుకునే దీక్షగల యువతి. తన చెడునడతను మార్చుకుని మంచి మార్గానికి రానొప్పని మూర్ఖచిత్త. సన్న సన్నని రేఖలతో రానురాను చక్కని ఆవరణతో వొప్పినపాత్ర రామప్ప పంతులు. విజయనగరంలో అలాంటి కొందరి వ్యక్తులను మనం ఎరగకపోము. అతను మద్యపాననిరతుడుగా వుండతగినవ్యక్తి అయితే అట్టి పరిపూర్ణత అవసరం లేకుండానే నాటకంలో అతని పాత్ర బాగుంది.

భారతదేశంలో అజ్ఞాకరమైన వ్యభిచారమే వృత్తిగాగల వనితలకు మధురవాణి పాత్ర మాతృకగా చిత్రితమైనట్లు అనిపిస్తున్నది. వ్యభిచారగృహాలలో తగుమనుష్యులు పడతగిన అగచాట్లు, దురవస్థలు నాటకంలో అద్భుతంగా ఊహింపబడ్డాయి. విటుడనేవాడు సంఘంలో తనకున్న మర్యాదను ఆత్మగౌరవాన్ని పూర్తిగా పోగట్టుకుందుకు సంసిద్ధుడు కావలసివుంటుందని ఈ నాటకం మనకు చక్కగా బోధపరుస్తుంది. పెళ్ళీడు వచ్చిన వెంకటేశం కేవలం మందమతి; లోకజ్ఞాన శూన్యుడు. కనక తనకు చదువుచెప్పే గిరీశం చేష్టల నడతల నిజస్వభావాన్ని అతను పోల్చుకోలేకపోతున్నాడు.

నాటకంలో ప్రతీది స్వభావసిద్ధంగా ప్రత్యక్ష పరిస్థితులకు సాక్షీభూతంగా వాస్తవికంగావుంది; ఎడతెరిపిలేని ఎదురు దెబ్బలతో సునిశితహాస్యచమత్కృతులతో ఈనాటకం మనల్ని పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్విస్తుంది. నాటక ప్రధానఅంతరకథాగమనానికి, సన్నివేశాలు దోహదపడుతూ క్రమక్రమంగా వస్తునిర్మాణాన్ని పెంపొందిస్తున్నాయి. నాటకనిర్మితిలో ఎక్కడా బిగి సడలలేదు. సందర్భానుసారంగా పరిస్థితుల కనుగుణంగా పాత్రలు పరిపోషితమౌతూవచ్చాయి.

ప్రతాపరుద్రీయము నాటకంమీద మీవిమర్శ నేను అవగతం చేసుకున్నాను. మీరు వ్రాసిన ప్రత్యక్షరం నిజమని ఆమోదిస్తున్నాను. శ్రీశాస్త్రిగారి 'ఉషా'‘నాగానందము’నాటకాలను నేను పాఠ్యగ్రంథాలుగా చదివాను.

కథానిర్మాణంలో అవి కొంత కుంటుపడినట్లు కనిపించింది వీరేశలింగముగారి హరిశ్చంద్ర చిలకమర్తి పారిజాతాపహరణము ప్రసన్నయాదవము లనుకూడా పాఠ్యగ్రంథాలుగా పఠించాను మీరుచెప్పినప్రకారం వీటిమీద మీసంక్షిప్తసమీక్షలను పంపినట్లయితే నేనెంతోకృతజ్ఞుణ్ణి

ఈ ప్రాంతంలో వాడుకలోలేని మీ నాటకంలో ప్రయుక్తమైన పదములను పట్టికగా తయారుచేసి మీకు త్వరలోనే పంపిస్తాను కన్యాశుల్కము మొదటి 128 పేజీలు మాత్రం నాకు అందాయి ఇప్పటికి అచ్చుయినమటుకు ఆ నాటకాన్ని నాకు పంపమని ముద్రాపకులకు వ్రాయండి

♦ ♦ ♦

రెంటాల హౌసు
మైలాపూరు మద్రాసు
7 జూలై 1909

ప్రియమైన అప్పారావు పంతులుగారు

మీరు పంపిన కన్యాశుల్కము నీలగిరిపాటలప్రతులు అందాయి మీరు దయతో వాటిని బహూకరించినందుకు నేను మిక్కిలి కృతజ్ఞుణ్ణి నాటకమును చదివి పట్టరాని ఆనందమును పొందాను ఇదివరకే మీ నాటకం పలువురి ప్రశంసలను పొంది ప్రసిద్ధికెక్కింది ఇంత ఉత్తమనాటకాన్ని ఆంధ్రులకు ప్రసాదించినందుకు మీకు నా అభివందనాలు మీరు ఏ భాషను పవిత్రమైనదిగా భావిస్తున్నారో ఆ వాడుక భాష నాటకంలో ముద్దుల మూట కడుతున్నది మొదటినుంచి చివరివరకు హాస్యరసము పాఠకుణ్ణి పరవశుణ్ణి చేస్తుంది నాటకఇతివృత్తం అతిగంభీరం నిరంతర ఆసక్తి జనకం కథా సంవిధానం చక్కగా అమరింది నాటకం పెద్దదయినా సన్నివేశ చమత్కారంవల్ల సంభాషణల మాధుర్యంవల్ల పాత్రల అమోఘ చిత్రణవల్ల పాఠకుడు రచయితను తప్పు పట్టలేడు మీ నాటకం జీవితాన్ని అతి సహజంగా చిత్రిస్తున్నది ఛాందస శ్రోత్రియుడు సంస్కర్త దుర్మార్గుడు మూర్ఖుడు నేర్పులేని ఆడది తమతమ మనఃప్రవృత్తులతో మీ రచనలో పాత్రలుగ మూర్తీభవిస్తున్నారు నాటకంలోని పాత్రలు సజీవమైనవి ఇక అవి చెక్కు చెదరవు

మీరు ప్రేమికులు మీరు ప్రేమించడం ఎరుగుదురు మీ నాటకంలో కొన్ని చోట్ల షాక్‌లు వున్నా అవి చురకలు మాత్రమే నాటక మంతటా విద్యుచ్ఛక్తి ప్రసరించినా ఎన్నో వింతవింత మెరుపులు మెరిసినా అందులోని విద్యుత్ప్రవాహం నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది ఎంత వెలుతురు నింపినా అది తరగదు చెదరదు

♦ ♦ ♦

లైబ్రరీ
24-11-12

నమస్కారములు ఉభయకుశలోపరి

నిన్ననార్తరన్ సర్కార్సు ప్రొగెసీవుయూనియన్‌మీటింగు జరిగినది మీ కన్యాశుల్కంలోని గిరీశంనుగూర్చిన కొంతభాగం ఆడి నారు పొట్ట చెక్కలగునట్లు నవ్వనివారులేరు అద్భుతముగానున్నది నేను పద్యములు వ్రాసితిని శ్రీ సుబ్బారావుపంతులుగారచ్చు వేయించినారు చాలామంది సంతోషించినారు

నేడు గ్రామ్యంగూర్చి వీరేశలింగంగారి యాజమాన్యమున పచ్చయప్ప కాలేజిలో మీటింగు ఇవి విశేషములు తప్పక వెంటనే తెలుగు రాయలశాసనము సింహాద్రిమీద యింకా రెడ్లశాసనాలు నా ప్రతాపరుద్రుని శాసనము దశకుమార చరిత్రము ముఖ్యముగా ప్రసంగరత్నావళి పంపగోరుచున్నాను ఎదురుసూచుచున్నాను జవాబు వ్రాయింపుడు దొరకునేని వెదురువిత్తులు పంపవేడెదను

కన్యాశుల్కపు కూర్పును నిన్న మెచ్చుకోనివారు లేరు వీరేశలింగముగారు రెం సు గారు న్యా సు జ రా గారు మొదలగువారు మిగుల సంతోషపడిరి మీ యొద్దనుండి పుస్తకములరాక కెదురుచూచుచున్నాడను చిత్తగింపుడు

* * *

లీలావినోదా రామచంద్రా

—— అప్పారావుగారు యెట్లాంటి నాటకరత్నాన్ని కల్పించాడని మనవిచేయను చూడడానికి పెద్ద నవలవలె వుంటుందికాని ఆడవచ్చేసరికి కన్యాశుల్కంలో కనుపించే పోకడలు స్వభావాలు ప్రత్యేక వికాసాలు తళుకు సొబగులు మరెక్కడా కనబడవు పేరునుపట్టి విచారిస్తే కథంతా లుబ్ధావధానుల వ్యవహారం అగ్నిహోత్రావధానుల కన్యావిక్రయ వ్యాపారంమటుకే వుండవలసి వుంటుంది ఇందులో గిరీశం చేసేపని యేమీ కనిపించదు మధురవాణి రామప్పపంతులు కరకటశాస్త్రి పన్ని దానికి తెలిసియు తెలియకను తోడ్పడుటకును అవసరమయి యుండవచ్చును కాని అక్కడకూడ పిల్లను కొనుక్కొనే ముసలిలోభికి కలగవలసిన శాస్తి దుష్పరిణామము చూపించడానికే వీరుచేసిన కథాభాగము జతయైనది గిరీశం వృత్తాంతమంతా కన్యాశుల్క గాథకు సంబంధించిలేదు కాని అప్పారావుగారి యీ యొక ఆటలో అనేకరకాల సాంఘిక దుర్నీతులను చూపించ నెంచాడు ఒక చెంప గిరీశం కొంచెమింగ్లీషు నేర్చి దొరల తరహాలు పట్టించుకొని చదువెక్కువ అంటకపోయినా డబ్బు దుగ్గాణి పేరుపెంపు వుద్యోగము సద్యోగము యేమీలేకపోయినా పెద్ద చదువరివలె ధనికుడివలె బింకాలు నరకుతూ పోజులు పెట్టే నవీన విద్వత్సోంబేరుల దుర్లక్షణాలను కనుపరుస్తాడు వీని మాటలలో దేశాభిమానం నేషనల్ రిఫారమ్ మొదలయిన పెద్దపోజులు కనిపిస్తూ బుద్ధులు మాత్రం నీతివిహీనంగా వుంటవి బ్రతుక నేర్చినవాడు గడుగ్గాయి సమయము గుర్తించి నడువనేర్చిన లోకసంచారి శృతిపాండిత్యానికి వచ్చిన నాల్గుముక్కలను వెళపెళ దబాయించడానికి లోటులేదు ఆ డ్రెస్సు ఆనడక ఆ చుట్టపీల్పుడు ఆ యెదుపులు ఆ పలుకులు మన దేశంలో మరేవేషానికి యొప్పియుండలేదు కాని గిరీశం అడ్డంకుల దప్పించుకునే యుక్తి కలవాడైనా బండబారిన దుశ్చింత కలవాడు కొన్ని సందర్భాల్లో పిరికితనము బెదురుపాటు తన తెలివికి తానే సంతోషించుకొను లేతబుద్ధి కలవాడు ఈగడుగ్గాయి కెదురుగా వెంకటేశాన్ని అమర్చాడు మా ముత్యాలసరములుగూర్చే మేటి కోవిల చదువుకు పట్నాలు జేరి పల్లెటి పొలాలలో గేదెలుకాచే బుద్ధిమాంద్యమింకా వదలక బాగోగులేమీ తెలియక పోజులు పెట్టే పెద్ద వాళ్ళ సాంగత్య మభిలాషించుచూ మంచికన్న చెడ్డను లీలగా నలవరచుకొను మూఢవిద్యార్థులలో వెంకటేశం వొకడు ఇప్పటి రౌడీ పరిభాషలో పల్లెటిగబ్బిలాయి గబ్బిలాయికూడా కాదు కోటులేకుండా ధోవతిలోపల మడచిన షర్టుమీద వంకరగా ఫరంగీకంటాభరణ పీలికను ధరించువాడు కాదు కాని వట్టి యవివేకి విశ్వాసి తెలివిలేమిని సర్వదా సర్వత్ర గనపరచు జడసత్వము గిరీశమెంత పోకిరీజాణయో వెంకటేశమంతటి ముగ్ధచేతస్కుడు బుచ్చమ్మకూడా వట్టిముగ్ధయే వీళ్ళిద్దరు అంత నిర్ధూమధాముడు గడుసుబొంద అగ్నిహోత్రావధానుల కడుపున పుట్టిందే మహాచిత్రము

తెలివితేటలలో వెంకటేశాన్ని వెనుక పీటికగా చూపినట్లే, పోకిరితనంలో మరియొకరకపు పాత్రాన్ని గిరీశానికి భిన్నంగా నిలువపెట్టాడు. రామప్పపంతులు నియోగి; కాదా? వ్యాపారి. గిరీశం వైదికపు వాళ్ళల్లోతప్పబుట్టినవాడు. రామప్ప పంతులు ప్రైవేటు వృత్తిలో సంపాదించుకొంటూ తన లౌకిక ప్రభావానికి, తన పంతులువేషానికి, తన సంపాదనకు వొక చంప నెరవారుచున్న మీసపుటందముకు, తన వలపుషోకులకు, పొంగిపడుతూ తనయంతటి రసికుడు, వ్యవహర్త, రూపసి, లేడను భావముతో సంచరించువాడు. నాల్గింగ్లీషు ముక్కలు రాకపోయినయిగాని ఆ గిరీశంవెధవని తెలయెత్తనిచ్చేవాణ్ణా అని మధురవాణి దగ్గర ప్రతాపాలు తెగనరకిన కోతగాడు. బుద్ధిలోనేకాదు. యెత్తుల పోటీయందునే కాదు. బలపరాక్రమాల్లో కూడ ధైర్యసాహసాల్లో కూడ నసహాయశూరుడని పొక్కి పొరలెడి చవిటి బుద్ధి. గిరీశం కనిపిస్తే పిలకెక్కత్తీస్తాననే మేటిబంటు. అతడు యేమరుపాటున ప్రవేశించగానే యీ మాటలు వాడి చెవిన పడలేదు గదా, అని తత్తరపడుచు మంచంక్రింద శరణు జొచ్చెను. రామప్పపంతులు తనరూపసంపదల ప్రభావముల విశ్వసించి, వెలయాలి చేతలను తీరుగా గుర్తింపనేరక, డబ్బు తగలేసుకుంటూ, తావలచినది తనను గూడ వలచునను భ్రాంతిలో దేలువాడు. ఒక్క చిటికెలో కరకటశాస్త్రి రామప్పపంతు లెదుటనే మధురవాణికి కన్ను గీటి, వంచకనటుని యాడు తెగిన కోమలాంగిగ జరిపి, కంటిలో మన్నుపోసి, లుబ్ధావధాను లిచ్చిన కన్యాశుల్కంలో చిల్లిగవ్వైనా పంతుల కందకుండా తప్పించుకొని, యింత పెద్ద ప్రైవేటు పంతులుకూ దబాలున దుంకీయిచ్చి దొబ్బేశాడు. (విశాఖపురిప్రాంత పరిభాష వాడినందుకు చదువరులు మన్నించెదరు గాక.)

తుదకు సౌజన్యారావుగారు వొకవిధంగా గిరీశం యొక్క దేశాభిమాన సంఘసంస్కరణ మిధ్యాడంబరమునకు సౌశీల్య విరాజితంబగు వెన్ను పట్టిగ వర్తించుచున్నాడు. మధురవాణి కూడ గిరీశముయొక్క దుశ్శీల దుర్విదగ్ధ మానస మౌఢ్యమునకు జీవితానుభవములలో మంచి చెడ్డలు తెలిసికొని బుద్ధితెచ్చుకునే సుస్వభావాన్ని చూపుతున్నది. బుచ్చమ్మను లేవదీయు ప్రయత్నము భంగమైనాక "డామిట్‌కథ అడ్డంగా తిరిగింది" అని చివాలున సౌజన్యారావు చెంతనుండి పురలిపోవునేకాని బుద్ధిని త్రిప్పుకొను దారుల రయడు. రామప్పపంతులు, వెంకటేశము, సౌజన్యారావు, మధురవాణి, యీ నలుగురు గిరీశము స్వభావాన్ని అట్టి తెరవులలో భేదంగా సంచరించే వివిధప్రవృత్తులను చూపడానికి కల్పించబడ్డకూడలి.

అగ్నిహోత్రావధానులు వ్యాజ్యాలకోరు. రేయింబగళ్లు ప్రక్కయింటివాని పెడకప్పు పీకించ నుంకించుచుండును. కడు లోభి. ఆచారపరాయణుడు. వీరేశలింగంపంతులుగారి రాజ శేఖర చరిత్రలో భోజనపుసమయానికి యవతరించిన సోమయాజులవంటివాడు. దర్భాసనపుకట్టతో, దేవతార్చనమూటతో, మూడు కోర్టులూ తిరిగివచ్చే లౌకిక వైదిక మర్యాదా సమన్వేత. శుద్ధ లోభి. కూతులనమ్ముకొని సొమ్ముచేసెడి పంద. గిరీశానికి ఆవునెయ్యి, గేదె పెరుగులతో శలవరోజులన్నీ విందు సేయదానికి వొప్పుకోకపోయేవాడే. కాని గిరీశం మోహనాస్త్రమంటే యేమిటో తెలిసినవాడు. పొలిటిక్సులో మెదిగిన చెయ్యి. 'నీవు అన్నమాట మహాబాగుంది.' అనే సమ్మోహన వాగ్బాణ ప్రయోగ సామర్థ్యమెరిగి వర్తించెను, గిరీశము. అగ్నిహోత్రావధానులు తన వ్యాజ్యాలలో గిరీశము తోడ్పాటు నాశించి యుండెను. కొడుకు చదువుకు కుండలలో గుర్రాలు తోలే వాడైనా, కోర్టు వ్యవహారాలలో మాత్రము వెనుక తీయడు. అక్కడకూడా వీలైతే చవుకగా మంచి ప్లీడరును కొట్టేయ్యాలని ఆశపడతాడు: పల్లెటి వైదికులలో అగ్నిహోత్రావధానులది వొక విధమైన ప్రకృతి. లుబ్ధావధానులదింకొకటి. నలత మనిషి, డబ్బుకు గింజులాడే స్వభావం. యెంతవరకూ చేతిపైసా వదలకుండా మంచి లాభం వెతుకుచూ కొద్ది కర్చులో బంగరు మేల్బంతిని కట్టికొన చూచువాడు. వీరిద్దరు యెవరిదారిలో వారు చాదస్తులే. పల్లెటి బ్రాహ్మణుల తృతీయప్రకృతి కరకటశాస్త్రియందు మూర్తీభవించియున్నది. ఇతను తగిన గడుగ్గాయి.

మంచిలౌక్యుడు యుక్తాయుక్తము మంచిచెడ్డలు లాభనష్టాలు తెలిసినవాడు శిష్యులు(౧)డుటచేత చదువుకున్నవాడని యూహింపవచ్చును ప్రాయశఃకావ్యనాటక విలాసపరిజ్ఞాత ఇవి వుంటూ సమయానుకూలమగు కార్యసాధన గలయజాచినవాడు బహుశా చీట్లాడగలడు వేశ్యాప్రసంగంలో ఆరితేరిన తెరువరి ఈ మూడు స్వభావాలు వెంకటేశంతోసహా పల్లెటి జీవుల వయః ప్రకృతి భేదములను చూపుతున్నది

ఇక ఆడవేషాలలో మధురవాణి పణ్యవనితా విచిత్ర వైఖరుల గరచిన మేటిసాని కాని యీమెలోకూడ కొంత మంచితనము స్వజాతి విరుద్ధమైన విశ్వాసము చివరకైనా పడుపుబ్రతుకుల బేలతనము గుర్తించి బుద్ధి మరలించుకొను ఆత్మశక్తియు గోచరించును బుచ్చమ్మ ముగ్ధలలోముగ్ధ గిరీశంగారు గొప్పవాడనుకుంధి ఆయన చెప్పిన మాటలు నిజమనుకుంది పునర్వివాహము దోషము కాదని నమ్మినది అందుకు లోబడ్డది మీనాక్షి బాల వితంతువే కాని మధురవాణివలె వేశ్యాంగనకాదు బుచ్చమ్మవలె సద్గతి విచారించునదియుకాదు తన యింటనే యుండి రహస్యముగా పడుచు పొగరును ద్రెంచుకొనజూచు దుశ్శీల ఈమూడు రకాల స్త్రీ స్వభావాలను యీనాటకంలో కూర్చినాడు

పట్నాల్లోను పల్లెల్లోను వుండే విపరీత స్త్రీ పురుష స్వభావాలను, రెండుమూడు కథా వ్యూహములను వొక్క కుదురున జేర్చి దేనికది చక్కగా విప్పారి నిజప్రవృత్తినగుపరచి రసపుష్టితో రాజిల్లునట్లుగ నతికించగలశక్తి అప్పారావుకే చెల్లినది మరియొక రైతే కథాంతానికి యేదో భక్తిజ్ఞాన వైరాగ్యమేర్పరచి నీతి బోధకుగఢంగియందురు గిరీశంచేత డామిట్ ఆనిపించుటలోనేయప్పరాయనియసాధారణప్రతిభా సామ్రాజ్యమగుపడుచున్నది తివాచులలో రేఖాసంస్ఫూర్తిగలచిత్ర్య విన్యాసముల కన్న యంచులోనుండి సగము ముప్పాతిక రూపములతో నగుపడుచు మరల నటులనే యావలికొనయందు నిష్క్రమించు పూలపొట్టెములు యెక్కువ యందిగించునట్లుగా కన్యాశుల్కంలో చూపబడ్డ గిరీశచరిత్ర అదివరకు లెక్కకు మించి జరిగిన సాహసాలలో యిది యొకటి యనియు దీని భంగపాటుతో చిత్తవైకల్యమొందక రణవీరుని పగిది మర్రి యొక పోరుతో తొల్లి చేజారిన విజయఫలమును పొందెదనను అహంకారమును సూచించుటయే మిక్కిలి నేర్పుగా తోచు చున్నది సుగుణములు దుర్గుణములు సత్ప్రయత్నములు దురాచారములు అనంతపారంపర్యలో వచ్చుచుండును కాని చప్పున మొలకెత్తి చివాలున వాడిపోవు పుర్రెకు పుట్టినబుద్ధి పుడకలతోగాని అంతరించదు

తెనాలి రామవిలాససభవారు బందరులో యీ నాటకాన్ని ముచ్చటమీర నాడిచూపారు ప్రదర్శనంలో కన్యాశుల్కపు యసామాన్య ప్రదర్శనౌచిత్యము బయట పడినది ఇందులో నామద్దింపుమీద రామప్పపంతులై అభినయించిన తంగిరాల ఆంజనేయులుగారికి ఫస్టుమార్కులు చేరుచున్నవి తరువాత స్థానం నరసింహారావుగారి మధురవాణిన్ని కరకటశాస్త్రుర్లయిన పులిపాక వెంకటేశ్వర్లుగా రున్నూ మన్నింపదగిరి బుచ్చమ్మ మీనాక్షి వేసిన జక్కుల కుర్రవాడు అగ్నిహోత్రావధానులు వెంకటేశము కూడ మొదటి తరగతిలో ప్యాసు అయినవారే డాక్టరు గోవిందరాజుల సుబ్బారావుగారి నటన విషయమై చెప్పవలసిన ముచ్చటకాదు గిరీశపు వ్యవహారాలన్నిటిని మిక్కిలి చక్కగా నిర్వర్తించారు కాని వేషంలో బిడ్డల తండ్రివలె గృహస్తోద్యోగివలె కనుపించెను గాని గిరీశము యొక్క యిర్రెస్పాన్సిబిలిటీ పలుగాకితనము షోకుడంబములు చూపించే యిరువది రెండు యిరువది మూడేండ్ల ప్రాయాన్ని సుబ్బారావుగారు చూపలేకపోయిరి అనగా వేష సౌష్టవము పాత్రౌచిత్యము కొరవడినవి

సుబ్బారావుగారి వొద్దికలు కొన్ని శారదలో కన్నులు గట్టినవి మొదటిరాకడ - బెత్తం ఆడించుకొంటూ చుట్టపొగ దులుపుకుంటూ యిక యీవూరులోవుంటే ఆపోరుదక్కేటట్టులేదు అని ఆలోచిస్తూ జేరవచ్చినయునికి అప్పుడే ఓడదిగివచ్చిన హాఫ్ యింగ్లీషుమైర్ వెళ్ళబోస్తూ వుండింది తరువాత యేమోయ్ మైడియర్ షేక్సి్పియర్ మొహం వేళ్లాడేసావ్ అని పితృవాత్సల్యసూచకమగు నౌదార్యముతో వెంకటేశమును పలుకరించుపట్టుకూడ విచిత్ర స్వాభావిక రామణీయక మొదవియుండెను ఆ వెనుక నొంటరిగా బుచ్చమ్మను తలచి నీదు మోముబ్రైటటా మూనులైటు లైటుటా టాటాటా అని మున్నగు మోహావేశప్రబోధితాశుకవితావ్యాపారమందు వలపుల నారబోయి పట్టులతి విచిత్రముగనుండెను పొలిటెక్సు దెబ్బల వుపదేశించాలిసినపుడెల్ల గిరీశముయొక్క సర్వజ్ఞత్వాన్ని వెంకటేశానికి నిజమైన యెద్యుకేషను ప్రసాదించవలెననెడి వ్యాజాభిలాషను అభినయవ్యాఖ్యానంలో గిరీశం సంప్రదాయాలు లెస్సగా బయట పడ్డవనే చెప్పవచ్చును

తంగిరాల ఆంజనేయులు బహు సమర్థుడైన నటుడు ఖుస్రూవేషంలో మహమ్మదీయ రాజకుమారుల సారాయి భంగు నిషాలను ముద్రించి నట్లగుపరచెను రామప్పపంతులు భూమికలో దరిలేని పంతులు తరహాలనన్నిటిని వెళ్ళబోసెను రామప్పపంతులు గుణాలు యెట్లాంటివో పైన విన్నవించుకొన్నాను ఆంజనేయులు యీ వేషాని కొసంగిన నాట్య విలాసము చూస్తేనే మాచదువరులు తెలుసుకోగలరు కాని మాటలయల్లికతో విప్పి చూపలేము ఇక కరకటశాస్త్రి నత్తివాగుడుతో, దయ్యాల పోతువలె మంత్రోపాసివలె నరుదెంచి పులిపాక వెంకటేశ్వర్లు చూపిన తెలివికి మేరయేలేదు తమ శిష్యుడికి పడుచుపిల్లల వేష మతికించి రామప్పపంతులుసహాయాన లుబ్ధావధానులకు అంటకట్టదెచ్చి బేరములాడు తరుణములో మధురవాణి నిజవృత్తాంత మెరింగి కన్నియ మగతనము గుర్తించి యచ్చెరు వంది జూడ నొక్కచూపులో వెంకటేశ్వర్లు ఆమెను వారించి సద్దుపరచి యామెతో పాలు కుదుర్చుకొని పైగానామెతో పూవిల్తు సయ్యాటలకు వలయు సంధానమమర్చుకొనెను ఈ చూపుకు వేయి వరాలిచ్చినా ఋణము తీరదు వెంకటేశ్వరుల మొగము స్ఫోటకవిలుంఠనముతో కొంత గొగ్గరు వోయినను స్త్రీ పురుషప్రధానపాత్రల ధరించిన యోగ్యుడు చక్కనిమొగము విశాలమయిన నేత్రములు గొంతువారని కంఠమాధుర్యము నాటకవిషయాల్లో ఆరితేరిన ప్రతిభ ఇన్ని చాకచక్యాలు కలిగియు సుందరాంగుడై విలసిల్లియు చకుముకీ కరకటశాస్త్రి మొదలయిన హాస్య ప్రసంగాలలో కడుంగడు నేర్పువహించి యాడగల్గుచున్నాడు స్థానం నరసింహారావు కులట వనితా వేషధారణమున నత్యంతమనోహరముగ నొప్పారు మెలకువతో ప్రవర్తించెను రామవిలాస సభవారి మేళము సర్వవిధములా కూర్పువడి మిక్కిలితెలివితో ఆలోచనతో శక్తితో నేర్పుతో మంచినాటకా లభినయింపగలిగిరని విన్నవించు

నాట్యకళా వైదుష్య సంకీర్తనోత్సాహుడు
భగవత్పాద సేవకుడు
పురాణం సూరిశాస్త్రి

# రెండవకూర్పు పీఠిక

కన్యాశుల్కం నాటకాన్ని కొద్ది మార్పులతో పునర్ముంద్రించాలని మొదట అనుకున్నాను; కాని నా మిత్రులు శ్రీ యస్, శ్రీనివాసఅయ్యంగారిసూచనవల్ల దాన్ని పూర్తిగా మార్చి తిరిగి పోతపోశాను. మరి ఆయన కావించే సాహిత్య నిర్ధారణలపట్ల నా కమిత గౌరవం. ఈ విధంగా రూపుదిద్దడంతో దీని పరిమాణం తగినంత పెరిగింది. ప్రస్తుత రూపంలో వున్న ఈ నాటకం యించుమించు సరికొత్తది.

కన్యాశుల్కం తొలికూర్పుకు చెప్పుకొతగ్గ విజయం లభించింది. పత్రికలు మనఃపూర్వకంగా స్వీకరించాయి; తెలుగు సాహిత్య చరిత్రలో దీనినొక సంఘటనగా పేర్కొని ప్రశంసించాయి. స్త్రీలు, పురుషులు, పిల్లలు నాటకాన్ని ఉత్సుకతతో పఠించారు. అయితే దీనిని ఆమోదించనివారు వొక్కరే వొక్కరు; వారు సాంఘిక సంస్కరణ, వ్యావహారిక భాషా తప్పితే, మిగిలిన ప్రపంచమంతా బహుచక్కగా నవ్యంగా వుందనుకొనే మహామహోపాధ్యాయ కొక్కొండవేంకటరత్నంపంతులుగారు. ఈ రెండింటినీ ఆయన సహింప నొల్లరు. మొదటికూర్పు నాటకం అచ్చయిన కొన్ని వారాలలోనే ప్రతులన్నీ అయిపోయాయి. నాటినుంచి ప్రతులు కావాలనే కోరిక నిరంతరం అధికమౌతూవచ్చింది. నాటకాన్ని రెండవసారి అచ్చువేయించే బెడదను ఇవాళకాదు రేపు అని చాలాకాలం తప్పించుకుంటూ వచ్చాను. కానైతే నా మిత్రుల పట్టుదలవల్ల ఇప్పుడు మళ్ళీ అచ్చువేయక తప్పిందికాదు.

తెలుగుదేశంలో గ్రంథకర్త అనేవాడు సాధారణంగా తన పుస్తకానికి తానే ప్రచురణకర్త; విక్రేత. పుస్తకాలను అమ్మిపెట్టే ఆదరవు దేశంలోమృగ్యం. పుస్తకవ్యాపారం నిరుత్సాహకరం. పాఠకులు స్వల్పం. దేశంలో ఈపాటి పుస్తకపఠనమైనా సాగుతున్నదంటే దానికి కారణం కేవలం బోర్డాఫ్‌స్టడీస్ పడుతున్న మహాశ్రమ. పరమపూజ్యమయిన ఈసంస్థ తలఎత్తడంతోనే క్రైస్తవ ధర్మసూత్రాలు "నువ్వు చదవాలి" అనే తమ పదకొండవ సుభాషితాన్ని బోధించడం మానుకున్నాయి, కాని "నువ్వు చదవాలి" అనే ఆ సూక్తిని వొక విధిగా శాసించే హక్కు ఈ సంస్థకు సంక్రమించింది. దానితో మానవమాత్రుడెవడూ చదివి ఆనందించలేని కొరగాని పాఠ్యగ్రంథాలను వేలాది యువకులు విధిగా చదువుకుంటున్నారు. పాపం, దురదృష్టవంతులు!

మొదట నేనీ నాటకాన్ని ప్రచురించాలని వ్రాయలేదు. సాంఘికసంస్కరణోద్యమాన్ని పురోగమింపచేయడానికి నాటకరంగానికి తెలుగుభాష నప్పదనే సామాన్య దురభిప్రాయాన్ని పోగొట్టడానికి దీన్ని నేను వ్రాశాను. ఆ మధ్య మహారాష్ట్ర సంచారక నాటకసమాజాలు తెలుగు జిల్లాలలో హిందీ నాటకాలను ప్రదర్శించాయి. డబ్బుచేసుకున్నాయి. స్థానికసమాజాలు వాటిని మక్కికి మక్కీ అనుకరించాయి; ప్రేక్షకులుతమకర్థంకానిదాన్ని వింటూపరమానందభరితులయారు. అజ్ఞానంవలన కలిగే మహదానందం అటువంటిది. కృత్రిమ యుద్ధాలుసాముగరడీలు దుష్టసంగీతం కామప్రేరేపక నృత్యాలు ఆడంబరవేషధారణాది అసహ్యరంగాకర్షణలకు కన్యాశుల్కంలో ఆస్కారంలేదు; అయినా అది అపార ప్రేక్షకసమూహాలను ఆకట్టుకొంది. వ్యావహారిక భాషకువున్న అర్హతను హక్కులను రుజువు పరిచింది.

తెలుగుదేశంలో హిందీనాటక ప్రదర్శనలు పతనమౌతున్నందుకు నాకు సంతోషంగా వుంది. అలా అని తెలుగు నాటకరంగస్థితిని చూసి మనం సంతృప్తి పడలేం. నామార్హమైన నాటకమందిరాలేవీ మనకు లేవు. నటనను కళగా సాధనచేసే వృత్తినటులు శూన్యం. పోనీ మంచినాటకాలయినా మనకు అట్టే కనిపించవు. కేవలం వినోదసాఫల్యంకోసం తప్ప అతిసంకీర్ణసాంఘికపరిస్థితులతో సంఘటితమైవున్న ఆధునిక జీవితాన్ని నాటకరచయితలెవరూ స్పృశించక కేవలం నిర్లక్ష్యంచేస్తున్నారు. శృంగారఘట్టాలనే విసుగుపుట్టే పర్యంతం మనరచయితలు అల్లుకుపోతున్నారు. రచయితల స్వతంత్ర కల్పనాశక్తి విహీనతకు భావదారిద్ర్యానికి ఇంతకంటే వేరే నిదర్శనం అక్కరలేదు. అంతో యింతో రచనాశిల్ప పరిజ్ఞానాన్ని ప్రదర్శించగల రచయితలు కొద్దిమంది. విశ్వవిద్యాలయవిద్య, పాశ్చాత్యసంస్కృతి, ప్రాబల్యంవహించిన ఏభైయేళ్ళకు కూడా సాహిత్యరచనా నైపుణ్యం ఇంత అధమస్థాయికి దిగజారిపోయిందీ అంటే, నిజంగా ఆశ్చర్యం కాదా! ఇందుకు హేతువు మన కళాశాలల్లో సాగుతున్న లోపభూయిష్ట ఆంగ్ల సాహిత్య బోధనా పద్ధతులేనని చెప్పవలసి వుంటుంది. వాడుక భాషలను వికసింపచేయడమే తమ ప్రధాన బాధ్యతగా, ఆంగ్ల అధ్యాపకులు, విద్యాధికారులు భావించి దోహదపడేవరకూ, ఇంతకంటె ఉత్తమస్థాయి ఉన్నతప్రమాణాలు ఏర్పడతాయని మనం ఆశించలేం.

ఒకే మూసలో పోతపోసే పునరావృత సాహిత్యప్రక్రియవల్ల వృత్త్యనుఛేకానుప్రాసాదిబిగింపుల పద్యరచనా పద్ధతులవల్ల నిరంకుశకృతక గ్రాంధిక భాషానిర్దాక్షిణ్యంవల్ల తెలుగు ప్రజ్ఞావికాసానికి తీవ్ర అవరోధం కలుగుతోంది. ఈ సందర్భంలో గ్రాంధిక భాషను గురించి నాదొకమాట. తొలికూర్పు కన్యాశుల్కం నాటకానికి నేను పీఠిక వ్రాసినప్పటినుంచి, వ్యావహారిక భాష వీలును స్థానాన్ని బలాన్ని సంపాదించుకోజొచ్చింది. ఈమధ్యనే కొన్ని ఆశయాలతో లక్ష్యాలతో నామిత్రులు ప్రిన్సిపాల్, పి.టి. శ్రీనివాసఅయ్యంగారు 'తెలుగు భాషాసంస్కరణ బోధక సంఘాన్ని' స్థాపించారు. తెలుగు వ్యావహారిక భాషను పెంపొందించడం ఈ సంఘ ప్రధాన ఆశయం. తెలుగు వారు సదా తనపేరును జ్ఞాపకం పెట్టుకొనేటట్లుగా మన పాఠశాలల్లో శాస్త్రీయ బోధనా పద్ధతులను ప్రవేశపెట్టిన మిస్టర్‌ఏట్సు, దీనికి అధ్యక్షులు. అందుకాయన అంగీకరించడంతో ఈ ఉద్యమానికొక విశిష్టత చేకూరింది.

వివిధ భావవ్యక్తీకరణకు కావలసినంత మేర వున్న భాష వ్యావహారికం. దీని సౌకుమార్యానికి లాలిత్యానికి విదేశీయులు సైతం ముగ్ధ లయారు. ఇంత ఇమ్ముగల వాడుక భాష గుణ సౌందర్యాన్ని ఆధునికరచయితలు ఎలా గమనించలేకపోతున్నారో, నాకర్థం కాకుండా వుంది. తెలుగు భాషలో మధురమైన వచనం వాడుక భాషలో వుంది. వింతగా కనుపించవచ్చునేమో కాని, తెలుగు వచన ప్రారంభ వికాసాలకు కారణం రాజుల పోషణా కాదు; పాశ్చాత్య సాహిత్య ప్రభావమూ కాదు. ఇందుకు హేతువు ఉత్సాహి అయిన వొకానొక ఆంగ్లేయుని శ్రమ; మన వాడుక

భాషలో వున్న స్థానికచరిత్రల సేకరణను ఆయన ప్రోత్సహించాడు. మెకెంజీ సేకరణలు కొన్ని నిస్సందేహంగా సాటిలేనివి. మరికొన్ని స్పష్టతలో ధారాశుద్ధిలో తూగుల నడకలో ఉత్తమ గ్రాంధికరచనలను తలదన్నగల రచనలు; అంతేకాక నాటికాలపు పోకడలను ప్రజా మేధన్ను ప్రతిబింబించే యిట్టివి, తెలుగు సాహిత్యంలో అరుదు. విశుద్ధ వివిధరీతుల వాడుకభాషలో భారతీయజీవితాన్ని వ్యాఖ్యానిస్తూ రాయ్ బహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు కొన్ని ప్రహసనాలను రచించారు; ప్రయోగార్హమైన కొన్ని ఆంగ్లనాటకాలను తెలుగుభాషలోనికి అనువర్తింపచేశారు. తలవని తలంపుగా కుశాగ్రబుద్ధితో వీటిని వొక సంపుటిగా వెలువరించి తెలుగు భాషకు మహోపకృతి కావించారు. ఈ ప్రథమ సంపుటిలో వారు, తమ ఉత్తమోత్తమ రచనను సంతరించారు. అందువల్ల యీ ఎన్నిక వారి ఉత్కృష్ట సమయోచిత జ్ఞానాన్ని యినుమడింప చేస్తున్నది; దేశం దద్దరిల్లి పోయేటట్లు తుపాను రేకెత్తించినదల్లా నిజానికి వారి రచనలల్లో ఇది ఒక్కటే. సంస్కృత నాటక లక్షణానుసారం, తెలుగు నాటకంలో మొట్టమొదట గ్రామ్యభాషను ప్రయోగించిన గౌరవం, నామిత్రులు వేదం వెంకటరాయ శాస్త్రిగారికి తక్కింది; ఆయన ప్రతాపరుద్రీయం నాటకంలోని పాత్రోచిత మాండలిక సంభాషణలు మిక్కిలి మధురమైనవి. అయితే కొండంత ఆశతో వాడుక భాషలో రచితమయిన ప్రప్రథమ నాటకం నాదేనని నా నమ్మకం; అది ఎంతమాత్రం విఫలం కాలేదు; కాని వొకమాట: ఒక భాషా సామర్థ్యాన్ని పరీక్షించి నిర్ణయించేవి ఆయారచయితల సాఫల్య వైఫల్యాలు కానేకావు.

ఈ విధంగా ఒకవంక వాడుకభాష ప్రాముఖ్యాన్ని గడిస్తూంటే, ఇంకొకవంక గ్రాంధికం. ఆధునికసులభవచనరూపంలో వ్యావహారికానికి దగ్గర పడుతోంది. వ్యావహారిక సన్నిహిత గ్రాంధికభాషను రచయితలు ధారాళంగా వాడుకొంటున్నారు. ఇప్పుడు దీని ప్రాచుర్యం అధికం. తెలుగు సారస్వత ప్రపంచంలో నేడు అగ్రగణ్యులైన రాయ్ బహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు పరుషసరళాది హల్లులవల్ల ద్రుత ప్రకృతికాలకు కలిగే సంధికార్యాలను కొన్నిచోట్ల పాటించక మార్గదర్శకులయారు. ప్రామాణిక ప్రయోగాల ప్రకారం వ్యాకరణ సూత్రాల ప్రకారం పరామర్శించినట్లయితే ఏ ఆధునికరచయితా, ఆక్షేపణకు గురికాకుండా తప్పించుకోలేదు. వ్యాకరణ విహిత సంధిసూత్రాలను సర్వత్ర పాటించాలనే నియమాలను, పండితులు స్కూళ్ళల్లో సడలించారు. సంప్రదాయ సిద్ధమైన బంధనాలను తెంచుకోవాలనే నైతికధోరణి ఈనాడు కన్పిస్తున్నమాట స్పష్టం. భావప్రకటనకు ప్రాచీన గ్రాంధిక భాష తగిన సాధనం కాదనే గ్రహింపు పదిమందికీ కలిగింది; నూత్నకావ్య భాషను ఏర్పరచుకోవాలనే అప్రయత్న పూర్వక కృషి కొనసాగుతోంది. ఇక నా విచారమల్లా, ఈ ఉద్యమం, యుక్తి యుక్తంకాని మందగతిని సాగుతోందని!

తెలుగుగ్రాంధికం మహాదుర్బలమైన వొక భాషా ప్రక్రియ. సంప్రదాయం దీన్ని వ్యర్థంగా తెలుగువాళ్ళమీద విధించిందని నామతం. సంకెళ్ళను ప్రేమించేవాళ్లు ఆ గ్రాంధిక భాషను ఆరాధిస్తారుగాక! నాకుమాత్రం నా మాతృభాష, జీవద్భాష. ఇది "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్టు." ఈ జీవద్భాషలో మన సుఖాల్నీ దుఃఖాల్ని వెల్లడించుకోడానికి మనం ఎవరమూ సిగ్గుపడడంలేదు కాని, దీన్ని వ్రాయడానికి మాత్రం మనలో కింతమంది బిడియపడుతున్నారు. వ్యావహారిక భాషలోవున్న సాహిత్యం రైతును మేల్కొల్పుతుంది. భారతదేశంలోవున్న అంగ్లేయుడి గుండెను కదుపుతుంది. దాని శక్తి అపారం; అవకాశాలు అనంతం.

ఆంగ్లమాండలికాల ప్రాకృతభాషల చరిత్ర తెలిసిన వాళ్ళకివాడుక భాషలోవున్న సాహిత్యప్రాశస్త్యాన్ని ఆవశ్యకతను ప్రత్యేకించి చెప్పవలసిన అవసరంలేదు. ఇంతకీ నూత్న కావ్యభాషను రూపొందించేవి వాద ప్రతివాదాలు కావని నాకు తెలుసును. నూత్న కావ్యభాషను ఒక మహారచయిత వ్రాయాలి; తయారు చేయాలి; అందుకు మనం అతనికి అనుకూల పరిస్థితిల్ని వాతావరణాన్ని కలిగిద్దాం.

ఈ మధ్య మద్రాసు హైకోర్టు తీర్పువల్ల సాంఘిక సంస్కరణోద్యమానికి గొప్పబలం వచ్చింది ప్రధానన్యాయమూర్తిసర్ ఆర్నాల్డు వైటు, న్యాయమూర్తులు మిల్లర్ మన్రోలు ఈ విధంగా తీర్పు యిచ్చారు ఒక పిల్లను వివాహంచేసుకుందుకు తండ్రికి డబ్బు చెల్లించే వొప్పదం నీతి బాహ్యం ఇండియన్ కాంట్రాక్టు ఆక్టు 23వ సెక్షన్ ప్రకారం చట్ట విరుద్ధం

ఈ పుస్తకాన్ని అచ్చువేయించేటపుడు నన్నొక జటిల ప్రశ్న ఎదుర్కొంది వాడుకభాషలోవున్న ఎన్నో శబ్దోచ్చారణలు తెలుగు అక్షరమాలలో కనిపించవు అలాంటి ఉచ్చారణ ధ్వనుల్ని సూచించడానికి సమీపఅక్షరాలమీద వొక నిలువుగీత పెట్టాను ఈనాటి తెలుగు శబ్దశాస్త్రపుస్థితిని బట్టి నేను ఈ గుర్తులతోనే తృప్తిపడవలసి వచ్చింది అనునాసిక వ ను సూచించడానికి 'వ తరువాత అర్థానుస్వారాన్ని వాడాను కొత్తసంజ్ఞలను కనిపెట్టి లిపిలో కల్పించుకోవడం వాడుక భాషలో గ్రంధరచన విస్తారంగా వ్యాప్తి చెందినపుడే సాధ్యపడుతుంది

నేను సూచించిన లేఖనచిహ్నాల్ని సంతోషంతో పాటించి నాకు సంతృప్తి కలిగేటట్లు పుస్తకాన్ని చక్కగా ముద్రించిన మెస్సర్సు. జి రామస్వామిచెట్టి అండ్ కంపెనీ వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు

– గురజాడ వేంకట అప్పారావు.

# సాహిత్య లేఖలు : నాటక గోష్ఠి

ఫోర్టు విజయనగరం
11 మార్చి 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం

నువ్వు పరీక్ష ప్యాసయావని నేనెంతో ఆనందించాను. మదరాసులో వుండగా నీకు జబ్బుచేసిందా నాఆందోళన అంతా యింతాకాదు. పరీక్షల నాటికి నిమ్మళిస్తుందో నిమ్మళించదో నని భయపడిపోయాను. మరి పరీక్షలంటే లేనిపోని బెడద. చికాకు. ప్రాణాంతకం. ఇవి ఎంత బాధాకరమైనవంటే పరీక్షలు ప్యాసయామని చెవిని పడీపడగానే తమ నెత్తి కెత్తిన బరువు దింపుకున్నట్లు యువకులు 'ఫీ'లవుతారు. వాళ్ళ ప్రాణాలు తెరిపిన పడతాయి. పరీక్షలంటే నాకు పరమఅసహ్యం.

నామీద గౌరవంకొద్దీ నువ్విలాగ నీ ఉత్తరంలో వ్రాశావు. నీ అభిమానానికి నా ధన్యవాదాలు. నాతో కలిసి మెలసి మసలడంవల్ల నా సాంగత్యఫలితంగా నీకు సారస్వతాభిరుచీ అభినివేశమూ ఉత్సాహమూ కలిగాయని నువ్వు చెబుతున్నావు. సరే సంతోషం. అయితే వొక్కమాట. నీతోపరిచయం కలగడంవలన రానున్నతరంలో యువకులు మాకన్న ఎక్కువ సాహిత్యకృషి చేయగలరన్న విశ్వాసం నాకు కుదిరించి. యువకులపట్ల ఆప్యాయమూ అభిమానమూ కలిగాయి. నీ పరిచయంవల్ల మళ్ళీ నా స్వయంవ్యక్తిత్వాన్ని నేను పొందగలిగాను. నా వొంట్లో కులాసాగా వుందని ఆరోగ్యం చక్కగా వుందని దర్బారు రాజకీయాలను దూర దూరంగా వుంచగలుగుతున్నానని తెలిస్తే నువ్వు ఆనందిస్తావుకదూ!

కన్యాశుల్కం నాటకాన్ని చాలామటుకు మార్చివేశాను. మూడు అంకాలు ప్రెస్సుకు వెళ్ళినతరవాత నాటకంలోని వొకపాత్రపట్ల నాకుగల దృక్పథాన్ని మార్చుకోవలసి వచ్చింది. నువ్వు మళ్ళీ మదరాసు వెళ్ళినపుడు శ్రీ జి. రామస్వామిచెట్టిని కలుసుకుని నా నాటకం త్వరగా అచ్చు అయేటట్టు చూడమని చెప్పు. ఇప్పటికే అనుకోనంత ఆలస్యమయింది. మా మేనల్లుడు శ్రీ పోతరాజు నరసిహంలేదూ, కాస్త శ్రద్ధతీసుకోమని అతనికి ఉత్తరం వ్రాశాను. కాని అతను జవాబు వ్రాయలేదు.

తెలుగువ్యాకరణం వ్రాయడానికి ఉపక్రమించాను. నెల్లూరుజిల్లా వ్యావహారిక భాషావ్యాకరణం నాకు అవసరం. నెల్లూరుజిల్లా వాడుకభాషాపదాలు, ముఖ్యంగా క్రియలు, క్రియాభేదాలు విశేష్యములలోని రూపభేదాలు తెలిపే వొక పట్టికను తయారుచేసి నాకు పంపించగలవూ?

మహాభారతంలోని వ్యాకరణవిరుద్ధప్రయోగాలనుగురించి తిక్కనసోమయాజిని గురించి అచ్చయిన * 'అముద్రితగ్రంథ చింతామణి' సంచిక కాపీలు, నీకు దొరికినట్లయితే వాటినిపంపు. కీ.శే పూండ్ల రామకృష్ణయ్యగారు నాకు స్నేహితులు. తిక్కన వంశీకులను గురించి, కొట్టరువుగ్రామం మొదలైనవాటిని గురించి ఆయన వ్రాశారు.

ఈసారి ఉత్తరంలో విపులంగా అన్నీ వ్రాస్తాను.

ప్రేమాభిమానాలతో.

ఎక్కహిల్ హౌస్
ఉదకమండలం
7 మే 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

నీభోగట్టాలేవీ నాకు తెలియడంలేదు. ఇన్నాళ్లూ ఎక్కడవున్నట్టు, నువ్వు ఏంచేస్తున్నట్టు? తరుచు నేను నీకు ఉత్తరాలు రాయడంలేదంటే కారణం నాకు రాయాలని లేక కాదు; బొత్తిగా వోపిక లేక.

'కన్యాశుల్కం' యిప్పటికి నూటయాభై రెండు పేజీలు అచ్చయింది, చిన్నక్షరాలలో ముద్రించినా రెండువందల పేజీలు దాటేటట్టు వుంది. బిడియమనేది అడ్డువస్తున్నమాట నిజమే అయినా కన్యాశుల్కం గొప్పరచనగా రూపొందించానని నేను అనుకుంటున్నాను. నాటకం చదివి నాకునేనే ముగ్ధుణ్ణయాను. అదే దీనికున్న గీటురాయి. మొదటి కూర్పుకంటె రెండవకూర్పు నామనోభావాలను ఆలోచనలనుసమగ్రంగా వ్యక్తం చేస్తున్నది. తొలికూర్పు అలాగకాక, పై మెరుగులనే ప్రతిబించింది.

ఇంతవరకూ అచ్చయిన ఫారాలను నీకు పంపమని నా నాటకముద్రాపకులకు రాశాను. దయవుంచి జాగర్తగా వాటిని చదువు, నీ స్నేహితులకు చదివి వినిపించు. నాటకంలో వొక దానికొకటి అతకని విషయాలు అసంగతాలు ఏవైనావున్నట్లునీకుతోస్తే, వాటిని వెంటనే నాదృష్టికి తీసుకురా. అందులో ఏయే మాండలికపదాలు నెల్లూరుజిల్లా ప్రజలకు అర్థంకావో ఆ పదాల దిగువను గీతగీసి గుర్తు పెట్టితివా, నాటకం చివర వాటి అర్థాలను వివరిస్తూ వొకపట్టిక చేరుస్తాను.

శ్రీ వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయము'వంటి కొన్ని నాటకాలలో కవితాప్రౌఢిమా కల్పనాచాతుర్యమూ లోపించకపోయినా ప్రస్తుతం తెలుగున వెలువడుతున్న నాటకాలన్నీ వొట్టి డొల్ల సరుకులు. చివరకు ప్రతాపరుద్రీయంలో సైతం పేజీలకు పేజీలు ఎన్నితిప్పినా అవి నాటకకథాగ విస్తరణకు పాత్రల పెరుగుదలకు ఉపకరించవు. అయితే యీ నాటకంలో నాకు బాగా నచ్చిన వొక లక్షణంమాత్రం వుంది. మనదేశ చరిత్రలో గుండెలను కదిలించే వృత్తాంతాన్నొకదాన్ని తీసుకొని దానిని నాటకంగా వెలయించేటపుడు యీ కవి సాహిత్యాత్మక దేశభక్తిపూరిత కల్పానిక

వాతావరణాన్ని సృష్టించుకొని దానిని నేర్పుతో జయప్రదం చేశాడు. కాని నాటకంలోని చారిత్రక చిత్రీకరణమటుకు కేవలం అభూతకల్పన; అసంభావితవిషయాలు సారస్వతకట్టుబాట్లను లై సెన్సును అతిక్రమిస్తున్నాయి. నువ్వు 'ప్రతాపరుద్రీయం' చదివే వుంటావు; కనక దానిని గురించి ప్రస్తావించాను.

శ్రీ వీరేశలింగం, చిలకమర్తి రచించిననాటకాలను నువ్వు చదివివున్నట్లయితే, వాటిమీదనో, లేక నాకు తెలిసిన తదితర నాటకాలనుగురించో కాదా నువ్వుచదివే నాటకాలను నాకొక్కొక్క ప్రతిచొప్పున పంపినట్లయితే వాటినో పరామర్శిస్తూ నీకు నాటకరచనాశిల్పం అవగతమయ్యేందుకు చిన్న చిన్న సమీక్షలు వ్రాసి పంపిస్తూవుంటాను.

పి.యస్: నాన్నగారెలా వున్నారు? ఆయనకు నా 'ప్రణామాలు'

ఎక్క హిల్ హౌస్<br>
ఉదకమండలం<br>
17 మే 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

నీ ఉత్తరం అందింది. సంతోషం. ఇంగ్లీషు భాషపై నీకు సిద్ధించిన అధికారానికి, నీ విమర్శనశక్తికి నాకు ఆశ్చర్యం వేసింది. విమర్శకు అవసరమైన అలంకారికపదస్వరూపం నీకు చక్కగా అవగతమయింది. ఈ విషయమై నీకు నేను బోధపరిచేది అట్టే వుండదనుకుంటాను. కన్యాశుల్కంమీద వొక సమీక్షవ్రాయి. అది ఏదో వొక మద్రాసు దినపత్రికలో అచ్చు అయ్యేటట్టు చూస్తాను. నాటకం వెలువడిన వెంటనే నీకుకొన్ని ప్రతులు పంపమని నా పుస్తకవిక్రేతలు మెస్సర్స్ వి. రామస్వామి శాస్త్రులు అండ్‌కో, ఎస్ప్లనేడ్‌కు వ్రాస్తాను. (ప్రొప్రయిటరు మిస్టర్ వి. వేంకటేశ్వర్లు మంచి సాహితీపరుడు; ఆయనతో నువ్వు తప్పక పరిచయం చేసుకోవాలి) కన్యాశుల్కము ప్రతులు అందగానే కొన్నిటిని స్నేహితులకు బహూకరిద్దువు గాని; మిగతావాటిని స్థానికపుస్తకవిక్రేతలద్వారా అమ్మించే ఏర్పాటుచేయగలవనుకుంటాను. 'నీలగిరిపాటలు' కన్యాశుల్కము పీఠిక నిన్ననే నీకు పంపించాను. నువ్వుకనక సమీక్షించేటట్లయితే పాటల్ని దృష్టిలో పెట్టుకో. ఏమంటావా నాకు గ్రాంథికం వ్రాయడంచేత కాక కన్యాశుల్కం నాటకాన్ని వాడుక భాషలో వ్రాశానని శ్రీ కొక్కొండవేంకటర్నంపంతులు కోవకుచెందిన పండితులు అంటే అనవచ్చును.

తెలుగు వ్యాకరణం వ్రాతామనుకున్నానా ఆరంభించిన పని అలాగునే నిద్రపోతూ వుంది. నేనుచేయవలసినపని ఎంతైనా వుంది. ఆరోగ్యంమటుకు బాగుండడంలేదు. నువ్వు నాకు చేదోడువాదోడుగా వుండాలని నా కోరిక. జీవితంలో యేవృత్తి స్వీకరించడమనే కదా నీప్రశ్న? నీకు సాహిత్యకృషే, తగినదని నాసలహా. నే ననుకుంటున్న సారస్వతకృషి ఏమౌతుందో చూడనీయి; అదే కనక ఫలించి వ్యాపారంగా రూపొంది పంటముఖానికి వస్తే నువ్వూ నాతోపాటు వుందువుగాని; నాసహచరునిగానిన్ను నేను తీసుకుంటాను. అందాకా అక్కడనే అంటిపెట్టుకునివుండు. నా మిత్రులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు 'రిప్పన్సు హిందూ హైస్కూలు'ను తమ మేనేజిమెంటులోనికి తీసుకోవాలని తలపోస్తున్నారు. ఆయనే కనక అది తీసుకుంటే నీకందులో స్థానం లభించగలదని వాగ్దానం చేస్తున్నాను. రిప్పన్సు హైస్కూలును ఆధునికపద్ధతులలో నిర్వహించి దానిఫలితం ఏమిటో చూడాలని రామమూర్తి పంతులు ఆశయం. అందువల్ల నీకు ఆ స్కూలులో పనిచేయడం చాలా ఆహ్లాదకరంగా వుంటుంది. విజయనగరంలో నువ్వుంటే మనంచేయలేని పనంటూ యేదీ వుండదని నానమ్మకం. స్కూళ్ళయినస్పెక్టరూ సిండికేటు మెంబర్ల లోని మనదేశస్థులూ మనకు సహాయపడతారు. మనమంతట మనమే సహాయం చేసుకోగలమని నా అభిప్రాయం.

పి.యస్ : చిలికమర్తి 'పారిజాతాపహరణం' వొక కాపీ పంపించు.

* * *

ఎక్క హిల్ హౌస్
ఉదకమండలం
21 మే 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

'పదములపట్టిక'ను పంపినందుకు నీకనేక ధన్యవాదాలు. మీనాన్నగారు అమ్మగారు క్షేమంగా వున్నారని తెలుసుకొని చాలా ఆనందించాను. మీనాన్న గారికి నాప్రణామాలను తెలియచేయవలసిందిగా కోరుతున్నాను.

నా నాటకం నీకు నచ్చినందుకు సంతోషం. నీ అభిప్రాయానికి నేను విలువయిస్తాను. నువ్వుపంపిన 'ఫారాలను' చదివాను . మళ్లీ మళ్లీ చదవాలని మనసు పుట్టింది. చదవతగ్గ కావ్యానికి అదే నిజమైన పరీక్ష. విస్మయకారణాలయిన లక్షణాలను చూసి యే రచయితా ముగ్ధుడుకాడు. రచయితకొక పుస్తకం నిజంగా బాగుందీ అంటే అది అక్షరాలా సొగసుగా వుందని, దానర్థం. 'కన్యాశుల్కం' నాటకంలో నిజమే మీనాక్షి కనిపించే దృశ్యాలు అంత నీతిదాయకమైనవీ ఉపదేశకమైనవీ కావు. అయితే వొకమాట మాటవరసకి షేక్స్పియరు నాటకాలలోంచి నీకు కొన్ని దృష్టాంతాలను చూపిస్తాను. నాలుగవహెన్రీ అయిదవహెన్రీ మెర్రీవైవ్స్ అనే నాటకాలలో తటస్థపడే డాల్‌షీర్‌షీట్ మైన్‌హోస్టెస్ దేమ్‌క్విక్లీ మొదలైన పాత్రలు సర్‌జాన్‌ఫాల్‌స్టాఫ్‌తో వొక కూటమిగా యేర్పడి యెంతో ఆసక్తిని కలిగిస్తాయి. ఈ పాత్రలలో యేదీ ఉజ్జ్వల నైతికశక్తికలది కాదు. వీరిలో ఎవరికీ మర్యాదా మప్పితమూ వున్నట్లు కనిపించదు. కాని అవినీతిపరుడూ కుటిలుడూ అయిన ఫాల్‌స్టాఫ్, షేక్స్పియర్ పద్ధతిహాస్యానికి శిఖరాగ్రంవలె ప్రాతినిధ్యం వహిస్తున్నాడు. నాకు సమంగా జ్ఞాపక మున్నట్లయితే ఆట్వే అనే నాటకకర్త అనుకుంటాను, 'వెన్నిస్ ప్రిజర్వుడ" నే తన నాటకంలో విసిగెత్తించే వొక రంగాన్ని సృష్టించాడు. అందులో వొకానొక ఉన్నత ప్రభుత్వోద్యోగి అతినీచమైన వొక వుంపుడుక త్తెముందు పరువు పోగొట్టుకుని తననుతానే క్షూణత పరుచుకుంటాడు.

వాస్తవికరచన అనే దానిని కళానైపుణ్యంతో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికీ, విధిగా అది కొన్ని లక్షణాలను ప్రస్ఫుటీకరింపక తప్పదు. వాస్తవికరచనాపద్ధతికి నైతికభావాలను గురించిన ఆక్షేపణ కొంతవరకు వ్యక్తుల స్వభావాలనుబట్టి ఏర్పడుతుంది.

మీ పినతండ్రి కుమారుడు శ్రీ పట్టాభి రామమూర్తి సాంగత్య ఫలితంగా నీకు అవినీతి అంటే పరమ అసహ్యం. సానిపిల్ల నిన్ను షాక్ చేస్తుంది. నీతిపై నీకుగల సున్నితమైన అభిప్రాయానికి నిన్ను నేను అభినందిస్తున్నాను. అందువల్ల యీ సమస్యను సాకల్యంగా నీతో నేను చర్చించదలచుకో లేదు. నువ్వు నీ వయస్సుకు మించిన జ్ఞానవంతుడివి.

కవితాన్యాయం నిన్న మొన్నటిలాగ నేడు లేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను. చిత్రిస్తూ కళా నైపుణ్యంతో ఆదర్శపూరితం చేస్తానే అనుకో. కవితాకళకు నేను వొదిగి వుండవలసిన వాడినే అయినా మానవ సమాజంపట్ల నాకొక మహత్తరమైనబాధ్యత ఉంది. కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. నేను వొకదోషాన్ని దుర్నడతను ఆకర్షవంతం చేశానా? చేయలేదనే భావిస్తున్నాను. కన్యాశుల్కం మొదటి కూర్పులో మధురవాణి వర్ణింపరాని హేయమైన

నడవడిక గలది; ఆ పాత్రకు ఎట్టి వన్నె చిన్నెలూ లేవు. నాటకం రచిస్తున్న కొద్దీ మధురవాణి పాత్రమీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చింది. అందువల్ల, పరస్పర విరుద్ధ లక్షణాలు వాటంతటవి వచ్చి పడినవేమే నాకు తెలియదు.

అయితే మానవ స్వభావంలోనే పరస్పరవైరుధ్యం వున్నది కనుక దీనిని గణుతింప నక్కరలేదు. మధురవాణిపాత్ర అంటే నాకు నేనే ముచ్చట పడుతున్నాను. కనుక ఆమెను చివరి అంకంలో సంస్కరించాను. ఇంక నీతో నాకువివాదగ్రస్త విషయమేమీ లేదు.

కన్యాశుల్కం నాటకం పిలవని పేరంటానికి 'మాఅప్పపట్టుచీరె కట్టుకొస్తాన'ని బయలుదేరి యేదో వొక నైతికోద్దేశాన్ని ప్రత్యక్షంగా బలవంతంగా నెత్తిన రుద్దదు. కాని దానికి ఒక మహత్తరమైన నైతిక ప్రయోజనం వుంది.

మానవ జీవితంతో నేను చెలగాటం ఆడడం లేనేలేదు. ఈ సంగతి నా నాటకం చదివితే నీకు తెలుస్తుంది. ఎట్టిశ్రుణీ కారభావములేకుండా మానవజీవితాన్ని గంభీరమైన దానినిగా భావించి యీ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను. ఆద్యంతం నువ్వు తొణికిసలాడేటట్టు యింత గంభీర యితివృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పనికాదు.

సానిపిల్లలో వుండే మానవత్వాన్ని నువ్వు మరిచిపోకు. ఆమెసైతం వొక మానవవ్యక్తి అనే మాటను విస్మరించకు. ఆమె విచారం కన్నీళ్లూ సంతోషం ఆనందబాష్పాలూ నీ నా సుఖదుఃఖాల వంటివే? మన అనుభూతులకు వలె అవీ గుణుతింప తగినవే. గంభీరమైనవే?

అవినీతిపరురాలైన వొక భార్యా లేక వ్యభిచారి అయిన వొకభర్తా కాదా వీరిద్దరితోనూ కూడిన సమాజమూ ఏరీత్యా వొక సానిపిల్లకంటె మిన్న? వ్యభిచారమే తనవృత్తిగా 'లేబిల్' వేయబడ్డ భోగంపడుచు సమాజాన్ని మోసగించడం లేదు. ఆమెకువున్న లేబిల్ దృష్ట్యా ఆమెజీవితం సరియైనతోవనే సాగుతున్నది. ఆమె యే వివాహబంధనాలను వైవాహిక సూత్రాలనూ ఉల్లంఘించడం లేదు.

జపానులో 'గైషా' అనే వొక తరగతి వేశ్యలను ఉన్నత ప్రభువులు, రాజవంశీకులు వివాహమాడతారు కదా, మరి దీనికి నువ్వేమంటావు? గ్రీకుదేశపు ఆస్పేషియాలనుగురించి నీకు తెలిసే వుంటుంది. లాండన్నొకసారి చదివిచూడు. చరిత్రలో గ్రీకు జపానులు ప్రసిద్ధికెక్కిన దేశాలని గణుతికెక్కాయి.

ఉన్న అసలు సంగతి యిదీ: సృష్ట్యాది వివిధ పరిణామాలను తెలిపేది మానవశాస్త్రం. మానవపరిణామశాస్త్రాధ్యయనమూ శాస్త్ర విమర్శనశక్తీ ఎక్కువవుతున్న కొలదీ, ఈజ్ఞానం వొక పరమసత్యాన్ని నొక్కినొక్కి చెబుతున్నది. ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటిస్థానే కొత్తవి రావలసిన అవసరానికీ అగత్యానికీ, మానవపరిణామవాదం దారితీస్తున్నది కంటి ఎదుట స్పష్టంగా కనిపిస్తున్న వాస్తవికవిషయాలకు భయపడి వాటిని మరుగుపుచ్చి తప్పించుకు తిరగడంవల్ల ప్రయెజనం లేదు. స్త్రీ పురుషలైంగిక సంబంధాలకు అనవసర ప్రాముఖ్య మివ్వడంలో అర్థమేముంది; ఔచిత్య మేముంది?

సామాజిక పరిణామచరిత్రలో వివాహసంస్థకున్న ప్రాధాన్యాన్ని నేను తక్కువ చేస్తున్నాననుకోకు. మానవజాతి గడచిన రెండుశతాబ్దాలలోను అమోఘమైనవిజ్ఞానాన్ని పొంది పురోగమించింది. గొప్ప గొప్ప ఆలోచనాపరులు ధీశాలురు పాతకాలపు అభిప్రాయాలను, ఆదర్శాలను పరీక్ష చేయడానికుపక్రమించారు. వివాహసంస్థ పురోగతికి దోహదం

చేసినదన్న మాట నిజమే; అయితే వివాహబంధాన్ని తెంచుకోరాదనే నియమం చెప్పనలవికాని కన్నీటిగాథలకు కారణం. ఈ సత్యాన్ని మన మెవరమూ విస్మరింపలేము. ఈ కథ యింతటితో ముగియడంలేదు.

ఇంగ్లీషు వారికి వివాహం వొక సివిల్ కాంట్రాక్టువంటిది. షెల్లీ, జార్జియిలియటులు జుగుప్సతో వివాహమనేభావాన్ని త్రోసిపుచ్చి అవతలకు ఎగురకొట్టివేశారు. ఆధునిక మహిళలు మానవచరిత్రను తిరిగి రచిస్తారు.

నేడు ఉదాత్తశృంగారకల్పనలలో శృంగారకథావస్తువు అదృశ్యమౌతున్నది. దానికి ప్రాముఖ్యము తగ్గిపోతున్నది. లేదా అది ద్వితీయస్థానాన్నిమాత్రమే పొందగలుగుతున్నది. స్త్రీపురుషశారీరకవాంఛలనుగురించి కామప్రవృత్తిని గురించి కావ్యఇతివృత్తాలలో మార్పుకనిపిస్తున్నప్పటికీ సాహిత్యం కేవలం వీటితోనే ఎందుకు నిండివుండాలి? 'స్త్రీపురుష' శారీరకవాంఛలు కామప్రవృత్తి' అనే పదాలను ప్రత్యేకం గుర్తుపెట్టుకో. లైంగిక వాంఛలు శారీరకపరిస్థితులపై ఆధారపడి వున్నాయి.

చికాకులతో జీవితంలో వొడిలిపోయిన ఏభై యేళ్ళ ముసలిదానిని వొక నవయవ్వనుడు యెందుకు ప్రేమించడు? వేడివేడి భోజనపదార్థాలవలెనో వికసించిన ఎర్రగులాబీవలెనో కాలంలోవున్న ఆడది యింద్రియాలను ఆకర్షిస్తుంది. మేకుల్లా వున్న చల్లనిఅన్నం చివిఁడిముద్దయిన అన్నం వాడిపోయిన పువ్వూ; వీటిని నువ్వు ఖాతరుచేయమన్నా చేయవు. వేడివేడి అన్నం మల్లెపూవుల్లా తెల్లగా వుమ్మగిల్లిన అన్నం నీ చవులూరిస్తుంది. అదేవిధంగా వికసించిన రేకులతో పరిమళమిచ్చే గులాబీ! ఇవి చెడిపోనపుడు దుమ్ములో కలిసిపోనపుడు మంచి పసందుగావున్న తరుణంలో నువ్వు వాటిని అనుభవించకుండా అవి నిన్ను వారించడం లేదు!

'జీవితం నీటి బుడగవంటిదని సౌందర్యం అశాశ్వతమని' సిద్ధాంతాలుచెప్పే వేదాంతుల సూక్తుల మాటకేంలే! ఈ వుత్తుత్తి కబుర్లన్నీ తీసి అవతలపెట్టు. జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పే సిద్ధాంతాలు యింద్రియసుఖాలు పరిత్యజింప తగినవనే వాదానికి బలాన్నీయవు. జీవితమూ సౌందర్యమూ అశాశ్వతమైనవని చెప్పినంత మాత్రంచేత యింద్రియసుఖం విడువ తగిందికాదు. నిజమాలోచిస్తే యిలాటి వాదములవల్ల యింద్రియసుఖాలు అనుభవింపతగినవనే వాదం ధృవపడుతున్నది.

దోషమన్నది అతిలోలత్వంలో యింద్రియచాపల్యంలో యిమిడివుంది. మితిమీరిన చపలత్వం దోషంకాదా మరి? ఈ అతిలోలత్వపు ఫలితం వెంటవెంటనే కనిపిస్తుంది.

మానవజీవితంలో కాని లేదా సారస్వత కల్పనలలో కాని ఎందులోనైనా స్త్రీపురుషశారీర కానుభవాలూ ఆనందాలూ వాటివర్ణనలూ తత్తదుచితస్థానంలో వుండాలి. ఇపుడు వీటికి అనుచిత ప్రాధాన్యమిచ్చి గోరంతలు కొండంతలు చేస్తున్నారు.

రోమనుడైన 'కేటో' ఎవరికో సరిగా జ్ఞాపకంలేదు కాని, తనభార్యను ఎరువుయిచ్చాడు. చంద్రవంశపు పట్టమహిషలను పుండాకోరులైన బ్రాహ్మణులకు బాహాటంగానే తార్చినట్లు కనిపిస్తుంది. బాహాటంగా జరిగినవే యీలావుంటున్నపుడు యింక రహస్యంగా ఎన్ని దుర్మార్గాలు అవినీతికర చర్యలు దోషాలు జరిగాయో కదా? మీ యితిహాసాలను పురాణాలను వొక్కసారి చదివిచూద్దూ నీకేతెలుస్తుంది!

నువ్వు వాస్తవికవిషయాలను యదార్థాలను కప్పిపుచ్చకు. ఇంతే నేను నిన్ను కోరుతున్నది. రోగికి డాక్టరు శస్త్ర చికిత్స చేసినట్లు సమాజంలోగల రుగ్మతలను కత్తితీసుకొనికోసి దేనికది విడదీసి అన్ని భాగాలనూ పరీక్షించి చూడు.

మనం మూర్తీభవింపచేయవలసిన ప్రేమ విశ్వమానవ ప్రేమ. తోటి మానవుణ్ణి హృదయమిచ్చి ప్రేమించు. నిజమైన ఆరాధించతగిన ప్రేమయేది? తనయుగంలోవున్న అవధులలోనే పోనీ, క్రీస్తు యేది బోధించాడనుకుంటున్నామో దేన్ని కళావిలాసమని కవితాసత్యమని షెల్లీ ప్రవచించాడో ఇదీ ఉత్తమమైన రాజమార్గమని దేనిని బుద్ధుడు మనకు ఉపదేశించాడో అదే నిజమైన ఉన్నతమైన ప్రేమ! మానవజాతిపై మనకు వుండవలసిన ప్రేమ!

ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మతవిషయిక ఆత్మహత్యను చేసుకుంది.

* * *

ఎక్కహిల్ హౌస్
ఉదకమండలం
24 మే 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం పంతులు,

నీకార్డు అందింది. నాధన్యవాదాలు. నువ్వుపంపిన 'పదముల పట్టిక' చేరింది. వీటిలో కొన్నిశబ్దాలు నిఘంటువులలో నీకగుపిస్తాయి. కన్యాశుల్కం చివర పెద్దజాబితా చేరుస్తాను. శ్రీ వై. నారాయణమూర్తి నానాటకాన్ని "అత్యద్భుతమైన కళాసృష్టి" అంటున్నారు. కాని నూటఇరవై ఎనిమిదో పేజీ వచ్చేసరికి ప్రధానోత్సుకత అనే గడపముందు నిలబడ్డట్టు నీకనిపిస్తుంది.అటు తరవాత వచ్చేరంగాలు, నాటకంలో ఉత్తమమైనవని నేను భావిస్తున్నాను.

శ్రీ వేంకటరాయశాస్త్రిగారి 'ఉషా' నాటక ప్రతినొక దానిని శ్రీ వేంకటేశ్వరులు నాకు పంపించారు. పాపం, వేంకటరాయశాస్త్రిగారికి "కళ" అంటే యేమిటో బొత్తిగా తెలియదు. గ్రీకు నాటకాలలో "కోరస్" ల్లాగ ఆంగ్లంలో "ప్రొలోగ్"ల వలె కథాకథనం కోసం ఆయన తన నాటకంలో విష్కంభాలను ఆశ్రయించారు. నాటకంలోవచ్చే దేవతామూర్తులను వొట్టి పిరికి పందలుగా చిత్రించారు. ఇక బాణా సురుణ్ణంటావా కడు దురహంకారిగా మర్యాదా మప్పితమూ యేకోశానాలేని జడునిగా అమితనీచునిగా తనతండ్రి అని ఉష చెప్పుకుని గర్వపడేందుకు యెంతమాత్రం తగనివిధంగా సృష్టించారు. దిక్పాలకుల్ని బాణాసురుడు "ఒరే!" అని సంబోధిస్తాడు.

మరొక నాటకం వ్రాతామని కథాప్రణాళిక సిద్ధం చేసుకుంటున్నాను. వ్రాతప్రతిలోవున్న మూడోనాటకం నీకు తెలుసుకున్నదేకదా! అయితే వీటిని అచ్చొత్తించే మార్గం? అక్కడ వుందయ్యా వున్న చిక్కల్లాను!

అన్ని విధాలా నీయోగక్షేమాలను కాంక్షిస్తున్నాను.

ఎక్కహిల్ హౌస్
ఉదకమండలం
2 జూన్ 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

నీ ఉత్తరం నాకెంతో ప్రీతిని కలిగించింది. నిన్ను నేనెన్నడూ అపార్థం చేసుకోలేదు. 'కన్యాశుల్కం' నాటకంలో వేశ్య కనిపించే రంగాలు చెప్పుకోతగ్గంత గొప్ప నీతిస్ఫోరకమైనవి కావని నువ్వువ్రాసిన వాక్యాలను మాత్రమే నేను విమర్శించాను. ఇలాగ విమర్శిస్తున్నపుడు మన భావనాత్మక సాహిత్యంలోని నైతికధర్మాలను పర్యావలోకించాను.

నైతికజ్ఞానమన్నది గుణస్వభావాలనుబట్టి కొంతవరకూ తప్పక ఏర్పడుతున్నమాట నిజం. అయినా కేవలం వీటిపైననే అది ఏర్పడుతున్నదని నేనెన్నడూ చెప్పలేదు. నైతికభావాలను గురించిన ఆక్షేపణ వ్యక్తుల గుణస్వభావాలనుబట్టి కొంతవరకు కలుగుతున్నదని మాత్రమే నీకు నేను వ్రాసిన విషయం. అలాగ వ్రాస్తున్నపుడు సాహిత్యసిద్ధాంతాలను, తీరులను, తీర్పులను దృష్టిలో పెట్టుకుని ప్రస్తావించాను. నేను వున్న యదార్థమిదీ అని పేర్కొన్నాను. సాహిత్యవిమర్శనచరిత్రను పరిశీలిస్తే నేను చెప్పినది నిజమేనని ధృవపరుస్తుంది. ఆధ్యాత్మిక నీతిశాస్త్రాలను నువ్వొకసారి పరికించినట్లయితే యిక మనకీవివాదమే వుండదు.

స్త్రీ పురుష లైంగికసంబంధాలను వేటికవి ప్రత్యేకించి విశ్లేషించి సమగ్రంగా పరీక్షించాలని నా అభిమతం. లేబరేటరీల నుంచి కన్వెన్షన్ల రంగుదీపాలను తొలగించి స్త్రీపురుష శారీరక సంబంధాలను చాలా సూక్ష్మాతిసూక్ష్మంగా దేనికది విభజించాలని నా కోరిక. శారీరక శాస్త్రసూత్రాలతో చారిత్రక దృష్టితో వీటిని పరిశీలించు; పరీక్షించు. అపుడు వాటికిగల నిజమైన మూల్యమెంతో నిర్ణయించడం అలవరుచుకో.

జీవితంలో నువ్వు సత్యాన్ని ప్రేమిస్తున్నావుకదా. సత్యమనే దానిని ఆరాధిస్తున్నావుకదా; మరి సెంటిమెంటులోవున్న సత్యమును ఎందుచేత అన్వేషించవు? అనుస్యూతంగా మనస్సునంటిపెట్టుకున్న భావాలలోని సత్యమును ఎందుకని గ్రహించవు? మగవాళ్ళ అధికారం కింద పెత్తనం కింద బానిసలుగా ఆడవాళ్ళుఎలాపడివుంటున్నారో ఎంత మ్రగ్గిపోతున్నారోనేనూహించుకోగలను. నువ్వామాత్రం ఊహించుకోలేవా? ఊహించిచూడు. నీచుట్టూ కనిపిస్తున్న వైవాహిక జీవితాన్ని పరిశీలించు; అవగాహన చేసుకో.

బలహీనులైన కురూపులైన దుర్మార్గులైన నిరుపేదలైన భర్తలనుగురించి భార్యలు యేవిధంగా తలపోస్తారో కాస్త వూహించేందుకు ప్రయత్నించు. 'అయితే దుష్టులు, కురూపులూ అయిన భార్యలు మాత్రంలేరా' అని బహుశా నువ్వు ప్రశ్నించవచ్చును. కాని స్త్రీలు బానిసలు. స్వాతంత్ర్యమన్నదేమిటో వాళ్ళు ఎరగరు. భార్యలు తమ భర్తలయందుండగోరు సద్వర్తన పవిత్రతలకంటె ఎక్కువ సద్వర్తన పవిత్రతలను భార్యలయందు వుండవలెనని భర్తలు వాంఛిస్తున్నారు. ఇదే స్త్రీలకూ పురుషులకూ వుండే వ్యత్యాసం.

మాటవరసకి సద్వర్తనపరులుకాని మగవాళ్ళనందరినీ నువ్వు అసహ్యించుకుంటున్నావనుకుందాం. వాళ్ళను నువ్వు ద్వేషిస్తున్నావనే భావించుకుందాం. ఇపుడు నీ స్నేహితులలో యీ గుణపరీక్షకు ఎంతమంది నిలబడతారు?

స్త్రీ ఖిన్నురాలు కావడానికి కారణం తాను యివ్వగలిగిన దానికంటె అధికంగా పురుషుడు తననుంచి వాంఛిస్తున్నాడు కదా అని. అయితే పురుషుడు దుఃఖితుడు కావడానికి హేతువు తాను అపేక్షించినంతగా స్త్రీ తనను

పువ్వుల్లో పెట్టి పూజించడం లేదని; నిశ్చలభక్తితో ఆరాధించడం లేదని. ఈర్ష్య అంటేఏమిటి? భర్త అందగాడు కాదు. రూపురేఖావిలాసాలు లేనివాడు. భార్య అతని అందచందాలను మెచ్చుకోలేదు. అందచందాలుగల వొక అపరిచయస్థుని మెచ్చుకోకుండా వుండలేదు. కాని ఆమె అలాగ చేయకూడదు. ఎంత అసాధ్యం! భర్త తెలివి తేటలు లేనివాడు. అతనికి యింగితజ్ఞానం పూజ్యం. అయినాసరే, అతని మేధాసంపత్తిని భార్య ప్రస్తుతించి తీరాలి.

ఈ విధంగా తార్కికదృష్టితో దీనిని తరచి తరచి విస్తరించి చూడవచ్చును.

జపానుదేశంలో "గైషా" అనే నృత్యంచేసే భోగంపడుచులను గురించి నువ్వు చదివేవుంటావనుకుంటాను. స్త్రీ పురుష శారీరక సంబంధాలు ఆదేశంలో అంతపట్టింపుగా లేవు. ఇలాగ ఇవి ఒక ప్రక్క యథేచ్ఛగవుంటూనే వున్నవి. మరొకవంక దానిసరసనే, ఖండితమైన జాతీయ జీవితమూ, భౌతికజీవితావసర వస్తు సంపద పుష్కలంగా వుంటూనేవున్నాయి. ఇంతకంటె విచిత్రమేమంటే, ఆదేశంలో ఉన్నత రాజకీయ ఆదర్శాలు బోలెడు!

సెంటిమెంటు వూసుకేంగాని, స్త్రీపురుష శారీరక సంబంధమైనసమస్యలను నేనిలాగ వీక్షిస్తాను, విశ్లేషిస్తాను, పరిశీలిస్తాను. సమాజం నిర్ణయించిన నీతిసూత్రాలు మనకు కొన్ని వున్నాయి. వాటిని గౌరవించడం మనవిధి. అందులో స్త్రీ పురుష పరస్పర సంబంధాలను విధంచే ధర్మసూత్రం వొకటి. ఈ సాంఘికశాసనాలు మన కవరోధం కలిగిస్తున్నవని, మనలకు వెనక్కు లాగుతున్నవని మనకు రుజువవుతున్నపుడుతప్ప, వీటి నతిక్రమించడం వొకనేరమే. అయితే ఈ సాంఘికశాసనాలు ధర్మాలు, లోపభూయిష్ఠంగా వున్నపుడు వాటిని మనం బాహాటంగా ఎదుర్కొని సంస్కరించవలసి వుంటుంది. నువ్వొక న్యాయానికి ధర్మానికి, సామాజికనిమయానికి లోబడి వుండవలెనన్నపుడు, దానిని అనుసరిస్తున్న నీకూ వొకహక్కువుంది. అది ఎంతవరకు అంగీకారయోగ్యమో దానిని సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలించే నీకుగల యీ హక్కును ఎవరూ రద్దుచేయరాదు. అది దోషభూయిష్టమైనదని నువ్వువిశ్వసిస్తున్నపుడు, దానిని సంస్కరించే హక్కూ అధికారమూ నీకు వుంది.

నీతి, నైర్మల్యపవిత్రములనే అనుభావాలను నేను కొనియాడుతున్నాను. అయితే అట్టి అనుభవాలకు గల నిజస్వరూప మెట్టిది? వీటి నిజతత్వమేమిటి? వీటి పుట్టుకలు, నడత యేవిధమైనవి? ఈ పవిత్రత ఎందులో యిమిడివుంది?

అందుకోలేని దుస్సాధ్యమైన సామాజిక నీతిసూత్రాలపై స్త్రీపురుష సంబంధాలు ప్రస్తుతం ఆధారపడివున్నవని నాభావం. ఈ సామాజిక నియమాలు నిర్ణయిస్తున్న స్థాయి, ఎవరూ చేరు కోలేనంత దుస్సాధ్యమైనదనీ ఎవరికి అందుబాటులో లేనిదనీ నా నమ్మకం. ఈ ఆదర్శాలలో అనేకలోపాలు వున్నాయని నేననుకుంటున్నాను.

మనం యేదయితే నిజమని నమ్ముతున్నామో దానిని ఆ పరమసత్యాన్ని మనం నిర్మొహమాటంగా చిత్తశుద్ధితో నిష్కర్షగా, పైకి చెప్పవలసిన సమయ మాసన్నమయింది. మనకు మనమే, సత్యంపట్ల విధేయులమై వుండాలి. మనకు మన అంతరాత్మయే సాక్షి. నువ్వంటున్నావుకదా అపవిత్రురాలైన వివాహిత స్త్రీపురుషు లిద్దరూ వొకభోగంపడుచు వలె సమానంగా ఏవగించుకోతగినవారని. ఈ రెండుతరగతులవారికి వున్న వ్యత్యాసం ఏమిటో నువ్వాలోచించి నిర్ధారించలేవా? కాస్త దూరం యోచిస్తే అసలువిషయం నీకిట్టే అవగతమవుతుంది. నీ ఆలోచనల కట్టి శక్తివున్నది కనక యీ వ్యత్యాసాలను అవలీలగా పోల్చుకోగలుగుతావు. కొంచెం నిశితంగా ఆలోచించిచూడు. వొక్కసంగతి: భోగంపడుచు తనవృత్తికి బద్ధురాలు, విధేయురాలు. దేనిని చెబుతున్నదో దానిపట్ల ఆమె నిజాయితీగా ప్రవర్తిస్తోంది. నేనీ విషయాన్ని దానిస్వభావాన్ని బట్టి విషయబద్ధంగా యోచించిమాత్రమే అవలోకిస్తున్నాను.

ఇన్ని విషయాలను యింత విస్తరించి ఎందుకు వ్రాస్తున్నానంటే నా రెండవ నాటకంలో ఈ సమస్యను కొద్దిగానైనా చర్చించ దలుచుకున్నాను

అవును కామ్టే అనే పాజిటవిస్టుతత్వవేత్త మానవత్వాన్ని వొక మతవిశ్వాసుగా విస్తృతపరిచాడు మానవత్వమంటే ఆయన ఏవిధంగా విస్తృతపరిచాడో అదేపద్ధతిని తు చ తప్పకుండా నేను దానిని పరిగణించను ఏమంటావా మతవిశ్వాసాలనేని ఆచరణకు అసాధ్యమైనవి నిరోధకమైనవి సంకెబండల వంటివి మానవుని ప్రేమించడమన్నది అతిసాధారణమైన జీవిత సూత్రం ఇతరులను ప్రేమించడంవల్ల మానవునికి నిరవధికానందం సిద్ధిస్తున్నది మనం వొకరికి యిచ్చేప్రేమ మళ్ళీ మనకు ప్రేమను కొనితెస్తుంది వొకరినొకరు ప్రేమించుకోవడం ఎంత మహత్తరమైనదని ఈ భూమిమీదకు స్వర్గం దిగివచ్చినంత భూలోక స్వర్గమే

ఆధునికపాశ్చాత్యరాజ్యాంగవ్యవస్థ దాని పరిపాలనా పద్ధతి వొక విచిత్రమైన కలగూరగంప ఇందులో కొద్ది మానవత్వం వున్నప్పటికీ మితిలేని స్వార్ధపరత్వంతో యిది కూడుకునివుంది యీ రెండింటిలో ఏది జయిస్తుంది? స్వార్థపరత్వమే కాబోలు

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి ఉషా నాటకం గురించేకదూ ఆ మధ్యనే నేనీనాటకం చదివాను నాకుతట్టిన అభిప్రాయాలను నాటకప్రతిలో ఆయాచోట్ల వ్రాసివుంచాను శ్రీ వై నారాయణమూర్తి చదువుతామన్నారు పుస్తకం యిచ్చాను అదిఎందుకూ కొరగాని పుస్తకం శ్రీ వేంకటరాయశాస్త్రిగారు బొత్తిగా పసిపిల్లల మనోభావాలు కలవారనికాని సహజ విలక్షణ భావనాశక్తిలోపించినవారనికాని నేన్నెదూ అనుకోలేదు ఒక అంకం ఉషావిరహం మరొక అంకం ప్రద్యుమ్న విరహం శైలిచూతామంటే పాతఫక్కీ తలనొప్పి పాతఫక్కీ తలనొప్పి చికాకు అన్నీ పాతసంప్రదాయలే అంతా కన్నెన్నన్నమయం తామర ఆకులు సెజ్జలు చంద్రకిరణతాపం విరహవేదన అన్నీని లేని వేం లేవు పాత్రౌచిత్యమూలేదు కదలికాలేదు పాత్రచిత్రణాలేదు బాణాసురుని మేనల్లునికీ ఉషాధాత్రేయికీ మధ్య నాటకకర్త నడిపించిన శృంగారఘట్టాలు చదవడానికీ అసహ్యమే వినడానికీ రోతే వొట్టి అశ్లీలంతప్ప మరేమీ కనిపించదు శాస్త్రిగారు బహుశానదీ నే హస్యచమత్కారాలనుకుంటున్నారు

కన్యాశుల్కం దాదాపు అయిపోయినట్టే చివరిరంగం అచ్చవుతోంది త్వరలోనే పూర్తినాటకం నీ చేతికొస్తుంది శ్రీనారాయణమూర్తి దీనిని అత్యద్భుత కళారూపమంటున్నారు కాపీలు త్వరత్వరగా చెల్లుబడి అవుతాయని పెద్ద పెద్దబుక్సెల్లర్లు జోస్యంచెబుతున్నారు మిస్టర్ ఏట్సు నాటకాన్ని కొనియాడుతూ బహుచక్కని పీరికవ్రాశాడు మరి మనం పొగడ్తల మీదనే బతుకుతున్నాం కదూ

ఈ ఏడు నా ఆరోగ్యం సరిగాలేదు బాగానీరసించిపోయాను కాని ఉదకమండలం వచ్చాక కాస్తనయం ఇప్పుడు కులాసాగానేవుంది

నాటకం చివర నువ్వు పంపిన 'పదములపట్టిక లో కొంత భాగం చేరుస్తాను మీనాన్నగారికి నావందనాలు నెల్లూరు నువ్వెపుడు వెళతావు?

పి యస్ మద్రాసు నుంచొచ్చే మెయిలు నెల్లూరు ఎన్ని గంటలకు చేరుతుందో

* * *

ధాకర్సు గార్డెన్సు
రాయపేట మదరాసు
24 జూన్ 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం

కన్యాశుల్కం వొకకాపీ నీ పేరున నిన్ననే మెయిలులో పోస్టుచేశాను దానిని సమీక్షించు నీలగిరి పాటలు కాపీ నీదగ్గర వుందనుకుంటాను వుంటే కన్యాశుల్కంతో పాటు వాటినీ విమర్శించు

అబ్బెబ్బే ఈ మనిషికి కావ్యభాషంటే కలం ఆడదు అందుకే వాడుక భాషలో కన్యాశుల్కం వ్రాశాడు నోటికందని ద్రాక్షపళ్లు పలుపురొద్దు అని ఛాందసగ్రాంధిక వాదులు అనకుండా నీలగిరిపాటల్ని నీ సమీక్షలో ప్రస్తావించు నీ సమీక్ష నాకుపంపు బహుశా దాన్ని హిందూసుందరి పత్రికకు పంపిస్తాను

అబ్బ తూర్పు కోస్తాప్రాంతం ఎంత ఉపద్రవానికి గురయింది మీజిల్లా ఎక్కువ నష్టానికి లోనయిందనుకుంటాను మూడు రైలుపెట్టెలు సర్వనాశన మయాయని విన్నాను అయితే చనిపోయినది ముగ్గురేనా ?

పాపం రంగయ్యచెట్టి పోయినాడు మంచిమనిషి అతని పద్ధతులు అతనివీ వాటిప్రకారం యోగ్యుడే నా పేరికలో అతన్ని దూయబట్టుకున్నాను అతని మరణంవల్ల బోర్డాఫ్ స్టడీస్ లో ఖాళీ యేర్పడింది ఒ అంటే న రాని వ్యక్తిని సభ్యునిగా నియమించవద్దని శ్రీకృష్ణస్వామయ్యర్తుతో చెప్పాను అతని స్థానంలో శ్రీరామానుజాచారిగారిని నియమించమని సూచించాను

పి యస్ పాప్యులర్ పుస్తకాలను ప్రచురించాలని కొందరీ మధ్య తలపెట్టినట్లు విన్నాను క్యూరేటరు రిజస్టర్డు బుక్కుల జాబితాలో నాపేరు కనిపించిందని యీ మధ్యనే ఎవరో నాతో అన్నారు కాని పుస్తకమేదీ నేను రిజస్టరు చేసుకోలేదే

ధాకర్సు గార్డెన్సు
పీటర్సు రోడ్డు
రాయపేట, 1 జూలై 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం

నీకుపంపిన పుస్తకం అందలేదంటివి నీతోపాటు మరి ముగ్గురు స్నేహితులకు పంపించాను ఇద్దరు తమకు అందినట్లు తెలిపారు పోస్టలువాళ్ళు ఏదో మజాచేసి వుంటారు కనుక్కో మళ్ళీ మరొక కాపీ నీకు పంపాను సమీక్షవ్రాసి దాన్ని నాకు పంపించు విమర్శించేటపుడు నీ అభిప్రాయాలు నిష్కర్షగా వుండాలి మొగమాటం వొద్దు విమర్శ నిష్కర్షగా వ్రాయక పోతివా అది పాక్షికమే అవుతుంది పాక్షిక విమర్శనలకు విలువలేదు నీ అంతట న వ్వే నిర్ధారించుకొని నీ నిర్ధారణలమీదనే నువ్వు ఆధారపడడం నేర్చుకోవాలి మనకు అభిప్రాయభేదం వస్తుందనుకో. వస్తే రానీ పరవాలేదు కొంప మునిగిపోదు రచయిత తాను ఏదివ్రాసినా అందుకుఏదో ఒక సమర్థన వుందనుకుంటాడు అది సబబైనది కానీ కాక పోనీ దానితో నీకు నిమిత్తంలేదు

—— దురదృష్టవశాత్తూ యిప్పుడు రిజస్ట్రేషన్ డిపార్టుమెంటు వొక్క మూరోపియను చేతుల్లో వుంది నా స్నేహితుల కెవరికీ అతనికి చెప్పేపాటి చనువులేదు వచ్చే ఆదివారం నువ్విక్కడికి రాగలవూ వొకట్రీ రెండు రోజులు నాతో

గడుపుదువు గాని నేను ధాకర్సు బంగళాలో వుంటున్నాను నాతోపాటు నువ్వూ వుండవచ్చును వాళ్లు నీకో రోజు సెలవివ్వరూ?

* * *

ధాకర్సు గార్డెన్సు
రాయపేట
7 జూలై 1909

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం

మూడోతేదీన నువ్వురాసిన ఉత్తరం చేరింది విజయనగరంలో నీకొక ఉద్యోగం చూసిపెట్టలేకపోయినందుకు నాకు చాలావిచారంగా వుంది రిప్పన్ హైస్కూలును నిర్వహించాలనే పథకం విఫలమయిపోయింది నువ్వు విజయనగరంలో స్థిరపడితే బాగుండిపోనని నేను ఆశిస్తూవచ్చాను అలాంటి అవకాశాలు త్వరలో లభిస్తాయని మనం ఆశిద్దాం కాకినాడలో ట్యూటరు ఉద్యోగం చెడ్డదికాదు కాని రెండేళ్ళబాండుమాత్రం యిబ్బంది అయినప్పటికీ నువ్వా ఉద్యోగంలో చేరడం మంచిదని నాసలహా ఇంతకంటే యోగ్యమైనది దొరికినట్లయితే నిన్ను ఆబాండు నుంచి తప్పిచేటట్టు కాలేజి కమిటీచేత సులువుగా మనం వొప్పించవచ్చును ఇక సమీక్ష గురించి హిందూలో మిస్టర్ వెంకన్న రాసిన ఆ రెడెడ్‌స్టఫ్‌ను నువ్వు చూసేవుంటావు మొదటిపేరాను అతను టైమ్సు ఆఫ్ యిండియా నుండి కాపీ చేశాడు నేనిక్కడ అధమపక్షం పదిహేను రోజులుంటాను

వొక తెలుగు పుస్తకాన్ని ఎలా రివ్యూచేయాలో తెలుసున్నవ్యక్తి నాఎరికలో ఎవడూ లేడు అన్నట్టు శ్రీ డి నరసయ్య అనే పండితుడు వొకాయన పీపుల్సుఫ్రండ్ అనే వొక వారపత్రికను నడుపుతూవుండేవాడు ఆ పత్రిక యిప్పుడు వెలువడడంలేదు ఆయన నెల్లూరు వాస్తవ్యుడు ఇప్పుడు వున్నారూ? వుంటే ఆయనచిరునామా నాకుపంపించు ఆంగ్లభాషలో ఆయన గట్టివాడు వొకసారి ఆయన్నికలుసుకో

* * *

అడ్మిరాల్టీహౌస్
మైలాపూరు
31 జూలై 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం

నీకార్డు చేరింది ధన్యవాదాలు మేం శుక్రవారం బయలుదేరుతాం కాకినాడ చెడ్డ ఊరేమీకాదు పెద్ద వ్యాపార కేంద్రం అంతేకాక సాహిత్యకేంద్రం కూడాను చక్కటి శీతోష్ణపరిస్థితి పోలవరం జమీందారు తదితర స్నేహితులకు నిన్ను పరిచయం చేస్తాను "ఆర్యమతబోధిని" సంపాదకులు శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారితో పరిచయం పెట్టుకో, ఆయన నానాటకాన్ని రివ్యూ చేస్తామన్నారు కాకినాడనుంచి వెలువడే మహిళల రెండు పత్రికలకు నా నాటకప్రతులను పంపించాను "సరస్వతి"లో వొక సమీక్ష అచ్చౌతుంది "రవి" సంపాదకులు యెవరు?

పోలవరం జమీందారుతో ఉంటున్న శ్రీ డి. శివరావు పంతులుకు నిన్ను పరిచయంచేస్తూ ఒక లేఖ వ్రాశాను దానిని యీ ఉత్తరంతో జతచేసి పంపిస్తున్నాను శ్రీ శివరావు పంతులు మాకు దగ్గర బంధువు సాహితీపరుడు

ఆయన్ని నువ్వు కలుసుకున్నప్పుడు "రవి" సంపాదకులకు వొక కాపీ పంపించమనిచెప్పు. కాకినాడ "సరస్వతీ" ఆఫీసు మేనేజరుకు అమ్మకానికై రెండు వందల కాపీలు పంపించాను. పుస్తకాలు ఎక్కడ లభిస్తాయో రివ్యూలలో పేర్కోవడం అవసరం. హిందూ మెయిలు పేపర్లలోనూ మదరాసు తెలుగు పత్రికలలోనూ వెలువడిన సమీక్షలను నువ్వు చదివావా?

పుస్తకాల చెల్లుబడి మందంగా వుంది. ఒకడు ఒక పుస్తకాన్నికొంటే దాన్ని ఎరువు పుచ్చుకొని చదివేవాళ్ళు యిరవై మంది. మనది పేదదేశం.

పోర్టు, విజయనగరం
11 ఆగస్టు 1909

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

నీ వుత్తరాలు ఎప్పటికపుడు అందుతూనే వున్నాయి. ఒంట్లోశక్తిలేకపోయినా నువ్వు వూహించినట్లు పనిమటుకు లావుగానే వుంది. ఇక్కడికి వస్తానని నువ్వు వ్రాసినందుకు సంతోషం. దయవుంచి "సరస్వతీ" ఆఫీసు మేనేజరును ఒకసారి కలుసుకో. ఆయనపేరు శ్రీ కామేశ్వరరావనుకుంటాను. నాపుస్తకం ఎలా అమ్మకమౌతున్నదో ఆయన్నడిగి కనుక్కో. శ్రీబ్రహయ్యగారి "ఆర్యమతబోధిని"లో సమీక్ష వెలువడిందా? వచ్చే శని ఆదివారాలలో నువ్విక్కడికి వచ్చినట్లయితే వర్డ్సువర్తు 'మైకేల్' మీద వొక చిన్నవ్యాసం తయారు చేయాలని అనుకుంటున్నాను. విషయాన్ని సేకరిస్తున్నాను.

ఉదాత్తగంభీరభావాల అనుభూతుల అభివ్యక్తీకరణకు వాడుకభాష అన్నివిధాల యోగ్యమైనదని చూపడానికి బిల్హణుని కథను నాటకంగా రచిస్తున్నాను.

అక్కడ పని నీకు అభిరుచిని కలిగిస్తున్నదా? మెట్రిక్ విద్యార్థులు ఏవ్యాకరణం చదువుతున్నారు? నెస్ఫీల్డేనా? కాక పోతే ఏవ్యాకరణాన్ని వాళ్లు ఉపయోగిస్తున్నారో, అది ఒక కాపీ పట్టుకురద్దూ.

* * *

పోర్టు, విజయనగరం
4 డిసెంబరు 1910.

ప్రియమైన సుబ్రహ్మణ్యం,

ఇంతకాలమై నీ యోగక్షేమాలు నాకు తెలియచేయకపోతే ఎలాగయ్యా? ఈమధ్య నేనువ్రాసిన కవిత్వం ఆంధ్రభారతిలో అచ్చుపడింది; చూశావా? 'డామన్ పిథియస్'ను ప్రాచీన సంప్రదాయలకు కట్టుబడిన పత్రికలవాళ్ళు సైతం [illegible] మెచ్చుకొంటున్నారు. శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి విమర్శ ధాటీగా వుందని కాకినాడలో చాలామంది భావిస్తున్నారని దానికి సమాధానం వ్రాయవలసిందని ఇదివరకొక మాటు నాతో నువ్వన్నట్టు నీకు జ్ఞాపకం వుండివుంటుంది. ఈ మధ్యనే 'శశిలేఖ' పత్రికలో నా విశాల దృక్పథాన్ని వివరిస్తూ వొకవ్యాసం వ్రాశాను. 'ఆంధ్రకేసరి' లోకూడా అది నీకు కనిపిస్తుంది. వాటిని చదివి నీ అభిప్రాయాన్ని తెలుపు. ఇంకా చాలావ్యాసాలు వరస వరసగా ప్రకటిస్తాను.

పిల్లలమఱ్ఱి పినవీరన 'శకుంతలాపరిణయం' వొకసారి చూసి 'కవిస్తుతి' ఆదిగాగల పద్యాలు కాపీచేసి పంపించు. ఎఱ్ఱా ప్రగడ 'నృసింహపురాణం' లోనివి సైతం కాపీచెయ్యి. ఇప్పుడు నువ్వేంచేస్తున్నావు? మీ నాన్నగార్ని అడిగినట్టు చెప్పకోరుతాను. ఆయన ఆరోగ్యం బాగా వున్నదని అనుకుంటాను.

*　　　*　　　*

అడ్మిరాల్టీహౌస్
మైలాపూరు, మద్రాసు
3 ఏప్రియల్ 1911.

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

నీ ఉత్తరం అందింది. ఎంతో అభిమానంతో నువ్వు వ్రాసిన వాక్యాలకు నాధన్యవాదాలు. ఆఖరికి నావంటి వృద్ధులకుసైతం కొంచెంప్రోత్సాహం అవసరం. అందులోనూ ప్రేమాభిమానాలున్న యువకుడివి; మరి నీపోటి మిత్రులవద్ద నుంచి అలాంటి ప్రోత్సాహం లభిస్తూవుంటే యిక అడిగేవా!

నాఉద్యమం ప్రజల ఉద్యమం. సంస్కృతిపరుల భావసంపద నాకు అండగావుంది. అసలువిషయాన్ని అర్థం చేసుకోజాలని ఎవరోకొందరు వ్యక్తులు నాకువ్యతిరేకంగా వ్యూహాలను పన్నితే పన్నుగాక! నేనేమీ లక్ష్య పెట్టను. వాళ్ళను మార్చినా భాషకు జరిగే మేలు యేమీ లేదు. వాళ్లు ఘోరమైన ప్రాచీన కృతక గ్రాంధిక భాషను వ్రాయడానికి అదోక వ్యసనంలాగ అలవాటు పడిపోయారు! దానికి కట్టుబడిపోయారు. అది వొదులుకొని వారు నూతనభాషను చక్కగావ్రాయగలుగుతారని నేను కలలోకూడా ఆశించలేదు. పోనీ, ప్రాచీనమైన గ్రాంధికభాషనైనా తేటగా సున్నితంగా వ్రాయగలరా అంటే అదీ కనిపించదు. నిర్దుష్టమైన గ్రాంధికం వ్రాసేవారు బహు అరుదు. లలితమైన సుందరమైన వాడుకభాషలో గ్రంథరచన కొనసాగించే సంప్రదాయ మొకటి తలెత్తాలంటే నీవంటి యువకులు నాకవసరం.

నేటికిసైతం నాఉద్యమానికి కాకినాడు వ్యతిరేకంగా వున్నందుకు విచారిస్తున్నాను. వివాదాలలో నేనవలంబించే పద్ధతి వేరు. ప్రతి పక్షీయులను తమకు తోచినరీతిని వ్రాసుకుపోనిస్తే పోగాపోగా వాళ్లే దారితప్పుతారు. వొక్కొక్క విమర్శకునికీ వరసవరసగా నేను సమాధానాలిస్తున్నాను. బహువింతలు గొలిపేవిషయాలను ప్రస్తావిస్తూ విమర్శకులనందరినీ ఎదుర్కొంటున్నాను. ఇన్నాళ్ళకి వాళ్ళు నన్ను గౌరవించడం నేర్చుకున్నారనుకుంటాను. శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు మర్యాద చూపుతున్నారు. మద్రాసులోవున్న గ్రాంధిక భాషావాదకూటమి నాయకులు నన్ను చూడడానికివచ్చారు. నాతో కత్తులు దూయడానికి ఎవరూ తొందరపడడం లేదు. సంశయిస్తున్నారు. వ్యావహారిక భాషా ఉద్యమం సాధించిన పురోగతికి నేనుపూర్తిగా సంతృప్తి పడుతున్నాను. కాని నాకు కావలసినదల్లా హెచ్చు మంది రచయితలు; మృదుమధురమైనశైలిలో మెలకువతో వాడుకభాషను రాసే యువకులు నాకవసరం. ప్రాచీన గ్రాంధిక భాషను వ్రాస్తామని దర్పానికిపోతూ వాడుకభాషను కృతకం చేసే రచయితలు నాకవసరంలేదు.

మీసోదరుడు పరీక్ష ప్యాసవాలని నాకోరిక. పూజనీయులైన మీనాన్నగారికి నానమస్కారాలు. నీకష్టాలేమిటో నేను సులభంగా గ్రహించుకోగలను. సెకండు గ్రేడు ప్యాసైతివా ప్రాక్టీసుపెట్టు. అంతేకాని గవర్నమెంటు నౌకరీలో

ప్రవేశించావు కనుక! క్రేన్‌లాగ నిన్ను మీదకు ఎత్తే చుట్టాలుంటే తప్ప గవర్నమెంటు నౌకరీకి ఎదుగూబొదుగూ వుండుదు. ప్రమోషనువచ్చేసరికి తలప్రాణం తోకకు వస్తుంది. సబార్డినేటు రెవిన్యూ నౌకరీ నీ నెత్తురు తాగేస్తుంది. నీమార్దవాన్ని ఉత్తేజాన్ని ఆహ్లాదాన్ని జలగలా పట్టి పీల్చేస్తుంది.

సరేకాని, నీకు సాహిత్య రచనోత్సాహం ఎందుకు సన్నగిలాలో నాకర్థం కావడంలేదు. వాక్యరచనావిన్యాసంలో తగు శ్రద్ధ కనబరుస్తూ హందాఅయిన వాడుకభాషను వ్రాయడం అభ్యసించి సాధన చేయగా చేయగా సుప్రసిద్ధ మహారచయితవు కాకపోయినా త్వరలోనే మంచి రచయితవౌతావు. నీకు విషయపరిజ్ఞానం వుంది. మొదట, పోనీ, మారు పేరుతోనేవ్రాయి. తెలుగుకవుల లేదా సంస్కృతకవుల, కాదాపర్షియను కవుల కావ్యాలను చదివి ఆకథలనువ్రాయి. ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో కళాపూర్ణోదయ కథాభాగాన్ని కృతికర్తశైలిలో నేను వ్రాశాను. అది నీకుఉపకరిస్తుంది. పిల్లలమర్రి పినవీరన 'శకుంతలా పరిణయం' ఒక ప్రతిని నాకు పంపగలవా?

* * *

పోర్టు, విజయనగరం
2 ఆగస్టు 1911

ప్రియమైన ముని సుబ్రహ్మణ్యం,

ఈమధ్య మాతల్లిగారికి ఒంట్లో కులాసాగా లేదు. అందువల్ల నీకు వెంటనే జవాబీయలేక పోయాను. ఆవిడ జబ్బుకుతోడు మా వెంకటేశ్వర్లు కూడా మంచాన పడ్డాడు. ఇవతల యింట్లో యిలావుండగా అవతల ఆఫీసులో కొత్తమేనేజిమెంటు వల్ల చేతినిండా పనే. ఊపిరి సలపడం లేదు. నువ్వు ఆర్థిక యిబ్బందుల్లో వున్నందుకు నేను చాలా విచారిస్తున్నాను . లాయరుగా నువ్వు తప్పకరాణిస్తావని, త్వరలోనే నీ యిబ్బందులు మబ్బులు విడిపోయినట్లు విడిపోతాయని నా నమ్మకం. స్వశక్తిమీద ఆధారపడి ఆత్మవిశ్వాసంతో కృషిచేసినట్టయితే నువ్వు విజయం సాధించి తీరుతావు. నీకుగల ప్రతిభావ్యుత్పత్తులు సాధారణమైనవికావు.

ఇంతకుముందు నేనువ్రాసినవాటికంటె 'లవణరాజుకల' ఎక్కువ శ్రుతిసుభగంగావుందని నేననుకోవడం లేదు. నూతన రీతులకు శైలికి ఛందస్సులకు ప్రజలు అలవాటు పడుతున్నారు. అంతే; మరేమీకాదు. ఒక కావ్యాన్ని చదివి దానిని సునిశితంగా పరిశీలించి తూచినట్టు విలువలుకట్టే విమర్శకులు మనలో బహు అరుదు. ఇప్పుడు పత్రికలలో వెలువడుతున్న విమర్శలకు నేనేమీ విలువ యివ్వను. నాగరికత సంస్కారం విజ్ఞానంగల నీబోటి వ్యక్తుల అభిప్రాయమంటే నాకు విలువ హెచ్చు.

* *

పోర్టు, విజయనగరం
1 సెప్టెంబరు 1911

ప్రియమిత్రమా;

చాలా కాలమై నీభోగట్టా నాకు తెలియడంలేదు. మన ఉద్యమం దినదినాభివృద్ధిని పొందుతున్నదని నీకు తెలపడానికి ఆనందిస్తున్నాను. నువ్వేమైనా రచిస్తున్నావా?

ఇండియన్ రివ్యూ కు చెందిన శ్రీ జి ఎ నటేశం సెనేటుకు పోటీ చేస్తున్నారు ఆయన మన జాతీయవీరులలో ఒకరు ధైర్యవంతుడు దేశభక్తుడు నిర్మాణదక్షుడు రాజకీయ ఆర్థిక సామాజిక తత్వశాస్త్రాలకు సంబంధించిన కొన్ని గ్రంధాలను ఆయన అచ్చొత్తించాడు ఆయన ప్రచురణలు అమూల్యమైనవి

కాకినాడ కాలేజీలో నీమిత్రులు శ్రీ వెంకటరంగయ్యగారిని తమవోటు శ్రీ నటేశంగారి కీయవలసినదిగా అడుగుతావని నమ్ముతాను ఆయన యేమన్నదీ నాకు ఉత్తరం వ్రాస్తావు కదూ?

మీ నాన్నగారికి నానమస్కారాలు

# మిత్రుల లేఖలు

బి.టి. సావర్కారు<br>పూనా<br>15-1-1907

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీరడిగిన సమాచారం రేపు పంపుతాను. ఈలోపున గోత్రచరిత్రమునుండి ఈ అచ్చుకాగితములను పంపిస్తున్నాను. వాశిష్ఠ, కాశ్యప, శాండిల్య గోత్రములకు సంబంధించిన కొంత భోగట్టాయిందులో వుంది. వాశిష్ఠ, శాండిల్య గోత్రములువేరు. పునానుంచి మీరేపుస్తకాలను కొన్నారో నాకు తెలియచేస్తారా? బొంబాయినుంచి ఏ గ్రంథాలను కొన్నారు? మీరడిగిన సమాచారాన్ని పంపడానికి కొంత పరిశీలించవలసి వుంది. అందువల్ల రేపటి ఎల్లుండిలో ఇంకొక ఉత్తరం వ్రాస్తాను.

* * *

హేమచంద్రదాసు గుప్త

ది వంగీయ సాహిత్య పరిషత్తు మందిరం<br>243-1 అప్పర్ సర్క్యులర్ రోడ్డు, కలకత్తా<br>23 జనవరి 1912

ప్రియమైన అయ్యా,

మీకు, నారాయణమూర్తిగారికి, ఆతిథ్యమిచ్చే సంకల్పంతో నేటి సాయంకాలం అయిదున్నర గంటలకు మాపరిషత్తు మందిరంలో తేనేటి విందును ఏర్పాటు చేసుకున్నాము. మా ఆతిథ్యాన్ని స్వీకరించడానికి మీరు పరిషత్తు మందిరానికి సాయంకాలం విచ్చేస్తారని ఆశిస్తున్నాను.

* * *

గురుదాస్ బెనర్జీ

నారికేల్ సంఘం
కలకత్తా
29 జనవరి 1912

ప్రియమైన అయ్యా,

మీరు 26 వ తేదీన వ్రాసిన ఉత్తరమున్నూ, దయతో బహూకరించిన మీ కన్యాశుల్కమన్న నాటకప్రతిన్నీ అందినవి. భావప్రేరేపణాత్మకముగ ప్రతిభావంతముగ మీరు ఆంగ్లమునరచించిన నాటకపీఠికను చదివి మిక్కిలి ఆనందించాను; అనేక అమూల్య విషయాలను గ్రహించగలిగాను. నాకు తెలుగు భాష వచ్చి మీ నాటకమును చదవగలిగి వుంటే, ఇంకను ఉత్తేజితుడనైవుందును. నాకు మీభాష రానందుకు విచారిస్తున్నాను.

కన్యలను శుల్కమునకు అమ్మజూపే దురాచారాన్ని మీరు ఖండించినందుకు సంతోషం. ఈ దురాచారాన్ని మనువుసైతం నిరసించాడు.

"న కన్యాయాః పితావిద్వాన్
గృహ్ణీయా చ్ఛుల్క మణ్వమి
గహ్ణన్ శుల్కం హి లోభేన
స్యాన్నరోఽ పణ్యం విక్రయీ"

విద్యా సమస్యలపై నేను రచించిన ఒకచిన్న పుస్తకమును మీకు పంపుతున్నాను.

శారదాచరణమిత్రా

85 గ్రేస్ట్రీటు, కలకత్తా
15 ఏప్రియలు 1912,

ప్రియమైన అప్పారావుగారూ,

మీరీనెల మొదటి తారీఖున వ్రాసిన ఉత్తరమును పంపిన తెలుగు గేయమును అందాయి. ధన్యవాదములు. దేవనాగరలిపిలో అచ్చయిన ఆ గేయాన్ని నేను చదవగలిగాను. తెలుగు పుస్తకాలను దేవనాగరిలో అచ్చువేసినట్లయితే, ఉత్తరదేశపు భాషలకు, తెలుగుకు యిపుడున్న వ్యత్యాసం కొంత తగ్గుతుంది. మీ అనువాదంలో పెక్కు సంస్కృతశబ్దా ప్రయుక్తమైనవి కనక, నాకది చక్కగా అర్థమయింది.

మీ గ్రంథాన్ని ఒక నిధివలె దాచివుంచాను. 'దేవనాగర' ద్వితీయసంచికలో అది అచ్చుపడేటట్లు చ భారతదేశ, ఐక్యతకు మనం ఒకసామాన్యలిపిని, సాహిత్య భాషను పెంపొందించుకోవలసి వుంటుంది. చంద్‌నుగురించి 'నేషనల్ మాగజెన్'లో కొన్ని వ్యాసాలు అచ్చుపడినాయి. ఆ వ్యాసాలు ప్రచురితమయిన సంచి దొరకడం కష్టమే కాని వాటిని ఎలాగైనా సంపాదించి మీకుపంపిస్తాను, నా లైబ్రరీలో ఆ సంచికలు వున్నవేమో వెతికిచూడమని నా కుమారునితో చెప్పాను.

సాహిత్యపరిషత్తు సభ్యులు బెంగాలీభాషలో తప్ప ఇంకే భాషలోను వ్యాసాలు రచించరు నేను పరిషత్తుకు అధ్యక్షునిగా వుంటూనే వాక్యల్లో లప్పబుట్టాను సరె మీరుకోరినట్లు ఎవరినో ఒకరిని ప్రోత్సహించి ఆధునిక వంగసాహిత్యభాషనుగురించి విపులంగా ఒక వ్యాసం వ్రాయిస్తాను అనేక గౌరవపూర్వకనమస్కృతులతో లేఖను ముగిస్తున్నాను

*　　　　*　　　　*

హేమచంద్రదాసు గుప్త

వంగీయ సాహిత్య పరిషత్తు మందిర్
243-1 అప్పర్ సర్క్యులరు రోడ్డు కలకత్తా
27 జూలై 1912

ప్రియమైన రావుగారూ

మీరు ఉదకమండలంనుంచి శ్రీ త్రివెదికి వ్రాసిన లేఖ లందింది అప్పుడు ఆయన పరిస్థితి అతి ఆందోళనకరంగా వుంది అప్పటికంటె ఇప్పుడు జబ్బు కొంచెంనయంగావున్నట్లనిపిస్తున్నా ప్రమాదం మాత్రం తప్పిపోలేదు ఎప్పుడూ ఆలోచిస్తూ ఏదోఒకటి వ్రాయడంవలన ఆయనకి అమితమైన శ్రమ కలిగింది నరాలన్నీ తోడుకుపోతున్నట్లు తెగిపోతున్నట్లు బాధపుట్టింది ఏమీఆలోచించవద్దని పూర్తిగావిశ్రాంతి తీసుకోమని డాక్టర్లు హెచ్చరిస్తున్నారు కాగితం కలం ఆయన కంట పడ నీయవద్దని మమ్మల్ని ఆదేశించారు అందువలన ఆయనకు బదులు నేను మీలేఖకు సమాధానం వ్రాయవలసి వచ్చింది

శాస్త్రీయ సాంకేతిక ఆంగ్లపదాలకు సమానార్థక పదాలను తెలిపే సంచికను మేం మా మాతృభాషలో యింతవరకు వెలువరించలేదు అయితే అలాంటిపదాలు చాలమటుకు మాత్రైమాస పత్రికలో అపుడపుడు అచ్చుఅవుతూ వచ్చాయి మరి కొన్ని పదాలను కొద్దికాలంలోనే ప్రచురించ దలచుకున్నాము రసాయనికశాస్త్ర ఆంగ్లపారిభాషిక పదాలను వాటి సమానార్థకాలను ఒక పట్టికగా తయారుచేయాలని డాక్టర్ పి సి రే ప్రయత్నిస్తున్నారు సమానార్థక పదాలను సాధ్యమైనంతవరకు ప్రాచీన సంస్కృతగ్రంథాలనుండి సేకరించాలని అవసరమైతే కొన్నిటిని సృష్టించుకోవాలని ఆయన సంకల్పం వీటిని మా పత్రికలో ప్రచురిస్తున్నాము ఇదివరకు మా పత్రికలలో ప్రచురితమైనవీ ఇకముందు ప్రకటనకు సిద్ధముగా వున్నవీ అన్నిటిని ఒక సంపుటిగా అచ్చొత్తించాలని డాక్టర్ రే నిర్ణయించుకున్నారు పదముల సృష్టికి ప్రత్యేకం ఒక పండితుడు ఆయనకు సహాయపడతాడు ఈ పారిభాషిక పదకోశమును వెలువరించడానికి రెండు మూడేళ్లు పడుతుంది

రేపు మావంగీయ సాహిత్యపరిషత్తు వార్షికోత్సవం మీరడిగినవి మాకులభ్యమైనంతవరకుసేకరిస్తున్నాను ఇంతవరకు వెలువడిన మాప్రచురణలను సమాచారాన్ని సోమవారంనాడు మీకు పంపిస్తాను ఈ పారిభాషిక పదాలను ఏయేసూత్రములపై సమకూర్చారో మీకు తెలియచేసేటందుకు అందుకు సంబంధించిన ప్రచురణను మీకు అందచేస్తాను ఈ సందర్భంలో నన్ను మీరు మన్నించినట్లయితే ఒక విషయం మీదృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను

మాపత్రిక 13వ సంచికలో ఇదే విషయం మీద నేను వ్రాసిన వ్యాసమెకటి అచ్చుపడింది. అ వ్యాసంలో నేను కొన్ని సూచనలను కావించాను. నా సూచనలపట్ల మీఅభిప్రాయమేమో తెలుసుకోవాలని, కుతూహల పడుతున్నాను. పూర్తిసెట్టు పంపాలంటే, అన్ని భాగాలు దొరకడం లేదు. కొన్ని భాగాలు ఆనాడే అమ్ముడయిపోయాయి. ఎంత గాలించినా అవి లభించవు. మీకొక పూర్తిసెట్టు పంపలేక పోతున్నానని బాధపడుతున్నాను.

* * *

జ్ఞానేంద్ర మోహన్ దాసు

30, బహిర్ మీర్జాపూరు రోడ్డు
కలకత్తా 21 జనవరి 1914

ప్రియమైన అయ్యా,

నేను విజయనగరం నుంచి బయలుదేరి వచ్చే ముందు మిమ్మల్ని మళ్ళీ ఒకసారి కలుసుకోలేక పోయాను. అందుకెంతో విచారిస్తున్నాను. మళ్లీ ఒకసారి కలుసుకుని భారతీయ భాషలలో అనుసరించదగు శైలిని గురించి, ఆధునిక బెంగాలీ భాషాధోరణులను గురించి, మీతో నేను ప్రసంగించి వుండవల్సింది. కాని ఆ అవకాశం లేకపోయింది. టాగూరు ఒకవ్యాసం వ్రాస్తామన్నారు. ఆయనకా విషయం జ్ఞాపకం చేయమని, నేను విశాఖపట్ణంలో వుండగానే, శ్రీ రామానంద ఛటర్జీకి ఉత్తరం వ్రాశాను. ఇక్కడకు వచ్చిన వెంటనే శ్రీ ఛటర్జీని కలుసుకుని ఈ విషయం ప్రస్తావించాను. మీరు కోరిన విషయాలను సేకరించి మీకు పంపలేకపోతున్నందుకు ఒకవంక సిగ్గుపడుతూనే వున్నాను. కాని, నా వాగ్దానం త్వరలోనే నెరవేర్చుకుంటాను. మెస్సర్సు బి. బెనర్జీ అండ్ కో వారొక చిన్నపుస్తకాన్ని ప్రచురించారు. మీరు నాతో చర్చించుదామనుకున్న విషయాలు కొన్ని అందులో వున్నాయి. ఆ పుస్తకం దొరికిన వెంటనే మీకు పంపించి, నా వాగ్దానం నిలబెట్టుకుంటాను.

విజయనగరం విశాఖపట్ణాలలో నేను వున్న ఆ స్వల్ప కాలంలో, నేనొక విషయాన్ని గ్రహించగలిగాను. అక్కడి పండితులు రెండువర్గాలు. మొదటి వర్గంవారి పద్ధతి అతి ప్రాచీనం. సాహిత్యరచనలో ఏమాత్రపు ప్రాచీన పద్ధతులు సడలినా, వారు సహించరు. మార్పుకు వారు విముఖులు. రెండవ వర్గంవారు సుముఖులు. కనక ఈ ఇరుతెగలవారికి అన్నిటా చుక్కెదురు.

ఒకప్పుడు బెంగాలీభాష స్థితి ఇలాగే వుండేది. పదాడంబరంతో పడికట్టురాళ్ళవంటి శబ్దాలతో సమానపు బిగింపులతో వచన రచన అధ్వాన్నంగా తయారయింది. విభక్తి ప్రత్యయాలను మాత్రం మార్చి అనుస్వార విసర్గ క్రియారూపాలను సర్దుబాటు చేస్తుకుని, సంస్కృతశబ్దాలను రస్సాకు రస్సా దించి పండితులు భాషను కృతకం కావించారు. ఈ క్రియాపదాలుసైతం సంస్కృతవ్యాకరణ సూత్రాలకు విరుద్ధంగా కటువుగా సృష్టిఅయేవి. పండితులు వ్రాసే కృతక వచన శైలి ఇటు ప్రజలకు అటు విద్యావంతులకు అర్థంకాక, కొరకరాని కొయ్యగా రూపొందింది. కాగా ఎవరి ఆదరణ లభించక, గ్రంథాలలో మేట వేసుకు పోయింది.

ఇలాంటి పరిస్థితులలో రాజా రామమోహన్‌రాయ్ చదవతగ్గ వచనాన్ని సృష్టించాడు. దానిని విద్యాసాగరుడు అనుసరించి, వాప్తిలోనికి తెచ్చారు. అయితే ఈయన శకం స్వతంత్ర కల్పనలకు యోచనకు ఆస్కారంలేక

అనువాదాలతోనే గడిచిపోయింది. ఇది కేవలం అనువాదయుగం. అందువల్ల విద్యాసాగరునిశైలి, సంస్కృత వ్యాకరణ మర్యాదల, భాషా సంప్రదాయాల సంకెళ్ళను తెంచుకుని బయటపడలేక పోయింది. కాగా ఆభాష విద్యావంతులలో వ్యాప్తిచెందినా, ప్రజలకుసన్నిహితం కాలేదు.

టేక్ చంద్ సర్వ స్వతంత్రుడు. అత్యంతసాహసి. ఆయన నిండుధైర్యంతో నిజమైన స్వాతంత్ర్యేచ్ఛతో తిరగబడ్డాడు. ఈ నియమాలను ఉల్లంఘించాడు. ఆయన భాషా ప్రవాహాన్ని తన కభిముఖంగా తిప్పుకుని, దానిని పండితులపై తిప్పికొట్టాడు. విద్య సాహిత్యంలో మైకేలు మధుసూదనదత్తు ఏవిధంగా పురోగమించాడో, అదే విధంగా టేక్ చంద్ గద్యసాహిత్యంలో ముందడుగు వేశాడు. ఈనాడు మీరు ఆంధ్రసాహిత్యంలో బహుశా ఏయే పరిణామాలను కోరుతున్నారో, వాటిని ఆనాడు ఆయన వంగసాహిత్యంలో సాధించాడు.

టేక్ చందు తరవాత అంతకంటె గొప్పధీశాలి ప్రభవించవలసివుంది. అలాప్రభవించిన పురుషుడు బంకిమచంద్రుడు. ఆయన కాలంలో మరిఇద్దరు ప్రసిద్ధికెక్కిన రచయితలు వుండేవారు. ఒకరు కాళీప్రసన్నఘోష్, ఇంకొకరు చంద్రనాథబోస్. ఘోష్‌గారిది తూర్పు బెంగాలు; బోసుగారిది పశ్చిమబెంగాలు. అయితే వీరిద్దరూ పరిశుద్ధతావాదులు.

ఇప్పుడు విద్యసాగరుని భాషాపద్ధతి పాతబడిపోయింది. టేక్ చందు నవ్యుడుకాదు. పూర్వకాలపు మనిషి. శుద్ధ 'అతల్' శైలిలో అందరికి అభిరుచి పోయింది. ఇంకా బంకిమచంద్రుడు సాహిత్యంలో బ్రతికివున్నాడు. వ్రాసే, మాటలాడే, గ్రంథములలో పత్రికలలో వాడే భాషలను గురించి వివాదం జరుగుతూనేవుంది. వాదప్రతివాదాలు, ఖండన మండనలు సాగుతూనే వున్నాయి. వాడుకభాషను గ్రామ్యమని, నింద్యమని కొందరు పండితులు నేటికీ అంటూనే వున్నారు. ఇంతవరకు ఏనిర్ణయమూ జరగలేదు.

మీరూ నేనూ మనమంతా, జవమూ జీవమూకల భాషకావాలని వాంఛిస్తున్నాము. అంటే ఆభాష పరిపూర్ణమైనదిగా వుండాలని మన ఆశయం. (అ) ప్రజలకు సాధారణజ్ఞానాన్ని కలిగించే (ఆ) పారిశ్రామిక, వైజ్ఞానిక, కళారంగాలలో కృషి చేస్తున్న విద్యార్థులకు సాంకేతిక జ్ఞానాన్ని ప్రసాదించే (ఇ) పండితులకు ఉదాత్తభావాలను, ఆదర్శాలను జ్ఞానాన్ని ప్రబోధించే (ఈ) ప్రసన్న గంభీరమధుర కావ్యసృష్టికి దోహదపడే అన్ని విధాలా అర్హమైన భాషను, భాషాశైలిని సృష్టించుకోవాలని మనం కృషిచేస్తున్నాము. ఈకృషి ఫలించాలని సాహితీ పరులంతా ఆశిస్తున్నారు. ఈ ఆశయంతోనే వారు సాహిత్యాన్ని ఆరాధిస్తున్నారు. దై నందిన జీవితంలో నిత్యమూ చెవిని పడుతున్న మాటలను, సులభంగా అర్థమయే సరళపదాలను, నుడికారాన్ని, సాహితీపరులు స్వీకరిస్తున్నారు. వారు తమ పుస్తకాలలో వాడుతున్న భాష రైతులకు రాజులకు పూజారులకు పురోహితులకు అందరికి సుపరిచితమైనట్టిది. అందులో ఏమాత్రం సందేహం లేదు. ఇప్పుడు బెంగాలులో రచయితలు సరళ సుబోధక శైలిని అనుసరిస్తున్నారు. మామూలు మాటలతో అర్థ గాంభీర్యాన్ని సాధిస్తున్నారు. ఇలాంటి సరళభాషను వాడుతూ రచనలో కృతకృత్యులు కావాలంటే, మాటలపొందిక, ఇమిడిక అవసరంకదా. సొగసయిన పదాలను ఎంచుకోవడంలో, వాటిని అర్థవంతంగా ప్రయోగించడంలో రచయితకువున్న నేర్పునుబట్టి అతని శైలికి అందం అమరుతుంది. ఆఖరికి నింద్యమని అపభ్రంశమని పండితులు ఈసడించే శబ్దాలను సైతం, అశ్లీలతాదోషం అంటనీయకుండా, సమర్థుడైన రచయిత ప్రయోగించవచ్చును.

భాష నాజూకుగా, ఠీవిగా వుండాలి. ఆడంబరం అందమీయదు. జటిలపద ప్రయెగంవల్ల భాషా సౌకుమార్యం కలగదు. తేటమాటలతో నాగరికమైన అనుభావాలను, ఉదాత్త భావాలను వ్యక్తపరచాలి. శైలి సహజ ప్రవాహంవలె

ఉరకలెత్తుతూ అనుభూతులను కలిగిస్తూ హృదయంపై చెరగని ముద్రలను వేయాలి శైలిఅందం ఇలాఇలా వుండాలని సిద్ధాంతీకరించి చెప్పడం సులభమే. కాని ఈ అందాన్ని అలరించడం కష్టం. అక్కడే వస్తుంది అడ్డు.

నిఘంటువుల, పండితుల, వైయాకరణుల సహాయం అవసరంలేకుండా, చదవగానే అందరికీ అర్థమయే విధంగా, భాషను సంస్కరించవలెనని మీ ఆశయం అదే నేటిసమస్య. మనమంతా భాషాసంస్కరణను కోరుతున్నాము. అంటే దాని అర్థం, భాషా గాంభీర్యాన్ని స్నిగ్ధసౌందర్యాన్ని మనం పోగొట్టుకుంటున్నామని కాదు; పైగా దాని సౌకుమార్యాన్ని ఇనుమారు తెచ్చుకుంటున్నాము. దాని ఫాయిదాను, వడ్డీఫాయిదాలతో లెక్కకట్టి చెల్లించి, సంపన్నవంతం చేయాలంటున్నాము. మనదేశంలో ఋజువర్తనగల మీవంటి ధీశాలురు, భాషాసంస్కరణ సమస్యను తరచి తరచి అవలోకిస్తున్నారు; సంతోషం!

ఇప్పటికే నా ఉత్తరం అనుకోకుండా పెరిగిపోయింది. ఇక ఇంతటితో ఆపివేస్తాను. మీరు ఆంధ్రసారస్వతరంగంలో తలపెట్టిన ఉద్యమం ఫలించాలని మీకు విజయం సిద్ధించాలని ఆశిస్తూ, నా లేఖను ముగిస్తున్నాను.

* * *

రవీంద్రనాథ టాగూరు

రామఘర్
కుమోన్ హిల్సు
మే 24, 1914

ప్రియ మిత్రమా,

మీ దయగల ఉత్తరానికి ధన్యవాదాలు. నేను నామేధాశక్తిని చాలాకాలం నుంచి వెచ్చింపవలసి వచ్చింది. అందువల్ల చెదిరిన నాశక్తులను కూడదీసుకుందుకు ఆత్మ సమస్థితిని పొందేటందుకు నేను ఇక్కడ, ఈ హిమాలయ ఏకాంతస్థలంలో విశ్రాంతి తీసుకుంటున్నాను. ఇది నా కత్యంత ప్రధానమని, మీరు సులభంగా అర్థం చేసుకోగలరు. కొంతకాలం వరకు మరే విషయంపై నేను, నాదృష్టిని సారించలేను. మీరు నన్ను అర్థం చేసుకుంటారని మీ కోరికను ప్రస్తుతం నెరవేర్చలేక పోతున్నందుకు, నన్ను మన్నించగలరని నా నమ్మకం.

జె.ఎ. యేట్సు

వాల్తేరు
24-5-09

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీనాటక నూతన ముద్రణపు పీఠిక పంపినందుకు మీకు నేను చాలా కృతజ్ఞుణ్ణి. ఆమధ్య శ్రీ శ్రీనివాసఅయ్యంగారు నాకొక ప్రతిపంపించి, నా అభిప్రాయాలు విపులముగ తెలియచేయమని అడిగారు. ఆంగ్లేయ దృక్పథంతో నేను మీ పీఠికను అర్థం చేసుకుని దానిని మెచ్చుకుంటూ నాభావాలను ఆయనకు తెలియచేశాను. నాఉత్తరాన్ని ఆయన మీకు పంపిస్తామన్నారు. దానిని మీకు వెంటనే అందచేయ వలసినదని ఈ రోజే పి.టి.యస్‌కు ఉత్తరం వ్రాస్తున్నాను. అలాఅయితే మళ్ళీ మీకు నాపరిశీలన వ్రాయనక్కరలేదు.

హెగిన్ బాథమ్స్ వారితో నాకు పరిచయం లేదు. అక్కడికి నేను రెండు మూడుసార్లు వెళ్లాను. నన్ను వాళ్లెరగరనుకుంటాను. శ్రీనివాసఅయ్యంగారు, మిస్టర్ హెగ్స్‌కు వ్రాస్తామన్నారు. లాభం వస్తుందని తోస్తే మీ నాటక ప్రతులను అమ్మకానికి వాళ్లు తీసుకుంటారు.

మీ నాటకం బాగా చెల్లిపోతుంది. తప్పదు. మీ పీఠికలో నన్ను పరిచయం చేసినందుకు మీకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. కాని తెలుగుభాషావిషయకచర్చలలో నాగురించి మీరు ప్రస్తావించడానికి నేను తగనేమో అని నా అభిప్రాయం. ఏమైనా, మీ ప్రశంసకు పాత్రుడనై నందుకు సంతోషం.

వాడుకభాషలో మీరిపుడు యింకా ఏమైనా వ్రాస్తున్నారా?

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ.

కోటగిరి

నీలగిరి

**3-6-1912**

ఎంతో విపులంగా, ఆసక్తిజనకంగా ఎన్నో సూచనలతో మీరువ్రాసిన లేఖ అందింది. అనేక ధన్యవాదాలు. నేనంత వివరంగా మీకు జాబు వ్రాయనక్కర లేదనుకుంటున్నాను మీరు మిడిల్‌మాస్టును చూడదలుచుకున్నట్లు ఆయనకి యిపుడే ఉత్తరం వ్రాశాను. ఉద్యమం పురోగతి చెందుతున్నదని తెలియచేశాను. ఇదివరకువలెకాక కొందరు ఈ ఉద్యమాన్ని అవహేళన చేయక, సానుభూతితో దానిని అర్థంచేసుకుందుకు, ప్రయత్నిస్తున్నట్లు నామిత్రులు మచిలీపట్నంనుంచి నాకు ఉత్తరాలు వ్రాస్తున్నారు. అవహేళన దశనుంచి ఉద్యమం సానుభూతిని పొందేదశకు పరిణతి చెందుతున్నందుకు సంతోషం. మీరు ఎదుర్కొనవలసివస్తున్న ప్రతిఘటన సామాన్యమైనది కాదు.

ఉదయం ఆరున్నర మొదలు మధ్యాహ్నం రెండు గంటల వరకు మిస్టర్ మిడిల్ మాస్టు తనపనిలో తాను నిమగ్నమైవుంటాడు. పిమ్మట గోల్ఫుఆటకు బయలుదేరతాడు. ఊటీ క్లబ్బులో ఆయన ఆగబోతున్నాడు. ముందు మీరు వొక ఉత్తరం వ్రాసి తనను ఏసమయంలో కలియ వీలున్నదో ఆయన్నే సూచించమని అడగండి.

నాకు మీఉత్తరం అందిన వెనువెంటనే, శ్రీయంగ్‌ను కలుసుకున్నాను. ఆయన మీకు జాబు వ్రాస్తానన్నాడు. మీఉత్తరం చదవమని నిన్న పొద్దున్న ఆయనకి పంపించాను. శ్రీయంగ్ శ్రద్ధకలవ్యక్తి అభిరుచివున్నవాడు. సందేహం లేదు; కానికాస్త వయసుమళ్ళిన తన పైఉద్యోగులూ మతాచార్యలూ మార్పుకు కేవలం విముఖులట. మతం ఏదైనా ఏమతశాఖయినా, కలకాలం ఛాందసత్వాన్ని అట్టే పెట్టుకోవాలనుకుంటుంది!

పి.టి.యస్. నావ్యాసాన్ని నాకు పంపించారు. దానిని నేను ప్రచురణార్థం ది మెయిలు పత్రికా సంపాదకునికి అందచేశాను. ఇంకా అనేక వ్యాసాలు పంపించగలమని ముఖ్యంగా మీరు కొన్ని వ్యాసాలు వ్రాస్తారని తెలుపుతూ ఆయనకొక దీర్ఘమైన లేఖను వ్రాశాను పరిషత్తువారు టి.బి.సి.ని పూర్తిగ తాము స్వాధీనపరుచుకోవాలని వాంఛించారని ఆయన కెరుకపరచాను. నిజానికి అప్పుడే వారు దానిని ఆక్రమించుకున్న ప్రమాదం సంభవించింది. కొంతకాలమై నాకు తెలుగు పుస్తకాలేవీ అందడం లేదు.

గ్రంథరచనలో ఏమాత్రం సంస్కరణ అగుపించినా, అవహేళన చేయడమే, రామయ్య సుబ్బారావుల పని. విద్యావిషయికంగా ఒక పుస్తకం మంచిదో చెడ్డదో అర్థం చేసుకుందుకు వారికి శక్తిలేదు. సంస్కరణవాదులు కొత్త

పుస్తకాలను అంగీకరింపచేయడానికి డి.పి.ఐ అనుమతిని పొందవలసి వుంటుంది. కనక అక్కడసైతం ఒక వల వుండనేవుంది. డి.పి.ఐ ఆ పుస్తకాలను పరిశీలించమని టి.బి.సి కార్యదర్శికి పంపుతాడు. అతను వాటిని చూడమని తలకిందులుగా ఆలోచించే వక్రభాష్యాలు చెప్పే..... రామయ్య సుబ్బారావులకు పంపిస్తాడు. తాము నిజంగా వీటిని అడ్డుకోగలమనే ఊహతో ఆ ఇద్దరూ అనేక ఆటంకాలను కలిగించవోతారు. తెలుగు పుస్తకాలను పరిశీలనార్థం పి.టి.యస్‌కి, నాకు పంపమని పట్టుపట్టాలను కుంటున్నాను. ముఖ్యంగా ప్రాధమిక పాఠశాలలో వేసే జాగ్రఫీ, లెక్కలు మొదలైన పుస్తకాలు జాగ్రత్తగా పరిశీలించడం అవసరం.

నే నీమధ్య ఊటీ రావడం పడదు. వచ్చినట్లయితే ఎక్‌హిల్ హౌస్‌లో మిమ్మల్ని తప్పక కలుసుకుంటాను.

పి.యస్ : లాసన్ నావ్యాసాన్ని ప్రచురించినట్లయితే, నేను వ్రాసినట్లు వెల్లడిచేయకండి. ఇంతకూ ఈ విషయంలో ఇలా వుండాలని నిరూపణ చేయక, కేవలం మీవాదముతో ఏకీభవిస్తూనే నావ్యాసాన్ని వ్రాశాను. కావ్యాలలో శృంగారరస విషయమై సుబ్బారావు ప్రభృతుల వాదాన్ని తలుచుకుంటున్న కొద్దీ, వారి అవివేకానికి మూర్ఖత్వానికి నవ్వు వస్తోంది!

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ.

కోటగిరి
14-6-1912

నిన్నమీరు దయతో వ్రాసినలేఖ అందింది. సంతోషం. నావ్యాసాన్ని సంపాదక లేఖగా పత్రికలో ప్రకటించగలనని లాసన్ జాబువ్రాశాడు. ఇక ఈ విషయంమీద ఉత్తర ప్రత్యుత్తరాలు ప్రచురించడానికి ఆయనకు ఇష్టంలేదు. కాని తెలుగు భాషాసాహిత్య సంస్కరణను గురించి ఎన్ని వ్యాసాలు వ్రాసినా. తాను కృతజ్ఞతతో సంతోషంతో అచ్చు వేయగలనని తెలియచేశాడు. పోయిన శనివారం నావ్యాసపు ప్రూఫులను పంపించాడు. దిద్ది వెంటనే పోస్టుచేశాను. నాలేఖలో శృంగార రసచర్చకు సంబంధించిన భాగం ఆయన్ని అమితంగా ఆకర్షించింది. కాని వ్యాసం ఘాటుగా వుందట. అయినా సబబుగానే వ్రాశానట అందులో నేను పేర్కొన్న విషయాలు తేటపడేటందుకు తనకు కొన్ని తెలుగు పద్యాలు అనువదింపచేసి పంపించమని కోరాడు. ఈసంగతి శ్రీరామమూర్తి పంతులుగారికి ఎరుక పరచాను. పాఠశాలల్లో విద్యార్థులకు వేయతగనివీ, రెండవ ఛార్లెస్‌వంటి రాజుల ఆస్థానంలో తలలు ఊపుతూ మెచ్చుకోతగినవీ, కొన్ని శృంగార పద్యాలను అనువదించి పంపించమని ఆయనకి ఉత్తరం వ్రాశాను! ఈవిషయంలో మనం మన దృక్పథాన్ని పూర్తిగా తేటపరిచినట్లయితే, లాసన్ అవునని అంగీకరింపక తప్పదు. అపుడు ఆయన తెలుగ భాషా సంస్కరణపు మూలసిద్ధాంతాలను సానుభూతితో అర్థంచేసుకుందుకు ఉత్సాహపడతారు.

ఇప్పట్లో నారాయణమూర్తి వ్యాసం లాసన్ అచ్చు వేయకపోతే, నే నాశ్చర్యపడను. తెలుగుభాష సంస్కృతజన్యమని రుజువు చేయడానికి వ్యాసంవ్రాసి పరిషత్సమావేశంలో చదివింది ఆయనే కదూ?

ఆ ఇద్దరు గౌరవనీయుల వాదనను కాదని మీరు విజయం సాధించినందుకు నేను మిక్కిలి సంతోషిస్తున్నాను. శ్రీరామచంద్రరావుగారిని నేనెరగను. కాని శ్రీ బి.యస్. శర్మగారిని బాగా ఎరుగుదును. ఆయన భాషా విషయాలను తరచి చూసిన వ్యక్తి అని నాకెంతమాత్రం నమ్మకం లేదు. పరిషత్తువారు రాయబార సన్నాహాలను కావిస్తున్నారని విని 'ఆహా' అనుకున్నాను.

అన్నట్టు చెప్పటం మరిచాను ఇక్కడికి మొన్న శ్రీమిడిల్ మాస్ట హంటర్‌లు వచ్చారు శ్రీ మిడిల్ మాస్టు ఆదివారం మద్రాసు వెళతాడు అందువల్ల ఆయన్ని కలుసుకోడానికి మీకు వీలుండదనుకుంటాను కాని మీరు ఎదురుచూస్తున్న నివేదిక అందిన వెంటనే ఆయనకు పంపించండి ఆయనకి మనవాదన పూర్తిగా న్యాయమనిపించింది సంస్కరణవాదులకు తాను యివ్వగలిగినంత స్వేచ్ఛను ఇవ్వడానికి ఆయన సముఖుడు

ప్రస్తుత వాచకములపై మీరు కావించిన విమర్శకు సంతోషం తెలుగు బై బిలును గురించి తనకు తెలిసిన సమాచారాన్ని మీకు పంపించమని శ్రీ యంగ్‌కు ఉత్తరం వ్రాస్తున్నాను మీవ్యాసాలు ప్రచురితమౌతున్న పత్రికలు నాదగ్గర వుండడం మంచిది అందువల్ల దయచేసి వ్యాసాలు ప్రకటించే ముందు నాకు తెలియచేయండి

నేనిక్కడనుంచి అదివారం పొద్దున్న బయలుదేరుతున్నాను ఉత్తరాలు కుంభకోణానికి వ్రాయండి శ్రీమిడిల్ మాస్టును ఆయన వెళ్ళేలోపున మీరే కలియడం పడకపోతే తరవాతనైనా మద్రాసులో కలుసుకుంటారుకదూ?

కుంభకోణం

5-7-12

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

నాకు మిక్కిలి ఉత్సాహాన్ని కలిగించే విపులమైన మీ లేఖ అందింది అనేక ధన్యవాదాలు మీ ఉత్తరంలోని సమాచారం అమూల్యమైనది దానిని నేను కాదనలేను

అవును మీరన్నట్లు భాషావిషయంలో ఆ వ్యక్తులకున్న లజ్ఞానానికీ మూర్ఖపు టభిప్రాయాలకి మితిలేదు మీ ఇంటర్వ్యూల విషయం తెలుసుకుని ఎంతో ఆనందించాను వాటివల్ల కొంత సత్ఫలితం కలుగుతుందని ఆశిస్తున్నాను అయితే గవర్నరు కాకినాడ వెళ్లేలోపున ఒకకరపత్రం వ్రాసి సిద్ధపరచడం సాధ్యం కాదనుకొంటాను కాని ఆయన్ని విశాఖపట్నంలో ఒక రాయభారవర్గం కలుసుకుని విషయాన్ని విడమర్చి చెప్పేందుకు వీలువుంటుందని ఊహిస్తున్నాను పి టి యస్ జి వి ఆర్‌లు సమర్థులు వారిలో ఎవరైనా గవర్నరును విశాఖపట్నంలో కలుసుకుంటారని ఆశిస్తున్నాను

ఈమధ్య నాకు పనిఎక్కువయింది తీరికలేదు అందువల్ల భాషాసమస్యలపట్ల శ్రద్ధ వహించలేకపోతున్నాను అతిత్వరలో తీరిక చిక్కించుకుని ఈ రంగంలో మీతోపాటు నేను చురుకుగా కృషి చేయగలనని అనుకుంటున్నాను నా పత్రాన్ని మీకు పంపిస్తాను నాదగ్గర మరొక ప్రతి లేదనుకుంటాను అయినాసరే దీన్ని మీకిష్టమొచ్చినన్నాళ్ళు మీదగ్గర వుంచండి నాకవసరమైతే ఇద్దరుగాని

నాకు మీరు ఉత్తరంవ్రాసిన రోజునే మీకు నేను ఉత్తరం వ్రాశాను అది ఈపాటికి మీకు అందేవుంటుంది శ్రీనివాస అయ్యంగారు ఉద్యమాన్ని బలపరిచే ప్రముఖులని విని సంతోషిస్తున్నాను ఆయన పేరు వినడమేకాని ఆయనతో నాకు పరిచయంలేదు

అనేక ప్రణామాలతో ఇక నా ఉత్తరాన్ని ముగిస్తున్నాను

* * *

కుంభకోణం
8-9-1912

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీరు వ్రాసిన సుదీర్ఘమైన లేఖ అందింది. మీ సమాధానం చదివి ఆనందించాను. దాన్ని త్వరలోనే గవర్నరుకు అందచేస్తారని ఆశిస్తున్నాను. పరిషత్తువారి విజ్ఞప్తిపత్రములో పరస్పరవిరుద్ధభావాలు వున్నాయని నేను గమనించాను. వాడుకభాషకొక అపార్థమును కల్పించి, ఉద్యమాన్ని అరికట్టడానికి పరిషత్తువారు శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. కాని మీ వాదమును ఎవరూ తొసిరాజన లేరు. మీ ఉపయోగార్థము ఈ లేఖతోపాటు కొన్ని పేపరు కత్తిరింపులు పంపుతున్నాను. మీ రారోగ్యముగా వున్నారని తలుస్తాను. జాబు వ్రాయండి.

మకాం. మంగుళూరు
19-10-15

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీరు దయతో వ్రాసిన ఉత్తరానికి వెంటనే సమాధాన మీయనందుకు నన్ను మన్నించ కోరుతున్నాను. మీరు పంపిన అత్యంత అమూల్యమైన మీ పరిశీలన గ్రంథము అందింది. అనేక అభినందనాలు. భాషాశాస్త్రదృష్ట్యా అది తిరుగులేనట్టిది. మీరు మీపరిశీలనలో పూర్వపక్షమునకు తావివ్వని సిద్ధాంతాలను ప్రతిపాదించారు. మీ పుస్తకమును నేను మిక్కిలి ఆసక్తితో పఠించాను. ద్వితీయభాగం ఎపుడు వెలువడునో అని ఆతృతతో నిరీక్షిస్తున్నాను. త్వరలోనే వెలువడుతుంది కదూ?

నిరంతరం పరి చేయడం వల్ల మీఆరోగ్యం సడలినందుకు ఎంతో విచారిస్తున్నాను. పాండిత్యమునకు తార్కాణమైన అటువంటి ఉత్తమోత్తమ గ్రంథమును రచించేటపుడు మీరు ఎంతశ్రమపడిరో, నేనూహించుకో గలను. ఇపుడు మీకు కాస్త మిసారిగా వుందనుకుంటాను.

మీ పుస్తకము వెల ఎంతో తెలియదు. అమ్మకానికి ఉద్దేశించినట్లయితే, నాకు ఒకటి రెండు ప్రతులను పంపండి. నేనిక్కడికి వస్తున్నపుడు నాతోపాటు రైలులో దంపతులిద్దరు ప్రయాణం చేశారు. ఆయన ఒక లండను సివిల్ సర్వెంటు. ఆవిడ అరబిక్ భాషలో పండితురాలు. భాషనుగురించి మేం, ఎన్నో విషయాలను చర్చించుకున్నాము. మీ గ్రంథానుబంధములో మీరు ఎత్తివ్రాసిన విషయాలన్నీ వాస్తవమని ఆవిడ దృఢపరిచింది.

కెయిరోలో నాసహాధ్యాయి ఒకాయన క్రైస్తవమతాచార్యునిగ వుంటున్నాడు. ఇపుడాయన వ్యావహారిక భాషా వాది అని ఆవిడ నాతో చెప్పింది. నాసహాధ్యాయి చాల తెలివైనవాడు. తన నిర్వహణలోవున్న పాఠశాలలలో ఆధునిక అరబిక్ భాషాగ్రంథాలను బోధించవలెనని ఆయన ఆదేశించాడు, భారతదేశ వ్యావహారిక భాషలను గురించి తప్పక కొంత భోగట్టా పంపగలనని ఆయనకు వాగ్దానం చేశాను. మీరు రచించిన ఈ పుస్తకమును ఆయనకు పంపవలెనని నాఅభిలాష.

ఎ గెలిటీ

ఎంజలిస్ హోటల్

25-12-09

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు 22 వ తేదీన వ్రాసినలేఖను ప్రభుత్వప్రధాన కార్యదర్శికి పంపించాను మీ కన్యాశుల్కము నాటకాన్నినేనెన్నో ఏళ్ళక్రితం చదివాను వాడుక భాషలోవున్న ఆ నాటకం రెండవసారి అచ్చుపడినందుకు చాల సంతోషం పదముల ఉచ్చారణనుబట్టి అక్షరములమీద మీరు సంజ్ఞలు వుంచారు విడిగావున్న అ కు అచ్చులతో కూడివున్న అకు ఉచ్చారణలోగల భేదాన్ని మీరు గుర్తించారు జర్మనులు దీనిని వలె వ్రాసి ఈ భేదాన్ని సూచిస్తారు

కొన్నేళ్ళక్రితం నేను వాడుకభాషలో వ్రాసిన చిన్న కరపత్రాన్ని మీకీ లేఖతోపాటు పంపిస్తున్నాను రోమనులిపిలో వ్రాయడం నాకు సులువనిపించింది దానిని మా మున్షీ తెలుగు లిపిలోనికి మార్చాడు తెలుగు లిపిలోకంటె రోమను లిపిలో వ్రాయడం సులభం సులభమేకాక వేగంగా వ్రాయవచ్చును కన్యాశుల్కము యింకొక ముద్రణ రోమనులిపిలో ధ్వని ఉచ్చారణాది భేదాలను సూచిస్తూ అచ్చుపడితే బాగుండును

* *

సిర్లిస్ గార్డెన్స్

1910 జనవరి 16

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు 4 14 వ తేదీలలో వ్రాసిన ఉత్తరాలకు ఎంతో కృతజ్ఞుణ్ణి మీరు పంపిన గీతాలు అందాయి సంతోషం నేను ఉద్యోగిని కనక వివాదగ్రస్త విషయాలను చర్చిస్తూ ఉత్తరాలు వ్రాయకూడదు మాతృభాషలు కళాశాలల్లో మాతృభాషల అధ్యయనం గురించి మీరు జనవరి 4 వ తేదీన వ్రాసిన లేఖ లార్డు మార్లేకు ఆసక్తి కలిగించవచ్చును మీకు అభ్యంతరం లేకపోతే మీ ఉత్తరాన్ని ఆయనకు పంపిస్తాను

* * *

శ్రీ ఇ. డబ్ల్యు మిడిల్ మాస్టు

మదరాసు

8 ఏప్రియల్ 1913

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు మార్చి 28 వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది ఈనెల 29 వ తేదీన సిండికేటు సమావేశం జరుగుతుంది ఆసమావేశంలో అన్ని బోర్డాఫ్ స్టడీస్‌ల విధానాలు రూపొందుతాయి నేనా సమయంలో ఉదక మండలంలో వుంటాను కనక సమావేశానికి హాజరు కాగలనో లేనో ఇప్పుడప్పుడే చెప్పలేను హాజరైతేమాత్రం మీ

ప్రతిపాదనలపట్ల విధిగా శ్రద్ధ వహిస్తాను కాని అవి అన్నీ అంగీకృతమౌతాయో లేవో నాకు సందేహం నిబంధనలను అనుసరించి బోర్డులు పన్నెండుగురు సభ్యులకే పరిమితం తగినంత కారణం వుంటే తప్ప పాత సభ్యులనే నామినేట్ చేస్తారు ఇది ఒక ఆచారం

సంస్కృతభాషలో డాక్టర్‌హుల్ మంచి పండితుడేనా? సమర్థుడే నంటారా? మీరు కోరుతున్నట్లు సంస్కృత ఉత్కళ బర్మీస్‌లను వేరువేరు శాఖలగా విడదీయడానికి నిబంధనలు మారవలసి వుంటుంది అవి మార్చుకోనిదే ఇందుకు వీలులేదు దేనికది విడదీయమని బోర్డు తనంతతాను ప్రతిపాదించడం మంచిదని నాఊహ

12 వ తేదీన ఉదకమండలం వెళుతున్నాను అక్కడ క్లబ్‌లో నాబస

* * *

ఉదక మండలం
16 మే 1913

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

పిటెండ్రి జాన్స్ మెఫైల స్థానంలో స్కిన్నర్ మొఫాటు మార్కుహంటర్లను సిండికేటుకు నేను నామినేటు చేస్తున్నాను స్కిన్నరు నియామకవిషయంలో అతని అర్హతలు మీకు వేరే చెప్పనక్కరలేదు మొఫాటు విషయం కొంచెం చెప్పవలసివుంటుంది సిండికేటులో సైన్సు చక్కగా తెలిసిన వ్యక్తి వుండడం అవసరం జాన్స్ స్థానంలో నియమితుడు కావడానికి అతను అర్హుడు మెఫైల్ స్థానంలో వుండతగ్గ వ్యక్తి హంటరు సిండికేటు కమిటీలలో అతనివలె ఇతను తన విధులను తాను చాకచక్యంగా నిర్వర్తించగలడు

ఇక సిండికేటు, స్కిన్నర్ మెఫాటులతో పాటు శేషగిరి అయ్యరునుకూడా నామినేటు చేస్తున్నది శేషగిరి అయ్యరును అది ఎందుకు నియమిస్తున్నదో నాకర్థం కావడంలేదు ఆయన విశ్వవిద్యాలయానికి ప్రత్యేకంగా చేసిన సేవ ఏమీలేదు పోనీ చెప్పుకోతగ్గ విద్యా వైదుష్యమూ కనిపించదు ఏ బోర్డాఫ్ స్టడీస్‌లోను ఈయన సభ్యుడు కాదు కేవలం ఆయన ఫేకల్టీ ఆఫ్ లా సభ్యుడు మాత్రమే దానికి ప్రతినిధులుగ సిండుకేటులో వైస్‌ఛాన్సలర్ సుందరం అయ్యరులు వుండనే వున్నారు సెనేటులోను తదితరచోట్ల ఆయన కావిస్తున్న ప్రసంగాలు చూస్తూవుంటే ఆయనకు విశ్వవిద్యాలయపు సమస్యల పట్ల తగిన జ్ఞానం ఉన్నట్లు నాకు తోచడంలేదు

హంటరు అలాకాదు అతనికి విశ్వవిద్యాలయ సమస్యలు క్షుణ్ణంగా తెలుసును వ్యవహారాలతో సన్నిహితసంబంధంవుంది విశ్వవిద్యాలయపు సేవలోనే తనశక్తిని కాలాన్ని వినియోగిస్తున్నాడు ఇంగ్లీషు బోర్డాఫ్ స్టడీస్‌కు ఆయన అధ్యక్షుడు లిటరరీ కమిటీకి కన్వీనరు ఈ మధ్య సెనేటు నియమించిన ఇంచుమించు అన్ని ముఖ్య కమిటీలలోను అతను సభ్యుడు అనేక సందర్భాలలో నివేదికలను తయారు చేయవలసినదిగా అతన్ని సెనేటు కోరుతూవచ్చింది సిండికేటుకు వివిధ కమిటీల కార్యకలాపాలలో అతను సహాయపడుతూ వచ్చాడు తాను ఒక నిర్ణయానికి వచ్చేముందు సిండెకేటు, హంటర్ అభిప్రాయాన్ని తెలుసుకుంటూ వుండేది వీటినన్నిటిని మించిన అర్హత ఇంకొకటి హంటర్ ఆంగ్లభాషా నిష్ణాతుడు అతన్ని ఒక ప్రామాణికునిగా అందరూ ఒప్పుకుంటారు

మీరు నాతో ఏకీభవిస్తారని ఆశిస్తున్నాను స్కిన్నర్ మొఘాటు హంటరులకు అనుకూలంగా మీరు ఓటు చేస్తారని విశ్వసిస్తున్నాను

* * *

దిక్లబ్ ఉదకమండలం
24 మే 1913

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు హంటర్‌కు ఓటు వేస్తానన్నందుకు నాధన్యవాదాలు నేను నామినేటు చేస్తున్న మిగిలిన ఇద్దరిలోనూ డాక్టర్ స్కిన్నర్ విశ్వవిద్యాలయ వ్యవహారాలతో మరీ సమర్థుడు సిండికేటు పనులను నిర్వహించగల దక్షుడు అతనికి కావలసినంత అనుభవం వుంది అతిబాధ్యతాయుత పదవిలో వున్నవ్యక్తి మిమ్మల్ని నేను ఉదకమండలంలో త్వరలోనే కలుసుకోగలనని ఆశిస్తున్నాను డాక్టర్ రంగప్ప శ్రీ రామానుజాచారిగార్ల ఓట్లు హంటర్‌కు పడేటట్టు మీరు చూడగలిగితే అద్భుతం స్వతంత్రంగా ఆలోచించి తమకు ఉచితమని తోచినవిధంగా మాత్రమే భారతీయులు వ్యవహరిస్తే మంచిది

* * *

శ్రీ హారాల్డు స్టూవర్టు

అడయార్ మద్రాసు
11 డిసెంబరు 13

ప్రియమైన అయ్యా

నేను జనవరి 30 31వ తేదీలలో వాల్తేరులో వుంటాను విజయనగరం రావలెనని అనుకోవడంలేదు వాల్తేరులో నన్ను ఏరోజున ఏసమయంలో కలుసుకుందుకు మీకు వీలున్నదో తెలియచేస్తే నేను తీరిక చేసుకుంటాను

అడయార్ మద్రాసు
19 మార్చి 1914

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు పంపిన వ్యాసములు తెలుగు కథ అందాయి తెలుగు కథను చదివి ఆధునిక తెలుగుభాష గుణయోగ్యతలను గ్రహించుటకు ప్రయత్నిస్తాను

ఆంతరంగిక కార్యదర్శి

ప్రభుత్వ భవనం
మద్రాసు
30 జనవరి 1913

ప్రియమైన అయ్యా

మిమ్ము మద్రాసు విశ్వవిద్యాలయపు ఫెలోగా నామినేటు చేయ ఉద్దేశించినట్లు తమకు తెలుపవలసినదిగా గవర్నరు నన్ను ఆదేశించారు అందుకు మీరు అంగీకరించి ఆఫీసు బాధ్యతలను స్వీకరించెదరని నమ్ముతున్నాను

మీరంగీకరించినట్లయితే మీపూర్తిపేరు తెలుప కోరిక. అలా అయినట్లయిన గెజెటులో ఈ విషయం ప్రకటించే ఏర్పాట్లు చేయడానికి నాకవకాశం కలుగుతుంది.

* * *

శ్రీ మార్కు హంటరు

శాన్‌థోమ్, మద్రాసు
20-10-12

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరీపాటికి చెన్నపట్నం వచ్చివుంటారు. ఈ వారం లోపు ఏదోఒక రోజున నన్ను కలుసుకుందుకు మీకు తీరిక వుంటుందనుకుంటాను. వీలయితే మనం సెనేటు సమావేశానికి ముందు కలుసుకోవడం మంచిది. ఎలాగైనా తమ కనుకూలమైన పండితులను చొరబెట్టాలనే శ్రీ శేషగిరి అయ్యరుగారి ప్రయత్నం నెరవేరదు. మంచిపనికి అడ్డు తగలకపోవడమే, పండితులు చేసే ఉపకారం.

సిండికేటు ఈసారి అతి ప్రధానమైన ప్రతిపాదనలను చర్చించబోతున్నది. భారతీయ భాషలను గురించి ఎవరూ క్షుణ్ణంగా ఆలోచిస్తున్నట్లు కనిపించదు. ఇంతవరకు 'ఎల్'ను ఫెల్లోగా గవర్నరు నామినేటు చేయలేదనుకుంటాను. ఇది అవసరమని గవర్నరుకు బోధపడినట్లు లేదు. ఆంధ్రులలో యూరోపియనులలో తగిన సమర్థులు వున్నారు మీరొకసారి వస్తే మనం మాట్లాడుకోవచ్చు.

* * *

శాన్‌థోమ్, మద్రాసు
9-2-13

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీ ఉత్తరం అందింది. ఇంతకుమునుపే, నేను మీకు సమాధానం వ్రాద్దామనుకున్నాను. కాని వీలుపడింది కాదు. మీ 'నోటు' చదివాను. మిడిల్ మాస్టుకి పంపించాను. ఆయన చదివి, దాన్ని రిజిస్ట్రారుకు పంపించారు. అది యిప్పుడు ఆచ్చులోవుంది. ఆ పనికి ఎవరు అర్హులో రేపు ఆయనతో ఆలోచిస్తాను.

ఫెల్లో ఆఫ్ ది యూనివర్సిటీగా మిమ్మల్ని నామినేటు చేసినందుకు సంతోషం. ఇందులో ఏ రాజకీయపు కారణాలు లేవు. కేవలం మీ పాండిత్యాన్ని ప్రతిభను పురస్కరించుకుని మీరు నామినేటయ్యారు. మీకు నా హృదయపూర్వక అభివందనాలు. వచ్చే సెనేటు సమావేశంలో భాషాసమస్య చర్చకు వస్తుంది. సమావేశం మార్చినెలలో జరుగుతుంది. చర్చలలో మీరు పాల్గొనడం వల్ల చాలా మేలు చేకూరుతుంది. విశ్వ విద్యాలయానికి ప్రభుత్వం మంజూరుచేసిన ధనాన్ని ఎలా వినియోగించాలో నివేదికలో లేదు. శ్రీ రామలింగారెడ్డి అభ్యంతరంవల్ల మంజూరయిన ధనం అలాగే వుండిపోయింది. శ్రీ శేషగిరి అయ్యరు ప్రభృతులు సూచించిన పద్ధతులపై భాషాధ్యయన విధానాలను మార్చకూడదని, కమిటీ యిటీవల తన నివేదికలో స్పష్టపరిచింది: "అలాంటి పద్ధతుల వల్ల మార్పులవల్ల నిజమైన అభివృద్ధిని సాధించడం సాధ్యంకాదు." మీరు సూచించిన పద్ధతులు అభిలషణీయంగా నాకు తోస్తున్నవి. సమావేశానికి ముందుగా మనం ఒకసారి కలుసుకోవడం అవసరమను కుంటున్నాను. వెంటనే జాబు వ్రాయగలరని ఆశిస్తున్నాను.

♦ ♦ ♦

శ్రీ థామ్సన్

వార్డెన్స్ లాడ్జి
మదరాసు యస్ ఇ
20-2-12

ప్రియమైన అయ్యా

మీరు దయతోపంపిన మీ హాస్యరస ప్రధానమైన నాటకం అందింది కృతజ్ఞుణ్ణి తెలుగు భాషారంగంలో సంస్కరణవాదులకు సనాతనవాదులకు జరుగుతున్న వాదాన్ని నేను కొంతవరకు అర్థంచేసుకోగలిగాను సంస్కారులు విద్యావంతులు మాటలాడుకునే శిష్ట వ్యావహారిక భాషలో వచన గ్రంథములు వ్రాయవలెననే మీ వాదము న్యాయమైనది సశాస్త్రీయమైనది

*  *  *

వార్డెన్స్ లాడ్జి
మదరాసు యస్ ఇ
13-11-13

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీ అభివందనాలకు సర్వదాకృతజ్ఞుణ్ణి నేను నూతన దృష్టితో, నిష్పక్షపాతబుద్ధితో భాషాసమస్యను పరిశీలించితినని మీరు అభిప్రాయ పడుతున్నందుకు సంతోషం గ్రాంధిక భాషా వాదులైన పండితులుకూడా అదే రీతిగ భావించాలని నా కోరిక

*  *  *

వార్డెన్స్ గార్డెన్స్
మదరాసు యస్ ఇ
16-11-13

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు 10వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది ధన్యవాదాలు భాషావివాదంలో కమిటీ సభ్యులకు సంతృప్తికరమైన రాజీ కుదురబోతున్నదని తెలుసుకుని నేనెంతో సంతోషించాను

పి యస్ పై వాక్యములు ముంగించేసరికి .. ఉత్తరంలో నేను జతచేసిన పేపరుకత్తిరింపులను చూడడం తటస్థించింది అవసరమనుకుంటే సమాధానం యివ్వడానికి మీకు ఉపకరిస్తాయని వాటిని మీకు పంపిస్తున్నాను

♦ ♦ ♦

ఫ్రాన్సిస్

సెనేటు హౌస్
మదరాసు
27-14-1914

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు 26 వ తేదీన వ్రాసిన లేఖను అనుసరించి మీ రిమార్కుల ప్రూఫును ఆఫీసులో అందరూ చదివారు అది చాలా స్పష్టంగావుంది కొన్ని టైపు తప్పులుమాత్రం అక్కడక్కడ దొర్లాయి పూర్తి డాక్యుమెంటు వచ్చేవారం పంపగల ననుకుంటున్నాను

* * *

సెనేటు హౌసు
మదరాసు
22-9-1914

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు మూడవ తేదీన వ్రాసిన లేఖకు ఇంతవరకు జాబు వ్రాయలేకపోయాను తెలుగు ఇంటర్మీడియటు కాంపొజిషను ప్రతులు అచ్చాఫీసునుంచి ఇప్పుడే అందాయి ఈ విషయంపట్ల ఆసక్తివున్న విశ్వవిద్యాలయానికి సంబంధించిన వ్యక్తులకు వాటిని పంపిస్తాను ఆఫీసు హోదాలో మరెవరికి వాటిని నేను పంపకూడదు అందువల్ల మీరు వారికి ప్రతులను పంపించండి మీరు కోరినన్ని ప్రతులను నేను మీకు అందచేస్తాను తెలుగు పాఠ్యగ్రంథాల విషయమై మీరు వ్రాసిన లేఖకు ఆఫీసు పద్ధతి ప్రకారం నేను ఇచ్చిన సమాధానాన్ని శ్రీ వెంకటరంగారావు మీకు తెలియచేశారనుకుంటాను ప్రధాన సంపాదకుడో సంపాదకవర సంఘమో ఈ సమస్యను పునఃపరిశీలించమని కోరితే తప్ప నేను తిరిగి ఈ విషయాన్ని చర్చకు తీసుకురాలేను మీరు మీ సూచనలను కాస్త వ్యవధివుండగా పంపించి వుంటే చాలా బాగుండేది

* *

సెనేటు హౌసు
మదరాసు
30-10-1914

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

మీరు 29 వ తేదీన వ్రాసిన లేఖ అందింది గత కొన్ని సంవత్సరాల మెట్రిక్ పాఠ్యగ్రంథాలను గురించి ముందు అనుకున్నట్లుగా మీరు నివేదికను తయారు చేయనవసరం లేదనుకుంటాను సిండికేటు ఉద్దేశించినదేదో అది సిద్ధించింది మాతృ భాషలలో అన్ని పాఠ్యగ్రంథాలను ఇక ముందు విశ్వవిద్యాలయం ప్రచురిస్తుంది ఎట్టిచర్య తీసుకోనక్కరలేదనే సూచనలను సిండికేటు కమిటీ ఆమోదించింది

* * *

జె.డబ్ల్యు.రీస్
17 పాల్ మాల్

యస్.డబ్ల్యు. లండన్
7 ఫిబ్రవరి 1904

ప్రియమైన అయ్యా,

మీరు వ్రాసిన లేఖ అందింది. అనేక ధన్యవాదాలు. మిమ్మల్ని నేను మరువలేదు. మీకు నాకు బాగా జ్ఞాపకం. నాతో సహకరిస్తానని మీరిచ్చిన వాగ్దానానికి కృతజ్ఞుణ్ణి. మీ కథలు పంపకోరిక. నాకవి నచ్చినట్లయితే ఆంగ్ల పాఠకులకు నచ్చినట్లే. త్వరలో మీ కథలను చదవకోరుతున్నాను.

♦ ♦ ♦

మాక్స్ పెంబర్టన్

56, ఫిట్జుజాన్స్ ఎవిన్యూ
హేంప్‌స్టెడ్
నవంబరు 29, 1904

ప్రియమైన అయ్యా,

దయతో మీరు వ్రాసిన లేఖలకు ఎంతో సంతోషించాను; దురదృష్టవశాత్తు ప్రస్తుతం అదనంగా ఏపని చేయాలన్నా అవకాశం లేకుండావుంది. కొంతకాలంవరకు నేననుకున్న వేవీ నెరవేరవు.

భారతీయ జీవితాన్ని ప్రతిబింబించే కథలు పంపించగలరా? కొన్ని కథలు పంపినట్లయితే కృతజ్ఞుణ్ణి; అయిదువేల మాటలకంటె ఎక్కువకాకుండా వ్రాయండి. మా పద్ధతికి సరి పడకపోయినట్లయితే అక్కడక్కడ కొద్దిగా మార్చవలసి వుంటుంది. ఇందుకు మీరు అనుమతిస్తారనుకుంటాను.

* * *

హెచ్.డి. డరెల్

38 లాంగ్ రిడ్జి రోడ్డు
లండను, యస్. డబ్ల్యు
అక్టోబరు 20, 1914

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

దయతో మీరు వ్రాసిన ఉత్తరం అందింది. కృతజ్ఞుణ్ణి; మీకు అస్వస్థతగా వున్నందుకు నాకెంతో దిగులుగావుంది. ఈ సరికి కొంత నయమైవుంటుంది. రుతువు మారుతున్నది కనుకవచ్చే శీతాకాలం గడిచేసరికి మీకు నిమ్మళిస్తుంది. పూర్తిగా కోలుకుని ఎప్పటిలా మీరు హాయిగావుంటారు. భయంకరసంఘటనలతో నిరంతర ఆందోళనలతో జీవితం నిండివుంది. అది తప్ప అంతా మామూలుగానే వుంది. నేను కులాసాగా వున్నాను.

మీరడిగిన సమాచారం త్వరలోనే మీకు తెలుపుతాను. నా స్నేహితుని ఉత్తరంకోసం ఎదురు చూస్తున్నాను. త్వరలోనే అన్నాను కాని త్వరలో ఏమౌతుందో ఎవరికెరుక? భవిష్యత్తు ఏమి ప్రసాదించనున్నదో ఎవరమూ చెప్పలేము. పారిస్‌లో వున్న నా స్నేహితుడు అసాధారణ బాధ్యతను నిర్వహిస్తున్నాడు. సరాసరి యుద్ధరంగంతో అతనికి ప్రత్యక్షసంబంధం వుంది. సైనికదళాలకు అధ్వర్యం వహిస్తున్నాడు. తుపాకులతో పని. ఇంతవరకు క్షేమంగానే వున్నాడు. మొన్నను ఆ మధ్య అతనికి విరేచనాలు పట్టుకున్నాయి. అయితే అదృష్టవశాత్తు అది ఆసియావాసులకు వచ్చేమాదిరిది కాదు. కాని అతని పరిస్థితి ఎప్పుడూ ప్రమాదకరమే కదా!

నేను ఫ్రాన్సునుంచి ఇక్కడికి వచ్చి పదిహేనురోజులయింది. అక్కడ వున్ననాళ్లు ఎక్కువకాలం పారిస్‌లో గడిపాను. నాకు రెడ్‌క్రాస్ కమిటీలో పని. ఇక యిక్కడ అట్టే రోజులు వుండను. నాలుగయిదురోజుల్లో బయలుదేరాలి. ఈసారి పారిస్ కాదు, మరెక్కడికో ప్రయాణం. జీవితం చిత్రవిచిత్రంగా వుంది. అన్నీ వింతవింత అనుభవాలు. తలుచుకుంటున్న కొద్దీ తమాషా. ఆ యుద్ధదృశ్యాలను వాతావరణాన్ని వర్ణించి మీ కళ్ళకు కట్టలేను కాని, పారిస్‌లోవుండగా ఒకసారి హఠాత్తుగా ఇరవై ఎనిమిది బాంబులు దబదబ పడ్డాయి. నగరం దద్దరిల్లి పోయింది. అటుఇటు ఊగిపోయింది. బాంబులుపడిననాడు నేను నగరసమీపంలో వున్నాను. ఆ ఘోరదృశ్యం ఇప్పటికీ నా కళ్ళకు కట్టినట్లుంది. కాని ఒక సంగతి. పూర్వంలా ఫ్రెంచి పౌరులు భయవిహ్వలులు కాలేదు. హఠాత్తుగా పడే బాంబులకు అలవాటు పడిపోయారు. ఇదివరకు అలాకాదు. అస్తవ్యస్తమై, ఎక్కువ నాశనం సంభవించేది.

మా సైనికదళం ఎక్కడకు వెళ్ళినా మన్ననలను పొందుతోంది. కష్టాలలో వున్నపుడు ఆదుకుందుకు వస్తున్నామనే భావం సర్వత్ర వెల్లివిరుస్తోంది. నిస్సహాయస్థితిని చక్కబరిచేందుకు సైనికులు నియుక్తులయారనే అభిమానం కనిపిస్తోంది. రెండుదేశాల మైత్రీభావం పరస్పరం పెంపొందుతోంది. సైనికులకు పౌరుల సహకారం అన్నిట లభిస్తోంది. యుద్ధంలో విజయానికి ఇది అత్యావశ్యకమని నా భావం.

నేను ఫ్రాన్సులో వుండగా ఒక భారతీయదళం ఆర్లియన్స్‌కు పయనమయింది, అది అక్కడ నిఘాచేస్తుంది. కందకాలను తవ్వుకుని బలమైన స్థావరాలను ఏర్పరచుకోవడం ఈ యుద్ధంలో ఒక ముఖ్యవ్యూహం. ఈవ్యూహరచనలో ఈ భారతీయ సైనికదళానికి ప్రత్యేకమైన శిక్షణ యిచ్చారు. లార్డుకిచిన్ సర్వవిధాల సమర్థుడు. తక్కువమంది సైనికులతో ఎక్కువ ఫలితాన్ని సాధించడం అతని లక్ష్యం. ఏమాత్రం ప్రాణనష్టం జరగనీయడు. అతి జాగ్రత్తగ వ్యూహాన్ని నడుపుతాడు. పూర్తిశిక్షణ పొందిన భారతీయ సైనికులకు సాటిరాగల సైనికులు మరెక్కడా కనిపించరు. మొత్తం యుద్ధరంగంలో వారికివారే సాటి.

ఫ్రాన్సులో నా యుద్ధానుభవాలను తెలుపుతూ మహారాజావారికి ఉత్తరం వ్రాస్తున్నాను. దానితోపాటు కొన్ని ప్రభుత్వ ప్రచురణలు పంపిస్తున్నాను. అవి మహారాజావారికంటె మీకు విజయనగరం స్నేహితులకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తాయని నానమ్మకం. వాటి వివరాలను మీరు ఆయనకు తెలియచేస్తారని ఆశిస్తాను.

ఈ యుద్ధానికి జర్మనులే బాధ్యులు. ఆ సంగతి నేను పంపుతున్న పత్రాలు చదివితే మీకు తేటపడుతుంది. మొదట దాడిచేసింది మిత్రమండలే అయినా, యుద్ధప్రేరేపకులు మాత్రం జర్మనులే. అందులో అనుమానంలేదు. ఎవరిని కవ్వించని వారిమీద దురన్యాయంగా, క్షమించరాని దురాక్రమణ బుద్ధితో జర్మనులు యుద్ధాన్ని ప్రేరేపించారు. ఇది సహించరాని దురాక్రమణకు వ్యతిరేకంగా ఆత్మరక్షణార్థమై సాగుతున్న యుద్ధం. యుద్ధపరికరాలను తయారు

చేసుకోవడంలో, యుద్ధనైపుణ్యాన్ని పెంపొందించుకోవడంలో, జర్మనులకంటె, మిత్రమండలిదేశాలు వెనకబడివున్నమాట నిజం. అయితే ఇలా వెనకబడివుండడమే ఆదేశాల గొప్పతనం; అలా పెంపొందించుకోవడమే జర్మనులకు అవమానకరం. యుద్ధపరికరాలను వాళ్ళల్లాగ పెంపొందించుకోనందుకు మేం నిజంగా గర్వించవచ్చుననుకుంటాను. మరి మీ ఉద్దేశం? నాతో ఏకీభవించరా? మేం ఆయుధసామగ్రిని, సైనికబలాన్ని వాళ్లల్లా పెంపొందించుకోలేదు. అందుకు మాకు శక్తిలేక కాదు. మాది అత్యత్తుమమైన నాగరికత; అందువల్ల మేం వెనకతీశాం. అదేవిధంగా మా సామ్రాజ్యాధిపత్యంలో వున్న దేశాలన్నీ ఒకేమాటమీద నిలబడివున్నవీ అంటే, దానికి కారణం మా నిష్పక్షపాతవైఖరి, అతి సున్నితమైన వ్యవహారదక్షత. ఈ యుద్ధంలో భారతదేశం ఇంగ్లండుకు తోడ్పడి చరిత్రలో మన్ననల పొందాలి. గౌరవమైన పద్ధతులతో ఈ రెండు దేశాలసంబంధం అభివృద్ధికిరావాలి. మా పరిపాలనలో అనేకలోట్లు, దోషాలు వుండవచ్చును. నిజమే అయినా మనం వేరు అనుకోరాదు : భారతీయులు ఇలాంటి స్వల్ప విషయాలను మరచిపోయి, మొత్తం యుద్ధాన్ని దృష్టిలో పెట్టుకొని ఆలోచించాలి. అలా ఆలోచించే గొప్పతనం భారతీయులకు ఎపుడూ వుంది. ఈ సమయంలో ఈ రెండుదేశాలవారు ఎవరిలాభాలను వారు చూసుకుంటే సమయం మించిపోతుంది : ఇరుదేశాల జాతులు పరస్పర సాన్నిహిత్యం పెంపొందించుకోవడం ఎంతో మేలు. ఇది భారతదేశంలో నా అనుభవం.

దయవుంచి నన్ను మిత్రులందరికి జ్ఞాపకం చేయండి. మీకు వ్యవధివుంటే ఒక ఉత్తరం వ్రాయండి.

హెచ్. కృష్ణశాస్త్రి

మకాం, మధుర

11 ఫిబ్రవరి 1910

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

దయతో మీరు రెండవతేదీన వ్రాసిన లేఖ అందింది. అనేక నగరాలు తిరిగి అలసటగా వున్న నాకు మీలేఖ హాయి అనిపించింది. బిల్హణుని జీవితకథను నాటకంగా వ్రాస్తున్నారని విని ఆనందించాను. అపూర్వ ప్రతిభావంతమైన మీలేఖినితో బిల్హణుడు ఆంధ్రసాహిత్యంలో ఆచంద్రతారార్కం భాసిస్తాడని నా విశ్వాసం. మహాప్రేమికుడు, లలిత హృదయుడు, మధురకవి అయిన బిల్హణుని భావోద్వేగానికి హేతువు గుజరాతు దేశపు రాజకుమార్తెయేనా? మీరు నా కావిషయం తెలిపినందుకు సంతోషం.

మీకళింగదేశచరిత్ర ఎపుడు వెలువడుతుందోనని అందరూ ఎదురు చూస్తున్నారు. అది ఆంధ్రపండితులకు, చరిత్రకారులకు విద్యార్థులకు ఎంతో ఉపయోగపడుతుంది. మీకు దొరికిన శాసనాలలో నాలుగు సరియైనవి కావనీ జర్మనీనుంచి ప్రొఫెసర్‌హుల్ట్సు, శ్రీ వెంకయ్యగారికి ఉత్తరం వ్రాశాడు. అవి సృష్టి కనక తాను వాటిని అచ్చువేయడట. అయితే అవి సృష్టి అని నేననుకోను. అందుకు తగినంత కారణమేమీ నాకు కనిపించలేదు.

ఈ మధ్య, అందులోను ఈ ప్రయాణంలో, నాకు దొరికిన శాసనాలు ఏమంత చెప్పుకోతగ్గవి కావు. పశ్చిమ చాళుక్య మొదటి విక్రమాదిత్యుని తామ్రశాసనమొకటి ఇటీవల నాకు లభించింది. ఇదే, నేను ఈ మధ్య కావించినపరిశోధన. ఇదికాక గంగ, కాకతీయ యుగాలకు చెందిన రెండుమూడు శిలాశాసనాలు దొరికాయి.

నేను ఇక్కడ గుహలలోని బ్రాహ్మీలిపిలో వున్న శాసనాలను పరిశీలిస్తున్నాను వాటిని ఇంతవరకు ఎవరూ వివరంగా పరిశోధించి సరిగా అన్వయించలేదని మీకు తెలుసుకదా వీటి పూర్వాపరాలు తెలుసుకోగలిగితే అది అద్భుతమైన పరిశోధనే అవుతుంది

పని ఎంతవున్నా రిపోర్టు తయారు చేయడంవల్ల తీరిక లేకపోయినా మీతో కొన్ని గంటలపాటు గడపడమంటే నా కెంతో హాయి నీలగిరికొండల మీద ప్రతిరోజు కాకపోతే మానె వారానికొకసారైనా మీతో ప్రసంగించడమంటే నాకానందం

నావద్ద శాసనాలను ఫోటోలను ఎత్తే పరికరాలన్నీ వున్నాయి మి మహత్తర నాటకం కన్యాశుల్కం రంగభూమి మీద దిగ్విజయ మౌతున్నందుకు మిమ్మల్ని మనసారా అభినందిస్తున్నాను

*　　　　*　　　　*

మకాం ఉదకమండలం
6 ఆగస్టు 1913

ప్రియమైన అప్పారావుగారూ

మీరు 25 వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది మీరు కోరిన ప్రకారం మూలప్రతి చిత్తున్నూ విష్ణుకుండినుల శాసనములపై మీరువ్రాసిన వ్యాసపు అనువాదమున్నూ ఈవేళ మీకు పంపిస్తున్నాను ఆఫీసు పనులవల్ల సరియైన ప్రతి తయారుచేయించలేకపోయినందుకు నన్ను క్షమించండి నూతనంగా లభించిన విష్ణుకుండినుల శాసనముల దృష్ట్యా మీ వ్యాసమును మీరన్నట్లు త్వరగా తిరిగి సరిచేసి పంపించినట్లయితే నేనెంతో కృతజ్ఞుణ్ణి మీవ్యాసముతోపాటు మీరు ప్రచురింపదలచుకున్న పీఠికను కూడా దయవుంచి పంపించండి వ్రాతప్రతిని మీరు పంపిన వెంటనే జాగ్రత్తగా పరిశీలించి అవసరమయితే ఏమైనా మార్పులు కొద్దిగాచేసి ఎపిగ్రాఫికా ఇండికాలో ప్రచురణార్థము డాక్టర్ స్టెన్‌కొనోకు పంపుతాను ఈ నెల రాజమండ్రిలో మీరుపన్యసించ నున్నారని తెలుసుకుని సంతోషించాను

మకాం ఉదకమండలం
27 అక్టోబరు 1913

ప్రియమైన అప్పారావుగారూ

మీరు 23 వ తేదీన వ్రాసిన ఉత్తరం అందింది మీరుకోరిన తామ్రశాసనపు నకళ్ళను పంపుతున్నాను విష్ణుకుండినుల శాసనాలపై తాను వ్యాసం వ్రాస్తానంటూ డాక్టర్ హుల్ట్జు కాలయాపనచేయడం నేను సమ్మతించను నా ఉత్తరం అందింది అంటూనే ఆయన యేదో ఒక నెపంతో వాయిదాలు వేయవచ్చును మీరు వ్రాసిన వ్యాసాన్ని నేను స్వీకరించి, దానిని డాక్టర్ కొనోకు పంపిస్తాను మీరు వెంటనే ఆ వ్యాసాన్ని నాకు అందజేయవలసిందిగా కోరుతున్నాను

*　　　　*　　　　*

టి.ఎ. గోపీనాధరావు

తిరువేంద్రం
10 ఫిబ్రవరి 1913

ప్రియమైన అయ్యా,

మీరు దయతో వ్రాసిన ఉత్తరం అందింది. కాని నేనీ మధ్య ఊళ్లోలేను. అందువల్ల వెంటనే మీకు సమాధాన మీయలేకపోయాను. 'సందేమెయిలు' సంపాదకులు శ్రీ రాఘవఅయ్యంగారు, విష్ణుచిత్తుని కాలమును గురించి పరిశోధించారు. విష్ణుచిత్తుడు, క్రీస్తుశకము తొమ్మిదవశతాబ్ది నడుమకాలమున వుండెనని ఆయన నిర్ణయం. ఆయన నిర్ణయంతో మనం ఏకీభవించవచ్చును.

మద్రాసు విశ్వవిద్యాలయమువారిచే, మీరు పొందిన గౌరవానికి నా అభివందనాలు. ఇంకా ఇలాంటి అనేక గౌరవములను మీరు పొందవలెనని నాకోరిక..

*　　　　*　　　　*

శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు

నిడుమోలు
కృష్ణాజిల్లా
27-4-1911.

ప్రియమైన అయ్యా,

మీరు మిక్కిలి దయతో 16 వ తేదీన వ్రాసిన ఉత్తరము బొంబాయి చేరి, ఇక్కడకు తిరిగివచ్చి నాకు అందినది. అనారోగ్యమువలన మార్పునుకోరి, విశ్రాంతికై ఇచ్చటకు వచ్చాను. ఇంకను ఒక నెలరోజులపాటు ఇక్కడనే వుంటాను.

మీరు పంపిన ఎన్నిక భాగములు, మహారాజావారిని గురించి వ్రాసిన పద్యములు అచ్చువేయనందుకు నన్ను మన్నించకోరిక. మహారాజావారిని గురించిన వ్యాసము ముద్రితమైనది కనుక పద్యములను అచ్చుకీయలేదు. కళాపూర్ణోదయ కావ్యప్రతి, తెలుగు భాషాభిమానులకు లభించును కనుక, అందుండి మీరు కావించిన ఎంచుబడి భాగములను ప్రచురింపలేదు.

సంపుటి పెద్దదయిపోయినందుకు నాకు మిగుల విచారముగా వున్నది. చేరిన వ్యాసములలో రెండులోపములు కనబడుతన్నవి. సంపుటిలో అచ్చువేసిన వ్యాసములను మీరొకసారి చూసితిరేని, ఏవో కొన్ని తప్ప, మిగిలినవన్నియు దీర్ఘములని గ్రహింపగలరు; ఒక నిర్ణీత తేదీన సంపుటిని వెలువరించవలసిన నాకు, బాగున్నవో, బాగులేనివో, ఒకమాదిరివో, ఈరచనలన్నియు అనుకున్న వ్యవధిలోపున అందలేదు. అందువలన వీటిని ఎంచుకుందుకు ఆస్కారము లేకపోయినది : వచ్చినవాటిని వచ్చినట్టూ అచ్చుకీయవలసివచ్చినది. నిర్ణీత కాలము లోపున రచనలను రచయితలు పంపియుండినట్లయితే, సంపుటి యింత పెరిగి వుండకపోయెడిది. అపుడు నాకు అట్టే ధనవ్యయము యింత శ్రమవుండేవికావు. రాబోవు సంచికకు నూతన అభిప్రాయములతో మీరు ఏవైనాకొన్ని సూచనలు కావింపవేడుతున్నాను.

భాష సజీవమైనది కనుక సంఘము అభివృద్ధిచెందుటతో పాటు, దానంతటది సంస్కరింపబడక విధిలేదు. తెలుగు భాషా వికాసమునకు ఏ, యే పద్ధతులు అనుసరించవలెనో, వాటిని ఎటుల అమలు జరుపవలెనో చర్చించుటకు ఉత్సాహవంతులను ఒకచోటమీరు సమావేశపరుప ప్రయత్నింపవలెను. అయితే మీ వలె సమస్యలను క్షుణ్ణంగా నిశితముగా తరచి పరిశీలించేవారు అట్టేమందిలేరని నా అనుమానము.

నాకు తెలుగుభాషా పరిజ్ఞానము అంతగాలేదు. నేను వ్రాసెడి తెలుగు మిక్కిలి పేలవము. నాకు సంస్కృతము కొంత వచ్చును. అందు వలన నారచనలలో సంస్కృత పదములు ప్రయుక్తమౌతూ వుంటవి. అపుడపుడు నేను ఎమర్సన్ గ్రంథములను చదవడంవలన నావాక్యవిన్యాసములో ఒడిదుడుకులు కనిపించుతూ అతని శైలిని అనుకరిస్తూ వుంటివి. అది ఎబ్బెట్టుగా వున్నయెడల ఆ పద్ధతిని విరమింప ప్రయత్నిస్తాను. మీరు చూపినదయకు, సంపుటిని మద్రాసు పత్రికలలో సమీక్షించెదనని మీరు వాగ్దానము చేసినందుకు నా ధన్యవాదములు.

బొంబాయి
5-3-1912

ప్రియమైన స్నేహితుడా,

మీరు రెండవ తేదీన దయతో వ్రాసిన ఉత్తరమును ఆసక్తి జనకమగు మీరచనయును అందినవి. అందుకు అనేక ధన్యవాదములు. మీ వ్యాసము వచ్చేవార సంచికలో అనగా 13 వ తేదీన ప్రకటితమౌతుంది. ఇంకను అనేక వ్యాసములు పంపగలమని వాగ్దానము చేసినందుకు నాధన్యవాదములు. అవి అన్నియు పత్రికలో ప్రచురితము కాగలవు.

నేను వ్రాస్తున్న ఈ దిగువ కొన్ని వాక్యములను పరిశీలించితిరేని, నేను ఎంతయో కృతజ్ఞుడను. మీరు గొప్ప పండితులు; ప్రతిభగల రచయితలు. కనుక ఈలేఖలో నేను కోరుతన్నదేదో మీరూహింపగలరు.

తెలుగు రచనలో గ్రాంథికమునకు బదులు జనులలో వ్యాపింపగల శైలిని అనుసరింపవలెనని మీమతము. ఆవిధముగ నేను వ్రాయక కదుపాపము చేస్తున్న వాడనగుతున్నప్పటికి, మీ వాదముతో ఏకీభవించుతున్నాను. దురదృష్టవశమున నేను వ్రాసెడి తెలుగు ధారాళమైనదికాదు. నాకు సంస్కృతము పరిజ్ఞానము స్వల్పము. అందువలన నాశైలిలో యిట్టి అస్తవ్యస్తత ఏర్పడుతున్నది; దీనికితోడు శాస్త్రీయ పారిభాషిక పదముల విషయములో మన భాషకు సహజదారిద్ర్యము వుండనేవున్నది. వీటిని సంస్కృత ధాతుశబ్దములనుండి సులభముగా సాధించుకొనుటకు మనకు వీలవుతున్నది. ప్రస్తుతకాలమున తెలుగు సాహిత్యమున సంస్కృతపదములు అనంతముగ వచ్చిచేరుటకు ఈ పరిస్థితులే ప్రధాన కారణము. రచయితలు బుద్ధిపూర్వకముగ కేవలము తమ పాండిత్య ప్రకర్షకోసము జటిల ఆడంబర శబ్దములను తమ రచనలలో ప్రయోగింపరని నా విశ్వాసము. అయితే ప్రాచీన కవుల భావములను ప్రయోగములను యింకొక రూపమిచ్చి తమగ్రంథములలో ప్రయోగించే రచయితలు లేకపోలేదు. ఏమైనప్పటికి, గ్రాంథికముకొరకే అన్నట్లు ఏ రచయితా, ఆభాషను తనరచనలలో వాడడని నానమ్మకము. ఇది సంస్కృతి లేకపోవుటవల్ల కాక, ప్రస్తుతము మనకుగల సంస్కృతిని అనుసరించి కలుగుతున్న సహజఫలితము.

గ్రాంథికమును మాత్రమే ప్రయోగింపవలెననే గ్రాంథికవాదులమతము న్యాయమైనది కాకపోవచ్చును. కాని మీరు దానిని అడుగడుగున పూనికవహించి ప్రతిఘటిస్తున్నారు. మన ప్రాచీనరచయితలు తమ గ్రంథములను గ్రాంథికమున వ్రాసినారు. నేటి కాలపురచయితలు తమ రచనలను గ్రాంధికమున వ్రాస్తున్నారు.

దేశమున బహుళ వ్యాపకమును పొందేభాషను వాడవలెననెడి వారి స్థితి, గ్రాంధిక భాషయే అనుసరణీయమనెడి వారి స్థితితో అభిన్నము కావలెను. ఈ ఇరుతెగల రచయితలకు ఎంత మాత్రము స్పర్థ వుండకూడదు. ఈ రెండు వర్గముల రచయితలు తమతమ ఆదర్శములను అనుసరించి భాషను సేవించవలెననియె అభిలషిస్తున్నారు. కాని ప్రయత్నపూర్వక గ్రాంధిక శైలియో, గ్రామ్యాభాషా శైలియో, రచయితలకు లక్ష్య పరమావధులు కానేరవు. అలాగ ఒకవేళ అయితే కావచ్చును కాని, ఆశైలి రచయితకు ఆత్మసంతృప్తిని కలిగించగలదే తప్ప, ఉత్తమప్రయోజనమునకు ఉపకరించదు. తమ నమ్మకములకు భంగము వాటిల్లగలదన్న వెరపుతో రచయితలు మార్గము తప్పి, ప్రాచుర్యమునవున్న పదములను కేవలము ఆ పదముల కోసమే అన్నట్లు, ఎంచుబడి చేసినట్లయితే ఉత్తమప్రయోజనము నెరవేరదు. మీరు అంటున్నట్లు మీరు గ్రామ్యభాషలో వ్రాయాలనే నా ప్రార్థన. కాని సిద్ధాంతములకోసము మీభావములను ఆ శైలిలో వ్యక్తము చేయడానికి ప్రత్యేకముగ ప్రయత్నించవద్దని నా అభ్యర్థన. మన మహారచయితలందరు అప్రయత్న పూర్వకముగ తమ భావములను సులభ సరళ శైలిలో వ్యక్తీకరించుటకు ప్రయత్నించారు. మీ రచనలలో మీరు వాడుక భాషాపదములను అక్కడక్కడ ప్రత్యేకముగ ప్రయత్నించి ప్రయోగిస్తున్నట్లు పాఠకునికి పొడగట్టకమానదు. వాడుక భాషపట్ల మీకున్న ఆ పక్షపాతవైఖరిని విడనాడి, మీసహజధారాళశైలిలో మీరు వ్రాసినట్లయితే, మీకు మీరు న్యాయము చేసుకున్నట్లవుతుంది; భాషకు సేవ చేసినట్లవుతుంది.

అడగనిదే యిటువంటి అభిప్రాయములు వెలిబుచ్చినందుకు నన్ను మన్నించగలరని ఆశిస్తున్నాను.

పి.యస్ : డెమ్మీసైజులో 12,24 పేజీలలో అక్కరకు వచ్చే చిన్న చిన్న పుస్తకములను ప్రచురించపలెనని నాసంకల్పము. 12 పేజీలకు అర్ధణా చొప్పున ధర పెట్టవలెననుకుంటున్నాను. 48 పేజీలయితే ఒక బేడ; 48 పుటలకు మించి ఏ పుస్తకమూ వుండదు. మీకు తోచిన అభిరుచివున్న ఆసక్తివున్న విషయమును గురించి ఒక పుస్తకము వ్రాసి పంపితే మిక్కిలి కృతజ్ఞుడను; నేను భావిస్తున్న ఈ ప్రణాళిక ఏరీతిన వుంటే బాగుండగలదో, కొన్ని సూచనలు సూచిస్తే, కృతజ్ఞుడను.

పి. శేషాద్రి

అనంతపురం

5 జూన్ 1912

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ,

మీ ఉత్తరం చేరింది. ధన్యవాదాలు. హంటరు ఊటీనుంచి ఇంకొకనెలలో బయలుదేరుతాడు. మీరు ఆయనను కలుసుకుంటున్నారని తెలియపరిచాను.

ఇక్కడి వాడుకపదాలు తెలిపే కొన్నిపుస్తకాలను మీకు నేను ఇవాళపంపిస్తున్నాను. అందులో కొన్ని పుస్తకాలు బ్రాహ్మణులు రచించినవి : మరికొన్ని శూద్రులు వ్రాసినవి; ఇంకొన్ని మహమ్మదీయులు, కల్పించినవి. ఈ పుస్తకాలలో వాడిన మాండలిక పదాలలో అంత తేడాకన్పించదు. కాని మహమ్మదీయులు రచించిన పుస్తకాలు పరిశీలించతగ్గవి. ఈ జిల్లాలో హిందువులు మాట్లాడే కొన్నిమాటలకు వాళ్ళు చిత్రంగా ప్రయోగించారు. రేపో ఎల్లుండో మరికొన్ని పుస్తకాలు సేకరించి పంపుతాను.

నేను తెలుగు సాహిత్యంమీద ఒకవ్యాసం వ్రాయాలనుకుంటున్నాను. ఆంధ్రసాహిత్యంలో నూతనపోకడలను పరిశీలిస్తున్నాను. ఆంధ్రకవితలో నూతనధోరణులనుగురించి "న్యూ కరెంట్సు ఇన్ తెలుగులిటరేచర్" అనేపేరుతోనో లేక "ఎక్స్ పెర్మెంట్సు ఇన్ తెలుగుపొయిట్రీ"అనే శీర్షికతోనో మీ గేయములనుగురించి ఒక వ్యాసము వ్రాయవలెనని కుతూహలపడుతున్నాను. మీ నీలగిరిపాటలు ప్రతి నావద్ద వున్నది. ఇతర రచనలు కొన్నింటిని పంపించకోరుతున్నాను. మీ గీతములను తిరిగి మీకు అందచేస్తాను. మీరు కులాసాగావున్నారని తలుస్తాను.

టి. సూర్యనారాయణరావు

తణుకు
18-6-12

ప్రియమైన అయ్యా,

మీరు దయతోవ్రాసిన లేఖ అందినది. నేను మీకు వెంటనే జాబు వ్రాసితిని; కాని మా గుమాస్తాలు దానిని ఆలస్యముగా పోస్టు చేసితిరి. మనమనుకున్న కార్యము జూలై నెలలో తప్ప నెరవేరదు. రామచంద్రరావు ఇతర పనులలో నిమగ్నుడైనాడు, అతను మనవెంట రావలె.

మీరు లేవనెత్తిన సమస్య మిమ్ములను కలుసుకొన్నపుడు చర్చించగలను. ఉత్తరములలో చర్చించడమువల్ల లాభము లేదు. మనము ఒకరినొకరము అపార్థము చేసుకుంటున్నామని నా అభిప్రాయము. చర్చించి ఒక అభిప్రాయమునకు వద్దాము. పత్రికలలో చర్చలు చూసితిని కాని ఏమి ప్రయోజనము?

ఉదాహరణకు మద్రాసు మెయిలులో అచ్చయిన వ్యాసమును తీసుకోండి. వ్యాసమంతయు, అపార్థద్యోతకముగానే వ్రాయబడినది. అకాడమీ సమావేశ ఉద్దేశములను, దాని అభిప్రాయములను వ్యాసకర్త అపార్థము చేసుకున్నాడు. శృంగార కావ్యముల సమస్యను ఆయన సరిగా అర్థము చేసుకోలేదు. పత్రికలలో వ్రాతలు ఇలాగునే వుంటివి.

పత్రికలలో చర్చలవల్ల ప్రయోజనము సిద్ధించదు. వ్యక్తి గత సమావేశములు, చర్చలవలన భాషకు నిజమైన ఉపకృతి చేకూరగలదు. ఓటమి, గెలుపులను లెక్కచేయక, మర్మము విడిచి మనసువిప్పి చర్చించుకొనవలెను.

నేను రచించిన గ్రంథములను మీకు పంపినాను. వ్యాకరణసూత్రములను పాటించుతూ మీ ఆశయములను నేను సాధించినాను. ఆర్థిక చరిత్ర రాధారాణి మాధవకంకణము మొదలైన నా గ్రంథములను మీరు పరిశీలించిన ఈ విషయం తెలియగలదు. అవి బాగుగానేవున్నవందురనుకుంటాను. ఇపుడింకొక పుస్తకమును అచ్చువేయించుతున్నాను. అచ్చయిన వెంటనే మీకొక ప్రతిని పంపగలను. అవును, నేను అందులో విరళముగా విసంధిని పాటించితిని.

మీరు ప్రబోధిస్తున్న సంస్కరణమువలన గ్రామ్యశబ్దములను ప్రయోగించి ఆ గ్రంధములను ప్రజలకు విడుచుపెట్టు అవకాశము కలుగుతున్నది ఈ భాషనే ప్రభుత్వము ఆమోదించవలెనని మీ పట్టుదల సరిగ్గా అదే ఎంతమాత్రమూ కూడదని నామతము ఈసారి వ్రాసేవుత్తరములో వివరముగా పేర్కొనగలను

*　　　*　　　*

## శ్రీ జి వెంకటరంగారావు

ట్రిప్లికేన్
2-7-2012

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

జూన్ 30 వ తేదీన మీరు వ్రాసిన లేఖ అందింది శృంగార రసవిషయమై మనదృక్పధమేమిటో మీరు శ్రీ జె అచిన్సన్‌కు బోధపరిచినందుకు సంతోషం బ్రౌణ్యం మీరు పంపించమన్నారని శ్రీ వెంకటేశ్వర్లుకు ఇదివరకేచెప్పాను కాని ఇంకా పంపలేదు ఆ విషయం మళ్ళీ హెచ్చరిస్తాను బెంగాలీలో పారిభాషిక పదాలనుగురించిన వివరాలు రిప్పన్ కళాశాల ప్రిన్సిపాల్ మీకు తెలియచేశాడా? పట్టిక అందినదా? అందకపోతే మళ్ళీ ఒకసారి ఆయనకి ఉత్తరం వ్రాద్దురూ

అనర్సు పేపర్లు మీరు నాకు పంపనక్కరలేదు వాటిని గురించి భోగట్టా అందేవరకు దాయండి ఈ కమిషనును మన చెంతకు ఎందుకుపంపించాలో నాకర్థంకావడంలేదు సంగతులు ఎప్పటికప్పుడు మీకు తెలియపరుస్తూవుంటాను ప్రొఫెసరు రంగాచారిగారు నెమ్మది నెమ్మదిగా కోలుకొంటున్నారు గండం గడిచి బయటపడినట్లేలెండి. మా బావమరిది సంగతి మరవరని తలుస్తాను నేను చెప్పినది దయయుంచి జ్ఞాపకం పెట్టుకోండి నారాయణమూర్తి మంగపతినాయుడుగార్లకు నానమస్కారాలని చెప్పండి ఎస్టేటుల్యాండు ఆక్టు విషయమై ఫౌలరు ఒక పెద్ద జవాబు వ్రాశారు

*　　　*　　　*

## శ్రీ గుమ్మడి వెంకటరంగారావు

ట్రిప్లికేన్
8 జూలై 1912

ప్రియమైన శ్రీ అప్పారావుగారూ

నిన్ననే మీ వుత్తరం అందింది కొత్త ఏర్పాట్లుకు మహారాజావారు అంగీకరించినందుకు సంతోషం శ్రీ శ్రీనివాసఅయ్యంగారు ఊటీనుంచి నిన్న తిరిగి వచ్చారు ఆయనను కలుసుకొని చాలాసేపు ప్రసంగించాను శ్రీ యస్ నాయర్ గారి సంగతంతా ఆయనకిపుడు తెలిసింది పూర్వం ఆయనంటే వున్న భ్రమలన్నీ పోయి నాయర్ గారి అసలు వ్యక్తిత్వాన్ని చూడగలిగారు అందుకు నాకెంతో సంతోషంగావుంది ఆయనతో నాకుకలిగిన ఆకొద్దిపాటి పరిచయంవల్ల శ్రీ వి కె అయ్యర్ గారి దూరదృష్టివల్ల నాయర్ గారి స్వభావం నాకా నాడే తెలిసింది అయ్యరుగారు మనుషుల వ్యక్తిత్వాన్ని అవలీలగా ఆమూకీ తీసి ఇట్టే కనిపెట్టగలిగేవారు మెరిసేదంతా బంగారంకాదు అలా అనుకొనేవాళ్ళకు నాయరుగారి పోకడ ఒక గుణపాఠం

ఈవేళరాత్రి ప్రొఫెసర్ రంగాచారిగారిని చూడడానికి వెళతాను మీ సందేశాన్ని ఆయనకు అందచేస్తాను ఆయన ప్రయాణంచేసే స్థితిలో లేరు నీరసం తగ్గడానికి ఇంకొకనెల పడుతుంది బ్రౌను నిఘంటువుమీద శృంగార రసంమీద మీ వ్యాసాలను సాధ్యమైనంతత్వరలో నాకు పంపించకోరుతున్నాను కావ్యప్రకాశికను ఇవాళ మీకు పోస్టుచేశాను ప్రస్తుతం నేను క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చను పరిశీలిస్తున్నాను చక్కగా వుంది

* * *

ట్రిప్లికేన్
1-2-13

ప్రియమైన అప్పారావుగారూ

మీరు నిన్న వ్రాసిన ఉత్తరం అందింది ఎమ్ ఏ పరీక్షాధికారుల సమావేశం మీరు సూచించే తేదీన మనం ఏర్పాటుచేసుకుందుకు నాకు సంతోషం కానినాకు నాలుగయిదు రోజుల వ్యవధిఅవసరం అందుకుఏతేదీ మీకు అనుకూలమో ముందుగా తెలపండి 15వ తారీఖున మీకు వీలుంటుందా? సూర్యనారాయణశాస్త్రిగారు ఈవేళపొద్దున్న నన్ను కలిశారు 15వ తేదీన సమావేశం జరుపమని ఆయన సూచన

వి సూర్యనారాయణరావుగారు

మచిలీపట్నం
20-6-14

ప్రియమైన అప్పారావుగారూ

మీ వ్యాసములను పత్రికలలో చదువుతున్నాను జయంతి రామయ్యగారివల్ల భాషాభివృద్ధి జరగదు తెలుగు అకాడమీ స్వరూపం మారితీరాలి శబ్దశాస్త్రాన్ని మధించిన గిడుగు రామమూర్తి పంతులుగారివంటి దిగ్దంతులు మనకు అవసరం నిఘంటు వ్యవహారం అతి అసహ్యకరంగా తయారయింది జరుగుతున్న జాప్యం అంతా యింతాకాదు నిఘంటు నిర్మాణంగురించి కొవ్వూరు న్యాయవాదులు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు వ్రాసిన వ్యాసం మీరు చదివి వుంటారు ఇది మీ స్వంత విషయంగా భావించి మీరు పూర్తి బాధ్యత వహించకపోతే నిఘంటు నిర్మాణం జయప్రదం కాదు మీరిప్పటికే వృద్ధులయిపోయినారు వెనకటి ఓపిక లేదు చరిత్ర రచన అలాగునే వుంచివేసినారు ఇతర వ్యాపకాలు తగ్గించుకొని మీరు తలపెట్టిన చరిత్రను పూర్తిచేయడం మంచిది దానినీ నిఘంటువును దేశానికి మీరు సమర్పించాలి మీరనుకుంటున్న విశాఖజిల్లా చరిత్ర త్వరలో వెలువడితే అది ఇతర జిల్లాలవారికి ఆదర్శప్రాయంగా వుంటుంది మీఆరోగ్యం ఎలాగవుంది? విజయనగరం ఎప్పుడు వెళతారు?

ఎనమండ్ర నారాయణమూర్తిగారు

కలకత్తా
12-12-12

మిత్రమా

నేనిక్కడ క్షేమముగా బ్రవేశించినాడను మీరు మెద్రాసుకు బయలుదేరి యుందురు కావున దీని నక్కడికి బంపవలయునని యింగ్లీషు మునిపీకి జెప్పి వారిపేర బంపుచున్నాను

ఇంతవేగముగా మీకుత్తరము వ్రాయవలసిన పని లేకపోవును గాని నిన్న నేను తొందరగా నజరుమహలుకు బోవుచుండగా మీరు కొన్ని మాటలు శెలవిచ్చినారు అందుకుత్తరము వెంటనే చెప్పలేకపోయినాను మీవంటి పురుషుల ప్రశ్నములకు దగిన జవాబు చెప్పుటకు కొంతయాలోచన కావలెను అప్పటినుండియు జిత్తమాయంశములందే కాపురముండి యీ యుత్తరము వ్రాయువరకు నుండబట్టినది కాదు

మీరు నాయందు రెండు నేరములు మోపినారు మెద్రాసు మహజరుకు సంతకము చేయుట మతబేదముచేత మీకివి నేరములుగా గాన్పించుట న్యాయమే కాని నాకెలాగు నేరములు? నేనొకరికేల భయపడవలెను అమూల్యమైన మీ స్నేహము దీనివలన బోయనేని యీ పనులు తప్పే కానియదియింతటితో బోయెడి భాగ్యముకాదు మీరును నాకుభిప్రాయస్వాతంత్ర్య మియ్యనంతటి సామాన్యులు కారు ఒక్కచోనాపని నిందర్హామే యగును మనమందరము సత్యప్రియులము ఎంతటి సామాన్యుడును సత్యము దాటినప్పుడేదో మిషకల్పించుకుదాటును గాని సత్యము నాకవసరములేదని చెప్పి తప్పడు కాబట్టి నే జేసినపని యిదివరలో నా మతమును ప్రకటించుకొనిన దానికి విరుద్ధమయిన యెడలగాని సంతకములు చేయించుటకు దంటాలు పడుటలో నేనితరుల నిర్బంధించి వంచించిన గాని నాయందు దోషారోపణ చేయవచ్చును మొట్టమొదట నేను తంటాలు పడవేలేదు అవకాశములు నాకు వచ్చినరోజునే మహారాజులుంగారు విజయనగరము వచ్చుటచేత నాకందును గురించి యాలోచించుటకైనను సావకాశము లేక రామానుజాచారిగారి కిచ్చి దొరికినన్ని సంతకములు సంపాదించుమని కోరినాను మొన్న సాయంకాలము కొంతమంది తగు మనుష్యులు నాకుదటస్థమైనారు వారికాగితముల సంగతి కొంచెముబోధజేసిసంతకములు చేయ నిష్టమున్నచో జేయవలెనని యడిగినాను అందుపై నొక్కరు అప్పారావుగా రేమందురో అన్నారు ఆమాట విని వారికిదివరికిచ్చియున్న సంతకములఫారము లాగికొందుమన్నంత యసహ్యము పుట్టినది కాని తొందరపడకనన్ను నేవారించికొన్నాను. మరునాడు వారు (మరెవ్వరు గారు అప్పయ్య) వట్టికాగితము తీసుకువచ్చినపుడు సంతకము చేసినాడా లేదా యనికూడా జూడలేదు మరియొకరు వాగ్వాదమున కారంభించినారు వాదమవసరము లేదు ఇదిగో మహజరు, చదివి చేసితే ఛెయ్యండి లేదా మ్హానవచ్చునన్నాను అక్కడికిని వారు వాదము మానకపోయేటప్పటికి నేను ప్రతివాద మాడినాను అందున్నవారు కొందరొక పక్షము మరికొందరు మరొక పక్షమైనారు ఇంతకన్న నెక్కువతంటాలు పడలేదు

ఇక నేసంతకము చేయుటలో గలిగిన రండాగర్భ మేమో శెలవియ్యవలెను నా మతము తమకు విశదమే సలక్షణముగాగాని తెలుగు వ్రాయగూడదని లక్షణ విరుద్ధమైనది బాలురు చదువగూడదని లక్షణమన్న నేమో మొదలగు సంగతులు చర్చింపవలసిన చోటిదికాదు మహజరు కోరినదియు నదియే ఈ కోరికల నిలబెట్టుటకు మహజరులో వ్రాసిన కొన్ని సంగతులు నాకు సహేతుకముగ గాన్పింపలేదు అవి అబద్ధములనికూడ చెప్పగలను అట్లని మహజరంతయు నిరసించుటన్యాయమా ఇంతకు నాసంతకముకన్న బహిరంగముగా నా యభిప్రాయములను వెల్లడి చేయుటకు యత్నించి యెద్రాసు మెయిలుకు వ్రాసినాను కదా? అలాగు వ్రాసిన యుపన్యాసమందలి వాదములు మహజరువాదములును గొట్టివేయునా వేయవా? ఇంతకన్న ధారాళమైన ప్రవర్తన మరి యెవ్వరి యందైనగలదా? నాసంతకమును ఉపన్యాసమును దగ్గిరబెట్టి విమర్శించి మరి నన్ను నిందించవలెను నేను సంతకముచేసినా నన్నమాత్రముచే మీకు గోపము వచ్చినది ఇంత పరమతాసహనము మీకుగూడదు మీకు జడిసియే అప్పయ్య సంతకము చేసినాడు కాదు నేనుకూడ నాలాగు చేయుమన్నారా అలాగు చేసితినేని మీకు నాయందు గౌరవముండునని యెంచవచ్చునా? లౌక్యుడవందురు కాబోలు కాని సత్యవాది యనియునందురా? మీ జవాబు చూచుకొని నా సంతకము విత్డ్రా చేసుకోను

మీరు మద్రాసులో బొడిచేపొడుపుకై యెదురు చూచుచున్నాను రామయ్యను రెండు సంగతులలో గెల్చుకొందురు కాని మెమోరియల్‌లోని విజ్ఞప్తి న్యాయము కాదని వాదించిరేని యాంధ్రప్రపంచమంతయు మీతోకకు తాటాకులు కట్టక మానదు ఒక్కశుభ (మీకశుభ) వార్త తమకు విన్నవించవలసి యున్నది శ్రీశ్రీశ్రీ విజయనగర మహారాజావారు మా పక్షము ఇప్పుడు మాబల మొక్కమారు తలచుకొండి

శ్రీనివాసయ్యంగారికి నా నమస్కారములు మనవిచేసి నాయుత్తరములకు జవాబియ్యనందుకు నాకు గలిగిన కోపము వారు కార్యసిద్ధిచేసినగాని తీరదని చెప్పవలెను మీ యుభయుల సహాయముచేతను ఆపని నెరవేరునని యాశపడుచున్నాను

చిత్తగించవలెను

* * *

కొండా వెంకటప్పయ్యపంతులుగారు

గుంటూరు
3 నవంబరు 14

ప్రియ మిత్రమా,

మీలేఖకు కొంచెం ఆలస్యంగా సమాధానమిస్తున్నందుకు మన్నింపకోరుతున్నాను ది ఇంటర్మీడియటు తెలుగు కాంపోజిషన్ కమిటీ రిపోర్టు, ది తెలుగు కాంపోజిషన్ కాంట్రవర్సీ రెండూ నాకు అందాయి మీరు కోరినట్లుగా నేను వాటిని ఇండియన్‌క్లబ్‌కు అందచేస్తాను .

ఇక్కడ ఇండియన్‌క్లబ్ కాక దియంగ్మెన్స్ లైబ్రరీ అసోసియేషను అనేపేరిట ఇంకొకసంఘం వుంది ఈ సంఘానికి నగరంలోని యువకులు, ముఖ్యంగా జూనియరు లాయర్లు హాజరవుతూవుంటారు మీకు ఇంకొక సెట్టు పుస్తకాలను పంపించడానికి అవకాశంవుంటే అలా పంపించడం వృథాకాదనుకుంటే తప్పక నాకు అందచేయండి వాటిని నేను దియంగ్మెన్స్ లైబ్రరీ అసోసియేషనుకు ఇస్తాను

వేదము వేంకటరాయశాస్త్రిగారు

నెల్లూరు మూలపేట
17-1-15

ప్రియమైన అయ్యా,

పన్నెండవ తేదీన మీరు దయతో వ్రాసిన ఉత్తరము అందినది మీ ఆరోగ్యం సరిగాలేనందుకు నాకెంతో విచారముగా వున్నది సైనిక అనుభవము వ్యసనములలో చేర్చదగినదని మీరు అభిప్రాయపడుతున్నారు సైన్యముకావించే మహాఘన కార్యము నరమృగయా కనుక అది మీ అభిప్రాయమును దృఢపరుస్తున్నది

ఎపుడు పిలిచినా హాజరయే నవుకర్లు మీకు అనేకులు అలాంటపుడు కాఫీ మీరే ఎందుకు స్వయంగా కాచుకుంటున్నారో నాకర్థము కానడములేదు భారమైన పనులతరవాత కొంతరిలీఫ్‌కోసము మీరే యిలాంటిపనులు

కల్పించుకుంటారు కాబోలును. నా కాఫీ నేనే కాచుకుంటానంటే దానికి కారణం వున్నది. నాకు నవుకర్లులేరు; ఇతర్లుచేస్తే రుచివుండదు. ఈసరికి మీచేయి నయమయిందనుకుంటాను.

ప్రాచీన పద్యకావ్యములతోపాటు, సమకాలీన పద్యకావ్యములను, బి.ఏ. విద్యార్థులకు పాఠ్యగ్రంథములుగా నిర్ణయించవలెనని మీ అభిమతము కాని, యిప్పట్టున, మీకొక విషయము చెప్పవలసివస్తున్నందుకు విచారిస్తున్నాను. ఇప్పటి కవిత్వము చాలమటుకు వట్టి ఊక. దీనిని క్లాసికల్ కవిత్వముగా, పరిగణించడానికి వీలులేదు. దీనికట్టి అర్హత పూజ్యము. వ్యాకరణము దుష్టము; ఛందస్సు లోపభూయిష్టము; నాట్యశాస్త్ర మర్యాదలు బొత్తిగా శూన్యము, ఔచిత్యము, వివేకజ్ఞానము మృగ్యము; ఇవీ, నేటికాలపు రచనలలో కనబడుతున్న ప్రధాన లక్షణములు నేను వ్రాసిన ప్రతాపరుద్రీయము నాటకములో విద్యానాథుని రంగము, ఈదోషములు లేనిదానివిగా భావించి దానిని పాఠ్యభాగముగా నిర్ణయించినట్లయితే, మీరు నాపట్లచూపుతున్న గౌరవమునకు కృతజ్ఞతాభివందనములు. దీనికి మారుగా ఇంకొక రంగమును పాఠ్యభాగముగా మంచిదని నేను పేర్కొనజాలను.

ఆముక్తమాల్యద వ్యాఖ్యానము ఎంతవరకు కొనసాగినదని మీరు అడిగినందుకు సంతోషము. నా రచనావ్యాసంగమును గురించి మీరు భోగట్టా చేసినందుకు కృతజ్ఞుడను; తృతీయా శ్వాసము పూర్తిచేసిన పిదప నాకు అనేక కష్టములు తటస్థించినవి. కెరటములవలె వచ్చి మీదపడుతున్న కష్టములకు తట్టుకొనలేక చెన్నపట్టణము వదలవలసివచ్చినది. ఆ కష్టములు నన్ను చెన్నపట్టణమునుండి తరుముటయేకాదు; ఈ లోకమునుండి నన్ను తరుమకొట్ట ప్రయత్నించినవి. వీటికితోడు శరీరమున అస్వస్థత; ఏదో ఒక బాధతో అయిదు నెలలపాటు శ్రమపడుతూనే వుంటిని.

ఇటీవల వావిళ్ళవారు ప్రచురించిన ఆముక్తమాల్యదను గురించి మీరు పేర్కొన్నారు. దానిని నేను చూడలేదు. ప్రతి ఒకటి సంపాదించి చూస్తాను. ఆముక్తమాల్యద కృతికర్త ఎవరో నిర్ధారణ చేయడానికి, శాసనములను యితర పత్రములను పరిశీలిస్తున్నాను. కాని ఇంతవరకు తగిన సమాచారము లభించలేదు. అంతవరకు ఆముక్తమాల్యదను శ్రీకృష్ణదేవరాయలు రచించినాడనే సిద్ధాంతముపట్ల నాకు నమ్మకము లేదు.

నిజమైన సాహిత్య వ్యాసంగమును హర్షించగలవారు మన దేశములో బహుకొద్ది. ఆ కొద్దిమందిలో మీరుఒకరు. అలాంటిమీరు, శృంగారనైషధముపై నా వ్యాఖ్యానము ఎలావున్నదో, వ్రాసినారు కాదు. అనర్హులు వేయిమంది పొగడినా తెగడినా, ప్రయోజనమేమిటి? మీరు మీ అభిప్రాయముగా నాలుగు పంక్తులు వ్రాయనందుకు, నా మనసు క్షోభపడుతున్నదంటే, మీరు ఆశ్చర్యపడనక్కరలేదు. శృంగార నైషధము వ్యాఖ్యానముమీద మైసూరునుండి శ్రీ రామలింగారెడ్డిగారు దయతోపంపిన అభిప్రాయమును, మీ పరిశీలనార్థము ఇందులో జతపరచివుంచాను. ఒక విషయమును, గౌరవనీయుడైన స్నేహితునికి తెలియచేయడము తప్ప, రెడ్డిగారి అభిప్రాయమును మీకు పంపడములో నాకు వేరే ఉద్దేశములేదు.

...ట్రికు, ఇంటర్మీడియటు, బి.ఏలకు సంబంధించిన 'బోర్డు ఆఫ్ ఎక్జామినర్స్' నుండి నన్ను తప్పించినట్లు మీరెరుగుదురు. మీరేకనక నాయెడల దయచూపి వుండినట్లయితే, యిది సంభవించెడిది కాదేమో అనుకుంటాను.

* * *

# డైరీలు

**16 ఆగస్టు :**

మహారాజావారి ఆస్థానములో 'డిబేటింగుక్లబ్' ఏర్పడినది. ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడితిని.

**6 సెప్టెంబరు :**

సెలవు వొకనెల పొడిగించితిని.

**16 సెప్టెంబరు :**

శర్మగారివద్దవున్న నా ప్రాక్టీసాఫ్ ఎలక్యూషన్ (వక్తృత్వాభ్యాసము) అనే గ్రంథం తేవలెను. 'లివింగ్ ఆథర్స్' (సజీవకవులు), 'హిస్టరీ ఆన్ ఎలక్యూషన్' అనే పుస్తకములు ప్రిన్సిపాలుగారివద్ద వుండిపోయినవి. ఎ లుక్ రౌండ్ లిటరేచర్ (సాహిత్యసమీక్ష) ఎనాలిసిస్ ఆఫ్ యింగ్లీషు లాంగ్వేజి (ఆంగ్లభాషావిమర్శ) ప్లెజర్ ఆఫ్ డిసల్యూటరీ రీడింగ్ (ఇచ్ఛానుసార పఠనమందలి ఆనందము) గ్రంథములను చదివితిని.

**4 అక్టోబరు, శుక్రవారం :**

విజయదశమి పండుగ, 'రెండుసంవత్సరముల క్రిందట ఈరోజున నాకీప్రస్తుత ఉద్యోగము లభించినది. అందువల్ల నాకెట్టి మనశ్శాంతికలిగినదో మహారాజావారికి తెలిసివుండదు. మహారాజావారిని పరమేశ్వరు డనుగ్రహించుగాక సి.సి.గారి కొరకు నా ప్రార్థనలు.

**6 అక్టోబరు, ఆదివారం :**

మహారాజావారు జె.యస్. తో, 'ప్రతివారము హార్పులో కవిత్వము వ్రాయరాదా?' అనిరి. మానవులలోగల పశుప్రవృత్తినిగురించి చర్చజరిగినది.

**7 అక్టోబరు, సోమవారం :**

గతనెల మొదటి తేదీ నుంచి నాకు జీతంలో అయిదు రూపాయిల యింక్రిమెంటు వచ్చింది. ఆర్డరు నెంబరు 118. కళాశాలలో చరిత్ర పాఠములను బోధిస్తూ వున్నంతకాలమూ యిది అమలులో వుంటుంది.

**8 అక్టోబరు మంగళవారం :**

నా కింతకంటె హెచ్చు యింక్రిమెంటు యీయలేక పోయినందుకు ప్రిన్సిపాలుగారు తమ విచారమును వెలిబుచ్చిరి.

కోటలో యివాళ "జ్ఞానప్రదమైన సాహిత్యము, శక్తివంతమైన సాహిత్యము". అనే సంప్రదాయ సిద్ధమైన సారస్వత విభాగమును గురించి చర్చ జరిగినది.

**27 అక్టోబరు, ఆదివారం :**

కాంగ్రెసు మీటింగు, బ్యాంకు ఏజంటు మార్కనలుగారికి నా ఉపన్యాసము పంపవలెను. మాధవరావుగారికి 'హేర్పు'లో ప్రచురించడానికి ఉపన్యాసపు కాపీ కావలెనట.

**8 నవంబరు :**

మహారాజావారి నాటక సమాజమువారు 'శకుంతల' ప్రదర్శించిరి. మహారాజావారు ప్రదర్శనమునకు విచ్చేసిరి.

**10 నవంబరు :**

మహారాజావారు విజయనగరంనుంచి బయలుదేరారు.

## 1891

**30 జూన్ :**

దేవరపల్లిలో రాజమ్మ వివాహమహోత్సవం.

## 1892

**17 అక్టోబరు :**

మహారాజావారివద్ద రెండువేల రూపాయిలు బదులు పుచ్చుకున్నాను.

## 1893

**10 డిసెంబరు, ఆదివారం :**

ఉదయము 5 గంటలకు ఆడుతూ పాడుతూ భోజనం చేసి 7 గంటలుకు విజయనగరంలో రెయిలు యెక్కడమైనది. రెయిలు పడివరకు యెప్పుడు పడునని ఆసక్తితో యెదురుచూచుచుంటిమి ; గాని రెయిలు పద్దతర్వాతకూడ గొణగడముకు కావలసినన్ని అవకాశములు రెయిల్వేవారు కల్పించినారు. ఊళ్ళదగ్గిర స్టేషనులు వుంటే ఉపద్రవము వస్తుందని కాబోలు ; యోచించి కాళ్ళకు కసరత్తు కలిగి పురజనులు దృఢముగా వుండగలుగుటకు ఊళ్ళకు కడుదూరముగా స్టేషనులు వుంచినారు. కొన్నిచోట్ల తునితగువులుకూడ చేయుచు వచ్చిరి. అలమండ స్టేషను వూరికి రమారమీ రెండుమైళ్ళ దూరము : సింహాచలస్టేషను వూరికి మూడు మైళ్ళు. వాల్తేరు స్టేషను త్రిశంకుస్వర్గమువలె వాల్తేరుకు విశాఖపట్నముకు అంటివుండక రెంటికీ యెడమగా వున్నది. విజయనగరంనుంచి అనకాపల్లి వెళ్ళగోరువారు అసావాదిత్యోబ్రహ్మ అని అనకాపల్లి త్రోవవదలి వాల్తేరు స్టేషనుయాత్రచేసి వొక గంట ఆ స్థలమును సేవించి, తిరిగి వదలిపెట్టి అనకాపల్లి, త్రోవవరకు వెనుకకు త్రొక్కి అక్కడనుండి అనకాపల్లి వెళ్ళేసరికి మధ్యాహ్నము కాగా,

ఆ యెండలో వూరికి అద్దెబళ్ళకుగాను బండి వారలతో అద్దెనుగురించి పోరాడి, వూరుచేరి మూడుఝాములలోగా యిన్ని మెతుకులు కదుపులో వేసుకొన్నయెడల కృతార్థులని యోచించ తగును.

## 1895

**3 జనవరి, లక్ష్మివారం :**

జనవరి నెలకు నాకు రావలసిన అలవెన్సు యిదివరకే షరీఫువద్ద పుచ్చుకున్నాను. సోమరాజు బావ నాకు యివ్వవలసిన సొమ్ము పంపించమని ఉత్తరం రాశాను. 10 రూ॥లు నగదు, స్టాంపుకోసం పుచ్చుకున్నది 10 రూ॥లు, రిజస్ట్రేషను రుసుం, 10, మందులకు 150, ఆక్సుఫర్డు పుస్తకాలకు 8 రూ॥లు, పెళ్లికి సామానులు కొనేందుకు 23, మొత్తం 211 రూ॥లు.

ఇవాళ కోటలో ఫేన్సీడ్రస్ వినోదములు, విందు.

**5 జనవరి, శనివారం :**

కృష్ణాజిల్లాలోని వీరవల్లి స్టేషనుసమీపాన వొక కొలను కలదు. గట్టుచుట్టూ తుమ్మచెట్లు, యీతచెట్లు, చాలా చెరువులు అలాగునే వున్నవి. రాజమండ్రివద్ద గోదావరి అవతల ఒడ్డున రోడ్డుకిరువంకలా తుమ్మచెట్లకింద "పచ్చికమాసికలు" కనిపించినవి. బెజవాడ సమీపంలో ఎన్నోతుమ్మచెట్లు, పచ్చిక బయలు. ఎంతో ఏపుగా పెరుగుతున్న ఆగడ్డి ఏమిటిచెప్మా ! బెజవాడవద్ద సీమచింత మొక్కలవరసలను చూశాను.

**9 జనవరి, బుధవారం :**

విజయనగరంనుంచి సాయంత్రం ఆరుగంటలకు బయలుదేరాను.

**10 జనవరి, లక్ష్మివారం :**

ఉదయం ఆరుగంటలకు రాజమండ్రీ వచ్చాను.

**11 జనవరి, శుక్రవారం :**

ఉదయం ఏడు గంటలకు బెజవాడ బయలుదేరాను. విజయనగరం మహారాజావారి ట్రెయినులో ఎక్కాను.

శ్రీ మోహనురావు చాలా మంచి వ్యక్తి. తన కొడుకును ఎంతో ఆప్యాయంగా ముద్దుముద్దుగా పెంచుతున్నాడు.

**12 జనవరి, శనివారం :**

ఇంకా మార్గమధ్యంలోనే వున్నాము. నంద్యాల దాటింది రైలు. నంద్యాల ప్రాంతం సొగసుగావుంది. కొత్తగా బాగుచేసి దున్నిన అడవిప్రదేశం చాలాకనబడుతూ వుంది. ఆముదపుపైరు ; కంది వ్యవసాయం కనబడదు. ఈ జాతి ఆముదపు మొక్కలే యీ భూమిలో ఎక్కువగా పెరుగునుకాబోలు ! కంకరభూమి. ఎక్కడ చూసినా ఆముదాలపైరే !

**13 జనవరి, ఆదివారం :**

ఉదయం మద్రాసు చేరుకున్నాము. అడ్మిరాల్టీహౌసు, అందమైన భవనం. మహారాజావారు, బిల్డింగంతా మాకు చూపించారు. తమ ఉద్దేశాలను, ఊహలను, ఆశయాలను, విధానాలను కొంతవరకు మాకు వివరించారు. భూములమీద, భవనాలమీద డబ్బు పెట్టుబడిపెట్టడం, దానికిగల ప్రాధాన్యత. మెట్రొపాలిస్‌లో మొట్టమొదటసారిగా

భవనంకొన్న మహారాజా యీయనే. మిగిలిన రాజులు కూడా యీయన్ని అనుసరిస్తారనుకుంటాను. అయితే 'సిటీ' అభివృద్ధి అవుతుంది. మహారాజావారి భవనం, మద్రాసులోకల్లా దివ్యమైనదని అంతా పరిగణిస్తున్నారు. ఇందుకు శ్రీ బాలయ్యనాయుడిగారిని అభినందిచక తప్పదు. మహారాజుకు తగినభవంతి.

**14 జనవరి, సోమవారం :**

అడ్మిరాల్టీహౌస్‌వలె ఫూల్‌బాగ్‌ను ఎందుకు అభివృద్ధి పరచకూడదు ? భవనంమాటకాదు ; తోట సంగతి.

**16 జనవరి, బుధవారం :**

కేశనపల్లి నరసింగరావు పంతులు ఇవాళ సాయంత్రం రమ్మనమని నాకు కబురంపారు. ఈనెల 17, 18, 19 వ తేదీల బేటా, ఆర్రూపాయిలు శ్రీ బాలయ్యనాయుడుగారు యిచ్చారు ; ఇమ్మనమని నే నడగలేదు.

**18 జనవరి, శుక్రవారం :**

శ్రీ మాధవరావుగారిని చూస్తున్నకొద్దీ ఆయనమీద నాకు గౌరవం హెచ్చుతూవుంది.

నంబరు 32, తంబుచెట్టివీధినుంచి శ్రీ జి. నారాయణ మూర్తిగారిలేఖ.

**19 జనవరి, శనివారం :**

జె.యం. గ్లీసస్ ఎస్క్వైర్, సూపరెండెంటు, సెయింటు జార్జికెథడ్రెల్‌రోడ్డు, తేనాంపేట.

శ్రీ మాధవరావుగారివద్ద 27 రూపాయలు చేబదులు పుచ్చుకున్నాను.

**21 జనవరి, సోమవారం :**

ఇవాళ బి.ఏ లను గురించీ, ఎలక్షన్లగురించీ తమ అభిప్రాయాలను మహారాజావారు మా యెదుట వ్యక్తపరచారు.

ఉదయపూర్ దివాన్ పన్నాలాల్జీకి స్వాగతమిచ్చారు. దివానుగారు వృద్ధులు. కాని మంచి ఆరోగ్యవంతులు. నవ్వుతూ కనిపించారు. ఆయన తాతగారే కాబోసు, మహారాజావారికి లోగడ ఉదయపూర్‌నుంచి ఉత్తరం వ్రాస్త. మహారాజావారు తాము కూచున్న కుర్చీలోంచి కొంచెంలేచి ఆయనకు నమస్కరించారు. కుర్చీ చూపించి కూచోమని గౌరవించారు. దివానుగారు రాజావారియెడల ఎంతో గౌరవం కనబరిచారు.

**31 జనవరి, లక్ష్మివారం :**

మహారాజావారు విజయనగరం బయలుదేరారు.

**7 ఫిబ్రవరి, లక్ష్మివారం :**

టిఫిన్ ఏడణాలు.

లిటరరీ సొసైటీ నుంచి శ్రీ సూర్యనారాయణ పంతులు తెచ్చిన పుస్తకాలను వొక వాల్యూంతప్ప, మిగిలినవన్నీ వాపసు చేశాను. మహారాజావారివద్ద లేనివి మూడు గ్రంథాలు యిక్కడ వున్నాయి.

**8 ఫిబ్రవరి, శుక్రవారం :**

పొద్దున్నే వొక మోతాదుమందు.

కోచ్‌వానికి అణాముక్కాణీ యిచ్చాను. పోస్టేజి నాలుగణాలు. లిటరరీసొసైటీ లైబ్రరీనుంచి ఇండియన్ ఆంటిక్వరీ వాల్యూములు పట్టుకొచ్చాను. కంపోజిటరుకు ఒక రూపాయి యీనాంయిచ్చాను. పనిచూస్తే చాలావుంది. చేతినిండాపనే. అయితే వున్నది మాత్రం ఒక్కడు. మిగిలినవాళ్ళంతా ఎవళ్ళపనుల్లో వాళ్ళు మునిగివున్నారు.

టిఫిన్ నాలుగణాలు.

**9 ఫిబ్రవరి, శనివారం :**

టిఫినుకు ఏడణాలు. రాత్రి, మాత్రవేసుకున్నాను.

**10 ఫిబ్రవరి, ఆదివారం :**

విజయనగరం టెలిగ్రాం. రెండు మోతాదుల కాడ్ లివరాయిలు. ఒక్కొక్క మోతాదు చెమ్చాడేసి. మోతాదులోపాటు రాత్రిమాత్ర.

**12 ఫిబ్రవరి, మంగళవారం :**

వంటలక్కకు అయిదు రూపాయిలు. రూపాయీ రెండణాలుపెట్టి అరరీము కాగితం కొన్నాను. టిఫిను నాలగణాలు. రెండణాలకు రెండు కొవ్వొత్తులు.

**13 ఫిబ్రవరి, బుధవారం :**

కథలు.

దూడ, గడ్డి, వూక తినుట
పరిమానందయ్యగారి శిష్యులు
ఏనుగు, కాకి, రెండుపావురములు
తోప
వంటపాత్ర
చీమానెమలి నేస్తం
రాజూ, అడవిమనిషీ
తనభార్యను రోసినరాజు

**17 ఫిబ్రవరి, ఆదివారం :**

ఓరియంటల్ లైబ్రరీ కేటలాగుకోసం శ్రీ శేషగిరి శాస్త్రియర్ యింటికి వెళ్ళాను. అక్కడ మైసూరు శేషన్నవీణ, జలతరంగిణి, వాయిద్యం ఎంతో బాగున్నది.

**18 ఫిబ్రవరి, సోమవారం :**

క్రీటీ త్వరగా రాధాబాబు సాహేబ్‌కు పంపించమని కలకత్తానుంచి టెలిగ్రాం.

శ్రీ బాలయ్యనాయుడుగారు, కబురు తోలేశారు. వంటలక్కకు అయిదు రూపాయీ లిచ్చాను.

**19 ఫిబ్రవరి, మంగళవారం :**

టిఫినూ, బిస్కట్లు రూపాయిబేడా. బి.యస్. గారికి టెలిగ్రాం. రాత్రి అడ్మిరాల్టీకి తిరిగివచ్చాక టెలిగ్రాం చూశాను. ఎనిమిదణాల పోస్టేజి.

**20 ఫిబ్రవరి, బుధవారం :**

మహారాజావారి కిచ్చిన టెలిగ్రాంకు మూడు రూపాయిలు. పుస్తకాలు కొన్నాను. గ్రామరు ; వాగ్విధాయిని; కథాసప్తతి, డిక్షనరీ పది రూపాయిలు. మొత్తం పధ్నాలుగు రూపాయిలు. సుల్తాన్ హోలువద్ద వేలంపాటలో కొన్న వస్తువులకు రెండు రూపాయిల పదిహేనణాల పరకా. ఒక ఫిల్టరూ, నాలుగుస్పూనులూ, టీసెట్టూ, పిల్లలకురెండు ఆటబొమ్మలూ.

అడ్మిరాల్టీకి వచ్చేసరికి నా కోసం నిరీక్షిస్తూ కూచున్న శ్రీ సుందర్రావు కనిపించాడు. తన స్నేహితులు బాబూజీ, అయ్యంగార్లను కలుసుకోమని చెప్పారు. వివేకానందుని శిష్యులలో వీరిద్దరూ ప్రప్రథములు, మీటింగులు, వక్తృత్వము, లిటరరీ సొసైటీలను గురించి మేమిద్దరం చాలసేపు ప్రసంగించుకున్నాము.

**21 ఫిబ్రవరి, లక్ష్మివారం :**

ఫైనల్ ప్రూఫ్‌లను పోస్టుచేశాను. రూపాయి పన్నెండణాలు యిచ్చి వొక జోళ్ళజత కొనుక్కున్నాను.

**22 ఫిబ్రవరి, శుక్రవారం :**

పి. సీతారామరాజువద్ద నాలుగు రూపాయలడిగి తీసుకున్నాను. టిఫిను ఎనిమిదణాలు. పుస్తకాలకు రెండ్రూపాయిల పదమూడణాలు. కోచ్‌వానికి బేడ.

**23 ఫిబ్రవరి, శనివారం :**

పుష్పప్రదర్శనం, గొట్టుముక్కల వెంకటరామరాజువద్ద పది రూపాయిలు చేబదులు.

టెలిగ్రాం, పిల్లలకు బొమ్మలు.

**24 ఫిబ్రవరి, ఆదివారం :**

ట్రిప్లికేనులో బోటుఫెస్టివల్. పదణాలు బట్లరుకీ వెంకటనాథానికి రెండ్రూపాయిలు, కొవ్వొత్తులు రెండణాలు. అయిదు రూపాయిలు వంటమనిషికి. రెండ్రూపాయిలు పుస్తకాలకు.

**26 ఫిబ్రవరి, మంగళవారం :**

చాకలాడికి తొమ్మిదణాలపరక. ఇరవై రెండుబట్టలు వేశాను.

**27 ఫిబ్రవరి, బుధవారం :**

మిస్టర్ అండర్‌వుడ్‌కు కథలు : వైద్యుడు గుర్రం ; వైద్యుడు కరక్కాయ ; రాజు మంగలిని మంత్రిని చేయుట; మిడుతంభట్లు ; సవారి : ముందూ వెనకా ; జ్యోతిష్కుడు ; మంచిగంధపుచెట్లు అమ్మడం ; ససేమిరా: ఏకః పంథానుకర్తవ్యం ; రాజుభార్య రాజును చంపుట : మంత్రి భార్యా బతికించుట ; పక్షులు మాట్లాడుకోవడం: రాచకన్యల తాలూకు బట్టల నిమిత్తం కుమారుడు.

2 మార్చి శనివారం.

శ్రీ కళ్యాణ రామయ్యొరు మాకు టిక్కెట్లు యిచ్చారు స్త్రీలు చక్కగా అభినయించారు

3 మార్చి ఆదివారం

రాజగోపాలాచారిని చూశాను కాలేజీలో మీటింగుకు వెళ్ళాను శశిపాదబెనర్జీ కాన్ఫరెన్సుకు బయలుదేరాం

9 మార్చి శనివారం

బంతి బాడిద మందార పూతపూసిన మామిడి

పరమేశ్వరన్‌పిళ్ళేగారిని ఓరియంటల్ లైబ్రరీలో కలుసుకున్నాను ఆయనతో నాకు పరిచయమయింది

10 మార్చి ఆదివారం

కథలు గారడీవిద్య విక్రమార్కుడు దొంగతనం ఒతను సాని యింటికి వెళ్ళుట రాజు దొంగతనం నేర్చుట నక్కలరాజు రాజు కొమారుడు వుండు యిల్లు పురోహితుడి కుమార్తె బాచిగాడు నెల్లూరి ప్రయాణం మంత్రి బంగారం గిన్నె యెత్తుకుపోవుట గొడ్డు గోతబడ్డది

11 మార్చి సోమవారం

లోకల్‌న్యూస్‌లో ఒతిముఖ్యమైన సమాచారం కనబడ్డది ఆపరేషన్

13 మార్చి బుధవారం.

క్రిష్ణంరాజ గారితో రిజిస్ట్రేషనాఫీసుకు వెళ్ళాను

సెనేటుహౌసులో సుందర్రావు పంతులుగారిని చూశాను అక్కడనుంచి బీచికివెళ్ళాం సాయంకాలం సంజచీకటి చల్లనిగాలి గాలిచల్లదనాన్నీ సంజచీకటినీచూసి ఆనందించాం అనేక విషయాలపైకి మా ప్రసంగం మళ్ళింది అత్యంత మధురమైనవేళ

గంటకుపైగా అక్కడనే వుండి గాలీ చీకటీ అనుభవించి సుందర్రావుపంతులు యింటికి వెళ్ళాం

14 మార్చి లక్ష్మివారం

రబ్బు కెస్ ఎమ్ ఏ యమ్ ఆర్ ఏసీ ఎగ్రికల్చరల్ కాలేజి ప్రిన్సిపాల్

మెమోరియల్ మీటింగుకు వెళ్ళాను ఉపన్యాసములు చాలామటుకు పాదుగానే వున్నవి శ్రీ పరమేశ్వరన్‌పిళ్ళే ఉపన్యాసం చాలా ఉత్తేజకరంగా వున్నది కాని ఉపన్యాసం చెబుతూ మాటిమాటికి ఉద్రేకపడ్డారు మనిషిలో అలసట కనిపించింది కొందరి ఉపన్యాసములలో హుందాతనమూ ఔచిత్యమూ లోపించినవి

తరువాత యింటికి బయలుదేరాను వెంకటపతిరాజుగారి వద్ద పదిరూపాయలు చేబదులు, ట్రీటీబుక్కుకు నాలుగు రీముల కాగితం

15 మార్చి, శుక్రవారం

అడ్మిరాల్టీలో బాలస్వామినాయుడుగారిని కలుసుకున్నాను ఆయన సన్మెంతో ఆదరించారు నూతనభవనం సరికొత్త డిజైన్లతో బాగుంది ఎదుట తోట మరీ బాగుంది

నాలుగువందల రూపాయలు డ్రా చేశాను

**19 మార్చి, మంగళవారం :**

ఉదయం తొమ్మిదీ పదిగంటలమధ్య బసనుంచి బయలుదేరి క్రిస్టియను కాలేజీకి వెళ్ళితిని. దిగువ గదులలో పిల్లలు రణగొణ ధ్వని. పెంకు లెగిరిపోయేటట్టు వీళ్ళింత గోలగోల చేస్తూవుంటే వింటూ ఊరుకున్నారు. విద్యార్థులు పెంకెఘటాలే, స్కూలు గోడలనిండా పెన్సిళ్ళతో ఏవేవో రాసి నానా ఖంగాళీ చేశారు. డాక్టరు మిల్లరు పిల్లల్ని కట్టుభాయిదాల్లో వుంచలాడనే వింటినే !

క్లాసు రూములు చిన్నవి. ఎత్తు తక్కువ. పిల్లలతో క్రిక్కిరిసి వున్నాయి. సొగసైన బెంచీలు. కొందరికి బెంచీలతో పాటు డస్కులుకూడా వున్నాయి. ఇనప కమ్ములతో డస్కుల తీరు బాగున్నవి.

డాక్టరు మిల్లరుదొర ప్రయివేటు రూము చాలా చిన్నది. ప్రొఫెసర్లు పాఠాలు చెబుతూవుంటే నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టే వుంది. తాము చెప్పేదంతా పిల్లలకు వినబడునో లేదో అని నా సందేహం.

రిఫరెన్సు లైబ్రరీ, పుస్తకాలతో నిండుగావుంది. గది కవతల గోడ కెదురుగా పుస్తకాల జాబితా ; చక్కటి షెల్ఫులలో పుస్తకాల పేర్పు ; అక్కడనే ఒక బంట్రోతు నించుని వున్నాడు. ఇతనికి కొంచెం యింగిలీషు వచ్చునుకాబోసు. పిల్లలకి కావలసిన పుస్తకాలు ఇతనే యిస్తూవుంటాడు. తమకు ఏయే పుస్తకాలు ఎప్పటిలోగా కావలెనో విద్యార్థులు చిన్న కాయితం ముక్కమీద రాసి వుంచుతారు.

విద్యార్థులు పుస్తకాలను చక్కగా పఠిస్తున్నట్టే కనబడుతున్నది. లయిబ్రరీలోవున్న గ్రంథాలను బాగానే వినియోగించుకుంటున్నారు. జనరలులయిబ్రరీలో చెప్పుకోతగ్గ విశేషమేమీ నాకు కనుపించలేదు. అలమారాలు బహు అందంగా వున్నాయి. చెక్కడపుపని బాగున్నది.

**20 మార్చి, బుధవారం :**

మిస్టరు కూపర్‌ఓక్లీని చూస్తిని. మనిషి గట్టివాడు. దాపరికంలేకుండా యిష్టాపత్తుగా మాట్లాడినాడు. పచ్చయ్యప్ప కాలేజీకంటె ప్రెసిడెన్సీ, క్రిస్టియను కాలేజీలే నయమట ! తన విద్యార్థులు పేదతనంవలన క్లాసు పుస్తకాలు కొనుక్కోజాలకున్నారట. మా కాలేజీ అంటే ఆయనకు చాలా గౌరవభావమున్నది. నన్ను పాఠములు విననివ్వవలసినదని కోరితిని. అందుకు తమ తాబేదారులు యిష్టపడరేమో అన్నారు.

**21 మార్చి, లక్ష్మివారం :**

ఉదయం తొమ్మిది గంటలకు డాక్టరు మిల్లరును చూడవెళ్ళితిని. నేను వెళ్ళీవెళ్ళగానే నన్ను చేతులతో ఆప్యాయంగా పట్టుకున్నాడు. వీపు తట్టాడు. ఎంతో మర్యాదతో మన్నన చేస్తూ పలకరించాడు. కుశలమడిగాడు. విజయనగరంలోవున్న తన పాతవిద్యార్థుల యోగక్షేమాలను భోగట్టాచేసి తెలుసుకున్నాడు.

కాలేజీలో కాస్సేపుండి, తిన్నగా అక్కడనుంచి రామస్వామిచెట్టి అచ్చాఫీసుకు వెళ్ళాను. అతని తమ్ముడు ఆఫీసులో కూచునివున్నాడు. ఇద్దరం అవీ యివీ ముచ్చటించుకుంటూ కొంతసేపు కాలక్షేపం చేశాము.

నాలుగోఫారం మళ్ళీ అచ్చువెయ్యమని చెప్పాను.

కాన్వొకేషనుకు హాజరవుతున్నానని తెలియచేస్తూ సెనేటు కొక దరఖాస్తు పంపించాను. శ్రీశ్రీనివాసశాస్త్రిగారికి లేఖ రాశాను.

23 మార్చి, శనివారం :

'చంగాంగడి' వద్దవున్న థియేటరులో బాలామణి జట్టునాటక ప్రదర్శనం. రమ్మనమని శ్రీ బాలస్వామి నాయుడుగారు నన్నూ, శ్రీనివాసాచారిశాస్త్రిగారినీ ఆహ్వానించారు. ఇక వెంకట్రావుపంతులుగారు సరేసరి ! రానంటోన్నా బలవంతంమీద కిందటి శనివారం రోజున నన్నక్కడికి లాక్కుపోయారు. జింకుషీట్లతో కట్టిన హాలు. మధ్యమధ్యన యినపవాసాలు. కాని థియేటరున్న సందు మురికివాసనతో అడుగుపెట్టడానికే రోతగా ఉండెను.

పోయిన శనివారం ప్రదర్శనానికి బోలెడంతమంది జనం వచ్చారు. హాలు క్రిక్కిరిసిపోయింది. హాలు వెలుపల తొడదొక్కిడి లావుగావుండెను. లోపల కూచుందుకు జాగావే దొరికిందికాదు.

'మాస్కాను' తోటలో బాలామణి ప్రదర్శించిన శకుంతల నాటకం కూడా చూస్తిమి. మేం వెళ్ళేసరికి తృతీయాంకం ప్రదర్శింపబడుతున్నది. శకుంతలను విడిచి దుష్యంతుడు తన నగరుకు వెడలిపోతున్న దృశ్యం అభినయిస్తున్నారు. బాలామణి చెల్లెలు దుష్యంతుడి పాత్ర ధరించింది. ఆమెరూపం వికారంగా వుంది. నడకలో రంగేలా. కంఠం విప్పితే ఆడదని యిట్టే తెలిసి పోతుంది. బాలామణి తప్ప ఆ జట్టులో చెప్పుకోతగ్గ మరివకమనిషి కనబడదు. మిగిలినవాళ్ళంతా ఎందుకూ పనికిరారనే చెప్పవచ్చును.

బాలామణి రూపం ఠీవిగావుంది. మనిషి నాజూకుగా దర్శనీయంగావుంది. ముఖంలో కొంత యౌవనలోపం కనబడుతున్నా లావణ్యం కలదు. వాచికం మధురంగానే వుండును కాని, కొంతయాస లేకపోలేదు. కంఠం మార్చగలశక్తి వున్నట్టు నాకు తోచదు. శాంతము, ఓరిమికల విషాదభూమికలను నేర్పుగా అభినయించగలదు. కరుణరసం వొప్పించడం అంత సహజంగా వుందనజాలను ; కొంత "అతి" వున్[illegible] అభినయించేటపుడు అనవసరంగా చీటికీ మాటికీ దుఃఖిస్తూవుంటుంది. శకుంతల ఇలాగున తరుచు దుఃఖిస్తూవుండాలని మూర్ఖతతో నాటకపుజట్టు నాయకుడు శాసించేడో, ఏమోమరి ! మొత్తంమీద బాలా మణినిచక్కని 'విషాదనటి' అని చెప్పలేను. విషాదనాయిక పాత్రను రమ్యంగా నటించగలదో లేదో నాకు సందేహమే. కాని మనిషి బాగున్నది. వేషము ధరించడంలో మంచి అభిరుచి వున్నట్టుతోచింది. అలంకరణ సొగసుగా కనిపించింది. పాత్రోచితమైన ఆహార్యము.

మద్రాసులోవున్న మోటు మనుష్యులను మెప్పించడం కోసమే కాబోలును, యీ జట్టులు ఆడే నాటకాలలో బండహాస్యమూ, మోటు శృంగారమూ వుత్పన్నము లవుతూవుంటవి. మంచి రసవత్తరమైన ఘట్టములలో కొసకు విషాదసన్ని వేశాలలో సైతం విదూషకుడు, సహజంగా నడిచిపోతున్న కథకు అడ్డు తగిలి అసంబద్ధ ప్రలాపాలతో రసాభాస చేస్తాడు.

బాలామణిజట్టులో మిగిలినవాళ్ళ వేషధారణ చాలాహీనంగా వున్నది. పాపం,మదరాసీలలో తక్కువ కులస్థులని చెప్పబడేవాళ్ళు అంత అందంగా వుండరు. అందుచేత నాటక రంగంమీద కాస్త కంటికింపుగా కనిపించేందుకు ఆర్భాటమైన అలంకరణ వీళ్ళకు అవసరం కాబోలు !

నాటక ప్రదర్శనలో సంగీత వాయిద్యాలు లెక్కకు మించినన్ని. సంగీతం అంతా వొట్టి అల్లరి. గడబిడగా తేలింది. ప్రహ్లాదనాటకలక్షణం బాలామణిజట్టు యిక్కడకూడా పోనిచ్చుకోలేదులావుంది.

పంచమాంకంలో దుష్యంతుడి దర్బారుదృశ్యం వొకంతకి తెమిలిందికాదు. శకుంతలా దుష్యంతుల సమావేశం గంటల తరబడి నడిచింది. ప్రశ్నమీద ప్రశ్న. ప్రశ్నలవర్షం ! సమాధాన పరంపర ! ఈ పంచమాంకాన్ని కాళిదాసు యెంతో నేర్పుతో నిర్వహించాడుకదా ! అంత రసవత్తరఘట్టాన్నీ అవలీలగా పాడుపాడు చేసి విడిచిపెట్టారు.

అన్నట్టు యింతసేపూ యీ విషయమే మరిచాను భరతుడు వేషం వేసిన గుంటడు కొండముచ్చులా వున్నాడు

పోయిన శనివారం బాలామణిజట్టు ప్రదర్శించిన నాటకం కొంతసేపు చూశాక కల్యాణరామయ్యరు నాటకానికి వెళ్ళాం అతని జట్టు ఆడుతున్న ద్రౌపదీవస్త్రాపహరణంలో చీరవొలుపు సీను చూద్దామని కుతూహలం బాల్కనీకి అవతలప్రక్క దూరాన ఆఖరు క్లాసులో కొన్ని నిముషాలపాటు నిలబడితిమి ఈ నాటకపు జట్టుకు విలువైన దుస్తులే వున్నవి కాని వేష రచన అసంబద్ధముగానూ వికారముగానూ కనిపించింది తలవెంట్రుకలు ముడిచి పెద్దకొప్పుగా చుట్టుకుని నెత్తిని టోపీ పెట్టుకుంటే రాచరీవి కనబడదు రాజవేషము వలె బొత్తిగా వుండదు ఇక దుశ్శాసనవేషము పెద్ద మీసాలు గడ్డము వింత తలపాగా ఇత్తడి బెట్లులు మా ప్రాంతపు పాములవాడి వేషమును తలదన్నుతున్నది దీనికి తోడు మరాటి కంపెనీలలోని రాక్షసవేషములవలె దుర్యోధనుడూ దుశ్శాసనుడూ పీండ్రించుకొని గావుకేకలు పెట్టారు బాలామణి తప్ప యీ మదరాసు నాటకకంపెనీలలో సహజంగా వచనం చెప్పగల నటిగాని నటుడుగాని వొక్కడూ కనబడలేదు వచనం సరసంగా సహజంగా పాత్రోచితంగా యాసలేకుండా చెప్పడము వీళ్లెవళ్ళకీ తెలియదు స్కూలు పిల్లలు పరీక్షాధికారి యెదట యేకరువుపెట్టినట్టు అనవలసిన ఆ నాలుగుమాటల్నీ గబగబ తరుముకుపోతారు ఉచ్చారణలో నిలుపులు సక్రమంగా వుండవు ఎవరి కేదితోస్తే అది ఎంత తోస్తే అంత మాట యాస ఇదివరకు కల్యాణరామయ్యరు జట్టు నాటక ప్రదర్శనాన్ని యింత పరిశీలనగా చూడలేదు గత శనివారం కొద్దిసేపే వుండి యింటికి వెళ్లిపోయినాను ఆవేళాయింతే దుశ్శాసన పాత్రధారి గుక్క తిప్పుకోకుండా పీండ్రించుకుని గగ్గోలుపెడుతూ నానా రభసా చేశాడు ద్రౌపదిముందు కుప్పిగంతులు వేస్తూ భయంకరంగా పులి గాండ్రుపెట్టినట్టు ఊరికే అరుపులు

ఈ మదరాసీలకు దీర్ఘోపన్యాసములు వందలకొద్దీపాటలూ హోరెత్తించే సంగీతమూతప్ప మరేవీ రుచించవనుకుంటాను కేవలం వచన నాటకమంటే వీ రా స్మరంతికే పోరేమో

ఈ వేళ తన చాకచక్యమంతా చూసి కల్యాణరామయ్యరు అభినయిస్తున్నాడు మనిషి వొడ్డు పొడుగూ బాగానే వున్నాడు ముచ్చట గొలుపుతున్నాడంటే పొరపాటుకాదు వేషధారణ ఆకర్షణీయంగా వుంది వేసుకున్న తెల్లని సిల్కు దుస్తులు సన్నని జరీ నాకు నచ్చినవి బట్టరంగు కంటికి యింపు గొల్పుతున్నది కాని వచ్చిన చిక్కల్లా అతని కళ్ళతోనే కళ్ళూ ముక్కూ తీరుగా లేకుండుటచేత వేషానికి లోపం కలుగుతున్నది కళ్ళు బండిచక్రాల్లా గుండ్రని ముక్కు చప్పిడి దూరంనుంచి చూస్తే విగ్రహం కంటికి కాస్త నజరుగానే కనిపిస్తుంది అయ్యరుకంఠంలో మృదుత్వంలేదు పాట సున్నితమూ కాదు రెండుకురెండే

చెపితే విచిత్రంగా తోచునేమోకాని అతని నటన అంతా మంచి చలాకీఅయిన పడుపుకన్య రకముగా వుంది బాలామణి శకుంతల వేషంలో బిడియం నమ్రత కనిపిస్తాయి

నాటకపుజట్టులలోనికి పడుపుకన్యలను చేరదీయుట హానికరమనే నా ఊహ అందకత్తెయై తెలివైన నటి పడుపు కన్యయేతే సంఘమునకు చాలా ముప్పు తెస్తుంది ఆమెకే కనక యెన్నికైన సౌందర్యం లావణ్యం వుంటే ఆమె చేసే అల్లర్లకు హద్దూ పద్దూ వుండదు

కల్యాణ రామయ్యరు నాటకప్రదర్శనం కొంచెంసేపు చూసి అక్కడనుంచి బాలామణి ప్రదర్శిస్తున్న నాటకం చూడవలెనని బయలుదేరాం వెళ్ళినవాళ్ళం బాలయ్యనాయుడిగారితో పన్నెండుమందిమి హాలు క్రిక్కిరిసివుంది

కూచుందుకు ఒక్కడికి కూడా సీటు లేకపోయింది. నించోడం అసాధ్యం. ఈ అసాధ్యాలను యిట్టే సాధించగలవాళ్లెవరైనా వున్నారా అంటే ఆయన బాలయ్య నాయుడుగారొక్కరే ! మహారాజా వారి ఉద్యోగులలో యింకొకరికి యీ చాకచక్యం లేదు. ఆయనపేరు చెబితేనే చాలును, కూచుందుకు చోటుతోపాటు ఆదరణకూడా లభిస్తుంది. ఆయనపేరు వింటే అందరికీ ఆకర్షణ కలుగుతుంది.

స్త్రీలు కూచున్నతట్టున వెనకభాగంలో మాకు చోటు దొరికింది. రిజర్వుడు క్లాసుకు వెళ్ళాం. టిక్కెట్టు ఖర్చంతా నాయుడుగారే పెట్టుకున్నారు.

బాలామణి 'దంబాచారి విలాస' ప్రదర్శనానికి చాలా ప్రసిద్ధి కలది. నాయిక పాత్రధారిణి హోషుగ్గావుంది. గొబ్బి ఆట బాలామణి ఎంతో నేర్పుతో సున్నితంగా ప్రదర్శించింది. ఇందులో ఒక దృశ్యంలో ఆమె యించుమించు దిగంబరిగా వచ్చి దంబాచారికి అభ్యంగనం చేయిస్తుంది. ఇది చూడడానికి చాలా మంది వస్తారు. ఇంగ్లీషు బ్యాలటువనితవలె బనియనులు వేసుకొని రంగంమీదకు దూసుకొనివస్తుంది.

ఆమె ముఖవర్చస్సు బాగున్నది. తల నున్నగా నాజూకుగా దువ్వుకొని సింగారించుకుంది. తలమీద సూర్యచంద్రుల ఆభరణాలు. ఇవి లేకుంటే యింతకంటే నయమనిపించును. నగ్నంగా యింగ్లీషుబ్యాలటువనితవలె బనియనులు ధరించి యీమె రంగంమీదకు రావడం నాకు నచ్చలేదు. వేషధారణ సహజంగా లేదు. పాత్రోచిత వేషధారణ అనజాలను. శృంగారవిలాసవిజృంభణ మృగ్యం. చలాకీతనం కనపడదు. మదనసుందరిగా అంతకంటే స్ఫురించదు. అభినయంలోను నడకలోను ప్రశాంతత ధీమా, సొగసూ వున్నవి. చిత్రమేమంటే యే మదరాసీ బంగారు పిచికనో యే చెట్టియారునో సర్వనాశనం చేసిన యీ భోగం పడుచు యీ 'దంబాచారి' నాటకంలో అట్టి సర్వనాశనము చేసే పడుపుకత్తెవేషం అభినయించి తన జీవితమునే గర్హింపజేసే నీతిని బోధించుట !

అయితేనేమి ఈమె పేర్కొనతగిన స్త్రీలలో వొకతె !

♦ ♦ ♦

ఈ వేళ పొద్దున్న వొక కుర్రాడు యిక్కడకు వచ్చి బాగుచేస్తాననే నెపంతో టెలిఫోను "జింక్సు" ను అటూ ఇటూ తుడిచేడు. బాగుచేయడంమాట దేవుడికెరుకగాని, తీరా వాడూ వెళ్లాక టెలిఫోను చెడిఊరుకుంది !

♦ ♦ ♦

తెలుగు మాట్లాడుతున్నపుడు తమిళుల ఉచ్చారణ : పదాలలో కలిగే మార్పు

వుండాది. పూడుస్తాడు. బెసిఅయింది. వెధవకొడుకు. తీస్తిని (Bought) అద (అదిగా) యక్కడనో (కో) సామి (అయ్యా)

ఉచ్చరించేటపుడు పదములోని మొదటి అక్షరంమీద ఊనిక హెచ్చు :

రెండుమనిషి : బిల్లుయత్తు ; చేస్తిని ; వెసుకుంటమూ; యేమిదండుగ ; కత్తిదారపోసినాడు (Lost mislaid) నెను మాచివాడు; లక్షణంగా.

**మార్చి 24, తేదీ ఆదివారం :**

శ్రీ బాలయ్యనాయుడుగారు కొంతమంది స్నేహితులను వెంటబెట్టుకొని యిక్కడకు వచ్చారు. నాకు వీరందరితోనూ పరిచయంకద్దు. సుబ్బారావుగారు జావళీలు చక్కగా పాడతారని ప్రసిద్ధి. కామస్వామినాయుడు,

షణ్ముగం చెట్టియార్లు ఎంప్రెస్ ఆఫ్ యిండియా ప్రెస్సుకు చెందినవారు. శ్రీనివాసాచారిగారు కొంతకాలం నాతోనే వుండిరి. మేమిద్దరం హాయిగా కొన్నాళ్ళు గడిపాం. సుబ్బరాయనుగారు మాతోపాటే. రోజూ రెండుమూడు బిలియర్డ్సు గేములు ఆడుకునేవాళ్ళం. ఇక టెన్నిసు ఆటకు మితమేలేదు. బాలయ్యనాయుడుగారు బంతిని బహు తమాషాగా కొడతారు. బహు నాజూకయిన స్ట్రోక్సు. కాని ప్రాక్టీసు చాలదు. కామస్వామినాయుడుగారి ఆట ఫరవాలేదనిపిస్తుంది. సుబ్బారావుగారిది ప్రశాంతమైన వ్యక్తిత్వం. నిశ్చలమైన స్వభావం ; ఆయన మాకు మొజార్టు వంటివారు.

షణ్ముగంగారిని చూడగానే చటుక్కున నాకు వెంకటాద్రి నాయుడుగారు జ్ఞాపకానికి వస్తారు. ఇద్దరి ముఖ లక్షణాలూ వొకేతీరున వుంటవి. దేనినీ లెక్కచేయనన్నట్టు ముఖంలో వొక ధీమా గోచరిస్తుంది. పిడుగు మీదపడ్డా చలించని ధీమా తొణకిసలాడుతూ వుంటుంది. నాయుడుగారు కలుపుగోరు మనిషి. అందరితోనూ కలివిడిగా వుంటారు.

తమిళదేశం, సంగీతంలో తెలుగుదేశంకంటె మిన్నకదా. అయినప్పటికీ తమిళులు పాడే పాటలన్నీ తెలుగుకృతులే అయివుండనేల? దీనికి కారణ మేమిటయి వుందునో అని యిక్కడి మిత్రులను చాలామందిని అడిగాను. తమిళముకంటె తెలుగుభాష యెక్కువ సంగీతమయంగానూ, మధురముగానూ వుండడమే దీనికి హేతువని మిత్రులు చెప్పుకొస్తున్నారు. ఏమైనప్పటికీ యిది పూర్తి నిజమనజాలను. తమిళభాష యేవిధంగానూ సంగీతమయం కాకపోదు. తెలుగు కృతులను తమిళులు పాడడానికి హేతువు 'యిదే'నని సమాధానం చెప్పుకోజాలను. దీనికి యింతకంటె బలవత్తరమైన కారణాలేవో వుండితీరాలి. వొకదేశం తన రహదారిని వొదిలి మాతృభాషను త్యజించి అన్యభాషను యెందుకు స్వీకరిస్తుందో సరియైన సమాధానం గ్రహించవద్దామరి !

ముసల్మానులు, యూరోపియనులు దక్షిణదేశంలో సామ్రాజ్యాలను స్థాపించుకోకపూర్వం అక్కడి పరిస్థితులు ఏలాగున వుండేవో గమనించినట్లయితే, యీ ప్రశ్నకు ప్రత్యుత్తరము లభించగలదని నా ఊహ. ఆనాటి దక్షిణదేశ స్థితిగతులే యిందుకు ప్రబలకారణమై వుండునని నాకు తోస్తున్నది. అప్పుడు దక్షిణదేశాన్ని పరిపాలించిన యేలికలు తెలుగువారు. అనగా మధురనాయకరాజులు, కంచిని ప్రధాన నగరంగా చేసుకొన్న చోళచాళుక్యులు ; విజయనగర రాజులు.

తెలుగుభాషకు కొన్ని అవకాశాలు కలమాట నిజమే ; సందేహంలేదు. ఎట్టి పరిమితులు లేకుండా తెలుగు, సంస్కృత భాషాపదములను స్వీకరిస్తుంది. తెలుగు అజంతభాష. అచ్చుల ఉచ్చారణము హెచ్చు. తమిళభాషలో కంఠ్యములు మిక్కుటము. 'ఠ' తరుచు వినిపిస్తూవుంటుంది. 'ర, ళ, డ'లకు ప్రాచుర్యము అధికము. సంయుక్తాక్షరములుకూడా తరుచు వినిపిస్తూనే వుంటవి. చాలాశబ్దములు హలంతములు.

*    *    *

టెలిఫోను సరిగ్గా పనిచేయడంలేదు. మహారాజావారు కలకత్తానుంచి బయలుదేరారట. సగం సగం మాటలలోనే, మాట పూర్తిగా చెప్పకుండానే అకస్మాత్తుగా టెలిఫోనుమూతి బిడాయించుకు కూర్చున్నదే !

**మార్చి 25, తేదీ సోమవారం :**

ఇవేళ యింటినుంచి యెక్కడికీ కదల్లేదు.

## పాత్రలు :

ఏకాంగి ఈయనొక యోగిపుంగవుడు స్ఫోటకపు మచ్చల ముఖము కొంచెము పొడుగైన నల్లని తలగుడ్డ చక్కరంగు జరీ మేలురకము కాషాయపు అంగీ ధరించి మహాజ్ఞానివలె నటిస్తూ వుంటాడు అబ్బో మనిషికి కొన్ని యింగ్లీషు ఫేషనులుగూడా పట్టుబడ్డవి మాటలధోరణి సాగుతూ వుంటే చీటికీ మాటికీ చేతిరుమాలు తీసి వాడుతూ వుంటాడు యెవరైనా ప్రశ్నిస్తే మహాపండితునివలె తల పంకిస్తాడు పాపం ముసలి కృష్ణంరాజుగారి కీతనివల్ల చాలా డబ్బు దండుగవుతూ వున్నది ఏకాంగిస్వామివారికి దయపుట్టి యిటు వచ్చినప్పుడల్లా రెండురూపాయలన్నర బండీ అద్దెకే ముడుపు చెల్లించుకుంటున్నారు స్వాములవారు తెలివితేటలు గలవాడే తెలివితేటలు వున్నవికాని వక్తకాదు మాటలధోరణి తెచ్చిపెట్టుకున్నదికాని సహజమైనదికాదు పామరజనాన్ని బాగా ఆకర్షించగలడు మావద్దకు వచ్చే బ్రాహ్మణులకు వైష్ణవులకు యితనంటే రోత ఇతనంత సుళువుగా కొట్టి పారవేయవలసిన మనిషికాదని చెప్పేందుకు యిదే దాఖలా శూద్రు లీతని పాదాలకు మ్రొక్కుతారు

కృష్ణంరాజుగారి వెంట వొక వైష్ణవ భిక్షువుకూడా తిరుగుతున్నాడు వాడు పచ్చి దొంగ శుద్ధస్కౌండ్రల్

**మార్చి 26 తేదీ మంగళవారం**

వినోలియా సబ్బొకటి కొనుక్కుంటిని బులుసు సూర్య నారాయణపంతులుగారికోసం మూడు రూపాయల పదణాలు పెట్టి వొక గడియారం కొన్నాను రామస్వామిచెట్టి షాపులో ఎనిమిది పాతవస్తువులకు ఎనిమిది రూపాయలు చెల్లిస్తిని 'వెస్టు ఫోరుమెనుకు రెండున్నర షీటుల పేపరుకోసం రెండు న్నరరూపాయలు యిచ్చాను ట్రీటీ నాలుగున్నర ఫారములు

♦ ♦ ♦

ఏకాంగి పునర్దర్శనం

♦ ♦ ♦

శలవు (expend ture) అన్నీ తడిసిపోయింది

విచారించుట (enqu re) తీస్తిని (bought)

నువపిందుకో (chewing betel leaves)

రైల్వేస్టేషనుకు వెళ్ళాను ఎంతబరువున్నానో తూచుకున్నాను ఎనభై ఎనిమిది పౌనులు ఏడు పౌనులు పెరుగుదల

**మార్చి 27 తేదీ బుధవారం .**

కృష్ణంరాజుగారివెంట తిరిగే వైష్ణవభిక్షువు చేతిలో యేదో జ్యోతి పెట్టుకుని తక్కుతూ తారుతూ నా గదిలోకి వచ్చాడు దేవుడికేదో చేస్తాడట అందు కతనికి యెంతో కొంత నా మనసుకు నచ్చినంత యివ్వవలెనని సూచించినాడు అలాగునా అని అతనికి కొంత తత్వబోధ చేశాను మారుమాటాడక వైష్ణవభిక్షువు మెల్ల మెల్లగా జారుకున్నాడు

వెంకటనారాయణరాజుగారీవేళ నాకో ముచ్చట చెప్పారు కథ వినడానికి కుతూహలంగా వుంది అది వెనక తమ బంధువులకూ వారి విరోధులకూ జరిగిన యుద్ధ కథ వెంకటనారాయణరాజుగారొక పాత్ర మంచి

నవ్వుతాలమనిషి. ఎప్పుడూ కులాసాగా వుంటారు. ఏదన్నా హాస్యంగానే తీసుకుంటారు. కాని తాను గౌరవిస్తున్న వ్యక్తి ఎవరైనా ఆయనతో పరుషంగా మాట్లాడితేమాత్రం విభ్రాంతు లౌతారు ; మొహం వెలవెల బోతుంది. రాజుగారి సంభాషణలో మాండలికపదాలు హెచ్చు. పలుకులో యాస ; సెసెచి ; సొం; యెటి ; యిత్యాదులు.

ఆయన చెప్పిన సోల్జర్ల ముచ్చట బాగానేవుంది.

♦ ♦ ♦

మాడుగులలోవయు, పార్కులో జరిగిన అగ్నిప్రమాదమును యేదైనా వొక నవలలో చిత్రించతగ్గవి.

* * *

ఇవాళెందుకో మనసు బాగుండలేదు. విచారం ముంచుకొస్తున్నది. మనసు పరిపరివిధాల పోతున్నది. మామావగారి కుటుంబం ! ఎంతమంది పోయారు ! వాళ్ళందరూ తలపుకు వస్తున్నారేమో మరి ! అందులోనూ చిన్నపిల్లడు చిట్టిబాబు పాపం !

మర్చిపోకుండా ఇవాళ గిడుగు రామమూర్తిగారికి ఉత్తరం రాయాలి. ఆయన్ని తలచుకుంటే నా కెంతో విచారంగా వుంది. ఈ దేశంలో గౌరవంగా బతికిన కుటుంబాల పరిస్థితులన్నీ యింతే ! కుటుంబయజమాని, ఆ వున్న కాస్త పెద్దదిక్కూ మరణించేసరికి, కుటుంబమంతా అవస్థలపాలు కావల్సిందే ! ఈ ·శపు పోకడే అంత !

**మార్చి 28 తేదీ లక్ష్మివారం :**

రామస్వామిచెట్టిగారి యింట ఆనందాచారిగారి కుమారుడు శ్రీనివాసాచారి కనుపించినాడు. మంచి యువకుడు; ఉత్సాహి. తన పత్రికానిర్వహణపద్ధతులు, కవితకు ముఖ్యంగా ఆధునిక కవితా వికాసానికి చక్కగా ఉపకరించడం లేదని అతనూ అంగీకరించాడు. ఇదే పద్ధతిలో కొనసాగించినట్లయితే ప్రజల దృష్టిని యెంతమాత్రమూ ఆకర్షించలేమని అన్నాడు. ఆంగ్ల సాహిత్య గ్రంథాలను, కావ్యాలను సమర్థతతో అనువదించగలవారు అట్టేమంది లేరని చెప్పాడు. కావ్యాలను సాధారణంగా మాతృకలతో సరితూగేటట్టు తర్జుమా చేయడం దుర్లభమని, అనువాదాలు జయప్రదం కావడం అరుదని అన్నాను. ఆమాటా నిజమేనని అంగీకరించాడు. దేశంలో స్వతంత్రరచనాశక్తి క్రమ క్రమంగా మృగ్యమౌతున్నదని విచారం వెలిబుచ్చినాడు.

* * *

ఇవాళ తెలుగుసంవత్సరాది. మహారాజావారిని దేవుడు అనుగ్రహించుగాక ! లోకంలో పరిపూర్ణానందం వెల్లివిరియుగాక !

**మార్చి, 29 తేదీ శుక్రవారం :**

కాన్వొకేషనుకు హాజరయితిని. ఏర్పాటులేమీ సంతృప్తికరంగా లేవు.

**మార్చి, 30 తేదీ శనివారం :**

డాక్టరు బ్రౌనింగు వచ్చాడు.

నాయుడుగారివద్దనుంచి సైనుల ప్రయాణపుఖర్చులకుగాను ఏభయి, మార్చినెల జీతాలనూ 'డ్రా' చేస్తిని.

ఈ వేళ సాయంకాలం స్కూలుపిల్లల సమావేశానికి వెళ్ళాను. స్వామినాయరుగారి స్మారకసభను విద్యార్థులు, టవును హాలులో యేర్పాటుచేశారు. సభకు మిస్టర్ నార్టను అధ్యక్షత వహించవలసియుండెను ; కాని ఆయన సభకు రాలేదు. శ్రీ పరమేశ్వరపిళ్లేగారు అధ్యక్షతవహించిరి.

♦ ♦ ♦

ది పిక్ పోకెట్.

రాత్రి థియేటరుకు వెళ్ళాను. జేబుదొంగ నాటక ప్రదర్శనం. పాత్రధారులు చాలా నెమ్మదిగా మాటలాడిరి. సంఘటనకు తగినవిధంగా పాత్రధారులు నటించలేకపోయారు. కథ ఏమంత ఆసక్తి కలిగించలేదు.

**31 మార్చి, ఆదివారం :**

అడ్మిరాల్టీ హావుసులో విందు జరిగింది. విందు యేర్పాటు చేసిన వారిలో శ్రీ పరమేశ్వరనుపిళ్ళేగా రొకరు. భోజనం బహురుచిగావుంది. వడ్డించిన పదార్థాలన్నీ చవులూరిస్తున్నవి. ముందు బ్రాహ్మణులకు వడ్డన. భోజనం చేసిన తరువాత మిగిలినవారు విందారగిస్తూవుంటే వారి ప్రక్కన కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పేందుకు మేమంతా వెళ్ళాం. విందు ముగిసేవేళ యింతమందిని ఆహ్వానించి చక్కని ఆతిథ్యమిచ్చిన శ్రీ పరమేశ్వరన్ ప్రభృతుల ఆయురారోగ్యాభివృద్ధిని కోరుతూ క్లుప్తంగా ఉపన్యసించాను. తరువాత అందరమూ సోడాలను తాగేం.

శ్రీనివాసాచారిగారూ, సుబ్బారావుగారూ కొంతసేపు కృతులను గానం చేశారు. నాయుడుగారికి మహారాజామీద గౌరవం హెచ్చు. ఆయన గొప్పతనాన్ని శ్లాఘిస్తూ కొన్ని పాటలు పాడవలసినదిగా నాయుడుగారు, శ్రీనివాసాచారి, సుబ్బారావుగారలను కోరారు. మహారాజావారిని తప్ప మరెవ్వరినైనా వారెంత గొప్పవారైనా కీర్తించడం తనకు అభిమతం కాదనీ, యింతటి గౌరవం చూపదగిన వ్యక్తి మహారాజావారేననీ నాయుడుగా రన్నారు.

నాయుడుగారికి తాము ఆనందంగా వుండడ మెలాగో తెలుసును. ఇతరుల ఆనందాన్నే తమ ఆనందంగా భావించుకునేగుణం ఆయనకు కలదు.

గిండీలోని డాక్టరు బ్రౌనింగు బంగళా. డాక్టరు యింటివద్ద లేదు. బంగాళాకు తూర్పుదిక్కు కభిముఖాన ఆఫీసురూము వున్నది. గది ఎంతో చల్లగా వుంది.

గిండీపార్కు కంటికి యింపుగా లేదు. నేలమీద పచ్చిక యెండిపోయింది. చెట్లు వొకదాని కింకొకటి యెడం యెడంగా వున్నవి. దూరదూరంగా వుండడానికి తోడు, వికృతమైన పెరుగుదల, చాలా అందవికారంగా కనిపిస్తున్నవి.

బ్రౌనింగు గదిలోవున్న అలమారానిండా పుస్తకాలు ; చాలావరకు మెడికల్ గ్రంథాలే. షేక్స్పియరు నాటకాలు గూడా కలవు. గదిచెంత బట్లరు నించుని వున్నాడు. అతనితో కొంతసేపు మాటలాడితిని. బట్లరుకు దొరమీద ప్రేమమిక్కుటముగా వున్నట్టు కనిపిస్తున్నది.

కేసులను పరీక్షించడంలో డాక్టరు బ్రౌనింగుకు మంచి ప్రసిద్ధికలదు. రోజులతరబడి వొక్కొక్కప్పుడు కేసులను నిదానంగా పరీక్షిస్తాడు. ఆలోచించి జాగ్రత్తగా పరిశీలించినమీదట కాని యే నిర్ణయానికీరాడు. వచ్చిన నిర్ణయాని కిక తిరుగువుండదు. వైద్య వృత్తిలో ఘటికుడనే ప్రతీతి. తాను యేమిఅనుకుంటున్నదీ మహారాజావారితో ముక్కుకు సూటిగా మాట్లాడగల నిర్మొహమాటి. ఈ నేర్పు కొద్దిమందికే వున్నది. మహారాజావారు లేనప్పుడుకూడా, మామూలు ఫీజుకంటే హెచ్చుగానే వసూలుచేశాడని బాలయ్యనాయుడుగారు నాతో చెప్పారు. బ్రేన్‌ఫోర్డు దొరకు రోజులు కలసిరాక, పేరు మరుగున పడిపోయిన తరువాత, వైద్యవృత్తిలో డాక్టరు బ్రౌనింగు బాగా పేరులోకి వచ్చి రాణిస్తున్నాడని, మదరాసులోవున్న మనవాళ్ళ అభిప్రాయం. ఈయన మెడికలు జర్నలులో వ్యాసాలు వ్రాసి ప్రచురిస్తున్నాడు. ఘోషా ఆస్పత్రి యితని అజమాయిషీక్రింద బాగుపడింది. వొళ్ళువంచి పనిచేసే స్వభావం. ఇతని వోర్మిని ఆసక్తిని చూసి గవర్నరుకూడా మెచ్చుకున్నారు.

ఇవ్వాళ నారాయణమూర్తిగారిని పరమేశ్వరను పిళ్లేకి పరిచయం చేశాను.

*   *   *

మీ అవయువాలకు వచ్చిన ప్రమాద మేమీ లేదు. అవి బాగానే వున్నాయి. కాని మీ నరాలుమాత్రం ఎక్కడి వక్కడ విడిపోయినట్టు ధ్వంసమయాయి. సాధ్యమైనంతవరకూ లైంగికసంబంధం పెట్టుకోవద్దు. ఇప్పుడు మీరు పెప్సిను పొడరు పుచ్చుకుంటున్నారుకదా ; ఆమందే యింకా కొంత కాలం వాడితే యిక ఆ మందు అవసరమే వుండదు, అవునండీ; మీరు బాగా పళ్ళరసం తీసుకోవాలి. సోడాకూడా మంచిది. మీరు కాలేజీనుంచి విరమించాలని నా అభిప్రాయం. ఎంత మాత్రం మీరిక కాలేజీలో పనిచేయకూడదని, వెంటనే విరమించాలని నా సలహా. నే నీమాట అన్నట్టు మహారాజా వారితో స్పష్టంగా చెప్పండి. శరీరానికి యెండతగలడం మంచిది కాదు. ఎండపొడ మీ శరీరానికి పడదు. అంతగా ప్రయాణం చేయవలసి వస్తే చేయండి కాని, వొంటికి ఎండా రొజ్జగాలీ తగలనీయవద్దు. శరీర దారుఢ్యానికి కాడ్‌లివరాయిలు సేవించండి. కొన్నాళ్ళు పుచ్చుకుంటే మీ ఆరోగ్యం చక్కబడుతుంది. సత్తువ కలుగుతుంది. పేటెంటు మందులని ఊరికే చెబుతూ వుంటారే, వాటిజోలికి పోవద్దు. అవన్నీ వట్టిమోసం, దగా, హంబగ్ ! వేసవికాలంలో చన్నీళ్ళస్నానం చేయవచ్చును. సైకిలు తొక్కితే గుండెకు ప్రమాదం వాటిల్లుతుంది. మీ మూత్రంలో జబ్బువున్నదో లేదో భోగట్టా మీరు తెలుసుకున్నందువల్ల ప్రయోజనమేమీ లేదు. అదియేమిటో తెలుసుకుందామనే శారీరకశాస్త్ర ఆసక్తితో అడుగుతున్నారు తప్ప, అది యెంతమాత్రమూ మీ ఔషధసేవకు యెట్టిభంగమూ కలుగుజేయదు. అది తెలుసుకోకపోయినంతమాత్రాన మీజబ్బు నిమ్మళించకపోదు.

**3 ఏప్రిల్, బుధవారం :**

ఇవాళ మదరాసునుంచి బెంగుళూరుకు ప్రయాణమయాను. రామస్వామిమొదలి సత్రవులో భోజనం దొరికిందికాదు. బెంగుళూరుకు సరాసరి పోయే రైళ్ళలో సెకండుక్లాసు కంపార్టుమెంటులు లేవు. కనక మెట్టుపాళియం రైలును ఎక్కాను. కంపార్టుమెంటులో మంచి యూరోపియను స్నేహితుడే దొరికాడు ; పేరు సి. హెన్రీ.

ఆర్కోణంలో వొక సంఘటన జరిగింది. జాలార్‌పేటలో బండి మారాను.

**4 ఏప్రిల్, లక్ష్మివారం :**

బెంగుళూరు చేరుకున్నారు. బాలయ్యనాయుడిగారికిక్కడ వొక మంచి యిల్లువుంది. అందరమైనదే. ఆయన యేజంటు వెంకోబరావుజీదేశముఖ్ నేనంటే శ్రద్ధాసక్తులు కనబరిచారు. ఎంతో మర్యాద చేశాడు.

సత్రవునానుకుని వొక వర్కుషాపు కలదు. మదరాసులో కంటే యిక్కడి పాటకజనం మంచి బట్టలనే ధరిస్తారు. రంగు రంగుల చీరెలను ఆడవాళ్ళు కట్టుకుంటారు.

ఇక్కడున్న నూతులు పాతాళంలో వున్నట్టు చాలా లోతు. ఒక దానితో యింకొకటి జతరపరిచి నాలుగుపెద్ద పలక రాళ్ళతో చుట్టూ నూతిగోడులు కట్టారు. నూతి వొరలు రాతితోనే నిర్మించుకున్నారు.

వీధిబడులలో పిల్లలకు తెలుగుకూడా బోధిస్తున్నారు. సముద్రతీరంలో సైతం ఉష్ణోగ్రత తొంభై డిగ్రీలదాకా పెరిగిపోతున్నదని వెంకోబరావు ఫిర్యాదు !

ఇక్కడ థియేటర్లు, నేటివుక్లబ్బులు, స్వభాషా పత్రికలు వున్నవో లేవో దర్యాప్తు చేయాలి.

బసకు వెళ్ళగానే ముందు మొహం కడుక్కుందామని వెంకోబరావుగారిని పందుంపుల్ల అడిగాను. నల్లటి టూతుపొడరు యింత పట్టుకువచ్చి ఆయన, నా చేతిలో పోశాడు. పందుంపుల్ల నా కెంత అనివార్యమో ఆయనకు బోధపడింది కాదు.

సరేనని వెంకోబరావుగారు నౌకరును పిలిచి వేపపుల్ల విరుచుకురమ్మన్నాడు. ఇంటి ఆవరణలోవున్న అంతచెట్టూయెక్కినౌకరు, అంగుళం వలం పందుంపుల్ల విరుచుకువచ్చాడు !

* * *

వీలుంటే నటేశశాస్త్రిగారినీ, రైస్‌దొరనూ కలుసుకోవాలి. సెయింటుజోన్సు స్ట్రీటులో వున్నారట. డాక్టరు హుల్సు, నంది‌దుర్గరోడ్డు ; మిస్టర్ రే : రాయలు ఆర్టిలరీ మెస్సు.

మిస్టరు ఆడమును మద్రాసులో తప్పక చూడాలి.

* * *

బెంగుళూరు సెంట్రల్ స్టేషనులో సోడా దొరకదే !

* * *

డాక్టరు హుల్సుగారి బసలో శ్రీకృష్ణశాస్త్రిగారినీ, వెంకయ్యగారినీ కలుసుకున్నాను. దొరబంగాళా బెన్సనురోడ్డు సమీపాన నందిదుర్గవీథిలో వుంది. కొండ పడమటివారికి చెందిన కొన్ని శాసనములను ఎత్తి వ్రాసుకున్నాను. తిరిగి యింటికి వచ్చేసరికి సాయంకాలమయింది.

బస్తీ చూడ మనసయింది. కొంతసేపు అటూ యిటూ తచ్చాడాను. నగరం ఏమీ అందంగా కనబడలేదు. వో పరసా వాడీ లేకుండా యిళ్లు. వొక తీరూ తెన్నూ కనబడని వీథులు ; పైగా యిరుకు ; మురికి. ఇంచుమించు ఇళ్ళన్నీ మట్టితో కట్టినవే. మేడలుసైతం మట్టివే. అయితే అక్కడక్కడ నూటికీ కోటికీ వొకటో రెండో మంచియిళ్లు లేకపోలేదు. మదరాసు, విశాఖ పట్నాలలోకంటె యిక్కడి పాటకజనపుస్త్రీలు మేలిరకపు ఉడుపులు ధరిస్తారు. చక్కగా ఆచ్ఛాదించుకుంటారు. మనుషులు చూడడానికి సొగసుగా వున్నారు. స్ఫురద్రూపులు. బజారేమీ బాగుండలేదు. ఆకర్షణీయంగా కనబడలేదు. మిఠాయి దుకాణాలు మదరాసులోకంటె నయం. పకోడీలు బహు రుచిగా వున్నాయి. సోడా తాగడానికి వీల్లేనంత దరిద్రంగా వుంది.

శ్రీనివాస రీడింగు రూముకు వెళ్లాను. పఠనాలయంలో వున్నతనికి నెలకు ఏభయిరూపాయలు యిస్తారట. రీడింగు రూములోకి వెళ్లిన ప్రతివాడూ సంతకం చేయాలి. గది వెడల్పు తక్కువేకాని పొడుగుహెచ్చు. పరిశుభ్రంగావుంది గది. వచ్చే పత్రికలు : అమృతబజారు, బెంగుళూరు మెయిలు, ట్యూస్డే స్టాండర్డు.

ఇక్కడి మనుషులు మంచి మర్యాదస్తులు. ఉపకారబుద్ధి వున్నది. ఉపకారమంటే ఊరొదిలిపెట్టిపోయే స్వభావం కాదు. ఏదైనా చెబితే వింటారు. మనుషులలో సరసతవుంది.

పురావస్తు పరిశోధనశాఖలో హెడ్డుగుమాస్తాగా పనిచేస్తున్న ఒకాయన తారసపడ్డాడు; పేరు 'స్వామి'ట. నాతో కొంతసేపు ప్రసంగించాడు ; ప్రసంగం మధ్యలో అడిగానుకదా : "ఏమండీ ! ఇక్కడ యిళ్ళింత జౌకుగా కట్టుకుంటారేం ? ఎందుకింత అసహ్యంగా వున్నాయ్ ?" అతను బిత్తరపోయాడు. పాపం ; నేరం వొప్పుకున్నాడు!

ప్రాచీన శిల్పఖండాలను గురించి, శిల్పకళను గురించి ఆయనతో కొంతసేపు ముచ్చటించాను.

సూయిలు పత్రాలనుగురించి మిత్రులను ప్రశ్నించాను. వారి కేమీ తెలియదని సమాధానమిచ్చారు.

ఆనందమహల్‌కు వెళ్లాను. బహు సొగసైన దీటైన భవనం.

నిజంగా బెంగుళూరులో కొందరు ఆడపిల్లలు ఎంతో మురిపెంగా వున్నారు.

**5 ఏప్రియల్, శుక్రవారం :**

కాఫీ తాగినతరువాత బండీయెక్కి సెంట్రలు కాలేజీకి వెళ్ళితిని. భవనం అందంగావుంది. చుట్టూ పెద్ద జాగా; విశాలమైన ఆవరణ. ఆడుతున్న బంతి అవతలకు పోకుండా అడ్డుటకు టెన్నిస్‌కోర్టు కిరువైపులా యెనిమిదడుగుల యెత్తున రెండు యినపతివ్వల వలలు కట్టివున్నవి. కాలేజీ, హైస్కూలు డిపార్టుమెంటులు రెండూ వొక్కచోటనే ఏర్పాటు చేసుకున్నారు. నాలుగువేల రూపాయలు ఖర్చుపెట్టి వొక ఫలహారశాలను నిర్మించారు. అస్తబలు, మరుగుదొడ్లు కలవు.

టీచర్ల వెయిటింగు రూములో మాథమిటిక్సు లెక్చరరు శ్రీ వెంకటస్వామినాయుడుగారిని కలుసుకున్నాడు. శ్రీ మోహనరావు, విజయరాఘవాచారీ, రామానుజాచార్యులుగార్లను ఆయన ఎరుగుదురట ! నాయుడిగారి జీతం మూడు వందలు.

బెంచీలు, కుర్చీలు అంత బాగాలేవు. వాటిని జాగ్రత్తగా ఉపయోగించుకున్నట్టు కనబడదు. విజయనగరంలో కంటే యిక్కడి బెంచీలు మరీ పాడుగావున్నవి. టీచర్ల వెయిటింగు రూములోవున్న సరంజామా మరీ అవుకు. రీడింగు రూములోవున్న బెంచీలను వొకచోట జతపరచి వాటినే వ్రాతబల్లలుగా వాడుకుంటున్నారు.

ఇవి పరిశుభ్రంగానే కనబడుతున్నవి. లైబ్రేరియను జీతం నెలకు పాతిక. లైబ్రరీలో మూడువేల పుస్తకాల ప్రత్యేక ప్రతులు వున్నాయి. ఒక అలమరానిండా బైండుచేసిన పత్రికా సంపుటాలు. ఇంతకుమించి లైబ్రరీలో గమనించతగ్గ విశేషాలేమీలేవు.

మాథమిటిక్సు సెక్షనులో మొత్తం యెనమండుగురు, ఫిజిక్సు సెక్షనులో పాతికమంది విద్యార్థులు వున్నారు.

ఇంగ్లీషు ప్రొఫెసరు టెయిటుగారితో వొక గంటసేపు సంప్రదించితిని. ఈ ప్రాంతపు విద్యార్థులకు ఆత్మాభిమానం మృగ్యమని ఆయన అన్నారు. స్వదేశస్థులైన మన విద్యార్థులకు తమ వ్యక్తిత్వంపై తమకే గౌరవభావంలేదని, ఆయన యెంతో బాధపడుతూ నాతో చెప్పుకొచ్చారు : "వొకళ్ళతో వొకళ్ళు కలసిమెలసి తిరగరు. ఎవరిదారి వారిదే. కలిసికట్టుగా వుండకపోతేమానె ! పోనీ తమ ప్రొఫెసర్ల చెంతకన్నా వస్తూ పోతూ సందేహాలు తీర్చుకుంటారా అంటే అదీ కనబడదు. చదువుకునే రోజుల్లో యిలాగున మే మెప్పుడూ ప్రవర్తించి యెరుగం. అందరం కలసిమెలసి మసిలేవాళ్ళం ; ఆడుకునేవాళ్ళం. ఎవరితోనైనా జట్టీ వచ్చిందా అంతా కాకికట్టు."

"ఉన్నతమైన వ్యక్తిత్వం, గుణసంపద, లోకజ్ఞానం, పాండిత్యంగలవ్యక్తులతో విద్యార్థులకు పరిచయం వుండాలంటాను. అట్టి సహవాసం వారినెంతో ముందుకు తెస్తుందని నా అభిప్రాయం."

"అవును ; మీరు చెప్పింది నిజమే" నన్నాడు దొర.

'విద్యార్థులు, ఇతరుల అభిప్రాయాలు తమకు భిన్నంగా ఉన్నవన్నంతమాత్రాన వాటిని ఎంతమాత్రం సహించలేనంతటి తీవ్రస్వభావులుకారు. తార్కికదృష్టి తీవ్రదృక్పథం వారి కలవరదుతున్నది. అయితే తమ మతచరిత్రగల కొన్ని సత్సంప్రదాయాలను వారు ఉపయుక్తం చేసుకోవడంలేదు. తమజాతిలో ఉద్భవించిన మహాపురుషుల గుణగణాలను సంప్రదాయాలను వారు అలవర్చుకోవడంలేదు. ఇందువలన విద్యార్థులలో గౌరవభావం, ఆత్మాభిమానం క్రమక్రమంగా సన్నగిలిపోతున్నదని' చెబుతూ, నేను ప్రసంగవశాత్తూ నార్టనుదొర అజమాయిషీలో వున్న విద్యార్థులను గురించి ముచ్చటించాను. 'అవును ; ఇది ఎంతో విచారకరమైన విషయమని' టెయిటుదొర అన్నాడు.

౹ిచివర కోసారి నాతో మాట్లాడుతూ డాక్టరు మిల్లరు విద్యాధికులైన హిందువులలో నైతికశక్తీ కార్యదీక్షా పట్టుదల కొరవడినపని అన్నాడు

చిన్నతనంలోనే వివాహంకావడంవల్ల భారతీయ విద్యార్థుల జీవితాలు దుఃఖభాజన మవుతున్నాయి దీనికితోడు దారిద్ర్యబాధ వారిని మరీ కృంగదీస్తున్నది అందువల్ల మా భారతీయ విద్యార్థులు హాయిగా కులాసాగా ఆనందంగా కనిపించరు జీవితంలో యెదుర్కొంటున్న కష్టాలను అధిగమించలేకపోతున్నారు కష్టాలను తేలికగా తీసుకుని నవ్వుతూ వాటిని దాటలేకపోతున్నారు మీ ఇంగ్లీషు యువకులకీ చతురత స్వభావసిద్ధమైన లక్షణం ఈ గుణం మా విద్యార్థులలో ఎలాగ కనిపిస్తుంది మరి ?

నేను చెప్పినదంతా నిజమేనని టెయిటుదొర సమాధాన మిచ్చాడు

వొకసారి ఆయన్ని వొక విద్యార్థి తనను పైక్లాసులోనికి ప్రమోటు చేయవలసిందిగా ప్రార్థించాడట తనకు పరీక్షలవుతున్న సమయంలో తన బిడ్డ చనిపోయిందని తన కా పసిపాప మరణం యెంతో దుఃఖం కలిగించిందనీ అందువల్ల తాను పరీక్షపేపర్లు బాగా వ్రాయలేకపోయా నని ఆ విద్యార్థి టెయిటుతో మొరపెట్టుకున్నాడట

ఈ విషయం టెయిటు యెంతో విస్మయంతో నాకు చెప్పినమీదట నేను మా ప్రిన్సిపాలుగారి సంగతి ముచ్చటించాను విద్యాభ్యాసం చేస్తుండగా విద్యార్థులు వివాహం చేసుకుంటే వారికిచ్చిన స్కాలరుషిప్పులను రద్దుచేయడం ఆయన పద్ధతి వివాహితులైన విద్యార్థులకు సర్వసాధారణంగా చనువివ్వడం అరుదు

గ్రీకు రోమను గ్రంథపరనమువల్ల రినేజాన్సుదినములలో యూరపులోని అన్ని దేశాలలోనూ స్వదేశీయ సారస్వత విజృంభణము వొక్కమారు ప్రతిభావంతమైనదిగదా అట్లే ఆంగ్లుల ప్రసిద్ధ సారస్వత ప్రచారంవలన విద్యాప్రభావం వలన, అట్టి విజృంభణము మన దేశభాషలలో చెప్పుకోతగ్గ ఫలిత మేమీ కానరాకపోవడం వింతగా తోచడంలేదా? ఇందుకు కారణం మీరేమని ఊహిస్తున్నారని ప్రశ్నించాను

ఈ దృష్ట్యా ఆయన ఆలోచించి దీనికి సమాధానమీయకుండెను మళయాళీ భాషలో చెప్పుకోతగ్గ నవలే వెలువడిందికదా మరి

దీని నంతవిశేషంగా చెప్పుకుందుకు కారణం మరేమీ లేదు వొక యూరోపియను ఆ నవలను అనువదించడమే మదరాసులోవున్న మళయాళీ మిత్రులతో యీ నవలను గురించి చర్చించాను వారి దృష్టిలో యీ నవలేమీ గొప్పది కాదు ”

ఆ నవలలో మంచి హాస్య సంభాషణ లున్నాయ్ వొక విద్యావిహీనునికీ విద్యావంతునికీ మధ్యజరిగిన సంభాషణ హాస్యంగా లేదూ ?

కొందరు యూరోపియనుల కీ నవల యెందుకు నచ్చుతుందో నాకర్థమయింది వాళ్ళకి హాస్యమంటే అభిరుచి హెచ్చు కాని నవలా శైలిలోనూ వస్తు నిర్వహణలోనూ యేమైనా సొగసు వున్నదా ? కళా చాతుర్యము వుట్టిపడుతున్నదా ?

నాకా సంగతి తెలియదు బహుశా వుండకపోవచ్చును

వొకవేళ యీ నవల బాగున్నదనుకున్నా భాషా వికాసానికి కీవొక్క నవలా సరిపోదు స్వదేశీయ సారస్వత విలుప్తతకు కారణం వొకటై వుంటుందనుకుంటాను సాహిత్య పాఠములలో విద్యార్థులకు శైలిలోను

వస్తువిన్యాసములోను యిదిమంచీ, యిది చెడ్డ అని విడదీసి వాటి బాగోగులను బోధింపకుండుట, విమర్శగా చదువుట నేర్పకుండుట, స్వతంత్ర యోచనా శక్తిని పురికొల్పేదిగా బోధనాక్రమముండకపోవుట. రసానుభవమూ, వివేచనా లేకుండుట కారణమని నా ఊహ. కాలేజీ విద్యార్థులకు చెప్పే పాఠాల తీరూ, బోధనా పద్ధతులూ చాలా దుష్టంగా వుంటున్నవి."

మీరు చెప్పినదంతా నిజమేనంటూ మిస్టర్ టెయిటు తనకు సాహిత్యపాఠాలను చెప్పడం రుచించడం లేదన్నాడు. గ్రంథాల పేర్లూ, కవులకాలాలనుగురించీ తప్ప మరిదేనికీ బోధించడంలేదనీ, యిది చాలా విచారించతగ్గ విషయమనీ అంటూ మిస్టరు టెయిటు "క్లాసులో విద్యార్థుల కేమీ బోధపడకపోయిందా, వెంటనే నిలబడి చెప్పేపాఠాలకు అడ్డువస్తారు."

'మనం గొప్ప గొప్ప కావ్యాలను విద్యార్థులచేత చదివించడం మంచిది. ఏదో వొక యుగపు వాఙ్మయ చరిత్రను పాఠ్యభాగంగా వేస్తే చాలునని' నే నన్నాను.

టెయిటు దొర యీ విషయం వొకప్పుడు డాక్టరు మిల్లరుకు సూచించగా ఆయన "ఇప్పటికే విద్యార్థులు చదవవలసిన పుస్తకాలు తడిసిమోపెడుండగా మరి నాలుగుపుస్తకాలు చదవమని వాళ్ళని బాధించలేం" అన్నారట ! "పిల్లలు చాలా పుస్తకాలు చదవవలసివుండినమాట నిజమే ! కాని మీ సూచనలను ఆమోదించినట్లయితే, యీ పుస్తకాల సంఖ్యా తగ్గివుండేది ; మంచి గ్రంథాలను పిల్లలు చదవనూ చదివేవారు."

"అవునవును ; మీరన్నది వాస్తవమే మరి ! మీరు ఏ యే పుస్తకాల్ని బోధిస్తున్నారు ?" మిస్టరు టెయిటు తన టేబిలుమీదవున్న గ్రంథాన్నొకదాన్ని చేతపుచ్చుకుని నన్ను ప్రశ్నించాడు. ఆయన చేతనున్న పుస్తకపు ఆకారాన్నిబట్టే అది లాంగ్మెన్సు బుక్కు అయివుంటుందని పోల్చుకోవచ్చును. "అది లాంగ్మన్సు బుక్కేకదూ ?"

"సరే ; మీకు తెలుసునన్నమాటే ! ఇందులో కంఠస్థం చేయతగ్గ మంచి విషయాలు చాలావున్నాయి. అదీ యీ పుస్తకంలోవున్న సొగసు !"

"మా విద్యార్థులచేత, బడిలేని టైములో జనరలు పుస్తకాలను చదివిస్తాం. కాలేజీ లెక్చరర్లలో ఒకాయన యీ పుస్తకాలను ఎలాగున పఠించవలెనో బోధపరుస్తూవుంటారు."

"ఇది మహమంచి పద్ధతి."

క్లాసులను నిర్వహించడం బహుకష్టమైపోతున్నదనీ, విద్యార్థులు వ్రాసే కాంపోజిషనులోని ప్రతిదోషాన్ని దిద్దడం దుస్సాధ్యమవుతున్నదనీ, మిస్టరు టెయిటు నాతో అన్నారు. "విద్యార్థులకాంపొజిషనులో ఏ,యే తప్పులు ఉన్నాయో చూపించినంతమాత్రంవల్ల లాభం శూన్యం. తమ చేసిన పొరపాటేదో విద్యార్థికి తెలియకుండా పోతున్నది. పోని ప్రతి తప్పు దిద్దుదూ కూచుందామాఅంటే అదీ సాగడం లేదు. ఇక యూనివర్శిటీ సరేసరి ! జనరలు యింగ్లీషు పేపరు వూసే అది ఎత్తడంలేదు. జనరలుయింగ్లీషు పేపరు వొక అవకతవకగా తయారయింది. ప్రశ్నా పత్రాలలో ఏది అడగాలో, ఏది అడగకూడదో ఎవరికీ బోధపడదు ; అంతా అయోమయం. ఎక్జామినర్ల యిష్టాయిష్టాలపై యివి ఆధారపడుతున్నాయి."

'మదరాసు కాలేజీలలో వున్న ప్రొఫెసర్లు తమ విద్యార్థులకు బోధించే పాఠాలకంటె హెచ్చు విషయాలను మేము మా విద్యార్థులకు బోధిస్తున్నామని' నే నన్నాను : "మదరాసు ప్రొఫెసర్లు ఎక్జామినర్లుగా వుండడంవల్ల మాకు వుండే శ్రమదమాదులు వారికుండవు.స్కీట్సు శబ్దశాస్త్రమూ, కెల్లెన్సు వాక్యరచనాపద్ధతీ మదరాసు ప్రొఫెసర్లు

యింకా తమ విద్యార్థులకు చెప్పనేలేదట ! నాలుగయిదేళ్ళ క్రిందటే ఆ గ్రంథాలను మా విద్యార్థులకు పాఠం చెప్పి, వాటిపై నోట్సు తయారుచేసి యిచ్చాను. వింత యేమంటే, నిరుడూ, యీయేడూ స్కీట్సు మీద విద్యార్థులను ప్రశ్నలు అడిగారు. కెల్లెను గ్రంథంపై ఒక్క ప్రశ్న కూడా యింతవరకూ రాలేదు".

కొంతసేపు ప్రసంగించిన తదుపరి, తాము పాఠములు చెబుతుండగా వినవలెనని వున్నదని మిస్టరు టెయిటును సూచన ప్రాయంగా కోరితిని. నా కోరికను మన్నించినఎడల నేనెంతో కృతజ్ఞుడనని చెప్పితిని. తనకు థర్డుఅవరు యింగ్లీషు క్లాసువున్నదని చెబుతూ, టెయిటుదొర నా సూచనకంత అభిముఖుడను కానని సూచించాడు. మరి నేనా విషయం ప్రస్తావించక అంతటితో నా కుతూహలాన్ని వొదులుకున్నాను. కాని లీనార్డు దొర పాఠములను బోధిస్తుండగా వింటిని. ఆయన చాలా అసమర్థుడు. పాఠాలను బొత్తిగా చెప్పలేడు. మిస్టరు టెయిటునుగూర్చి గొప్పగా వింటిని. కొంచెం మోటుమనిషనీ, కోపిష్ఠి అనీ పిల్లలు అంటారుగాని చాలా మర్యాదస్తుడుగా కనపడ్డాడు. నాతో అదేపనిగా మాట్లాడినాడు. అయితే అది వాచాలత కాదు. నేను చాలావరకూ అనేక విషయాలను ప్రస్తావించి ఆయనను సంభాషణలోనికి దించితిని. ఆంగ్ల, ఆంధ్ర భాషావిషయాలు వచన భేదాలను గురించి ఆయనకు తెలియచేశాను. కాలేజీలోవున్న కన్నడభాషాపండితునితోగూడా కొంతసేపు ప్రసంగించితిని.

మా సమావేశానంతరం, యిక సెలవు పుచ్చుకుంటానని నేనే మొదట కుర్చీలోంచి లేచాను. టెయిటు దొర చాలా ఆప్యాయతతో కరస్పర్శ కావించాడు. ఇంతసేపూ ఏవేవో విషయాలను ముచ్చటించి ఆయన పనికి ఆటంకం కలిగించినందుకు మన్నించవలసినదిగా కోరాను. "కాదు కాదు ; మీతో సంభాషించడంవల్ల నా కెంతో ఆనందంగా వుంది. మీ పరిచయం కలిగినందుకు నాకెంతో సంతోషం."

**6 ఏప్రియల్, శనివారం :**

ఈ వేళ ఉదయం ప్యాలసును చూస్తిని. భవనం చాలా అందంగా వుంది. కాని లోపల వస్తు సామాగ్రి విజయనగరంలోని మోతిమహలుకు తీసికట్టే. మహలు కొన్ని చోట్ల హుందాగా కనిపిస్తూ ప్రశాంతతతో తులదూగుతున్నది. మేడ మెట్లలో కొన్ని ఔకుగానూ అందవిహీనంగానూవున్నవి. బల్లలతో కట్టిన వరండా. అదీ బాగులేదు. మహలులో చెప్పుకోతగినన్ని వర్ణచిత్రాలులేవు. మహారాజావారిలైబ్రరీలో అట్టే పుస్తకాలు లేవు. వున్న ఆ కొన్ని పుస్తకాలయినా కులాసాకి చదువుకునే నవలలు. పేలసు వొక తమిళపిళ్ళే అజమాయిషీకింద వుంది. అతను ధరించిన బట్టలు దరిద్రంవోడుతూ వున్నవి. పేలసు గేటులను మూసివుంచమనీ, ఎవరినీ లోనికి రానీయవద్దనీ మహారాణి హుకూం జారీ చేసిందట ! ముందే నాకీ సంగతి తెలిసివుంటే, నేనింతదూరం వచ్చేవాడినీకాను ; లోనికి వెళ్ళేవాడినీ కాను.

పిళ్ళే అంటే అందరికి ఎంతో ప్రేమ; గౌరవం. మహారాణికి ఇంగ్లీషు, కన్నడం, తెలుగు చక్కగా వచ్చును. ఈ మూడు భాషలలోనూ ధారాళంగా మాట్లాడగలదు. వ్రాయగలదు. ఆవిడ భాషాసంపన్నతకు మనదేశం గర్వించవచ్చును. ఆమెకు అయిదుగురు పిల్లలు. వీరి కుటుంబం వర్ధిల్లాలనీ, తమ తల్లిదండ్రులవలె, పిల్లలు కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించుకోవాలని నా కోరిక.

ఈ మహారాజు చాలాకాలం క్రితం కలకత్తాలో మరణించాడు. మా మహారాజావారి భవనంలో అతిథిగావుంటూ మందు పుచ్చుకునేవాడు. జబ్బు నిమ్మళించలేదు. ఆయన మరణించాడని ఒకనాడు షూ మహారాజావారికి టెలిగ్రాంవచ్చింది. తన మిత్రుని మరణవార్తవిని మహారాజావారు యెంతో విచారించారు. ఆయనంటే యీయనకెంతో గౌరవం.

తనభర్త మరణానంతరం, మహారాణి, కలకత్తానుంచి వెళ్ళిపోవస్తూ తన కృతజ్ఞతను మా మహారాజావారికి తెలియచేయవలసినదిగా బాబూసాహేబును కోరింది; ఆయన ఆవిధంగానే తెలియచేశారు. "కలకత్తానుంచి తమ స్వస్థలానికి బయలుదేరుతూ మీకు తమ కృతజ్ఞతను తెలియచేయవలసినదిగా మహారాణి అభ్యర్థించింది. తమభర్త తన అవసానదశలో మీ బసలోనే వున్నందుకు, మహారాణికి కొంత ఊరటకలిగింది. ఇదివరకటివలెనే, ఇప్పుడూ ఎప్పుడూ మన రెండు కుటుంబాలకూ గల స్నేహం వర్ధిల్లగలదని ఆమె ఆశిస్తున్నది."

మహారాణి వాక్యాలలోగల సౌహార్దమునకు మా మహారాజావారు మిగుల ఆనందించారు.

కీ.శే. మహారాజు ఏమంత చెప్పుకోతగ్గ ధీశాలీ, పండితుడూ కాదు.

♦ ♦ ♦

మ్యూజియమును చూడ వెళ్ళితిని. అక్కడవున్న ఆఫీసరు చాలా మర్యాదస్థుడు. మ్యూజియములోని దంతపుపని మిగుల బాగున్నది. విజయనగరం మహలులో ఉన్నవాటికంటె యిక్కడివే సొగసుగా కనబడుతున్నవి.

♦ ♦ ♦

బ్రష్‌తో రాతిపలకను చక్కగా తుడిచి నీళ్లతో కడగవలెను. కాగితమును నీటిలో ముంచి, పైకితీసి, శాసనపు పలకమీద జాగ్రత్తగా నిండుగాపరిచి, బ్రష్‌తో వొత్తవలెను. శాసనములోని అక్షరములు కాయితంమీద పడేవరకు బ్రష్‌తో అదమవలెను. నీళ్లలో కాగితాన్ని ముంచేటప్పుడు దానిని టబ్బులో బాగుగా వుంచాలి.

నౌకరు మొదటి నాసిక్ పేపరును వుంచాడు. దానిపై ప్రింటింగు పేపరును పరిచాడు. రాయి మోటుగా వుండి అక్షరములు స్ఫుటముగా పడనప్పుడు, వొక సీసాలో దీపపుమసీ, యింకుపొడరూ వేసి సిరావలె తయారయేటట్టు నీళ్ళుపోయాలి. పేడ్‌పై కొద్దికొద్దిగా యీ సిరాను చిమ్ముతూ మెల్లగా వొత్తవలెను. అక్షరములు స్పష్టపడేవరకూ అలాగున యింకును పోస్తూనే వుండవలెను.

....... ....... .......

ఈ వేళ సాయంకాలం రైలులో వొక పటాలం వెళ్ళిపోతుండగా చూశాను. సిపాయిలను సాగనంపుటకు వారి బంధువులు వచ్చారు. బంధువులు, కుటుంబస్థులు మిగుల దుఃఖిస్తూ వుండిరి. చాలా హృదయ విదారకమైన దృశ్యం. సిపాయిలను యెక్కించుకొని రైలు బయలుదేరింది. ఇవతల నిలబడివున్న తమ ఆప్తులను, బంధువులను రైలు పెట్టెలలో నుండి తొంగి తొంగి చూస్తూ సిపాయిలు జేబు రూమాళ్ళను ఊపుతూ వుండిరి !

* * *

శ్రీ కృష్ణశాస్త్రిగారు చాలా మంచిమనిషి ; ఒకరికి తనకు తెలిసిన విషయాలను చెప్పేందుకు, ఇతరులవలన మరికొన్ని విషయాలను తెలుసుకునేందుకు సదాసంసిద్ధులు. మనిషిలో లేనిపోని నటన, భేషజమూ లేవు.

కాని ఆయన యివాళ వస్తానని చెప్పి యింకారాలేదు. ఇక నాకు మిగిలినదల్లా వెంకయ్యగారి సాన్నిధ్యమే. ఈయనకు నాపనిమీద శ్రద్ధలేదు ; సానుభూతీలేదు. ఎప్పుడో యేదో పురావస్తు తత్వశాస్త్రవిషయాలలో మునిగి తేలిపోతున్నట్టూ, తనకేమీ తీరిక లేనట్టూ ప్రవర్తిస్తాడు. తనశక్తి సామర్థ్యాలను గురించి తానే కొంచెం గొప్పగా పొగుడుకుంటూ, కాస్త యీర్ష్య ప్రదర్శిస్తూవుంటాడు. మనిషికి యీసు లావు. రికార్డులు చూస్తానయ్యా బ్రహ్మదేవుడా అంటే, అవి చూడ్డానికే ఆయన నాకవకాశమీయలేదు.

ఇలియటుదొరగారి తెలుగుశాసనసంపుటి కావాలని అడిగితిని హుల్ష్ దొరగారు వాటిని తీసుకువెళ్ళి వుంటారని ఆయన సమాధానం బెజవాడ నాదెండ్ల శాసనాల నొకసారి తిలకించమని వెంకయ్యాగారన్నారు వాటిల్లో నాకు కావలసిన ప్రధాన విషయాలేవీలేవు సింగవంశపు శాసనాలను కావాలని అడిగాను అవీ లేవు వొకటేదోవుంటే అది ఎడిటుచేయడానికని కీల్హార్నుదొరకు పంపించాము ఈ రెండు శాసనాలు సూయిలులో కలవని నేనన్నాను అబ్బే అది పొరపాటై వుంటుంది

మొదటి పదిరోజులు వెంకయ్యగారు డాక్టరు హుల్ష్ దొరను పొగడడం తప్పితే మారుమాటేమీ పలకలేదు ఆ పది రోజులూ పొగడ్తలతోనే ఊసుపోయింది ఆయన గొప్ప సంస్కృత పండితుడు రాజేంద్రచోళమిత్రుడు గొప్ప సంస్కృత భాషా పాండిత్యం కలవాడు కాదని హుల్ష్‌దొర చెప్పినారు సంస్కృత వ్రాతప్రతులను గురించి భండార్కరు వ్రాసిన నోట్సు లలో కొన్ని దోషములున్నట్లు నేను కనిపెట్టాను అయితే నేనింకా నా సంస్కృతభాషా పరిజ్ఞానాన్ని వృద్ధిచేసుకోవాలనుకుంటున్నాను చోళరాజరాజుకూ ఆయన అక్క కుందనదేవికీ మధ్య కొంత సంభాషణను ఊహించి వ్రాయాలని నా అభిలాష రాజరాజు శక్తిసామర్థ్యాలను ప్రతిభను ఉగ్గడిస్తూ కొన్ని వ్యాసాలను వరుసగా ప్రచురిద్దామని తలపోస్తున్నాను ఇలాగ ఎంతోసేపు వెంకయ్యగారు ప్రసంగిస్తూ కాలం వెళ్ళబుచ్చారు

తెలుగులో కొన్ని చారిత్రక నాటకాలను నవలలను వ్రాయ తలపెట్టాను అందుకోసం ఎట్టి విప్రతిపత్తిలేని దక్షిణ భారతదేశ చరిత్ర నాకు అవసరం సరియైన చారిత్రక యితివృత్తం పథకం నా నాటకాలలో నవలలలో స్వీకరించాలని నా తలంపు అన్నాను తనకూ యిట్టి ఊహకలదని వెంకయ్యగారు చెప్పారు

కృష్ణా గోదావరి జిల్లాలకు సంబంధించిన శాసనాలను రికార్డులను యీయవలసినదిగా వెంకయ్యగారిని నేను వచ్చిన రోజునే అడిగాను కాని ఆయన నాకా సదుపాయం కలుగజేయలేదు నాకు వున్న వ్యవధి చాలా తక్కువ ఆ కాస్త టైమునీ ఏదో వొక సంభాషణలోనికి నన్ను దించుతూ ఆయన హరించివేశాడు కాలయాపన చేద్దామనే కాని నే నడిగిన దేమిటో పరిశీలించి యిద్దామనే తలంపు వెంకయ్యగారికే కోశానా లేకపోయెను

ఒక శాసనంలోని తెలుగులిపిని పరిశీలిస్తూ కొన్ని మాటలకు అర్థం చెప్పవలసినదిగా ఆయన నన్ను కోరాడు శాసనపు లిపిని పోల్చుకోవడంలో ఆయనకు నాకు చేతనైనంత సహాయం చేశాను

కరికాలచోళుడు అనేది వొక బిరుదునామమనీ దానిని అనేకులు ధరించారనీ శ్రీ వెంకయ్యగారి ఊహ కావేరి నదిపై ఆనకట్ట లేక వంతెన కట్టినది ఎవరో ఆయనకు తెలియదు కరికాళచోళుడు బహుశా యీ నదిపై కట్టలు పోయించివుంటాడని ఆయన అభిప్రాయం కరికాళచోళుని గురించి ఆయన కేమీ తెలియదు స్థానిక శాసనాలు దాఖలాలు అంటే ఆయనకు విలువలేదు

ఇలియటు తెలుగు శాసనముల సంపుటి యిలియటు దొరగారు ఆఫీసుకు పంపించివేశారు ఈ శాసనసంపుటిని యెవరూ పరిశీలించినట్టు తోచదు ఇందులో కొన్ని శాసనములలో దానముల ప్రసక్తి వున్నది కాని వాటి మూల ప్రతులు పోయినవి రెండు వందల సంవత్సరాలకు పూర్వము చేసిన వొక దానమునుగురించిన భోగట్టా యిందు కలదు బహుశా యిది ప్రక్షిప్తమయి వుంటుంది

నాకు కొన్ని పేడ్స్ బ్రష్‌లూ కావలసివుంది ఆయన వీటిని ఆర్డరిచ్చి తెప్పించి నా కీయగలడు గాని అలా చేయలేదు డాక్టర్ హుల్ష్ దొరకు వ్రాసి తెప్పించుకోవలసిందిగా చెప్పాడు అక్కడి ఆఫీసులో కూచుని నేను సేకరించిన భోగట్టాను యెంతమాత్రమూ ప్రచురించవద్దని వెంకయ్యగారు నన్ను కోరారు కారణం హుల్ష్

దొరగారి అనుమతి లేనిదే నకళ్లూ అవీ ఆయన నా కిచ్చారట. డాక్టరుగారు ప్రివిలేజీలీవుమీద బెంగుళూరులో వున్నారాయో ! కొన్ని శాసనపు నమూనాలకు, ఫోటోగ్రాపులు యెత్తవలెనని నేను అనుకున్నాను. దానికికూడా హుల్ట్జుదొర అంగీకారం అవసరమట ! రాసిన ఉత్తరాలకు సమాధానమిచ్చే అలవాటు హుల్ట్జు సర్వసాధారణంగా లేదు. "ఇదేమిటండీ వెంకయ్యగారూ" ఆయన "దొరకు పరాకులావండీ! గడియకోలాగ వుంటాడు. నేనేం చేయను?" అని సమాధానం. డాక్టరు హుల్ట్జు స్వభావ మేమిటో ఈయనకీ తెలియదు. దొరకు దూరప్రయాణాలంటే యిష్టంలేదు. కమానువెళ్ళడ మంటే యజ్ఞం చేసినట్టే.

"పోనీ సూయిలుదొర సంపుటాలు వొకసారి చూడనిద్దురూ" అని అడిగాను. అవి యేమిటో ఆయనకు తెలియదు !

"సరే, గవర్నమెంటు యీ మధ్యనే సేకరించిన శాసనాలూ దానిమీద, వ్రాసిన నోట్సూ, వుంటే యియ్యండి"

"ఇదీ ఆయనకు తెలియదు. "బహుశా 'రావు' గారు పట్టుకుపోయి వుంటారేమోనండీ" అని సమాధానం.

"కనుక్కోలేక పోయారామరి ?"

"కనుక్కున్నానండీ. రావుగారి అసిస్టెంటు నడిగితే అవి తన ఆఫీసులో లేవన్నాడూ !"

రావుగారు పండితుడుకాదనీ, ఆయన చేసే పనల్లా భవనం జాగ్రత్తగా వుంచడమనీ, శాసనాలను చెడిపోకుండా కాపాడడమనీ మిస్టరు టయిటుగారు యిదివరకొకసారి నాతో చెప్పారు.

నటేశానికి శాస్త్రీయ పద్ధతుల ప్రకారం కార్యభారాన్ని నిర్వహించడం చాతకాదట. మనిషికీ శాస్త్రీయ పద్ధతుల ఆలోచనల కంటె ఊహాగానం విపరీతమట. ఆయన "జానపద చరిత్ర" కేవలం ఊహాగానం. ఇలాంటి కేవల ఊహలపై రచించిన గ్రంథంవల్ల యెట్టి ప్రయోజనమూ లేదు. శాస్త్రీయపద్ధతులు వొదిలిపెట్టి ఊహలతో పరిశోధనలను సాగించడంవల్ల లాభం కనిపించదు.

ఆఫీసులో భోగట్టా సంపాదించడం బ్రహ్మాండం. ఆ మాటా యీమాటా చెప్పి, కేవలం యుక్తిగానూ, పదేపదే నొక్కి నొక్కి ప్రశ్నిస్తూ వొత్తిడిచేయడంవల్లనూ ఎలాగైతేనేం, కొంత సమాచారం సంపాదించగలిగాను.

కోటరాజులనుగురించి వెంకయ్యగారి కేమీ తెలియదు. రాజమహేంద్రవరపు రెడ్డిరాజులు వియ్యంవల్లకాక కేవలం కొండవీటి రెడ్డిరాజులను జయించి రాజ్యాన్ని స్థాపించారని ఆయన ఊహ. ఈ విషయంలో శ్రీ వీరేశలింగం పంతులుగారి అభిప్రాయమే నిజమైనదని ఆయన భావం. రాజమహేంద్రవరపు రెడ్డిరాజులు కోమటి వేమారెడ్డితో యుద్ధం సలిపినమాట నిజమే ;

గణపతి, "మహామండలేశ్వర" అనే బిరుదు వహించుటకు కారణమేమి ? చోళులు అనంతరం, కాకతీయులు పరాక్రమవంతులయిరని, ప్రసిద్ధికెక్కిరని వెంకయ్యగారికి తెలియదు. "ఇటీవలనే ఇండియను ఆంటిక్వరీ" వాల్యూములో తూర్పు చాళుక్యలపై ఫ్లీటుదొర వ్యాసం వ్రాసిరిగదా? సాగివంశస్థులను గురించి మీ కేమైనా భోగట్టా తెలుసునా ?"

"ఉహుఁ !"

విజయనగర పరిపాలకులలో ఆఖరివాడు శ్రీకృష్ణదేవరాయలు. ఆయన తరువాత వచ్చిన రాజులు కొన్ని గ్రామాలను మాత్రమే యేలినప్పటికీ తాము మహాచక్రవర్తులమని ప్రకటించుకొన్నారు.

పరిశోధనకు తెలుగు అసిస్టెంటు నొకరిని నియామకం చేయవలెనని ఇందుకు శ్రీ గిడుగు రామమూర్తి పంతులును నియమించవలెనని హుల్ట్జుదొర మొదట అభిప్రాయపడ్డాడు. కాని ఆంధ్రదేశంలో పరిశోధించవలసిన శాసనాలు మిక్కుటముగా లేవని భావించి శ్రీకృష్ణశాస్త్రిగారిని తరువాత నియమించాడు.

నాకే ఆశలూలేవు ; నాకు విశ్రాంతి కావాలి. సాహిత్య కృషిని, కొనసాగించడ మొకటే నా ఆశయం. అయితే సాహిత్య రచనను నేను సర్వస్వతంత్రుడుగా వుంటూ సాగించవలెనని నా అభిమతం.

సర్క్యులరు రిపోర్టులనుగురించి మ్యూజియములో విచారణ చేశాను. ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రచురింపబడేవాటికి పేజీకి అయిదు రూపాయల చొప్పున యిస్తారట. ఆయన శాసన పరిశోధక డిపార్టుమెంటులో ఉద్యోగానికి దరఖాస్తుపెట్టాడట. "నా దరఖాస్తుమీద ఏమీ రిమార్కులు రాశాడో హుల్ట్సు దొర ! గవర్నమెంటు నా జీతం హెచ్చించింది. ఇప్పుడు రెండు వంద లిస్తున్నారు. ముందుముందు రెండువందల యాభైదాకా పెరుగుతుంది."

ఈ హుల్ట్సుదొర పెద్ద పండితుడేమీ కాదని శ్రీనివాసయ్యంగారు చెప్పారు. ఈ పదవిని పెర్మనెంటుచేయవలసిందిగా ఆయన దరఖాస్తు పెట్టాడట. లేకపోతే పెన్షనైనా యివ్వండన్నాడట. ఇంతవరకూ ప్రభుత్వం యిందుకు సమాధానం చెప్పలేదు. అతనీ పదవిలో వుండేదీ లేనిదీ అతనుచేసే పనిని బట్టి వుంటుందని ప్రభుత్వం ఆయనకు సూచిస్తున్నట్లుంది. అందుకే దొర పిటిషనుమీద యేమీ మాట్లాడలేదు.

పినవీరన్న, అప్పన్న మంత్రులనుగురించి కొంత భోగట్టా చెప్పవల్సిందిగా నన్ను ఆయనకోరాడు. సరేనని అంతాచెప్పాను.

**7 ఏప్రియల్, ఆదివారం :**

రైలు బెంగుళూరునుంచి మద్రాసు వచ్చేసరికి యింకా భళ్ళున తెల్లవారలేదు. సెంట్రలు స్టేషనులో కాఫీతాగాను. స్పెన్సరు హోటలునుంచి టెలిఫోను చేస్తిని. కాని సెంట్రలాఫీసు నుండి ఏమీ ప్రత్యుత్తరం రాలేదు. ఇంకా బాగా తెల్లవారక పోవడంవలన ఆఫీసుకు ఎవరూ రాలేదనుకుంటాను. ఇంతవేగిరం బసనుంచి స్టేషనుకు బండీవచ్చే సాధనమేమీలేదు. త్వరగా యింటికిపోవడం మంచిదని, వొక గుర్రపుబండీని కుదుర్చుకున్నాను. తీర గుర్రపుబండీ యెక్కేసరికి, గేటు అవతలవున్న సార్జెంటు వొకడు, బండీని అడ్డివేశాడు. 'ఎందుకాపావంటే' 'ప్యాసు చూపించ' మన్నాడు.

"లగేజీని ప్లాటుఫారం అవతలకు వాళ్ళు పోనిచ్చారుకదా, మధ్యన నీ అభ్యంతరమేమిటి ?" అని ప్రశ్నించాను.

"వాళ్ళు పోనిచ్చారు కనకనే, మిమ్మల్ని నేను పట్టుకున్నాను !"

"నువ్వు పట్టుకుందుకు నేనేం నేరం చేయలేదే ?"

"నేరస్థులు తాము నేరంచేసినట్టు ఎక్కడైనా వొప్పుకుంటారా సార్ ?"

ఈ గలాభా అంతాచూసి బండీవాడు "బేడకాసొకటి వాడిమొహాన పారేయండి ! నోరు కట్టడుతుంద"ని గోసాయి చిట్కా ఉపదేశించాడు.

"బేడకాదు ; వాడికొక్క రోశీకూడా యివ్వను ; ఈ శషభిషలు నాదగ్గర పనికిరావు. పద, వెనక్కి ! బండీ తిప్పు" అన్నాను. తన మంత్రం పాచేటట్టులేదని గ్రహించాడు కాబోలును సార్జెంటు, మరి మారుమాటాడకుండా మా బండీని ముందుకు పోనిచ్చాడు!

బెంగుళూరులో నాయుడిగారి బంధువులు నన్నెంతో ఆదరించి గౌరవమర్యాదలను కనపరిచినారు. బెంగుళూరు మనుష్యులు చాలా నాగరికులు ; మర్యాదస్థులు ; అందరూ నన్ను ఎంతో మన్నన చేశారు.

♦ ♦ ♦

శ్రీ శ్రీనివాసాచారిగారు మాకొక ముచ్చటను చెప్పారు బొమ్మాడి గ్రామం ... ఆయన ప్రవర్తించిన విధం ఆయన వ్యక్తిగౌరవానికి తగినట్టులేదని నా అభిప్రాయం

♦ ♦ ♦

లా కాలేజీ విద్యార్థులు యేర్పరుస్తున్న సమావేశానికి రావలసినదని శ్రీనివాసాచారిగారికి మిత్రుడు సుందర్రావు పంతులు వొక ఆహ్వానాన్ని పంపించాడు బి యల్ డిగ్రీ పరీక్షలో ఎన్నికైన మార్కులతో ఉత్తీర్ణులైన శ్రీవేపారామేశంపంతులును అభినందిస్తూ వొక వెండికప్పును బహూకరించవలెనని లా కాలేజీ విద్యార్థులు యీ సమావేశాన్ని ఏర్పాటు చేశారు నేను బెంగళూరునుంచి తిరిగి వచ్చినట్లయితే నన్ను కూడా వెంట తీసుకురావలసినదని మరీమరీ నాతో చెప్పవలసినదని సుందర్రావుగారు శ్రీనివాసాచారిగారికి చీటీ పంపినాడు నాకు సభకు వెళ్ళడానికి బడలికగా వున్నమాట నిజమే కాని వెళ్ళకపోతే నాకు వారిపై సానుభూతిలేదని దురభిప్రాయపడతారని నేనూ హాజరైతిని మిత్రుడు సుందర్రావుకు నాలెక్చరు చదివి వినిపించాను ఆయన సమావేశపు ఉద్దేశాన్ని నాకు తెలియచేయగా నేను చెప్పాను దీనిని పెద్ద ఆర్భాటంగానూ గోరంతలు కొండంతలుగానూ ప్రదర్శించినట్టయిదే తెలుగు వాళ్ళు చాలా వెనకబడి వుండడంవల్ల యీ విజయాన్నింత ఘనంగా చెప్పుకుంటున్నారని యిక్కడివాళ్ళు అనుకుంటారు పరీక్షలో చక్కగా ప్యాసయిన అభ్యర్థిని అన్నివిధాలా ప్రోత్సాహించవలసిందే కాని ఆ అభ్యర్థిని సహజంగా మనోదౌర్బల్యం వుండివున్నట్లయితే మిత్రుల లేనిపోని పోగడ్తలవల్ల అతనికి అనవసర భేషజం కొత్తగా వస్తుంది అతని జీవితం మున్ముందు విఫలమవుతుంది ఇందుకు మిత్రులు అనుసరించిన మార్గాలే కారణం కావచ్చును విద్యావంతులమని చెప్పుకునే మన స్వదేశీయులకు లేనిపోని అతిశయం నటన భేషజం పరిపాటి అయిపోతున్నవి ఇవి వారికి మానసికమైన వొక అత్యవసర గుణాలుగా కనిపిస్తున్నాయి ఈ దుర్గుణాలను యెంత వేగిరంగా మొగ్గలో తుంచితే అంత మంచిది దక్షిణ దేశంలో పాండిత్యమనేది ఉపకారానికి బదులు అపకారం చేస్తోంది ఇది ఎంతో హానికరంగా పరిణమిస్తోంది కాస్తో కూస్తో పాండిత్యముంటే చాలును లేదా అతను తగుమాత్రపు ఘనతను సాధిస్తేచాలు ఇక మనవాళ్ళు అదేపనిగ అతన్నికీర్తించడానికి యెగపడతారు అతన్నొక ఆదర్శపురుషునిగా" శ్లాఘిస్తూ అతని అభిమానులు వింజామరలు వీస్తూ పొద్దుపుచ్చుతారు అంతటితో ఆయన తనను తాను అభివృద్ధి చేసుకుందుకు యేమాత్రమూ ప్రయత్నించడు ఆయన అభిమానులు ఆయనలో వుండే సుగుణాలనుకాక దుర్గుణాలను అనుకరిస్తారు ఈ సందర్భంలో శ్రీ వీరేశలింగంగారి అనుచరులను వొక ఉదాహరణగా పేర్కొనవచ్చును

అయితే శ్రీ వేపా రామేశంపంతులు భేషజపరుడుకాదు అందుకు నాకెంతో ఆనందంగా వుంది ఆయన నిర్మొహమాటి నిష్కర్షగా సాదాగా మాట్లాడతాడు మనిషిలో దాపరికం ఏమీలేదు ఈ సుగుణం సాధారణంగా మనలో చాలామందికి మృగ్యం వినయసంపన్నుడు ఆయన తన విద్యార్థి జీవిత ఆదర్శాలను తన ఉపజ్ఞను శక్తిసామర్థ్యాల లోతుపాతులను సరిగ్గా అంచనావేసుకుని నడుచుకున్నట్లయితే యెంతో మేలు సిద్ధిస్తుంది ఆయన భవిష్యత్తులో చక్కగా రాణించగలడనే నా నమ్మకం అయితే యీ రాణింపు ప్రస్తుతం మన మదరాసు కేసరులని చెప్పబడేవారి ఘనత ను పోలివుండదనే ఆశిస్తున్నాను

ఈ అభినందన సభకు అధ్యక్షత వహించవలసినదిగా మొదటనన్ను కోరవలెనని అనుకున్నారట కాని నేను బెంగుళూరులో వున్నట్టు తెలిసినమీదట శ్రీ శ్రీరాములుగారిని అధ్యక్షులుగా వుండవలసినదని అభ్యర్థించారు శ్రీరాములుగారు బి ఏ బి యల్ హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్నారు మచిలీపట్టంజిల్లా నివాసి

మీటింగునాడు నేను వేసుకున్న దుస్తులు చాలా అందవికారంగా వుండెను ; మీటింగుకు వెళ్ళి కుర్చీలో కూచునీ కూర్చొనగానే, అధ్యక్షులు నా దగ్గరకువచ్చి "ఈ సమావేశానికి అధ్యక్షత వహించే అర్హులు ఎవరైనా వున్నారా అంటే వారు తమరే !" అన్నారు.

అధ్యక్షత వహించడమనే చికాకు కలిగించే బాధ్యత తప్పిపోయినందుకు భగవంతుణ్ణి అభినందించాను. సుందర్రావు పంతులు ఉపన్యాసధోరణి యేమీ బాగులేదు. మాటలతీరు, నిలుపులు సుదీర్ఘం. పొగడ్తలు లావు. ఈ పొగడ్తలు వింటే మహర్షికి సైతం తలతిరిగిపోతుంది ! ఇక సుబ్రహ్మణ్యంగారు, సుందర్రావుపంతులుకన్న యేడాకులు యెక్కువే చదివాడు. ఉపన్యాసధోరణి బాగున్నదికాని విషయం పాడుగా వుంది. ఉపన్యాసాలను కావించడమనేది ఆధునికనాగరికత తెచ్చిపెట్టిన దోషాలలో వొకటివలె కనిపిస్తున్నది. మంచి ఉపన్యాసమంత చక్కనిదీలేదు; చెడ్డ ఉపన్యాసమంత దుర్భరమైనదీ లేదు. కాని చాలా ఉపన్యాసాలు విసుగెత్తించేవిగానే వుంటున్నాయి. ఈ పొగడ్తల వలన రామేశంపంతులు భేషజాన్నలవరుచుకుంటే, అలాగ అలవర్చుకోడనే భావిస్తాను. దానికి మన మిత్రులే కారణం. నేనీసంగతి సుందర్రావుపంతులుకు తెలియచెప్పాను. ఈ సమావేశానికి నేనే అధ్యక్షతవహించి వున్నట్లయితే, అసలు విషయాలను పక్కదారులకు పోనిచ్చే వాడినికాను. సరియైన మార్గమేదో వివరించి చూపించి వుండేవాణ్ణి.

నేను, ఇంటికి వెళ్ళేముందు రామేశంపంతులును కలుసుకుని అతని లోతుపాతులను గ్రహించాలి.

నే నాయన్ని ఒకరోజున విందుకురమ్మని ఆహ్వానించాను. కాని ఆయన యెందువల్లనో రాలేదు. సుందర్రావుపంతులూ, కవిమిత్రుడూ వచ్చారు. కవిగారు తన నవల అరవై పేజీలు చదివి వినిపించారు.

సమావేశంనాడు శ్రీనివాసాచారిగారు సభలో గానం చేశారు. సమావేశానంతరం, మేడమీద వెన్నెట్లో మరికొంతసేపు కొన్ని కృతులను పాడారు. క్షత్రియుల విద్యాసమస్యను గురించి వెంకటపతిరాజుగారితో కొంతసేపు సంప్రదించితిని.

♦ ♦ ♦

మదరాసులో పకోడీలు బహురుచిగా వుంటాయి.

అన్నట్టు యింతసేపూ యీ విషయమే మరిచాను. ఈవేళ ట్రిప్లికేను వెళ్ళడమే ఎంతో కష్టమైపోయింది. జనసమూహంతో దారి అంతా క్రిక్కిరిసిపోయింది. ఇసకవేస్తే రాలని ప్రజ. అరువత్తిమూరు ఉత్సవం జరుగుతూ వుండెను. వచ్చిన జనంలో చూడదగిన చక్కనిమొహం వొకటీ కనబడలేదు. స్త్రీలుకూడా అందంగా కనిపించలేదు.

**10 ఏప్రియలు, బుధవారం:**

స్కూలాఫ్ ఆర్ట్సుకు వెళ్లితిని. పచ్చయ్యప్ప కాలేజీకి అక్కడనుంచి బ్యాంకుకు పోతిని. బాలస్వామినాయుడుగారి వద్ద నుంచి తీసుకున్న చెక్కు మార్చుకుని నూట ఎనభైరూపాయలు తీసుకుంటిని. అటుపిమ్మట మళ్లీ కాలేజీకి, కాలేజీనుంచి ఓరియంటలు లైబ్రరీకి వెళ్ళాను. అక్కడ నాపెన్సిల్ పోయింది. చెప్పిన ప్రకారం ఆ విద్యార్థి అక్కడకు వచ్చాడు. నా సలహాను తప్పక పాటిస్తానని వాగ్దానం చేశాడు.

**11 ఏప్రియల్, లక్ష్మివారం :**

దళసరైన ఎరుపు మొరాకోలెదరు బైండు కాపీలు పన్నెండు కావాలని శ్రీసూర్యనారాయణగారు చెప్పగా విన్నాను. మిగిలినవి వివిధ రంగులవి. నలుపు, ఆకాశపురంగు, ఆకుపచ్చ, ఊదా, "త్వరగా వాటిని పంపించేటట్టు చూడండి. వీలరు వద్దనుంచి ఫొటోగ్రాపులు తీసుకోండి. యింకా హెచ్చుకావాలంటే ఆర్డరివ్వండి. జాగ్రత్తగా పుస్తకాలకు పంపమని వీలరు అండ్ కో., కు తెలపండి. పదిలంగా పేక్‌చేసి, సీళ్ళువేసి సంతకాలు చేసి కట్టుదిట్టంగా పంపించేటట్టు యేర్పాటు చేయమనండి."

**12 ఏప్రియల్, శుక్రవారం :**

అడ్మిరాలిటీ హౌసులో ఇవాళ గానసభ. త్యాగయ్యగారి శిష్యుడు, శతవృద్ధు రమ్యంగా కొన్ని కృతులనుపాడారు. మనిషి వృద్ధులే అయినా చాలా ఆనందంగానూ, కులాసాగానూ వున్నారు. మిగుల ఉత్సాహి. ఉల్లాసంగా నాజూకుగా కనిపించారు. శ్రీనివాసాచారిగారు తమతో నగరాజారావు, రామచంద్రం, సాహేబు మరికొందరు గానసభకు తీసుకువచ్చారు.

**13 ఏప్రియల్, శనివారం :**

ఒకరోజున శ్రీనివాసాచారిగారిని వారిబసలో కల్యాణరామయ్యరు కలుసుకుని నాటక ప్రదర్శనాలను గురించీ, రంగభూమిని గురించీ కొంచెంసేపు ముచ్చటించినాడట ! ఆనాడు తాము ప్రదర్శిస్తున్న నాటకాన్ని చూడరమ్మని ఆహ్వానించగా శ్రీనివాసాచారిగారు నేను వూళ్ళో లేకపోవడంవల్లనూ, ఆయనకు తదితరపనులు వుండడంవల్లనూ నాటకానకు వెళ్ళలేక పోయినారట. ఈవేళ వస్తామని కల్యాణరామయ్యరుకు వాగ్దానం చేశారు. వాగ్దానం చెల్లించుకుందుకు మేం ప్రదర్శనానికి చూడవెళ్ళాము. దారిలో శ్రీ సూర్యనారాయణ పంతులునూ, మాకవిమిత్రుణ్ణీ కలుసుకుని వారినికూడా వెంటతీసుకువెళ్ళాం; ప్రదర్శనం యేమీ బాగుండలేదు. హాలు నిండలేదు. నాటక ప్రదర్శనం జరుగుతున్న స్థలం టౌనుహాలు ; హాలులో చాలా కుర్చీలు ఖాళీగానే పడివున్నవి. టిక్కెట్ల రేట్లు రెండు ; రూపాయిన్నర, రూపాయి ; రేట్లు తక్కువగా లేకపోవడంవల్ల ప్రేక్షకులు పల్చబడివుంటారు.

హాలులో చూడదగిన ఆసక్తి కలిగించే దృశ్యం ఆనరబుల్ శంకరనాయరుగారి కుటుంబం. మొదటివరసలో ఒక పెద్ద బెంచీమీద ఆయన కుటుంబీకులు ఠీవిణీవేసుకు కూర్చున్నారు. నలుగురు కూచోదగిన బెంచీ ; కూచున్న స్త్రీలలో ఒకావిడ అందరికంటె వయసులో పెద్ద. స్థూలకాయం. మనిషి నాజూకుగానే వుంది. వొళ్ళో బిడ్డణ్ణి పండుకోబెట్టుకుని హాయిగా కూర్చున్నది. ఆవిడ ప్రక్కనే యింకొకామె, వయస్సులో కొంచెం చిన్నదే, చతికిలబడింది. తరువాత కూర్చున్నామె అందరికంటె చిన్నపిల్ల. మళయాళీ పద్ధతిలో చక్కని చీరెలు ధరించారు. దస్తులు చాలా ఖరీదైనవే. ధరించిన నగలుసైతం ఎంతో విలువైనవి ; అలంకరణ ఎబ్బెట్టుగా లేదు. మధ్యన కూర్చున్న ఆవిడచెవులకు కుట్టుపోగులు లేవు. కాని మిగిలిన యిద్దరి చెవులకూ ఎన్నో పోగులు. చూడడానికంత నాజూకుగా లేవు. చెవులకున్న పోగులు చాలా వలంగావున్నవి. స్త్రీలను, వారి ఆచార పద్ధతులనుంచి మళ్ళించడం కష్టమేకాని, చెవులకు అన్నేసి కుట్టుపోగులు, ఆభరణాలు పెట్టుకోవడమనే అలవాటును మాన్పించవలసివుంది. ఈ కాలంలోకూడా యీ అలవాట్లేమిటో! ఈ పద్ధతులను త్యజించవలసినదిగా గట్టి కృషి చేయాలి. వారిలో అందరికంటే చిన్నపిల్ల చాలా బక్కపల్చగా వున్నది. కళ్ళు చేపకన్నులను పోలివున్నవి.

నాటక ప్రదర్శనం పాడుగావుంది. దీనిని యీ మహిళలు ఏవిధంగా అనుభవిస్తూ ఆనందిస్తున్నారో గమనిద్దామని నాకు కుతూహలం కలిగింది. చిన్నపిల్ల అమాయిక. ఎంతో వినయవిధేయతలుగలపిల్లవలె పొడకట్టింది. రంగభూమిమీద వొక అసంబద్ధ సన్నివేశం తరువాత యింకొకటి అలాగున ప్రదర్శింపబడుతూనేవున్నది. ఈ అసంబద్ధ సన్నివేశాలను, దృశ్యాలను, నటననుచూసి యీ చిన్నపిల్ల ఏవిధంగా భావిస్తున్నదీ, ప్రతి చలిస్తున్నదీ గమనించవలెనని ప్రయత్నించాను.

సీనులు పాడుగావున్నాయి. తెరగుడ్డలు మరీఅసహ్యం. అభినయం! దానిని యేమనాలో నాకే బోధపడడంలేదు. ఈ దుర్భర పరిస్థితిని వర్ణించడానికి తగిన విశేషణం భాషలో అగోచరం.

మొట్టమొదట అనసూయా, ప్రియంవదల సంగతి. తాటకిలాటి శరీరాలు ; చెప్పలేనంత మోటుతనం. అనాగరకత హెచ్చు. సొగసైన లాలిత్యంగల శకుంతల చెలికత్తెలుగా వీరు తయారయినారు. సున్నితమైన హృదయభావాలనూ, మార్దవమైన అభిప్రాయాలనూ రీవినీ హుందాతనాన్ని కలిగివున్న చెలికత్తెల వేషాలు యీ'కోమలాంగులు' వేస్తే నాటకం ఎలాగున వుండవలెనో అలాగునే వున్నది !

శకుంతల పాత్ర ధరించిన కల్యాణ రామయ్యరు కన్యవలె కనిపించకపోతేమానె ! మంచి నడివయస్సులోవున్న స్త్రీవలె చూపరులకు దిగ్భ్రాంతి కలిగించాడు. అతని ముఖలక్షణాలు అతనికే లొంగకుండెను. గుండ్రని కన్నులు. మొహానకు అతికించినట్లు పెద్దగ్రుడ్లు ; ఆటబొమ్మల కున్నట్లు మీదకు యెక్కొచ్చినట్లు వున్నవి. కోపమూ, చికాకూ, రుసరుసలు బహుశా ఏదో అవ్యక్తమయిన అనుకంపమూ తప్పితే అతని నేత్రాలు మరొకభావాన్ని అభివ్యక్తీకరింపజాలవు. మర్యాద, లజ్జ, ప్రేమ, గౌరవము, వినయశీలత, విచారము, విషాదము మొదలైన ఉదాత్తభావాలను వ్యక్తీకరించుటకు అతని కన్నుల తీరు సరిపడదు. ఈ గుణములేవీ అతని నేత్రాలలో మచ్చుకైనా కానరావు. భావప్రకటనకుగల యోజన అతని కనులకు మృగ్యం ; నుదురు కిందకు అణిగి పోయివుంది; చిన్నది; లొత్త, చివరిభాగాలు మరీ చిన్నవి. కనుబొమ్మలు వొకతీరునలేవు. పెదిమలు సన్ననివీకావు. పోనీ కుదురుగ వున్నట్టూ కనిపించవు. మీది పెదవి గుండ్రన. పెదాలూ నోరూ ముందుకు పందెం వేసుకున్నట్టు తోసుకువచ్చాయి. స్తనములు చాలాపెద్దవి. పాపం అతను వాటిని సరిగ్గా అమర్చుకోలేదు. అయ్యరు ఆకారానికి సంబంధించినంతవరకూ యివీ విశేషాలు ; ఇక అతని వాచికం సంగతి. నోరుతెరచి అతను మాట్లాడబోయేసరికి థియేటరు విడిచివెళ్ళిపోదామన్నంత దుర్భరమనిపించింది. గొంతుకవింటే కప్పలు బెకబెకలాడినట్లే ; ఎంతపెళుసు ! మగ వారికంఠమని యిట్టే తెలిసిపోతున్నది. సంగీతవాయిద్యాలు మహాభయంకరం; మార్దవం పిసరంతలేదు. కర్ణకఠోరమైన సంగీతం ! ఈ దుస్సహమైన దిక్కుమాలిన సంగీతాన్ని అతను యెందుకు మానుకోడు ? ఉహుం! అలాగ వినిపించి ప్రేక్షకులను రంజింపచేయాలనే అతని అభిమతం !

ఈ మదరాసీలు కల్యాణరామయ్యరు పేరుచెబితే పొంగిపోతారు ; ఉబ్బితబ్బిబ్బవుతారు. బాగులేదన్నవాళ్ళకు బహిష్కారమే. ఇతడు మంచి వ్యాపారస్థుడు. ముందుగా తాను వెళ్ళే స్థలములలో తగు మనుష్యులను కలుసుకుని వారిని ఆశ్రయించి ఆదరణ సంపాదించుతాడు. చెన్నపట్టం విడిచి దక్షిణానికిపోతూవుంటే యితని ప్రసిద్ధిమరీ ఎక్కువగా కనిపిస్తుంది. దీనినిబట్టి మదరాసీలకు 'విచక్షణ', సరియైన విలువలను పోల్చుకునే దృష్టి లేదని తేలుతున్నది. విజయనగరంజట్టు నాటకములలో అభినయం యింతకంటె బాగావున్నది. బుచ్చిశాస్త్రి కంపెనీవారు కల్యాణరామయ్యరు జట్టుకంటె అన్ని విధాలా ఎన్నోరెట్లు మెరుగు. అయితే వారికి శ్రీనివాసాచారి తరిబీదు వుందని చెప్పకతప్పదు. కల్యాణరామయ్యరువలె రంగభూమి మీద వెంకయ్యగారు అవకతవకగా ఎన్నటికీ అభినయించదు.

అయ్యరుచేసిన మోటుపనులు కొండయ్య చేస్తాడంటే కలలో కూడా నమ్మజాలను. అసలు యితని నాటకపు నోటీసులే అవకతవకగా వున్నవి. ఈతని ప్రకటనలకొక అర్థంపర్థంలేదు. తానొక అసాధారణ ప్రజ్ఞావంతుడనని ప్రకటించుకుంటాడు. ఈ నోటీసులను అచ్చుముగా అలాగే "పంచ్" పేపరులో అచ్చొత్తిస్తే హాస్యపు ప్రకటనలుగా చలామణీ అవుతవి. "నమ్రత" అంటే అయ్యరు ప్రకటనలలోనే కలదుగదా మరి ! ఈ నాటకపు వాళ్ళకు ఆత్మశ్లాఘన అలవాటు అయినది.

ఇది యీనాడు వారికొక ఫేషను. తమిళుల పద్ధతులు బహుతమాషాఅయినవి. అవకాశము కలిగినచోటల్లా తమ వాళ్ళను తామే పొగుడుకుంటూ ఆకాశానికెత్తుతుంటారు. కల్యాణ రామయ్యరుకు ప్రసిద్ధి యిలాగే కలిగివుంటుంది. అతని రూపు, సందేహంలేదు, చలాకీఅయిన డాన్సింగు గరల్‌వలె వుంది. ఇంతకంటే తక్కువ వయసులో చిన్నతనంలో అయ్యరు కంఠమూ, రూపూ కాస్త బాగావుండేవేమో ! యిప్పటికికూడా తాను తగుదునని ఆడవేషాలు ధరించడం ఎంత మూర్ఖత ! అతని వక్రబుద్ధిని యేమనగలం!

దుష్యంతుడువేషం కట్టిన బుద్ధిమంతుడు బహుశా యీ ట్రూపుకు నాయకుడు కాబోలును. ఈ వేషమునకు ఇతనిని యెంచుకోవడంలో కల్యాణరామయ్యరు ప్రాజ్ఞతను యేమని పొగడగలరు ! పాడుమోహం ; మట్టిబుర్ర. దోకువస్తూ రాక్షసుడిలా దూసుకువచ్చాడు. దయ్యంలాంటి మనిషి. నల్లగా లేడు కాని, వేషధారణ రోతకలిగిస్తున్నది. వేషంమీద రూపం అందంగాకనపడేటట్టు చేసుకోవడం కూడా యెరిగినట్టు తోచదు. సాక్సు, నల్ల ట్రౌజరు, కోటూ వేసుకుని మిలిటరీ ఆఫీసరులాగ దిగబడ్డాడు. దీనికితోడు తలమీద టోపీకూడాను ! మీసాలు పల్చగా సన్నగా వున్నాయి. వేషానికి తగిన మీసకట్టుకాదు. నుదుట తిరుచూర్ణము ; మొత్తంమీద మనిషిని చూసీ చూడగానే, మావేపు సాతానిభిక్షువు జ్ఞాపకంవచ్చాడు. మూతి కొంచెం ముందుకుంటుంది. మీది పెదవి గుండ్రము ; పెదవులలో యిమడని పొడుగుపళ్ళు. ఇట్టి ముఖములో లావణ్యముగాని, చురుకుతనముగాని యేలాగు కనబడగలవు ?

పాపం, అందు కతనేమి చేయగలడు ! ధీమాగాని, చలాకీతనంగాని, రాజపౌరుషంకాని జోడుకంచుకాగడాలు పట్టుకుని వెతికినా అతని ముఖంలో కానరావు. వేషము సరే సరి ! అంతా మోటుతనమే ; యుక్తత అన్నదిపూజ్యం. వెంట్రుకలు కొప్పుగా ముడుచుకుని దానిమీద టోపీవొకటి పెట్టుకున్నాడు. తలవెనుక ముడి ! ఆహా ! వీళ్లెంత మోటుమనుషులు ! కించిత్తు దర్జాకూడాలేదు ; పోనీ ఔచిత్యం అంతకంటే కనిపించదు ! దుష్యంత మహారాజావారులేచి నిలుచుంటే తలముడి ముందుకు పడుతూ వుంటుంది. బోర వెనక్కు వెడుతూ వుంటుంది ! ఆరి వీడి సిగతరగా ! ఏమి వేషం ! ఏమిలోకం ! దుష్యంతుడు ఎంత మూర్ఖుడు ! ఎంత జడ్డి పీనుగ !

మిగిలిన పాత్రధారుల వేషధారణ యేమీ చెప్పుకోనక్కరలేదు. ఇంచుమించు వారికి మంచి దుస్తులు లేనట్టే; ఏ పనులయితే చేయకూడదో, ఏ మాటలను పలకకూడదో అవన్నీ చక్కగా చేసి, పలికి, రంగభూమి అంతాకంగాళీచేసి విడిచి పెట్టారు. ఇదివర కొకసారి నేను చెప్పినట్టుగానే, రంగభూమిమీద కనిపించిన ప్రతి నటుడూ ఏదో సణుగుడు ప్రారంభించాడు. మంత్రాలు, జపాలు, పాటలు ; సంభాషణ మట్టుకు లేదు. నోరు విప్పి మాట్లాడ్డం తప్ప మిగిలిన హంగామా కావలసినంత.

రంగభూమిమీద ఒకనటుడు విశాఖపట్టం చేంతాడంత స్వగతం చెప్పుకుపోతున్నాడు. పక్కనున్న మిత్రుణ్ణి "ఏమిటి నేస్తం యీ తరగనిదుంప ! ఎప్పుడైనా హనుమంతుడి తోక చూశావా ? అన్నట్టు ఇందులో నీకేమైనా బోధపడ్డదీ ?" అని అడిగాను. ఎవరయితే అనర్గళంగా ఉపన్యాసధోరణిలో మాట్లాడుతారో వారు గొప్ప తెలివైనవాళ్ళని, గొప్ప నటులని మనవాళ్ళ అభిప్రాయం. ఇది మరాటీ కంపెనీల బాణీ; దీని నొక సూత్రంగా యీ కంపెనీలు

పరిగణిస్తున్నాయి. నటులు పలికే మాటలు కేవలం పాఠం వప్పగించినట్లే విసుగుకలిగిస్తూ కృతకమనిపిస్తున్నవి. ఎంతో కష్టంమీద వొక్కొక్కమాటనే అంటున్నారు. ఈపాటి మహాభాగ్యానికి, కల్యాణరామయ్యరు చంగా బజారుసందుగొందుల్లో ప్రదర్శనాలీయక, ఎందుకీ టౌనుహాలులో నాటకాలు వేయాలని సహజంగా ఎవరైనా ప్రశ్నించవచ్చును ; దీనికి నేనేం సమాధానమీయగలను ? పాపం, అయ్యరు వొట్టి వెర్రికుట్టె ! తాను శకుంతల భూమికను అత్యద్భుతంగా నిర్వహించగలనని భావిస్తున్నాడు. నటులకు వేషం చక్కగా కుదిరేటట్టు చేశానని, కాళిదాసు శ్లోకాలు అమోఘంగా భట్టీ వేయించానుకదా అని అతనిధీమా. వీటికే అతను హెచ్చు ప్రాధాన్యత యిస్తున్నాడు. శ్లోకములన్నీ ఆభాసుపాలు చేసినాడు. శ్లోకం తరవాత శ్లోకం. ఎక్కడా ఎడతెరిపిలేదు ; నించున్న పాటున మనిషిని గొంతుక నులిపి హత్యచేసినట్టు శ్లోకాలను ధ్వంసంచేసి విడిచిపెట్టాడు. దారుణమైన హత్య ! ఇక నా ఓర్మి సన్నగిల్లింది.

కిం శీతలై ః క్లమ వినోదిభిః అనే శ్లోకం దుష్యంతుడు నాటకంరంగంమీద యీడుస్తూ చదువుతూవుంటే యిక భరించలేకపోయాను. నా తీవ్రఅసమ్మతిని తెలియచేసేటందుకో అన్నట్టు కాలిబుటుతో వొక్కసారి నేలనుకొట్టి దురన్యాయం దురన్యాయం అనుకున్నాను. నేను చేసిన యీ అసమ్మతి సూచక ధిక్కారం హాలంతా ప్రతిధ్వనిస్తున్నదా అనిపించింది. హఠాత్తుగా శకుంతల దుష్యంతుడి చెంత చేరుతూ గునుస్తూ సానిపిల్లలాగా టక్కరితనంతో వగలు కురిపిస్తూ తెలుగులో "ననుగూడరా నాథా" అని జావళీ అందుకుంది! ప్రాణం విసిగెత్తిపోయి పాపం, శ్రీనివాసాచారిగారు దిగ్గనలేచిపోయారు. యిదేమిటీ దిక్కుమాలిన శకుంతల !

ఇదివరకు వొకసారి కల్యాణరామయ్యరు ప్రదర్శనం మీద నేను తీవ్రంగా జడ్జిమెంటు చెప్పానని శ్రీనివాసాచారిగారికి బాధనిపించిది. ఆనాడు ఆయన కల్యాణ రామయ్యరు నాటక ప్రదర్శనాలను సమర్థిస్తూ వాదించారు.

నాచెంతనే కూచున్న మిత్రుడు వెనక్కితిరిగి "ఇప్పుడీనాటక ప్రదర్శనానికి కాళిదాసువచ్చివుంటే ఏమనుకునేవాడో!" అన్నాడు.

"మారుమాటాడక యీపాటికి ఏ నుయ్యో, గొయ్యో చూసుకునివుండును !"

ఒక్కచోటమాత్రం అయ్యరు అభినయం బాగున్నది. దుష్యంతుడితో తన చెలికత్తెలు ప్రసంగిస్తున్నపుడు శకుంతల మౌనంగా నిలబడివుంటుంది. ఇలా తానేమీ మాట్లాడకుండా నించున్నపుడే అయ్యరు నటన ఫరవాలేదనిపించింది.

శకుంతల, దుష్యంతుడితో ఇక్కడేమిటి అల్లరి చేస్తావు. అంతా చూస్తారు. బహిరంగం అంటున్నది. సైదు కర్రెను పక్కకు తప్పుకొని, కాస్సేపు అచట నక్కి మళ్ళీ యింకొక సైదుకర్రెనులోంచి తలపైకెత్తి తొంగితొంగి ముందుకు చూస్తూ మునికన్య శకుంతల "అక్కడకు మళ్ళీ నేనెటులపోగల దానను ? నా పూలదండ పోయినదికదా !" అని వాపోతున్నది. వెదుక్కుంటూ యింకొకతె రంగంమీదకు ప్రవేశించింది. దుష్యంతుడు శకుంతలను "నీ కేమి కావలె?" అని ముచ్చటగా అడిగాడు.

"అయ్యో ! నా పూలచెండును పోగొట్టుకొంటినే!"

"ఊరడిల్లు మూరడిల్లుము. అద్దానిని నేను నీ కొసంగెదను. కాని నీవు నాకొక వాగ్దానమీయవలెను!"

"ఇచ్చెదను!"

"ముందు మాటయియ్యి"

"యిచ్చితిని!"

"అటులైన యిటువచ్చి కూర్చో. పూలచెండును నీ జటయం దలంకరించెద!"

దుష్యంతుడు, శకుంతలకు పూలదండను యిచ్చి ఆమె చేతిని పట్టుకున్నాడు. పట్టుకుని లాగుతూ "నీకరమెంత మెత్తగా నున్నదో!" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు! శకుంతలాదుష్యంతుల ప్రేమాభినయమును చూసి హాలులోకూర్చున్న స్త్రీలు ఫక్కున నవ్వడమారంభించారు.

ఇప్పుడు యింక దుష్యంతుడు రంగభూమిమీద శకుంతల చెంత అభినయిస్తున్నాడు. వివాహితస్త్రీని మానభంగంచేసేటంత దూకుడుగా శకుంతలతో పెనుగులాడుతున్నాడు !

**14 ఏప్రియలు, ఆదివారం :**

1. తెనాలి రామకృష్ణ.
2. హిందువులు అనుసరిస్తున్న ప్రస్తుత వైవాహిక పద్ధతి సంతృప్తికరముగా వున్నదా.
3. మద్రాసులో విద్యార్థిజీవితం సుఖప్రదంగా వున్నదందుమా.
4. జీవితధ్యేయములు.
5. కేవలము వొకవ్యక్తి గొప్పస్థితిలోవున్నంతమాత్రాన, ఆతనియెడల గౌరవభావము చూపవలెనా.
6. ప్రజల ఐక్యతకు వర్ణవ్యవస్థ అనేది గొప్ప ఆటంకముగానూ, అడ్డుగోడవలెనూ లేదా.
7. మతనమ్మకమనేది ప్రస్తుతము, భారతదేశములో అభివృద్ధి అవుతున్నదా, లేక నశించుతున్నదా.
8. బహిరంగశత్రువు, కపటస్నేహితుడు, వీరిలో ఎవరు ఎక్కువ ప్రమాదకారులు.
9. ఆత్మహత్య చేసుకోవడమనేది మనిషి ధైర్యమునకు హేతువా లేక పిరికితనానికా
10. ఉపజ్ఞాపూర్వకమైన విద్యను గరపడంవలన, దేశంలో నేరముల సంఖ్య తగ్గునా?
11. జీవితపవిత్రత
12. చాంధసత్వమనేది సమాజమునకు హెచ్చు ఉపద్రవము తెచ్చిపెట్టునా

**15 ఏప్రియల్, సోమవారం :**

పచ్చయప్ప కాలేజీకి వెళ్ళితిని. సభకువచ్చిన జనం యెక్కువగా లేరు. చాలా బెంచీలు ఖాళీగానే వున్నవి. ఏర్పాట్లు బాగులేవు. వేదికమీద కొంతమంది మనవాళ్ళూ, ఆరుగురు యూరోపియనులూ ఆసీనులయిరి. వేదికచుట్టూ చాలామంది తగు మనుష్యులు గుమిగూడిరి. వారి గడబిడ, గాభరా హెచ్చుగానే వుంది.

బిషప్పుగారి ఉపన్యాసము యెంతో చక్కగా వుంది. ధోరణి ఎన్నతగింది. మధురమైన కంఠము. తెలుగుభాష సొగసును మెచ్చుకుంటూ కొంతసేపు ప్రసంగించాడు. మనిషిలో హాస్య, చమత్కారములు కలవు.

ఉపన్యాసమును ముగించాడు. మిగిలినవారి ప్రసంగములు పాదుగానే వున్నవి. మిస్టరు కూపరు ఓక్లీ ముక్కుకు సూటిగా ఉపన్యసించాడు. ఉపన్యాసములో తనకు సంబంధించిన భోగట్టా జాస్తి. ధోరణి బాగులేదు. ఎవరో కృష్ణమాచారిగారట, నానా చెత్తా మాట్లాడినాడు. విద్యాభివృద్ధిని కోరుతూ 'టోస్టు'ను ప్రపోజుచేసే బాధ్యత

# డైరీలు

**16 ఆగస్టు :**

మహారాజావారి ఆస్థానములో 'డిబేటింగుక్లబ్' ఏర్పడినది. ఉపాధ్యక్షుడుగా ఎన్నుకోబడితిని.

**6 సెప్టెంబరు :**

సెలవు వొకనెల పొడిగించితిని.

**16 సెప్టెంబరు :**

శర్మగారివద్దవున్న నా ప్రాక్టీసాఫ్ ఎలక్యూషన్ (వక్తృత్వాభ్యాసము) అనే గ్రంథం తేవలెను. 'లివింగ్ ఆథర్స్' (సజీవకవులు), 'హిన్ట్సు ఆన్ ఎలక్యూషన్' అనే పుస్తకములు ప్రిన్సిపాలుగారివద్ద వుండిపోయినవి. ఎ లుక్ రౌండ్ లిటరేచర్ (సాహిత్యసమీక్ష) ఎనాలిసిస్ ఆఫ్ యింగ్లీషు లాంగ్వేజి (ఆంగ్లభాషావిమర్శ) ప్లెజర్ ఆఫ్ డిసల్యూటరీ రీడింగ్ (ఇచ్ఛానుసార పఠనమందలి ఆనందము) గ్రంథములను చదివితిని.

**4 అక్టోబరు, శుక్రవారం :**

విజయదశమి పండుగ, రెండుసంవత్సరముల క్రిందట ఈరోజున నాకీప్రస్తుత ఉద్యోగము లభించినది. అందువల్ల నాకెట్టి మనశ్శాంతికలిగినదో మహారాజావారికి తెలిసివుండదు. మహారాజావారిని పరమేశ్వరు డనుగ్రహించుగాక సి.సి.గారి కొరకు నా ప్రార్థనలు.

**6 అక్టోబరు, ఆదివారం :**

మహారాజావారు జె.యస్. తో, 'ప్రతివారము హార్పులో కవిత్వము వ్రాయరాదా?' అనిరి. మానవులలోగల పశుప్రవృత్తినిగురించి చర్చజరిగినది.

**7 అక్టోబరు, సోమవారం :**

గతనెల మొదటి తేదీ నుంచి నాకు జీతంలో అయిదు రూపాయిల యింక్రిమెంటు వచ్చింది. ఆర్డరు నెంబరు 118. కళాశాలలో చరిత్ర పాఠములను బోధిస్తూ వున్నంతకాలమూ యిది అమలులో వుంటుంది.

**8 అక్టోబరు మంగళవారం :**

నా కింతకంటె హెచ్చు యింక్రిమెంటు యీయలేక పోయినందుకు ప్రిన్సిపాలుగారు తమ విచారమును వెలిబుచ్చిరి.

కోటలో యివాళ "జ్ఞానప్రదమైన సాహిత్యము, శక్తివంతమైన సాహిత్యము". అనే సంప్రదాయ సిద్ధమైన సారస్వత విభాగమును గురించి చర్చ జరిగినది.

**27 అక్టోబరు, ఆదివారం :**

కాంగ్రెసు మీటింగు, బ్యాంకు ఏజంటు మార్కనలుగారికి నా ఉపన్యాసము పంపవలెను. మాధవరావుగారికి 'హార్పు'లో ప్రచురించడానికి ఉపన్యాసపు కాపీ కావలెనట.

**8 నవంబరు :**

మహారాజావారి నాటక సమాజమువారు 'శకుంతల' ప్రదర్శించిరి. మహారాజావారు ప్రదర్శనమునకు విచ్చేసిరి.

**10 నవంబరు :**

మహారాజావారు విజయనగరంనుంచి బయలుదేరారు.

## 1891

**30 జూన్ :**

దేవరపల్లిలో రాజమ్మ వివాహమహోత్సవం.

## 1892

**17 అక్టోబరు :**

మహారాజావారివద్ద రెండువేల రూపాయిలు బదులు పుచ్చుకున్నాను.

## 1893

**10 డిసెంబరు, ఆదివారం :**

ఉదయము 5 గంటలకు ఆడుతూ పాడుతూ భోజనం చేసి 7 గంటలుకు విజయనగరంలో రెయిలు యెక్కడమైనది. రెయిలు పడివరకు యెప్పుడు పడునని ఆసక్తితో యెదురుచూచుచుంటిమి ; గాని రెయిలు పద్దతర్వాతకూడ గౌణగడముకు కావలసినన్ని అవకాశములు రెయిల్వేవారు కల్పించినారు. ఊళ్ళదగ్గిర స్టేషనులు వుంటే ఉపద్రవము వస్తుందని కాబోలు ; యోచించి కాళ్ళకు కసరత్తు కలిగి పురజనులు దృఢముగా వుండగలుగుటకు ఊళ్ళకు కడుదూరముగా స్టేషనులు వుంచినారు. కొన్నిచోట్ల తునితగువులుకూడ చేయుచు వచ్చిరి. అలమండ స్టేషను వూరికి రమారమీ రెండుమైళ్ళ దూరము : సింహాచలస్టేషను వూరికి మూడు మైళ్ళు. వాల్తేరు స్టేషను త్రిశంకుస్వర్గమువలె వాల్తేరుకు విశాఖపట్నముకు అంటివుండక రెంటికీ యెడమగా వున్నది. విజయనగరంనుంచి అనకాపల్లి వెళ్ళగోరువారు అసావాదిత్యోబ్రహ్మా అని అనకాపల్లి త్రోవవదలి వాల్తేరు స్టేషనుయాత్రచేసి వొక గంట ఆ స్థలమును సేవించి, తిరిగి వదలిపెట్టి అనకాపల్లి, త్రోవవరకు వెనుకకు త్రొక్కి అక్కడనుండి అనకాపల్లి వెళ్ళేసరికి మధ్యాహ్నము కాగా,

ఆ యెండలో వూరికి అద్దెబళ్ళకుగాను బండి వారలతో అద్దెనుగురించి పోరాడి వూరుచేరి మూదుఝాములలోగా యిన్ని మెతుకులు కడుపులో వేసుకొన్నయెడల కృతార్థులని యోచించ తగును

## 1895

**3 జనవరి లక్ష్మివారం**

జనవరి నెలకు నాకు రావలసిన అలవెన్సు యిదివరకే షరీఫువద్ద పుచ్చుకున్నాను సోమరాజు బావ నాకు యివ్వవలసిన సొమ్ము పంపించమని ఉత్తరం రాశాను 10 రూ లు నగదు స్టాంపుకోసం పుచ్చుకున్నది 10 రూ లు రిజిస్ట్రేషను రుసుం 10 మందులకు 150 ఆక్సుఫర్డు పుస్తకాలకు 8 రూ లు పెళ్లికి సామానులు కొనేందుకు 23 మొత్తం 211 రూ లు

ఇవాళ కోటలో ఫేన్సీడ్రస్ వినోదములు విందు

**5 జనవరి శనివారం**

కృష్ణాజిల్లాలోని వీరవల్లి స్టేషనుసమీపాన వొక కొలను కలదు గట్టుచుట్టూ తుమ్మచెట్లు యీతచెట్లు చాలా చెరువులు అలాగునే వున్నవి రాజమండ్రివద్ద గోదావరి అవతల ఒడ్డున రోడ్డుకిరువంకలా తుమ్మచెట్లకింద "పచ్చికమాసికలు కనిపించినవి బెజవాడ సమీపంలో ఎన్నోతుమ్మచెట్లు పచ్చిక బయలు ఎంతో ఏపుగా పెరుగుతున్న ఆగడ్డి ఏమిటిచెప్మా బెజవాడవద్ద సీమచింత మొక్కలవరసలను చూశాను

**9 జనవరి బుధవారం**

విజయనగరంనుంచి సాయంత్రం ఆరుగంటలకు బయలుదేరాను

**10 జనవరి లక్ష్మివారం**

ఉదయం ఆరుగంటలకు రాజమండ్రీ వచ్చాను

**11 జనవరి శుక్రవారం**

ఉదయం ఏడు గంటలకు బెజవాడ బయలుదేరాను విజయనగరం మహారాజావారి ట్రెయినులో ఎక్కాను

శ్రీ మోహనురావు చాలా మంచి వ్యక్తి తన కొడుకును ఎంతో ఆప్యాయంగా ముద్దుముద్దుగా పెంచుతున్నాడు

**12 జనవరి శనివారం .**

ఇంకా మార్గమధ్యంలోనే వున్నాము నంద్యాల దాటింది రైలు నంద్యాల ప్రాంతం సొగసుగావుంది కొత్తగా బాగుచేసి దున్నిన అడవిప్రదేశం చాలాకనబుతూ వుంది ఆముదపుపైరు కంది వ్యవసాయం కనబడదు ఈ జాతి ఆముదపు మొక్కలే యీ భూమిలో ఎక్కువగా పెరుగునుకాబోలు కంకరభూమి ఎక్కడ చూసినా ఆముదాలపైరే

**13 జనవరి, ఆదివారం :**

ఉదయం మద్రాసు చేరుకున్నాము అడ్మిరాల్టీహౌసు అందమైన భవనం మహారాజావారు బిల్డింగంతా మాకు చూపించారు తమ ఉద్దేశాలను ఊహలను ఆశయాలను విధానాలను కొంతవరకు మాకు వివరించారు భూములమీద భవనాలమీద డబ్బు పెట్టుబడిపెట్టడం దానికిగల ప్రాధాన్యత మెట్రొపాలిస్‌లో మొట్టమొదటసారిగా

భవనంకొన్న మహారాజా యీయనే. మిగిలిన రాజులు కూడా యీయన్ని అనుసరిస్తారనుకుంటాను. అయితే సిటీ అభివృద్ధి అవుతుంది. మహారాజావారి భవనం, మద్రాసులోకల్లా దివ్యమైనదని అంతా పరిగణిస్తున్నారు. ఇందుకు శ్రీ బాలయ్యనాయుడిగారిని అభినందిచక తప్పదు. మహారాజుకు తగినభవంతి.

**14 జనవరి, సోమవారం :**

అడ్మిరాల్టీహౌస్‌వలె ఫూల్‌బాగ్‌ను ఎందుకు అభివృద్ధి పరచకూడదు ? భవనంమాటకాదు ; తోట సంగతి.

**16 జనవరి, బుధవారం :**

కేశనపల్లి నరసింగరావు పంతులు ఇవాళ సాయంత్రం రమ్మనమని నాకు కబురంపారు. ఈనెల 17, 18, 19 వ తేదీల బేటా, ఆరురూపాయిలు శ్రీ బాలయ్యనాయుడుగారు యిచ్చారు ; ఇమ్మనమని నే నడగలేదు.

**18 జనవరి, శుక్రవారం :**

శ్రీ మాధవరావుగారిని చూస్తున్నకొద్దీ ఆయనమీద నాకు గౌరవం హెచ్చుతూవుంది.

నంబరు 32, తంబుచెట్టివీధినుంచి శ్రీ జి. నారాయణ మూర్తిగారిలేఖ.

**19 జనవరి, శనివారం :**

జె.యం. గ్లీసన్ ఎస్క్వైర్, సూపరెండెంటు, సెయింటు జార్జికెథడ్రెల్‌రోడ్డు, తేనాంపేట.

శ్రీ మాధవరావుగారివద్ద 27 రూపాయలు చేబదులు పుచ్చుకున్నాను.

**21 జనవరి, సోమవారం :**

ఇవాళ బి.ఏ లను గురించీ, ఎలక్షన్లగురించీ తమ అభిప్రాయాలను మహారాజావారు మా యెదుట వ్యక్తపరచారు.

ఉదయపూర్ దివాన్ పన్నాలాల్‌జీకి స్వాగతమిచ్చారు. దివానుగారు వృద్ధులు. కాని మంచి ఆరోగ్యవంతులు. నవ్వుతూ కనిపించారు. ఆయన తాతగారే కాబోసు, మహారాజావారికి లోగడ ఉదయపూర్‌నుంచి ఉత్తరం వ్రాస్త. మహారాజావారు తాము కూచున్న కుర్చీలోంచి కొంచెంలేచి ఆయనకు నమస్కరించారు. కుర్చీ చూపించి కూచోమని గౌరవించారు. దివానుగారు రాజావారియెడల ఎంతో గౌరవం కనబరిచారు.

**31 జనవరి, లక్ష్మివారం :**

మహారాజావారు విజయనగరం బయలుదేరారు.

**7 ఫిబ్రవరి, లక్ష్మివారం :**

టిఫిన్ ఏడణాలు.

లిటరరీ సొసైటీ నుంచి శ్రీ సూర్యనారాయణ పంతులు తెచ్చిన పుస్తకాలను వొక వాల్యూంతప్ప, మిగిలినవన్నీ వాపసు చేశాను. మహారాజావారివద్ద లేనివి మూడు గ్రంథాలు యిక్కడ వున్నాయి.

**8 ఫిబ్రవరి, శుక్రవారం :**

పొద్దున్నే వొక మోతాదుమందు.

కోచ్‌వానికి అణాముక్కాణీ యిచ్చాను. పోస్టేజి నాలుగణాలు. లిటరరీసొసైటీ లైబ్రరీనుంచి ఇండియన్ ఆంటిక్వరీ వాల్యూములు పట్టుకొచ్చాను. కంపోజిటరుకు ఒక రూపాయి యీనాంయిచ్చాను. పనిచూస్తే చాలావుంది. చేతినిండాపనే. అయితే వున్నది మాత్రం ఒక్కడు. మిగిలినవాళ్ళంతా ఎవళ్ళపనుల్లో వాళ్ళు మునిగివున్నారు.

టిఫిన్ నాలుగణాలు.

**9 ఫిబ్రవరి, శనివారం :**

టిఫినుకు ఏడణాలు. రాత్రి, మాత్రవేసుకున్నాను.

**10 ఫిబ్రవరి, ఆదివారం :**

విజయనగరం టెలిగ్రాం. రెండు మోతాదుల కాడ్ లివరాయిలు. ఒక్కొక్క మోతాదు చెమ్చాడేసి. మోతాదులోపాటు రాత్రిమాత్ర.

**12 ఫిబ్రవరి, మంగళవారం :**

వంటలక్కకు అయిదు రూపాయిలు. రూపాయి రెండణాలుపెట్టి అరరీము కాగితం కొన్నాను. టిఫిను నాలగణాలు. రెండణాలకు రెండు కొవ్వొత్తులు.

**13 ఫిబ్రవరి, బుధవారం :**

కథలు.

దూడ, గడ్డి, వూక తినుట

పరిమానందయ్యగారి శిష్యులు

ఏనుగు, కాకి, రెండుపావురములు

తోప

వంటపాత్ర

చీమానెమలి నేస్తం

రాజూ, అడవిమనిషీ

తనభార్యను రోసినరాజు

**17 ఫిబ్రవరి, ఆదివారం :**

ఓరియంటల్ లైబ్రరీ కేటలాగుకోసం శ్రీ శేషగిరి శాస్త్రియర్ యింటికి వెళ్ళాను. అక్కడ మైసూరు శేషన్నవీణ, జలతరంగిణి, వాయిద్యం ఎంతో బాగున్నది.

**18 ఫిబ్రవరి, సోమవారం :**

ట్రీటీ త్వరగా రాధాబాబు సాహేబ్‌కు పంపించమని కలకత్తానుంచి టెలిగ్రాం.

శ్రీ బాలయ్యనాయుడుగారు కబురు తోలేశారు. వంటలక్కకు అయిదు రూపాయీ లిచ్చాను.

**19 ఫిబ్రవరి మంగళవారం .**

టిఫినూ బిస్కట్లు రూపాయిబేడా బి యస్ గారికి టెలిగ్రాం రాత్రి అడ్మిరాల్టీకి తిరిగివచ్చాక టెలిగ్రాం చూశాను ఎనిమిదణాల పోస్టేజి

**20 ఫిబ్రవరి బుధవారం .**

మహారాజావారి కిచ్చిన టెలిగ్రాంకు మూడు రూపాయిలు పుస్తకాలు కొన్నాను గ్రామరు వాగ్విధాయిని కథాసప్తతి డిక్షనరీ పది రూపాయిలు మొత్తం పధ్నాలుగు రూపాయిలు సుల్తాన్ హాలువద్ద వేలంపాటలో కొన్న వస్తువులకు రెండు రూపాయిల పదిహేనణాల పరకా ఒక ఫిల్టరూ నాలుగుస్పూనులూ టీసెట్టూ పిల్లలకురెండు ఆటబొమ్మలూ

అడ్మిరాల్టీకి వచ్చేసరికి నా కోసం నిరీక్షిస్తూ కూచున్న శ్రీ సుందర్రావు కనిపించాడు తన స్నేహితులు బాబూజీ, అయ్యంగార్లను కలుసుకోమని చెప్పారు వివేకానందుని శిష్యులలో వీరిద్దరూ ప్రప్రథముల మీటింగ్ వక్తృత్వము లిటరరీ సొసైటీలను గురించి మేమిద్దరం చాలసేపు ప్రసంగించుకున్నాము

**21 ఫిబ్రవరి లక్ష్మీవారం**

ఫైనల్ ప్రూఫ్‌లను పోస్టుచేశాను రూపాయి పన్నెండణాలు యిచ్చి వొక జోళ్ళజత కొనుక్కున్నాను

**22 ఫిబ్రవరి శుక్రవారం**

పి సీతారామరాజువద్ద నాలుగు రూపాయలడిగి తీసుకున్నాను టిఫిను ఎనిమిదణాలు పుస్తకాలకు రెండ్రూపాయిల పదమూడణాలు కోచ్‌వానికి బేడ

**23 ఫిబ్రవరి, శనివారం :**

పుష్పప్రదర్శనం గొట్టుముక్కల వెంకటరామరాజువద్ద పదిరూపాయిలు చేబదులు

టెలిగ్రాం పిల్లలకు బొమ్మలు

**24 ఫిబ్రవరి ఆదివారం**

ట్రిప్లికేనులో బోటుఫెస్టివల్ పదణాలు బట్లరుకీ వెంకటనాథానికి రెండ్రూపాయిలు కొవ్వొత్తులు రెండణాలు అయిదు రూపాయిలు వంటమనిషికి రెండ్రూపాయిలు పుస్తకాలకు

**26 ఫిబ్రవరి మంగళవారం**

చాకలాడికి తొమ్మిదణాలపరక ఇరవై రెండుబట్టలు వేశాను

**27 ఫిబ్రవరి బుధవారం**

మిస్టర్ అండర్‌వుడ్‌కు కథలు వైద్యుడు గుర్రం వైద్యుడు కరక్కాయ రాజు మంగలిని మంత్రిని చేయుట మిడుతంభట్లు సవారి ముందూ వెనకా జ్యోతిష్కుడు మంచిగంధపుచెట్లు అమ్మడం ససేమిరా ఏకః పంథానుకర్తవ్యం రాజుభార్య రాజును చంపుట మంత్రి భార్యా బతికించుట పక్షులు మాట్లాడుకోవడం రాచకన్యల తాలూకు బట్టల నిమిత్తం కుమారుడు

2 మార్చి, శనివారం :

శ్రీ కళ్యాణ రామయ్యరు మాకు టిక్కెట్లు యిచ్చారు స్త్రీలు చక్కగా అభినయించారు

3 మార్చి ఆదివారం

రాజగోపాలాచారిని చూశాను కాలేజీలో మీటింగుకు వెళ్ళాను శశిపాదబెనర్జీ కాన్ఫరెన్సుకు బయలుదేరాం

9 మార్చి శనివారం

బంతి బాడిద మందార పూతపూసిన మామిడి

పరమేశ్వరన్‌పిళ్ళేగారిని ఓరియెంటల్ లైబ్రరీలో కలుసుకున్నాను ఆయనతో నాకు పరిచయమయింది

10 మార్చి ఆదివారం :

కథలు గారడీవిద్య విక్రమార్కుడు దొంగతనం అతను సాని యింటికి వెళ్ళుట · రాజు దొంగతనం నేర్చుట నక్కలరాజు రాజు కొమారుడు వుండు యిల్లు , పురోహితుడి కుమార్తె బాచిగాడు నెల్లూరి ప్రయాణం మంత్రి బంగారం గిన్నె యెత్తుకుపోవుట గొడ్డు గోతబడ్డది

11 మార్చి సోమవారం :

లోకల్‌న్యూస్‌లో అతిముఖ్యమైన సమాచారం కనబడ్డది ఆపరేషన్

13 మార్చి బుధవారం :

క్రిష్ణంరాజుగారితో రిజిస్ట్రేషనాఫీసుకు వెళ్ళాను

సెనేటుహౌసులో సుందర్రావు పంతులుగారిని చూశాను అక్కడనుంచి బీచికివెళ్ళాం సాయంకాలం సంజచీకటి చల్లనిగాలి గాలిచల్లదనాన్నీ, సంజచీకటినీచూసి ఆనందించాం అనేక విషయాలపైకి మా ప్రసంగం మళ్ళింది అత్యంత మధురమైనవేళ

గంటకుపైగా అక్కడనే వుండి గాలీ చీకటీ అనుభవించి సుందర్రావుపంతులు యింటికి వెళ్ళాం

14 మార్చి లక్ష్మివారం :

డబ్ల్యు కెన్ ఎమ్ ఏ యమ్ ఆర్ ఏసీ ఎగ్రికల్చరల్ కాలేజి ప్రిన్సిపాల్

మెమోరియల్ మీటింగుకు వెళ్లాను ఉపన్యాసములు చాలామటుకు పాడుగానే వున్నవి శ్రీ పరమేశ్వరన్‌పిళ్ళే ఉపన్యాసం చాలా ఉత్తేజకరంగా వున్నది కాని ఉపన్యాసం చెబుతూ మాటిమాటికి ఉద్రేకపడ్డారు మనిషిలో అలసట కనిపించింది కొందరి ఉపన్యాసములలో హుందాతనమూ ఔచిత్యమూ లోపించినవి

తరవాత యింటికి బయలుదేరాను వెంకటపతిరాజుగారి వద్ద పదిరూపాయలు చేబదులు ట్రీటీబుక్కుకు నాలుగు రీముల కాగితం

15 మార్చి, శుక్రవారం :

అడ్మిరాల్టీలో బాలస్వామినాయుడుగారిని కలుసుకున్నాను ఆయన నన్నెంతో ఆదరించారు నూతనభవనం సరికొత్త డిజైన్లతో బాగుంది ఎదుట తోట మరీ బాగుంది

నాలుగువందల రూపాయలు డ్రా చేశాను

**19 మార్చి, మంగళవారం :**

ఉదయం తొమ్మిదీ పదిగంటలమధ్య బసనుంచి బయలుదేరి క్రిస్టియను కాలేజీకి వెళ్ళితిని. దిగువ గదులలో పిల్లలు రణగొణ ధ్వని. పెంకు లెగిరిపోయేటట్టు వీళ్ళింత గోలగోల చేస్తూవుంటే వింటూ ఊరుకున్నారు. విద్యార్థులు పెంకెఘటాలే, స్కూలు గోడలనిండా పెన్సిళ్ళతో ఏవేవో రాసి నానా ఖంగాళీ చేశారు. డాక్టరు మిల్లరు పిల్లల్ని కట్టుఖాయిదాల్లో వుంచుతాడనే వింటినే !

క్లాసు రూములు చిన్నవి. ఎత్తు తక్కువ. పిల్లలతో క్రిక్కిరిసి వున్నాయి. సొగసైన బెంచీలు. కొందరికి బెంచీలతో పాటు దస్కులుకూడా వున్నాయి. ఇనప కమ్ములతో దస్కుల తీరు బాగున్నవి.

డాక్టరు మిల్లరుదొర ప్రయివేటు రూము చాలా చిన్నది. ప్రొఫెసర్లు పాఠాలు చెబుతూవుంటే నూతిలోనుంచి మాట్లాడుతున్నట్టే వుంది. తాము చెప్పేదంతా పిల్లలకు వినబడునో లేదో అని నా సందేహం.

రిఫరెన్సు లైబ్రరీ, పుస్తకాలతో నిండుగావుంది. గది కవతల గోడ కెదురుగా పుస్తకాల జాబితా ; చక్కటి షెల్ఫులలో పుస్తకాల పేర్పు ; అక్కడనే ఒక బంట్రోతు నించుని వున్నాడు. ఇతనికి కొంచెం యింగిలీషు వచ్చునుకాబోను. పిల్లలకి కావలసిన పుస్తకాలు ఇతనే యిస్తూవుంటాడు. తమకు ఏయే పుస్తకాలు ఎప్పటిలోగా కావలెనో విద్యార్థులు చిన్న కాయితం ముక్కమీద రాసి వుంచుతారు.

విద్యార్థులు పుస్తకాలను చక్కగా పఠిస్తున్నట్టే కనబడుతున్నది. లయిబ్రరీలోవున్న గ్రంథాలను బాగానే వినియోగించుకుంటున్నారు. జనరలులయిబ్రరీలో చెప్పుకోతగ్గ విశేషమేమీ నాకు కనుపించలేదు. అలమారాలు బహు అందంగా వున్నాయి. చెక్కడపుపని బాగున్నది.

**20 మార్చి, బుధవారం :**

మిస్టరు కూపర్‌ఓక్లీని చూస్తిని. మనిషి గట్టివాడు. దాపరికంలేకుండా యిష్టాపత్తుగా మాట్లాడినాడు. పచ్చయ్యప్ప కాలేజీకంటె ప్రెసిడెన్సీ, క్రిస్టియను కాలేజీలే నయమట ! తన విద్యార్థులు పేదతనంవలన క్లాసు పుస్తకాలు కొనుక్కోజాలకున్నారట. మా కాలేజీ అంటే ఆయనకు చాలా గౌరవభావమున్నది. నన్ను పాఠములు విననివ్వవలసినదని కోరితిని. అందుకు తమ తాబేదారులు యిష్టపడరేమో అన్నారు.

**21 మార్చి, లక్ష్మివారం :**

ఉదయం తొమ్మిది గంటలకు డాక్టరు మిల్లరును చూడవెళ్ళితిని. నేను వెళ్ళీవెళ్ళగానే నన్ను చేతులతో ఆప్యాయంగా పట్టుకున్నాడు. వీపు తట్టాడు. ఎంతో మర్యాదతో మన్నన చేస్తూ పలకరించాడు. కుశలమడిగాడు. విజయనగరంలోవున్న తన పాతవిద్యార్థుల యోగక్షేమాలను భోగట్టాచేసి తెలుసుకున్నాడు.

కాలేజీలో కాస్సేపుండి, తిన్నగా అక్కడనుంచి రామస్వామిచెట్టి అచ్చాఫీసుకు వెళ్ళాను. అతని తమ్ముడు ఆఫీసులో కూచునివున్నాడు. ఇద్దరం అవీ యివీ ముచ్చటించుకుంటూ కొంతసేపు కాలక్షేపం చేశాము.

నాలుగోఫారం మళ్లీ అచ్చువెయ్యమని చెప్పాను.

కాన్వొకేషనుకు హాజరవుతున్నానని తెలియచేస్తూ సెనేటు కొక దరఖాస్తు పంపించాను. శ్రీశ్రీనివాసశాస్త్రిగారికి లేఖ రాశాను.

**23 మార్చి, శనివారం :**

'చంగాంగడి' వద్దవున్న థియేటరులో బాలామణి జట్టునాటక ప్రదర్శనం. రమ్మనమని శ్రీ బాలస్వామి నాయుడుగారు నన్నూ, శ్రీనివాసాచారిశాస్త్రిగారినీ ఆహ్వానించారు. ఇక వెంకట్రావుపంతులుగారు సరేసరి ! రానంటోన్నా బలవంతంమీద కిందటి శనివారం రోజున నన్నక్కడికి లాక్కుపోయారు. జింకుషీట్లతో కట్టిన హాలు. మధ్యమధ్యన యినపవాసాలు. కాని థియేటరున్న సందు మురికివాసనతో అడుగుపెట్టడానికే రోతగా ఉండెను.

పోయిన శనివారం ప్రదర్శనానికి బోలెడంతమంది జనం వచ్చారు. హాలు క్రిక్కిరిసిపోయింది. హాలు వెలుపల తొడదొక్కిడి లావుగావుండెను. లోపల కూచుందుకు జాగావే దొరికిందికాదు.

'మాస్కాను' తోటలో బాలామణి ప్రదర్శించిన శకుంతల నాటకం కూడా చూస్తిమి. మేం వెళ్ళేసరికి తృతీయాంకం ప్రదర్శింపబడుతున్నది. శకుంతలను విడిచి దుష్యంతుడు తన నగరుకు వెడలిపోతున్న దృశ్యం అభినయిస్తున్నారు. బాలామణి చెల్లెలు దుష్యంతుడి పాత్ర ధరించింది. ఆమోరూపం వికారంగా వుంది. నడకలో రంగేలా. కంఠం విప్పితే ఆడదని యిట్టే తెలిసి పోతుంది. బాలామణి తప్ప ఆ జట్టులో చెప్పుకోతగ్గ మరివకమనిషి కనబడదు. మిగిలినవాళ్ళంతా ఎందుకూ పనికిరారనే చెప్పవచ్చును.

బాలామణి రూపం ఠీవిగావుంది. మనిషి నాజూకుగా దర్శనీయంగావుంది. ముఖంలో కొంత యౌవనలోపం కనబడుతున్నా లావణ్యం కలదు. వాచికం మధురంగానే వుండును కాని, కొంతయాస లేకపోలేదు. కంఠం మార్చగలశక్తి వున్నట్టు నాకు తోచదు. శాంతము, ఓరిమికల విషాదభూమికలను నేర్పుగా అభినయించగలదు. కరుణరసం వొప్పించడం అంత సహజంగా వుందనజాలను ; కొంత "అతి" వుస్తు[illegible] అభినయించేటపుడు అనవసరంగా చీటికీ మాటికీ దుఃఖిస్తూవుంటుంది. శకుంతల ఇలాగున తరుచు దుఃఖిస్తూవుండాలని మూర్ఖతతో నాటకపుజట్టు నాయకుడు శాసించేడో, ఏమోమరి ! మొత్తంమీద బాలా మణినిచక్కని 'విషాదనటి' అని చెప్పలేను. విషాదనాయిక పాత్రను రమ్యంగా నటించగలదో లేదో నాకు సందేహమే. కాని మనిషి బాగున్నది. వేషము ధరించడంలో మంచి అభిరుచి వున్నట్టుతోచింది. అలంకరణ సొగసుగా కనిపించింది. పాత్రోచితమైన ఆహార్యము.

మద్రాసులోవున్న మోటు మనుష్యులను మెప్పించడం కోసమే కాబోలును, యీ జట్టులు ఆడే నాటకాలలో బందహాస్యమూ, మోటు శృంగారమూ వుత్పన్నము లవుతూవుంటవి. మంచి రసవత్తరమైన ఘట్టములలో కొసకు విషాదసన్ని వేశాలలో సైతం విదూషకుడు, సహజంగా నడిచిపోతున్న కథకు అడ్డు తగిలి అసంబద్ధ ప్రలాపాలతో రసాభాస చేస్తాడు.

బాలామణిజట్టులో మిగిలినవాళ్ళ వేషధారణ చాలాహీనంగా వున్నది. పాపం,మదరాసీలలో తక్కువ కులస్థులని చెప్పబడేవాళ్ళు అంత అందంగా వుండరు. అందుచేత నాటక రంగంమీద కాస్త కంటికింపుగా కనిపించేందుకు ఆర్భాటమైన అలంకరణ వీళ్ళకు అవసరం కాబోలు !

నాటక ప్రదర్శనలో సంగీత వాయిద్యాలు లెక్కకు మించినన్ని. సంగీతం అంతా వొట్టి అల్లరి. గడబిడగా తేలింది. ప్రహ్లాదనాటకలక్షణం బాలామణిజట్టు యిక్కడకూడా పోనిచ్చుకోలేదులావుంది.

పంచమాంకంలో దుష్యంతుడి దర్బారుదృశ్యం వొకంతకి తెమిలిందికాదు. శకుంతలా దుష్యంతుల సమావేశం గంటల తరబడి నడిచింది. ప్రశ్నమీద ప్రశ్న. ప్రశ్నలవర్షం ! సమాధాన పరంపర ! ఈ పంచమాంకాన్ని కాళిదాసు యెంతో నేర్పుతో నిర్వహించాడుకదా ! అంత రసవత్తరఘట్టాన్నీ అవలీలగా పాడుపాడు చేసి విడిచిపెట్టారు.

అన్నట్టు యింతసేపూ యీ విషయమే మరిచాను భరతుడు వేషం వేసిన గుంటడు కొండముచ్చులా వున్నాడు

పోయిన శనివారం బాలామణిజట్టు ప్రదర్శించిన నాటకం కొంతసేపు చూశాక కళ్యాణరామయ్యరు నాటకానికి వెళ్ళాం అతని జట్టు ఆడుతున్న ద్రౌపదీవస్త్రాపహరణంలో చీరవొలుపు సీను చూద్దామని కుతూహలం బాల్కనీకి అవతలప్రక్క దూరాన ఆఖరు క్లాసులో కొన్ని నిముషాలపాటు నిలబడితిమి ఈ నాటకపు జట్టుకు విలువైన దుస్తులే వున్నవి కాని వేష రచన అసంబద్ధముగానూ, వికారముగానూ కనిపించింది తలవెంట్రుకలు ముడిచి పెద్దకొప్పుగా చుట్టుకుని నెత్తిని టోపీ పెట్టుకుంటే రాచఠీవి కనబడదు రాజవేషము వలె బొత్తిగా వుండదు ఇక దుశ్శాసనవేషము పెద్ద మీసాలు గడ్డము వింత తలపాగా ఇత్తడి బెట్టీలు మా ప్రాంతపు పాములవాడి వేషమును తలదన్నుతున్నది దీనికి తోడు మరాటి కంపెనీలలోని రాక్షసవేషములవలె దుర్యోధనుడూ దుశ్శాసనుడూ పీంద్రించుకొని గావుకేకలు పెట్టారు బాలామణి తప్ప యీ మదరాసు నాటకకంపెనీలలో సహజంగా వచనం చెప్పగల నటిగాని నటుడుగాని వొక్కడూ కనబడలేదు వచనం సరసంగా సహజంగా పాత్రోచితంగా యాసలేకుండా చెప్పడము వీళ్లెవళ్ళకీ తెలియదు స్కూలు పిల్లలు పరీక్షాధికారి యెదట యేకరువుపెట్టినట్టు అనవలసిన ఆ నాలుగుమాటల్నీ గబగబ తరుముకుపోతారు ఉచ్చారణలో నిలుపులు సక్రమంగా వుండవు ఎవరి కేదితోస్తే అది , ఎంత తోస్తే అంత మాట యాస ఇదివరకు కల్యాణరామయ్యరు జట్టు నాటక ప్రదర్శనాన్ని యింత పరిశీలనగా చూడలేదు గత శనివారం కొద్దిసేపే వుండి యింటికి వెళ్లిపోయినాను ఆవేళాయింతే దుశ్శాసన పాత్రధారి గుక్క తిప్పుకోకుండా పీంద్రించుకుని గగ్గోలుపెడుతూ నానా రభసా చేశాడు ద్రౌపదిముందు కుప్పిగంతులు వేస్తూ భయంకరంగా పులి గాండ్రుపెట్టినట్టు ఊరికే అరుపులు

ఈ మదరాసీలకు దీర్ఘోపన్యాసములు, వందలకొద్దీపాటలూ హోరెత్తించే సంగీతమూతప్ప మరేఁవీ రుచించవనుకుంటాను కేవలం వచన నాటకమంటే వీ రా స్మరంతికే పోరేమో

ఈ వేళ తన చాకచక్యమంతా చూసి కల్యాణరామయ్యరు అభినయిస్తున్నాడు మనిషి వొడ్డు పొడుగూ బాగానే వున్నాడు ముచ్చట గొలుపుతున్నాడంటే పొరపాటుకాదు వేషధారణ ఆకర్షణీయంగా వుంది వేసుకున్న తెల్లని సిల్కు దుస్తులు సన్నని జరీ నాకు నచ్చినవి బట్టరంగు, కంటికి యింపు గొల్పుతున్నది కాని వచ్చిన చిక్కల్లా అతని కళ్ళతోనే కళ్ళూ ముక్కూ తీరుగా లేకుండుటచేత వేషానికి లోపం కలుగుతున్నది కళ్ళు బండిచక్రాల్లా గుండ్రన ముక్కు చప్పిడి దూరంనుంచి చూస్తే విగ్రహం కంటికి కాస్త నజరుగానే కనిపిస్తుంది అయ్యరుకంఠంలో మృదుత్వంలేదు పాట సున్నితమూ కాదు రెండుకురెండే

చెపితే విచిత్రంగా తోచునేమోకాని అతని నటన అంతా మంచి చలాకీఅయిన పడుపుకన్య రకముగా వుంది బాలామణి శకుంతల వేషంలో బిడియం నమ్రత కనిపిస్తాయి

నాటకపుజట్టులలోనికి పడుపుకన్యలను చేరదీయుట హానికరమనే నా ఊహ అందకత్తెయై తెలివైన నటి పడుపు కన్యయేతే, సంఘమునకు చాలా ముప్పు తెస్తుంది ఆమెకే కనక యెన్నికైన సౌందర్యం లావణ్యం వుంటే ఆమె చేసే అల్లర్లకు హద్దూ పద్దూ వుండదు

కల్యాణ రామయ్యరు నాటకప్రదర్శనం కొంచెంసేపు చూసి అక్కడనుంచి బాలామణి ప్రదర్శిస్తున్న నాటకం చూడవలెనని బయలుదేరాం వెళ్ళినవాళ్ళం బాలయ్యనాయుడిగారితో పన్నెండుమందిమి హాలు క్రిక్కిరిసివుంది

కూచుందుకు ఒక్కడికి కూడా సీటు లేకపోయింది నించోడం అసాధ్యం ఈ అసాధ్యాలను యిట్టే సాధించగలవాళ్లెవరైనా వున్నారా అంటే ఆయన బాలయ్య నాయుడుగారొక్కరే మహారాజా వారి ఉద్యోగులలో యింకొకరికి యీ చాకచక్యం లేదు ఆయనపేరు చెబితేనే చాలును కూచుందుకు చోటుతోపాటు ఆదరణకూడా లభిస్తుంది ఆయనపేరు ఏంటే అందరికీ ఆకర్షణ కలుగుతుంది

స్త్రీలు కూచున్నతట్టున వెనకభాగంలో మాకు చోటు దొరికింది రిజర్వుడు క్లాసుకు వెళ్ళాం టిక్కెట్టు ఖర్చుంతా నాయుడుగారే పెట్టుకున్నారు

బాలామణి దంబాచారి విలాస ప్రదర్శనానికి చాలా ప్రసిద్ధి కలదు నాయిక పాత్రధారణి హోషుగ్గావుంది గొబ్బి ఆట బాలామణి ఎంతో నేర్పుతో సున్నితంగా ప్రదర్శించింది ఇందులో ఒక దృశ్యంలో ఆమె యించుమించు దిగంబరిగా వచ్చి దంబాచారికి అభ్యంగనం చేయిస్తుంది ఇది చూడడానికి చాలా మంది వస్తారు ఇంగ్లీషు బ్యాలటువనితవలె బనియనులు వేసుకొని రంగంమీదకు దూసుకొనివస్తుంది

ఆమె ముఖవర్చస్సు బాగున్నది తల నున్నగా నాజూకుగా దువ్వుకొని సింగారించుకుంది తలమీద సూర్యచంద్రుల ఆభరణాలు ఇవి లేకుంటే యింతకంటే నయమనిపించును నగ్నంగా యింగ్లీషుబ్యాలటువనితవలె బనియనులు ధరించి యీమె రంగంమీదకు రావడం నాకు నచ్చలేదు వేషధారణ సహజంగా లేదు పాత్రోచిత వేషధారణ అనజాలను శృంగారవిలాసవిజృంభణ మృగ్యం. చలాకీతనం కనపడదు మదనసుందరిగా అంతకంటే స్ఫురించదు అభినయంలోను నడకలోను ప్రశాంతత ధీమా సొగసూ వున్నవి చిత్రమేమంటే యే మదరాసీ బంగారు పిచికనో యే చెట్టియారునో సర్వనాశనం చేసిన యీ భోగం పడుచు యీ దంబాచారి నాటకంలో అట్టి సర్వనాశనము చేసే పడుపుకత్తెవేషం అభినయించి తన జీవితమునే గర్హింపజేసే నీతిని బోధించుట

అయితేనేమి ఈమె పేర్మోనతగిన స్త్రీలలో వొకతె

♦ ♦ ♦

ఈ వేళ పొద్దున్న వొక కుర్రాడు యిక్కడకు వచ్చి బాగుచేస్తాననే నెపంతో టెలిఫోను "జింక్సు" ను అటూ ఇటూ తుడిచేడు బాగుచేయడంమాట దేవుడికెరుకగాని తీరా వాడూ వెళ్లాక టెలిఫోను చెడిఊరుకుంది

♦ ♦ ♦

తెలుగు మాట్లాడుతున్నపుడు తమిళుల ఉచ్చారణ పదాలలో కలిగే మార్పు

వుండాది పూడుస్తాడు బెసిఅయింది వెధవకొడుకు తీస్తిని (Bought) అద (అదిగా) యక్కడనో (కో) సామి (అయ్యా)

ఉచ్చరించేటపుడు పదములోని మొదటి అక్షరంమీద ఊనిక హెచ్చు

రెండుమనిషి బిల్లుయత్తు చేస్తిని వెసుకుంటమూ యేమిదందుగ కత్తిదారపోసినాడు (Lost mislaid) నెను మాచివాడు లక్షణంగా

**మార్చి 24, తేదీ ఆదివారం :**

శ్రీ బాలయ్యనాయుడుగారు కొంతమంది స్నేహితులను వెంటబెట్టుకొని యిక్కడకు వచ్చారు నాకు వీరందరితోనూ పరిచయంకద్దు సుబ్బారావుగారు జావళీలు చక్కగా పాడతారని ప్రసిద్ధి కామస్వామినాయుడు

షణ్ముగం చెట్టియార్లు ఎంప్రెస్ ఆఫ్ యిండియా ప్రెస్సుకు చెందినవారు. శ్రీనివాసాచారిగారు కొంతకాలం నాతోనే వుండిరి. మేమిద్దరం హాయిగా కొన్నాళ్ళు గడిపాం. సుబ్బరాయనుగారు మాతోపాటే. రోజూ రెండుమూడు బిలియర్డ్సు గేములు ఆడుకునేవాళ్ళం. ఇక టెన్నిసు ఆటకు మితమేలేదు. బాలయ్యనాయుడుగారు బంతిని బహు తమాషాగా కొడతారు. బహు నాజూకయిన స్ట్రోక్సు. కాని ప్రాక్టీసు చాలదు. కామస్వామినాయుడుగారి ఆట ఫరవాలేదనిపిస్తుంది. సుబ్బారావుగారిది ప్రశాంతమైన వ్యక్తిత్వం. నిశ్చలమైన స్వభావం ; ఆయన మాకు మొజార్టు వంటివారు.

షణ్ముగంగారిని చూడగానే చటుక్కున నాకు వెంకటాద్రి నాయుడుగారు జ్ఞాపకానికి వస్తారు. ఇద్దరి ముఖ లక్షణాలూ వొకేతీరున వుంటవి. దేనినీ లెక్కచేయనన్నట్టు ముఖంలో వొక ధీమా గోచరిస్తుంది. పిడుగు మీదపడ్డా చలించని ధీమా తొణకిసలాడుతూ వుంటుంది. నాయుడుగారు కలుపుగోరు మనిషి. అందరితోనూ కలివిడిగా వుంటారు.

తమిళదేశం, సంగీతంలో తెలుగుదేశంకంటె మిన్నకదా. అయినప్పటికీ తమిళులు పాడే పాటలన్నీ తెలుగుకృతులే అయివుండనేల? దీనికి కారణ మేమిటయి వుండునో అని యిక్కడి మిత్రులను చాలామందిని అడిగాను. తమిళముకంటె తెలుగుభాష యెక్కువ సంగీతమయంగానూ, మధురముగానూ వుండడమే దీనికి హేతువని మిత్రులు చెప్పుకొస్తున్నారు. ఏమైనప్పటికీ యిది పూర్తి నిజమనజాలను. తమిళభాష యేవిధంగానూ సంగీతమయం కాకపోదు. తెలుగు కృతులను తమిళులు పాడడానికి హేతువు 'యిదే'నని సమాధానం చెప్పుకోజాలను. దీనికి యింతకంటె బలవత్తరమైన కారణాలేవో వుండితీరాలి. వొకదేశం తన రహదారిని వొదిలి మాతృభాషను త్యజించి అన్యభాషను యెందుకు స్వీకరిస్తుందో సరియైన సమాధానం గ్రహించవద్దామరి !

ముసల్మానులు, యూరోపియనులు దక్షిణదేశంలో సామ్రాజ్యాలను స్థాపించుకోకపూర్వం అక్కడి పరిస్థితులు ఏలాగున వుండేవో గమనించినట్లయితే, యీ ప్రశ్నకు ప్రత్యుత్తరము లభించగలదని నా ఊహ. ఆనాటి దక్షిణదేశ స్థితిగతులే యిందుకు ప్రబలకారణమై వుండునని నాకు తోస్తున్నది. అప్పుడు దక్షిణదేశాన్ని పరిపాలించిన యేలికలు తెలుగువారు. అనగా మధురనాయకరాజులు, కంచిని ప్రధాన నగరంగా చేసుకొన్న చోళచాళుక్యులు ; విజయనగర రాజులు.

తెలుగుభాషకు కొన్ని అవకాశాలు కలమాట నిజమే ; సందేహంలేదు. ఎట్టి పరిమితులు లేకుండా తెలుగు, సంస్కృత భాషాపదములను స్వీకరిస్తుంది. తెలుగు అజంతభాష. అచ్చుల ఉచ్చారణము హెచ్చు. తమిళభాషలో కంఠ్యములు మిక్కుటము. 'ర' తరుచు వినిపిస్తూవుంటుంది. 'ర, ళ, డ'లకు ప్రాచుర్యము అధికము. సంయుక్తాక్షరములుకూడా తరుచు వినిపిస్తూనే వుంటవి. చాలాశబ్దములు హలంతములు.

* * *

టెలిఫోను సరిగ్గా పనిచేయడంలేదు. మహారాజావారు కలకత్తానుంచి బయలుదేరారట. సగం సగం మాటలలోనే, మాట పూర్తిగా చెప్పకుండానే అకస్మాత్తుగా టెలిఫోనుమూతి బిడాయించుకు కూర్చున్నదే !

**మార్చి 25, తేదీ సోమవారం :**

ఇవేళ యింటినుంచి యెక్కడికీ కదల్లేదు.

## పాత్రలు :

ఏకాంగి : ఈయనొక యోగిపుంగవుడు. స్ఫోటకపు మచ్చల ముఖము. కొంచెము. పొడుగైన నల్లని తలగుడ్డ; చక్కరంగు జరీ. మేలురకము కాషాయపు అంగీ ధరించి మహాజ్ఞానివలె నటిస్తూ వుంటాడు. అబ్బో ! మనిషికి కొన్ని యింగ్లీషు ఫేషనులుగూడా పట్టుబడ్డవి. మాటలధోరణి సాగుతూ వుంటే చీటికీ మాటికీ చేతిరుమాలు తీసి వాడుతూ వుంటాడు. యెవరైనా ప్రశ్నిస్తే మహాపండితునివలె తల పంకిస్తాడు. పాపం ; ముసలి కృష్ణంరాజుగారి కీతనివల్ల చాలా డబ్బు దండుగవుతూ వున్నది. ఏకాంగిస్వామివారికి, దయపుట్టి యిటు వచ్చినప్పుడల్లా రెండురూపాయలన్నర బండీ అద్దెకే ముడుపు చెల్లించుకుంటున్నారు. స్వాములవారు తెలివితేటలు గలవాడే. తెలివితేటలు వున్నవికాని, వక్తకాదు. మాటలధోరణి తెచ్చిపెట్టుకున్నదికాని సహజమైనదికాదు. పామరజనాన్ని బాగా ఆకర్షించగలడు. మావద్దకు వచ్చే బ్రాహ్మణులకు, వైష్ణవులకు యితనంటే రోత. ఇతనంత సులువుగా కొట్టి పారవేయవలసిన మనిషికాడని చెప్పేందుకు యిదే దాఖలా. శూద్రు లీతని పాదాలకు మ్రొక్కుతారు.

కృష్ణంరాజుగారి వెంట వొక వైష్ణవ భిక్షువుకూడా తిరుగుతున్నాడు. వాడు పచ్చి దొంగ. శుద్ధస్కౌండ్రల్ !

**మార్చి, 26 తేదీ మంగళవారం :**

వినోలియా సబ్బొకటి కొనుక్కుంటిని. బులుసు సూర్య నారాయణపంతులుగారికోసం మూడు రూపాయల పదణాలు పెట్టి వొక గడియారం కొన్నాను. రామస్వామిచెట్టి షాపులో ఎనిమిది పాతవస్తువులకు ఎనిమిది రూపాయలు చెల్లిస్తిని. 'వెస్లు' ఫోరుమెనుకు రెండున్నర షీటుల పేపరుకోసం రెండు న్నరరూపాయలు యిచ్చాను. 'ట్రీటీ' నాలుగున్నర ఫారములు.

♦ ♦ ♦

ఏకాంగి పునర్దర్శనం !

♦ ♦ ♦

శలవు (expenditure) అన్నీ తడిసిపోయింది;

విచారించుట (enquire) తీస్తిని (bought)

నువపిండుకో (chewing betel leaves)

రైల్వేస్టేషనుకు వెళ్ళాను. ఎంతబరువున్నానో తూచుకున్నాను. ఎనభై ఎనిమిది పౌనులు. ఏడు పౌనులు పెరుగుదల.

**మార్చి, 27 తేదీ బుధవారం :**

కృష్ణంరాజుగారివెంట తిరిగే వైష్ణవభిక్షువు చేతిలో యేదో జ్యోతి పెట్టుకుని తక్కుతూ తారుతూ నా గదిలోకి వచ్చాడు. దేవుడికేదో చేస్తాడట ; అందు కతనికి యెంతో కొంత నా మనసుకు నచ్చినంత యివ్వవలెనని సూచించినాడు. అలాగునా అని అతనికి కొంత తత్వబోధ చేశాను. మారుమాటాడక వైష్ణవభిక్షువు మెల్ల మెల్లగా జారుకున్నాడు

వెంకటనారాయణరాజుగారీవేళ నాకో ముచ్చట చెప్పారు. కథ వినడానికి కుతూహలంగా వుంది. అది, వెనక తమ బంధువులకూ, వారి విరోధులకూ జరిగిన యుద్ధ కథ. వెంకటనారాయణరాజుగారొక పాత్ర. మంచి

నవ్వుతాలమనిషి. ఎప్పుడూ కులాసాగా వుంటారు ఏదన్నా హాస్యంగానే తీసుకుంటారు కాని తాను గౌరవిస్తున్న వ్యక్తి ఎవరైనా ఆయనతో పరుషంగా మాట్లాడితేమాత్రం విభ్రాంతు లౌతారు మొహం వెలవెల బోతుంది రాజుగారి సంభాషణలో మాండలికపదాలు హెచ్చు పలుకులో యాస సెసెచి సొం యెటి యిత్యాదులు

ఆయన చెప్పిన సోల్జర్ల ముచ్చట బాగానేవుంది

♦ ♦ ♦

మాదుగులలోవయు పార్కులో జరిగిన అగ్నిప్రమాదమును యేదైనా వొక నవలలో చిత్రించతగ్గవి

* * *

ఇవాళెందుకో మనసు బాగుండలేదు విచారం ముంచుకొస్తున్నది మనసు పరిపరివిధాల పోతున్నది మామావగారి కుటుంబం ఎంతమంది పోయారు వాళ్ళందరూ తలపుకు వస్తున్నారేమో మరి అందులోనూ చిన్నపిల్లడు చిట్టిబాబు పాపం

మర్చిపోకుండా ఇవాళ గిడుగు రామమూర్తిగారికి ఉత్తరం రాయాలి ఆయన్ని తలచుకుంటే నా కెంతో విచారంగా వుంది ఈ దేశంలో గౌరవంగా బతికిన కుటుంబాల పరిస్థితులన్నీ యింతే కుటుంబయజమాని ఆ వున్న కాస్త పెద్దదిక్కూ మరణించేసరికి, కుటుంబమంతా అవస్థలపాలు కావల్సిందే ఈ శపు పోకడే అంత

**మార్చి 28 తేదీ లక్ష్మివారం .**

రామస్వామిచెట్టిగారి యింట ఆనందాచారిగారి కుమారుడు శ్రీనివాసాచారి కనుపించినాడు మంచి యువకుడు ఉత్సాహి తన పత్రికానిర్వహణపద్ధతులు కవితకు ముఖ్యంగా ఆధునిక కవితా వికాసానికి చక్కగా ఉపకరించడం లేదని అతనూ అంగీకరించాడు ఇదే పద్ధతిలో కొనసాగించినట్లయితే ప్రజల దృష్టిని యెంతమాత్రమూ ఆకర్షించలేమని అన్నాడు ఆంగ్ల సాహిత్య గ్రంధాలను కావ్యాలను సమర్ధతతో అనువదించగలవారు అట్టేమంది లేరని చెప్పాడు కావ్యాలను సాధారణంగా మాతృకలతో సరితూగేటట్టు తర్జుమా చేయడం దుర్లభమని అనువాదాలు జయప్రదం కావడం అరుదని అన్నాను ఆమాటా నిజమేనని అంగీకరించాడు దేశంలో స్వతంత్రరచనాశక్తి క్రమ క్రమంగా మృగ్యమౌతున్నదని విచారం వెలిబుచ్చినాడు

* * *

ఇవాళ తెలుగుసంవత్సరాది మహారాజావారిని దేవుడు అనుగ్రహించుగాక లోకంలో పరిపూర్ణానందం వెల్లివిరియుగాక

**మార్చి 29 తేదీ శుక్రవారం .**

కాన్వొకేషనుకు హాజరయితిని ఏర్పాటులేమీ సంతృప్తికరంగా లేవు

**మార్చి 30 తేదీ శనివారం :**

డాక్టరు బ్రౌనింగు వచ్చాడు

నాయుడుగారివద్దనుంచి సైనుల ప్రయాణపుఖర్చులకుగాను ఏభయి మార్చినెల జీతాలనూ డ్రా చేస్తిని

ఈ వేళ సాయంకాలం స్కూలుపిల్లల సమావేశానికి వెళ్ళాను స్వామినాయరుగారి స్మారకసభను విద్యార్థులు టవును హాలులో యేర్పాటుచేశారు సభకు మిస్టర్ నార్టను అధ్యక్షత వహించవలసియుండెను కాని ఆయన సభకు రాలేదు శ్రీ పరమేశ్వరపిళ్లేగారు అధ్యక్షతవహించిరి

♦ ♦ ♦

ది పిక్ పోకెట్.

రాత్రి థియేటరుకు వెళ్ళాను. జేబుదొంగ నాటక ప్రదర్శనం. పాత్రధారులు చాలా నెమ్మదిగా మాటలాడిరి. సంఘటనకు తగినవిధంగా పాత్రధారులు నటించలేకపోయారు. కథ ఏమంత ఆసక్తి కలిగించలేదు.

**31 మార్చి, ఆదివారం :**

అడ్మిరాల్టీ హవుసులో విందు జరిగింది. విందు యేర్పాటు చేసిన వారిలో శ్రీ పరమేశ్వరనుపిళ్ళేగా రొకరు. భోజనం బహురుచిగావుంది. వడ్డించిన పదార్థాలన్నీ చవులూరిస్తున్నవి. ముందు బ్రాహ్మణులకు వడ్డన. భోజనం చేసిన తరువాత మిగిలినవారు విందారగిస్తూవుంటే వారి ప్రక్కన కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పేందుకు మేమంతా వెళ్ళాం. విందు ముగిసేవేళ యింతమందిని ఆహ్వానించి చక్కని ఆతిథ్యమిచ్చిన శ్రీ పరమేశ్వరన్ ప్రభృతుల ఆయురారోగ్యాభివృద్ధిని కోరుతూ క్లుప్తంగా ఉపన్యసించాను. తరువాత అందరమూ సోడాలను తాగేం.

శ్రీనివాసాచారిగారూ, సుబ్బారావుగారూ కొంతసేపు కృతులను గానం చేశారు. నాయుడుగారికి మహారాజామీద గౌరవం హెచ్చు. ఆయన గొప్పతనాన్ని శ్లాఘిస్తూ కొన్ని పాటలు పాడవలసినదిగా నాయుడుగారు, శ్రీనివాసాచారి, సుబ్బారావుగారలను కోరారు. మహారాజావారిని తప్ప మరెవ్వరినైనా వారెంత గొప్పవారైనా కీర్తించడం తనకు అభిమతం కాదనీ, యింతటి గౌరవం చూపదగిన వ్యక్తి మహారాజావారేననీ నాయుడుగా రన్నారు.

నాయుడుగారికి తాము ఆనందంగా వుండడ మెలాగో తెలుసును. ఇతరుల ఆనందాన్నే తమ ఆనందంగా భావించుకునేగుణం ఆయనకు కలదు.

గిండీలోని డాక్టరు బ్రౌనింగు బంగళా. డాక్టరు యింటివద్ద లేదు. బంగాళాకు తూర్పుదిక్కు కభిముఖాన ఆఫీసురూము వున్నది. గది ఎంతో చల్లగా వుంది.

గిండీపార్కు కంటికి యింపుగా లేదు. నేలమీద పచ్చిక యెండిపోయింది. చెట్లు వొకదాని కింకొకటి యెడం యెడంగా వున్నవి. దూరదూరంగా వుండడానికి తోడు, వికృతమైన పెరుగుదల, చాలా అందవికారంగా కనిపిస్తున్నవి.

బ్రౌనింగు గదిలోవున్న అలమారానిండా పుస్తకాలు ; చాలావరకు మెడికల్ గ్రంథాలే. షేక్స్పియరు నాటకాలు గూడా కలవు. గదిచెంత బట్లరు నించుని వున్నాడు. అతనితో కొంతసేపు మాటలాడితిని. బట్లరుకు దొరమీద ప్రేమమిక్కుటముగా వున్నట్టు కనిపిస్తున్నది.

కేసులను పరీక్షించడంలో డాక్టరు బ్రౌనింగుకు మంచి ప్రసిద్ధికలదు. రోజులతరబడి వొక్కొక్కప్పుడు కేసులను నిదానంగా పరీక్షిస్తాడు. ఆలోచించి జాగ్రత్తగా పరిశీలించినమీదట కాని యే నిర్ణయానికీరాడు. వచ్చిన నిర్ణయాని కిక తిరుగువుండదు. వైద్య వృత్తిలో ఘటికుడనే ప్రతీతి. తాను యేమిఅనుకుంటున్నదీ మహారాజావారితో ముక్కుకు సూటిగా మాట్లాడగల నిర్మొహమాటి. ఈ నేర్పు కొద్దిమందికే వున్నది. మహారాజావారు లేనప్పుడుకూడా, మామూలు ఫీజుకంటే హెచ్చుగానే వసూలుచేశాడని బాలయ్యనాయుడుగారు నాతో చెప్పారు. బ్రేన్‌ఫోర్డు దొరకు రోజులు కలసిరాక, పేరు మరుగున పడిపోయిన తరువాత, వైద్యవృత్తిలో డాక్టరు బ్రౌనింగు బాగా పేరులోకి వచ్చి రాణిస్తున్నాడని, మదరాసులోవున్న మనవాళ్ళ అభిప్రాయం. ఈయన మెడికలు జర్నలులో వ్యాసాలు వ్రాసి ప్రచురిస్తున్నాడు. ఘోషా ఆస్పత్రి యితని అజమాయిషీక్రింద బాగుపడింది. వొళ్ళువంచి పనిచేసే స్వభావం. ఇతని వోర్మిని ఆసక్తిని చూసి గవర్నరుకూడా మెచ్చుకున్నారు.

ఇవ్వాళ నారాయణమూర్తిగారిని పరమేశ్వరను పిళ్లేకి పరిచయం చేశాను.

* * *

మీ అవయవాలకు వచ్చిన ప్రమాద మేమీ లేదు. అవి బాగానే వున్నాయి. కాని మీ నరాలుమాత్రం ఎక్కడి వక్కడ విడిపోయినట్టు ధ్వంసమయాయి. సాధ్యమైనంతవరకూ లైంగికసంబంధం పెట్టుకోవద్దు. ఇప్పుడు మీరు పెప్సిను పొడరు పుచ్చుకుంటున్నారుకదా ; ఆమందే యింకా కొంత కాలం వాడితే యిక ఆ మందు అవసరమే వుండదు, అవునండీ; మీరు బాగా పళ్ళరసం తీసుకోవాలి. సోడాకూడా మంచిది. మీరు కాలేజీనుంచి విరమించాలని నా అభిప్రాయం. ఎంత మాత్రం మీరిక కాలేజీలో పనిచేయకూడదని, వెంటనే విరమించాలని నా సలహా. నే నీమాట అన్నట్టు మహారాజా వారితో స్పష్టంగా చెప్పండి. శరీరానికి యెండతగలడం మంచిది కాదు. ఎండపొడ మీ శరీరానికి పడదు. అంతగా ప్రయాణం చేయవలసి వస్తే చేయండి కాని, వొంటికి ఎండా రొజ్జగాలీ తగలనీయవద్దు. శరీర దారుఢ్యానికి కాడ్‌లివరాయిలు సేవించండి. కొన్నాళ్ళు పుచ్చుకుంటే మీ ఆరోగ్యం చక్కబడుతుంది. సత్తువ కలుగుతుంది. పేటెంటు మందులని ఊరికే చెబుతూ వుంటారే, వాటిజోలికి పోవద్దు. అవన్నీ వట్టిమోసం, దగా, హంబగ్ ! వేసవికాలంలో చన్నీళ్ళస్నానం చేయవచ్చును. సైకిలు తొక్కితే గుండెకు ప్రమాదం వాటిల్లుతుంది. మీ మూత్రంలో జబ్బువున్నదో లేదో భోగట్టా మీరు తెలుసుకున్నందువల్ల ప్రయోజనమేమీ లేదు. అదియేమిటో తెలుసుకుందామనే శారీరకశాస్త్ర ఆసక్తితో అడుగుతున్నారు తప్ప, అది యెంతమాత్రమూ మీ ఔషధసేవకు యెట్టిభంగమూ కలుగుజేయదు. అది తెలుసుకోకపోయినంతమాత్రాన మీజబ్బు నిమ్మళించకపోదు.

**3 ఏప్రిల్, బుధవారం :**

ఇవాళ మదరాసునుంచి బెంగుళూరుకు ప్రయాణమయాను. రామస్వామిమొదలి సత్రవులో భోజనం దొరికిందికాదు. బెంగుళూరుకు సరాసరి పోయే రైళ్ళలో సెకండుక్లాసు కంపార్టుమెంటులు లేవు. కనక మెట్టుపాళియం రైలును ఎక్కాను. కంపార్టుమెంటులో మంచి యూరోపియను స్నేహితుడే దొరికాడు ; పేరు సి. హెన్రీ.

ఆర్కోణంలో వొక సంఘటన జరిగింది. జాలార్‌పేటలో బండి మారాను.

**4 ఏప్రిల్, లక్ష్మివారం :**

బెంగుళూరు చేరుకున్నారు. బాలయ్యనాయుడిగారికిక్కడ వొక మంచి యిల్లువుంది. అందరమైనదే. ఆయన యేజంటు వెంకోబరావుజీదేశముఖ్ నేనంటే శ్రద్ధాసక్తులు కనబరిచారు. ఎంతో మర్యాద చేశాడు.

సత్రవునానుకుని వొక వర్కుషాపు కలదు. మదరాసులో కంటే యిక్కడి పాటకజనం మంచి బట్టలనే ధరిస్తారు. రంగు రంగుల చీరెలను ఆడవాళ్ళు కట్టుకుంటారు.

ఇక్కడున్న నూతులు పాతాళంలో వున్నట్టు చాలా లోతు. ఒక దానితో యింకొకటి జతరపరిచి నాలుగుపెద్ద పలక రాళ్ళతో చుట్టూ నూతిగోడులు కట్టారు. నూతి వొరలు రాతితోనే నిర్మించుకున్నారు.

వీధిబడులలో పిల్లలకు తెలుగుకూడా బోధిస్తున్నారు. సముద్రతీరంలో సైతం ఉష్ణోగ్రత తొంభై డిగ్రీలదాకా పెరిగిపోతున్నదని వెంకోబరావు ఫిర్యాదు !

ఇక్కడ థియేటర్లు, నేటివుక్లబ్బులు, స్వభాషా పత్రికలు వున్నవో లేవో దర్యాప్తు చేయాలి.

బసకు వెళ్ళగానే ముందు మొహం కడుక్కుందామని వెంకోబరావుగారిని పందుంపుల్ల అడిగాను. నల్లటి టూతుపొడరు యింత పట్టుకువచ్చి ఆయన, నా చేతిలో పోశాడు. పందుంపుల్ల నా కెంత అనివార్యమో ఆయనకు బోధపడింది కాదు.

సరేనని వెంకోబరావుగారు నౌకరును పిలిచి వేపపుల్ల విరుచుకురమ్మన్నాడు. ఇంటి ఆవరణలోవున్న అంతచెట్టూయెక్కినౌకరు, అంగుళం వలం పందుంపుల్ల విరుచుకువచ్చాడు !

*                    *                    *

వీలుంటే నటేశశాస్త్రిగారినీ, రైస్‌దొరనూ కలుసుకోవాలి. సెయింటుజోన్సు స్ట్రీటులో వున్నారట. డాక్టరు హుల్సు, నంధ్రిదుర్గరోడ్డు ; మిస్టర్ రే : రాయలు ఆర్టిలరీ మెస్సు.

మిస్టరు ఆడమును మద్రాసులో తప్పక చూడాలి.

*                    *                    *

బెంగుళూరు సెంట్రల్ స్టేషనులో సోడా దొరకదే !

*                    *                    *

డాక్టరు హుల్సుగారి బసలో శ్రీకృష్ణశాస్త్రిగారినీ, వెంకయ్యగారినీ కలుసుకున్నాను. దొరబంగాళా బెన్సనురోడ్డు సమీపాన నందిదుర్గవీధిలో వుంది. కొండ పడమటివారికి చెందిన కొన్ని శాసనములను ఎత్తి వ్రాసుకున్నాను. తిరిగి యింటికి వచ్చేసరికి సాయంకాలమయింది.

బస్తీ చూడ మనసయింది. కొంతసేపు అటూ యిటూ తచ్చాడాను. నగరం ఏమీ అందంగా కనబడలేదు. వో పరసా వాడీ లేకుండా యిళ్లు. వొక తీరూ తెన్నూ కనబడని వీధులు ; పైగా యిరుకు ; మురికి. ఇంచుమించు ఇళ్ళన్నీ మట్టితో కట్టినవే. మేడలుసైతం మట్టివే. అయితే అక్కడక్కడ నూటికీ కోటికీ వొకటో రెండో మంచియిళ్లు లేకపోలేదు. మదరాసు, విశాఖ పట్నాలలోకంటె యిక్కడి పాటకజనపుస్త్రీలు మేలిరకపు ఉడుపులు ధరిస్తారు. చక్కగా ఆచ్ఛాదించుకుంటారు. మనుషులు చూడడానికి సొగసుగా వున్నారు. స్ఫురద్రూపులు. బజారేమీ బాగుండలేదు. ఆకర్షణీయంగా కనబడలేదు. మిఠాయి దుకాణాలు మదరాసులోకంటె నయం. పకోడీలు బహు రుచిగా వున్నాయి. సోడా తాగడానికి వీల్లేనంత దరిద్రంగా వుంది.

శ్రీనివాస రీడింగు రూముకు వెళ్లాను. పఠనాలయంలో వున్నతనికి నెలకు ఏభయిరూపాయలు యిస్తారట. రీడింగు రూములోకి వెళ్లిన ప్రతివాడూ సంతకం చేయాలి. గది వెడల్పు తక్కువేకాని పొడుగుహెచ్చు. పరిశుభ్రంగావుంది గది. వచ్చే పత్రికలు ; అమృతబజారు, బెంగుళూరు మెయిలు, ట్యూస్డే స్టాండర్డు.

ఇక్కడి మనుషులు మంచి మర్యాదస్తులు. ఉపకారబుద్ధి వున్నది. ఉపకారమంటే ఊరొదిలిపెట్టిపోయే స్వభావం కాదు. ఏదైనా చెబితే వింటారు. మనుషులలో సరసతవుంది.

పురావస్తు పరిశోధనశాఖలో హెడ్డుగుమాస్తాగా పనిచేస్తున్న ఒకాయన తారసపడ్డాడు; పేరు 'స్వామి'ట. నాతో కొంతసేపు ప్రసంగించాడు ; ప్రసంగం మధ్యలో అడిగానుకదా : "ఏమండీ ! ఇక్కడ యిళ్ళింత జౌకుగా కట్టుకుంటారేం ? ఎందుకింత అసహ్యంగా వున్నాయ్ ?" అతను బిత్తరపోయాడు. పాపం ; నేరం వొప్పుకున్నాడు!

ప్రాచీన శిల్పఖండాలను గురించి, శిల్పకళను గురించి ఆయనతో కొంతసేపు ముచ్చటించాను.

సూయిలు పత్రాలనుగురించి మిత్రులను ప్రశ్నించాను. వారి కేమీ తెలియదని సమాధానమిచ్చారు.

ఆనందమహల్‌కు వెళ్లాను. బహు సొగసైన దీటైన భవనం.

నిజంగా బెంగుళూరులో కొందరు ఆడపిల్లలు ఎంతో మురిపెంగా వున్నారు.

5 ఏప్రియల్ శుక్రవారం .

కాఫీ తాగినతరువాత బండీయెక్కి సెంట్రలు కాలేజీకి వెళ్ళితిని భవనం అందంగావుంది చుట్టూ పెద్ద జాగా విశాలమైన ఆవరణ ఆడుతున్న బంతి అవతలకు పోకుండా అడ్డుటకు టెన్నిస్‌కోర్టు కిరువైపులా యెనిమిదడుగుల యెత్తున రెండు యినపతివ్వల వలలు కట్టివున్నవి కాలేజీ హైస్కూలు డిపార్టుమెంటులు రెండూ వొక్కచోటనే ఏర్పాటు చేసుకున్నారు నాలుగువేల రూపాయలు ఖర్చుపెట్టి వొక ఫలహారశాలను నిర్మించారు అస్తబలు మరుగుదొడ్లు కలవు

టీచర్ల వెయిటింగు రూములో మాథమిటిక్సు లెక్చరరు శ్రీ వెంకటస్వామినాయుడుగారిని కలుసుకున్నాదు శ్రీ మోహనరావు విజయరాఘవాచారీ రామానుజాచార్యులుగార్లను ఆయన ఎరుగుదురట నాయుడిగారి జీతం మూడు వందలు

బెంచీలు కుర్చీలు అంత బాగాలేవు వాటిని జాగ్రత్తగా ఉపయోగించుకున్నట్టు కనబడదు విజయనగరంలో కంటే యిక్కడి బెంచీలు మరీ పాడుగావున్నవి టీచర్ల వెయిటింగు రూములోవున్న సరంజామా మరీ అవుకు రీడింగు రూములోవున్న బెంచీలను వొకచోట జతపరచి వాటినే వ్రాతబల్లలుగా వాడుకుంటున్నారు

ఇవి పరిశుభ్రంగానే కనబదుతున్నవి లైబ్రేరియను జీతం నెలకు పాతిక లైబ్రరీలో మూడువేల పుస్తకాల ప్రత్యేక ప్రతులు వున్నాయి ఒక అలమరానిండా బైండుచేసిన పత్రికా సంపుటాలు ఇంతకుమించి లైబ్రరీలో గమనించతగ్గ విశేషాలేమీలేవు

మాథమిటిక్సు సెక్షనులో మొత్తం యెనమండుగురు ఫిజిక్సు సెక్షనులో పాతికమంది విద్యార్థులు వున్నారు

ఇంగ్లీషు ప్రొఫెసరు టెయిటుగారితో వొక గంటసేపు సంప్రదించితిని ఈ ప్రాంతపు విద్యార్థులకు ఆత్మాభిమానం మృగ్యమని ఆయన అన్నారు స్వదేశస్థులైన మన విద్యార్థులకు తమ వ్యక్తిత్వంపై తమకే గౌరవభావంలేదని ఆయన యెంతో బాధపడుతూ నాతో చెప్పుకొచ్చారు వొకళ్ళతో వొకళ్ళు కలసిమెలసి తిరగరు ఎవరిదారి వారిదే కలిసికట్టుగా వుండకపోతేమానె పోనీ తమ ప్రొఫెసర్ల చెంతకన్నా వస్తూ పోతూ సందేహాలు తీర్చుకుంటారా అంటే అదీ కనబడదు చదువుకునే రోజుల్లో యిలాగున మే మెప్పుదూ ప్రవర్తించి యెరుగం అందరం కలసిమెలసి మసిలేవాళ్ళం ఆడుకునేవాళ్ళం ఎవరితోనైనా జట్టీ వచ్చిందా అంతా కాకికట్టు

ఉన్నతమైన వ్యక్తిత్వం గుణసంపద లోకజ్ఞానం పాండిత్యంగలవ్యక్తులతో విద్యార్థులకు పరిచయం వుండాలంటాను అట్టి సహవాసం వారినెంతో ముందుకు తెస్తుందని నా అభిప్రాయం

అవును మీరు చెప్పింది నిజమే నన్నాడు దొర

విద్యార్థులు ఇతరుల అభిప్రాయాలు తమకు భిన్నంగా ఉన్నవన్నంతమాత్రాన వాటిని ఎంతమాత్రం సహించలేనంతటి తీవ్రస్వభావులుకారు తార్కికదృష్టి తీవ్రదృక్పథం వారి కలవరదుతున్నది అయితే తమ మతచరిత్రగల కొన్ని సత్సంప్రదాయాలను వారు ఉపయుక్తం చేసుకోవడంలేదు తమజాతిలో ఉద్భవించిన మహాపురుషుల గుణగణాలను సంప్రదాయాలను వారు అలవర్చుకో<sup></sup>డంలేదు ఇందువలన విద్యార్థులలో గౌరవభావం ఆత్మాభిమానం క్రమక్రమంగా సన్నగిలిపోతున్నదని చెబుతూ నేః ప్రసంగవశాత్తూ నార్టనుదొర అజమాయిషీలో వున్న విద్యార్థులును గురించి ముచ్చటించాను అవును ఇది ఎంతో విచారకరమైన విషయమని టెయిటుదొర అన్నాడు

ఇదివర కోసారి నాతో మాట్లాడుతూ డాక్టరు మిల్లరు 'విద్యాధికులైన హిందువులలో నైతికశక్తీ, కార్యదీక్షా, పట్టుదల కొరవడినవని' అన్నాడు.

"చిన్నతనంలోనే వివాహంకావడంవల్ల భారతీయ విద్యార్థుల జీవితాలు దుఃఖభాజన మవుతున్నాయి. దీనికితోడు దారిద్ర్యబాధ వారిని మరీ కృంగదీస్తున్నది. అందువల్ల మా భారతీయ విద్యార్థులు హాయిగా కులాసాగా ఆనందంగా కనిపించరు. జీవితంలో యెదుర్కొంటున్న కష్టాలను అధిగమించలేకపోతున్నారు. కష్టాలను తేలికగా తీసుకుని, నవ్వుతూ వాటిని దాటలేకపోతున్నారు. మీ ఇంగ్లీషు యువకులకీ చతురత స్వభావసిద్ధమైన లక్షణం. ఈ గుణం మా విద్యార్థులలో ఎలాగ కనిపిస్తుంది మరి ?"

నేను చెప్పినదంతా నిజమేనని టెయిటుదొర సమాధాన మిచ్చాడు.

వొకసారి ఆయన్ని వొక విద్యార్థి తనను పైక్లాసులోనికి ప్రమోటు చేయవలసిందిగా ప్రార్థించాడట. తనకు పరీక్షలవుతున్న సమయంలో తన బిడ్డ చనిపోయిందని, తన కా పసిపాప మరణం యెంతో 'దుఃఖం కలిగించిందనీ, అందువల్ల తాను పరీక్షపేపర్లు బాగా వ్రాయలేకపోయా'నని ఆ విద్యార్థి టెయిటుతో మొరపెట్టుకున్నాడట!

ఈ విషయం టెయిటు యెంతో విస్మయంతో నాకు చెప్పినమీదట నేను మా ప్రిన్సిపాలుగారి సంగతి ముచ్చటించాను. విద్యాభ్యాసం చేస్తుండగా విద్యార్థులు వివాహం చేసుకుంటే వారికిచ్చిన స్కాలరుషిప్పులను రద్దుచేయడం ఆయన పద్ధతి. వివాహితులైన విద్యార్థులకు సర్వసాధారణంగా చనువివ్వడం అరుదు.

గ్రీకు రోమను గ్రంథపఠనమువల్ల రినేజాన్సుదినములలో యూరపులోని అన్ని దేశాలలోనూ స్వదేశీయ సారస్వత విజృంభణము వొక్కమారు ప్రతిభావంతమైనదిగదా, అట్లే ఆంగ్లుల ప్రసిద్ధ సారస్వత ప్రచారంవలన, విద్యాప్రభావం వలన, అట్టి విజృంభణము, మన దేశభాషలలో చెప్పుకోతగ్గ ఫలిత మేమీ కానరాకపోవడం వింతగా తోచడంలేదా? ఇందుకు కారణం మీరేమని ఊహిస్తున్నారని ప్రశ్నించాను.

ఈ దృష్ట్యా ఆయన ఆలోచించి దీనికి సమాధానమీయకుండెను : "మళయాళీ భాషలో చెప్పుకోతగ్గ నవలే వెలువడిందికదా, మరి."

"దీని నంతవిశేషంగా చెప్పుకుందుకు కారణం మరేమీ లేదు ; వొక యూరోపియను ఆ నవలను అనువదించడమే! మదరాసులోవున్న మళయాళీ మిత్రులతో యీ నవలను గురించి చర్చించాను. వారి దృష్టిలో యీ నవలేమీ గొప్పది కాదు !"

"ఆ నవలలో మంచి హాస్య సంభాషణ లున్నాయ్ ! వొక విద్యావిహీనునికీ, విద్యావంతునికీ మధ్యజరిగిన సంభాషణ హాస్యంగా లేదూ ?"

"కొందరు యూరోపియనుల కీ నవల యెందుకు నచ్చుతుందో నాకర్థమయింది. వాళ్ళకి హాస్యమంటే అభిరుచి హెచ్చు. కాని నవలా శైలిలోనూ, వస్తు నిర్వహణలోనూ యేమైనా సొగసు వున్నదా ? కళా చాతుర్యము వుట్టిపడుతున్నదా ?"

"నాకా సంగతి తెలియదు; బహుశా వుండకపోవచ్చును."

"వొకవేళ యీ నవల బాగున్నదనుకున్నా భాషా వికాసానికి కీవొక్క నవలా సరిపోదు. స్వదేశీయ సారస్వత విలుప్తతకు కారణం వొకటై వుంటుందనుకుంటాను. సాహిత్య పాఠములలో విద్యార్థులకు శైలిలోను,

వస్తువిన్యాసములోను యిదిమంచీ యిది చెడ్డ అని విడదీసి వాటి బాగోగులను బోధింపకుండుట విమర్శగా చదువుట నేర్పకుండుట స్వతంత్ర యోచనా శక్తిని పురికొల్పేదిగా బోధనాక్రమముండకపోవుట రసానుభవమూ వివేచనా లేకుండుట కారణమని నా ఊహ కాలేజీ విద్యార్థులకు చెప్పే పాఠాల తీరూ బోధనా పద్ధతులూ చాలా దుష్టంగా వుంటున్నవి

మీరు చెప్పినదంతా నిజమేనంటూ మిస్టర్ టెయిటు తనకు సాహిత్యపాఠాలను చెప్పడం రుచించడం లేదన్నాడు గ్రంథాల పేర్లూ కవులకాలాలనుగురించీ తప్ప మరిదేనికీ బోధించడంలేదనీ యిది చాలా విచారించతగ్గ విషయమనీ అంటూ మిస్టరు టెయిటు 'క్లాసులో విద్యార్థుల కేమీ బోధపడకపోయిందా వెంటనే నిలబడి చెప్పేపాఠాలకు అడ్డువస్తారు

మనం గొప్ప గొప్ప కావ్యాలను విద్యార్థులచేత చదివించడం మంచిది ఏదో వొక యుగపు వాఙ్మయ చరిత్రను పాఠ్యభాగంగా వేస్తే చాలునని నే నన్నాను

టెయిటు దొర యీ విషయం వొకప్పుడు డాక్టరు మిల్లరుకు సూచించగా ఆయన ఇప్పటికే విద్యార్థులు చదవవలసిన పుస్తకాలు తడిసిమోపెడుండగా మరి నాలుగుపుస్తకాలు చదవమని వాళ్ళని బాధించలేం అన్నారట పిల్లలు చాలా పుస్తకాలు చదవవలసివుండినమాట నిజమే కాని మీ సూచనలను ఆమోదించినట్లయితే యీ పుస్తకాల సంఖ్యా తగ్గివుండేది మంచి గ్రంథాలను పిల్లలు చదవనూ చదివేవారు

అవునవును మీరన్నది వాస్తవమే మరి మీరు ఏ యే పుస్తకాల్ని బోధిస్తున్నారు ? మిస్టరు టెయిటు తన టేబిలుమీదవున్న గ్రంథాన్నొకదాన్ని చేతపుచ్చుకుని నన్ను ప్రశ్నించాడు ఆయన చేతనున్న పుస్తకపు ఆకారాన్నిబట్టే అది లాంగ్మెన్సు బుక్కు అయివుంటుందని పోల్చుకోవచ్చును అది లాంగ్మన్సు బుక్కేకదూ ?

సరే మీకు తెలుసునన్నమాటే ఇందులో కంఠస్థం చేయతగ్గ మంచి విషయాలు చాలావున్నాయి అదీ యీ పుస్తకంలోవున్న సొగసు

మా విద్యార్థులచేత బడిలేని టైములో జనరలు పుస్తకాలను చదివిస్తాం కాలేజీ లెక్చరర్లలో ఒకాయన యీ పుస్తకాలను ఎలాగున పఠించవలెనో బోధపరుస్తూవుంటారు

ఇది మహామంచి పద్ధతి

క్లాసులను నిర్వహించడం బహుకష్టమైపోతున్నదనీ విద్యార్థులు వ్రాసే కాంపోజిషనులోని ప్రతిదోషాన్ని దిద్దడం దుస్సాధ్యమవుతున్నదనీ మిస్టరు టెయిటు నాతో అన్నారు విద్యార్థులకాంపొజిషనులో ఏ యే తప్పులు ఉన్నాయో చూపించినంతమాత్రంవల్ల లాభం శూన్యం తమ చేసిన పొరపాటేదో విద్యార్థికి తెలియకుండా పోతున్నది పోని ప్రతి తప్పు దిద్దుదూ కూచుందామాఅంటే అదీ సాగడం లేదు ఇక యూనివర్సిటీ సరేసరి జనరలు యింగ్లీషు పేపరు వూసే అది ఎత్తడంలేదు జనరలుయింగ్లీషు పేపరు వొక అవకతవకగా తయారయింది ప్రశ్నా పత్రాలలో ఏది అడగాలో ఏది అడగకూడదో ఎవరికీ బోధపడదు అంతా అయోమయం ఎక్జామినర్ల యిష్టాయిష్టాలపై యివి ఆధారపడుతున్నాయి

మదరాసు కాలేజీలలో వున్న ప్రొఫెసర్లు తమ విద్యార్థులకు బోధించే పాఠాలకంటె హెచ్చు విషయాలను మేము మా విద్యార్థులకు బోధిస్తున్నామని నే నన్నాను మదరాసు ప్రొఫెసర్లు ఎక్జామినర్లుగా వుండడంవల్ల మాకు వుండే శ్రమదమాదులు వారికుండవు స్కీట్సు శబ్దశాస్త్రమూ కెల్లెన్సు వాక్యరచనాపద్ధతీ మదరాసు ప్రొఫెసర్లు

యింకా తమ విద్యార్థులకు చెప్పనేలేదట ! నాలుగయిదేళ్ళ క్రిందటే ఆ గ్రంథాలను మా విద్యార్థులకు పాఠం చెప్పి, వాటిపై నోట్సు తయారుచేసి యిచ్చాను. వింత యేమంటే, నిరుడూ, యీయేడూ సీక్సులు మీద విద్యార్థులను ప్రశ్నలు అడిగారు. కెల్లెను గ్రంథంపై ఒక్క ప్రశ్న కూడా యింతవరకూ రాలేదు".

కొంతసేపు ప్రసంగించిన తదుపరి, తాము పాఠములు చెబుతుండగా వినవలెనని వున్నదని మిస్టరు టెయిటును సూచన ప్రాయంగా కోరితిని. నా కోరికను మన్నించినఎడల నేనెంతో కృతజ్ఞుడనని చెప్పితిని. తనకు ధర్డుఅవరు యింగ్లీషు క్లాసువున్నదని చెబుతూ, టెయిటుదొర నా సూచనకంత అభిముఖుడను కానని సూచించాడు. మరి నేనా విషయం ప్రస్తావించక అంతటితో నా కుతూహలాన్ని వొదులుకున్నాను. కాని లీనార్డు దొర పాఠములను బోధిస్తుండగా వింటిని. ఆయన చాలా అసమర్థుడు. పాఠాలను బొత్తిగా చెప్పలేడు. మిస్టరు టెయిటునుగూర్చి గొప్పగా వింటిని. కొంచెం మోటుమనిషనీ, కోపిష్ఠి అనీ పిల్లలు అంటారుగాని చాలా మర్యాదస్తుడుగా కనపడ్డాడు. నాతో అదేపనిగా మాట్లాడినాడు. అయితే అది వాచాలత కాదు. నేను చాలావరకూ అనేక విషయాలను ప్రస్తావించి ఆయనను సంభాషణలోనికి దించితిని. ఆంగ్ల, ఆంధ్ర భాషావిషయాలు వచన భేదాలను గురించి ఆయనకు తెలియచేశాను. కాలేజీలోవున్న కన్నడభాషాపండితునితోగూడా కొంతసేపు ప్రసంగించితిని.

మా సమావేశానంతరం, యిక సెలవు పుచ్చుకుంటానని నేనే మొదట కుర్చీలోంచి లేచాను. టెయిటు దొర చాలా ఆప్యాయతతో కరస్పర్శ కావించాడు. ఇంతసేపూ ఏవేవో విషయాలను ముచ్చటించి ఆయన పనికి ఆటంకం కలిగించినందుకు మన్నించవలసినదిగా కోరాను. "కాదు కాదు ; మీతో సంభాషించడంవల్ల నా కెంతో ఆనందంగా వుంది. మీ పరిచయం కలిగినందుకు నాకెంతో సంతోషం."

**6 ఏప్రియల్, శనివారం :**

ఈ వేళ ఉదయం ప్యాలసును చూస్తిని. భవనం చాలా అందంగా వుంది. కాని లోపల వస్తు సామాగ్రి విజయనగరంలోని మోతిమహలుకు తీసికట్టే. మహలు కొన్ని చోట్ల హుందాగా కనిపిస్తూ ప్రశాంతతతో తులదూగుతున్నది. మేడ మెట్లలో కొన్ని ఔకుగానూ అందవిహీనంగానూవున్నవి. బల్లలతో కట్టిన వరండా. అదీ బాగులేదు. మహలులో చెప్పుకోతగినన్ని వర్ణచిత్రాలులేవు. మహారాజావారిలైబ్రరీలో అట్టే పుస్తకాలు లేవు. వున్న ఆ కొన్ని పుస్తకాలయినా కులాసాకి చదువుకునే నవలలు. పేలసు వొక తమిళపిళ్ళే అజమాయిషీకింద వుంది. అతను ధరించిన బట్టలు దరిద్రంవోడుతూ వున్నవి. పేలసు గేటులను మూసివుంచమనీ, ఎవరినీ లోనికి రానీయవద్దనీ మహారాణి హుకూం జారీ చేసిందట ! ముందే నాకీ సంగతి తెలిసివుంటే, నేనింతదూరం వచ్చేవాడినీకాను ; లోనికి వెళ్ళేవాడినీ కాను.

పిళ్ళే అంటే అందరికి ఎంతో ప్రేమ; గౌరవం. మహారాణికి ఇంగ్లీషు, కన్నడం, తెలుగు చక్కగా వచ్చును. ఈ మూడు భాషలలోనూ ధారాళంగా మాట్లాడగలదు. వ్రాయగలదు. ఆవిడ భాషాసంపన్నతకు మనదేశం గర్వించవచ్చును. ఆమెకు అయిదుగురు పిల్లలు. వీరి కుటుంబం వర్ధిల్లాలనీ, తమ తల్లిదండ్రులవలె, పిల్లలు కీర్తి ప్రతిష్టలు ఆర్జించుకోవాలని నా కోరిక.

ఈ మహారాజు చాలాకాలం క్రితం కలకత్తాలో మరణించాడు. మా మహారాజావారి భవనంలో అతిథిగావుంటూ మందు పుచ్చుకునేవాడు. జబ్బు నిమ్మళించలేదు. ఆయన మరణించాడని ఒకనాడు మా మహారాజావారికి టెలిగ్రాంవచ్చింది. తన మిత్రుని మరణవార్తవిని మహారాజావారు యెంతో విచారించారు. ఆయనంటే యీయనకెంతో గౌరవం.

తనభర్త మరణానంతరం, మహారాణి, కలకత్తానుంచి వెళ్ళిపోవస్తూ తన కృతజ్ఞతను మా మహారాజావారికి తెలియచేయవలసినదిగా బాబూసాహేబును కోరింది; ఆయన అవిధంగానే తెలియచేశారు. “కలకత్తానుంచి తమ స్వస్థలానికి బయలుదేరుతూ మీకు తమ కృతజ్ఞతను తెలియచేయవలసినదిగా మహారాణి అభ్యర్థించింది. తమభర్త తన అవసానదశలో మీ బసలోనే వున్నందుకు, మహారాణికి కొంత ఊరటకలిగింది. ఇదివరకటివలెనే, ఇప్పుడూ ఎప్పుడూ మన రెండు కుటుంబాలకూ గల స్నేహం వర్ధిల్లగలదని ఆమె ఆశిస్తున్నది.”

మహారాణి వాక్యాలలోగల సౌహార్దమునకు మా మహారాజావారు మిగుల ఆనందించారు.

కీ.శే. మహారాజు ఏమంత చెప్పుకోతగ్గ ధీశాలీ, పండితుడూ కాదు.

♦ ♦ ♦

మ్యూజియమును చూడ వెళ్ళితిని. అక్కడవున్న ఆఫీసరు చాలా మర్యాదస్థుడు. మ్యూజియములోని దంతపుపని మిగుల బాగున్నది. విజయనగరం మహలులో ఉన్నవాటికంటె యిక్కడివే సొగసుగా కనబడుతున్నవి.

♦ ♦ ♦

బ్రష్‌తో రాతిపలకను చక్కగా తుడిచి నీళ్లతో కడగవలెను. కాగితమును నీటిలో ముంచి, పైకితీసి, శాసనపు పలకమీద జాగ్రత్తగా నిండుగాపరిచి, బ్రష్‌తో వొత్తవలెను. శాసనములోని అక్షరములు కాయితంమీద పడేవరకు బ్రష్‌తో అదమవలెను. నీళ్లలో కాగితాన్ని ముంచేటప్పుడు దానిని టబ్బులో బాగుగా వుంచాలి.

నౌకరు మొదటి నాసిక్ పేపరును వుంచాడు. దానిపై ప్రింటింగు పేపరును పరిచాడు. రాయి మోటుగా వుండి అక్షరములు స్ఫుటముగా పడనప్పుడు, వొక సీసాలో దీపపుమసీ, యింకుపొడరూ వేసి సిరావలె తయారయేటట్టు నీళ్ళుపోయాలి. పేడ్‌పై కొద్దికొద్దిగా యీ సిరాను చిమ్ముతూ మెల్లగా వొత్తవలెను. అక్షరములు స్పష్టపడేవరకూ అలాగున యింకును పోస్తూనే వుండవలెను.

....... ....... .......

ఈ వేళ సాయంకాలం రైలులో వొక పటాలం వెళ్ళిపోతుండగా చూశాను. సిపాయిలను సాగనంపుటకు వారి బంధువులు వచ్చారు. బంధువులు, కుటుంబస్థులు మిగుల దుఃఖిస్తూ వుండిరి. చాలా హృదయ విదారకమైన దృశ్యం. సిపాయీలను యెక్కించుకొని రైలు బయలుదేరింది. ఇవతల నిలబడివున్న తమ ఆప్తులను, బంధువులను రైలు పెట్టెలలో నుండి తొంగి తొంగి చూస్తూ సిపాయీలు జేబు రూమాళ్ళను ఊపుతూ వుండిరి !

* * *

శ్రీ కృష్ణశాస్త్రిగారు చాలా మంచిమనిషి ; ఒకరికి తనకు తెలిసిన విషయాలను చెప్పేందుకు, ఇతరులవలన మరికొన్ని విషయాలను తెలుసుకునేందుకు సదాసంసిద్ధులు. మనిషిలో లేనిపోని నటన, భేషజమూ లేవు.

కాని ఆయన యివాళ వస్తానని చెప్పి యింకారాలేదు. ఇక నాకు మిగిలినదల్లా వెంకయ్యగారి సాన్నిధ్యమే. ఈయనకు నాపనిమీద శ్రద్ధలేదు ; సానుభూతీలేదు. ఎప్పుడో యేదో పురావస్తు తత్వశాస్త్రవిషయాలలో మునిగి తేలిపోతున్నట్టూ, తనకేమీ తీరిక లేనట్టూ ప్రవర్తిస్తాడు. తనశక్తి సామర్థ్యాలను గురించి తానే కొంచెం గొప్పగా పొగుడుకుంటూ, కాస్త యీర్ష్య ప్రదర్శిస్తూవుంటాడు. మనిషికి యీసు లావు. రికార్డులు చూస్తానయ్యా బ్రహ్మదేవుడా అంటే, అవి చూడ్డానికే ఆయన నాకవకాశమీయలేదు.

ఇలియటుదొరగారి తెలుగుశాసనసంపుటి కావాలని అడిగితిని. హుల్ట్సు దొరగారు వాటిని తీసుకువెళ్ళి వుంటారని ఆయన సమాధానం. "బెజవాడ, నాదెండ్ల శాసనాల నొకసారి తిలకించమని" వెంకయ్యగారన్నారు. వాటిల్లో నాకు కావలసిన ప్రధాన విషయాలేవీలేవు. సింగవంశపు శాసనాలను కావాలని అడిగాను. "అవీ లేవు; వొకటేదోవుంటే, అది ఎడిటుచేయడానికని కీల్హార్నుదొరకు పంపించాము". ఈ రెండు శాసనాలు సూయిలులో కలవని నేనన్నాను. "అబ్బే ! అది పొరపాటై వుంటుంది !"

మొదటి పదిరోజులు వెంకయ్యగారు, డాక్టరు హుల్ట్సు దొరను పొగడడం తప్పితే, మారుమాటేమీ పలకలేదు. ఆ పది రోజులూ పొగడ్తలతోనే ఊసుపోయింది. "ఆయన గొప్ప సంస్కృత పండితుడు. రాజేంద్రచోళమిత్రుడు గొప్ప సంస్కృత భాషా పాండిత్యం కలవాడు కాదని హుల్ట్సుదొర చెప్పినారు; సంస్కృత వ్రాతప్రతులను గురించి భండార్కరు వ్రాసిన నోట్సు' లలో కొన్ని దోషములున్నట్లు నేను కనిపెట్టాను. అయితే నేనింకా నా సంస్కృతభాషా పరిజ్ఞానాన్ని వృద్ధిచేసుకోవాలనుకుంటున్నాను. చోళరాజరాజుకూ, ఆయన అక్క కుందనదేనికీ మధ్య కొంత సంభాషణను ఊహించి వ్రాయాలని నా అభిలాష. రాజరాజు శక్తిసామర్థ్యాలను, ప్రతిభను ఉగ్గడిస్తూ కొన్ని వ్యాసాలను వరుసగా ప్రచురిద్దామని తలపోస్తున్నాను." ఇలాగ ఎంతోసేపు వెంకయ్యగారు ప్రసంగిస్తూ కాలం వెళ్ళబుచ్చారు.

"తెలుగులో కొన్ని చారిత్రక నాటకాలను నవలలను వ్రాయ తలపెట్టాను. అందుకోసం ఎట్టి విప్రతిపత్తిలేని దక్షిణ భారతదేశ చరిత్ర నాకు అవసరం ; సరియైన చారిత్రక యితివృత్తం, పథకం నా నాటకాలలో నవలలలో స్వీకరించాలని నా తలంపు" అన్నాను. తనకూ యిట్టి ఊహకలదని వెంకయ్యగారు చెప్పారు.

కృష్ణా, గోదావరి జిల్లాలలకు సంబంధించిన శాసనాలను రికార్డులను యీయవలసినదిగా వెంకయ్యగారిని నేను వచ్చిన రోజునే అడిగాను. కాని ఆయన నాకా సదుపాయం కలుగజేయలేదు. నాకు వున్న వ్యవధి చాలా తక్కువ. ఆ కాస్త వ్రైమునీ ఏదో వొక సంభాషణలోనికి నన్ను దించుతూ ఆయన హరించివేశాడు. కాలయాపన చేద్దామనే కాని నే నడిగిన దేమిటో పరిశీలించి యిద్దామనే తలంపు వెంకయ్యగారికే కోశానా లేకపోయెను !

ఒక శాసనంలోని తెలుగులిపిని పరిశీలిస్తూ కొన్ని మాటలకు అర్థం చెప్పవలసినదిగా ఆయన నన్ను కోరాడు. శాసనపు లిపిని పోల్చుకోవడంలో ఆయనకు నాకు చేతనైనంత సహాయం చేశాను.

కరికాలచోళుడు అనేది వొక బిరుదునామమనీ, దానిని అనేకులు ధరించారనీ శ్రీ వెంకయ్యగారి ఊహ. కావేరి నదిపై ఆనకట్ట, లేక వంతెన కట్టినది ఎవరో ఆయనకు తెలియదు. కరికాళచోళుడు బహుశా యీ నదిపై కట్టలు పోయించివుంటాడని ఆయన అభిప్రాయం. కరికాళచోళుని గురించి ఆయన కేమీ తెలియదు. స్థానిక శాసనాలు, దాఖలాలు అంటే ఆయనకు విలువలేదు.

ఇలియటు తెలుగు శాసనముల సంపుటి, యిలియటు దొరగారు ఆఫీసుకు పంపించివేశారు. ఈ శాసనసంపుటిని యెవరూ పరిశీలించినట్టు తోచదు. ఇందులో కొన్ని శాసనములలో దానముల ప్రసక్తి వున్నది. కాని, వాటి మూల ప్రతులు పోయినవి. రెండు వందల సంవత్సరాలకు పూర్వము చేసిన వొక దానమునుగురించిన భోగట్టా యిందు కలదు. బహుశా యిది ప్రక్షిప్తమయి వుంటుంది.

నాకు కొన్ని పేడ్స్, బ్రష్‌లూ కావలసివుంది. ఆయన వీటిని ఆర్డరిచ్చి తెప్పించి నా కీయగలడు గాని, అలా చేయలేదు. డాక్టర్ హుల్ట్సు దొరకు వ్రాసి తెప్పించుకోవలసిందిగా చెప్పాడు. అక్కడి ఆఫీసులో కూచుని నేను సేకరించిన భోగట్టాను యెంతమాత్రమూ ప్రచురించవద్దని వెంకయ్యగారు నన్ను కోరారు. కారణం హుల్ట్సు

దొరగారి అనుమతి లేనిదే నకళ్లూ అవీ ఆయన నా కిచ్చారట. డాక్టరుగారు ప్రివిలేజిలీవుమీద బెంగుళూరులో వున్నారాయో ! కొన్ని శాసనపు నమూనాలకు, ఫోటోగ్రాఫులు యెత్తవలెనని నేను అనుకున్నాను. దానికికూడా హుల్ట్స్‌దొర అంగీకారం అవసరమట ! రాసిన ఉత్తరాలకు సమాధానమిచ్చే అలవాటు హుల్ట్స్ సర్వసాధారణంగా లేదు. "ఇదేమిటండీ వెంకయ్యగారూ" ఆయన "దొరకు పరాకులావండీ! గడియకోలాగ వుంటాడు. నేనేం చేయను?" అని సమాధానం. డాక్టరు హుల్ట్స్ స్వభావ మేమిటో ఈయనకీ తెలియదు. దొరకు దూరప్రయాణాలంటే యిష్టంలేదు. కమానువెళ్ళడ మంటే యజ్ఞం చేసినట్టే.

"పోనీ సూయిలుదొర సంపుటాలు వొకసారి చూడనిద్దురూ" అని అడిగాను. అవి యేమిటో ఆయనకు తెలియదు !

"సరే, గవర్నమెంటు యీ మధ్యనే సేకరించిన శాసనాలూ దానిమీద, వ్రాసిన నోట్సూ, వుంటే యియ్యండి"

"ఇదీ ఆయనకు తెలియదు. "బహుశా 'రావు' గారు పట్టుకుపోయి వుంటారేమోనండీ" అని సమాధానం.

"కనుక్కోలేక పోయారామరి ?"

"కనుక్కున్నానండీ. రావుగారి అసిస్టెంటు నడిగితే అవి తన ఆఫీసులో లేవన్నాడూ !"

రావుగారు పండితుడుకాడనీ, ఆయన చేసే పనల్లా భవనం జాగ్రత్తగా వుంచడమనీ, శాసనాలను చెడిపోకుండా కాపాడడమనీ మిస్టరు టయిటుగారు యిదివరకొకసారి నాతో చెప్పారు.

నటేశానికి శాస్త్రీయ పద్ధతుల ప్రకారం కార్యభారాన్ని నిర్వహించడం చాతకాదట. మనిషికీ శాస్త్రీయ పద్ధతుల ఆలోచనల కంటె ఊహాగానం విపరీతమట. ఆయన "జానపద చరిత్ర" కేవలం ఊహాగానం. ఇలాంటి కేవల ఊహలపై రచించిన గ్రంథంవల్ల యెట్టి ప్రయోజనమూ లేదు. శాస్త్రీయపద్ధతులు వొదిలిపెట్టి ఊహలతో పరిశోధనలను సాగించడంవల్ల లాభం కనిపించదు.

ఆఫీసులో భోగట్టా సంపాదించడం బ్రహ్మాండం. ఆ మాటా యీమాటా చెప్పి, కేవలం యుక్తిగానూ, పదేపదే నొక్కి నొక్కి ప్రశ్నిస్తూ వొత్తిడిచేయడంవల్లనూ ఎలాగైతేనేం, కొంత సమాచారం సంపాదించగలిగాను.

కోటరాజులనుగురించి వెంకయ్యగారి కేమీ తెలియదు. రాజమహేంద్రవరపు రెడ్డిరాజులు వియ్యంవల్లకాక కేవలం కొండవీటి రెడ్డిరాజులను జయించి రాజ్యాన్ని స్థాపించారని ఆయన ఊహ. ఈ విషయంలో శ్రీ వీరేశలింగం పంతులుగారి అభిప్రాయమే నిజమైనదని ఆయన భావం. రాజమహేంద్రవరపు రెడ్డిరాజులు కోమటి వేమారెడ్డితో యుద్ధం సలిపినమాట నిజమే ;

గణపతి, "మహామండలేశ్వర" అనే బిరుదు వహించుటకు కారణమేమి ? చోళులు అనంతరం, కాకతీయులు పరాక్రమవంతులయిరని, ప్రసిద్ధికెక్కిరని వెంకయ్యగారికి తెలియదు. "ఇటీవలనే ఇండియను ఆంటిక్వరీ" వాల్యూములో తూర్పు చాళుక్యలపై ఫ్లీటుదొర వ్యాసం వ్రాసిరిగదా? సాగివంశస్థులను గురించి మీ కేమైనా భోగట్టా తెలుసునా ?"

"ఉహుఁ !"

విజయనగర పరిపాలకులలో ఆఖరివాడు శ్రీకృష్ణదేవరాయలు. ఆయన తరువాత వచ్చిన రాజులు కొన్ని గ్రామాలను మాత్రమే యేలినప్పటికీ తాము మహాచక్రవర్తులమని ప్రకటించుకొన్నారు.

పరిశోధనకు తెలుగు అసిస్టెంటు నొకరిని నియామకం చేయవలెనని ఇందుకు శ్రీ గిడుగు రామమూర్తి పంతులును నియమించవలెనని హుల్ట్స్‌దొర మొదట అభిప్రాయపడ్డాడు. కాని ఆంధ్రదేశంలో పరిశోధించవలసిన శాసనాలు మిక్కుటముగా లేవని భావించి శ్రీకృష్ణశాస్త్రిగారిని తరువాత నియమించాడు.

నాకే ఆశలూలేవు ; నాకు విశ్రాంతి కావాలి. సాహిత్య కృషిని, కొనసాగించడ మొకటే నా ఆశయం. అయితే సాహిత్య రచనను నేను సర్వస్వతంత్రుడుగా వుంటూ సాగించవలెనని నా అభిమతం.

నర్ప్యులరు రిపోర్టులనుగురించి మ్యూజియములో విచారణ చేశాను. ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రచురింపబడేవాటికి పేజీకి అయిదు రూపాయల చొప్పున యిస్తారట. ఆయన శాసన పరిశోధక డిపార్టుమెంటులో ఉద్యోగానికి దరఖాస్తుపెట్టాడట. "నా దరఖాస్తుమీద ఏమీ రిమార్కులు రాశాడో హుల్ట్సు దొర ! గవర్నమెంటు నా జీతం హెచ్చించింది. ఇప్పుడు రెండు వంద లిస్తున్నారు. ముందుముందు రెండువందల యాభైదాకా పెరుగుతుంది."

ఈ హుల్ట్సుదొర పెద్ద పండితుడేమీ కాదని శ్రీనివాసయ్యంగారు చెప్పారు. ఈ పదవిని పెర్మనెంటుచేయవలసిందిగా ఆయన దరఖాస్తు పెట్టాడట. లేకపోతే పెన్షనైనా యివ్వండన్నాడట. ఇంతవరకూ ప్రభుత్వం యిందుకు సమాధానం చెప్పలేదు. అతనీ పదవిలో వుండేదీ లేనిదీ అతనుచేసే పనిని బట్టి వుంటుందని ప్రభుత్వం ఆయనకు సూచిస్తున్నట్లుంది. అందుకే దొర పిటీషనుమీద యేమీ మాట్లాడలేదు.

పినవీరన్న, అప్పన్న మంత్రులనుగురించి కొంత భోగట్టా చెప్పవల్సిందిగా నన్ను ఆయనకోరాడు. సరేనని అంతాచెప్పాను.

**7 ఏప్రియల్, ఆదివారం :**

రైలు బెంగుళూరునుంచి మద్రాసు వచ్చేసరికి యింకా భళ్ళున తెల్లవారలేదు. సెంట్రలు స్టేషనులో కాఫీతాగాను. స్పెన్సరు హోటలునుంచి టెలిఫోను చేస్తిని. కాని సెంట్రలాఫీసు నుండి ఏమీ ప్రత్యుత్తరం రాలేదు. ఇంకా బాగా తెల్లవారక పోవడంవలన ఆఫీసుకు ఎవరూ రాలేదనుకుంటాను. ఇంతవేగిరం బసనుంచి స్టేషనుకు బండీవచ్చే సాధనమేమీలేదు. త్వరగా యింటికిపోవడం మంచిదని, వొక గుర్రపుబండీని కుదుర్చుకున్నాను. తీర గుర్రపుబండీ యెక్కేసరికి, గేటు అవతలవున్న సార్జెంటు వొకడు, బండీని అడ్డివేశాడు. 'ఎందుకాపావంటే' 'ప్యాసు చూపించ' మన్నాడు.

"లగేజీని ప్లాటుఫారం అవతలకు వాళ్ళు పోనిచ్చారుకదా, మధ్యన నీ అభ్యంతరమేమిటి ?" అని ప్రశ్నించాను.

"వాళ్ళు పోనిచ్చారు కనకనే, మిమ్మల్ని నేను పట్టుకున్నాను !"

"నువ్వు పట్టుకుందుకు నేనేం నేరం చేయలేదే ?"

"నేరస్థులు తాము నేరంచేసినట్టు ఎక్కడైనా వొప్పుకుంటారా సార్ ?"

ఈ గలాభా అంతాచూసి బండీవాడు "బేడకాసొకటి వాడిమొహాన పారేయండి ! నోరు కట్టడుతుంద"ని గోసాయి చిట్కా ఉపదేశించాడు.

"బేడకాదు ; వాడికొక్క రోళీకూడా యివ్వను ; ఈ శషభిషలు నాదగ్గర పనికిరావు. పద, వెనక్కి ! బండీ తిప్పు" అన్నాను. తన మంత్రం పారేటట్టులేదని గ్రహించాడు కాబోలును సార్జెంటు, మరి మారుమాటాడకుండా మా బండీని ముందుకు పోనిచ్చాడు!

బెంగుళూరులో నాయుడిగారి బంధువులు నన్నెంతో ఆదరించి గౌరవమర్యాదలను కనపరిచినారు. బెంగుళూరు మనుష్యులు చాలా నాగరికులు ; మర్యాదస్థులు ; అందరూ నన్ను ఎంతో మన్నన చేశారు.

♦ ♦ ♦

శ్రీ శ్రీనివాసాచారిగారు మాకొక ముచ్చటను చెప్పారు. బొమ్మాడి గ్రామంలో ఆయన ప్రవర్తించిన విధం, ఆయన వ్యక్తిగౌరవానికి తగినట్టులేదని నా అభిప్రాయం.

♦ ♦ ♦

లా కాలేజీ విద్యార్థులు యేర్పరుస్తున్న సమావేశానికి రావలసినదని శ్రీనివాసాచారిగారికి, మిత్రుడు సుందర్రావు పంతులు వొక ఆహ్వానాన్ని పంపించాడు. బి.యల్. డిగ్రీ పరీక్షలో ఎన్నికైన మార్కులతో ఉత్తీర్ణులైన శ్రీవేపారామేశంపంతులును అభినందిస్తూ వొక వెండికప్పును బహూకరించవలెనని లా కాలేజీ విద్యార్థులు యీ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. నేను బెంగళూరునుంచి తిరిగి వచ్చినట్లయితే, నన్ను కూడా వెంట తీసుకురావలసినదని మరీమరీ నాతో చెప్పవలసినదని సుందర్రావుగారు, శ్రీనివాసాచారిగారికి చీటీ పంపినాడు. నాకు సభకు వెళ్ళడానికి బడలికగా వున్నమాట నిజమే కాని, వెళ్ళకపోతే నాకు వారిపై సానుభూతిలేదని దురభిప్రాయపడతారని నేనూ హాజరైతిని. మిత్రుడు సుందర్రావుకు నాలెక్చరు చదివి వినిపించాను. ఆయన సమావేశపు ఉద్దేశాన్ని నాకు తెలియచేయగా నేను చెప్పాను; "దీనిని పెద్ద ఆర్భాటంగానూ, గోరంతలు కొండంతలుగానూ ప్రదర్శించినట్టయిదే తెలుగు వాళ్ళు చాలా వెనకబడి వుండడంవల్ల యీ విజయాన్నింత ఘనంగా చెప్పుకుంటున్నారని యిక్కడివాళ్ళు అనుకుంటారు. పరీక్షలో చక్కగా ప్యాసయిన అభ్యర్థిని అన్నివిధాలా ప్రోత్సాహించవలసిందే ; కాని ఆ అభ్యర్థిని సహజంగా మనోదౌర్బల్యం వుండివున్నట్లయితే, మిత్రుల లేనిపోని పొగడ్తలవల్ల అతనికి అనవసర భేషజం కొత్తగా వస్తుంది. అతని జీవితం మున్ముందు విఫలమవుతుంది. ఇందుకు మిత్రులు అనుసరించిన మార్గాలే కారణం కావచ్చును. విద్యావంతులమని చెప్పుకునే మన స్వదేశీయులకు లేనిపోని అతిశయం, నటన, భేషజం పరిపాటి అయిపోతున్నవి. ఇవి, వారికి మానసికమైన వొక అత్యవసర గుణాలుగా కనిపిస్తున్నాయి. ఈ దుర్గుణాలను యెంత వేగిరంగా మొగ్గలో తుంచితే అంత మంచిది. దక్షిణ దేశంలో పాండిత్యమనేది ఉపకారానికి బదులు, అపకారం చేస్తోంది. ఇది ఎంతో హానికరంగా పరిణమిస్తోంది. కాస్తో కూస్తో పాండిత్యముంటే చాలును ; లేదా అతను తగుమాత్రపు ఘనతను సాధిస్తేచాలు,, ఇక మనవాళ్ళు అదేపనిగ అతన్నికీర్తించడానికి యెగపడతారు. అతన్నొక "ఆదర్శపురుషునిగా" శ్లాఘిస్తూ అతని అభిమానులు వింజామరలు వీస్తూ పొద్దుపుచ్చుతారు. అంతటితో ఆయన తనను తాను అభివృద్ధి చేసుకుందుకు యేమాత్రమూ ప్రయత్నించడు. ఆయన అభిమానులు ఆయనలో వుండే సుగుణాలనుకాక దుర్గుణాలను అనుకరిస్తారు. ఈ సందర్భంలో శ్రీ వీరేశలింగంగారి అనుచరులను వొక ఉదాహరణగా పేర్కొనవచ్చును.

అయితే శ్రీ వేపా రామేశంపంతులు భేషజపరుడుకాడు. అందుకు నాకెంతో ఆనందంగా వుంది. ఆయన నిర్మొహమాటి. నిష్కర్షగా, సాదాగా మాట్లాడతాడు. మనిషిలో దాపరికం ఏమీలేదు. ఈ సుగుణం సాధారణంగా మనలో చాలామందికి మృగ్యం. వినయసంపన్నుడు. ఆయన తన విద్యార్థి జీవిత ఆదర్శాలను, తన ఉపజ్ఞను, శక్తిసామర్థ్యాల లోతుపాతులను సరిగ్గా అంచనావేసుకుని నడుచుకున్నట్లయితే, యెంతో మేలు సిద్ధిస్తుంది. ఆయన భవిష్యత్తులో చక్కగా రాణించగలడనే నా నమ్మకం. అయితే యీ రాణింపు ప్రస్తుతం మన మదరాసు కేసరులని చెప్పబడేవారి 'ఘనత'ను పోలివుండదనే ఆశిస్తున్నాను.

ఈ అభినందన సభకు అధ్యక్షత వహించవలసినదిగా మొదటనన్ను కోరవలెనని అనుకున్నారట. కాని నేను బెంగుళూరులో వున్నట్టు తెలిసినమీదట, శ్రీ శ్రీరాములుగారిని అధ్యక్షులుగా వుండవలసినదని అభ్యర్థించారు. శ్రీరాములుగారు బి.ఏ., బి.యల్., హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్నారు. మచిలీపట్టంజిల్లా నివాసి.

మీటింగునాడు నేను వేసుకున్న దుస్తులు చాలా అందవికారంగా వుండెను  మీటింగుకు వెళ్ళి కుర్చీలో కూచునీ కూర్చొనగానే  అధ్యక్షులు నా దగ్గరకువచ్చి  ఈ సమావేశానికి అధ్యక్షత వహించే అర్హులు ఎవరైనా వున్నారా అంటే వారు తమరే  అన్నారు

అధ్యక్షత వహించడమనే చికాకు కలిగించే బాధ్యత తప్పిపోయినందుకు భగవంతుణ్ణి అభినందించాను సుందర్రావు పంతులు ఉపన్యాసధోరణి యేమీ బాగులేదు  మాటలతీరు  నిలుపులు సుదీర్ఘం  పొగడ్తలు లావు ఈ పొగడ్తలు వింటే మహర్షికి సైతం తలతిరిగిపోతుంది  ఇక సుబ్రహ్మణ్యంగారు  సుందర్రావుపంతులుకన్న యేడాకులు యెక్కువే చదివాడు  ఉపన్యాసధోరణి బాగున్నదికాని విషయం పాడుగా వుంది  ఉపన్యాసాలను కావించడమనేది ఆధునికనాగరికత తెచ్చిపెట్టిన దోషాలలో వొకటివలె కనిపిస్తున్నది  మంచి ఉపన్యాసమంత చక్కనిదీలేదు  చెడ్డ ఉపన్యాసమంత దుర్భరమైనదీ లేదు  కాని చాలా ఉపన్యాసాలు విసుగెత్తించేవిగానే వుంటున్నాయి ఈ పొగడ్తల వలన రామేశంపంతులు భేషజాన్నలవరుచుకుంటే  అలాగ అలవర్చుకోడనే భావిస్తాను  దానికి మన మిత్రులే కారణం  నేనీసంగతి సుందర్రావుపంతులుకు తెలియచెప్పాను  ఈ సమావేశానికి నేనే అధ్యక్షతవహించి వున్నట్లయితే  అసలు విషయాలను పక్కదారులకు పోనిచ్చే వాడినికాను  సరియైన మార్గమేదో వివరించి చూపించి వుండేవాణ్ణి

నేను  ఇంటికి వెళ్ళేముందు రామేశంపంతులును కలుసుకుని అతని లోతుపాతులను గ్రహించాలి

నే నాయన్ని ఒకరోజున విందుకురమ్మని ఆహ్వానించాను  కాని ఆయన యెందువల్లనో రాలేదు సుందర్రావుపంతులూ  కవిమిత్రుడూ వచ్చారు  కవిగారు తన నవల అరవై పేజీలు చదివి వినిపించారు

సమావేశంనాడు శ్రీనివాసాచారిగారు సభలో గానం చేశారు  సమావేశానంతరం  మేడమీద వెన్నెట్లో మరికొంతసేపు కొన్ని కృతులను పాడారు  క్షత్రియుల విద్యాసమస్యను గురించి వెంకటపతిరాజుగారితో కొంతసేపు సంప్రదించితిని

♦ ♦ ♦

మదరాసులో పకోడీలు బహురుచిగా వుంటాయి

అన్నట్టు యింతసేపూ యీ విషయమే మరిచాను  ఈవేళ ట్రిప్లికేను వెళ్ళడమే ఎంతో కష్టమైపోయింది జనసమూహంతో దారి అంతా క్రిక్కిరిసిపోయింది  ఇసకవేస్తే రాలని ప్రజ  అరువత్తిమూరు ఉత్సవం జరుగుతూ వుండెను  వచ్చిన జనంలో చూడదగిన చక్కనిమొహం వొకటీ కనబడలేదు  స్త్రీలుకూడా అందంగా కనిపించలేదు

**10 ఏప్రియలు, బుధవారం**

స్కూలాఫ్ ఆర్టుకు వెళ్లితిని  పచ్చయ్యప్ప కాలేజీకి అక్కడనుంచి బ్యాంకుకు పోతిని  బాలస్వామినాయుడుగారి వద్ద నుంచి తీసుకున్న చెక్కు మార్చుకుని నూట ఎనభైరూపాయలు తీసుకుంటిని  అటుపిమ్మట మళ్లీ కాలేజీకి కాలేజీనుంచి ఓరియంటలు లైబ్రరీకి వెళ్ళాను  అక్కడ నాపెన్సిల్ పోయింది  చెప్పిన ప్రకారం ఆ విద్యార్థి అక్కడకు వచ్చాడు  నా సలహాను తప్పక పాటిస్తానని వాగ్దానం చేశాడు

**11 ఏప్రియల్, లక్ష్మీవారం :**

దళసరైన ఎరుపు మొరాకోలెదరు బైండు కాపీలు పన్నెండు కావాలని శ్రీసూర్యనారాయణగారు చెప్పగా విన్నాను. మిగిలినవి వివిధ రంగులవి. నలుపు, ఆకాశపురంగు, ఆకుపచ్చ, ఊదా, "త్వరగా వాటిని పంపించేటట్టు చూడండి. వీలరు వద్దనుంచి ఫొటోగ్రాఫులు తీసుకోండి. యింకా హెచ్చుకావాలంటే ఆర్డరివ్వండీ. జాగ్రత్తగా పుస్తకాలకు పంపమని వీలరు అండ్ కో., కు తెలపండి. పదిలంగా పేక్‌చేసి, సీళ్ళువేసి సంతకాలు చేసి కట్టుదిట్టంగా పంపించేటట్టు యేర్పాటు చేయమనండి."

**12 ఏప్రియల్, శుక్రవారం :**

అడ్మిరాలిటీ హౌసులో ఇవాళ గానసభ. త్యాగయ్యగారి శిష్యుడు, శతవృద్ధు రమ్యంగా కొన్ని కృతులనుపాడారు. మనిషి వృద్ధులే అయినా చాలా ఆనందంగానూ, కులాసాగానూ వున్నారు. మిగుల ఉత్సాహి. ఉల్లాసంగా నాజూకుగా కనిపించారు. శ్రీనివాసాచారిగారు తమతో నగరాజారావు, రామచంద్రం, సాహేబు మరికొందరు గానసభకు తీసుకువచ్చారు.

**13 ఏప్రియల్, శనివారం :**

ఒకరోజున శ్రీనివాసాచారిగారిని వారిబసలో కల్యాణరామయ్యరు కలుసుకుని నాటక ప్రదర్శనాలను గురించీ, రంగభూమిని గురించీ కొంచెంసేపు ముచ్చటించినాడట ! అనాడు తాము ప్రదర్శిస్తున్న నాటకాన్ని చూడరమ్మని ఆహ్వానించగా శ్రీనివాసాచారిగారు నేను వూళ్ళో లేకపోవడంవల్లనూ, ఆయనకు తదితరపనులు వుండడంవల్లనూ నాటకానకు వెళ్ళలేక పోయినారట. ఈవేళ వస్తామని కల్యాణరామయ్యరుకు వాగ్దానం చేశారు. వాగ్దానం చెల్లించుకుందుకు మేం ప్రదర్శనానికి చూడవెళ్ళాము. దారిలో శ్రీ సూర్యనారాయణ పంతులునూ, మాకవిమిత్రుణ్ణీ కలుసుకుని వారినికూడా వెంటతీసుకువెళ్ళాం; ప్రదర్శనం యేమీ బాగుండలేదు. హాలు నిండలేదు. నాటక ప్రదర్శనం జరుగుతున్న స్థలం టౌనుహాలు ; హాలులో చాలా కుర్చీలు ఖాళీగానే పడివున్నవి. టిక్కెట్ల రేట్లు రెండు ; రూపాయిన్నర, రూపాయి ; రేట్లు తక్కువగా లేకపోవడంవల్ల ప్రేక్షకులు పల్చబడివుంటారు.

హాలులో చూడదగిన ఆసక్తి కలిగించే దృశ్యం ఆనరబుల్ శంకరనాయరుగారి కుటుంబం. మొదటివరసలో ఒక పెద్ద బెంచీమీద ఆయన కుటుంబీకులు ఠీవిఠీవేసుకు కూర్చున్నారు. నలుగురు కూచోదగిన బెంచీ ; కూచున్న స్త్రీలలో ఒకావిడ అందరికంటె వయసులో పెద్ద. స్థూలకాయం. మనిషి నాజూకుగానే వుంది. వొళ్ళో బిడ్డణ్ణీ పందుకోబెట్టుకుని హాయిగా కూర్చున్నది. ఆవిడ ప్రక్కనే యింకొకామె, వయస్సులో కొంచెం చిన్నదే, చతికిలబడింది. తరువాత కూర్చున్నామె అందరికంటె చిన్నపిల్ల. మళయాళీ పద్ధతిలో చక్కని చీరెలు ధరించారు. దస్తులు చాలా ఖరీదైనవే. ధరించిన నగలుసైతం ఎంతో విలువైనవి ; అలంకరణ ఎబ్బెట్టుగా లేదు. మధ్యన కూర్చున్న ఆవిడచెవులకు కుట్టుపోగులు లేవు. కాని మిగిలిన యిద్దరి చెవులకూ ఎన్నో పోగులు. చూడడానికంత నాజూకుగా లేవు. చెవులకున్న పోగులు చాలా వలంగావున్నవి. స్త్రీలను, వారి ఆచార పద్ధతులనుంచి మళ్ళించడం కష్టమేకాని, చెవులకు అన్నేసి కుట్టుపోగులు, ఆభరణాలు పెట్టుకోవడమనే అలవాటును మాన్పించవలసివుంది. ఈ కాలంలోకూడా యీ అలవాట్లేమిటో! ఈ పద్ధతులను త్యజించవలసినదిగా గట్టి కృషి చేయాలి. వారిలో అందరికంటే చిన్నపిల్ల చాలా బక్కపల్చగా వున్నది. కళ్ళు చేపకన్నులను పోలివున్నవి.

నాటక ప్రదర్శనం పాడుగావుంది. దీనిని యీ మహిళలు ఏవిధంగా అనుభవిస్తూ ఆనందిస్తున్నారో గమనిద్దామని నాకు కుతూహలం కలిగింది. చిన్నపిల్ల అమాయిక. ఎంతో వినయవిధేయతలుగలపిల్లవలె పొడకట్టింది. రంగభూమిమీద వొక అసంబద్ధ సన్నివేశం తరువాత యింకొకటి అలాగున ప్రదర్శింపబడుతూనేవున్నది. ఈ అసంబద్ధ సన్నివేశాలను, దృశ్యాలను, నటననుచూసి యీ చిన్నపిల్ల ఏవిధంగా భావిస్తున్నదీ, ప్రతి చలిస్తున్నదీ గమనించవలెనని ప్రయత్నించాను.

సీనులు పాడుగావున్నాయి. తెరగుడ్డలు మరీఅసహ్యం. అభినయం! దానిని యేమనాలో నాకే బోధపడడంలేదు. ఈ దుర్భర పరిస్థితిని వర్ణించడానికి తగిన విశేషణం భాషలో అగోచరం.

మొట్టమొదట అనసూయా, ప్రియంవదల సంగతి. తాటకిలాటి శరీరాలు ; చెప్పలేనంత మోటుతనం. అనాగరకత హెచ్చు. సొగసైన లాలిత్యంగల శకుంతల చెలికత్తెలుగా వీరు తయారయినారు. సున్నితమైన హృదయభావాలనూ, మార్దవమైన అభిప్రాయాలనూ ఠీవినీ హుందాతనాన్ని కలిగివున్న చెలికత్తెల వేషాలు యీ'కోమలాంగులు' వేస్తే నాటకం ఎలాగున వుండవలెనో అలాగునే వున్నది !

శకుంతల పాత్ర ధరించిన కల్యాణ రామయ్యరు కన్యవలె కనిపించకపోతేమానె ! మంచి నడివయస్సులోవున్న స్త్రీవలె చూపరులకు దిగ్భ్రాంతి కలిగించాడు. అతని ముఖలక్షణాలు అతనికే లొంగకుండెను. గుండ్రని కన్నులు. మొహానకు అతికించినట్లు పెద్దగ్రుడ్లు ; ఆటబొమ్మల కున్నట్లు మీదకు యెక్కొచ్చినట్లు వున్నవి. కోపమూ, చికాకూ, రుసరుసలు బహుశా ఏదో అవ్యక్తమయిన అనుకంపమూ తప్పితే అతని నేత్రాలు మరొకభావాన్ని అభివ్యక్తీకరింపజాలవు. మర్యాద, లజ్జ, ప్రేమ, గౌరవము, వినయశీలత, విచారము, విషాదము మొదలైన ఉదాత్తభావాలను వ్యక్తీకరించుటకు అతని కన్నుల తీరు సరిపడదు. ఈ గుణములేవీ అతని నేత్రాలలో మచ్చుకైనా కానరావు. భావప్రకటనకుగల యోజన అతని కనులకు మృగ్యం ; నుదురు కిందకు అణిగి పోయివుంది; చిన్నది; లొత్త, చివరిభాగాలు మరీ చిన్నవి. కనుబొమ్మలు వొకతీరునలేవు. పెదిమలు సన్ననివీకావు. పోనీ కుదురుగ వున్నట్టూ కనిపించవు. మీది పెదవి గుండ్రన. పెదాలూ నోరూ ముందుకు పందెం వేసుకున్నట్టు తోసుకువచ్చాయి. స్తనములు చాలాపెద్దవి. పాపం అతను వాటిని సరిగ్గా అమర్చుకోలేదు. అయ్యరు ఆకారానికి సంబంధించినంతవరకూ యివీ విశేషాలు ; ఇక అతని వాచికం సంగతి. నోరుతెరచి అతను మాట్లాడబోయేసరికి థియేటరు విడిచివెళ్ళిపోదామన్నంత దుర్భరమనిపించింది. గొంతుకవింటే కప్పలు బెకబెకలాడినట్లే ; ఎంతపెలుసు ! మగ వారికంఠమని యిట్టే తెలిసిపోతున్నది. సంగీతవాయిద్యాలు మహాభయంకరం; మార్దవం పిసరంతలేదు. కర్ణకఠోరమైన సంగీతం ! ఈ దుస్సహమైన దిక్కుమాలిన సంగీతాన్ని అతను యెందుకు మానుకోడు ? ఉహుఁ! అలాగ వినిపించి ప్రేక్షకులను రంజింపచేయాలనే అతని అభిమతం !

ఈ మదరాసీలు కల్యాణరామయ్యరు పేరుచెబితే పొంగిపోతారు ; ఉబ్బితబ్బిబ్బవుతారు. బాగులేదన్నవాళ్ళకు బహిష్కారమే. ఇతడు మంచి వ్యాపారస్థుడు. ముందుగా తాను వెళ్ళే స్థలములలో తగు మనుష్యులను కలుసుకుని వారిని ఆశ్రయించి ఆదరణ సంపాదించుతాడు. చెన్నపట్టం విడిచి దక్షిణానికిపోతూవుంటే యితని ప్రసిద్ధిమరీ ఎక్కువగా కనిపిస్తుంది. దీనినిబట్టి మదరాసీలకు 'విచక్షణ', సరియైన విలువలను పోల్చుకునే దృష్టీ లేదని తేలుతున్నది. విజయనగరంజట్టు నాటకములలో అభినయం యింతకంటె బాగావున్నది. బుచ్చిశాస్త్రి కంపెనీవా[illegible] కల్యాణరామయ్యరు జట్టుకంటె అన్ని విధాలా ఎన్నోరెట్లు మెరుగు. అయితే వారికి శ్రీనివాసాచారి తరిబీదు వుండ[illegible] చెప్పకతప్పదు. కల్యాణరామయ్యరువలె రంగభూమి మీద వెంకయ్యగారు అవకతవకగా ఎన్నటికీ అభినయించదు.

అయ్యరుచేసిన మోటుపనులు కొండయ్య చేస్తాడంటే కలలో కూడా నమ్మజాలను. అసలు యితని నాటకపు నోటీసులే అవకతవకగా వున్నవి. ఈతని ప్రకటనలకొక అర్థంపర్థంలేదు. తానొక అసాధారణ ప్రజ్ఞావంతుడనని ప్రకటించుకుంటాడు. ఈ నోటీసులను అచ్చుముగా అలాగే "పంచ్" పేపరులో అచ్చొత్తిస్తే హాస్యపు ప్రకటనలుగా చలామణీ అవుతవి. "నమ్రత" అంటే అయ్యరు ప్రకటనలలోనే కలదుగదా మరి ! ఈ నాటకపు వాళ్ళకు ఆత్మశ్లాఘన అలవాటు అయినది.

ఇది యీనాడు వారికొక ఫేషను. తమిళుల పద్ధతులు బహుతమాషాఅయినవి. అవకాశము కలిగినచోటల్లా తమ వాళ్ళను తామే పొగుడుకుంటూ ఆకాశానికెత్తుతుంటారు. కల్యాణ రామయ్యరుకు ప్రసిద్ధి యిలాగే కలిగివుంటుంది. అతని రూపు, సందేహంలేదు, చలాకీఅయిన డాన్సింగు గరల్‌వలె వుంది. ఇంతకంటే తక్కువ వయసులో చిన్నతనంలో అయ్యరు కంఠమూ, రూపూ కాస్త బాగావుండేవేమో ! యిప్పటికికూడా తాను తగుదునని ఆడవేషాలు ధరించడం ఎంత మూర్ఖత ! అతని వక్రబుద్ధిని యేమనగలం!

దుష్యంతుడువేషం కట్టిన బుద్ధిమంతుడు బహుశా యీ ట్రూపుకు నాయకుడు కాబోలును. ఈ వేషమునకు ఇతనిని యెంచుకోవడంలో కల్యాణరామయ్యరు ప్రాజ్ఞతను యేమని పొగడగలరు ! పొడుమోహం ; మట్టిబుర్ర. డోకువస్తూ రాక్షసుడిలా దూసుకువచ్చాడు. దయ్యంలాంటి మనిషి. నల్లగా లేదు కాని, వేషధారణ రోతకలిగిస్తున్నది. వేషంమీద రూపం అందంగాకనపడేటట్టు చేసుకోవడం కూడా యెరిగినట్టు తోచదు. సాక్సు, నల్ల ట్రౌజరు, కోటూ వేసుకుని మిలిటరీ ఆఫీసరులాగ దిగబడ్డాడు. దీనికితోడు తలమీద టోపీకూడాను ! మీసాలు పల్చగా సన్నగా వున్నాయి. వేషానికి తగిన మీసకట్టుకాదు. నుదుట తిరుచూర్ణము ; మొత్తంమీద మనిషిని చూసీ చూడగానే, మావేపు సాతానిభిక్షువు జ్ఞాపకంవచ్చాడు. మూతి కొంచెం ముందుకుంటుంది. మీది పెదవి గుండ్రము ; పెదవులలో యిమడని పొడుగుపళ్ళు. ఇట్టి ముఖములో లావణ్యముగాని, చురుకుతనముగాని యేలాగు కనబడగలవు ?

పాపం, అందు కతనేమి చేయగలడు ! ధీమాగాని, చలాకీతనంగాని, రాజపౌరుషంకాని జోడుకంచుకాగడాలు పట్టుకుని వెతికినా అతని ముఖంలో కానరావు. వేషము సరే సరి ! అంతా మోటుతనమే ; యుక్తత అన్నదిపూజ్యం. వెంట్రుకలు కొప్పుగా ముడుచుకుని దానిమీద టోపీవొకటి పెట్టుకున్నాడు. తలవెనుక ముడి ! ఆహా ! వీళ్లెంత మోటుమనుషులు ! కించిత్తు దర్జాకూడాలేదు ; పోనీ ఔచిత్యం అంతకంటే కనిపించదు ! దుష్యంత మహారాజావారులేచి నిలుచుంటే తలముడి ముందుకు పడుతూ వుంటుంది. బోర వెనక్కు వెడుతూ వుంటుంది ! ఆరి వీడి సిగతరగా ! ఏమి వేషం ! ఏమిలోకం ! దుష్యంతుడు ఎంత మూర్ఖుడు ! ఎంత జడ్డి పీనుగ !

మిగిలిన పాత్రధారుల వేషధారణ యేమీ చెప్పుకోనక్కరలేదు. ఇంచుమించు వారికి మంచి దుస్తులు లేనట్టే; ఏ పనులయితే చేయకూడదో, ఏ మాటలను పలకకూడదో అవన్నీ చక్కగా చేసి, పలికి, రంగభూమి అంతాకంగాళీచేసి విడిచి పెట్టారు. ఇదివర కొకసారి నేను చెప్పినట్టుగానే, రంగభూమిమీద కనిపించిన ప్రతి నటుడూ ఏదో సణుగుడు ప్రారంభించాడు. మంత్రాలు, జపాలు, పాటలు ; సంభాషణ మట్టుకు లేదు. నోరు విప్పి మాట్లాడ్డం తప్ప మిగిలిన హంగామా కావలసినంత.

రంగభూమిమీద ఒకనటుడు విశాఖపట్నం చేంతాడంత స్వగతం చెప్పుకుపోతున్నాడు. పక్కనున్న మిత్రుణ్ణి "ఏమిటి నేస్తం యీ తరగనిదుంప ! ఎప్పుడైనా హనుమంతుడి తోక చూశావా ? అన్నట్టు ఇందులో నీకేమైనా బోధపడ్డదీ ?" అని అడిగాను. ఎవరయితే అనర్గళంగా ఉపన్యాసధోరణిలో మాట్లాడుతారో వారు గొప్ప తెలివైనవాళ్ళని, గొప్ప నటులని మనవాళ్ళ అభిప్రాయం. ఇది మరాటీ కంపెనీల బాణీ; దీని నొక సూత్రంగా యీ కంపెనీలు

పరిగణిస్తున్నాయి. నటులు పలికే మాటలు కేవలం పాఠం వప్పగించినట్లే విసుగుకలిగిస్తూ కృతకమనిపిస్తున్నవి. ఎంతో కష్టంమీద వొక్కొక్కమాటనే అంటున్నారు. ఈపాటి మహాభాగ్యానికి, కల్యాణరామయ్యరు చంగా బజారుసందుగొందుల్లో ప్రదర్శనాలీయక, ఎందుకీ టౌనుహాలులో నాటకాలు వేయాలని సహజంగా ఎవరైనా ప్రశ్నించవచ్చును ; దీనికి నేనేం సమాధానమీయగలను ? పాపం, అయ్యరు వొట్టి వెర్రికుట్టె ! తాను శకుంతల భూమికను అత్యద్భుతంగా నిర్వహించగలనని భావిస్తున్నాడు. నటులకు వేషం చక్కగా కుదిరేటట్టు చేశానని, కాళిదాసు శ్లోకాలు అమోఘంగా భట్టీ వేయించానుకదా అని అతనిధీమా. వీటికే అతను హెచ్చు ప్రాధాన్యత యిస్తున్నాడు. శ్లోకములన్నీ ఆభాసుపాలు చేసినాడు. శ్లోకం తరవాత శ్లోకం. ఎక్కడా ఎడతెరిపిలేదు ; నించున్న పాటున మనిషిని గొంతుక నులిపి హత్యచేసినట్టు శ్లోకాలను ధ్వంసంచేసి విడిచిపెట్టాడు. దారుణమైన హత్య ! ఇక నా ఓర్మి సన్నగిల్లింది.

కిం శీతలై ః క్లమ వినోదిభిః అనే శ్లోకం దుష్యంతుడు నాటకంరంగంమీద యీడుస్తూ చదువుతూవుంటే యిక భరించలేకపోయాను. నా తీవ్రఅసమ్మతిని తెలియచేసేటందుకో అన్నట్టు కాలిబుటుతో వొక్కసారి నేలనుకొట్టి దురన్యాయం దురన్యాయం అనుకున్నాను. నేను చేసిన యీ అసమ్మతి సూచక ధిక్కారం హాలంతా ప్రతిధ్వనిస్తున్నదా అనిపించింది. హఠాత్తుగా శకుంతల దుష్యంతుడి చెంత చేరుతూ గునుస్తూ సానిపిల్లలాగా టక్కరితనంతో వగలు కురిపిస్తూ తెలుగులో "ననుగూడరా నాథా" అని జావళీ అందుకుంది! ప్రాణం విసిగెత్తిపోయి పాపం, శ్రీనివాసాచారిగారు దిగ్గునలేచిపోయారు. యిదేమిటీ దిక్కుమాలిన శకుంతల !

ఇదివరకు వొకసారి కల్యాణరామయ్యరు ప్రదర్శనం మీద నేను తీవ్రంగా జడ్జిమెంటు చెప్పానని శ్రీనివాసాచారిగారికి బాధనిపించిది. ఆనాడు ఆయన కల్యాణ రామయ్యరు నాటక ప్రదర్శనాలను సమర్థిస్తూ వాదించారు.

నాచెంతనే కూచున్న మిత్రుడు వెనక్కితిరిగి "ఇప్పుడీనాటక ప్రదర్శనానికి కాళిదాసువచ్చివుంటే ఏమనుకునేవాడో!" అన్నాడు.

"మారుమాటాడక యీపాటికి ఏ నుయ్యో, గొయ్యో చూసుకునివుండును !"

ఒక్కచోటమాత్రం అయ్యరు అభినయం బాగున్నది. దుష్యంతుడితో తన చెలికత్తెలు ప్రసంగిస్తున్నపుడు శకుంతల మౌనంగా నిలబడివుంటుంది. ఇలా తానేమీ మాట్లాడకుండా నించున్నపుడే అయ్యరు నటన ఫరవాలేదనిపించింది.

శకుంతల, దుష్యంతుడితో ఇక్కడేమిటి అల్లరి చేస్తావు. అంతా చూస్తారు. బహిరంగం అంటున్నది. సైదు కర్టెను పక్కకు తప్పుకొని, కాస్సేపు అచట నక్కి మళ్ళీ యింకొక సైదుకర్టెనులోంచి తలపైకెత్తి తొంగితొంగి ముందుకు చూస్తూ మునికన్య శకుంతల "అక్కడకు మళ్ళీ నేనెటులపోగల దానను ? నా పూలదండ పోయినదికదా !" అని వాపోతున్నది. వెదుక్కుంటూ యింకొకతె రంగంమీదకు ప్రవేశించింది. దుష్యంతుడు శకుంతలను "నీ కేమి కావలె?" అని ముచ్చటగా అడిగాడు.

"అయ్యో ! నా పూలచెండును పోగొట్టుకొంటినే!"

"ఊరడిల్లు మూరడిల్లుము. అద్దానిని నేను నీ కొసంగెదను. కాని నీవు నాకొక వాగ్దానమీయవలెను!"

"ఇచ్చెదను!"

"ముందు మాటయియ్యి"

"యిచ్చితిని!"

"అటులైన యిటువచ్చి కూర్చో. పూలచెండును నీ జటయం దలంకరించెద!"

దుష్యంతుడు, శకుంతలకు పూలదండను యిచ్చి ఆమె చేతిని పట్టుకున్నాడు. పట్టుకుని లాగుతూ "నీకరమెంత మెత్తగా నున్నదో!" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు! శకుంతలాదుష్యంతుల ప్రేమాభినయమును చూసి హాలులోకూర్చున్న స్త్రీలు ఫక్కున నవ్వడమారంభించారు.

ఇప్పుడు యింక దుష్యంతుడు రంగభూమిమీద శకుంతల చెంత అభినయిస్తున్నాడు. వివాహితస్త్రీని మానభంగంచేసేటంత దూకుడుగా శకుంతలతో పెనుగులాడుతున్నాడు !

**14 ఏప్రియలు, ఆదివారం :**

1. తెనాలి రామకృష్ణ.
2. హిందువులు అనుసరిస్తున్న ప్రస్తుత వైవాహిక పద్ధతి సంతృప్తికరముగా వున్నదా.
3. మద్రాసులో విద్యార్థిజీవితం సుఖప్రదంగా వున్నదందుమా.
4. జీవితధ్యేయములు.
5. కేవలము వొకవ్యక్తి గొప్పస్థితిలోవున్నంతమాత్రాన, ఆతనియెడల గౌరవభావము చూపవలెనా.
6. ప్రజల ఐక్యతకు వర్ణవ్యవస్థ అనేది గొప్ప ఆటంకముగానూ, అడ్డుగోడవలెనూ లేదా.
7. మతనమ్మకమనేది ప్రస్తుతము, భారతదేశములో అభివృద్ధి అవుతున్నదా, లేక నశించుతున్నదా.
8. బహిరంగశత్రువు, కపటస్నేహితుడు, వీరిలో ఎవరు ఎక్కువ ప్రమాదకారులు.
9. ఆత్మహత్య చేసుకోవడమనేది మనిషి ధైర్యమునకు హేతువా లేక పిరికితనానికా
10. ఉపజ్ఞాపూర్వకమైన విద్యను గరపడంవలన, దేశంలో నేరముల సంఖ్య తగ్గునా?
11. జీవితపవిత్రత
12. చాంధసత్వమనేది సమాజమునకు హెచ్చు ఉపద్రవము తెచ్చిపెట్టునా

**15 ఏప్రియల్, సోమవారం :**

పచ్చయప్ప కాలేజీకి వెళ్ళితిని. సభకువచ్చిన జనం యెక్కువగా లేరు. చాలా బెంచీలు ఖాళీగానే వున్నవి. ఏర్పాట్లు బాగులేవు. వేదికమీద కొంతమంది మనవాళ్ళూ, ఆరుగురు యూరోపియనులూ ఆసీనులయిరి. వేదికచుట్టూ చాలామంది తగు మనుష్యులు గుమిగూడిరి. వారి గడబిడ, గాభరా హెచ్చుగానే వుంది.

బిషప్పుగారి ఉపన్యాసము యెంతో చక్కగా వుంది. ధోరణి ఎన్నతగింది. మధురమైన కంఠము. తెలుగుభాష సా[illegible]ని మెచ్చుకుంటూ కొంతసేపు ప్రసంగించాడు. మనిషిలో హాస్య, చమత్కారములు కలవు.

ఉపన్యాసమును ముగించాడు. మిగిలినవారి ప్రసంగములు పాడుగానే వున్నవి. మిస్టరు కూపరు ఓక్లీ ముక్కుకు సూటిగా ఉపన్యసించాడు. ఉపన్యాసములో తనకు సంబంధించిన భోగట్టా జాస్తి. ధోరణి బాగులేదు. ఎవరో కృష్ణమాచారిగారట, నానా చెత్తా మాట్లాడినాడు. విద్యాభివృద్ధిని కోరుతూ 'టోస్టు'ను ప్రపోజుచేసే బాధ్యత

ఆయనమీద పడింది. విద్యావిధానం లోపభూయిష్టముగా వున్నదనీ, దానిని చక్కపరచవలెననీ ప్రతిభావంతంగా నిర్వహించవలెననీ, ఆయన ప్రసంగించినాడు.

మిస్టరు స్టోనుదొర మాట్లాడుతూ విద్యావిధానము స్వయంపోషకముగా నిర్వహింపబడేటట్లు చూడవలెననీ, విద్యావంతులు తమనుతాము పోషించుకునేశక్తి గలిగివుండాలనీ, ప్రభుత్వం యీ విషయాన్ని తృణీకారభావంతో చూస్తున్నదనీ అన్నాడు.

* * *

సౌవర్సుదొరను సాగనంపుటకు వెళ్ళి అక్కడనుంచి 'చీపాకు'కు బయలుదేరాను. గవర్నరుగారు 'స్టూడెంట్సు హాస్టలు'కు శంకుస్థాపనచేసినసభకు చాలామంది విచ్చేశారు. మిస్టర్ బ్లిస్‌దొర మొదట మాట్లాడిరి. వైఖరి అంతబాగా లేదు. ప్రతీ వాక్యాంతమందున్నూ వొకేవిధమైన నిలుపులతో ధోరణి చికాకు కలిగిస్తూ వుండెను. మహారాజావారిని పొగడుతూ ప్రసంగించినాడు. కాని ఆయన పొగడ్తలు మహారాజా వారి కేమీ రుచించినట్లు కనిపించలేదు. బ్లిస్‌దొర ఉపన్యాసం సుదీర్ఘం.

తరువాత శంకుస్థాపన మహోత్సవం. మిస్టర్ డంకన్ గవర్నరుచేతికి కలశమందించాడు. ఒక ప్లేటుతో ప్లాస్టరును ఒక అందమైన కూజాలో నీళ్ళను తెచ్చి బాలయ్యనాయుడుగారు గవర్నరు కందించారు. కమిటీతరపున రాజావారు శంకువును బహూకరించారు. గవర్నరు ప్లాస్టరును అలది శంకుస్థాపన జరిగినట్లు ప్రకటించారు. శంకుస్థాపనానంతరం వేదికవద్దకు వెళ్ళిగవర్నరు ఉపన్యసించాడు. బ్లిస్‌దొర ప్రసంగముకంటే గవర్నరు ఉపన్యాసము బాగున్నది. కాని జంకుతూవున్నట్టు మాట్లాడాడు. శరీరం ముచ్చెమటలుపోసింది. సభవారితరపున జస్టిస్ సుబ్రహ్మణ్యఅయ్యరుగారు వందనములు సమర్పించారు. ఉపన్యాస ధోరణి బాగులేదు. చెప్పినసంగతులు బాగులేవు. అతిపొగడిక. అయినా నాగరికముగాను, యుక్తముగాను చెప్పవచ్చునా ; అది మదరాసీలలో మృగ్యము.

♦ ♦ ♦

కోటకువెళ్ళితిని. విజయనగరవంశచరిత్రకు సంబంధించిన ముఖ్యమైన భోగట్టాలు దొరికినవి.

♦ ♦ ♦

శ్రీ శ్రీనివాసాచారిగారి మేనగోడలు గర్భాధాన మహోత్సవమునకు వెళ్ళితిని. దారిలో కపాలేశ్వరుని ఉత్సవము చూసితిని.

డాక్టరు హుల్ట్సుదొరను అడగవలసిన విషయములు :

కోట యేలికలను గురించి మీకేమైనా తెలియునా ?

వీరు జైనరాజులని కృష్ణాజిల్లా మాన్యువలులో పేర్కొనబడినది. అన్నట్టు మొదటి చాళుక్యులు జైనమతస్థులేనా? జైన దేవాలయములో వొక చోళరాజు యేదో నిర్మించినట్లు దాఖలావుంది కదూ?

పూసపాటి మాధవవర్మనుగురించి మీకేమైనా తెలుసునా ?

కాకతి గణపతి "మహా మండలేశ్వర" బిరుదును వహించాడు.

నెల్లూరు రాజునకును మరెవ్వరికి జరిగింది ఆ యుద్ధం? నోటుబుక్కు చూదండి.

తరువాత కంచిని రాజధానిగా పరిపాలించిన పల్లవులు వెల్లూరులో ఏమైనా శాసనము లున్నవేమో చూడండి.

ఇండియను ఏంటిక్వరీ వాల్యూము 6; పేజీలు 226 జమ్మలమడుగు చెంతవున్న గరిశలూరు; వెంపల్లె (అనుమలసముతు)

కావేరిబ్రిడ్జి

తిరువాంకూరురాజులది యేరాజవంశం. గోత్రములు, పాండ్య.

చోళులవంశమూలచరిత్ర ఎక్కడ నుంచి మీకు తెలుసును.

శంభురాజు తెలుగువాడు.

రాజరాజు, రాజరాజగంగయే కారాదా? రెండు తరగతుల క్షత్రియులు.

సూయిలు దొర పత్రములు.

ఇలియటుదొర.

ఎపిగ్రికా ఇండికాలో పేర్కొన్న మాధవర్మ శైల, లేదా శిలావంశస్థుడు.

బుద్ధవర్మ, చిక్కభీమ, మైలపభీమ, అన్నపదేవ, వీరబసవరాజు.

**16 ఏప్రియలు, మంగళవారం :**

శ్రీనివాసాచారిగారితో కలిసి 'అభిజ్ఞాన శాకుంతలము' చదవడాని కుపక్రమించితిని. నాటకారంభమున తపస్వికన్యల సంభాషణము అభ్యంతరకరము కాదా? కాళిదాసునకు అనాఘ్రాత పుష్పములవంటి కన్యల సౌందర్యమును వర్ణించుట ప్రీతి. వల్కలములను ధరించిన శకుంతల, పుష్పాలంకృత పార్వతి వర్ణనములు.

వనజ్యోత్స్న; నవమాలిక! ఈ రంగము మహా సౌందర్యమైన కవితా రూపకల్పనతో అలరారుతున్నది! కథానాయకుడు మాటున దాగి ఇతరుల మాటలను వినడమనేది నాటకాలలో తరుచు కనిపిస్తూవుంటుంది. ఇది సాధారణమైన కల్పనే.

"ఉవభోగక్షమ" అనే ప్రయోగము అర్థవంతమైనది. సాభిప్రాయము. క్షత్రపరిగ్రహక్షమా; యదార్యమస్యామభిలాషి మే మనః.

తుమ్మెద నిన్ను బాధిస్తూవుంటే మేమేం చేయగలం? నిన్ను రక్షించడానికి మేమెవరమి? ఈ తపోవనాలు రాజుచేత సంరక్షింపబడుతున్నాయి. నిన్ను రక్షించడానికి దుష్యంతుణ్ణి పిలు.

ఎంత చక్కగా వుంది!

రాజు అడిగిన ప్రశ్నకు శకుంతల ప్రత్యుత్తరమీయకపోవడం ఎంతో స్వాభావికముగానూ, సహజముగానూ వుంది.

ఈ కథలోని సంఘటనలు జరుగుతుండగా విశ్వామిత్రుడు యేమిచేస్తున్నట్టు? "పురాకిల" అంటే యెన్ని సంవత్సరాలు? "దేవతలకీ పరతపోభయశీలత యెప్పుడూ వున్నదే" అనే రాజు మాటలు అనవసరం. ఇలా అనడంవలన ఆ పిల్లలకు తనమీద నమ్మక విశ్వాసం యేర్పడుతుందని దుష్యంతుడి ఉద్దేశం.

'వైఖానసం' దీనికి వివిధ విధములగు అర్థములు, అన్వయములు కలవు.

శకుంతల అసంబద్ధప్రలాపినీ " ఎంతసొగసుగా వున్నది వృక్షములకు కలశములతో నీరు పోయుటవలన శకుంతల అలసిపోయింది అలసిన శకుంతలావర్ణనం మనోహరం

అనసూయా ప్రియంవదలకు చదువువచ్చును ప్రియంవద తెలివైన పిల్ల

అబ్బో మేము మేము అని ఏమి రాచరీవి

**17 ఏప్రియల్ బుధవారం**

రాజుగారు విజయనగరం బయలుదేరారు

ఆవ్‌దాస్ రచించిన ఫ్రెసీవ్స్ అనే నవలను నేనూ శ్రీనివాసాచారిగారూ చదువుకున్నాం ఇది ఒకరివరెండుకు సంబంధించిన క్షణికోద్రేకపూరితమైన కథ ఇటాలియను కొండజాతిపిల్లను యితను పెంచుతాడు ఒక ఇంగ్లీషు వనిత నృత్యమందిరాన్ని చిత్రించడానికై మఠాచారి ఆహ్వానింపబడతాడు తను చిత్తరువును వ్రాస్తుండగా ఆ ఇంగ్లీషు వనితను ప్రేమించడ మారంభిస్తాడు ప్రేమ వ్యవహారం మెల్లగా మందకోడిగా సాగుతుంది మొదట ఆమెను అతను అంతగా మెచ్చుకోడు ఆమె ఎంతో అందకత్తె కథలో చెప్పిందే చెప్పడం టు బీ ఆర్ నాటు బీ పద్ధతి రచనాశైలీ విపరీతం ప్రేమించనా మాననా? అనే వితర్కం విసుగు పుట్టించేటట్టు సాగింది పాత్రల మానసిక అవస్థలను చిత్రించేటపుడు రచయిత్రి తికమకలు పడింది మానసిక తత్త్వనిరూపణ విశ్లేషణ యేమీ సహజంగా లేదు సంభవ మనిపించలేదు పాత్రల మానసికత తత్త్వం యిలాగున వుండడం అసంభవం. ఆమె మంచి ఆస్తిపరురాలు ఇద్దరి ప్రేమకథా యిలాగున వుండగా చిట్టచివరకు యీ ప్రేమికుడు తన పెత్తండ్రి కుమారుడని ఆమెకు తెలియవస్తుంది అతనే తన ఆస్తికి నిజమైన హక్కుదారుడని విదితమవుతుంది ఈ కథ వొక కల్లబొల్లి అతుకులబొంత ఈవిషయం తెలియక మునుపు ఆమె తనను వివాహం చేసుకోవలసిందిగా యేలుకో వలసినదిగా అతన్ని కోరుతుంది ఈ విషయం తెలిశాక నేలమీద పడి మూర్ఛబోతుంది

**18 ఏప్రియలు లక్ష్మివారం**

బట్లరుకు ఏభైరూపాయలనోటూ వొక పదిరూపాయల నోటూ దాచయిస్తిని

♦ ♦ ♦

ఇవాళ యెందుచేతనోకాని నామనస్సు * దేవరపల్లి వైపునకు పరిపరివిధాల పోతున్నది మా మావగారూ చిన్న బావమరదీ వాళ్ళూ – అన్నట్టు అతనూ ఆ బ్రాహ్మణకుర్రవాడు శాస్త్రులు తెలిసీ తెలియని జ్ఞానం మూర్ఖత ఆగమ్మ కాకి అతనూ జ్ఞాపకానికొస్తున్నాడు ఆహా ఆరోజులు మళ్ళీవస్తే ఎంతబాగుండునోకదా ఇంతకాలమైపోయిన తరువాత వాటిని తలుచుకుంటే ఎంత మనోహరంగా వున్నవి కాని ఆ గతించిన రోజులు కష్టాలతో నాకెంతో వ్యధను కలిగించాయి హృదయానికి మోయలేని భారమనిపించాయి. నిజంగా అవి ఎంతోభారం చెప్పలేనంత భారం అంతో యింతో సంపన్నవంతుడనయేవరకూ నాకష్టాలు గట్టెక్కాయి కావు

నా చిన్ననాటిరోజుల తిరిగి రావలెననే కోరిక యిక నాకు లేదు ఎప్పుడూ ఏదో వొక దిగులు డబ్బులేకపోవడం వల్ల ఎన్నెన్ని చిక్కులు ఆ దుర్దినాలు వెళ్ళిపోయాయి వెళిపోయాయి పూర్తిగా మటుమాయమైపోయాయి అమ్మయ్య ఎట్టి విపత్తు

అయితే నేమి ఆరోజులలో నాకానందం లేకపోలేదు రోజులు మంచి ఉత్సాహంతో గడిపాను తెల్లవారితే దినంయెలాగ గడుస్తుందనే చీకూ చింతా లేనప్పుడే మనిషికి ప్రశాంతి సుఖమూను వొకరిసంపాదనమీద ఆధారపడ్డ మనిషికి యే అనుభవమూ వుండదు

♦ ♦ ♦

పాపం, నారాయణమూర్తి వంటి అంత తెలివైన వ్యక్తికి ఆరోగ్యం తిన్నగా లేకపోవడం యెంత విచారకరం!

చిరంజీవి వెళ్ళిపోయినాడు. ఎంత ముచ్చటైన కుర్రపిల్లవాడు! అతనికి స్కాలరుషిప్పు యిప్పించగలననే అనుకుంటాను. అతనికి మా అమ్మాయినిచ్చి వివాహం చేసివుందును కాని మాపెత్తండ్రికొడుకుకు, అతనికి తన కూతుర్ని య్యాలని వుంది. ఇదే సబబు.

♦ ♦ ♦

పదిహేనోతేదీని వొక వింత జరిగింది. తులుచుకుంటే యిప్పటికీ నవ్వు వస్తున్నది. పచ్చయప్పకాలేజీలో మీటింగుకు వెళ్ళి, యింకా చాలా వ్యవధి వున్నదికదాఅని 'యీవినింగు బజారు'లో తచ్చాడుతూవుంటిని. ఒక పుస్తకాలస్టాలువద్ద ఆగి పుస్తకాలను కొనుక్కొంటూవుండగా అక్కడకొక బికారి వంటివాడు వచ్చి ఆ అంగడి వానికొక కళ్ళజోడు అమ్మజూపినాడు. దానిని షాపువాడు రూపాయిన్నరకు అడగగా, వాడు మూడురూపాలకిస్తానన్నాడు. నేను రూపాయిన్నర యిస్తానంటిని ; వాడు కొంచెము గొణుగుకొని యిచ్చి వేసినాడు. అది వెంటనే కళ్ళకుపెట్టుకొని చూస్తిని. సరిపడలేదు. ఎట్లు సరిపడును? నాకప్పటికి చత్వారమూలేదు; హ్రస్వ దృష్టీలేదు. బూట్సూ, స్పెక్టికల్సుతో యేదో లేనిఘనత వొకటి కొత్తగా వచ్చిపడ్డట్టు, మహాదర్జాగా అవి కళ్ళకు అలంకారంగా వుంచుకొని, కాలేజీలోకి వెళ్ళబోయినాను. కాని ఆ కళ్ళజోడులో దూరపుచూపునకొకముక్కా చదవడమునకొకముక్కా అతికి వుండడముచేత, దృష్టి చెదరి మెట్లమీదనే, ద్వారములోనే జారి చాలా హాస్యాస్పదముగా చతికిలబడిపోయినాను !

♦ ♦ ♦

రవివర్మ చిత్రించిన 'రాధ' బొమ్మను చూస్తిని. మొద్దు మనిషివలె కనబడింది. ముఖములో కొంత అవాస్తవికత; స్త్రీమోము ఆలాగున వుండునా అనిపించుతుంది. కళ్ళు అంత పెద్దవిగావుండడం బాగులేదు. ఎడమకనుబొమచాలా పొట్టి. కన్నులు చారెడేసి. మీదిపెదవికొన కొంచెము అణగారినట్లున్నది. కొంచెమేమి, కాస్త హెచ్చుగానే వంగిపోయివుంది. నోటితీరు నాకేమీ నచ్చలేదు. ఆకారము చూడగానే, మొత్తముపైని చాలా సాధువుగానూ, అమాయికంగానూ కనిపిస్తుంది. మరి, రాధ యిట్టిదా ? ఆమెలో భోగలాలసత్వమూ, చలాకీతనమూ చూసిచూడడంలోనే స్ఫురించవద్దూ ?

**19 ఏప్రిల్, శుక్రవారం :**

ఏభై రోజులకు బేటా నూరురూపాయిలు, టిక్కెట్లు ఇరవైరూపాయిలు, ఇరవైనాలుగు రూపాయలకు కొన్ని నాటకాలను కొంటిని. బ్రౌనుగ్రామరు వొకరూపాయి, మహారాజావారి ఖర్చులు నూరు.

♦ ♦ ♦

క్రిస్టియను కాలేజీ తెలుగుసొసైటీ ఏర్పాటు చేస్తున్న సభ, సాయంకాలం 4-45 ని॥లకు ; సభకు అధ్యక్షత వహించవలసినదిగా నన్నుకోరినాడు. విషయం : "వార్తాపత్రికల ప్రభావము".

శాకుంతల నాటక పఠనము తిరిగి సాగించితిని.

విదూషకుడు తక్కువ జాతిబ్రాహ్మణుడనుట స్పష్టం. మాటాడే భాషప్రాకృతము. మాంసం భుజిస్తాడు. 'కిం మొదకఖాదనే'? విదూషకుడి కిది మామూలే. హాస్యమేమంత గొప్పగా చెప్పుకో తగిందికాదు.

శరీర వ్యాయామమును కాళిదాసు కీర్తిస్తాడు. వేట దోషమే అయినా అది శరీరానికొక వ్యాయామం, కనుక దానిని సమర్థిస్తాడు.

తపోవనాన్ని విడిచి తనసైనికులను దూరముగా వుండేటట్లు కట్టుదిట్టం చేయమని దుష్యంతుడు, సేనాపతికి ఆజ్ఞయివ్వడం ; ఇది తపోజనులపై రాజునకుగల గౌరవం తెలుపుతుంది.

ద్వితీయాంక ప్రారంభంవలన, శకుంతలయెడల రాజునకు కలిగిన ప్రేమాతిశయంవల్ల అతనికి వేటయందు విముఖత కలిగిందని చెప్పడంతప్ప మరొక ప్రయోజనం కనిపించదు.

"సఖే, న పరిహార్యే వస్తుని పౌరవాణాం

మనః ప్రవర్తతే;"

ఈ మనోభావము వాస్తవిక విషయాలను నిజంగా తెలుపుతున్నదా? అలాగున తెలపకపోయినప్పటికీ, కాళిదాసు తనకాలంలో వున్న రాజులకీఆదర్శం వుండవలెనని అభిలషిస్తున్నాడా? అతనలాగున అభిలషించడం అర్థమే. గతకాలపు రాజుల ఆదర్శాన్ని తనకాలపు రాజులకు కాళిదాసు ఆపాదిస్తున్నాడు కాబోలును!

"వశినాం హి పరపరిగ్రహసంశ్లేషపరాఙ్ముఖీవృత్తిః."

యదార్య మస్యా మభిలాషి మే మనః

ఇంగుదీతైల చిక్కణ శీర్షస్య

తెలుగున 'చిక్క' అనే శబ్దము, "చిక్కణ" అనే సంస్కృత శబ్దమునుండి పుట్టినదా? "చిక్క" సంస్కృతభవమా? గురువులగు కాశ్యపులు ఆశ్రమంలో లేరుకనుకనే బహుశా దుష్యంతుడు తనను వివాహం చేసుకోవలసిందిగా శకుంతలను అడిగివుంటాడు.

రాజు, నీవారధాన్యములలో ఆరవవంతు భాగము యిమ్మని వొత్తిడిచేవచ్చును. రాజుకు పుష్కలంగా ధనం వస్తోంది. కోశాగారం నిండుగానే వుంది. దుష్యంతునిలో కొంత హాస్యచమత్కారము లున్నవి. "తపములో ఆరవవంతు."

అహోదీప్తి మతోఽపి విశ్వసనీయతా వపుషః! అథవా

ఉపన్న మేతదృషిభ్యో నాతి భిన్నే రాజని.

ఇటువంటి గుణములుకల రాజులను కాళిదాసు శ్లాఘిస్తాడు. తనకు ఆశ్రయమిచ్చిన కవిపోషకుడైన యేలిక నుద్దేశించి కాళిదాసు యీ పొగడ్తలను బహుశా చేసి వుంటాడు.

"కతిపయరాత్రం సారథి ద్వితీయే నాయుధ సధ్రీచా

భవతాసనాధీ క్రియతా మాశ్రమ ఇతి".

సరే ; అందుకని, రాజు ఆశ్రమంలో కొన్ని రోజులు వున్నాడు.

"మొదటైతే కుతూహలం పైకుబికినమాట నిజమేకాని, ఇప్పుడీ రాక్షసుల కథ వినగానే ఒక్కపిసరంత మిగల్లేదు." హాస్య సంభాషణము !

రాజధానినుండి కరభకుడు రాజ ఆజ్ఞను దుష్యంతునికి తెలిపాడు "ఆగామిని చతుర్థే దివసేనిర్వృత్తపారణ ఉపవాసో మమ భవిష్యతి. తస్మిన్ దివసే దీర్ఘాయుషా ఽ. వశ్యం సన్నిహితేన భవితవ్యమితి".

త్రిశంకురివాంతరాళే తిష్ఠ త్రిశంకుని కథ యెప్పుడు జరిగింది? శకుంతలా వృత్తాంతానికి పూర్వమా కాక తరువాతనా ? ఇది ఎనక్రానిజమ్ కాదా ?

ముందుకాలంలో ఎప్పుడోజరిగిన త్రిశంకు వృత్తాంతాన్ని శకుంతలా వృత్తాంతానికి పూర్వమే జరిగినట్టు ఇక్కడ కవి చెబుతున్నాడేమో?

మా ఖలు మాం రక్షోభీరుకం గణయసి?

మహాబ్రాహ్మణ కథమేతద్భవతి సంభావ్యతే?

**హాస్యసంభాషణము .**

~ రెండో అంకంలో చివరిశ్లోకంవలన దుష్యంతుడు భయంతోనూ గౌరవంతోనూ శకుంతలను చేపడుతున్నట్లు తెలుస్తున్నది

**20 ఏప్రియల్ శనివారం**

మొన్ననీమధ్య షణ్ముగంచెట్టియారుతో రా కెట్టు కోర్టులో కూర్చున్నాను మాతోపాటు కృష్ణయ్యగారుకూడా వున్నారు ఆయన చాలా ముసలివాడు కళ్ళు ప్రకాశవంతములు ఉత్సాహం అధికం తనకు అరవైఎనిమిదేళ్ళ వయస్సని చెప్పారు త్యాగయ్యగారు నలభైఆరు సంవత్సరాలక్రితం పరమపదించారు ఆయన గురువు రామబ్రహ్మం ఆనందసాగరమె అనే కృతికి అర్ధమేమిటని కృష్ణయ్యగారిని అడిగాను ఈ కృతిని ఆనందసాగర మీదని దేహము భూభారము రామ బ్రహ్మానందసాగరము అని చదువవలెను

భాగవతం దేశంలో నశించిపోతున్నదని ఆయన అన్నారు తమ చిన్నతనంలో ఎన్నో మంచి భాగవతపు జట్టులుండేవట హరికథ దాసులను ఆయనా షణ్ముగంచెట్టియార్‌గారూ ప్రశంసిస్తూ కొంతసేపు ప్రసంగించారు

త్యాగయ్యగారు శ్యామసుందరాంగ అనే కీర్తనను గానంచేస్తూ చనిపోయినారని శ్రీ కృష్ణయ్యగారు చెప్పినారు ఆయన ముడికి నాటి బ్రాహ్మణుడు నారాయణ అనేది శివవరం

♦ ♦ ♦

కృష్ణమరాజుగారు విచిత్రంగా సంభాషిస్తారు యివి అన్ని మాయాపురాణాలు మనుష్యుల్నినరకానికి తోసివెయ్యడానికి వచ్చినాయి అవి వినకూడదు పురాణాలు అన్ని ఐక్య కంర్యం చెయ్యవలె విష్ణుపురాణములు సాత్వికములు బ్రహ్మవి రాజసములు శివుడివి తామసములు అంతర్ముఖులు శివుణ్ణిగాని అన్యదైవములనుగాని పూజించరు మాట్లాడుతున్నప్పుడు రాజుగారికళ్ళలో మందహాసముతొలగి క్రోధభావము కనబడుతూవుండెను మనిషికి చిరుకోపం ఇట్టే నిముషాల మీద విరుచుకు పడతారు సంభాషలో ప్రశాంతత లేదు మాటలను యీడుస్తూ పలుకుతారు పలికిన మాటనే పలుకుతూ చెప్పిన వాక్యమునే చెబుతూవుంటారు మామూలుధోరణిలోనూ కోపం వచ్చినపుడూ ఇదేతీరు భూమి వణకిపోతుందేమోనన్నంత జాగ్రత్తగా ఒక్కొక్క అడుగే ఎత్తిఎత్తివేస్తూ నడుస్తూ వుంటారు ఖర్చులో యేమాత్రం వెనకడుగు వేసేదిలేదు చేతిలో ఎంతుంటే అంతా అవలీలగా ఖర్చుపెట్టేస్తారు దూబరాలావు స్వభావం మంచిది కొన్నికొన్ని సందర్భాలలో సానుభూతిని చూపిస్తారు మనిషి శుభ్రంగా వుంటారు చిన్న వేశ్యాలంపటం వొకటి డాక్టరు దగ్గరకు వెళ్ళాలన్నారు

♦ ♦ ♦

ఈ వేళ తెలుగుహార్పు రెండు సంచికలు నాకువచ్చినవి పోనీ అప్పుడప్పుడైనా దాని సంగీతధ్వని వినవస్తూవుండడం సంతోషదాయకం ఇదివరకటివలెనే నామిత్రులు ఉల్లాసముగానూ ఉత్సాహముగానూ దీనిని నిర్వహిస్తున్నందుకు ఆనందమవుతున్నది నాయరు రాకవలన విజయనగరంలో కొంత అలికిడిగా వున్నట్లుంది

నాయరును దుయ్యబడుతూ మిత్రుడు వెంకయ్య చాలా ఘాటుగానే పత్రికలో లేఖ వ్రాశాడు యువకులకుగల ఉత్సాహం దురుసుతనం తప్పిస్తే లేఖ చక్కగానేవుంది అతని మొదటివ్యాసం కంటె యిందులో కృత్రిమత్వం తక్కువే తిట్టడపు దూకుడు చాలా తీవ్రంగానూ యెంతమాత్రం తగనిదిగానూ అయుక్తంగానూ వుంది

నాయరు చాలా చిన్నవాడు మహారాజావారి దృష్టిలో పడినప్పట్నుంచీ తననుతాను అభివృద్ధిచేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు ఇక్కడ వున్నప్పుడు కొన్ని పుస్తకాలను చదవడానకు ఆరంభించాడు వెనుకంజ వేయకుండా కృషి చేసినట్లయితే యువకులలో మంచి వక్తగా రాణించగలడు

ఈ సంవత్సరం కాలేజీఫోటో నేను లేకుండానే సాగిపోయినది బహుశా యిది మంచిదే జబ్బుమనిషికి గ్రూపు ఫోటోలో స్థానంలేదు కురూపికి ఫోటో తీయడమనే శ్రమకూడా యేల

♦ ♦ ♦

నా ఉత్తరాలకు జవాబు రాసేపాటి దయ మేనేజర్లకు లేకపోయింది బహుశా నాకు తెలియచేయడానికి సంతోషకరమైనవార్త యేదీ లేదులావుంది వారిపరిస్థితి అంత అనుకూలముగా లేదేమో

♦ ♦ ♦

వెంకయ్యగారే కాక మిగిలిన విజయనగరవాసులు శ్రీ నాయరును అభినందించవలసివుంది విజయనగర వింతలు చాలా ఆసక్తిగానూ ఆహ్లాదకరంగానూ వుండవచ్చును విజయనగరంలో యిక ఊసుపోతుంది నాయరు రాకవలన కలిగిన ప్రభావంయిది ఆశ్చర్యమేమి పిల్లలు నాయరంటే యిష్టపడి తీరుతారు చక్కగా వ్రాయగలశక్తీ మాట్లాడగల నేర్పూ వున్నప్పుడు పిల్లలను ఆకర్షించవచ్చును మిస్టరు నార్టన్ అంటే విద్యార్థుల కెంత యిష్టమో చూడండి ఆయనచుట్టూ ఎప్పుడూ పిల్లలే

పాపం రామమూర్తి పంతులు ఆయన కుమారుని మురుగులు చోరీపోయినవట తెలుగు హార్పుకొక న్యూసు దొరికింది నా అనారోగ్య విషయముకూడా పత్రికకు వార్త అయినది కొత్త వీరువలె తెలుగు హార్పు మంచి పూటీమీద వున్నది ఎక్కడచూసినా దొంగతనాలూ అగ్నిప్రమాదాలూ ఉపన్యాసపు వెల్లువలు

మా బావమరదికి నామీద కోపంవచ్చింది ఇక్కడకు వచ్చినప్పట్నుంచీ అతన్దగ్గర్నుంచి నాకొక వుత్తరమైనా రాలేదు అతని ప్రయత్నాలకు నే నభ్యంతరం కలిగించాననీ మహారాజా వారు తనకు సొమ్ము బదులు యివ్వకుండా ఆటంక పరిచాననీ నామీద అతనికి కోపం ఇందువలన కలిగిన ఫలితమల్లా మా యిద్దరికీ భేదాభిప్రాయాలు కలగడమే

నా భార్యా పిల్లలూ మాడుగులలో వున్నారు వాళ్ళ యోగక్షేమాలు సైతం నాకు తెలపడావకు మా బావమరదికి మనస్కరించింది కాదు పోనీ వచ్చిన యిబ్బందేమీలేదు అప్పువ్యవహారంలో కలగచేసుకుని నావిధిని నేను నిర్వర్తించాను అందుకు నాకేమీ విచారం లేదు

ఒకనాడు మహారాజావారు అనుకూలమైన షరతుల మీద కొంతడబ్బు అప్పిస్తామంటిరి ఆయన అనుగ్రహానికి నేను తగను చాలా సంవత్సరాలయింది ఆయనవద్ద రెండువేల రూపాయలు నగదు అప్పు పుచ్చుకుని అప్పుడు మాస్థితి గతులు యేమీ బాగులేవు తీసుకున్న అప్పులో యింతవరకూ వొక్కరూపాయి చెల్లుపెట్టలేకపోతిని పుచ్చుకున్న సొమ్ము తిరిగి నేను యివ్వలేకపోతానని మహారాజావారికి తాము మాట ఇచ్చినపుడు తెలియలేకపోయెను ఈ అవకాశాన్ని యెంత మాత్రం వినియోగించుకోకూడదని నేనూ అనుకున్నాను నేనటువంటి మనిషినికానని నా స్నేహితులకూ తెలుసును కాని చేసిన రుణంతీర్చలేక పోతిని

మా బావమరిది అప్పులవిషయంలో ఖరాఖండీగా ప్రవర్తించదని తెలిశాక, నా మనసుకు మరీ బాధకలిగింది. అందువల్లనేను జోక్యం కలగజేసుకుని మహారాజావారికి నా అభ్యంతరం తెలియచేశాను. తీసుకున్న సొమ్ము తిరిగి చెల్లించకపోతే మనసుకు శాంతివుండదు. అటువంటి చిక్కులేవీ రాకుండా, ముందే మహారాజావారు నాకు మనశ్శాంతి కలిగించారు.

నేను యిక్కడకువచ్చి కొన్ని నెలలయింది. కాని ఇంత వరకూ నాఆరోగ్యంతిన్న బడలేదు. ఇంతకంటెతిన్నబడుతుందన్న ఆశనాకులేదు. ఈఅడ్మిరాల్టీ హౌసులోనే ఇదిబాగుపడనప్పుడు విజయనగరంలో అసలే లాభంలేదు. చుట్టుపక్కల వాతావరణం, యిన్ని మంచి సదుపాయాలు, గొప్పధనవంతులకూ, ఉన్నతోద్యోగులకూ తప్పించి, అన్యులకు అందుబాటులో వుండవు.

నిజమే ; నాకు ఆలోచనలు లావు ; మనసు ప్రశాంతంగా వుండక అనేక విషయాలమీదకు దృష్టి పోతుంది. పురావస్తు తత్త్వ పరిశోధలను కావించాలనే పిచ్చి ప్రబలిపోతున్నది. విజయనగరం రాజకుటుంబీకులచరిత్ర రాయాలనే తలంపు ప్రత్యేకంగా నానాటికీ హెచ్చుతున్నది. ఇందునిమిత్తమే నేను బెంగుళూరు వెళ్ళాను. ఓరియంటలు లైబ్రరీలో గంటలతరబడి కూర్చుని, ఛోగట్టా సేకరించాను. సందేహాస్పదమైన ఆరోగ్యం కలవ్యక్తి సాధ్యమైనంతత్వరలో తాను చేయగలపనిని యేదో వొకటి చేయడం మంచిది. విజయనగరకుటుంబ పూర్వీకుల వంశచరిత్రను గురించి కొన్ని కొత్త కొత్త విషయాలను చెప్పగలిగితినేని, అది నాకెంత ముదావహము !

ప్రస్తుతము నా ఆలోచనలో వున్నవి. మూడు విషయాలు : మహారాజావారి వంశచరిత్ర ; ఆంధ్రనాటకరంగం: క్షత్రియుల విద్యా సమస్య. ఈ మూడింటిని గురించి యెంతో కొంత నేను కృషి చేయగలనుకదా!

♦ ♦ ♦

కొంతదూరము వచ్చినట్టే వచ్చిమాగుర్రం మరిముందుకు కదలడానకు వెనుకాడింది ; సరే అని దానిని యింటికి పంపించి వేశాము. గయాసమాజ్‌లో జరుగుతున్న మీటింగుకు హాజరయితిని. సంగీతముపై వొక సంస్కృత పండితుడు చక్కని వ్యాసమును తెలుగున వ్రాసి చదివినాడు. అయితే దానినెవరూ అర్థముచేసుకోకపోతేమానె, ఖాతరుకూడా చేయలేదు.

సమావేశమునకు అధ్యక్షత వహించినది మిష్టరు ఆడం ; ఇద్దరు పిల్లవాళ్లు చూడడానికెంతో ముచ్చటగా వుండిరి. సభకు హాజరయినవారు అతితక్కువ,

సమావేశానంతరం రైల్వేస్టేషనుకు వెళ్లితిని. శ్రీ స్వామినాథయ్యరు మొదటితరగతి కంపార్టుమెంటులో ప్రయాణము చేస్తూవుండెను. అతను కూర్చున్న కంపార్టుమెంటులోనికి ఇద్దరు యూరోపియనులు ప్రవేశించిరి. అయ్యరుగారు రిజర్వుడు కంపార్టుమెంటులోనికి వెళ్ళిపోవలసి వచ్చినది. రైలు కదలబోతూండగా సామాను మరొకపెట్టెలోనికి మార్చడం యెంతశ్రమ ! ముందే వొకపెట్టె ఆయన రిజర్వు చేసుకోవలసింది !

**21 ఏప్రియల్, ఆదివారం :**

శాకుంతల నాటకం మళ్ళీ తెరిచాను.

"యజ్ఞకర్మ అయిపోయింది కనక సదస్యులు నాకు వీడ్కోలిచ్చారు. విరహంతో బాధపడుతున్న నేనింక యేమి చేయుదును ?" అని దుష్యంతుడు "శక్యమరవినర్దసురభిః కణ వాహీ మాలినీ తరంగణామ్ అఙ్గైరనఙ్గత ప్తైరవిరళమాలిఙ్గతుం పవనః" భైరవి.

మేఘసందేశము భవభూతి ఉత్తరరామచరితములతో సరిపోల్చి చూడవలెను

వేతసమరిక్షిప్తేలతామణ్టపేసన్నిహితయా శకున్తలయాభవితవ్యమ్ దుష్యంతుడు శకుంతల అడుగుజాడలను పరిశీలించుట సొగసుగా వుంది

అభ్యున్నతా పురస్తాదవగాఢా జఘనగౌరవాత్పశ్చాత్

ద్వారేఽస్యపాండుసికతే పదపఙ్క్తిర్దృశ్యతేఽభినవా

చెట్లచాటున పొంచుండి శకుంతలనుచూడడం ఆపిల్లల మాటలు దొంగచాటుగా వినడం రాజునకు గౌరవప్రదమా? దుష్యంతుని ఉదాత్తతకు అర్హమైనదా ?

ప్రథమదర్శనాదారభ్య పర్యుత్సుకాఆపన్నేవశకుంతలా

శకుంతల దుష్యంతుణ్ణి వొక్కసారే చూసి వుంటుందా యేమిటి పర్యుత్సుకా ఎంత సొగసుగా వుంది

పూర్వార్ధేన పుష్పశయనాదుత్థాయ అహా ఎంత సహజంగావుం దీ భంగిమ

సరిగా దుష్యంతుడు లతామండపం చెంతకు వెళ్ళేసరికి అనసూయాప్రియంవదలు శకుంతలమదన బాధనుగురించి యెందుకు ప్రసంగించాలో ? వారి సంభాషణ కొంత జరిగిన తరవాత మధ్యలో రాజు లతామండపం చెంతకు వచ్చినట్టు చూపిస్తే బాగుండును

♦ ♦ ♦

కనుబొమలు ముఖమునకు కొంత అందము కలిగిస్తూ కొన్ని లక్షణములకు దోహదముచేస్తవి ముందుకు పొటకరించుకొని బొద్దుగావుండేవి సొగసుగా వుండవు చర్మమునకు అంటుకొనిపోయినట్లుంటే క్రూరత్వమును సూచిస్తవి అతి సున్నితముగా పెన్సిలు గీతవలె వుంటే చులకనమనిషి అని సూచన క్రమముగా విల్లువలె వంగి వోమోస్తరు దళసరితనముతో కండ్లకు అతిదూరముగాగాని అతిదగ్గరగాగాని లేకుండా వుంటే అవి ముఖమునకు శోభనిస్తవి ఏకవరసగా లయినుగా కాకుండా యెగుడుదిగుడుగా సోగగావుంటే అవి తెలివితేటలకు సూచన ఉదాహరణకు అనంతాచారిగారి కుమారుడు

♦ ♦ ♦

ఈరోజున ధనం" పాటను వింటిని ఏమంత రూపసిపికాదు కాని నిఘాగాచూస్తే ఆమె ముఖవర్చస్సులో ప్రజ్ఞగల ధీమా చక్కని నమ్రత కలిసి గోచరిస్తవి నాజూకుతో మిళితమైన యీషత్తు నిర్లక్ష్యభావం వైఖరిలో స్ఫురిస్తుంది ఉదాత్తంలో పాడుతూవుంటే కనుబొమలు విడతవి పాట చాలా హాయిగాను మధురంగాను వున్నది పెటుకుతనం యేమీలేదు పాండిత్యకౌశలమునకు తోడునీడగా అభిరుచివుంది అయినా మదరాసీ స్త్రీలలో కనబడే చొరవగాని శ్రీనివాసాచారి పాటలో వుండే భావవిన్యాసముగాని యీమెలో కనబడలేదు ఆచారిగారి పాటలో రకరకాల అనుభూతులు వున్నవి కాని మధురమైన రసోత్కర్ష ఈమె గానములో గోచరించినట్లు ఆయన కంఠములోకూడా కానము ఈమె అనుభూతికిగల ఉద్రిక్తతను ఆచారిగారు అందుకోజాలరు అట్టి ఉద్రిక్తానుభూతిని ఈమె యిట్టే అవలీలగా అందుకోగలదు "ధనం పాటనువినే అవకాశం యింతకుముందు నాకు లభించలేదు ఇదే మొదటిసారి వినడం నేను సాధారణముగా వినవలసివుంటూ వుండిన గానములలో వలె యిందులో గళసాధకపు వికారము లేమీలేవు వాటిని ఆమె త్యజించినది జయించినది పాట సరళముగానూ ఆహ్లాదకరముగానూ వున్నది స్వరకల్పనలలో పాండిత్యమూ చమత్కారమూ కలవుగాని తీపితనము అంతరించలేదు

గాత్రముతోపాటు నాజూకైన మనోహరమైన వాయిద్యసమ్మేళనము వీణారవమునకు సరితూగు గొంతుక వీణావాయిద్యముకూడా మృదువుగా వున్నది ఇంతకుముందు మైసూరుశేషన్నపాట వినడం తటస్థించింది కాని ఈమె గాత్రం ఆయనగాత్రంకంటె మధురమైనది ఇక మిగిలినవారి సంగీతము ఈమెముందు దిగదుడుపు

కాని ఈమెలో ఒక లోపమున్నట్లు నాకు తోచినది వాయిద్యములో ధాటీ కనబడదు ఆరితేరిన చేతిలోపడి దిక్కులను మార్మోగించే వాయిద్యంకాదు

దర్బార్ భైరవి సావేరి యరుకులకాంభోజి పున్నాగ వరాళి మొదలైన రాగములలో కొన్ని కృతులను బహుచక్కగా పాడింది

♦ ♦ ♦

ధనం పాటకచేరినుండి యింటికివస్తూంటే తోవలో మాకొక పెళ్ళిఊరేగింపు తారసపడ్డది ఊరేగింపు చాలా బాగున్నది ముందు వొకబ్యాండు దానివెనుక వందలకొద్దీ మగవాళ్ళు రకరకాల విలువైన దుస్తుల ధరించుకుని రీవిగానడిచి వెడుతున్నాడు ఒక గుర్రంపై వొకబాలుడూ బాలకా కూచుని వున్నారు గుర్రం వెనకాల జరీచీరెలు వింత వింత పొదుల ఆభరణాలు జిగజిగ మెరుస్తూ వుంటే స్త్రీలు కొందరు వయ్యారంగా నడుస్తున్నారు పెళ్ళి ఊరేగింపు మొత్తంమీద చూడదగినదిగా కనిపించింది స్త్రీలలో కొందరు సుందరులు

గుర్రపు బండీ దిగి ఊరేగింపు తిలకిద్దామనుకుంటిని ఏమి వింతలుకంటికి కనిపిస్తాయో చెవులకు వినిస్తాయో మరి . అనుకుంటూ వుండగానే బండీవెళ్ళిపోయింది నేనాపమనలేదు

**23 ఏప్రియలు, మంగళవారం :**

క్రిస్టియనుకాలేజీలో రసెల్‌గారు షేక్స్పియరు కొరియొలేనసు" పాఠము చెప్పగా వింటిని వక్త అనజాలను ధోరణి అంతబాగాలేదు స్కిన్నరు కన్న దృఢతరమైన వాచికము కద్దు ఈషత్తు కాయికాభినయం ముఖవికాసములో మార్పులు స్కిన్నరును చూస్తిని విశాలమైన మెగుడునుదురు వాచికము మంచి స్ఫుటముగావున్నది బేకను ఉపన్యాసముల ను బోధించుచుండెను. పొడగరి బక్కపల్చని మనిషి, సౌహార్ద్రదృష్టి కలదు పిల్లలు చాలా మెల్లగా చదువుచుండిరి నెమ్మదిగా మాట్లాడుచుండిరి

రసెల్ క్లాసులోకి రాగానే పిల్లలకు పేపర్లను యిచ్చివేసినాడు కొరియొలేనసు నాటకము ప్రథమాంకము తొమ్మిదవ రంగము ఇది నిజముగా చాలా కష్టమైనరంగము వివిధపాఠాంతరములు ఉన్నపాఠాంతరములు మిక్కుటము వీటిని సమన్వయముచేయడమే దుస్సాధ్యము క్లారడన్ ప్రెస్సుఎడిషన్‌లో వాక్య విరామచిహ్నాలు ఎక్కువ రసెల్ యిలాగున చెబుతూ చిరునవ్వునవ్వాడు ఇదిగో యిది గ్లోబ్ ఎడిషన్ ఇదీ క్లారన్‌డన్‌ప్రెస్సు సంపుటినే అనుసరించిందాయె ఆరవ పంక్తిలో పాఠాంతరం షేక్స్పియరీయనుపండితులు గ్లోబు ఎడిషనే ఫాలో అవుతూవుంటారు పుస్తకాన్ని బల్లమీద పెట్టి కాస్సేపు రస్సెల్ మౌనంవహించాడు పుస్తకాన్ని తీసి చేతులతో అటూ ఇటూ ఒకమారు తిప్పాడు "ఇక్కడ డ్రగ్గున్ చెబుతున్నపదం ఏన్ ఓవర్ట్యూర్ అని నోట్సు తెరచి ప్రొఫెసరు బోధిస్తున్నాడు

"ఆయన చెబుతున్నప్రకారం ఆయన్ని మనమొక అథార్టీగా ఎంచుకోనక్కరలేదు ఆయన యాపదం అయివుంటుందని సూచిస్తున్నాడంతే ఆయన సూచన మంచిదేమరి కాని షేక్స్పియరీ యను పండితులీ సూచనను ఆమోదిస్తారో లేదో నాకు తెలియదు ఓవర్ట్యూరు అనేపదం ముందు 'సి' అనే అక్షరం లోపించివుంటుంది "

సుద్దముక్క చేతపుచ్చుకుని దాన్ని మెల్లగా ఎగరవేస్తూ కిందపడకుండా పట్టుకుంటూ రసెల్ తన ఉపన్యాసం కొనసాగించాడు " పోనీ ఆయన చెబుతున్న ప్రకారం మనమాశబ్దాన్ని పరిగ్రహించినప్పటికీ నేపేసేజి అర్థంమటకు మారదు కనక దాన్ని మనం పరిగణించనక్కర్లేదు

డ్రగ్బన్ అర్థాన్ని సమర్థిస్తూ వొక విద్యార్థి ఏదో పుస్తకాన్ని పట్టుకువచ్చాడు

"ఫొలియోసులోమాత్రం ఓవర్ట్యూర్ అనే పదమే కలదు దానినే అక్కడ సమన్వయించుకుని అర్థం చెప్పుకుంటే 'పేసేజి భావం పూర్తిగా మారిపోతుందండీ

ఓవర్ట్యూర్ అనగా ప్రెల్యూడ్ అని అర్థం

రసెల్ తన నోట్సును తిరగ్గవేస్తూ చెప్పుకువస్తున్నాడు

"మంచిది రైట్‌దొర చెబుతున్నప్రకారం ఈ పదాన్ని ఈ అర్థంలో షేక్స్పియరుకాని లేదా ఆయన సమకాలిక రచయితలుకాని ప్రయోగించలేదు

క్లారన్డన్‌నోట్సు రసెల్‌వొకసారి తిరగవేసి 'రైటు ఈ పదాన్ని కవర్ట్యూర్ అని నిర్ధారించాడు దీన్ని షేక్స్పియర్ కవర్ అనే అర్థంలోకాక ఎప్లేసాఫ్ కన్సీల్‌మెంటు అనే అర్థంలో ప్రయోగించాడు కాని కవర్ అంటేనే ఎప్లేసాఫ్ కన్సీల్‌మెంటు విద్యార్థులు నవ్వుతున్నారు సరే డ్రగ్బన్ నోట్సులో మరేదోవుంది నోట్సు తెరచి చూస్తున్నాడు నుదుటిమీద వేళ్ళనుఆనించి కొట్టుకుంటూ ఆలోచించసాగాడు మనం గ్లోబ్ క్లారన్‌డన్ ఎడిషన్లనే క్లాసికల్‌టెక్స్టుగా తీసుకోవడం మంచిదనుకుంటాను (విద్యార్థుల పేపర్లను ఇక్కడి ప్రొఫెసర్లు దిద్దుతున్నారో లేదో? సత్యనాథంగారిని కలుసుకుని యీ విషయం భోగట్టాచేసి చూతాం)

రసెల్ మాటిమాటికీ విద్యార్థులను ప్రశ్నలు వేస్తున్నాడు వివరణలను అడుగుతున్నాడు డెబైల్ అనే పదం మనకిప్పుడు వాడుకలో లేదు మనకు డెబిలిటీ అనే శబ్దం వుంది క్రియాపదం డెబిలిటేట్ రసెల్ పెదవులపై మందహాసం మనిషి పొడగరి కాని సన్నం వదనంలో ప్రసన్నత

"కొరియొలేనస్ అహంకారి అతని వ్యక్తిత్వం రానురాను ప్రస్ఫుటమౌతున్నది గర్వి క్రోధం హెచ్చు అందువల్ల తన సహచరులకు దూరంగావుంటాడు ఆరిస్టోక్రటిక్ తరగతికి చెందిన వ్యక్తులలో ఇతనిపాత్ర ద్విగుణీకృతమై రూపొందినది తన అభిప్రాయాలను త్యజించి ఇతరుల అభిప్రాయాలకు చెవిఒగ్గే నమ్రత లతనికిలేదు అహంకారం జాస్తీ ప్రపంచమే అంత" అంటూ రసెలు చిరునవ్వు నవ్వాడు

## మిష్టర్ స్కిన్నర్

విద్యార్థులకు పేపర్లను యిచ్చివేశాడు విశాలమైన నుదురు బేకను ఉపన్యాసములను పాఠం చెబుతున్నాడు "జీవితంలో వివిధ అంతస్థులకు చెందిన మానవులమధ్య వివాహం షెల్ అనేది అంత అవసరంకాదు షెల్ అంటే తప్పక జరగగలిగేదని అర్థం " స్కిన్నరు తన ఎడమ చేతిని మెడపై ఆనించుకున్నాడు మెనీటైమ్సు ఆన్ మెనీ అకేషన్స్, యీ రెండింటిలో దేనికి ప్రాధాన్యతయిస్తే బాగుంటుందో నాకు తెలియదు ఆంగ్లంలో ఎన్నో లాటిను భాషాపదాలు ప్రయుక్తమవుతూవుండేవి లాటిను క్రియా విభక్తులను విడిచిపెట్టి ఆ పదాలను ఆంగ్లంలో వాడుతూ వుండడం సంప్రదాయం ఆంగ్లక్రియవిభక్తులు అవసరం కాదనుకునేవారు

బేకన్ యీ వ్యాసాంతమందు వివాహాలను గురించి ఎన్నో అభిప్రాయాలను వెలిబుచ్చాడు. యులిసెస్‌ను గురించిన కథ."

యులిసెస్ పూర్వ వృత్తాంతాన్ని స్కిన్నరు విద్యార్థులకు చెప్పాడు.

"అయితే ఇక్కడీ కథ యులిసెస్ గుణసంపత్తికి, ఔన్నత్యానికి ఉదాహరణగా పేర్కొనబడిందా?"

స్కెన్నరుది కొంచెం చప్పిడిముక్కు.

'క్వారల్' అనే పదం లాటిను అర్థంలో వాడబడింది .... (క్లాసు రూములో కూచోవడంవల్ల నా తలప్రాణం తోకకు వస్తోంది. గదిలో ఎండ. కొంజాలు దిగువకు వున్నాయి.)

యంగ్మెన్సు హిందూ అసోసియేషనుకు వెళ్లితిని. టేబిలుచుట్టూ ఎన్నో పత్రికలు వున్నవి. టిట్‌బిట్సు, కాంటెంపరరీ ఫార్టునైట్లీ, ఇండియా ఎకాడమీ ; పబ్లిక్ ఒపీనియస్, లండన్ టైమ్సు, వీక్లీ సోషల్ రిఫార్మర్ మొదలైన పత్రికలు. గుండ్రని బెంచీలు ; తోట ఎంతో అందంగా వుంది. ప్రతి ఆదివారమూ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు ప్రొద్దున్న వేళల వేదాంత తత్త్వమును బోధిస్తూవుంటారు.

కాలేజీలో శ్రీవేదం వెంకటరాయశాస్త్రిగారు కనిపించి నాతో ప్రసంగించారు. "ఆధునిక ఆంధ్రసాహిత్యం యేమైతేనేం; దాన్ని నేను పట్టించుకోను ; నా కొచ్చిన ఆ కాస్త తెలుగూ దానివల్ల పాడైపోతుంది. సాత్త్విక స్వభావం అలవర్చుకున్న వారు ఎప్పుడూ నిజమే పలుకుతారు."

"డిబేటింగ్ సొసైటీ"కి హాజరయితిని ; చర్చనీయాంశము : "విద్యార్థులు : రాజకీయాలు." ఇద్దరు విద్యార్థులు ఫరవాలేదు, ఓ మాదిరిగా మాట్లాడారు. అధ్యక్షుడు, బొంబాయినుంచి వచ్చిన వొక ప్రొఫెసరు.

**24 ఏప్రియలు, బుధవారం :**

గుఱ్ఱం మరికదలనని పెంకితనం చేస్తున్నది. జమేదారు వద్దకు వెళ్ళాను. అతనీ ప్రాంతాలలో లేదు. దూరదేశమే పోయాడు. జట్కాచేసుకుని వెస్టు అందుకో కు వెళ్ళితిని. అక్కడనుంచి లిటరరీ సొసైటీకి పయనం.

**25 ఏప్రియలు, లక్ష్మివారం :**

గుఱ్ఱపు బండీవానిని బలవంతుణ్ణే కుదుర్చుకున్నాము. శ్రీనివాసాచారిగారు, రామనాధయ్యరు ముఖమును పరిశీలనగా చూశారు. అతడు ఆయనకు సలాము చేశాడు.

**26 ఏప్రియలు, శుక్రవారం :**

గుఱ్ఱపుబగ్గీచెడిపోయింది ; బగ్గీ తయారీ యింకా పూర్తికాలేదు.

**27 ఏప్రియలు, శనివారం :**

ఈ వేళ ఉదయమే నేను తోటలో పూవులను కోసుకుంటూవుండగా, యింజనీరింగు కాలేజీ విద్యార్థి వచ్చాడు; వచ్చి తనవిషయమై శ్రీ సుందరరావుపంతులుగారితో చెప్పమని కోరినాడు. అతనూ వెళ్ళగానే, పరమేశ్వరపిళ్ళేగారు వొక మిత్రుని వెంటబెట్టుకుని వచ్చారు. బిలియర్డ్సుగేము ఆడితిమి. తదుపరి మిత్రులకు ఎన్నో ఉత్తరాలను వ్రాస్తిని.

28 ఏప్రియలు, ఆదివారం :

ఈవేళ చాలా లేఖలు వ్రాశాను. నాయుడిగారి మిత్రుడు, దుబాసీ వచ్చాడు. బట్లరూ, అతనూ చాలాసేపు కాలక్షేపం చేశారు. నాకూ ఊసుపోయింది. బిలియర్డ్సు ఆడాం ; నాలాగే అతనూ బాగానే ఆడతాడు.

♦ ♦ ♦

మా వంటలక్క చెప్పుకోతగ్గ మనిషే ; శరీరం నలుపు, మొదటిలో ఆవిడ చాలా మంచిమనిషిఅనీ, శీలవంతురాలనీ, భక్తురాలనీ తోచినది. ఇట్టి శాంతతగలమనిషి చెన్నపురిలో యిన్నేళ్లూ వంటలక్కగావుండి, పట్నవాసపుఫక్కీ యేమీ అలవరచుకోలేదే అనే వితర్కమూ సంతోషమూకూడా కలిగాయి ; గాని యీ సదభిప్రాయ మెంతో కాలం నిలవలేదు.

కంఠం ఎంతో బాగుంటుంది. పాటలు చాలా మధురముగా పాడుకుంటూ వుంటుంది. కేవలము భక్తిగీతములే కావు. అప్పుడప్పుడు అడపాతడపా కొన్ని ప్రేమగీతాలు కూడాను. కొంత వర్ణనాచాతుర్యము, కథనకౌశలమూ కలవు. తాను యెరిగిన భోగట్టాలు చిలవలూ పలవలూపెట్టి వినసొంపుగా చెబుతుంది. చాలా తమాషాఅయిన మనిషి. గుణం మంచిదోకాదో నాకు తెలియదు. మంచిదనే అనుకుందాము.

ఆమెకొక సోదరుడు వున్నాడు. కరణీకంకోసం కోర్టుల్లో లావాదేవీలు పడుతున్నాడు. శ్రీ బి.యస్.పంతులును కలుసుకుని ఆయనతో తన సోదరునిగొడవ చెప్పుకున్నదట ! ఆ కరణీకపుసూటు తనసోదరునిపక్షమయేటట్లు చేస్తానని మా వంటలక్కకు ఆయన వాగ్దానమిచ్చాడట. ఆయన కిపుడు నెల్లూరు బదిలీఅయింది. మాటలుంటే మా వంటలక్క మనువు మరిచిపోతుంది. మాటలాడడమంటే చెవికోసుకుంటుంది. వి.యస్.ఆర్. కుటుంబాన్ని బాగాఎరుగును. వి.యస్.ఆర్. గారు వొక మధ్వులమ్మాయిని పెళ్లిచేసుకున్నారు. ఆపిల్ల మిగుల అందకత్తె. యూరోపియనులలోగాని, స్వదేశీయులలోగాని అంతటి అందకత్తె లేదు. ఆమె 'శ్రీర' జమీందారుని కుమార్తె. ఆమెకు పెద్దమనిషి అయిన పదహారోనాడు శోభనమయింది. ఆనాడే భర్త ఆమెను కాపరానకు యిక్కడకు తీసుకువచ్చేశాడు.

మా వంటలక్క యీ ముచ్చటలను చెబుతూండగా నేను "ఆమె యిప్పుడు వుందా ?" అని ప్రశ్నించాను; "ఉహు ! చనిపోయింది !"

వొకసారి ఆమెను పెనిమిటి బొంబాయినగరము తీసుకువెళ్ళాడు. రోజుకు వందరూపాయల అద్దె యింటిలో పరమున్నాడు. వొకనాడు ఆమె వొక నిలువుటద్దములో ముఖము చూసుకుంటూఉండగా అందువొక పెద్దపులిఆకృతి కనిపించి భయముగొలిపినది. అద్దములో కనిపించే ఆ పెద్దపులి మీదను దుముకుతూ మింగవస్తున్నట్లు అనిపించింది. తన మెడవరకూ భుజాలనుసైతమూ పెద్దపులి మింగివేసింది. వెంటనే తెలివితప్పిపోయి, పిల్ల కిందపడిపోయింది; ఎంతసేపటికీ స్మారకానకు రాకుండెను. భర్త భూతవైద్యము తెలిసిన వొక ముసల్మాను మంత్రగానిని రప్పించాడు. నూరుకడవల చల్లనీనీరు ఆమెమీద ధారాప్రవాహంగా గుమ్మరించమని భూతవైద్యుడు భర్తను ఆదేశించాడు. ఆ విధంగా స్నానంచేయించగా, కొంత సేపటికి ఆపిల్లకు స్పృహవచ్చింది. తదుపరి, బొంబాయి నుంచి దంపతులు యిక్కడకు వెళ్లిపోవచ్చారు. ఇప్పుడిక ఆమె 'ఆమె' కాదు. పూర్వపులావణ్యమూ, సౌరూ, సౌందర్యము నశించి పోయినవి.

ఆమెను, 'శ్రీర' గ్రామమునకు వచ్చివుండమని కన్నవారు, చాలా పర్యాయములు కబురు పంపుతూ వచ్చిరిగాని, ఆ పిల్ల పుట్టింటికి వెళ్ళలేదు.

"దంపతులిద్దరూ ప్రేమతో అన్యోన్యంగా యిష్టాపత్తుగా వుండేవారా?"

"ఉహూ ! వుండేవారుకాదు; అహ ! వుండేవారు ; అవునూ కాదూ అని చెప్పలేను."

అతని భుజములపై ఆమె ఎప్పుడూ పడుతూవుండేది. అతనొకనాడు కృష్ణాజిల్లాలో వున్న తన తోబుట్టవును చూడడానికి వెళ్ళాడు. ఇలావుండగా వొక రోజున, ఆమె వంట్లో యేమీ బాగుండకపోయెను. మనసుకు చికాకు హెచ్చుసాగింది. ఇంత మజ్జిగా అన్నమూ పెట్టమని అయిదారుసార్లు అడిగింది. అలాగున రోజల్లా అడుగుతూనే వుంది. భర్త గ్రామాంతరము నుండి తిరిగి వచ్చాక తనకు వంట్లో యేమీ బాగులేదనీ చికాకుగా వుందనీ చెప్పింది. తాను లోపలకు రాకూడదనీ, 'వెలపల' వుంటిననీ తెలియచేసింది.

తన వొంటిమీద వొక్కసారి చెయ్యివేసి చూడమని భర్తను అడిగింది. భర్త, భార్యను స్పృశించాడు. తన మెడను రెండు చేతులా దగ్గరకుతీసుకుని, తనను అక్కున జేర్చుకోవలసినదని వేడుకొంది. భర్త భుజములపై తనతలను వాల్చుకొని భార్య, యీ అప్పగింతమాటలను చెబుతూ మరణించినది : "యక్కడ శ్రీర. యక్కడ ఈవూరు. నేను మీపిల్లను. మీతో సంబంధం రావడము, మీతొడలపైని కాలము చేయడము...."

నాటినుండి ఆయనకు మనోధైర్యము సడలిపోయింది. పట్టుతప్పి మనసు చంచలం కాజొచ్చింది. ఎప్పుడు ఏది మాట్లాడినా ఆమెను గురించే ; వొకేవిధమైన కలవరింత ; వొకటే పలవరింత. ఆమె మూర్తి అతనిని వదలకుండెను. ఇది యించుమించు వొక ఉన్మాదఅవస్థ. తన భార్యను గురించి కథారత్నాకరం అనే గ్రంథాన్నీ మరివొక నవలనూ రచించాడు. ఆయన యెప్పుడూ యేదో పుస్తకము పఠిస్తూనే వుంటాడు.

ఈ విషాదగాథను విన్నంతనే నా హృదయభారము మిక్కుటమయింది. మనసులో ఏవేవో ఆలోచనలు చెలరేగి గుండెలలో చేయిపెట్టి కలచినట్లయి, కొంతసేపు మౌనముగ అలాగునే నిలబడిపోయాను. భరించలేని విషాదానుభూతి కలిగింది. బహుశా యీ హృదయవిదారకదృశ్యమును మా వంటమనిషి తన కళ్ళారా చూసింది కాబోలును !

వి.యస్.ఆర్. మొదట ఉపాధ్యాయ వృత్తినిచేపట్టి తరువాత కొన్నాళ్ళకు ప్లీడరయినాడు. వకీలు వృత్తిలో చక్కగా రాణించి చాలా ధనం ఆర్జించాడు. మంచి వ్యక్తి. తెలివితేటలుగలవాడు. "పి.యచ్.యస్."ను ప్రారంభించాడు కాని లాభించలేదు. తరువాత స్పెక్యులేషను ఆరంభించాడు.

పైన చెప్పిన విషాదగాథను మరికొందరు యింకొక విధంగా చెబుతారు. ఆ యువతి అనుమానింపబడి హత్య చెయ్యబడ్డదట ! హరిహరీ ! ఇదే యదార్థమైతే, కాదనే హృదయపూర్వకంగా నమ్ముతున్నాను, అతనే యీ అకృత్యం కావించిన నరపిశాచి అయివుండాలి. ! ఎంత ముక్కాతిమూర్ఖుడు !

ఒక కుమారుడు, ఒక కుమార్తెగల వయసుమళ్ళిన వొక పురుషుడు తన శాఖకాని సుందరాంగి, నవజవ్వని యెడల వెర్రివ్యామోహములోపడిపోయి, ఎంతో శ్రమపడి పెండ్లాడి మితిమీరిన వైభవంతో విరగబడుతూ త్యాగభోగరాయుడు లాగ వెలుగుతూవుంటే, అతనికి ఆమెనుగూర్చి యెన్నెనా అనుమానములు లోలోపల పీడిస్తూ వుంటవని యితరులకు తోచడములో యేమీ ఆశ్చర్యమూ లేదు ; ఇది అసంభవమూకాదు. నాలుగయిదు రోజులీమధ్య తప్పక అతని నొకసారి నేను చూసితీరవలెను.

ఈ గాథను వి.యస్.ఆర్. యింకొక విధముగా చెప్పాడు. చాలా రొమాంటిక్ కథవలె వర్ణించాడు : స్పెక్యులేషనులో తన ధనమంతా పోయింది. ఇక బతుకుమీద ఆశ లేక తానూ తనభార్యా ఆత్మహత్య చేసుకుందామనుకున్నారట ! తలుపులు బిడాయించుకొని రెండు విషపాత్రలను యెదట పెట్టుకొని వొక గదిలో కూచున్నారు ; ముందు ఆమె, విషం తాగింది. కాని యితను తాగేలోపుననే దంపతుల ఆత్మహత్యాప్రయత్నం నలుగురికీ వెల్లడి అయిపోయింది. అతని ఆత్మహత్యా ప్రయత్నం విఫలమయింది.

♦ ♦ ♦

జలంత్ర సూటుకు సంబంధించిన విషయాలను గురించి మాట్లాడేటందుకు రంగాచారియర్, వకీలువద్దకు వెళ్ళాను. అక్కడనుంచి మాధవనాయరుగారింటికి, తరువాత బీచి. ఇల్లు.

**29 ఏప్రియలు, సోమవారం :**

నాటకములలో నాయికలు తక్కువ. వసంతసేన బోగముపిల్ల. భూమిక ఆకర్షణీయము ; కాళిదాసుని "నాయికలు" శృంగారమునకే ప్రసిద్ధి. నాటకములలో దాంపత్య శృంగారము. సంఘటనములు తక్కువ. నాయికలేకుండా నాటకము. గ్రీకు నాటకములలో గ్రీకుల సాంఘిక పరిస్థితులు, ఇంగ్లీషులో ఆంగ్లుల జీవితము, భారతీయ నాటకములలో హిందూదేశ పరిస్థితులు కనబడతవి.

లీలావతి, సులోచన లేదా టు సిస్టర్సు ; పి. సాంబనాథన్ బి.ఏ. రచియించిన కొత్త నాటకం.

రివరెండు డి. అనంతన్ బి.ఏ. హెడ్‌మాస్టర్ సి.యమ్.యస్. హైస్కూలు.

* * *

'అడ్మిరాలిటి హౌసు' ఇపుడు ఉత్సాహంతో కనులవైకుంఠమువలె వుంది. ప్రాతఃకాలంయెంతో శోభాయమానంగా వుంటున్నది. ప్రతి ఉదయమూ ఆహ్లాదకరమే ; కోకిలమ్మకు మా తోటలోనే కాపురం. మధురమైన కంఠమునెత్తి పగటి వేళల నిరంతరము దిక్కులు పిక్కటిల్లేటట్టు కుహూకుహూమని తన కలకలస్వనముతో గానప్రవాహముతో మైమరిపిస్తున్నది. తోటలో ఎన్నో లతలు ఎన్నెన్నో పూలగుత్తులు. విరిగపూసిన మొక్కల సొగసు, లిల్లీసు, నందివర్ధనపూలు, ఫలసంపంగి, గంగరావి, మందార !

అయాంబిక్ పెంటామీటరూ, లాటిను డ్రమెటిక్ మీటరూ వొకటేనా ?

యూరిపిడస్‌ను తమిళభాషలోనికి అనువదించిన రచయిత యెవరో, దానినతను బ్లాంకు వెర్సునకెలాగున సరిపుచ్చెనో ?

ప్రాచీన భారతదేశపు నాటకములు అచ్చొత్తింపబడలేదు. అచ్చుయంత్రములుండీ, యెంత దౌర్భాగ్యము !

♦ ♦ ♦

'కారన్ హిల్' మ్యాగజిను సంపుటములను వరసగా చదువనారంభించితిని :

స్టేజి ఎడాప్టేష్టేషన్సు ఆఫ్ షేక్స్పియరు ; ఫారిన్ యాక్టర్సు అండ్ ఇంగ్లీషు డ్రామా ; ది మిజరీస్ ఆఫ్ డ్రమెటిక్ ఆథర్ ష్లే, ది యింగ్లీషు డ్రామా ; ఎలిజబెత్ అండ్ జేమ్సు ; షేక్స్పియరు యిన్ ఫ్రాన్స్ ; కాస్ట్యూమ్సు అండ్ కారెక్టర్సు; క్లి యోపాట్రా ; ఎ పెర్షియన్ పేషన్ ప్లే ; డ్రమెటిక్ సిట్యుయేషన్ అండ్ డ్రమెటిక్ కారెక్టర్సు ; వైడిడ్ షేక్స్పియర్ రైట్ ట్రాజడీస్ ; ది కామెడీ ఆఫ్ ఫ్రాన్సు ; షేక్స్పియర్ అండ్ వాల్టేర్ ; ఎ డ్రమెటిక్ టేల్ ; ఎ స్టడీ ఇన్

ఫూల్ లిటరేచర్ ; ది థియేటర్ ఇన్ చైనా ; ది ఫారిన్ థియేటర్ బిఫోర్ మోలీ ; టు(డ్రమెటిస్టు) ఆఫ్ ది లాస్ట్ సెంచరీ; బిహైన్డ్ ది కర్టెన్ ; ఆట్వే ; ది డేనిష్ నేషనల్ థియేటర్ ; ఎక్లైజెంట్ ప్లే ; ది ఆర్ట్ క్రిటిసిజమ్ ; డాంటే ; ఏన్షియన్ట్ హ్యూమరు ; ఆర్ట్ : రిలేషన్ టు మేన్ ; సూపర్ నాచురల్ ఇన్ ఆర్ట్ ; హ్యూమర్ ; అమెరికన్ హ్యూమర్ : క్రిటిసిజమ్ ఆన్ వర్డ్స్‌వర్తు ; జార్జి ఇలియట్ ; నవల్ ఎలిమెంటు యిన్ లిటరేచర్ ; సోషియల్ లైఫ్ యిన్ ఆర్ట్స్ ; ఆర్ట్ అండ్ మొరాలిటీ ; ఇంగ్లీషు రూరల్ పొయిట్రీ ; పెసిమిదం అండ్ పొయిట్రీ ; ఎథిక్స్ అండ్ యీస్తటిక్స్ ఆఫ్ మోడరన్ పొయిట్రీ ; ద్రవిడియన్ ఫోక్ సాంగ్స్ ; ది స్టడీ ఆఫ్ కెల్టిక్ లిటరేచర్.

ఇంగ్లీష్ లిరికల్ పొయిట్రీ ; పొయిటిక్ ఇమేజ్ అండ్ ప్రిమిటివ్ కన్సెప్షన్ ; క్రిటిసిజం ఆన్ వర్డ్స్‌వర్తు ; పొయిట్రీ ఆఫ్ ఇటాలియన్ డైలెక్ట్సు ; బాలెడ్ ; ఛా సర్స్ లవ్ పొయిట్రీ ; ఎర్లీ యియర్స్ ఆఫ్ షెల్లీ ; ఎ ప్లీ ఫర్ ఎరోటిక్ ఫారమ్స్ ఆఫ్ వెర్స్, ది మోడరన్ కల్చర్ ; బొహీమియన్స్ అండ్ బొహీమియనిజం ; మైకర్స్టీమన్ ; ఎనార్కీ అండ్ అథారిటీ ; నేషనల్ కారెక్టరు ; ది సోషల్ లైఫ్ ఎమాంగ్ గ్రీక్స్ ; ది బర్మీస్ హీరోయిన్స్ ; సెల్ఫ్ ఎస్టీమ్ అండ్ ఎస్టిమేషన్; థీవ్స్ అండ్ థీవింగ్ ; ది జయంట్ ప్లానెట్, ది జూపిటర్ ; ఎథిక్స్ ఆఫ్ ఫ్రెండ్షిప్ ; ది మోడరన్ ఐడియా ఆఫ్ కల్చర్;

ఫ్రెంచి ప్రెస్ ; ది జర్నలిజం ; ఎర్లీ న్యూస్ పేపర్స్ ; న్యూస్ పేపర్ ఇంటరెస్టు ఇన్ జర్మనీ.

♦ ♦ ♦

అప్పటికి సిస్టరిన్‌లా వయసు ఇరవైయేళ్ళు. ఆమె భర్త వొక సబు – మేజిస్ట్రేటు. ఆమె గదిలో ఆమె పెట్టె బేడా తదితర సరంజామా అంతావుండేది. అతని సోదరునిభార్య, అక్క అతని యింటికివచ్చి అక్కడనే వుంటూవుండేవారు. వీరిద్దరికీ ఆమె అంటే తగని యీర్ష్యపట్టుకున్నది. ఆమెను విషంపెట్టి చంపివేశారు. ఎందుకు విషం పెట్టి చంపారు? కారణం తెలియదు. వాళ్ళకు ఆమె అంటే పడేదికాదు. ఏమో? చెప్పలేను. ఆమె, తానే విషం తాగి చనిపోయిందని కొందరంటారు.

ఒకనాటిరాత్రి గదిలోనుంచి వొక అరుపు వినవచ్చెను. ఆమె గొంతుకలో విషం బలవంతంగాపోసి కాళ్ళతో మెడను తొక్కిపెట్టారు. ఆమె కేకలు అతనికీ వినిపించాయి. ఆ రాత్రి యెలాగయితేనేమి, అతనికి నిద్రలేదు. ఆమె అరుపులు, మూలుగులు ఇంటినౌకరుకూడా విన్నాడు. పొద్దున్న ఆవిడ పడకగది తలుపులు యెంతకూ తెరవబడకుండెను. ఎంత పొద్దెక్కినప్పటికీ వేసినతలుపులు వేసినట్లే వున్నాయి. గది తలుపులు తెరిచి యింటివాళ్ళు లోపలికివెళ్లి చూసేసరికి ఆమె చచ్చిపోయిపడివుంది. శవంచెంత వొకగ్లాసు కనిపించింది. పోలీసులకు ఫిర్యాదుచేశారు. పోలీసులు వచ్చారు ; వెళ్ళారు. ఆమెభర్త ఎంతోడబ్బు విరజిమ్మవలసివచ్చింది.

ఇది జరిగి యిప్పటికి వొక సంవత్సరమయింది ; అతని రెండోభార్య మూడేళ్ళక్రితం చనిపోయింది.

వి.యస్.సంగతి సందర్భాలను మంచిచెడ్డలను ఉనికిని తెలుసుకుందామని ఆమెను అడగ్గా ఆవిడ అన్నీ చెప్పింది. చెప్పి "అతనికి మంచితనం వకటి, యెటున్నూ వున్నది. పెళ్ళాలకి సంగీతం మప్పడమేమిటి, పైవాళ్లయదట పాడించడమేమిటి" అన్నది ; అలాగున వి.యస్.చేసినాడా ? అవును.

ఆఖరుకి అతనికి మేం క్షమాపణకూడా చెప్పుకోవలసి వచ్చింది. ఎంత అన్యాయం ! నాకీ ఉదంతం చెవిని పడినపుడు నా కెంతటి విచారం కలిగిందో చెప్పలేను. అవును మరి, తొడిమకున్న ముళ్ళతేమను పీల్చుకునేకదా గులాబీ మొగ్గలు వికసించేది !

30 ఏప్రియలు, మంగళవారం :

'వెస్టు అండుకో'కు వెళ్ళాను. మిస్టరు శామ్యుల్ వూళ్ళో లేడు. మిస్టరు బిషపు తాను మూడు రోజుల్లో బుక్కులను సిద్ధంచేసి వుంచుతానని చెప్పాడు. కాని బైండరు యింకా వూరునుంచి రాలేదని, అందువల్ల బైండింగుకు కొంత వ్యవధి అవసరం పడుతుందని ఫోర్‌మన్ తెలియచేశాడు. బుక్కులు తయారయిన తీరు బైండరుకు నచ్చలేదట; చక్కగా బైండుచేయాలని అతని ఉద్దేశం. అందుకు కొన్నాళ్ళాగమని గడువు యిప్పించమని ఫోరుమన్ నన్ను కోరాడు. 'సరే' అన్నాను. అక్కడనుంచి తిన్నగా మీటింగుకు బయలుదేరాను. పచ్చయ్యప్ప హాలులో సమావేశం. శ్రీ సత్యనాథం ఉపన్యాసమును సభలో చదువుతూ వుండెను. విషయం : "హిందువులకు యూరోపియన్‌లకుగల సాంఘిక సహవాసము" ఈ ఉపన్యాసము శంకరనాయరుగారు కొత్తగా ఆరంభించిన మేగజినులో అచ్చుపడ్డది. సమావేశానికి మిస్టరు చెర్చిల్ అధ్యక్షత వహించాడు.

ఉపన్యాసం పేటుకుగా వుంది. ఇంగ్లీషు దోషభూయిష్టము. భాష మహాదురుసుగా సాగింది. తెచ్చిపెట్టుకొన్న హాస్యం ; జుగుప్సాకరం ; ప్రసంగమంతా పేలవంగానే వుంది. చెప్పిన విషయంలో 'పస' లేదు. మనకూ యూరోపియనులకూ మధ్యపొత్తు కలియకపోవుటకు కారణము "యూరోపియనులకు మనల గురించి యేమీ తెలియదు. అందువల్ల వారికి మనమీద సానుభూతి లేదు." ఇదీ ఆయన ఉద్దేశం; "వారు మనలను సానుభూతితో చూడరు కనక వారికి మనలగురించి యేమీ తెలియదు. స్త్రీలను మనం నలుగురియెదటకూ తీసుకురాము ; వారికి సమాజంతో ప్రమేయం లేకుండాపోతుంది. మనలో మనకు ఐకమత్యము లేదు. ఆంగ్లజాతికి తాము అధికులమనే వొక గర్వభావం కద్దు. భారతీయులు ఇంగ్లీషువాళ్ళను పగపట్టినట్టు చూస్తున్నారు ; అందువలన వాళ్ళకు స్వదేశీయులమీద గౌరవములేదు."

అయితే యిందుపై నా ఉద్దేశాలు యివి ; స్వదేశీయులకు ఇంగ్లీషువాళ్ళకు మధ్య ఒక పెద్ద అఖాతమున్నదీ అంటే దానికి కారణాలు యివి :

1. సాంఘిక అవస్థలో మనకూ వాళ్ళకూ గల భేదం. మనం స్వతంత్రులముకాము ; వొకరిపై ఆధారపడ్డవాళ్ళం.
2. మన ఆచారములు సంప్రదాయము వేరు ;
3. ఇరుజాతులమధ్య వొకే పోలికగల అభిరుచులు, ఆసక్తి, పరస్పర సాహాయిక దృష్టి వుంటేనే తప్ప, యిరుజాతులకు చనువు యేర్పడదు.
4. విద్యావంతులైన స్వదేశీయులు ఒక వింత అయిన మనుష్యులు. అటు ఆవుపెయ్యాకాదు ; ఇటు గేదెపెయ్యాకాదు అనే సామెతవలె వుంది వీరి పద్ధతి. వీరికి వ్యక్తిత్వమూ, శీలమూ పూజ్యము. నిజమైన సంస్కృతిని, వ్యక్తిత్వమును సాధించినాడు వీరికి సమాజములో గౌరవము కలుగుతుంది. సిరిసంపదలుకూడా మనిషికి గౌరవము తెస్తవి.

1 మే, బుధవారం :

పత్రికలు నిరంతరము నిర్వహించవలసిన పనులు.

1. బహుదుర్బలులు, నిరుపేదలు అవివాహితులుగా వుండుట.
2. పిల్లలను చక్కగా పెంచి విద్యాబుద్ధులు గరిపే విధానం.
3. దొంగమందులను కంపెనీలను వెలివేయుట, చెడ్డ అలవాట్లను నిరోధించుట.
4. క్షత్రియులు, శూద్రులు తమ ఆడపిల్లలకు యుక్త వయసువచ్చిన పిమ్మటనే పెళ్ళిచేసేటట్టు కృషి సల్పుట.

పత్రికారచనలో శైలివిషయమున తగు జాగ్రత్త వహించవలసిన అగత్యము వుందా ? తప్పకవుంది. మన పత్రికారచయితలు యే పరిస్థితులలో వుంటూ తమ కృషిని సాగిస్తున్నారో, ఆ పరిస్థితులు దుస్సహమైనవి. అన్ని డిపార్టుమెంటులలోనూ చాలినంతమంది పురుషులు లేరు. వున్నవాళ్ళు బహుకొద్ది, మేనేజరూ, ఎడిటరూ ప్రొప్రయిటరూ అన్నీ వొకడే. వున్న వుద్యమాలకు సెక్రటరీ, ఉపన్యాసకుడూ వొకడే. స్కూలు మాస్టరూ, వకీలూ ఇతర ఉద్యోగ విధులు; దీనితో పుస్తక పఠనమునకు పరిశీలనకు తీరిక చిక్కదు. కొంతకాలంవరకూ వారపత్రికలు హెచ్చుఉపయోగం. దేశములో ఐకమ్యతము లేకపోవడము వొక ప్రధానలోపం.

సున్నితమైన హాస్యము. సరియైన పద్ధతులలో కల్పనా కథలు నవలలు. గుడ్డెద్దు చేలో పడ్డట్టు తర్జుమా చేయడం వల్ల లాభం శూన్యం. తెలుగుభాషలో పత్రికా ప్రచురణావశ్యకత ఎంతోవుంది. మాతృభాషలలో పత్రికలు, రాజకీయాలు, సాంఘికపరిస్థితులూ తెలిపేఒక మాన్యుయలు వంటిది అవసరం. ఇట్టిది యింగ్లీషునలేదు.

**2 మే, లక్ష్మివారం**

కాస్మపొలిటను క్లబ్బుకు వెళ్ళితిని. క్లబ్బులో మద్రాసు గ్రాద్యుయేట్ల ఎసోసియేషనువా రొక సమావేశము ఏర్పాటు చేశారు.

డాబామీద జట్టులు జట్టులుగా కూడి వారు కొంతసేపు అటూ ఇటూ పచారుచేస్తూ కాలము గడిపిరి.కానీ, కాఫీ, నారింజ, ద్రాక్ష మొదలైన పానీయాలు, సోడాలు త్రాగిరి.

అనంతరం సభ – శ్రీ రంగాచారి తమ ఉపన్యాసమును చదివిరి. ధోరణి యేమీబాగులేదు. అవసరం వున్నా లేకున్నా ప్రతివాక్యమునూ నొక్కినొక్కి పలుకుతున్నారు. చెప్పిన అభిప్రాయములలో ప్రాముఖ్యత లేనేలేదు. ఆచరణయోగ్యతా లేదు ; సభకు అధ్యక్షులు శ్రీ మణిఅయ్యరు. నాచెంత శ్రీ సుందరశాస్త్రిగారు కూర్చునివుండిరి. రంగాచారిగారు ఉపన్యసిస్తుండగా సందర్భానుసారముగా శాస్త్రిగారు విమర్శిస్తూ రిమార్కులు చేస్తూవుండిరి. ఆచారిగారు వెన్లక్‌నూ ఆయన సతీమణినీ పొగడుతూ, ప్రసంగిస్తూవుండగా శాస్త్రిగారు నాతో మెల్లగా యిలా అన్నారు : "మనవాడు సబ్ జడ్జి కావాలని ప్రయత్నాలు చేస్తున్నాడు."

ఉపన్యాసకుడు ఛాందసత్వాన్ని ఎడాపెడా విమర్శిస్తుంటే ఆయన మళ్ళీ యిలాగున వ్యాఖ్యానించారు. : "అదంతా బాగానే వుంది. మరి దీనికి ప్రత్యామ్నాయంగా మన విద్యావంతులయిన యువకులు యేంచేసినట్టు ? విద్య అనేది మన యువకులకు తగనిగర్వం,నిరంకుశత్వం తెచ్చిపెట్టడం లేదూ ?".

ఆయన తరువాత శ్రీ బాలాజీరావుగారు ప్రసంగించారు. రావుగారి ఉపన్యాసములో సబబులకన్న నవ్వించడం హెచ్చు. సందర్భశుద్ధికంటే హాస్యం లావు. ఆ నవ్వుతాలమాటలైనా ఆయనవికావు. ఎరువు తెచ్చుకున్న మాటలు. ఏదో ఒక నెపంతో పట్టభద్రులను ఆయన దుమ్మెత్తిపోశాడు. పట్టభద్రులకు స్వయంప్రతిభ లేదట. విషయ సేకరణ, పఠానసక్తి మృగ్యమట. చెన్నపునారిలోవున్న పట్టభద్రులకంటె యితర పట్టణాలలోవున్న పట్టభద్రులు మరీసనవలట ! కాలేజీ చదువులు ముగిసినతరవాత యింక పుస్తకాలజోలికేపోరు ; డిగ్రీ తీసుకున్న పిమ్మట చదువుకు స్వస్తి. అరడజను పుస్తకాలైనా చదవరట ! సామాజిక సంస్కరణగురించి వక్త చాలాచాలా చెప్పినాడు.

ఈయన ప్రసంగానంతరం వొక డిస్ట్రి మునసబులేచి నించున్నాడు. విదేశ భాషను అభ్యసించడం యెంత కష్టమో వివరించాడు. కాలేజీలలో పనికిరాని విషయాలనే హెచ్చుగా బోధిస్తారు. ఉదాహరణకు మాథమెటిక్సు వట్టి నిరుపయోగం. ఈయన ప్రసంగంలో సబబూ, సందర్భమూ వున్నాయికాని, ఒకంతకు తెమిలిందికాదు.

శ్రీ సుబ్రహ్మణ్యంగారు యిలాగ చెప్పారు : "స్త్రీ విద్య అంటే మీరేమీ పట్టించుకోవడంలేదు. మనము మన కుమారుల చదువుకుమాత్రము బోలెడుడబ్బు వెచ్చిస్తున్నాము. కాని మనకుమార్తెల చదువు నిమిత్తం మనం ఖర్చుచేసేది యేమీ లేనేలేదు."

సుబ్రహ్మణ్యంగారి ప్రసంగమయినతరువాత మరివొక ఉపన్యాసకుడు లేచాడు ; పట్టభద్రులు చేసిన కృషి తనకు ఎంతో సంతృప్తికరంగా వున్నదని, ఆయన చెబుతూ "పట్ట భద్రుల కృషి ప్రశంసనీయంగా వుంది ; ఇందుకు కీర్తిప్రతిష్ఠ లార్జిస్తున్న పరమేశ్వరపిళ్లె, కళ్యాణరామయ్యరు ప్రభృతులే వారి ప్రతిభయే ఉదాహరణ" అని పేర్కొన్నాడు.

అయితే ఈ సమావేశాని కొక నిర్దిష్టకార్యారణ కుపయుక్తమయే కార్యక్రమ మేమీ లేదు. పట్టభద్రులుకనుక వారి కొక కర్తవ్యం వుందికదా. విద్యావిషయిక సమస్యలను చర్చించడం పట్టభద్రుల ప్రప్రథమ కర్తవ్యం. నిజంగా ఆలోచిస్తే విద్యాసమస్యలపై యిపుడు మనకు ప్రతిభావంతమైన 'పబ్లిక్ ఒపీనియనే' లేదు. చరిత్రను యెలాగున బోధించాలి మొదలైన విషయాలపై ఎట్టి ఊహ కానరాదు. సాహిత్య కృషి సరేసరి. స్వతంత్రయోచన 'లేదు లేదు' అని చెప్పడమే కాని ఎందుకు లేదో ఎవరూ చెప్పరు.

మదరాసు నాటకరంగస్థితి సిగ్గుపడవలసిన పరిస్థితులలో వుంది.

ఇక పాఠశాలలో మాతృభాషలు అధ్వాన్నంగా వున్నవి. వస్తువిన్యాసంలోను, శైలిలోను శిల్పం అనేది హుళక్కి, ఒరిజినాల్టీలేదు. దారిద్ర్యం, తక్కువస్థితి; ఉన్నతస్థితికి వచ్చుటకు ప్రయత్నములు అవసరం. గర్వపడుటకు కారణములే కనిపించవు. విద్యావిధానమే దుష్టము ; లోపభూయిష్టము. అభిరుచి అన్నదే కలిగించడం లేదు. దీనికి నాయకత్వము వహించు వ్యక్తులు లేకపోవడం. దీనికితోడు ఇంగ్లీషుతో పోటీ.

మైక్రొస్కోపులో పొడగట్టుతున్న విప్లవం, దాని నైతిక స్వభావము.

**పట్టభద్రులు సంస్థలను నెలకొల్పుకోవడంలేదు.**

**మహిళలకు ఇంగ్లీషు విద్యను బోధించడం లేదు.**

మెట్రిక్యులేషనుకు పాఠ్యపుస్తకాలు ; ఆంగ్లదేశచరిత్రను, భారతదేశ చరిత్రను బోధించడం.

**మెట్రిక్యులేషను క్లాసు.**

**మోడరన్ ఇండియన్ హిస్టరీ.**

**యూరపు : ఇంగ్లీషు పిరీయడు.**

కళాశాలలో సాహిత్య పాఠాలను యింతకంటె మిన్నగా చక్కగా చెప్పవలెను. మాతృభాషలలో ప్రొఫెసరు షిప్పులు, మదరాసు తెలుగు.

ప్రాదేశిక విభేదాలు, వైమనస్యాలు. ఐకమత్యం, అవసరం. జాతిభేదంఅనేదికూడదు. వీడు ఈజాతివాడు ఆ జాతిఅనే భావం కూడనిది. విద్యారంగములో కృషిచేయుటకు, సేవచేయుటకు కాంపిటీషను యేర్పరచి అర్హులకు స్థానమీయవలెను. ఇంతకంటె జీతం హెచ్చుచేయవలె. ప్రతిభావంతులను ఆహ్వానించుటకు విద్యాసంస్థలలో వారికి యింతకంటె హెచ్చుసదుపాయములు అవకాశములు కలుగచేయవలెను.

ప్రైవేటు మేనేజిమెంటుకు సంస్థలను అప్పగించడమనేది చేయరాని ఒక మహాదోషం ; ఇంతకంటె హానికరమైన పనిమరివొకటి లేదు. నగరాలలో వున్న పాఠశాలలు కళాశాలలు యెంత అవకతవకగా. బేసబబుగా

నిర్వహింపబడుతున్నాయో వాటికి అజమాయిషీ వహించే కమిటీలు యెంత ఆరాచకంగా ప్రవర్తిస్తున్నాయో ఊహించలేం. కమిటీలకు వున్నదల్లా అహంకారం వొకటే. బాగుపడే విధాన మేదో వారింకా గ్రహించినట్టులేదు.

పచ్చయ్యప్ప కాలేజి ఎందు కంత వెలుగులోకి వస్తున్నదో అర్థంచేసుకోనడం సులభం కాదు.

ఉపాధ్యాయులు ఆదర్శప్రాయులుగా వుండాలి. మహోన్నతశీలము, వ్యక్తిత్వము, గుణసంపద అవసరము. సాహిత్యాభినివేశము కలిగించాలి. ఇప్పుడు బి.ఏ., జనరలు యింగ్లీషు వట్టి ఆరాచకమయం.

మన విశ్వవిద్యాలయాల పరిస్థితివేరు. ప్రాదేశిక ఇంగ్లీషు యూనివర్సిటీల తీరువేరు. ప్రాదేశికవిస్తీర్ణము. మెట్రోపొలిటను మనుషులే సెనేటు సభ్యులు. మిగిలినవారికి యేమీ లేదు. ఇతర నగరాలలోవున్న పరిస్థితులు సాధారణంగా యేమీ తెలియదాయెను.

యువకులు కొంతకాలం బ్రహ్మచారులుగా వుండడం అవసరం. ఉపాధ్యాయుల కళాశాలను యిప్పటికంటే మంచి పద్ధతులపై నిర్వహించాలి. ఇంగ్లీషులో పట్టభద్రుడైనంత మాత్రాన, అతను యేపనిబడితే ఆపని నేరవేర్చగలడా, ఏ విషయాన్నైనా బోధచేయగలడా, ఏ పరీక్షకయినాసరే అతడు పరీక్షాధికారిగా వుండగలడా ?

స్వదేశీయులకు ఒరిజినాలిటీలేదని స్వతంత్ర యోచనా శక్తిని కనబరుచుటలేదని చాలామంది పదేపదే అంటున్నారు. అయితే నా దొక ప్రశ్న : ఈ దేశంలోవున్న ఈ ఉపాధ్యాయులు యేమి స్వతంత్ర యోచనాశక్తిని ప్రదర్శిస్తున్నారు ? వీరికివున్న ఒరిజినాల్టీయేమి? కేవలం టెక్స్టుబుక్కులను ఎడిటుచేసుకోవడం ; మిస్టర్ థాంప్సన్ అందు కాంపొజిషను పేపర్లు తయారుచేసుకోవడం తప్పితే వీరు వెలగబెడుతున్న దేమిటోమరి ?

భారతీయ విద్యార్థులకు వారు ఎడిట్‌చేస్తున్న పాఠ్యపుస్తకాలపద్ధతి యేమిటో నాకేమీ బోధపడడంలేదు. అంతాదురవగాహంగావుంది. వారు చేస్తోన్నపని యేమీలేదు. మాతృభాషలోనూ, నుడికారపు సొంపుతోను కాంపొజిషను పుస్తకాలు రచింపబడాలని మనం ఆశించడం సహజం. ఈ ఆశయం ప్రతివారికీ వుంటుంది. కాని వాటి ప్రసక్తి యిక్కడా అక్కడా ఎక్కడా కానరాదుకదా !

ఎఫ్.ఏ. క్లాసులో చెప్పే హిస్టరీసంగతి మరి చెప్పనక్కరలేదు. భయంకరంగా కర్ణకఠోరంగా వినిపించే తప్పుల తడక యింగ్లీషుతో, అంతకంటే ఘోరమైన ఆ చెప్పేపద్ధతితో విసిగెత్తిపోయి కుర్రవాళ్ళు క్లాసులో కూచుందుకే హడలెత్తుతున్నారు.

కొందరికి తాము చెప్పే విషయమేమిటో బాగానే వచ్చును. విషయంతెలిస్తే లాభం యేముంది ? దానిని చక్కగా బోధించవద్దూ ? అదే వీరికి కొరత !

**4 మే, శనివారం :**

పాపం, ఆర్.వి. సుబ్బారావుగారి కుమారుడు ఆకస్మికముగా పోయినాడట! సాయంకాలం సరదాగా బీచికి వెళ్ళి యింటికి వచ్చాడు. రాత్రి అన్నం తిని పడుకున్నాడు. కాని పొద్దున్న చూసేసరికి మరి లేదు. పాపం, సుబ్బారావుగారు ఎంత దురదృష్టవంతులు !

* * *

క్లబ్బులో శ్రీరామశాస్త్రిగారిని కలుసుకుని ఉత్తర సర్కారులలోని విద్యార్థుల ఎసోసియేషన్ గురించి మాట్లాడాను.

క్లబ్బులో కూరెళ్ల సుబ్బారాయుడు కొడుకు వెంకటలింగం కనబడ్డాడు. ద్రవిడభాషాశబ్దశాస్త్రమును గురించి తను కెల్లెటుగారిని అడిగితే ఆయన, నన్నుగురించి ప్రశంసావాక్యములు చెబుతూ, నావద్దకు వెళ్లి తెలుసుకోమన్నారని చెప్పినాడు ; 'అయ్యా ! తమరు యిచటకు దయచేస్తే నేను రోజూ క్లబ్బుకు వస్తానని' అతనన్నాడు. ఈ చెన్నపట్టములోవాళ్ళు చాలా వింతమనుషులు !

బట్లరుదగ్గర అయిదు రూపాయలు పుచ్చుకున్నాను. యూరోపియనులనుగురించి నాటకము వ్రాసి, వారియెడల అనుకంపము కలిగేటట్లు చేయవలెను. ఈ సంకరులను యింగిలీషులు పెట్టే క్షోభకు ఆ యింగిలీషులే తలవంచుకునేటట్లు నాటకము వ్రాయవలెను.

మిస్టరు జగన్నాథం, నరసింగరావు, సిద్ధాంతి, లింగన్న.

**5 మే. ఆదివారం :**

'నేటివ్‌క్లబ్'కు వెడితిని. రాజామణిచెట్టియారుతో వొక గేమ్ ఆడాను. నెమ్మదిగా ఆడడం, పుష్, స్పిన్నూ ఇవీ అతని ఆటకు ప్రసిద్ధితెచ్చిన రహస్యాలు. ఎదురుగుండా బంతివస్తున్నపుడు, దగ్గరపడినపుడు, నీ బేటు కొంచెం వెనక్కి తీసుకుని, మీదనుంచి అరబంతిని నెమ్మదిగా కొట్టాలి. వెనక్కి గిరుక్కున తిరగాలి.

బంతి మిడిల్ పోకెట్‌కు వచ్చినపుడు స్పిన్ స్లో :

**6 మే, సోమవారం :**

నా రచన నారూపు రేఖలవలెనే వుంది.

రామమూర్తిగారివద్ద పదిరూపాయలు పుచుకున్నాను. రంగాచారిగారిని కలుసుకున్నాను. ఆయన్ని హైకోర్టుకు తీసుకువెళ్ళాను. బగ్గీవాడికి పావలా యిచ్చి యింటికి పంపించివేశాను. పావలాపెట్టి పెప్సిన్ పొడరు కొనుక్కున్నాను. జట్కా వాలాకు రూపాయి యిస్తిని.

**7 మే, మంగళవారం :**

భాషలు యేవిధముగా మార్పుచెందుతున్నవి ; దూరదూరముగావున్న ప్రదేశములలో భాషలు యేకకాలమున మారుటకున్నూ, కొన్ని కొన్ని ప్రాంతాలలో వొకేరీతిని మారుటకున్నూ, మరి కొన్నిచోట్ల యీ మారుదల వేరు వేరుగా వుండుటకున్నూ కారణ మేమయివుండును ?

మాటవరసకు మూలద్రవిడభాష దక్షిణాన తమిళముగానూ, ఉత్తరాన తెలుగుగానూ ఏలాగున మారినది? తమిళభాష మూలద్రవిడభాషకు చాలా సన్నిహితముగా వున్నదనీ, అందు గొప్పసాహిత్యం కలదనీ అన్నవాడు బర్నలుదొరే అనుకుంటాను. తమిళభాషలో గొప్ప సాహిత్యముకలదని చెప్పినంత మాత్రాన, అది అతిప్రాచీనభాష అని చెప్పడానికి వీలులేదు. అర్వాచీనసోదరసాహిత్యంకంటె ప్రాచీనసాహిత్యం పాత భాషారూపములను, పదములను యెక్కువగా నిక్షేపించుకుంటుందనడంలో సందేహమేమీలేదు, కాని తమిళసాహిత్యం తెలుగుసాహిత్యంకంటె అత్యంత ప్రాచీనమైనదని గట్టిగా చెప్పలేము.

భాషలు యేలాగున మారునను ప్రశ్నకు సమాధానము యీ విధంగా తేలుతోంది ; కొన్నికొన్ని ప్రదేశాలలోని ప్రజలు కొన్ని కొన్ని ధ్వనులను పలికేటపుడు వారి ఉచ్చారణాంగాలైన తాల్వాద్యవయవాలనుబట్టి భాషా పదములు మారుతూ వుంటాయి. ఇదేరీతిని ప్రజల అలవాట్లు, ఆచార వ్యవహారాలు, మతము, వారిపాటలు, సంగీతము,

సాహిత్యము మొదలైనవి భాషలపై తమ ప్రభావాన్ని స్పష్టముగా నెరపుతున్నాయి. ఈ లాగునే ఇరుగుపొరుగు ప్రదేశాలలోవున్న భాషలు.

ఒక భాషాకుటుంబములో అనేకరూపాంతరిత పదములు. ఒకేజాతి భాషలో పలు రూపాంతరములు.

పచ్చయ్యప్ప కాలేజీలో అడుగుపెట్టేసరికి మాథమెటిక్సు లెక్చరరు కనిపించి "వొహోహో ! ఎప్పుడు రావడం ఏమిటి కథ ?" అంటూ పలకరించాడు. నిజానికి ఆయన యెవరో నాకు తెలియదు. ముక్కూ మొహమూ ఎరుగని వొక అపరిచయస్థుడు అంత కలుపుగోరుతనంగా పలకరించినపుడు మనం తికమకలలో పడతాం ; ఇదొక తమాషాఅయిన పరిస్థితి.

♦ ♦ ♦

**మద్రాసు మ్యూజియం ; ప్లేటు నవంబరు 13**

సూయిలు దొరగారు తలచినట్లు రెండు దానాలుకావు. మూడు.

**9 మే, లక్ష్మివారం :**

రామస్వామిచెట్టి, కృష్ణస్వామిచెట్టిగార్లను 'రఫ్‌పేపరు' వుంటే కావాలన్నాను.

**10 మే, శుక్రవారం :**

నాలుగణాలు నౌకరుకు. నాలుగణాలు బగ్గీవాడికి అయిదురూపాయలు లిటరరీసొసైటీకి, రూపాయిన్న రబిలియర్సు, ఒకరూపాయి జింజరు, సోడా. మిగిలిన సొమ్ము శ్రీనివాసాచారివద్ద వుంది.

**11 మే, శనివారం :**

బట్లకుదగ్గర ఆర్రూపాయలు తీసుకున్నాను. బ్యాంక్వెటింగుహాలుకు వెళ్లాను. టిక్కట్లుకు అర్రూపాయ లిచ్చాడు. ట్రిప్లికేను థియేటరులో నాటకప్రదర్శనం.

షేక్స్పియరు సీనులు. ప్రదర్శకులు మిస్టర్ అండ్ మిసెస్ బి. క్రాఫ్టన్, విల్మర్, హాలు కిటకిటలాడుతూ వుంది. మన చెన్నపురి పెద్దలు, భారతీయులు, యువకులు, వకీళ్లు, పలువురు విద్యార్థికులు ప్రదర్శనానికి హాజరయిరి.

ఫాల్‌స్టాఫ్‌వేషం బాగులేదు. వుండవలసినంత పెద్దవాడుగాగాని, లావుగాగానిలేడు. వైఖరి యేదోవొకలాగవున్నది. వాచికము "వప్పగింత" వలె వున్నదితప్ప "అభినయముగా" తోచలేదు.

మర్చంటాఫ్ వెన్నిస్‌లో నటించిన సూయిలుదొరకు పోర్షను నోటికిరాదు. టేబిల్‌మీద పుస్తకాన్ని చూసో, మరి పోర్షనుకాయితం చూసో చెప్పలేనుకాని, దానిని చదువుతూ అభినయించాడు. షైలాక్ వేషము 'ఫరవాలేదులే' అనిపించింది. కాని పోర్షియో పాత్రధారిణి విల్మర్‌సతి 'వోహో' అనిపించింది. అభినయం ప్రశంసనీయం. ఆమె అసలు చాలా సొగసైన మనిషి. వేషధారణము యుక్తము, అభినయం సహజముగానూ, భాసమానముగానూ వుంది. వాచికం స్ఫుటముగానూ, గణనీయముగాను వున్నది.

ఒథెల్లోవేషం పరమదౌర్భాగ్య మనిపించింది. వికారమైన వేషధారణ. నటన పాడుపాడు ! డెస్డెమోనా అంతబొత్తిగా బాగులేకపోలేదు !

మళ్లీ విల్మర్‌సతి ఎమీలియావేషంలో కనిపించింది అత్యద్భుతమనిపించింది ఎమీలియా ఆహార్యము ఎంత సొగసుగా వున్నదో వర్ణించిచెప్పడం కష్టం దుస్తులు అలంకరణ బాగుబాగు అనిపించినవి విల్మర్‌సతితప్ప యీజట్టులో చెప్పుకోతగ్గ వారెవరూలేదు ఆమె ఒకర్తెమాత్రమే చక్కగా నటించగలదు మిగిలినవారి ప్రసక్తి అనవసరం

ఇంటికి వెడుతూ వెడుతూ ఒకసారి ట్రిప్లి కేను థియేటరుకుపోయి తొంగిచూశాము హాలులోకి అడుగుపెట్టీపెట్టగనే శ్రీనివాసాచారిగారితో పరియస్థులొకరు మమ్మల్ని మర్యాదగా పలకరించి మొట్టమొదటి సోఫా చూపించి అక్కడ కూర్చోండని కోరినాడు శ్రీనివాసాచారిగారికి అన్ని నాటకపు జట్టులతోనూ మంచి పరిచయం కద్దు నాటక కంపెనీలవారు యీయన పేరు చెబితేనే మన్నన చేస్తారు మేము సొమ్మేమీ చెల్లించనక్కర్లేదని ఆ కంపెనీ మనిషి అన్నాడు అతను కోరిన ప్రకారం ముందు వరసలో సోఫాలమీద కొంతసేపు కూచుని యింటికి వెళ్ళిపోయాము వెళ్ళిపోతూ టిక్కట్టు సొమ్ము వచ్చివేశాం

భవనము చాలా పాడుగా వుంది తెరలు అంతకన్నా పాడు వేషములూ అభినయమూ మరీ దరిద్రం అందరి దుస్తులూ పాడుగానే వున్నవి చెప్పుకుంటే సిగ్గు సిగ్గు హిరణ్యక్షుడి వేషం కన్న చెన్నపట్టంలో యే ముష్టివాడి వేషమేనా బాగుంటుంది తగిన తరిబీదు వుంటే ప్రహ్లాద వేషం నటించిన పిల్లవాడు పనికి రావచ్చును

ఉత్తరదేశపు బాణీలో నటి వికారంగా పరమ రోతపుట్టేటట్టు పాడుతూ డ్యాన్సు చేసింది ఉత్తరదేశపు పాటలకు నృత్యాలకు యిది వొక పేరడీవలె కనిపించింది సూత్రధారుని విగ్రహం పుష్టిగావుంది పాట కొంతవరకు నయం గొంతుక ఫరవాలేదు నటీ సూత్రధారుల సంభాషణ మొదట తెలుగు పద్యాలలో కొనసాగింది పద్యాలు భాగవతంలోనివి పద్యాలు పాడినతరవాత వాటిఅర్థం తెలుగున వివరించి చెప్పారు ఇంచుమించు ఇది కళ్యాణ రామయ్యరు తమిళ సంస్కృతముల కలగలుపువలె వుండెను

ప్రహ్లాద నాటక ప్రదర్శనలలోని నటుల అభినయమును ఏదైనా వొక 'స్కెచ్' లో వర్ణించవలెను

♦ ♦ ♦

రైల్వేస్టేషనునుంచి 'పేడ్స్' అందినవి

♦ ♦ ♦

ది యూరేషియను డ్రామా ఒక గొప్ప సివిలియను ఒక కొండజాతి స్త్రీని వుంచుకుంటాడు అతనికి ఇద్దరు సంతానం ఈ ఇద్దరూ ఇంగ్లండులో పెరిగారు పరిస్థితుల ప్రభావంవలన తల్లీ పిల్లలూ ఒకరికొకరు దూరమౌతారు అతను ఆమెతో సంబంధాలను తెంచుకుంటాడు అతను ఎక్కడవున్నాడో అతని ఆనుపానులేమో ఆమెకు తెలియదు ఒక ముసల్మాను వర్తకుడు ఆమెకు ధనం యిస్తూవుంటాడు ఇంటికి కావలసిన వస్తువులు తెచ్చి పడవేస్తూవుంటాడు ఇతను మొదట బట్లరు తర్వాత వర్తకుడైనాడు కొంత కాలానికి ఆమె కొడుకూ కూతురూ తిరిగి వస్తారు కొడుకుకు తన తల్లి కొండజాతిస్త్రీ అని మొదట తెలియదు తన తండ్రి చనిపోయాడని అనుకుంటాడు కాని అతను యిండియాకు రాగానే పరిస్థితులన్నీ అవగాహనవుతాయి ఇంటికి వచ్చే సప్లయిలు కొన్నిరోజులనుంచి ఆగిపోతాయి కూతురు పనిచేస్తూవుంటుంది ఆమెకు చదువు వచ్చును సప్లయిలు బంద్ అయినపుడు అట్టి సన్నివేశంలోనే పిల్లలిద్దరూ ఇండియా చేరినట్లు చిత్రించేదా ?

ఆ యూరోపియను వొక పిల్లను పెళ్ళాడతాడు. అతనికి పిల్లలు కలుగుతారు. దగుల్బాజీ, ఇంకొక పిల్లను ప్రేమిస్తాడు.

**12 మే, ఆదివారం :**

ఇండియను యాంటిక్వరీ వాల్యూములను చాలావాటిని చదివితిని.

**14 మే, మంగళవారం :**

క్రిస్టియను కాలేజీలో హిస్టరీ ప్రొఫెసరు కెల్లెటుగారిని కలుసుకున్నాను. ఇద్దరం ఒక గంటకుపైగా ఎన్నో విషయాలను ముచ్చటించుకున్నాం. కాలేజీలలో ఆంగ్లసాహిత్యాన్ని బోధించేటపుడు ఎన్ని అవకతవకలు జరుగుతున్నవో, బోధనా పద్ధతులు ఎంత లోపభూయిష్టముగావున్నవో వివరముగా చెప్పాను. విద్యాబోధన ఆలోచనలను పురిగొల్పేదిగా యెంతమాత్రం వుండడంలేదు. అభిరుచీ, విమర్శనా, అసలు లేనేలేదు.

మాతృభాషల సాహిత్యం గురించీ, దేశచరిత్ర రచనావశ్యకతను గురించీ ప్రసంగించాను. తెలుగు పాఠ్యగ్రంథాల నిర్ణయంలోనూ, పరీక్షాధికారుల నియామకంలోనూ జరుగుతున్న పాక్షికత్వమును గురించి నొక్కి వక్కాణించాను. విశ్వవిద్యాలయ, బోధనాపద్ధతుల దోషాలు దేశమంతటా విస్తరిస్తున్నాయి.. మదరాసు తెలుగు. రామనుజాచారి, మాధవరావు, వెంకటరాయశాస్త్రి, శ్రీరామశాస్త్రిగార్లను గురించి కెల్లెటుతో ముచ్చటించాను. అప్పుడు కెల్లెటు యిలా అన్నాడు : "చాలా ఆలస్యమైపోయింది. ఈ ఏడు వ్యవధిలేదు. మీదటికి ఏదైనా తప్పకుండా ఏర్పాటు చేస్తాను" ఇందుకు నేనిలా సమాధానమిచ్చాను. "నాకైతే అట్టి పదవి అక్కరలేదు. అలాగున నేను కాలము వ్యర్థము చేయజాలను. కాని మా ప్రాంతమువారిని కూడా, తగిన పండితులను, అట్టి పదవులకు నియమించవలెను. కారణమేమంటే యిప్పుడు పరీక్షా పత్రములను బట్టి పాఠ్యక్రమము నిర్ధారిత మవుతున్నది కనుక."

చరిత్రను బోధించే పద్ధతులను గురించి సంభాషణ జరిగింది.

"పోలికలూ, భేదములూ నిరూపిస్తూ గ్రీసు రోము రాజ్యముల చరిత్ర మీరెందుకు వ్రాయరాద"ని కెల్లెటుగారు నన్ను ప్రశ్నించారు.

**"అబ్బో ! అది నా శక్తికిమించిన పని."**

**"కాదు కాదు. మీరే వ్రాయగలరు !"**

మేమిద్దరమూ అనేక విషయాలను గురించి ప్రసంగించుకున్నాము. నావంట్లో బాగుండలేదు. లేకపోతే ఆ సంభాషణ అంతా వ్రాసేవాడినే మరి !

**14 మే మొదలు 24వ తేదీ వరకు :**

పది పదకొండు రోజులనుంచి వొంట్లో యేమీ బాగులేదు. "బ్రోంకైటిస్" వ్యాధి పట్టుకుని పీడించసాగింది. బాధలావు. రోగంతోటే సరిపోయింది. పనేమీ కొనసాగింది కాదు. చేసిన మంచి కార్యం వొకటే. మహారాజావారి పుస్తకాలు తయారుచేసి వెస్ట్ అండ్‌కో వారు పంపించివేశారు. శ్రీ వెంకన్నగారు నన్ను చూడ్డానికి వచ్చారు. అతనంటే నాకు చాలా అభిమానం. మంచి సాహిత్యాభిరుచి వున్న కొద్దిమంది యువకులలో ఇతను వొకడు ; మనదేశంలో ఇలాటి యువకులు అరుదు.

**28 మే, మంగళవారం :**

బెల్టు కొలతలు, టేబుతో 32 అంగుళముల కైవారం గల, అంతకు కొంచెం తక్కువగా వుంటే మరి వకటి గూడా తెస్తే బాగా వుంటుంది.

కంచు అమాం దస్తా. బి. సూర్యనారాయణరావు గారికోసం సంస్కృతం గ్రంథాలు, నోట్సు ; శంకరనారాయణ డిక్షనరీ, లెదరు బెల్టు ; ఒక జత ముత్తెపు గుండీలు, జాకెట్టు క్లాత్స్ ; ఫేన్సీ వస్తువులు ; అలారం టైంపీసు.

**3 జూన్, సోమవారం :**

డాక్టరు కీలా&హరనుదొరకు ఉత్తరం వ్రాశాను. గరిసెలూరు శాసనం గురించి శ్రీ సుబ్రహ్మణ్యం, విజయరాఘవాచారి, సీతారామయ్య ప్రభృతులకు లేఖలు వ్రాశాను.

**4 జూన్, మంగళవారం :**

డాక్టరు భండార్కరుకూ, డాక్టరు ఫ్లీటుదొరకూకూడా ఉత్తరాలు రాశాను.

**5 జూన్, బుధవారం :**

రాచూరు.

'వెస్టు అందుకో' కు వెళ్ళాను. "టైప్సు విరగదీసి మీకెప్పుడుకావలెనో తెల్పితే అప్పుడు పంపించివేస్తాము. మా సామానుమేము వుంచుకుంటాము" అన్నాను మిష్టరు బిషప్పు.

"కొంపదీసి విరగదీయడం మాత్రం వొద్దు. మొత్తం టైప్సంతటికీ సొమ్ము యిచ్చుకోమంటారు."

"ఫ్రేమూ మిగతా సామాను మావేకదండీ; అలాంటప్పుడు అంతా యెలా యిచ్చేస్తాం"

"పోనీ ఓపని చేయండి. ఫ్రేమూ, మిగతా సామానూ, కంపెనీ టైప్సు అన్నీ మా రాజావారికి ఖరీదుకివ్వండి; అలాచేస్తే నాకెంతో సంతోషం."

"ఫస్టుపార్టులోని టైపూ, మార్జినలు నోట్సులో వాడే టైప్సూ అన్నీ మావేకదండీ".

"అవనీండి ! అయితేనేం? మా కోరికను మీరు మన్నించవచ్చుకదా ! ఆయనకి కావాలంటే కొత్త సరుకే కొనుక్కోవచ్చును."

"అవునవును. సరే; అయితే అంతటికీ మేం ధరకట్టాలే!"

"సరే ; కడితేకట్టండి, పోనీ!"

"కానీ, ఫ్రేముల్లోవున్న యీటైప్సు మహారాజావారేం చేసుకుంటారు?"

"ఏమో ; అవన్నీ నాకేం తెల్సు; బహుశా స్టెనోటైపింగుకు వీటిని వాడుకుంటారేమో! అలాఅయితే మాత్రం మీ ఆఫీసులోనే చేయిస్తాంలెండి".

"ఆయన తమపుస్తకాన్ని అక్కడే అచ్చొత్తించు కుంటారు కాబోలు!"

"బహుశా అందుక్కాదేమో లెండి; అక్కడ మంచి పనివాళ్ళు లేరు. బుక్కు చాలా విలువైనది. అందువల్ల యిక్కడ కంటె అక్కడే స్టెనోటైపు చేయించాలని అనుకుంటున్నా రేమో మరి! ఇక్కడ కంటె అక్కడ సులువు హెచ్చు. యిక్కడే మిషను అమిరిస్తే జాగా అంతా ఆక్రమిస్తుంది."

"సరేలెండి. మరి ఎల్లోక్లాత్ కావాలంటిరే! దాన్సంగ తేమిటి?"

"మీరు సప్లయిచేస్తే బహుసంతోషం!"

"అది యింకా ఎప్పటి కొస్తుందో తెలియకుండావుంది. ఇప్పట్లో బహుశా రాదేమోనండీ!"

"అయితే నేటివ్ ఫర్మ్సులో అడిగిచూస్తాను"

"అబ్బే! వాళ్ళదగ్గిరుండదు. అయితేనేం, అడిగి చూడండి. మేమెప్పుడూ వాకబు చేయలేదుమరి"

"ఆc అదే మరీ ! పసుపురంగు క్లాతుమీద గిల్టక్షరాలు సొగసుగా వుంటాయి కదాని!"

♦ ♦ ♦

అబ్బయ్యశాస్త్రి వొంట్లో యెలావుందో డాక్టర్నడిగాను. చిరంజీవికీ, నరసింగరావు పంతులుగారికీ ఉత్తరాలు రాశాను.

| | | | |
|---|---|---|---|
| వేదాంతసారం | ..... | ..... | 2 - 0 - 0 |
| ది ఫోక్ సాంగ్స్ | ..... | ..... | 2 - 0 - 0 |
| ఒరిస్సా అండ్ టెంపుల్ ఆఫ్ జగన్నాధ | ..... | ..... | 0 - 12 - 0 |
| గ్రీక్ అండ్ గోథే | ..... | ..... | 3 - 0 - 0 |

♦ ♦ ♦

డాక్టరు హుల్ట్సుదొర వ్రాసిన ఉత్తరానికి నకలు :

ఉదకమండలం, 5, జూన్ 1895.

**డియర్ మిస్టర్ అప్పారావు**

ఈ నెల 3వ తేదీన మీరు వ్రాసిన ఉత్తరం నిన్ననే నాకు అందింది. వచ్చేనెలలో మీరెక్కడ వుండేదీ, దయవుంచి మీ చిరునామా తెలపండి. బెంగుళూరుకు తిరిగి వచ్చాక, ఆ మూడుశాసనాలను చూసి (ఉదయగిరివి రెండూ, పాలకొల్లు శాసనము వొకటీ) ప్రచురణ నిమిత్తం మీకు వాటిని తప్పక పంపిస్తాను.

మీ లేఖలో పేర్కొన్న కృష్ణరాయ కాలపు రెండు శాసనములను ప్రచురించడానికి ప్రొఫెసరు కీల్హారను తలపెడుతున్నట్టు కనబడదు. ఈశాసనాలలో ప్రస్తావింపబడిన విషయం గురించి మీరొక మెమోరాండము పంపించినట్లయితే దానిని నేను సంతోషపూర్వకంగా డాక్టరు కీల్హారను ముందు పెడతాను. అపుడు ఆయన శాసనాలను ప్రచురించడానికై ఉద్దేశపడవచ్చును ; అలా కానిపక్షంలో మీరు వాటిని ఎడిట్ చేసి ప్రచురించడానికై వాటిని వెంటనే మీకు పంపించివేయగలను.

మీరన్నట్టు నాసిక్ పేపరు మేమే సప్లయి చేయాలంటే అది నాకెంతో శ్రమ. లోకలుయేజంట్ల దగ్గర మీ కాపేపరు దొరకడం కష్టం కాదనుకుంటాను.

**10 జూను, సోమవారం :**

బజారులో కొనవల్సిన వస్తువులు : సగ్గుబియ్యం, పట్కిపంచదార, పాతబియ్యం, నెయ్యి, పేపబెత్తుపెట్టె, అగిపెట్టెలు, స్టౌమీది సన్నపాటి గిన్నెలు రెండు, లాంతరు.

**16 జూన్; ఆదివారం :**

| | |
|---|---|
| రామస్వామిచెట్టి | 57 - 12 - 0 |
| నా సాదరు | 49 - 14 - 0 |
| వెస్టు అండ్‌కో బైండరుకు | 2 - 10 - 0 |
| వంటలక్కకు | 10 - 0 - 0 |
| పాలవాడికి | 6 - 0 - 0 |
| పెరుగు | 1 - 0 - 0 |
| నారాయణమూర్తి మందులబిల్లు | 6 - 0 - 0 |
| డాక్టరు బిల్లు | 90 - 0 - 0 |
| మందులు | 40 - 0 - 0 |
| పుస్తకాలు | 31 - 0 - 0 |

**కొనవల్సిన సామాను :**

బొత్తాయిలు

నెక్ టై

పొత్తికడపుపై కట్టుకునే బెల్టు

**19 జూన్, బుధవారం :**

మబ్బుల వాతావరణం మనోహరంగావుంది. ఇంతకు ముందు చలిగాలి రివ్వున వేసుకొచ్చేది.

**20 జూన్, గురువారం :**

ఈ రోజు ఉదయానే బెజవాడ చేరుకున్నాను. ఇక్కడ విజయనగరం రాజకుటుంబానికి చెందిన భోగట్టా కావాలసినంత "శ్రీకృష్ణవిజయం" రచించిన రాజకవి అత్యంత ఆత్మీయుతతో వర్ణించిన యింద్రకీలాద్రి చేరువనవున్న బెజవాడ యెంత మనోహరం నగరం ! ఆ కొసనున్న కృష్ణాబ్రిడ్జినుంచి ఎర్రని కెరటాలతో ప్రవాహం ; నగరంచుట్టూ వెనకభాగాన 'సెట్టింగ్' వేసినట్లు ఎత్తయిన కొండలు ; లోయలో ప్రతిష్ఠింపబడిన కనక దుర్గగుడీ, రైల్వేస్టేషను చెంతవున్న పర్వతంమీద కట్టబడిన బంగాళాలు ; చూడ్డాని కీనగర శోభయెంత ఆహ్లాదంగావుంది! కనుల వేడుక !

పాటిబండ వెంకట రమణయ్య పంతులుగారియింట నా బస. ఆయనకి నేను అతిథిని. కొండలకు దూరంగా గవర్నరు పేటలో వారియిల్లు ; వాసయోగ్యంగానూ, హాయిగానూ, ఎంతో సదుపాయంగానూ వుందీ యిల్లు. పంతులుగారు సంస్కృత పండితులు. తరువాత తరువాత యింగ్లీషు నేర్చుకున్నారు. ఇప్పుడీవూళ్ళో యీయన లీడింగు ప్లీడరు. ఇల్లు సొగసుగా యిమ్ముగా వుంది. గాలీ, వెలుతురూ పుష్కలం. గదులు చాలినన్నీ. ఇన్ని గదులున్నా భవంతి అందమేమీ చెడగొట్టలేదు. భవనం యెక్కచ్చిగా వుంది.

నే నున్న కిటికీ తెరచిచూస్తే యెదురుగా బందరు కాలువ, కాలువవెనక వరసలు వరసలుగా చెట్లూ కనిపిస్తవి. ఇటువంటి యిల్లువొకటి కట్టుకొని అందులో కాపురముండాలని నాకోరిక, యిల్లు వొకటి కట్టుకొని

అందులో కాపురముండాలని నాకోరిక. ఏడాదికీ కొన్నినెలలైనా యిటువంటి యింటిలో విశ్రాంతి తీసుకోవాలని మనసు, తీరిక అనేది చిక్కి కాలం నా చెప్పుచేతల్లోవుంటే యిటువంటి యింట్లో 'రిటైరు' అవుతాను. రిటైరు కావడం! విశ్రాంతి ! ఎంత వింతైనమాట ! ఎన్నడూ విననిమాట ! ఈమాట కేమన్నా అర్థంవున్నదా ! శరీర దారుఢ్యం పూర్తిగా సడలిన నావంటివాడికి యిది ఎంత వింతమాట ! ఆరోగ్యం బాగున్నా లేక పోయినా బలవంతుడైనా దుర్బలుడైనా మనిషి ఎలాగూ రిటైరుఅవుతాడు. అప్పుడు ప్రశాంతమైన ఒక యింట్లో గడిపే అవకాశం వుంది. కాని ఎప్పుడూ యేదోఆలోచిస్తూ యేదో రాస్తూవుండేనాకు 'విశ్రాంతి' అనేది కల్ల. నా మెదడు ఎపుడు పనిచేస్తూనే వుంటుంది. ఈ కృషినుంచి నేను తప్పించుకుంటాననేది పొసగనిమాట. డాక్టర్లు ఎన్ని సలహాలిస్తేనేమి ! వాటిదారి వాటిదీ ; దీనిదారి దీనిదీ ! శ్రమ అధికమై, ఇక నేనేపనీ చేయజాలని పరిస్థితే కలిగినప్పుడు, నాకిక బతుకుమీద ఆశలేదు. పనిచేయలేకపోవడమనేది ఒక విషమపరిస్థితి.

కాని నా కిపు డొక విషయం జ్ఞాపకానకు వస్తున్నది. ముసలికాలంలో దేవరాపల్లిలోనో, లేదా మరో గ్రామంలోనో, 'రిటైరు' కావాలని నా కొకప్పుడు వుండేది. ఏడాదికీ నాలుగయిదు నెలలో పోనీ ఏడాదల్లానో అక్కడే కాలం వెళ్ళబుచ్చాలని ఒకనాటి నా తలంపు.

♦ ♦ ♦

అన్నన్న ! భూపతిరాజు కత్తెర్లనీ దీపపుమసినీ నా పెట్టెలో పెట్టడం మర్చిపోయాడే !శాసనపు పలకల్ని కాపీ చేసుకుందుకు అవసరమైన వస్తువుల్ని వేటినీ మరవకుండా అన్నీ 'నాపెట్టెలో పెట్టండి బాబూ' అని అందరికీ మరీ మరీ చెప్పానాయె ! అవీ యివీ అన్నీ కలిపి విజయనగరం 'పెక్' చేసి పంపించేశాడు.

రామస్వామిచెట్టి కంపెనీలో వున్న గణపతిచెట్టి నాకు స్నేహితుడు. దుకాణదారుడికీ, బేరగాడికీ వున్న పరిచయం వంటిదికాక మా యిరువురికీ మంచి స్నేహమే వుంది. మద్రాసులో నే నున్నన్నాళ్ళూ నాతో యెంతో యిష్టాపత్తుగా వున్నాడు. ఏ వస్తువడిగినా సప్లయిచేసేవాడు. రైలుకొచ్చి దిగబెట్టేడు. సామానూ అవీ కట్టుదిట్టంగా పంపించాడు. అతనే స్టేషనుకు రాకపోతే, యిబ్బందికలిగేది. రైలు తప్పిపోను ! అతని ఫర్ము రాణింపులోకి రావాలని నా కోరిక. పట్నంలో అందరి అభిమానాన్ని సంపాదించుకోవాలి. యూరోపియను ఫర్ములు దీనిముందు మందులోకి రాకుండాపోవాలి. ప్రింటింగులో వాటిని యిప్పటికే వెనక్కితోసేశాడు. పాయింటుటైపులో ఒక బుక్కు అచ్చువేయాలని గవర్నమెంటు సూపరెండెంటు ఊళ్లోని అన్ని ప్రెస్సులకూ వెళ్ళాడు. మద్రాసులో అన్ని అచ్చాఫీసులకు ఆబుక్కు పంపించిచూశాడు. స్పెసిమను కాపీలను అచ్చు ఆఫీసులన్నీ తయారుచేసి గవర్నమెంటుకు పంపించాయి. కాని అన్నింట్లోకి ఇతని ప్రింటింగే కుదురుగా వున్నదని ఎంచుబడి చేశారు. అయితే, రామస్వామిచెట్టి షాపు చూసీచూడగానే కొట్టవచ్చినట్టు డాబుగా కనిపించదు.

చెట్టిది గౌరవమర్యాదలున్న కుటుంబం, పెద్దింటివాడు. తగు మనిషి. బాగా పైసా, పరకా వున్నవాళ్ళే, వాళ్ళ పినతండ్రి మదరాసులో షాపు పెట్టాడు. ఇదే చెన్నపట్ణానికి మొట్టమొదటి "నేటివుషాపు"

గణపతిచెట్టికీ, నాకూ పరిచయం ఎలా కలిగిందో ! ఆc ! శ్రీనివాసాచారిగారు నా కాయన్ని ఎరుకపరిచారు.

* * *

బెజవాడ ఒకప్పుడు దేశానికి రాజధానిగా వుండేది. చెప్పుకోతగ్గ నగరంగానే వుండేదనుకోవచ్చును. సైనిక ప్రాధాన్యత దృష్ట్యా దీనికి ప్రాముఖ్యతవుంది. ఇక్కడ చాలా సైనిక బలము వుండేదని కృష్ణామాన్యయలులో

పేర్కొనబడింది కృష్ణరాయలు పూర్వ దిగ్విజయయాత్రకు విచ్చేస్తూ బెజవాడలో కొన్ని దినములు వున్నాడు ఆముక్తమాల్యద విజయవాటిం గొన్ని దినంబులుండి వాటి ని మాధవ వర్మ సంస్థాపించాడు బెజవాడలో "పూసపాటివారికోట అని పిలువబడే వొక ప్రదేశమున్నది ఇప్పుడీ జాగాలో యిళ్ళు కట్టబడ్డవి

**3 జూలై ఆదివారం .**

అమ్మయ్య ఎంతకాలానకు యిల్లు చేరుకున్నాను లోకలురికార్డులను యెత్తివ్రాసుకున్న నా బుక్కు మావాళ్ళ నిర్లక్ష్యంవల్ల పోయింది నెలలతరబడి చేసిన యింత కృషీ శ్రమా బూడిదలోపోసిన పన్నీరు రాజమండ్రీలో వొకరోజు ఆగాను వివిధ కాంపౌండులలోవున్న అనేక శాసనపు పలకలను పరిశీలించాను శాసనపుపలకలు ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ దిక్కూమొక్కూ లేక పడివున్నాయి వీటినిచూసే నాధుడే లేడు

రాజమండ్రీ నుంచి పిఠాపురంవచ్చి అక్కడోరాత్రి వున్నాను మా మేనత్తగారి కుటుంబపరిస్థితులేమీ బాగులేవు ఆవిడపెనిమిటి రోగిష్టి ప్రథమకోపం చీటికీమాటికీ రుసరుసలు మనిషికి ఎంతతోస్తే అంత శతమొండి ఆవిడ పెద్దకొడుకు తెలివైనవాడే ఇంటిగొడవలు ఫాక్తునపళ్ళేదు సంసారంలో సుఖంలేదు మా మావఁను నా వెంట తీసుకువెళ్ళిపోవచ్చాను ఇరవైరూపాయలు చేతిలోపెట్టి యింటికి పంపించివేశాను అతనికి భద్రాచలం వెళ్ళిపోయి మడిదున్నకు బతకాలని వుంది

♦ ♦ ♦

నిన్నటి సాయంకాలం మహారాజావారు యితరుల మనస్సుకు నొప్పి కలిగించకుండా వుండడముగురించిన్నీ ఆగ్రహమును అదుపులో పెట్టుకోవడము గురించిన్నీ మాతో ముచ్చటించిరి దీనికి సందర్భము యిలాగున కలిగింది మొన్నటిరోజన పిల్లవాళ్ళను మహారాజావారి యెదుట పరీక్షిస్తూ లక్ష్మాజీ పంతులుగారు నో ఎనీ అనే పదబంధం ప్రయోగించినారట వెంటనే తన మామూలు ధోరణిలో శర్మ ఆయనమీద విరుచుకుపడి అది ఆంగ్లములో దుష్ప్రయోగమ ని మందలించెనట అదీ పిల్లవాళ్ళయెదట నేను అప్పుడు లేనుగాని తరవాత తెలిసింది రామమూర్తి పంతులు సుందర్రావు పంతులూ శర్మగారితోపాటు కత్తులెత్తినారట తాను యింటికివచ్చేముందు లక్ష్మాజీపంతులుకు క్షమార్పణ చెప్పుకొంటినని సుందర్రావుపంతులు నాతోచెప్పిరి కాగా నాటి ఉదంతమును గురించి రాజావారు యిలా అన్నారు నాతో వుండేవారంతా తమ ఆగ్రహమును ఆదుపులో వుంచుకోవలెనని నా కోరిక మనిషి అనుకునేవాడల్లా యిది అభ్యసించతగ్గది ఇతరుల మనసుకు నొప్పి కలిగించకుండా వుండేందుకు ప్రతిమనిషీ యెంత జాగ్రత్త వహించవలెనో అంత జాగ్రత్తనూ వహించి మసలుకోవలెను మనిషినే ప్రతివాడికీ యేదో వొక యిబ్బంది వుంటూనేవుంది సంసారతాపత్రయాలో లేక ఉద్యోగంలో కలుగుతున్న చికాకులో ఏవో అందర్నీ బాధిస్తూనే వున్నాయి ఈ చికాకులకు తోడు మరికొన్ని లేనిపోని బెడదలను కొనితెచ్చుకోవడమేల? ఉన్న చికాకులు మనిషికి యెలాగూ తప్పడంలేదు అందులోనూ కుటుంబభారమంతా మీదపడ్డ వొక మనిషిని మరీ చికాకుపరచడం దేనికి? అసలే పుట్టెడు కష్టాలతో కుమిలిపోతున్న వొకరి హృదయాన్నీ మనసునూ మనమేల గాయపరచవలెను ? యెవరివల్లనైనా లోపమేవుంటే కష్టంకలిగితే తప్పువుంటే మనం వారిమొహం యెదటనే పుల్లవిరిచి పొయ్యిలో పెట్టినట్టు మాటలనగూడదు సమయాసమయములు సవ్యాపసవ్యములూ వున్నవి తప్పును మృదువుగానూ మనస్సును నొప్పించకుండానూ చెప్పుటకు వీలున్నది "

ఈ సందర్భమును పురస్కరించుకొని రాజావారొక ముచ్చట చెప్పారు చాలా యేళ్ళక్రితం తాము విద్యావ్యాసంగము చేస్తుండగా తమయెదుట వారి నాయనగారు కూర్చొనిరట నాయనగారియెదట అంతసేపు

అలాగున కూర్చొనడంవల్ల శరీరము చెమటలుపోసి మనసుకు చికాకు వేసిందట ; అపుడు మహారాజావారు లేటు సుందర్రావుపంతులుగారితో 'నాన్నగారి యెదట కూచోడం కష్టంగా వుందని' రట ; ఈ మాటవిని సుందర్రావు పంతులుగారు మందహాసంచేస్తూ, "గొప్పతనముయెదట కూచోవడం సుఖంగావుండదు !" అన్నారట.

మహారాజావారు మరివొక ముచ్చటను ప్రస్తావించారు. ఒక యూరోపియను, ఆయనపేరు నేనూ మరిచాను. మహారాజావారి నాయనగారితో తానొకప్పుడు వొక నౌకరుమీద ఎంతో క్రోధము వహించితినని తెలియచేశారట. ఆ నౌకరు ఎన్నిసారులు చెప్పినా తన దుష్ప్రవర్తన మానకుండెననీ, అతని నడవడిని యిక సహించలేకపోతిననీ యూరపియను రాజావారికి చెప్పెను ; నౌఖరును చంపుదామన్నంత కోపం యూరపియనుకు కలిగింది. చంపుదామనే అనుకున్నాడు. కాని, కొంచెం తమాయించుకుని అతన్ని చంపే ప్రయత్నం మానుకున్నాడు. కాని ఆ యూరోపియను, యింత పెద్దమనిషీ చరచరా తన పడక గదిలోనికి వెళ్ళి తాడుతో చితుకబాదెనట. తనకోపం చల్లారేవరకూ అలాగున ఛళ్ళుఛళ్ళున కొడుతూనే వుండెను. రాత్రి భోజనం వేళకు అతనికోపం చల్లారినది. ఇదివిని మిస్టర్ అండర్‌వుడ్‌తో యిలాగున అనెను : "అంతకోపంగా పడక గదిలోనికిపోయి ఎందుకు ప్రవర్తించవలసి వచ్చింది ? సత్ప్రవర్తనంటే ఏమిటో తెలియదు : కనుక మనుషులు దుష్ప్రవర్తన కలవాటు పడిపోతారు. దుష్ప్రవర్తనమేతప్ప వారికింకొకటి వున్నదనే విషయమే తెలియదు. ఇవన్నీ కేవలం అజ్ఞానంవలన పుడుతూవుంటవి." దీనికి దొర సమాధానం చెబుతూ "నిజమే ; కోపగించుకోవడం, రోషంతో చిందులు తొక్కడం మంచిపనికాదని నాకూ తెలుసును. క్రోధ మనేది మనిషిని భూతంవలె వెంటాడుతూ, మనఃక్లేశాలను కలిగిస్తుంది. కాని యేమి చేయను ? ఇట్టే చిర్రుబుర్రు లాడడం, కోపంతో రెచ్చిపోవడం నా స్వభావమాయె?" అన్నాడట.

**5 జూలై, శుక్రవారం :**

రేపు శాకుంతలనాటక ప్రదర్శనానికి తప్పక వెళ్ళి కల్యాణ రామయ్యరు, బాలామణి జట్టులకూ, దీనికీగల తారతమ్యములను తైపారువేసి పరిశీలనగా చూడాలి.

♦ ♦ ♦

గత కొన్ని దినముల నుంచి రాజావారు అదే దీక్షగా లెక్కలేనన్ని వ్యాకరణములు తిరగవేసి "నో ఎనీ" అనే ప్రయోగం తప్పా, అయితే యెందువలన తప్పు అనే సంగతి పరిశీలిస్తున్నారు. మేముకూడా ప్రమాణగ్రంథములను తిరగవేస్తున్నాము.

ఈరోజున రాజావారు అప్రయత్నంగా తోచినట్టు 'న్యూ మన్'లో గాని, 'ఫ్రూడ్'లో గాని యిట్టి ప్రయోగం దొరకవచ్చునని అన్నారు. సూర్యనారాయణ పంతులు 'న్యూమన్ చరిత్రోపన్యాసములు' మొదటి వాల్యూము పదిపేజీలు అలా తిరగవేస్తూ వెళ్ళేసరికి, వింత ! "హ్వెదర్ ఆర్ నో ఎనీ" అనే ప్రయోగం కంటపడ్డది. అక్కడికా వివాదము ఫైసలయిపోయింది. దీనిమీదట మహారాజావారు అన్నారుకదా : "ఇదివరకొకసారి కొన్నేళ్ళక్రితం యిలాగునే నాకొక సందేహము కలిగింది. అదిమా పూర్వీకులకు 'మహామండలేశ్వర' అనే బిరుదుకలదా, లేదా అని. పాపం, సంజీవరావుపంతులుగారు, అంత ముసలివారైవుండి కూడా బహుఓపికతో యీ విషయం పరిశీలించి సందేహ నివృత్తిచేశారు. మహామండలేశ్వర అనే బిరుదుకల మా పూర్వీకులలో వొకరు జారీచేసిన ఫర్మానాలను వారు నాకు చూపించారు. నేను రీసెర్చిసలిపి 'ట్రీటీ' వ్రాసితిని. మనము మన తప్పులను సరిదిద్దుకోగలము. తప్పుల తడకలతోవున్న ప్రకటనలను సరిచేసుకోగలము.

మా నాయనగా రొకసారి మా వంశీయులకు కుటుంబీకులకు మహామండలేశ్వర సుబదార్ అనే బిరుదలు కలవని క్లెయిము చేసిరి మా నాయనగారి క్లెయిమునకు యెట్టి ఆధారము లేదని యివి గాలి కబుర్లని నేను సంశయించాను వివాదగ్రస్తమైన తన ప్రకటనలను చనిపోయిన ఒక మనిషి ధ్రువపరచుకోజాలదుకదా ఈ విషయములో మా నాయనగారి మాట నిజము కావచ్చును వారిమాట గౌరవించవలెను

సంజీవరావుగారు దాఖలా చూపించిన పత్రం మహామండలేశ్వర బిరుదును ధ్రువపరుస్తున్నది కాని సుబదార్ అనే బిరుదుమాట మొన్న మొన్న అప్పారావు పంతులు సుబదార్ బిరుదును ధృవపరచే ఒక గ్రంధమును తెచ్చి నాకు చూపించినారు

ఇపుడు శ్రీ సూర్యనారాయణపంతులు వారినాన్నగారికి తగిన కుమారులవలె దీక్షతో వెదికి యీ నో ఎనీ ప్రయోగాన్ని ప్రామాణికంగా చూపించారు ఈ ప్రయోగంవల్ల అసలు ప్రశ్న తేలిపోయింది న్యూమన్ ప్రామాణికుడు కాదనలేము ఆయన యెన్నికగన్న రచయిత ఒకానొక ప్రయోగము సాధువా అసాధువా అనే విషయంపై నాకున్నూ, రామానుజాచారిగారికిన్నీ వొకప్పుడు మతభేదం కలిగింది ఈ ప్రయోగమునుగురించిన శంక అయిదుసంవత్సరాలవరకూ నా మనసులో వుంది తుదకు సాధువా అసాధువా అని శంకిస్తున్న యీ ప్రయోగం నాకు న్యూమన్‌లో దొరికి నిర్ధారణ అయింది మనం ఈవేళ నో ఎనీ అనే ప్రయోగం కనుగొనుట యేదో మహత్కార్యమనిగాని ఈ చర్యకు అవకాశ మిచ్చిన సంఘటననుబట్టి యుత్కర్ష పొందదగినదనిగాని నే ననుకోను నో ఎనీ ప్రయోగము సాధువుకాదని చెప్పడానకు నా కేమీ అభ్యంతరంలేదు తన కొక విషయము సరియైనదని స్పష్టంగా తెలిసి నిశ్చయజ్ఞానం కలిగినపుడు యితరు లావిషయంలో పొరపడుతున్నారని దృఢముగా తెలసినపుడు అప్పుడే నిజంగా ఓరిమి వహించాలి ఇతరులు పొరబడుతున్నారని మనకు తెలుస్తున్నకొద్దీ మనము శాంతము వహించవలె ప్రాజ్ఞుల మనసులకు నొప్పి కలిగించకూడదు అందులోనూ లక్ష్మాజీపంతులువంటి వయోవృద్ధులను పొరబడిరని చటుక్కున బొత్తగా ఆక్షేపించరాదు మన మనసులోని మాటలను నాజూకుగా మృదువుగా యేమీ కోపించకుండా నెమ్మదిగా చెప్పవచ్చును

పాపం లక్ష్మాజీపంతులు అష్టకష్టాలూ పడి కాలము మళ్ళిన వృద్ధులూ అనుభవములో పండిపోయిన యోధులు వాదించేటపుడు ఆయన కోపముతోనే మాటాడివుండవచ్చును వీరత్వముగానే పలికివుండవచ్చును అయితేనేమి వారికన్న చిన్నవారు ఆయనపట్ల గౌరవముతో మసలుకోవలెను వారి పలుకులు సహించవలెను వారి మనస్సు సంతోషపెట్టవలెను లోపములు చూపుటకు చక్కని మార్గములున్నవి సాధువుగా చెప్పుటకు వీలున్నది నేను చెప్పినదే సబబని నిష్కర్షగా విధి వాక్యముగా అననక్కరలేదు శర్మవంటి ప్రజ్ఞావంతులకు తాము యెంత పెద్దవారైతే అగుగాక దురుసుగా యితరుల నెరసులను ఎంచవలసిన అవసరం కనబడదు

ఈ సందర్భములో మహారాజావారొక ఆర్చి బిషపు వృత్తాంతాన్ని వివరించారు మతముమీద మిల్లుదొర వ్రాసిన మూదువ్యాసాలను రాజావారు చదువుకుంటూ వుండగా కొన్ని ధర్మసందేహాలు కలిగాయట కాళీబాబు తన శంకలను తీర్చగలడేమో అని ఆయనను అడిగితే యిలాటి శంకలను నే నేమీ ఖాతరుచేయను హాయిగా యింత తిని పడివుండక నా కెందుకీబెడద రామరాజు పొద్దున్నే పాలూ వెన్నా పట్టుకొస్తాడు గుమ్మపాలు కులాసాగా తాగి ఆనందగా తిరుగుతాను ఇంత చదువూ చదివి రామరాజునీ బట్లరుముండాకొడుకునీ అదమాయించుకోలేరు మీరు చదువులూ చట్టుబండలూను ఎప్పుడూ ఏదో సందేహమే ఏదో ధర్మశాస్త్రచర్చే నాకు మీ అంత చదువురాలేదని దిగులులేదు రేపట్నుంచీ నా క్కావలసింది పొదుగులో పాలు వేరే మరగబెట్టుకొని

రామరాజూ, నేనూ పుచ్చుకుంటాం. బాగా అనుభవించడం యెలాగునో మాకు తెలుసును ; మీరు మాత్రం యేదో శంకలు, ధర్మసందేహాలు వేసుకుని ప్రాణిని ఉసురుపెట్టుకుంటూంటారు. శంకలు లావవుతున్నకొద్దీ చికాకులు జాస్తీ."

ఇంతలోనే ఆర్చిబిషపు వచ్చి తమకోసం ఎదరు చూస్తున్నాడని కబురురాగా, తొందర తొందరగా దుస్తులు వేసుకుని రాజావారు వెళ్ళిపోయినారట. పుస్తకం చదువుతున్నపుడు తమకు కలిగిన సందేహాన్ని బిషప్పుకు, వివరించి చెప్పగా ఆయన "బట్లరుదొర దీనిని ఫలానాపుస్తకంలో చర్చించి ఫలానా ఫలానాచోట వివరణ రాసినట్టుంది" అన్నాడట !

"బాగానేవుంది కథ. అదేమిటో తెలియచెప్పక రాసినట్టుందంటాడేమిటి ? తను ఇంగ్లీషువాడైవుండికూడా, బట్లరుగురించి యితమిత్థమని తెలియదే !" అని రాజావారు తలపోసిరట. బిషప్పు వెళ్ళిపోగానే, బుక్సెల్లరువద్ద బట్లరు గ్రంథంకొని పరిశీలనగా చూసేరట. బిషప్పు పేర్కొనినచోట ఆ వివరణ విపులంగా వుందట. అప్పుడు రాజావారిలాగున అనుకున్నారట ; "ఈ ఇంగ్లీషు విద్వాంసులకు యెంత నిశ్చయజ్ఞానముంది. దానిని చెప్పేటపుడు ఎంత నాగరికంగా నమ్రతగా చెప్తూతారు !".

ఈ విషయం ఉదహరించి మహారాజావారింకా యిలాగున చెప్పారు : "పిన్నలతో మనం ప్రసంగించేటపుడు యెంతో జాగ్రత్త వహించవలెను. చిన్నల దోషాలను సరిదిద్దేటపుడు పెద్దవారికంటె వీరికి హెచ్చు బాధనిపిస్తుంది. అది సహజం. ఇతరులు తమ లోపాలను యెత్తిచూపించకూడదని కుర్రవాళ్ళు తాపత్రయ పడుతూవుంటారు. 'నేను వేసుకున్న బట్టలను గురించి నా రూపలావణ్యం గురించి వాళ్ళూ వీళ్ళూ యేమనుకుంటున్నారు? నా వేషభాషలు, తెలివి తేటలు, ఇతరుల మెప్పును, పొందుతున్నాయా? పదిమందీ నన్ను గొప్పవాడినని అనుకుంటున్నారా, లేదా? అనే ఊహలు యువకులను సదా వెంటాడుతూనే వుంటవి. చిన్నప్పుడు నా చుట్టూ ఎవరుండేవారో వా రెలాంటివారో అనే ప్రసక్తే నాకు వుండేదికాదు. వాళ్లెలాంటి వాళ్ళయితే నాకేమీ? నన్నుగురించి చెడ్డగా భావించకుండా వుంటే చాలును. నా గొడవేదో నాది ; నా మీద నాకే శ్రద్ధ హెచ్చుగా వుండేది. యెవరయినా నాగురించి యేమయినా అనుకున్నారా. లేదూ నాకు అపకారమేచేశారా, వాళ్ళపాపం వాళ్ళది. నే నేమీ లెక్కచేసేవాడిని కాను. దాన్ని యిట్టే మర్చిపోయేవాడిని. నా కపకారం చేసినవాళ్ళమీద నాకు కినుకా వుండేదికాదు. "పోనిస్తూ" అని క్షమించేవాణ్ణి.

ఒక పిల్లవాడిని మనం దురుసుగా మందలించి, ఛీవాట్లు పెట్టి కారాలూ మిరియాలూ నూరి దుయ్యబట్టుకుంటే మనచెంత కిక రమ్మన్నారాడు. మనచెంతకువస్తేనేకాని వీల్లేని స్థితిలో వుండి ఆ పిల్లవాడు మనదగ్గరకు రాక తప్పదనుకుందాం. అపుడు మన సహవాసం సాంగత్యం అతనికి ఆనందమీయదు.

అయితే వయసువస్తున్నకొద్దీ అనుభవం హెచ్చుతున్న కొద్దీ, మనపట్ల యితరులు ఎట్టిదోష మాచరించినా పట్టించుకోకూడదు. మనోబలమున్న మనుష్యులు వీటికి చలించరు. పదిమందిమధ్యకీ వచ్చినతరువాత, సమాజములో పాల్గొంటున్నపుడు వొకరిని ఎంచుబడిచేయుటకు, తానట్టి యెంచుబడికి గురి అవుటకు వ్యక్తులు సిద్ధపడకతప్పదు. తనకు పరిచయమవుతున్న మనుషుల చహరాలు, వ్యక్తులు పడికట్టవలెను. మానవజీవితమనే గ్రంథమును చక్కగా చదవవలెను. లేకపోతే ఆవ్యక్తి యెందుకూ మారనట్టు నలుగురూ జమకడతారు. ఇట్టి అభ్యాసమునకు నిదర్శనం యేమంటే ఓరిమీ, సహనమూ, ఇతరులను రంజింపజేసే వుద్దేశమూ, శక్తీ కలిగి ప్రవర్తించుట. ఇట్టి వ్యక్తులలో వొకరిని నొప్పించుట అనే గుణం వెదికినా కానరాదు."

ఈ విధంగా ఆయన చాలా చెప్పుకొచ్చారు. జరిగిన యీ సంభాషణ యథాతథంగా రాయగలిగానని నేను చెప్పజాలను. కొన్నిచోట్ల పొరపాటు పడ్డానేమో !

అపకారంచేసిన వారిమీద కినుక వహించకపోవడమనేది, యితరుల దోషాలను మన్నించడమనేది రాజావారి వ్యక్తిత్వంలో కనిపిస్తుందనీ, అవి పిన్నలకూ, పెద్దలకూ అరుదుగా వుంటవనీ ఆయనకే తెలియదు !

మహారాజావారు యింకా యేమేమో ప్రస్తావిస్తూండగా శలవు తీసుకుంటానని కాలేజీకి వెళ్ళిపోవలసివచ్చింది!

**8 జూలై, సోమవారం :**

కృష్ణంరాజుగారివంట్లో యెలా వుందో చూసివద్దామని పొద్దున్నే బయలుదేరాను. నిన్నటికంటె యివాళ నయం. రెండువి రేచనా లయాయట. వమనం చేసుకున్నారట.

మద్రాసు ఎలక్ట్రిక్ ట్రాంవే కంపెనీకి ఏ మాత్రం పరపతి వుందని ఆవిడ నన్ను అడిగారు. కాస్త మంచికబురు ఆవిడ చెవిని వేతామనుకుంటే, యేమీ లేనేలేదు. తనకు తానే వితర్కించుకుని తమ సొమ్ముకేమీ మోసంరాదనుకుంటూ, కొద్దిపాటి లీగలుపరిజ్ఞానాన్ని ప్రదర్శించింది ఆవిడ. టెక్కలి ప్రోనోటుమీద దావావేయమని మా నాన్నగారికి మేనేజర్లు దానిని, పంపించినట్టు ఆవిడ తెలియజేసింది. అది చెల్లుపెట్టవలసిన పూచీ తమకున్నట్టు ఆవిడ చెప్పలేదు ; కాని నాలుగువేల రూపాయలు అడ్వాన్సుయిస్తే ఎలా వుంటుందని మా నాన్నగారిని ఆవిడ సలహా అడిగారట ; అడ్వాన్సు ఈయమని ఆవిడకు మా నాన్నగారు సలహా యిచ్చారట. జమీందారు మేనేజరు, ప్రోనోటు వ్రాశారు. ఇప్పుడు జమీందారు తనకూ, ప్రోనోటుకూ యేమీ సంబంధం లేదంటున్నాడు.

కృష్ణంరాజుగారి కుశలం తెలుసుకున్నాక, హెడ్ మేనేజరు చెంతకు వెళ్ళాను. నేను వెళ్ళేసరికి జరుగుతున్న రివెన్యూకేసుకు సంబంధించిన చరిత్రయావత్తూ ఆయన చెప్పుకువస్తున్నాడు. ఈ కేసులో రాజకీయంకూడా యిమిడివుంది. చెబుతున్నపుడు ముఖకవళికలు మామూలుగానే వున్నాయి. ఏమీ తొట్రుపాటు కనిపించలేదు. చెప్పే తీరు ధారాళంగా వుంది.

ఇక్కడనుంచి తిన్నగా సుందర్రావు పంతులు యింటికి ! నేను కనిపించేసరికి ఆయన తన హాబీని/గురించి ముచ్చటించారు. ఆయుర్వేదం, దాన్ని ప్రోత్సహించవలసిన ఆవశ్యకత, వైద్యవిధానం, అన్నీ చెప్పుకొచ్చారు. ఇంటికివచ్చిన మీదట కోటకు వెళ్ళాను.

మేనేజరు సాహేబు కేసు ఎలా వివరిస్తున్నాడని మహారాజావారు నన్ను ప్రశ్నించారు. చక్కగా నివేదిస్తున్నాడనే కబురు విని నాకు తమ అభివందనలను తెలిపారు. అక్కడ లక్ష్మాజీ పంతులుగారుకూడా వున్నారు.

'చారు' మానేయడం మంచిదని రాజావారు సలహాయిచ్చారు. దేహానికంత మంచిదికాదని, కడుపులో గాలి యేర్పడుతుందని, అజీర్తికి హేతువుకాగలదనీ ఆయన అన్నారు. కోదండరావు పంతులుగారు వృద్ధులు ; ఆయనకి నల్లమందు కడుపులో పడందే వొక్క గడియ గడవదు. పాలు తాగరు ; పెరుగు వేసుకోరు, గోధుమ ససేమిరా పనికిరాదు. ద్రాక్షపళ్ళరసం రోగిష్టికి ఎంతో మంచిదని రాజావారు చెప్పారు. ఇంత పంచదార కలిసి పుచ్చుకుంటే వొంటికి మంచిదట; ఈ మాట యెంతవరకూ నిజమోనని వైద్యగ్రంథాలు చూస్తిమి; రాజావారన్నమాట అక్షరాలా నిజం.

మహారాజావారిది వొక ప్రత్యేకమైన ప్రవృత్తి. గుణ సంపద యెనలేనిది. ప్రత్యేకమైన వ్యక్తిత్వం. ఆయనకు ఆయనే సాటి. మనదేశంలో యింతటి గుణసంపన్నులు అరుదు. ఛలోక్తులూ, హాస్యమూ ఆయనలో మిన్నగా

కనబడతవి. జీవిత వేదాంతం నుంచి ఉద్భవించిన హాస్య చమత్కృతులు, షేక్స్పియరు కవికి గల చమత్కారం ; తనకు తానే, తమ మరణం గురించ తామే నవ్వుతాలుగా మాట్లాడతారు.

పూర్వం వొకానొకప్పుడు వొక ముసల్మాను, మంచి నవ్వుతాల మనిషి వుండేవాడట. అందరినీ కడుపుబ్బా నవ్విస్తూ వుండేవాడు. తన అవసానకాలంలో కుమాళ్ళను పిల్చి తను పడుకున్నమంచమును గోడచేరువకు లాగమని కోరాడట. చనిపోతున్నపుడు తనకాళ్లు రెండూ గోడమీద పారచాపి అదే స్థితిలో వుండిపోయాడు. కాళ్ళురెండూ పారజాపివున్న మనిషి మృతకళేబరం ! అతనిని కుమారులు సమాధిచేస్తున్నపుడు కాళ్లు యెంతకూ వొంగేయికావు. ఎలావున్న శవం అలానే వుంది. పట్టుకు దొరకదు. శరీరాన్ని లొంగదీసుకుని సమాధి చేద్దామని ప్రయత్నిస్తునకొద్దీ ఆ శవం వున్నట్టేవుండి రక్కున మళ్ళీ యథాస్థితికి వచ్చేది. ఏ తాములాగ కిందకూ, మీదకూ ఊగులాడడమే కాని లొంగడమనేది లేకపోయింది. ఆ చనిపోయిన ముసల్మాను చుట్టాలు యిదిచూసి యిలా అన్నారు : "ఈ మనిషి నవ్వుతాలమనిషి. తాను బతికివున్నపుడూ మనలను నవ్వించాడు. చనిపోయిన తరవాతా నవ్విస్తున్నాడు."

మహారాజావారు యిలాటిదే మరొకకథే చెప్పారు. ఒకానొక ముసలాయన తన అవసానకాలంలో కొమాళ్ళను దగ్గరకు రమ్మని పిల్చి అన్నాడట : "మీరు కుర్రముండాకొడుకులుగా వున్నపుడు మిమ్మల్ని ఉయ్యాలలో పెట్టి ఊపాను. ఇప్పుడిక మీరు నన్ను ఊపండి !"

* * *

నిన్న రామమూర్తి పంతులుగారు వచ్చారు.

మహారాజావారు యెంతో కొంతసొమ్ము స్టీవెన్సుదొరకు ముట్టచెబుదామనుకున్నారు కాబోలును. జాయింటు మేనేజరు గారిని పిలిచి స్టీవెన్సుకు సూపరింటెండింగుపనో, లేదా తనిఖీపనో కొన్నాళ్ళు అప్పజెప్పమన్నారు. ఈపని ఎవరైనా చేసిపెట్టగలరు. దీనికి స్టీవెన్సే అక్కర్లేదు. కాని దొరకు ఎంతో కొంత సొమ్ము యిద్దామని కదూ, రాజావారి తలంపు.

మహారాజావారిపట్ల స్టీవెన్సు ప్రవర్తన ఉచితంగా లేదు ; తెలివి తక్కువగా ప్రవర్తిస్తున్నాడు. మర్యాదా మప్పితం లేకుండా రాజా వారితో ప్రసంగిస్తూ వుంటాడు. ఇలాగున రాజావారితో స్వదేశీయులుగాని, యూరోపియనులుగాని సంభాషించివుండరు. ఈ పద్ధతీ నడవడీ అతనికి ఎంతమాత్రం తగదు. స్టీవెన్సుదొర యిక్కడ లేకపోతే పనులేం అడ్డిపోవు ; ఇన్నాళ్లూ యితను లేకుండానే రాజావారు తమ వ్యవహారాలను చూసుకున్నారు. ఇక ముందూ అంతే ! మహారాజావారు తననెంత 'యిది'గా చూస్తున్నారో దొర గమనించినట్లులేదు. మహారాజావారికున్న కీర్తిప్రతిష్ఠలు అతని కెరుకపడినట్లులేదు. స్టీవెన్సు పోనీ డెమోక్రటు అందామా అంటే అదీకాదు ; వొట్టి కన్సర్వేటివు; దురభిమాని. కన్సర్వేటివు పక్షంమీద ప్రీతి లావు. అయితే, యిన్ని దురభిమానములు, లోటుపాట్లు వున్నా అతనికి కొన్ని సుగుణాలు లేకపోలేదు. మహారాజావారంటే దొరకు ప్రేమ. తనకు చేతనైనా సహాయం ఎవరికైనా చేస్తాడు. కాదనడు. సర్వీసులో వున్న మిగిలిన యూరోపియనులు చేసేపని తక్కువ ; తక్కువేమి ? యేమీ లేనేలేదు. కాని వాళ్ళ క్లెయిమ్సూ, కుటుంబాల క్లెయిమ్సూ తలకుమించినన్ని. ఇది కావాలి. అదికావాలి అన్నీ కోరికలే !

మహారాజావారు 'సర్వీసు'లో మిస్టర్ డేనిస్‌ను వుంచి యెంత దయతో దొరను చూశారు ? ఇతరత్రా డబ్బువచ్చే ఉపాధికూడా కల్పించారు. తనకు వివాహమయిందని తన భార్య తనను నమ్మి యింగ్లండునుంచి యింతదూరం వెళిపోవచ్చిందని దొర చెప్పుకున్నంతమాత్రాన మనసుకరిగి రాజావారు దొరకు సదుపాయాలు కలిగించారు. డేనిస్‌కు పెళ్ళి అయిందికనుక యిక అతను తెచ్చే ఆదాయం సంసారానికి సరిపోదని మహారాజావారు

అనుకున్నారు అందుకని దొరకు యిన్నోటి సదుపాయాలు

రాజావారు నో ఎనీ అనే ప్రయోగం గురించి స్టీవెన్సును అడగ్గా మీ రన్నట్టు అది న్యూమన్లో కొటేషన్లో వుందికదా అదే యిక రుజువూ దానికదే ఉదాహరణ అన్నాడు అదికాదు ఆ ప్రయోగం గురించి మీ ఉద్దేశమేమిట ని రాజావారు ప్రశ్నించారు చర్చకు తావివ్వక తన ఉద్దేశమేమో చెప్పక దొరగారు "నే నింగ్లీషువాణ్ణి మీ అందరికంటె నా భాష నాకు బాగా తెల్సును మిస్టర్ అండర్ వుడ్ నే నన్నమాట రైటన్నాడు ఇద్దరు ఇంగ్లీషువాళ్ళకి యేకాభిప్రాయం కుదిరిందంటే యిక వివాదం ఫైసలయిపోయిందన్నమాటే మిష్టరు ఆడం కూపరు ఓక్లీ యిద్దరూ మంచి గ్రంధకర్తలే వాళ్ళగ్రంధాలు చూడండి

దొర ఎంతసేపూ యిలా చెప్పుకుపోతాడే తప్ప తన అభిప్రాయమేమో వివరించడు వ్యాకరణ విషయాలనూ చర్చించడు

* * *

ఈ వేళ సాయంకాలం శర్మవచ్చాడు ఆడం గ్రంధంలోని వొక వాక్యసముచ్చయము గురించి తనకూ లక్ష్మాజీ పంతులుగారికీ వివాద మేర్పడిందట దానిమీదట రాజావారు గంటల తరబడి వ్యాకరణ విశేషాలను గురించి ప్రసంగించారు మహారాజావారికి వ్యాకరణ శాస్త్ర పరిజ్ఞానం అపారం ఎంత వింత

**11 జూలై లక్ష్మీవారం .**

జాయింటు మేనేజరు శర్మ ప్రిన్సిపాలుగారలను తమ వెంట మహారాజావారు తీసుకువచ్చారు శర్మ సోదరునికి సంస్థానపు దావాలలో వకాలత్ యివ్వడం గురించి చర్చ జరిగింది

మహారాజావారు గొప్ప ఆశ్చర్యకరమైన రాజనీతిని ప్రదర్శించారు పరిపాలనా దక్షత ఎంత గొప్పది ? మేనేజిమెంటును గురించి తమకు తామై సూటిగా ప్రసంగించలేదు దాని కనేక కారణాలు ఆయనకు వుండివుండవచ్చును

ఎస్టేటులను ఎందుకు జమీందారులు తమకు తామై మేనేజిచేయకూడదో నాకు కనిపించే కారణాలు అనేకం జమీందారు అయినంతమాత్రాన అతనికి పరిపాలన దక్షత వుంటుం దనుకోనక్కర్లేదు . నిజానికి అతను జీవించే పద్ధతీ పరిసరాల సరళీ వేరు మామూలు పరిసరాలు వాతావరణం అతని అభివృద్ధికి ఆటంకమని అతనిభావన పరిస్థితు లిలా వుంటున్నపుడు అజమాయిషీచేసే జమీందారు ఒక న్యూసెన్సుగా తయారవుతాడు. మంచి మేనేజరును ఎంచుబడి చేసుకోవడమే జమీందారు కర్తవ్యం అంతటితో అదిసరి ఇదీ నా అభిప్రాయం

శర్మ చాలా నెమ్మదిగా తన అభిప్రాయాన్ని తాను చెప్పాడు నాకే ఆశ్యర్యమనిపించింది శ్రీ జగన్నాధరావు పంతులు అందరికంటె అద్భుతంగా చెప్పారు ప్రసంగంలో మహారాజావారు ఎప్పుడూ ముందు వుండేవారు ఆయనొక విషయాన్ని ప్రారంభించి విడిచిపుచ్చేవారు మధ్య మధ్య సూచనలుగా రెండు మూడు మాటలు అంటూండేవారు అంతేనేకాని ఎన్నడూ ఆయన ఆదేశమిస్తున్నట్టు మాత్రం ప్రసంగించనూ లేదు ఒకరు చెప్పింది కాదని త్రోసిపుచ్చనూలేదు

శర్మ సోదరునికంటె జగన్నాధరావు పంతులుగారి కుమారుని క్లెయిమ్మును మహారాజావారు అంగీకరించడం న్యాయమే మరి

మహారాజావారు మా నాన్నగారి కుశలమడిగి తెలుసుకున్నారు.

**12 జూలై, శుక్రవారం :**

మనదేశపు నౌకరులు యెంత తెలివితక్కువగా, యెంత మూర్ఖంగా, అపరిశుభ్రంగా వుంటారో యీవేళ మాటల సందర్భంలో రాజావారు చెప్పుకొచ్చారు : "యే వస్తువు యెక్కడుండాలో అక్కడది వుండదు. దేన్ని యెలా వుంచాలో అలా వుంచరు. మనకు కోపం లేకపోయినా, లేని కోపం తెచ్చిపెట్టుకొని నటిస్తేనేగాని వాళ్ళతో వ్యవహారం సజావుగా సాగదు. మెల్లిమెల్లిగా అప్పుడప్పుడు అదీ యిదీ బోధిస్తూ వాళ్ళకి జ్ఞానోదయం కలిగించాలి. మనల్ని మనమూ అభివృద్ధి చేసుకోవాలి. ఈ శిక్షణ మనకూ అవసరమే.

ప్రతీ వస్తువూ నేలమీదపెట్టి వుంచడమనేది వొక దురలవాటు. బల్లలమీద యెందుకు వుంచకూడదు ? ప్రతీ యింటా బల్ల లుండడం అవసరం. మన హిందూ స్త్రీలు వారెంత గొప్ప వారైనాకానీయండి, కాకపోనీయండి. పగలల్లా స్నానాలతోనే కాలం గడుపుతారు. మడీ తడీ ; వంటా వడ్డనా ; యేదో వొక చాకిరీ వుంటూనే వుంటుంది.

గిన్నెలూ, చెంబులూ కడుగుతారా, లోపల మకిలి వదలదు. అంతా పై పైనే ; పాత్రలుమాత్రం ధగధగా మెరుస్తూ వుంటే చాలు."

'ఇ' దొరగా రొకసారి రాజావారి స్టూడియోకి వెళ్ళేరు. అప్పుడు ఆయన తన స్టూడియోలో వున్న పాత్రలను కింద పెట్టి గుడ్డతో దుమ్మును దులుపుతున్నారట. దొరను చూసి "మంచి పనిలో వున్నాను. చేతినిండా పనే" అంటూ ఆయన చిరునవ్వు నవ్వారట.

♦ ♦ ♦

రాజావారి దెంత నిరాడంబర జీవితం. ఆయనా, ఆయన పరిచితులూ కూచునే కుర్చీలు, బెంచీలు పెద్ద విలువైనవి కావు. వేసుకునే దుస్తులు చాకింటి మడతలే కాని, అవీ ఆర్భటంగా వుండవు. ఆయన నాయనగారు ధరించే లేసు తలపాగాలు, సాధారణంగా ధనికులు ధరించడానికి తాపత్రయపడే డాంబికమైన టోపీలు రాజావారికి కిట్టవు. ఆయన పెట్టుకునే తలపాగా సహజంగా వుంటుంది. దర్పం కనిపించదు. కాని అందంగా వుంటుంది. ఠీవి కనిపిస్తుంది. ఆయన ధరించే తలపాగాలనే ఇతర జమీందారులు, మొఖాసాదారులు అనుకరిస్తున్నారు.

**29 జూలై, సోమవారం :**

మళ్ళీ మామూలే. వంట్లో యేమీ బాగులేదు. మహారాజావారికి నామీద ప్రేమ.

శ్రీ వీరేశలింగంగారు.

కవులకాలము. మూలసూత్రమంతా యిక్కడేవుంది. కవుల జననం, తేదీలు, కాలమూ అన్నీ ఆయనకు ....

**2 ఆగస్టు, శుక్రవారం :**

మహారాజావారికి నే నంటే అభిమానం. అరటికాయ కూర 'డిసింట్రీకి' మంచిదని చెప్పి రోజూ పొద్దున్నే నాకు పంపించే యేర్పాటు చేస్తున్నారు.

నేను వ్రాతామని వేసుకున్న సాహిత్యప్రణాళిక :

ఒక వ్యాకరణమును వ్రాయుట

భారతదేశచరిత్ర, ఆంగ్ల దేశచరిత్ర

ఇంగ్లండులో ప్రచురించుటకై ఆంగ్లములో కొన్ని కథలు. గ్రీసు రోము చరిత్రలను తారతమ్య పరిశీలనతో రచించుట.

ఆధునిక జీవితమును అభివర్ణిస్తూ యింగ్లీషున నవాల రచన.

తెలుగు సారస్వతంపై వరసవరసగా కొన్ని ఉపన్యాసములు, ఈ సారి మద్రాసు వెళ్ళినపుడు వచ్చే శీతాకాలంలో అక్కడ యీ వుపన్యాసము లీయవలెను.

♦ ♦ ♦

| | |
|---|---|
| సామంతమౌళి మణి | భైరవి |
| కువలదళ స్నిగ్ధరంగై | పున్నాగమరాళి |
| తవకుసుమశరత్వం | శహన |
| కుమ్మీయది పొణ్ణైకుమ్మిగియది పెణ్ణి | హుశెని |
| కొంగై కులుంగవకుమీయతి | |
| సమ్మయిరకై కింనిత్యకళ్యాణరై | |
| శ్యామసుందరాంగా | ధన్యాశి |
| యెంతో ముద్దు యంతసొగసు | బిందుమాలినీ |
| విదముశాయవే | ఖరహరప్రియ |
| గూఢంనూపురశబ్ద | హిందుస్తాని కాపీ |

**దృశ్యములు :**

కుమిలిఘాటు, గునుపూడి అడవి, నెల్లిమర్లయేరు, రామతీర్థం, శృంగవరపుకోట కొండలు, మాదుగుల, సింహాచలం, కోనాడ.

**విషయాలు :**

దానిమ్మ ; సారంగ.

♦ ♦ ♦

తానెవ్వరో తనా వా రెవ్వరో

* * *

చిత్తా స్వాతి వాన జోడించి కురీయగా

చిప్పలోను బడె చినుకొక్కటి

ఆ చుక్క ముత్యమయి మునిగిపోయె ముందు

చిప్పతో చెప్పింది మా టొక్కటి

* * *

శకుంతల

కామంప్రియా మోహన ; బాగుంది!

భ్యాగడ

యణ్ణె తెక్కురే న్వారాయ్ కణ్ణాళ్ళనే

ధర్మసంవర్ధనీ మా యమ్మా సమ్మితి నిన్నూ

దాసుడను నను బ్రోవవలె నమ్మా

బంగారుకొమ్మా

రీతి గౌళ

జననీ నీను వినా త్రైలోక్య - దిక్కెవరమ్మ జగమూ

లోనగాని

సరసిజమానసమ్మోహిని వినవే నా మనవినీ

విని నన్నూబ్రోవు

పూరికల్యాణి

నిను వినా మరి దిక్కెవ రున్నారు నిఖిలలోకజనని

నన్ను బ్రోచుటకు

పన్నగ భూషణుడౌ .........................

హిందూస్తానీ కాపీ

వా డెటూ బాల్కెనొ దెల్పవే

పయ్యదాపై నాదనామక్రియ

నామానాసువంటిదె నీ మానసయి

తే, నా నోముఫలము తీరురా కళ్యాణి

...... ..... ......

యేమందునే కొమ్మా దీనివెద యట్లా తీరునమ్మ

కోమలి శ్రీ రాజాగోపాలు నెడబాసీ

రామరామ యన్నాళ్లో కామినీ తాళూను

...... ..... ......

పన్నీటతడసె పడతి పయ్యదకొంగు

కన్నీటతడిసెనుగా వన్నెమీరినట్టి

వనితా చక్కనిమోము చిన్నపోయెనుగా

మిన్నగమెరసే మెలత చక్కనిమేను
నన్నమై సోలేనుగా వెన్నెలనాడే వెలది
చందురూని కన్నెత్తి చూడాదుగా దిగులొందగ శహన

ఏవో వారానమ్మా యింగి ఆందుపో
యి శెనెనేర మాచ్చమ్మా
మానె శ్రీనివాసున్ మది మరందా
నోయన్నె ఆనాలుం యిప్పడి ఆహు
మో అవనిక్కి

రాజువెడల జూతామురారే తోడి

యేమగువ బోధించెరా నీ కేమగువ
శ్యామరాజ భూపాలతనయ
సరస శ్రీకృష్ణరాజేంద్ర మారువ

రమ్మనిబిలిచితే రావే చెలియా కన్నడ

**31 డిసెంబరు మంగళవారం**

| | | | |
|---|---|---|---|
| సరుకులమీద | కాసులు | 100 | రూ॥ లు |
| | కంకణాలు | 60 | |
| | హుళీ | 200 | |
| | వడ్డీలు | | |
| | వెంకటరత్నంగారి బాకీ | 60 | |
| | కొట్టాల నర్సన్నగార్కి | 50 | |
| | మొత్తం | 470 | రూ॥ లు |

| | |
|---|---|
| నీళ్ళ బ్రాహ్మడికి | |
| నాలుగునెలల జీతం | 12- 0-0 |
| జగన్నాథం | 28- 0-0 |

| | |
|---|---|
| దేవాంగికి | 20- 0-0 |
| ఆముదం | 7- 0-0 |
| చిట్టి వెంకన్న | 10- 0-0 |
| నూనె | 20- 0-0 |
| పెరుగు నెయ్యి | 12- 0-0 |
| నూకిజీతం | 6- 0-0 |
| చేబదులు | 20- 0-0 |
| పాలది | 5- 0-0 |
| చాకలి | 3- 0-0 |
| యింటిమీదిమొత్తం | 20- 0-0 |
| సన్యాశి | 4- 8-0 |
| పండుగఖర్చు | 25- 0-0 |
| చన్నయ్య | 36-10-4 |
| వెంకటాద్రి జీతం | 14-12-0 |
| అగురు దానికి | 2- 0-0 |
| మొత్తం | 259-14-4 |

## 1896

**1 జనవరి బుధవారం**

విజయనగర రాజవంశీకుల ప్రాచీన చరిత్రను సంసిద్ధపరచడం

**3 ఫిబ్రవరి సోమవారం**

డైరెక్ట రాఫ్ పబ్లిక్ ఇనస్ట్రక్షన్ వచ్చాడు స్టేషనువద్ద ప్రిన్సిపాలుగారు ఆయన్ని కలుసుకొనిరి డాబాతోటలో జాయింటు మేనేజరుగారు కలుసుకుని తమతోపాటు ఆయన్ని తీసుకొని వచ్చారు

**4 ఫిబ్రవరి మంగళవారం**

కాలేజీలో జరిగిన సమావేశంలో డైరక్టరుగా రిలాగున ఉపన్యసించిరి

తత్వశాస్త్రము యెందుకూ పనికిరాదని కొందరి అభిప్రాయము కాని అది అభివృద్ధి చెందుతూ వున్నది మహారాజావారి యెడల యెంతో గౌరవప్రపత్తులను కనబరుస్తూ మీరు ప్రసంగించడమనేది నా కాశ్చర్యమును కలిగించలేదు ఆయనను యెరిగినవా రెవరైనా ఆయనను ప్రేమించకుండా వుండజాలరు అయితే ఆయనకొక దోషముకలదు ఎంతో మంచితనము చెప్పలేనంత మంచితనము కలిగి వుండడమే ఆయన దోషం ధార్మికదృష్టికూడా ఆయనకు లావు

**14 ఫిబ్రవరి, శుక్రవారం :**

వెన్లక్ మెమోరియల్ గురించి జాయింటు మేనేజరు గారితో ప్రసగించితిని. నాకు తోచిన వ్యక్తులతో తన పేరున ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికి అనుమతించారు.

**28 ఫిబ్రవరి, శుక్రవారం :**

బాలరామారావుకి రెండురూపాయలిచ్చి శ్రీకాకుళం పంపించాను.

**29 ఫిబ్రవరి, శనివారం :**

శ్రీ బలిజేపల్లి సూర్యనారాయణ పంతులుగారిని కలుసుకుని ఆయనతో ముచ్చటించితిని. విశాఖపట్టణములో జరగబోయే వెన్లక్ మీటింగుకు సహాయం చేస్తామని మాట యిచ్చిరి. ఇదేపనిమీద వెంకన్నపంతులుగారినికూడా కలిసితిని. సంతోషం. మాన్యుమెంటును గురించి శ్రీ రామానుజాచారిగారితో మాట్లాడినదానికంటె యింకా హెచ్చు భరవసాగా నాతో ప్రసంగించిరి. అధ్యక్షత వహించమని ఆయన్ని కోరాను. అందుకు తమకేమీ అభ్యంతరం లేదనీ, కాని మిస్టర్ ముల్లర్ అధ్యక్షత వహించేటట్లుగా ఆయన్ని వొప్పించడానికి ప్రయత్నించగలవనీ అన్నారు.

**2 మార్చి, సోమవారం :**

శ్రీకాకుళంలో మెమోరియల్ మీటింగు విజయవంతముగా జరిగింది. సభ యిక ముగుస్తుందనగా కొంత చిక్కు ఏర్పడ్డది. లీడింగు లాయరు బాపిరాజు మొదట కొంత విముఖతతో వున్నారు. తీర్మానం ప్రతిపాదించవలసినదిగా ఆయన్ని కోరాను. కొంతచర్చ జరిగినమీదట యెలాగైతేనేం, ఆయనందుకు వొడబడ్డారు. చాలాసేపు ప్రసంగిస్తూ తీర్మానం ప్రతిపాదించి ఉపన్యాసం అయిపోయాక నాదగ్గరకొచ్చి యిలా అన్నారు : "చిట్టచివరికి ఎలాగయితేనేమి, నన్ను మార్చి వేశావు."

**4 మార్చి, బుధవారం :**

సోంపేట బయలు దేరాను.

**5 మార్చి, లక్ష్మీవారం :**

సోంపేటనుంచి, ఛత్రపురం బయలుదేరాను. అడవి ప్రదేశంలో రైల్వేస్టేషను. నాదగ్గర చదువుకున్న విద్యార్థి కనకరాజు కనిపించాడు. నాయెడల శ్రద్ధాభక్తులు కనబరిచాడు. స్టాండర్డు పత్రిక ఎక్కడపడితే అక్కడే వుంటోంది. మంచి ప్రచారంలోకే వచ్చింది. కనకరాజు చేతిలో స్టాండర్డు పత్రికను చూశాను.

**6 మార్చి, శుక్రవారం :**

సబ్ - మేజస్ట్రేటును, తహశ్శీల్దారును కలుసుకున్నాను. ఎంతో గౌరవం చూపారు. ఈ విషయంలో తాము తప్పక సహాయంగా నిలబడతామన్నారు. జమాబందీ అడావుడిలో వున్నారు. తిరుగు ప్రయాణంలో ఒకసారి మనం కల్సుకుంటే మంచిదన్నారు.

**21 మార్చి, శనివారం :**

గం. 5-25 లకు యెలమంచిలి బయలుదేరాను.

గంగారాంకి విజయరామపంతులు 43,000 రూపాయలు యిస్తానన్నాడు. చలపతిరావుపంతులు, భూమి చూసుకున్న తరవాత 75,000 యిస్తానన్నాడు

"బోసందు" అనే పదం యీ ప్రాంతాల్లో వాడుకలో వుంది బోసందు అంటే భూసంధి కాబోలును

**23 మార్చి, సోమవారం :**

వెంకటేశ్వర్లు 24 000 రూపాయలకు కాపగొాద వలసకొన్నాడు వెయ్యిరూపాయిల రాబడి వస్తుందని అంటున్నారు

**15 మే, శనివారం :**

నిన్నరాత్రి విచిత్రమైన కలవచ్చింది కలలో కన్నీరు కార్చాను మహారాజావారికేదో విపత్తు వాటిల్లినట్లు నాకు దుఃఖం పొంగుకువచ్చినట్లు కల కలలో మహారాజావారు కనిపించారు తెల్లవారిన తరువాతకూడా మనసు స్థిమితపడలేదు

కాని ఎంత ఆశ్చర్యం పొద్దున్న పదకొండు గంటల వేళకు రొప్పుకుంటూ రొప్పుకుంటూ సూరీడు పరుగెత్తుకొచ్చాడు మనిషి నిలువునా వణకిపోతూ కంపిత స్వరంతో చెప్పలేక చెప్పలేక చెప్పాడు "హెర్‌హైనెస్ ఛోటా మహారాణివారు మరణించారు "

దుఃఖకరమైన యీవార్తను మొదట నమ్మలేకపోయాను ప్రతాప్‌సింగ్జీ భవంతిలో విషాదచ్ఛాయలు ఆవరించినవనీ ఆపుకోలేని దుఃఖం అలముకొన్నదనీ వార్త వార్త తెలిసి సూరీడును వెంటబెట్టుకొని ప్రతాప్‌సింగ్జీ భవంతికి వెళ్లాను ఆయన్నీ ఓదార్చాను కష్టసమయాల్లో ఆత్మసంయమనం అవసరం ధైర్యం వహించండని చెప్పాను సాయంత్రం మళ్లీ వెళ్ళి పరామర్శించి వచ్చాను

**16 మే, ఆదివారం .**

పొద్దున్న ప్రతాప్‌సింగ్జీ కబురుపంపారు మధ్యాహ్నం భోజనంచేశాక మళ్లీ మనిషిని పంపారు వెడుతూ వెడుతూ దారిలో ఆయనికి కొన్ని రిఫ్రెష్‌మెంట్లుకొని తీసుకువెళ్లాను

**5 జూన్, శుక్రవారం :**

సంస్థానం హుజూరు ఆఫీసులో పనిచేయ ప్రారంభించాను

**7 జూన్ ఆదివారం .**

కోటపల్లి చలపతిరావుపంతులు దగ్గరవున్న క్యాషుబుక్కూ, స్టేటుమెంట్లను పరిశీలించాను ఫారాలను పూర్తిగా మార్చివేస్తేనే కాని లాభంలేదు అప్పుడుకాని యెక్కొంట్లను దేనికది విడమర్చి వేయడం సాధ్యంకాదు ఇప్పుడున్న యీ ఫారాల్లోని ఎక్కౌంట్లను స్టేటుమెంట్లనూ చెక్‌చేయడం కష్టం కోర్టాఫ్‌వార్డ్సు హయాములోవున్న పిఠాపురం ఎస్టేటుఫారాలను పంపించమని రాశాను ఈ ఫారాల్లో ఇన్ని హెడ్డింగులు ఎందుకో

**20 జూలై సోమవారం :**

ఏడుంబావుకి తిలారికి బయలుదేరాను స్టేషనుకీ ఊరికీ దూరం నాలుగుమైళ్ళు.

సవారినిచూస్తే పిల్లలకు సరదా ఆశ్చర్యంతో ఏదో పెద్ద వింతలాగ పిల్లలు చూస్తూ నిలబడ్డారు

**21 జూలై, మంగళవారం :**

జరజంగికి ఒంటిగంటా పదినిముషాలయేసరికి బయలుదేరాను

22 జూలై బుధవారం :

గంగరాం గ్రామము తాలూకు ధాన్యం అంబారం చోళ్లు నూఁచేను చోళ్లు వగయిరా తౌలకరి

నది యిక్కడుంటే ఎంతబాగుండును

"జాముచెసినరూ అంతన్నాను"

మంచి ప్రయోగాలే

23 జూలై, లక్ష్మివారం :

వనవిష్ణుపురం వెళ్ళాను భూమి సారవంతమైనదే విస్తీర్ణంకూడా హెచ్చు చెరువుకింద భూములు చెరువులో నీరు ఏడాదిపొడుగునా వుంటుంది

ఇరవై వేలు ఐదువేలు

## 1897

1 జనవరి, శుక్రవారం :

ఫేన్సీ డ్రస్‌బాల్ మహారాజావారు ఉపన్యసించారు ఉపన్యాసం బాగున్నది కలెక్టరు మిస్టర్ హ్యామ్ అభినందిస్తూ సమాధానం చెప్పారు

2 జనవరి, శనివారం :

మహారాజావారు నన్ను బగ్గీమీద కూచోబెట్టుకుని కంటోన్మెంటు తీసుకువెళ్ళారు అక్కడ కేంపులో నాటకప్రదర్శనం జరుగుతున్నది రాజావారు కుట్టించిన కొత్తకోటు తొడుక్కున్నాను ప్రదర్శిస్తున్న నాటకంపేరు "కేస్టు" అభినయం మనోహరం నాయిక తండ్రిగా మిస్టర్ రామ్సన్ నేర్పుగా నటించాడు ఆ తాగుబోతు మాటలు, పోకిరీతనం కిల్లాడీతనం యుక్తంగా చూపించాడు పోలీ ఒక దేవతవలె తోచింది దేవకన్య హృదయం పుట్టిపడేటట్టు నాయికపాత్ర ధారిణి నటించింది

3 జనవరి ఆదివారం :

జిల్లామునసబు రిటైరు అవుతున్నందుకు హెడ్ మ్యానేజరుగారి యింట సంగీతకచేరి జాయింటు మ్యానేజరుగారికి దివాన్ బహద్దరు బిరుదు వచ్చినందుకు అభినందనము విందు నా కన్యాశుల్కము ప్రతినొకదానిని ఆయనకు కానుకగా సమర్పించి "ఇంత తక్కువ విలువగల కానుకను యిస్తున్నందుకు అన్యథా భావించకండ న్నాను ఇది స్వల్పమేమీకాదు అలా ఎన్నడూ అనుకోకండి మీరు మీ హృదయాన్ని నాకు కానుకగా బహూకరిస్తున్నారు ఆ సంగతి నాకు తెలుసును ఇది ఎంతో గొప్ప కానుక"

5 జనవరి, మంగళవారం :

విజయనగరంలో పావుశతాబ్దం ఇరవైఐదు సంవత్సరాలు

19 జనవరి, మంగళవారం :

ఇంటిని గురించి

**22 జనవరి, శుక్రవారం :**

బాపిరాజు పంతులుగారికి అక్కివలసకేసుకు సంబంధించిన రికార్డుల్ని యిచ్చాను.

మాక్సుముల్లర్ 'వాట్ ఇండియా టీచస్ అజ్."

**23 జనవరి, శనివారం :**

దీనబంధు ; మద్రాసు పేపరు

77 అన్నపిళ్లైవీధి ;

**27 జనవరి, బుధవారం :**

రేపు ఉదయం రైల్లో రాజామణి చెట్టియార్, దిగ్రేట్ 'ఆర్' వస్తున్నారు.

మాధవరావు వ్యవహారం. కాలేజికి, హిందూస్కూలుకి నోటీసులు.

**28 జనవరి, లక్ష్మివారం :**

జాయింటు మ్యానేజరుగారితో బొబ్బిలి వ్యవహారం మాట్లాదాను.

**29 జనవరి, శుక్రవారం :**

మహారాజా హోల్కర్ టెలిగ్రాంయిచ్చారు. ఆయన్ని గురించి మ్యున్సిపల్ సెక్రటరీతో మాట్లాదాను.

**30 జనవరి, శనివారం :**

కన్యాశుల్కం ప్రతులు రివ్యూలకోసం మద్రాసు పత్రికలకు పంపించాను.

**4 ఫిబ్రవరి, లక్ష్మివారం :**

ప్రిన్సిపాలుగారికి క్లాసికల్ డిక్షనరీలు. మెకాలే వాల్యూం 7.

**10 ఫిబ్రవరి, బుధవారం :**

భీమిలిల్లో మీటింగు. మహారాజావారు ఉపన్యసించారు. మిస్టర్ టర్నర్ రాజావారి ప్రసంగం చాలా బాగుందని ప్రశంసించాడు.

**11 ఫిబ్రవరి, లక్ష్మివారం :**

"టర్నరంటే నాకెందుకు అభిమానమో మీకు తెలుసునా?" అని మహారాజావారు ప్రశ్నించారు. దానికాయనే సమాధాన మిచ్చారు :

"నేను రాడికల్‌ను కనక"

నేను టర్నరుతో అన్నాను : "ఆయన్ని మీకు మర్చి పోదానికికంటె, ఆయన, మిమ్మల్ని మర్చిపోవడానికి అవకాశం హెచ్చుగా వుందికనక !"

**14 ఫిబ్రవరి ఆదివారం :**

కమాండర్ - ఇన్ - ఛీఫ్ యివాళ ఉదయం రైలులో వచ్చాదు. రైల్వేస్టేషనువద్ద పటాలం.

**15 ఫిబ్రవరి సోమవారం :**

నిన్న ఆదివారం సెలవుకనక, యీవేళ కమాండర్ ఇన్ ఛీఫ్ గౌరవార్థం ఫిరంగులు పేల్చారు.

పదిగంటలకు మోతీమహలులో విందు.

**24 ఫిబ్రవరి, బుధవారం :**

అక్కయ్యవలసకేసు యీరింగు.

**10 మార్చి, బుధవారం :**

పేకాట, కథల పుస్తకాలకు ఐదురూపాయలు ఖర్చు.

**2 మే, ఆదివారం :**

వెయ్యిరూపాయలు డ్రా చేశాను.

రెండు మెమోరాండములు.

దర్జావద్ద మూడువందల ఇరవైరూపాయల నోట్లు డ్రా చేశాను. అతనివద్దనే వుంచాను.

**23 మే, ఆదివారం :**

తెల్లవారుఝాము మూడు గంటలకు మహారాజావారు పరమపదించారు.

**26 జూలై, సోమవారం :**

రామయమ్మగారివద్ద కృష్ణమ్మ సరిగ్గా పనిచేయడం లేదని రెండణాల జుల్మానా.

**27 జూలై, మంగళవారం :**

మేనేజరుగారికి బ్యాంకువిషయమై మెమోరాండం.

**3 ఆగస్టు, మంగళవారం :**

రామయమ్మగారు నాఎదుట కరన్సీనోట్లను జమకట్టారు. మొత్తం వెయ్యి రూపాయలు.

**8 ఆగస్టు, ఆదివారం :**

సీతారామయ్య తాను షష్టిపూర్తికని రామాయమ్మ గారినిడబ్బు అడిగినాడట. ఆయన కిమ్మనమని చెప్పి ఆవిడ నా చేతికి ముప్పై రూపాయలు యిచ్చారు.

**18 ఆగస్టు, బుధవారం :**

మోతీలాల్ వెళ్లిపోయినాడు.

**22 ఆగస్టు, ఆదివారం :**

ఒకలక్షా నలభైవేలు. నెలకు వడ్డీ ఏడువందలు. ఆరు నెలలకు రావలసినవడ్డీ నాలుగువేల రెండువందలు.

**రెండవ అయిటము :**

పదివేల రూపాయలు. ఏప్రియల్ 15 వ తేదీ.

135 రోజులకు ; రోజుకూ రూపాయి పదణాల ఎనిమిది పైసలు.

**మూడవ అయిటము :**

ఏడువేలు ; 147 రోజులకు రోజుకూ రూపాయి బేడా ఎనిమిది దమ్మిడీలు.

నాలుగువేల అయిదువందల పంథొమ్మిది రూపాయిలన్నర. ఈ అయిటములక్రింద రావలసినవడ్డీ.

**అయిటము నాలుగు .**

నాలుగు సంవత్సరాలనుంచీ

పదిహేడు వేలు

**అయిటము అయిదు .**

| | |
|---|---|
| టర్నర్ వెళ్లిపోయినపుడు | పదివేలు |
| రెండవదఫా | ఏడువేలు |
| మూడవదఫా | రెండువేలు |

మొత్తం పంధొమ్మిదివేలు

అన్ని అయిటముల మొత్తం లక్షా తొంభై మూడు వేలు వడ్డీతో కలిపి లక్షా తొంభై ఏడువేల అయిదువందల తొంభై ఆరున్నర

మిస్టర్ టర్నరు బహుశా ఫిబ్రవరి పన్నెండవ తేదీన వెళ్ళిపోయి వుండాలన్నమాట సెప్టెంబరు 18 వ తేదీకి రెండు వందల రోజులు దీనికి వడ్డీ నాలుగువేల తొమ్మిదివందల ఇరవైతొమ్మిది రూపాయల పదమూడణాల నాలుగుపైసలు

**27 ఆగస్టు శుక్రవారం**

ఇంగ్లీషు ఇలస్ట్రేటెడ్ మాగజైన్

గ్లిమ్సెస్ ఆఫ్ ది వరల్డు .

**11 సెప్టెంబరు, శనివారం**

మహారాణీవారు గవర్నరుకు తంతి యిచ్చారు కాపీ ఒకటి బాలయ్యానాయుడుగారికి పంపించారు మ్యానేజరుగారు దిద్దుబాటులుచేసిన ముసాయిదా కృష్ణమూర్తివద్ద వున్నది

**12 సెప్టెంబరు, ఆదివారం .**

హిందూస్థానీ పనికత్తెకు నెలకు ఆర్రూపాయిల చొప్పున యివ్వవలసిన యెనిమిదినెలల జీతం మొత్తం నలభై ఎనిమిది రూపాయలు యివ్వవలసినదిగా ఆర్డరయిందని జగన్నాధరావు పంతులుగారు నాకు చెప్పారు

**27 సెప్టెంబరు, సోమవారం ·**

బాడీసు బాగా ఉతక్కుండా పాడుచేసినందుకు అర్ధరూపాయి చాకలాడికి జరిమానా రామయ్యమ్మగారిద్వారా నాకీ సంగతి తెలిపారు

**11 నవంబరు లక్ష్మివారం**

మిస్టరు విల్లక్ యివాళ ఛార్జీ తీసుకొన్నాడు

**20 నవంబరు, శనివారం**

ఇవాళ హెచ్ హెచ్ దివంగతులైన మహారాజా వారి క్వార్టర్సుకు వెళ్ళి ఒక సారి చూసివచ్చారు

**26 నవంబరు ఆదివారం**

ఇవాళా అంతే

**21 నవంబరు శుక్రవారం ·**

ఎ దబ్ల్యు అండ్‌కోకు లెన్సు పంపమని టెలిగ్రాం యిచ్చాను. మేగ్ని ఫయింగ్ గ్లాసెస్ కావాలని ఎ సైజు ఒకటి బి సైజు ఒకటి 13 వ తేదీకే రావలసివుండె మరి

**9 డిసెంబరు లక్ష్మివారం ·**

తాళపత్రగ్రంథం యిచ్చినందుకు భట్రాజుకు పన్నెండు రూపాయలు చెల్లిస్తిని

**11 డిసెంబరు, శనివారం ·**

| | |
|---|---|
| పట్టుపంచెలు | పసుపురంగువి |
| బుఖ్నీ | ఎరుపు |
| సాటెన్ | |

**12 డిసెంబరు ఆదివారం .**

తెల్లచారలతో వున్న నీలిఉన్ని పావుపౌను పంపించమని విశాఖపట్టం ఉత్తరం రాశాను

**14 డిసెంబరు, మంగళవారం**

తెలుపు కుంకుమ రంగుల ఉన్ని రెండేసి పేకెట్టులు పంపమని మా వకీలుకి ఉత్తరం

**15 డిసెంబరు బుధవారం :**

చిట్టిబాబుగారికి సాటిన్ కోటుకు పాయిజామా కుట్టించమని పంతులుగారికి పురమాయించాను

**17 డిసెంబరు, శుక్రవారం :**

మా వకీలుగారు తెలుపు కుంకుమ రంగులవి నాలుగు ప్యాకెట్ల ఉన్ని పంపించారు

**18 డిసెంబరు, శనివారం .**

దత్తతస్వీకార మహోత్సవం ఇవాళ తొమ్మిదిగంటల నలభైఅయిదు నిమిషాలకు జరిగింది హిందూపత్రికలో రిపోర్టు

**22 డిసెంబరు, బుధవారం :**

పంటల ఎస్టిమేటు గురించి జరూరుగా ఆర్డర్లు పంపించమని గంగారం అమీను పంపుకున్న పిటీషనుమీద హెడ్ మ్యానేజరుగారు యిలా ఎండార్సు చేశారు

నా కీ పిటీషనుగురించిగాని అతని నియామకంగురించి గాని ఏమీ తెలియదు బహుశా శాసనపరిశోధకుడు శ్రీ అప్పారావుకు ఎస్టేటు గురించి అన్ని తబిశీళ్లూ తెలిసివుండవచ్చును - రిప్రజెంటు "

అందుమీదట మిస్టర్ విల్లక్ యీ వ్యవహారం గురించి వెనువెంటనే వొక ఫుల్‌నోట్ తయారుచేయవలసిందిగా" అప్పారావుకి ఎండార్సు చేశారు

**23 డిసెంబరు, లక్ష్మివారం :**

పిటిషను మీద రిపోర్టు వ్రాస్తూ మిస్టర్ విల్లక్‌కు ఇలా తెలియచేశాను "రెండు మూడు రోజుల్లోపున మెమోరాండం పంపిస్తాను రికార్డులు లభించలేదు కనక యిప్పటికి అసమగ్రమైన రిపోర్టునే పంపవలసి వచ్చింది "

మిస్టర్ విల్లక్ ఎండార్సుమెంటు : "అలా అయితే సంస్థానం ఆఫీసుకు వెళ్ళి రికార్డులుచూసి సమగ్రమైన మెమోరాండం తప్పకుండా పంపించండి."

**25 డిసెంబరు, శనివారం :**

దత్తత గురించి హిందూలో వ్యాసం.

**26 డిసెంబరు, ఆదివారం :**

"మిస్టర్ విల్లక్ మిమ్మల్ని రేపు ఉదయం కోటలో కలుసుకోవాలను కుంటున్నారండి" అని మ్యానేజరుగారు చెప్పారు.

**27 డిసెంబరు, సోమవారం :**

మిస్టర్ విల్లక్ నా యెడల ధూర్తుడుగా ప్రవర్తించాడు. "మెమోరాండం మీ రెందుకు తయారు చేయరు ?"

"రికార్డులన్నీ ఆఫీసులో వున్నాయి కదండి!"

"అయితే మీకు తెలుసున్నదే రాయండి. ఆఫీసులోకి వెళ్ళి పనికిరాని కవిలకట్టకోసం మానేజర్ని మీరూరికే ట్రబుల్ చేస్తున్నారే ?"

"నే నెవర్నీ ట్రబుల్ చేయలేదే ! సరే ! నాకు తెలుసున్న దేదో రాయమని మీరన్నట్లయితే నే నేనాడో రాసి పంపించేవాడిని."

"పోనీ ! వెంటనే యిప్పుడు రాసి యివ్వండి."

"మీరు అఫెండయినందుకు విచారం. మిమ్మల్ని అఫెండు చేద్దామనే ఊహ నాకు లేదు."

"సర్సరే ! నోట్ తయారు చేయండి."

"మీకది రేపే పంపించేస్తాను. గుడ్ యీవినింగ్."

**26 డిసెంబరు, బుధవారం :**

ఉదయం అయిదు గంటలకు మిస్టర్ విల్లక్‌కు రిపోర్టు పంపించాను.

**31 డిసెంబరు, శుక్రవారం :**

ఇది నాకు చాలా ప్రమాదకరమైన సంవత్సరంగా పరిణమించింది. శ్రీ విజయనగరం మహారాజావారు, నేను దారాపుత్రులకన్నా, తల్లిదండ్రులకన్నా అధికంగా ప్రేమించిన వ్యక్తి, పరమపదించారు. ఆయన శీలమూ, వ్యక్తిత్వమూ పరిణతమనస్కుల హృదయాలను ఆకట్టుకొనేవి. నిష్కల్మష హృదయంతో, నిండు దయతో, నిరంతర సత్యాన్వేషణతో ఆయన కుశాగ్రబుద్ధిగల మేధావులను ఆకర్షించేవారు. ఆయన పట్ల అవ్యాజమైన భక్తిప్రేమలు కలగడానికి కారణం ఆయన సుగుణసంపత్తి. మా జీవితములు ఆయన జీవితముతో పెన వేసుకు పోయినవి. లోకమునుంచి ఒక జ్యోతి వెడలిపోయినది.

మహారాజకుమారికావారికి నేనంటే ఆదరణ ఇంతా అంతా కాదు. చెప్పలేనంతదయ.

# 1898

**10 జనవరి, సోమవారం :**

శ్రీ కె.సి. నరసింగరావుగారివద్ద గుర్రాన్ని కొన్నందుకుగాను ఖరీదు ముప్పైఅయిదురూపాయిలు ఆయనకు చెల్లిస్తిని.

**11 జనవరి, మంగళవారం :**

విశాఖపట్టంజిల్లా మాన్యుయలు కాపీ శ్రీ బి. సూర్యనారాయణపంతులుకు యిచ్చాను. విల్లకు దొరకు కావాలని అడిగి తీసుకువెళ్ళారు.

**22 జనవరి, శనివారం :**

సూర్యగ్రహణము, ఉదయమే అక్కాబత్తుళ్ళనిద్దరిని నియమించవలెను. గ్రహణ కాలములో బంగారము, వెండి, రాగి కలిపిన మిశ్రమముతో ఎన్ని ఉంగరములు చేయగలరో అన్నింటినీ చేయించవలెను.

12 గంటల 20 నిముషముల 12 సెకండులకు దక్షిణముగా 64 డిగ్రీలు; పశ్చిమముగా 30.7 డిగ్రీలు. గ్రహణము ఆరంభము.

సూర్యగ్రహణము 15 గంటల 8 నిముషముల 54 సెకండ్లకు పట్టు విడుస్తుంది.

**1 ఫిబ్రవరి మంగళవారం :**

హిందూస్థానీ పనిమనిషికి ముప్పైఆరు రూపాయలు, ఆరునెలల జీతం.

**17 ఫిబ్రవరి, లక్ష్మీవారం :**

విశాఖపట్నం నుంచి "అప్" ట్రయిన్లు :

| రాక | పోక |
|---|---|
| 1-42 | 2-2 |
| 18 | 18-22 |
| లోకల్ | |
| 9-47 | 10-7 |

విజయనగరం నుంచి "డౌన్"

| రాక | పోక |
|---|---|
| 17-34 | 18-1 |
| 23-2 | 23-22 |
| లోకల్ | |
| 13-30 | 13-50 |

**18 ఫిబ్రవరి, శుక్రవారం :**

హార్బరు కట్టడానికి వైజాగ్ అద్భుతమైన ప్రదేశం. రాత్రి ఏడుగంటల పదిహేను నిమిషాలకు గవర్నరు వచ్చాడు.

**19 ఫిబ్రవరి** శనివారం

డాక్టర్ బ్రౌనింగ్‌ను కలిశాను గవర్నరు హార్బరుకు వెళ్ళాడు నేనూ అక్కడకు వెళ్ళాను

**20 ఫిబ్రవరి** ఆదివారం ·

ఫోటోగ్రాఫిక్ నెగెటివులు భూమికి సంబంధించిన వ్యవహారము విశాఖపట్టంనుంచి గవర్నరుగా ట్రెయినులో విజయనగరం బయలుదేరాను అదే ట్రెయినులో నేనూ బయలుదేరాను స్టేషనునుంచి తిన్న గవర్నరుగారూ డాక్టర్ బ్రౌనింగూ నేనూ కోటకు చేరుకున్నాము తరవాత వారిని పెద్ద పూలతోటకు తీసుకువెళ్ళాన

**21 ఫిబ్రవరి** సోమవారం ·

పేలస్‌కు గవర్నరు సాయంకాలం మూడుగంటలకు వెళ్ళిపోయారు

**27 ఫిబ్రవరి** ఆదివారం :

తీగ

నున్న కడియం

కెంపులతో తాపిన పతకంగల మూడు పేటలపలకసర్లు

పతకం లేకుండా మూడు పేటల పలకసర్లు

ఆరువందల రూపాయిలు

అయిటము రెండు

కంటె

వడ్డాణం

తీగ

డిటో

డిటా

కంకణాల జత

బాజుబందుల జత

యేదువందల రూపాయిలు

**1 మార్చి** మంగళవారం ·

యలమంచిలిది మంచి పుగాకు

**8 ఏప్రియలు** శుక్రవారం :

శ్రీ బాలయ్యగారిని సాగనంపితిని

**23 ఏప్రియలు** శనివారం ·

పి వి ఆర్ సన్సు మ్యూజిక్ హార్మోనియం

**24 ఏప్రియలు** ఆదివారం .

బిదుభూషన్ దాస్

అచ్చువేయడానికు పేపరు పదిరూపాయిల ఆరణాలు

శ్రీనివాసాచారి

**26 ఏప్రియల్, మంగళవారం :**

సాయంకాలం ట్రెయిన్లో బరంపురం బయలు దేరాను.

రిఫ్రెష్‌మెంటు రూములో రెండురూపాయలు ఖర్చు, కోచ్‌వాడికి అర్ధరూపాయి.

**27 ఏప్రియల్, బుధవారం :**

బరంపురంలో కలక్టర్ను కలిస్తిని.

మిస్టరు టయిలరుదొర రేపు యిక్కడకు వస్తున్నారు. రామయ్యకు రెండు రూపాయలిస్తిని.

**28 ఏప్రియలు, లక్ష్మివారం :**

ఉదయం మిస్టర్ వుల్ఫుముర్రేను కలుసుకొని ప్రసంగించితిని. గిల్‌మన్‌కు టెలిగ్రాం. ఖర్చు రూపాయిన్నర.

**29 ఏప్రియలు, శుక్రవారం :**

మిస్టరు టెయిలరు దొరతో సంభాషించితిని.

**30 ఏప్రియలు, శనివారం :**

మిస్టరు ఉల్ఫుముర్రే దొరను మళ్ళీ కలుసుకున్నాను.

రెండురూపాయిాలు యినాం.

ఒక రూపాయి బండి అబ్బికి.

**1 మే, ఆదివారం :**

క్యాంపు కంచిలి. సొనార్‌గొచ్చా ; గ్రాంధికం.

చెరువుకు దక్షిణంవైపు పచ్చని చింతలు, మొదళ్ళవలె కొన్ని; వెదురు పొదలించుమించు నీటి ఉపరితలాన్ని తాకుతున్నవి.

**2 మే, సోమవారం :**

అమీను. పెద్ద జమీందారును కలిశాను.

సోంపేట.

**3 మే, మంగళవారం :**

క్యాంపు సోంపేట, జలంత్రమేపు సంపాదించితిని. సోంపేటనుంచి విజయనగరం బయలుదేరాను. రెండున్నర రూపాయిాలు రాముడికి. రంగస్వామినాయుడుకొక రూపాయి.

**12 మే, లక్ష్మివారం :**

చి॥ నాన్నమ్మ వివాహం.

చి॥ బాబు ఉపనయనం.

**14 మే, శనివారం :**

సదస్యం.

**14 జూన్ శుక్రవారం**

తమదగ్గర మహారాజావారి వజ్రాల బ్రోచ్ వుండిపోయినదని తెలియజేస్తూ శ్రీ బాలయ్యనాయుడుగారు మహారాణివారికి యిచ్చిన తంతి కాపీ నొకదాన్ని మిస్టర్ విల్లకు దొరకు అందజేస్తిని

**15 జూన్ బుధవారం**

రిఫ్రెష్‌మెంటు రూమ్ బిల్లు

**24 జూన్, శుక్రవారం**

ఏదో భూముల తగువుల్లో యిరుక్కున్న రైతులువస్తే వాళ్ళని మ్యానేజరుగారి చెంతకు తీసుకువెళ్ళండని రీవా మహారాణీవారు నాతో చెప్పారు సరేనని రైతులను వెంటబెట్టుకొని మ్యానేజరుగారి ఆఫీసుకు వెళ్ళాను నేను వెళ్ళేసరికి మ్యానేజరుగారు ఆపనీ ఈపనీ చూసుకుంటూ నన్నలాఎంతోసేపు కూచోబెట్టి విల్లకు దొరగారి చూడవెళ్ళారు అక్కడనుంచి తిరిగివచ్చి దొరగారు మిమ్మల్ని పిలుస్తున్నార ని చెప్పారు

తీరా నేను వెళ్ళేసరికి దొరగారు తన ధోరణిలోలేరు గిరుక్కున నా కేసితిరిగి చూసి మంచిది ఏమిటీ వ్యవహారం? అని ప్రశ్నించారు

ఈ వ్యవహారం గురించి నాకేమి తెలియదండి రైతుల్ని మ్యానేజరుగారిదగ్గరికి తీసుకు వెళ్ళమంటేనూ

అలా అయితే నన్ను కలుసుకోవాలని మీరెందుకనుకున్నారు?

అనుకో లేదండీ

ఈ విషయంలో యాక్షను తీసుకునేదినేను మేనేజరు కాదు ఆయనదగ్గరికి మీరెందుకెళ్లారు ? ఇలాంటి వ్యవహారాలు నేను సాగనిచ్చేదిలేదు

అసలు వ్యవహారమేమిటో నాకు తెలియదు ఇదేదో రైతుల వ్యవహారం వీళ్లని రీవామహారాణివారు మ్యానేజరుగారిదగ్గరికి తీసుకు వెళ్ళమంటే సరేనన్నాను ఇంతే నేను చేసింది

హాఁ నాకు తెల్సును ఈ వ్యవహారానికంతా మూలం మీరే యు ఆర్ ఎట్ ది బాటమ్ ఆఫ్ దిస్ యస్ మీ ప్రవర్తన గురించి మీరు జాగ్రత్తపడాలి

నా ప్రవర్తన నాకు తెలుసును కాని నేనేమీ బాటమ్‌లో లేను మీ కంత కోపం ముంచుకొస్తున్నందుకు నాకు మాత్రం విచారంగా వుంది

యస్ యస్ సరే సరే ఇక మీరు వెళ్ళండి

**4 జూలై, సోమవారం**

ఫిబ్రవరి 1896 లో తాకట్టుపెట్టిన నగలు విడిపించాను

**15 జూలై, శనివారం .**

మైనరుమహారాజావారికి కుట్టించిన ఆరు షర్టులను టైలరింగు డిపార్టుమెంటువారు వెంకటస్వామిద్వారా యివాళ పంపించారు

**16 జూలై, ఆదివారం :**

కోట ఆవరణంతా పరిశుభ్రం చేయించమని కబురురాగా సంజీవరావు పంతులుగారిని పాకీవాళ్ళని పిలిపించమని కోరాను.

మాలిని గురించి రిపోర్టు. గరిశధాన్యం.

**20 జూలై, బుధవారం :**

మూడు తులముల తొమ్మిది అణాల పరకకు ఒక గురి విందగింజ తక్కువ.

**21 జూలై, బుధవారం :**

ఇరవైరూపాయలు పుచ్చుకుని, అందులో పంథొమ్మిది రూపాయలు అమ్మకు పంపించాను. పోస్టుజవానుకు అయిదు రూపాయల ఆరణాలు. అముద్రిత గ్రంథ చింతామణి చందా.

**31 జూలై, ఆదివారం :**

గార్డియను మిస్టరు డబ్ల్యు.ఎ. విల్లకు, మహారాజ కుమారికపేరున ఇరవైఅయిదువేలకు స్వయంగా తానే ప్రోనోటు వ్రాశాడు. సంవత్సరానికి నూటికి ఆర్రూపాయల వడ్డీ చొప్పున ఈ సొమ్మును మహారాణీవారు యిచ్చారు.

**3 ఆగస్టు, బుధవారం :**

మహారాణీ సాహేబావారు చెప్పిన ప్రకారం పాచిపెంటలో వున్న సకినేటి జగన్నాధరాజుకు కవరుపంపించాను.

**20 ఆగస్టు, శనివారం :**

బంగారు కంకణాల జతమీద అమ్మ వందరూపాయలు ఆమెకు యిచ్చింది. టంకప్పొడి, లక్క పట్టుతో కలిపి తూకం ఏడుతులాలు.

**11 సెప్టెంబరు, ఆదివారం :**

మిస్టర్ గిల్‌మన్ దొరను కలుసుకొని, కె.వి. వ్యవహారాలను గురించి ముచ్చటించాను.

గిల్‌మన్‌దొర హంపి, విజయనగర శిధిలాలను చక్కగా ఫొటోకు ఎత్తాడు. శిల్పాల ఫోటోలను చూశాను. ఫోటోగ్రాఫిక్ కెమెరా ఎరువు కావాలన్నాడు.

**14 సెప్టెంబరు, బుధవారం :**

మిస్టర్ గిల్‌మన్‌కు యిమ్మని ఉత్తరం పంపించారు.

**15 అక్టోబరు, శనివారం :**

పోలో టోర్నమెంటు.

**24 అక్టోబరు, సోమవారం :**

విజయదశమి. రాజావారికి ఉద్యోగులు అనేక ఫలాలను కానుకలుగా సమర్పించారు.

**28 అక్టోబరు, శుక్రవారం :**

డవేజరు మహారాణీవారిని శ్రీ రామానుజాచారిగారు కలుసుకున్నారు.

**4 నవంబరు, శుక్రవారం :**

డవేజరు మహారాణీవారి విల్లు.

**5 నవంబరు, శనివారం :**

ఉదయం తొమ్మిదీ యేభైఅయిదు నిముషాలకు బెనారస్ బయలు దేరాను.

**6 నవంబరు, ఆదివారం :**

గార్డులకు పాతిక రూపాయిలు.

**7 నవంబరు, సోమవారం :**

వాడీ చేరుకున్నాను. గరవ్నమెంటు ప్లీడరు కలుసుకున్నాడు.

**8 నవంబరు, మంగళవారం :**

ఎనిమిదిన్నరకు అహమ్మదునగరు.

పాలు మంచినీళ్ళు తెచ్చాడు. తొమ్మిదిన్నర ఖర్చు.

**9 నవంబరు, బుధవారం :**

వొకచెక్కపెట్టె కొన్నాను.

**13 నవంబరు, ఆదివారం :**

కాశీలో బాబూ మొహన్‌దాస్ మిత్రాను మహారాజా వారు చూశారు.

**17 నవంబరు, లక్ష్మివారం :**

కుమారరాజా ; స్వామి భాస్కరనందను మహారాజా వారు పలిపించారు.

**18 నవంబరు, శుక్రవారం :**

హరివిద్యానాథశాస్త్రి

సీతారాం, అలహాబాద్.

**30 నవంబరు, బుధవారం :**

బెనారస్ రాజకుమారుడు కబురుపెట్టారు.

**3 డిసెంబరు, శనివారం :**

ఈ వారం అన్నీ విశేషాలే. మార్కట్టు చూడతగ్గదిగా వుంది. గవర్నమెంటు పేపరు గురించిన పని ముగిసిం

**4 డిసెంబరు, ఆదివారం :**

శ్రీ 'హో'గారిని చూడదానికి మూడు నాలుగుగంటల మధ్య వెళ్ళవలెను.

**17 డిశంబరు, శనివారం :**

సి. 49/2 గవర్నమెంటు పేపరుసొమ్ము ఖర్చయిపోయినది.

**29 డిశంబరు, లక్ష్మివారం :**

టర్నరుగురించి బి.ఎస్.వ్రాసిన ఉత్తరం అందింది.

# 1900

**17 మార్చి :**

మదరాసులోవున్న మేనేజరాఫీసుకు యెవరో మరి, ఆకాశరామన్న వుత్తరమును వ్రాసిరి.

**16 ఏప్రియల్ :**

మద్రాసు ప్రభుత్వపు ప్రొసీడింగులు. ఉత్తరువు నెంబరు

357 ఆఫ్ మార్చి 9 ;1900

"ఛీఫ్ సెక్రటేరియటు పుస్తకక భాండాగారములో వున్న శ్రీ అప్పారావుగారు పేర్కొన్న రికార్డులను, అవి రహస్యముగా వుంచవలసినవి కానందున, వాటిని పరిశీలించడానికి శ్రీ జి.వి. అప్పారావుగారికి అనుమతి ఒసంగడమైనది. ఇందువిషయమై జనరలు రికార్డు డిపార్టుమెంటు సూపరెండెంటుతో ఉత్తర ప్రత్యుత్తరాలను జరపవలసినదిగా శ్రీ అప్పారావుగారిని కోరడమైనది."

**29 నవంబరు, బుధవారం :**

కలకత్తా చేరుకున్నాము, తెల్లవారిన దగ్గరనుంచీ మేము చూసినవన్నీ వరి పొలాలే. నగరసరిహద్దులు దగ్గర పడుతున్న కొద్దీ మిల్లులు మాకు ఎదురయాయి. నిన్న సాయంకాలము బీహారు మీదుగా ప్రయాణము చేస్తిమి. ఎటుచూసినా సమతల ప్రదేశము. పంటలతో అలరారుతున్నది. జొన్నచేలు, శనగచేలు, చింతతోటలు పుష్కలముగా కనిపించినవి.

సీల్డాప్యాలసు అందమైన భవనమే ; నివాసయోగ్యంగానూ, సదుపాయముగానూ వున్నది. కానైతే పరిసరములు మాత్రం రోతగా వున్నవి. రైల్వేస్టేషనూ, ఫ్యాక్టరీల గడబిడ జాస్తీ. భవనమునకు చుట్టూ కాంపౌండూ, తోటా కలవు. కాంపౌండులో రెండు గృహములు వున్నవి. భవన నిర్మాణములో శిల్పచాతుర్య మేమంత చెప్పుకోతగ్గది కాదు.కాని గదులు వొకదాని కొకటి యెదురెదురుగానూ, విశాలముగానూ వున్నవి. కలకత్తాలో గృహ శిల్పం గొప్పదేమీ కాదు. మాయముండామాటలూ వీడూ, ఇటాలియను ఫెర్గ్యూసను చెప్పినంత సుందరవంతమైనదేమీ కాదు.

మునిసిపలు మార్కెట్టు చూడదగ్గ మనోహరమైన స్థలాల్లోకల్లా ముఖ్యమైనది.

**30 నవంబరు, లక్ష్మివారము :**

న్యూమన్స్ కేటలాగులో ప్రాచీన భారతదేశ భూగోళ చరిత్ర పుస్తకము వున్నది. ఒక నిఘంటువు. వీటిని కొనవలెను.

పుస్తకశాలవద్ద "ది ఫ్రెంచి యిన్ యిండియా" అనే గ్రంథమును జూస్తిని.

**1 డిసెంబరు, శుక్రవారం :**

షాపుకు వెళ్ళి గ్రంథాలను ఖరీదు చేస్తిని. హారిసనురోడ్డు విద్యుద్దీపములతో కలకలలాడుచుండెను. వొకదానిని తప్పించి యింకొక నైరుపోస్టునకు దీపపుగ్లోబులు అమర్చబడివున్నవి. వీధి వీధి అంతా ధగ ధగ మెరుస్తూ వేయి చంద్రబింబములు వుదయించినట్లుండెను. వెన్నెల దూరినట్లు వున్నవీధి.

**3 డిసెంబరు, ఆది :**

మ్యూజియమును చూస్తిని. ప్రాచీన శిల్పఖండములను దర్శించితిని. బౌద్ధశిల్పములే హెచ్చుగా వున్నవి. దుస్తుల అలంకరణములోనూ, అవయవ నిర్మాణపు తీరులోనూ, శిరోజములను దిద్దుకొనుటలోనూ, గ్రీకుల శిల్ప ప్రభావము పొడగట్టుతున్నట్లు నాకు తోచినది. ముఖవిన్యాసములో సైతము గ్రీకుల ప్రభావము కద్దు.

ప్రాకారము అమరావతిలోవలె కాక దాబు దర్పములు లేకుండెను. అక్కడ మరికొన్ని స్థూపములు కలవు. అనేక శిరస్సులు బుద్ధునివీ, బోధిసత్వులవీ పదిల పరచి వుంచాను. వీటిలో కొన్ని మహాసౌందర్యముగ చెక్కినవి. శిల్పవిన్నాణము యెన లేనిది.

ఆశ్చర్యం ; ఇక్కడ వొక దక్కను శాసనపుపలకవున్నది. దీనిని శ్రీ కొవల్లి వెంకటరామయ్యగారు బహూకరించారు.

ఇవేకాక, మరికొన్ని జైన విగ్రహములను మ్యూజియములో చూస్తిని. బుద్ధ, బోధిసత్వుల విగ్రహములను కడుజాగరూకతతో పరిశీలించినపుడు, నాకు కనిపించిన భేదమల్లా బోధిసత్వుల విగ్రహములకు ఆభరణము లున్నవి; బుద్ధ విగ్రహములకు లేవు.

కొన్ని జైన విగ్రహములు నించున్నట్లు చెక్కినారు.

కాశీలో ప్యాలసునకు సమీపముగ పార్శ్వనాథుని దేవాలయములు గలవు. రోడ్డునకు పక్కగావున్న గుడి మొన్న మొన్నటిది. ఇక్కడనుంచి, ప్రాచీన దేవాలయమున కొక రోడ్డు కలదు. దేవాలయము లోపల, కిటకిటలాడుతూ భోపాలు నుంచి యాత్రికులు వచ్చి గుమిగూడివుండిరి.

అచ్చట మూడు చిన్నచిన్న కోవెలలు గలవు. వీటిలో పీఠములూ, పీఠములలో తీర్థంకరుల విగ్రహములూ ప్రతిష్ఠించి వుంచిరి. ఈ విగ్రహములలో కొన్ని పాలరాతివి. మరికొన్ని నల్ల శానాపురాయివి.

ఒక చాన్దిని. దేవాలయపు స్తంభములు కొన్ని చతురస్రాకారముగానూ, మరికొన్ని యెనిమిది కోణములతోనూ వుండి, వాటిపై స్త్రీల ప్రతిమలు చెక్కబడినవి. (పురుషుల విగ్రహములుకూడ చెక్కి వున్నవి?) ఈ విగ్రహములు గానము చేస్తున్నట్లూ, వివిధ భంగిమములతో అలరారుతూ వున్నవి.

ప్రాచీన దేవళమునకు ఒక 'బేడా' కలదు ; అర్వాచీన దేవాలయమునకు మాత్ర మదిలేదు. ఇది యిటీవల కట్టినదే. కాశీలోని హిందూదేవాలయములను పోలివున్నది.

* * *

నిన్న రాత్రి నేషనలు థియేటరునకు వెళ్ళితిని. థియేటరు జనంతో కిటకిటలాడుతూ వుండెను. ఆరుగురు మనుషులు నిలబడడానికిమాత్రము జాగా వుంది.

నటుల వేషధారణ యెంతో వాస్తవికముగానూ, సహజముగానూ వుంది. దుస్తులలో ఆడంబరములేదు. సంగీతము లేనేలేదు. రంగము ముగిసిన తరువాత మాత్రము సంగీతము వినిపిస్తూ వుండెను. నటన అత్యద్భుతముగా, సొగసుగా వున్నది. బఫూనరీ తప్పించి మిగిలినదంతా సహజసిద్ధమైన పాత్రోచితమైన అభినయము. విషాదాంత నాటకములలో మధ్యమధ్యన బండ హాస్యము చాలా [illegible]గతముగా వుంటుంది ;

నిన్న ప్రదర్శించిన నాటకము విషాదాంతము.

బెంగాలీ థియేటరునకుకూడా నేను వెళ్లి చూస్తిని. ఇది మిగుల చిన్నది. నేను వెళ్ళేసరికి వొక ప్రేమ ఘట్టము ప్రదర్శితమౌతూవున్నది. వొక అమ్మాయికీ, మరివొక నిద్రభంగికీ జరుగుతున్న ప్రేమఘట్టం. యువకుడు చాలాదృఢకాయుడు. పగడపు రంగుదుస్తులు ధరించి వున్నాడు. పిల్లయితే మధురముగా మాటలాడుతూ, చక్కగా నటిస్తున్నది. కాని, చూడదానికి నాజూకుగా కనిపించలేదు.

మిగిలిన రంగములన్నీ బఫూనరీలే ! ఒక బ్యాలటు మాత్రము బహుబాగున్నది. ట్యూనులు చక్కగా వీనుల విందుగా వున్నవి. కాని వాయిద్యసమ్మేళనముమాత్రము ఘోరాతిఘోరం !

**4 డిసెంబరు, సోమవారం :**

హైకోర్టు భవనములను చూడదానకు పయనమైతిని. కోర్టు ఆవరణ చిన్నదేకాని, అయితేనేమి, మిగుల పరిశుభ్రముగా కడిగిన ముత్యమువలె వున్నది. పార్కు సొగసుగా మురిపెముగా వున్నది. మద్రాసు హైకోర్టునకు యీ అందములేదు. ఇక్కడ చక్కని గాలీ, వెలుతురూ వచ్చునట్లుగా కట్టిన వల్కావాలు, [illegible] చాలినంత విస్తీర్ణం.

**5 డిసెంబరు, మంగళవారం :**

ఉదయము, కలకత్తానుంచి బయలుదేరితిని. హుగ్లీ పరిసర వాతావరణం, వృక్షములు కనులకు విందుగొల్పుతున్నవి. విశేషించి, సితాపూర్ తోటలెంత మనోహరముగా, వున్నవని ! స్టీమర్లు పడవలు, మిల్లులు !

**6 డిసెంబరు, బుధవారం :**

విజయనగరము చేరుకొంటిని. ఉదయము దారిలో భువనేశ్వరాలయమును చూస్తిని. దట్టమైన అడవులమధ్య విశాలమైన మైదానములో దేవాలయపు గోపురములు కనబడినవి. నదీతీరాన, దారి అంతా మంచుతో కప్పి వున్నది.

**7 డిసెంబరు, లక్ష్మివారం :**

మదరాసు చేరుకుంటిని. ఎస్కార్టుగా ఎనిమిదిమంది. మా కోసము బగ్గీసిద్ధముగా వున్నది. జయపూరు, తదితర జమీందారులూ వచ్చిరి.

**10 డిసెంబరు, ఆదివారం :**

రీవారాణి బగ్గీమీద వెళ్ళినది. 'బొబ్బిలి'ని చూసినది.

**11 డిసెంబరు, సోమవారం :**

వైస్రాయి మదరాసు వచ్చాడు. రీవారాణి, వైస్రాయికి వంటకములను పంపించినది. గిల్మన్ వచ్చినాడు.

**12 డిసెంబరు, మంగళవారం :**

ఆహ్వానసభకు మహారాజా లనేకమంది హాజరైరి.

రీవారాణి "విక్టోరియా ప్రశస్తి" కాపీలను వైస్రాయికీ, ఆయన సతీమణికీ పంపించినది.

# అడ్మిరాల్టీలో ఉదయం

పిట్టలు కిల కిలమని పాడుతున్నవి. ఒడ్డున విరుచుకుపడుతున్న తరంగాలతో, దూరంగాచూస్తున్నకొద్దీ పోనుపోను సముద్ర జలాలు ధగధగ ప్రకాశిస్తున్నాయి. తరంగములు ముందుకు విరుచుకుపడి, ఒడ్డునుంచి వెనుకకు తగ్గుతున్నపుడు నలుపు వర్ణము కనిపించుచుండెను. సముద్రం ఒడ్డున కొంచెము దూరముగా సాల్పోర్లో పచ్చిక యెదిగివుంది. సముద్ర తీరము, దిగువగానూ నేలకు లెవిలుగానూ వుంది.

సముద్రతీరమున కివతలభాగాన కొన్ని తాడిచెట్లూ, చిన్న చిన్న ముళ్ళదుబ్బులూ గాలికి కదలాడుతున్నవి వాటికి దిగువస్థలాన మరికొంతదూరములో సరుగుడు, కొబ్బరితోటలు కనిపిస్తున్నాయి. సముద్రతీరాన్నుంచి ఒకరోడ్డుమీదుగా వెళితే అక్కడ శ్మశానము. అడ్మిరాల్టీనుంచి మరొక రోడ్డుమీదుగా పోతే ఊరి తగులుతుంది. దారిలో సరుగుడుతోటలగానము వినిపిస్తుంది. పోర్టికోకు వెళ్ళుమార్గములో చక్కని పూలతోట, లతామంటపములతో పరిమళములను వెదజల్లుతున్నది. తోట చుట్టూ వెదురుపొదల కట్టవు కలదు. తోటమధ్య సొగసైన ఫౌంటెను, దానిచుట్టూ పూలతివ్వల పందిళ్ళూ శోభతో అలరారుతున్నవి. పోర్టికో, నాజూకైన గుండ్రనిస్తంభములతో కట్టబడ్డది. స్తంభములు పెద్దవేకాక చాలా పొడుగు. స్తంభముల మొదళ్ళు చతురస్రాకారాముగా వున్నాయి. స్తంభములమీద పచ్చనిరంగుతో లతలు, తెల్లగా మెరసేటట్లున్న పువ్వులు అంచులుగా చెక్కబడ్డవి.

డ్రాయింగు రూమునకు దిగువన పాలరాతి మేడమెట్లు కలవు. డ్రాయింగురూము లోపలభాగము ఆకుపచ్చనిరంగుతో అద్దకము వేసినట్లున్నది. గదిచెంత పూలలతలు. గది సీలింగు కూడా రంగువేసి వుంచారు. డ్రాయింగురూములోకి వెళ్ళే ద్వారమునకు లలితమైన తెరగుడ్డ అమర్చివుంది. తలుపులకు నలుపురంగు.

ఒక ద్వారముచెంత నిలబడితే యెదురుగ సముద్రం అవుపిస్తుంది. ఇంకొక ద్వారము తెరిచి చూస్తే చుట్టూ వున్న గోడ కనిపిస్తుంది. గదిగోడకు నిలువుటద్దములు, కింద బల్లమీద నల్లని సింహపు ప్రతిమా వున్నవి.

గదిముందు విల్లు ఆకారముతో మనోహరమైన ఒక పూల పందిరి కలదు. అందమైన లేకుబద్ద మీద నగిషీ చెక్కిన చందమున పూలతీగలు అల్లుకున్నవి.

ఆవరణచుట్టూ వున్నగోడకు గదికి యెదురుగ కర్రతో చేసిన గేటువుంది. గేటు చెక్కడపుపని మితముగా వుంది. గిల్టుతో మలామాచేసిన గేటుమీద రెండు చిన్నసింహపు పిల్లల ప్రతిమలు నిల్పుతున్నవి. ద్వారపు గోడమీద చిన్నిచిన్ని పిరమిడ్ల ఆకృతిని రెండు కొప్పులు.

మీది అంతస్థునకు వెళ్ళేందుకు గేటుచెంతనే మెట్లు వున్నవి. పడమటి దిక్కున కుడివైపు మలుపులు తిరగవలెను.

గదిలో టేబిలుమీద యించుమించు నగ్నముగా వున్న కంచువిగ్రహము యెడమచేత్తో డాలూ, కుడిచేత్తో ముందుకు విసురుతున్న బల్లెమూ పట్టుకుని భయంకరమైన భంగిమలో నిలబడి వున్నది.

**15 డిసెంబరు, శుక్రవారం :**

'మొదలు ఫారము' నకు పోతిని.

(1) అరటిమొక్క పెరుగుదలకు నిరోధము కలగకుండా వాటి పిలకలను యెప్పుడు తీసివేయవలె ?

అరటి మొక్కలకు యెరువులు. పెంట.

చెరుకు పంట పాడవకుండా, చెదపట్టకుండా కాపుదల చేయవలెను. పొలమునకు చక్కగా నీరుపట్టవలెను. మన్నులో సున్నము వెదజల్లి - యెకరమునకు ఒక అరటన్ను - ఫినాయిలు రెండు గేలనులు. చక్కని నీటిపారుదల.

(2) కాలువ గట్టుల ఏ పంటలు పండించవలెనో.

(3) కాలువలు మేట వేయకుండా ఆపుట యెట్లు ?

**16 డిసెంబరు, శనివారం :**

శ్రీ భాష్యంగారు కబురు పంపించారు.

**17 డిసెంబరు, ఆదివారం :**

మైనరు మహారాజావారిని వైస్రాయిగారు రమ్మనమని వర్తమానం పంపించినారు.

**18 డిసెంబరు, సోమవారం :**

ఉదయం.

నిన్నరాత్రి చిన్న చిన్న తుంపర్లతో పన్నీరు చల్లినట్లు వానచినుకులు పడినవి.

తూర్పుదిక్కున ఆకాశపు మూలల పొగలవంటి మబ్బులు కమ్ముకు వచ్చాయి. మబ్బులరంగు దట్టముగా లేదు. తూర్పు దిశనుండి మబ్బు లటుయిటూ కదలాడి మిగిలిన ఆకాశమును అక్కడక్కడ పలచని బట్టతో కప్పినట్లు తెరలు తెరలుగా కమ్మినవి.

చల్లని పిల్లవాయువులు వీస్తూ, నీలి ఆకాశము పూర్వ రంగముగా వున్న కొబ్బరితోటలను కదలిస్తూ, అపుడపుడు మర్మరధ్వని చేస్తూ వున్నవి. ఆకాశమూ, భూమీ కలుసుకున్న చోట, కొంచెము దూరమున ఎత్తుగా విదియనాటి చంద్రుడు. చంద్రునకు దిగువభాగాన, మూడు నాలుగు గజాలదూరంలో చిన్ని నక్షత్రము మిణుకు మిణుకుమని మెరయుచుండెను.

సముద్ర తీరమునకు కొంచెము దూరములో పాయలు పాయలుగా చీల్చుకొని వచ్చే తరంగాలమీద బెస్తవాళ్ళు వలలువేసి చేపలను పట్టుకొంటూవుండిరి !

**20 డిసెంబరు, బుధవారం :**

సర్ ఆర్థర్ హేవ్ లక్ వచ్చాడు. ఇంటర్వ్యూ ముప్పావుగంటసేపు. వెళ్ళిపోతూ ఆయనన్నమాట లివి : “మీదగ్గర” ఆమె వద్ద సెలవు తీసుకునేందుకు విచారముగా వున్నది.”

## చే య వ ల సి న ప ను లు

ఓక్స్ వేలంవేసే సెకండు హాండు పుస్తకాలను ఖరీదు చేయడము. మా తమ్మునికి ఒక గడియారము, ఒక పెన్నూ, అమ్మకు చంద్రహారపు గొలుసు. చక్కని వొకదుప్పటి.

లిటరరీ సొసైటీ లయిబ్రరీనుంచి గ్రంథములను తెచ్చుకోవలెను. ఇండియను ఆంటిక్వరీ ది ఎపిగ్రాఫికగా యిండికా. కృష్ణాజిల్లాలోని బౌద్ధశిల్పములను, శాసనములను తెలిపే ఫోగట్టు.

# దృశ్యములు

**26 డిసెంబరు, మంగళవారం :**

రాత్రి, నీళ్ళల్లో దీపములు ప్రతిబింబించు చుండెను. అక్కడక్కడ వెలుగుతున్న దీపములకాంతి నదీ వక్షోజమున పడి తళతళ మెరుస్తున్నవి.

ఆగ్నేయ దిశను సరుగుడు, కొబ్బరితోటలు కలవు. ఈ దృశ్యమును చూసేసరికి, యేదో తెలియని ఉల్లాసమూ, ఉత్సుకతా కలిగినవి.

మనం, సొగసును, లావణ్యాన్నీ సౌందర్యాన్నీ భావించుకుంటాము. మనుషులపట్ల కూడా మనం యింతే. మనుషుల గురించి మనకు యెంత తక్కువగా తెలిస్తే అంత యెక్కువగా వారినిగురించి మన ఊహాపోహలు పోతూవుంటవి. ఈ ఊహలు యెంతో రమ్యంగా వుండడం కద్దు. ఊహలు రమ్యంగా వుంటున్న కొద్దీ ఆ మనుషులను తెలుసుకోవాలనే ఆసక్తి అధికమౌతూ వుంటుంది.

రాత్రి ఆ నీళ్ళల్లో ప్రతిబింబించే దీపముల కాంతి యెక్కడ నుంచి వచ్చి పడుతున్నది ? ఆ దీపములు బెంగుళూరు కిరస్తానుల యింగ్లీషు కుటుంబము కాపుర ముంటున్న బంగళాలోనివి. భార్య కొత్తగా కిరస్తానీమతము స్వీకరించినది. ఇదివరకు ఆమె హిందూ స్త్రీ ; నూతనముగా హిందూ స్త్రీని వివాహమాడిన యూరోపియన్ తనమనసులో తన భార్యను గురించి ఏమి ఊహించుకొనునో ! నిజముగా అతని భావములు గమనించతగ్గవి. ఆమె నడవడి, ఆమె పరిసరములు, ఆమె గత జీవితము, తొలినాటి ముచ్చట్లు చిన్ననాటి వేడుకలు యివన్నీ ఆసక్తిని కలిగించేవే ! ఆమె పెనిమిటికీ ఊహలు మధురముగా వుండును కాబోలును !

**31 డిసెంబరు, ఆదివారం :**

ఈ వేళ యేమి రాసేది నేను? ఇవాళేమీ ముఖ్యమైన సంఘటన జరగలేదు. కనక వొక విషయమునుమాత్రము పేర్కొంటాను. పంధొమ్మిదవ మహాశతాబ్దము నేటితో గడిచిపోయినది.

## 1901

**1 జనవరి, సోమవారం :**

నూతన సంవత్సరము. 1901. నూతన శతాబ్దము. పాపం ! ఈ శతాబ్దములో జీవించే అదృష్టము మహారాజా వారికి లేకపోయినది !

**6 జనవరి, శనివారం :**

రాత్రి పదకొండు గంటలకు మదరాసునుంచి బయలుదేరాను.

**7 జనవరి, ఆదివారం :**

మార్గమధ్యలో వున్నాను.

**8 జనవరి, సోమవారం :**

విజయనగరమునకు ఉదయమే చేరుకున్నాను.

**9 జనవరి, మంగళవారం :**

'నేంద్రకోజా' మలబారు అరటిమొక్కను తోటలో నాటితిని.

**13 జనవరి ఆదివారం :**

చెరుకుపొలములో యేదురోజులు గొర్రెలమందను కట్టించితిని మధ్యభాగంలో నాలుగు రాత్రుళ్ళు

నిన్నరాత్రి వొక దుక్కి వాన కురిసింది ఉత్తరమున కట్టుబాగా తడిసింది మీదకు కొంచెం దూరంగా కట్లు తడవలేదు బహుశా యిక్కడ వానపడలేదు కాబోలును చెరువుకు నీరు కట్టించితిని

**18 జనవరి శుక్రవారం :**

పదిహేనో తారీఖున వర్షం కురిసింది ఇంతవరకూ ఆకాశం మబ్బులతోనే వుంది వర్షం విపరీతంగా కురియడం వలన గట్టుమీద సర్వేరాళ్ళు కొట్టుకు పోయినవి మన్ను మేట వేసింది

అరటితోట వేయడమే మంచిది మంచి లాభసాటిగా వుంటుంది

**19 జనవరి శనివారం :**

మాధవదొరవద్ద పట్టుకొచ్చిన అనాసమొక్కలను నాటించితిని వెయ్యి ఒక్కంటికి అయిదురూపాయల ఖరీదు నాకు అవసరం పడ్డవి అయిదువందలు గెడ్డకు అవతల భాగాన అరటి మొక్కలను పాతించితిని

వాతావరణం మబ్బుగానే వున్నది నల్లనిమేఘాలు ఆకాశంమీద పరుగులుతీస్తున్నవి కాని మూడురోజులనుంచి ఒక్క చినుకైనా పడిందికాదు

మతారుబొందలో నీరు నిల్వవుంది

నక్కదోస గింజలు చెరువుగట్టున జల్లించవలెను గెడ్డమీద కర్బూజాకూడా వేయించవలె

**20 జనవరి ఆదివారం ·**

సరే ఫిబ్రవరి 26 వ తేదీన హాజరుకమ్మని కోర్టుసమనులు వచ్చి పడ్డాయి

**14 జూన్**

ఇవాళ విజయనగరముమీదుగా మిడుతలదండు వొకటి దూసుకుపోయినది

**29 జూలై .**

జోత్పూర్ మహారాజా అర్జునసింగ్జీ యివాళ వచ్చారు

**31 జూలై .**

ఆయనను నే నీరోజున కలుసుకున్నాను ఆరువేల రూపాయలు నగదు మరికొన్ని బహుమతులు ఆయనకు యిచ్చారు

**1 ఆగస్టు .**

మహారాజా అర్జునసింగ్జీ నేటి సాయంకాలం వెళ్ళిపోయారు

**9 ఆగస్టు :**

నిన్నరాత్రి వెంకన్న పంతులుగారు చనిపోయినారు పాశ్చాత్య నాగరికత తెచ్చిపెట్టిన మంచీ చెడూ ద్విగుణీకృతమై ఆయనలో మూర్తీభవించినవి ఆయనకు పౌర కార్యకలాపాలపై ఆసక్తిమెండు మనిషికి ధైర్యం వున్నది స్వతంత్రుడు కాని మనిషి మనసుకు యేదితోస్తే అది యెంతతోస్తే అంత ఆలోచనలకు తూకము లేదు

ఆయనంటే కిట్టనివాళ్ళు ఆయనకుగల చెడ్డగుణాలనే చెబుతారుకాని ఆయన మంచిని ఎన్నికచేయరు. ఆయన చెడ్డను గోరంతలు కొండంతుల చేస్తారు. కాని అటువంటి దుర్గుణాలు ప్రస్తుతం మన సమాజంలో వృద్ధ మేధావివర్గమునకు తప్పని సరిగా వుండకమానవనే విషయాన్ని వీరెవరూ గుర్తించడం లేదు.

మన మతనమ్మకములు, సాంఘిక అభిప్రాయములు, ఆశయములు అంతో యింతో వ్యక్తిగత జీవితములో నైతిక ప్రమాణమును కలుగజేస్తూనే, ఇంకొకవంక పౌరహిత జీవితములో సద్వర్తనమును, నీతిని కలిగించలేకపోతున్నవి; విద్యాధికులైన భారతీయులపై ఇవి తమ ప్రభావమును నెరపలేక పోతున్నవి. పాశ్చాత్య విద్యావిధానము ముందునకుపోయే గమన శక్తిలేని కేవలము కొన్ని అభిప్రాయములను, ఆశయములను మాత్రమే వుపదేశిస్తున్నది. సామాజిక, మేధోజీవిత పరిస్థితులను సమన్వయముచేసే శక్తి యీ పాశ్చాత్య విద్యకు మృగ్యము ; పాశ్చాత్య విద్యాజనిత ఆశయముల కిట్టి శక్తి పూజ్యము.

తూర్పు యూరపు ప్రజలనుగురించి ఫ్రీమన్ ఒకచోట పేర్కొన్నట్లుగా, నే నిక్కడ ఒకమాట చెప్పవలెను. పరస్పర వ్యత్యాసముగల, విభిన్న సంస్కృతులు రెండింటి మధ్య ప్రస్తుత తరపు జనులు జీవించవలసి వచ్చినది. ఇందులో ఒక నాగరికతకు సూత్రములు కొల్లలుగావున్నప్పటికీ అవి శిథిలమైనట్టివి. ఈ సంస్కృతి పూర్తిగా చికి శల్యావశిష్టమైనది. దీనికి యితరులతో సమాధానపడు తత్వము లేకపోయినప్పటికీ యిది బహుదుర్బలమైనది. తనకు గల సంకుచితత్వమే దాని దుర్బలత్వమునకు హేతువు. కేవలము సంకుచితదృష్టివల్లనూ, యీ సంస్కృతికి ప్రాతినిధ్యము వహించువ్యక్తులు సాంఘికముగా తక్కువస్థితిలో వుండుటవల్లనూ, తద్వ్యతిరేకమైన పాశ్చాత్య నాగరికతా దోషములను, కెరటములవలె వచ్చి పడుతున్న విజాతీయ విశ్వాసములను, పద్ధతులను వారు యెదిరించలేకపోతున్నారు.

ఇక రెండవదాని విషయము : ముందుకు నడుచుకుపోవుటలో యిది శక్తివంతమైనది. స్వేచ్ఛాయుతమైనది. ఇది హేతువాదమును ఆకట్టుకొనుచున్నది.

పాశ్చాత్య నాగరికత కొన్ని అంధవిశ్వాసాలను పోగొట్టుతున్నమాట యథార్థమే అయినప్పటికీ, అది ప్రబోధించే స్వాతంత్ర్యము సాంఘికప్రగతిశూన్యమైనది. ఇది సంపూర్ణ స్వాతంత్ర్యము కాదు. నామమాత్రమైనది. ఇది అన్యులకు చోటివ్వదు. ఇటువంటి నాగరికత, మనుజులను అవలక్షణములకు, అస్థిరత్వమునకు, దోషములకు గురిచేసి అక్కడకు తీసుకుపోయి, దిగవిడువక తప్పదు. ఈ అవలక్షణములను దోషములను, చెడుగులను, ధోరణిని దిగ్విజయముగా యెదిరించి పోరాడుట నేటి ప్రప్రథమ సమస్య.

విజాతీయ నాగరికతా గుణదోషములు రెండున్నూ, రెట్టించిన పరిమాణములో శ్రీ వెంకన్నగారి వ్యక్తిత్వమున మూర్తీభవించినవి.

**15 నవంబరు :**

మొన్న శ్రీశ్రీనివాస అయ్యంగారు యిక్కడకు వచ్చారు. ఆయనలో వొక వింతపరిణామము కలిగినది. మొదట ఆయన స్వతంత్రయోచనాపరుడైన సంశయవాదిగా వుంటూ, యిపుడు అసంబద్ధమైన ప్రతిదానినీ విశ్వసించే మూఢ విశ్వాసాలను శాస్త్రీయదృష్ట్యా అసంగతంగా సమర్థింపజూసే, థియొసోఫిస్టుగా మారిపోయినాడు !

**18 నవంబరు :**

పెద్ద ముసురుపట్టినది. కుండపోతగా వర్షము కురిసినది. ఆముదపు పైరు బాగుగానే పెరుగుతున్నది.

# 1902

**4 మార్చి :**

ఉదయము యేడు గంటలకు విజయనగరమునుంచి మద్రాసుకు బయలుదేరితిని దవేజరు మహారాణీ, రీవాసర్కారు, మైనరు మహారాజా, చిట్టి మహారాణీ సాహెబు, బాబూసాహెబ్, ప్రతాప్‌జీ పెద్దకుమార్తె, ట్యూటరు డాక్టరు లీపింగూ బయలుదేరారు.

**5 మార్చి :**

ఉదయం యేడుగంటలకు మద్రాస్ చేరుకున్నాము. స్వామి పరమహంస బాలసుబ్రహ్మణ్యంకూడా హెర్ హైనెస్‌తో వచ్చారు. ఆయన ఆమెకు ఆనరబుల్ ప్రైవేటు సెక్రటరీ.

ఆయన శిష్యులు కొందరు ఆయనకోసం వొక బండీ తీసుకువచ్చారు. మరివొక బండీనిండా పూలమాలలు, చందనము. ఆయనకు శిష్యులు ఛత్రము పట్టినారు.

**7 మార్చి :**

ఈవేళ ఉదయం వొక మొదలియారు యువకుడు స్వామిజీని సందర్శించ వచ్చాడు. మొదలియారు యువకుడు పట్టభద్రుడు. తమిళమున "ఉత్కృష్ట మతము : హిందూవేదాంతము" అనే గ్రంథము వ్రాసినాడట. విద్యాధికులైన హిందువులకు మత వేదాంత విషయపరిజ్ఞానము శూన్యమని, యేమేమో గొప్పగా చెప్పుకొచ్చినాడు. అబ్బో ! నా మొహం యెదుటనే, నన్నుగురించి అతిగా ప్రశంసావాక్యములు పలుకుతూ పేర్కొన్నాడు : "మీది మహోన్నతమైన ఆత్మ!"

అతని రిమార్కును ఆ భగవంతుడే రక్షించుగాక !

**9 మార్చి :**

తన చిన్న కుమారుని వెంటబెట్టుకొని బొబ్బిలి మహారాజావారు యీదినం వచ్చినారు. జమీందారులకు ట్యూటరులుగా వుండేందుకు యింగ్లీషువాళ్లకంటె ఆంగ్లో యిండియనులే తగునని అభిప్రాయపడుతున్నామని ఆయన చెప్పారు.

బొబ్బిలి చరిత్రమును తెలుగులో తాము ప్రచురించితిమని తెలియచేశారు. ఇందులో మొదటిభాగము స్వర్గీయ శ్రీ రామమూర్తి పంతులుగారు రచించిన వెలమ కులమును గురించిన భోగట్టాతోను, రెండవభాగమును తాము రచించిన బొబ్బిలి చరిత్రమును ముద్రించిరట.

**10 మార్చి :**

నిన్నసాయంకాలము మేము శ్రీకృష్ణ భాగవతి హరికథా కాలక్షేపమునకు వెళ్లితిమి. శ్రీకృష్ణ భాగవతిది తంజావూరుజిల్లా. ఆయన గొప్ప గాయకుడేకాక, తెలివితేటలుగల వ్యక్తి. తమిళమున రుక్మిణీ కళ్యాణము కథను హృదయ రంజకముగా చెప్పినాడు. కథ చెప్పుతీరు బాగున్నది. మిక్కిలి ఉత్సాహముతో శ్రద్ధతో విని జనులు సంతోషపడిరి. సంస్కృత శ్లోకములు, తెలుగు పద్యములు, తమిళ, కన్నడ, మళయాళీ కీర్తనలు ఆయన పాడెను. తెలుగు పద్యములు, సంస్కృత శ్లోకములు భాగవతములోనివి.

కథా కథనమందు క్లుప్తతయే ఆయన విజయమునకు కారణము.

## 1903

**1 మార్చి .**

అస్తబలు నా అజమాయిషీక్రిందకు వచ్చినది

**7 ఏప్రియలు**

విజయనగరంనుంచి మద్రాసుకు బయలుదేరితిని

**8 ఏప్రియలు**

మద్రాసు చేరితిని

**10 ఏప్రియలు :**

సర్ భాష్యంగారు వచ్చిరి

**11 ఏప్రియలు ·**

కూనూరుకు ప్రయాణము

**14 ఏప్రియలు .**

ఒకరోజు ఊటీలో

**18 ఏప్రియలు**

బాలయ్య నాయుడుగారు వచ్చిరి

**11 జూన్**

ఊటీనుంచి బయలుదేరితిని

**14 జూన్ ·**

మద్రాసులో

**20 జూన్**

విజయనగరమునకు బయలు దేరితిని

**13 జూలై .**

శర్మగారు విశాఖపట్టంలో మరణించిరి సమస్థానముపై దావా

**26 డిసెంబరు .**

పిఠాపురం రాణులలో ఒకామె కోటకు వచ్చినారు

# 1904

**27 ఏప్రియలు .**

విజయనగరమునుంచి ఊటీకి బయలుదేరితిమి స్టేషను వద్ద తునిరాజుగారు తన మేనల్లుళ్లను వెంటబెట్టుకొని మహారాజాను చూడవచ్చిరి

**28 ఏప్రియలు ·**

మద్రాసు వచ్చితిని మా అమ్మాయికి వొంట్లో బాగులేదని టెలిగ్రాము వచ్చినది

**29 ఏప్రియలు**

నాన్నమ్మకు కులాసాగా వున్నదని మళ్లీ టెలిగ్రాం

**30 ఏప్రియలు ·**

శ్రీ రంగాచారిగారు విచ్చేసిరి

**31 ఏప్రియలు :**

సర్ భాష్యంగారు వచ్చిరి కూనూరుకు బయలుదేరితిని

**1 మే ·**

కూనూరు చేరితిని

**9 మే :**

ఊటీకి వచ్చితిని

**11 మే :**

మిష్టర్ గిల్మన్ వచ్చాడు

**16 మే ·**

మిష్టర్ లార్మో విచ్చేసినాడు

**23 మే .**

లేడీప్రిన్సు వచ్చినది

**30 మే :**

ది ఆనరబుల్ మిష్టర్ స్టోక్స్ వచ్చినాడు కాగితములపై దస్కత్తులయినవి

**2 జూలై ·**

ఊటీనుంచి బయలు దేరితిని

**3 జూలై ·**

మద్రాసు చేరితిని

**4 జూలై :**

సర్ భాష్యంగారు వచ్చిరి.

**6 జూలై :**

మిస్టర్ డ్రైల్, ఆయన సతీమణి యింటికి వెళ్ళిరి.

## 1905

**15 ఏప్రియల్ :**

మద్రాసుకు చేరుకుంటిని.

**24 ఏప్రియల్ :**

మా నాయనగారు పరమపదించుటవల్ల నేను విజయనగరముకు బయలు దేరితిని.

**7 మే :**

ఊటీకి పోవుటకు విజయనగరమునుంచి బయలుదేరితిని.

**8 మే :**

మద్రాసులో.

**10 మే :**

మద్రాసునుంచి బయలుదేరితిని.

**11 మే :**

ఊటీకిచేరితిని. రైలులో మిస్టర్ లార్మర్‌నాతోపాటు ప్రయాణము చేసినాడు. నేను ఊటికి వెళ్ళునరికి మిస్టర్ చూథాంప్సన్ నాకోసం యెదురుచూస్తున్నాడు. శుక్రవారము నాడు మిస్టర్ గిల్మన్ వచ్చాడు.

**26 మే :**

మిస్టర్ లార్మర్ వెళ్ళిపోయినాడు.

**29 మే :**

మహారాజావారు ప్రభుత్వ భవనములో గవర్నరును కలిసిరి.

**5 జూన్ :**

గవర్నరు సతీమణి మహారాజునుచూడదానికి వచ్చినది.

## 1906

**12 జనవరి, శుక్రవారము :**

తాళపత్రగ్రంథములు సంపాదించితిని.

**16 జనవరి, మంగళవారం :**

శ్రీరామమూర్తి గ్రంథము రెండవభాగమును ఫైలు చేయవలెను.

**18 జనవరి లక్ష్మివారం :**

వెలుగాడ గ్రామమునకు రోడ్డు.

**22 జనవరి, సోమవారం :**

వాల్తేరుకు బయలు దేరితిని.

**27 జనవరి, శనివారం :**

మహారాణి, ప్రిన్స్ ఆఫ్‌వేల్సును చూసినది.

## 1911

**12 జనవరి గురువారం :**

శ్రీ వీరేశలింగం పండితులు నిశ్చయముగా మహాపురుషుడు. సాహిత్యములో వొకశాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధిపంథాలేవదీసిన మాన్యుడు. ఇది మిగుల కష్టతరమైన పని. తెలుగుదేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము ఆయనలో ప్రవహించుచున్నది. కనుకనే వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడతవి.

**27 మార్చి :**

నాది ప్రజల వుద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను.

## 1913

**1 జనవరి, బుధవారం :**

సర్‌జాన్ ఎట్కిన్సన్‌ను కలుసుకున్నాడు. మనిషి మంచి మర్యాదస్థుడు. పబ్లిక్ సర్వీసు కమీషన్ వెళ్ళిపోయిన తరువాత వొకసారి మళ్ళీ ఆయనను చూడవలసివుంది. రామమూర్తికి రావుసాహేబ్ బిరుదు వచ్చినందుకు నాకు అమిత ఆనందం కలుగుతున్నది. ఆహ్లాదకరమైనవార్త. కాస్మోపాలిటన్ క్లబ్బులో రామచంద్రరావు కనిపించి యీ విషయం ప్రసంగిస్తూ "మన ఉద్యమానికిది వొక గొప్పవిజయమన్నా"డు.

**2 జనవరి, లక్ష్మివారం :**

15వ తేదీన వారసత్వపు దావా అపీలు విచారణకు వస్తుంది. వాదులు వాయిదాకోరితే, దాన్ని శ్రీనివాసయ్యంగారంగీకరిస్తేతప్ప, మళ్ళీ 'యీరింగు' పడదు. ఇకవాయిదా యివ్వాస్తికాదని మేం వాదిస్తాం.

జస్టిస్ పి.ఆర్. సుందరఅయ్యరును చూస్తిని. తెలుగు కథలనుగురించి వొకనోట్ రెండుమూడు రోజుల్లో రాసియియ్యాలట. 10వ తేదీన మీటింగు.

శేషయ్యరునుకూడా ఇవ్వాళనే కలుసుకున్నాను. మిస్టర్ హంటర్, ఏట్సు, శేషగిరిరావులకు లేఖలు రాశాను. మహారాజాకు వైర్ యిచ్చాను.

**3 జనవరి, శుక్రవారం :**

మిస్టర్ ఫౌలర్ నావిజయనగరం చిరునామాకు తంతి యిచ్చాడట బహుశా విల్లునుగురించే అయివుంటుంది. లాయరు కిచ్చిన సూచనలను మార్చుకోవలసివచ్చింది

**4 జనవరి, శనివారం .**

మదరాసు నుంచి బయలు దేరాను హెచ్ హెచ్‌కి వైరు (అ) తెలుగు (ఆ) సివిలియన్సుకు తెలుగు

**5 జనవరి ఆదివారం .**

ఏలూరులో

విజయనగరం చేరుకున్నాను రాజమండ్రిలో గున్నేశ్వరరావు కనిపించి ప్రదర్శించుకుందుకు తెలుగు నాటకాలు కావాలని అడిగారు.

**6 జనవరి సోమవారం .**

మిస్టర్ ఫౌలరూ మహారాజావారూ నేనూ కీర్తిశేషులైన మహారాజావారి విల్లును గురించి చర్చించుకున్నాం

**9 జనవరి లక్ష్మివారం**

విజయనగరం నుంచి మద్రాసుకు బయలు దేరాను

**12 జనవరి ఆదివారం .**

స్వామి అయ్యరు యింట 13 వ తేదీన పార్టీ మార్కుహంటర్‌ను మిస్టర్‌గిల్ మన్‌ను చూస్తిని

**14 జనవరి మంగళవారం .**

ఎమ్ జి నటేశంగారియింట ఆరున్నర గంటలకు పార్టీ

**16 జనవరి లక్ష్మివారం**

గవర్నర్ విజిట్ - తిరుగు ప్రయాణం

**23 జనవరి లక్ష్మివారం ·**

పేజి 360 జె యమ్ యల్ యస్ అక్టోబరు 1839 సంపుటి పది

తెలుగుభాషా సాహిత్యములమీద రచించిన వ్యాస తెలుగు పద్యములను రెండు తరగతులుగా విభాగించుకోవచ్చును పాప్యులర్ క్లాసికల్

(షరా ఇది స్థూలమైన విభాగం)

పాప్యులరు కృతులు (సామాన్య కావ్యములు) సమాన ప్రమాణంగల ద్విపదలలో రచింపబడ్డవి పాశ్చాత్య సాహిత్యంలోని కథాగేయములవలె యివి జన బాహుళ్యానికి పరిచితమైన శైలిలో వ్రాయబడినవి

క్లాసికల్ (మహాకావ్యములు) కృతులు సాధారణముగా పద్యాలలో వ్రాయబడినట్టివి గ్రే హా రేస్‌ల కృతులతో వీటిని సరిపోల్చవచ్చును

వీటికి శబ్దాడంబరం ఎక్కువ. శబ్దాడంబరానికే ప్రాధాన్యత లావు. కాని పద్యాపాదాలలో అభిరుచికలిగించే గుణం, సౌకుమార్యం వుందనడానికి సందేహం లేదు.

చాలా పద్యాలలో ముఖ్యంగా సీసపద్యాలలో ఒకే ఒకభావం పదేపదే మూడు నాలుగుసార్లు ఆవృతమౌతూ వుంటుంది. భావ ఒకటే. కొద్దిగా పదాలుమాత్రం తేడా. ఇవి తెలుగుభాష నేర్చుకుందామనుకునే విదేశీయుడికైతే బాగా ఉపయోగపడతాయి. అతనిక అమరకోశము అక్కరలేదు. ఇవి చాలును. కాని యీ పద్యపాదాలు మట్టుకు సొగసుగా వుండవు.

ఇట్టి పదాడంబరంలేని ద్విపద కావ్యాలు విదేశీయుని అభిరుచులకు సరితూగగలవి. ఇవి సహజంగానూ, లలితంగానూ వుంటాయి. కనక, విదేశీయుల మెప్పుదల పొందగలుగుతాయి. శబ్దాడంబరం లేకపోవడం ఛాందసులైన బ్రాహ్మణ పండితుల దృష్టిలో వొకదోషం. దీనికితోడు యింకొకటి : చాలా ద్విపదకావ్యాలు, బహుశా అన్నీ, వారి దృష్టిలో తక్కువే. సాధారణంగా, బహుశా అన్నీ, వారి దృష్టిలో తక్కువే. సాధారణంగా పద్యకావ్యాలు మాత్రం పవిత్రమైన జాతికి చెందినట్టివి ! కోదండరామ, కాంతాలలామ సుమతీ శతకం, యిత్యాదులన్నీ తక్కువజాతికి చెందినకృతులు. వేమనశతకం, సిద్ధరామశతకం, కాంతాలలామ, యిలాంటివి కేవలం వొట్టి గ్రామ్యభాషలో రాయబడ్డవని పండితప్రకాండుల లెక్క

(ఇది చాలా వింతయైనమాట. పండిత సంప్రదాయమైన సంస్కృతపద జటిలత్వముగల కవితాపద్ధతులతో ఛందస్సుతో వీటిని పోల్చి చూస్తున్నారు. ఈ జానపద గేయాలలో శబ్దసౌష్టవం లేకపోయినా, కవితాశిల్పం లేకపోలేదు. సర్వజన సంవర్ధితమైన జానపదగేయములు విదేశీయులకు ఆకర్షణీయములు. దేశమున ప్రాచుర్యము పొందిన శైలిలో, భావములను వివిధరీతుల వ్యక్తీకరించడంవల్ల ఇవి విదేశీయుల ఆదరణను పొందగలుగుతవి. ఇందుగల భావవ్యక్తీకరణ పద్ధతి వారికెంతో ప్రయోజనకారి.)

ఇవి కాక మరికొన్ని కథారూపమున వున్న బ్యాలెడులు కలవు. ప్రత్యేకమైన ఒకవిధమగు సంగీతం యీ వీరకథలలో సహజం. ఇవి పెద్దవి. మార్గ కవితారీతులకు, ఛందోనియమములకు యివి విభిన్నం. బొబ్బిలికథ (రంగారావు చరిత్ర) నాగమ్మకథ మొదలైనవి యీ తరగతికి చెందినవి. ఆనోటా ఆనోటా ప్రచారంలోనికి వచ్చి యివి జనులవల్ల పదిలపరచబడ్డవి. మొన్నమొన్నటి వరకూ యివి అచ్చుకు నోచుకోలేదు. ఈ కథలు దేశంలో నలుమూలలా బహుళ వ్యాప్తి చెందాయి. పండితులు వీటిని తిరస్కార భావంతో తోసిపుచ్చినా, గ్రామ్యమని, నిరసించినా, వీటిని దేశీయులు పాడుకుంటూ వుంటారు. పేరా 67 ;

వ్యాఖ్యానంతో టెక్స్టు ముద్రింపబడింది. పదిమందికీ తెలిసే తెలుగులో వ్రాసినవ్యాఖ్య. ప్రతిపదానికీ విపులమైన అర్థం.

**367 :**

వైదికమత ప్రధానమైన బ్రాహ్మణుల సాహిత్యమువలె, జైన, శైవవాఙ్మయములు, సౌకుమార్యము గలవి.

**376 :**

త్వరలోనే మద్రాసులో అచ్చుకానున్న వొక కావ్యము నుండి కొంతభాగము యిందు ఉదహరింపబడ్డది ఇది దేశంలో గొప్ప ప్రసిద్ధికెక్కిన కావ్యం. బహుళ ప్రచారంలోవున్న కావ్యం. అదే సారంగ ధర చరిత్ర, ద్విపద ఇదికాక చామకూర వెంగళరాజు మధురమైన ఉదాత్తశైలిలో రచించిన యిదే కావ్యమున్నది కాని విదేశీయులకు ద్విపదకావ్యం హెచ్చుగా ఉపయోగపడతుంది. ద్విపదలను సహజ సిద్ధమైన సంభాషణ పూర్వక శైలిలో వ్రాయడమే

యిందుకు హేతువు అక్కడక్కడ సారంగధర ద్విపదలోని శైలిని బట్టిచూస్తే యిది ప్రాచీన కావ్యమని రుజువవుతుంది కాని శైలి నేటికి కూడా సుపరిచితమయినదే

**13 ఫిబ్రవరి, లక్ష్మివారం ·**

రెండుసంతకాలు పెద్దచెరువు మహారాజా ఫొటోను ఉపయోగించవలెను

**22 ఫిబ్రవరి, శనివారం :**

ఆక్స్‌ఫర్డు యూనివర్సిటీ హేండ్‌బుక్కు

పంచాప కేశఅయ్యరు

**7 ఏప్రియల్ సోమవారం :**

విజయనగరం నుంచి బయలుదేరాను రాజమండ్రిలో వీరేశలింగం పంతులుగారు బండి యెక్కారు ఇద్దరమూ కలిసి ప్రయాణం చేశాము

**8 ఏప్రియల్ మంగళవారం**

మద్రాసు చేరుకున్నాను

**9 ఏప్రియల్ బుధవారం :**

పరీక్షాధికారుల సమావేశం

**14 ఏప్రియలు, సోమవారం .**

విజయనగరం నుంచి బయలుదేరాను మోడరన్ రెవ్యూ

**15 ఏప్రియల్, మంగళవారం :**

మద్రాసు చేరుకున్నాను

ఫ్రెంచి బుక్కుకోసం వెంకటచలానికి హైద్రాబాదతనికి ఉత్తరాలు రాశాను

**23 ఏప్రియల్, బుధవారం :**

జస్టిస్ పి ఆర్ సుందయ్యరును కలిశాను

రామేశం బుక్కు, రామకృష్ణ కవిగారికి ఉత్తరం వ్రాశాను

వెంకటచలం లక్ష్మివారం వస్తాడుట

**24 ఏప్రియల్, లక్ష్మివారం :**

పరీక్షాధికారులకు ఉత్తరాలు వ్రాశాను

**26 ఏప్రియల్, శనివారం :**

సింహాచలం శాసనము

తిమ్మరుసుమీద గ్రంథం

విన్నకోట పెద్దన వ్యాకరణం

దంతులూరి

**1 మే లక్ష్మివారం :**

విజయనగరంనుంచి నీలగిరి కొండలకు బయలుదేరాను టెక్స్టుబుక్కు కమిటీలోవున్న మిస్టర్ యస్ దొర కంపార్టుమెంటులో తారసపడ్డాడు మనిషి ప్రసన్నంగా వుంటాడు ఓర్మితో ప్రతీదీ వింటాడు తెలుగును గురించి చాలాసేపు చర్చించుకున్నాము దొర మంచివాడు కనుకనే కంపార్టుమెంటు కిటికీ నన్ను మూసివేసుకోనిచ్చాడు

**2 మే శుక్రవారం ·**

మిస్టర్ మిడిల్ మార్టును ట్రెయిన్లో చూశాను చివరికెలా అయితేనేం అతన్ని కలుసుకోగలిగాను మెయిలు కేరేజీలో ఇద్దరమూ ఎక్కాం 3 రూపాయిలు చెల్లించాం ప్లాటుఫారంమీద అతను అదృశ్యుడయాడు

హైలాండ్సుకు చేరుకున్నాను లోనికి వెళ్ళమని మహారాణీవారు డ్రాయింగురూము చూపించారు పూలపందిర కొండలు లోయలు దిగువను సమతల ప్రదేశం ప్రకృతిశోభ ఒక కలవలె తోస్తున్నదని ఆమె అన్నారు నిజమే మరి ఇది అందమైన ఒక కల గది చక్కని అలంకరణతో అలరారుతున్నది

నీలిపూల లతలు తలలు వూపుతూ స్వాగతమిస్తున్నవి ఉక్కింతలు కూడా కలవు

**10 మే, బుధవారం :**

ఊటీకి బయలుదేరి వెళ్ళాను

**14 మే, బుధవారం :**

| | |
|---|---|
| మహారాణీవారి కోసమని షేక్స్పియరు నాటకం కొన్నాను | 1-12-0 |
| టైమ్స్ ఆఫ్ ఇండియా | 0-4-6 |
| | 2-0-6 |

**15 మే, లక్ష్మివారం :**

ఉదకమండలం బయలుదేరి వెళ్ళాను

**23 మే, శుక్రవారం :**

గురువులుకి నాల్గురూపాయ లిచ్చాను

**12 జూన్, లక్ష్మివారం :**

ఆనమెరా లైబ్రరీలో (1) అనంతపురం మాన్యుయల్ (2) బళ్ళారిజిల్లా మాన్యుయల్ (3) మద్రాసు లిటరరీ సొసైటీ జర్నలు విన్నకోట పెద్దన జర్మన్ పండితుడు వ్రాసిన వ్యాసము యూనివర్సిటీ నోట్‌బుక్కు చూడవలెను దత్తమండలముల శాసనముల పుస్తకము

**17 జూలై, లక్ష్మివారం :**

క్రింది అంతస్థుకు దూలాలు 8×17'×10"×12

మీది అంతస్థుకు దూలాలు 8×16'×9"×11

**26 జూలై శనివారం :**

మెంటాడ ప్రాజెక్టు సమాచారం

**8 ఆగస్టు శుక్రవారం .**

శ్రీ కె లింగమూర్తి శ్రీ వీరేశలింగంపంతులుగారి లైబ్రరీ

**14 ఆగస్టు లక్ష్మివారం**

స్వామిగారి రామాయణము

చిలకమర్తి పద్మనాభము

గున్నేశ్వర్రావు

**15 సెప్టెంబరు, సోమవారం ·**

పారిస్‌లోవున్న మిస్టర్ ద్యూరెల్‌కు పబ్లిక్ లైబ్రరీలో నాకు కావలసిన సమాచారము లభియించగలదేమోనని ఉత్తరం వ్రాస్తిని ఇంపీరియల్ లైబ్రరీలోని లైబ్రేరియనుకు పారిస్ విశ్వవిద్యాలయములోని హిస్టరీ ప్రొఫెసరుకూ లేఖలు వ్రాస్తిని

**దూప్లేను గురించి ఫ్రెంచిభాషలో ఏమీ గ్రంధమేలేదా!**

**స్కూలు పుస్తకములు అక్కరకువచ్చే సారస్వతము.**

♦ ♦ ♦

శ్రీ అ రామమూర్తి పంతులుగారు ఆయన ధరించే దుస్తులు

**17 అక్టోబరు శుక్రవారం**

ధే క రేస్ రెడ్యూసుడు సర్వే మ్యాప్ ఆఫ్ ఇండియా అండ్ బర్మా బ్రిజె జి చార్తోలొమ్యూ దబ్బై మైళ్ళకు వొక అంగుళము స్కేల్

సెయింట్సుబరీస్ యింగ్లీషునవల

సెనేటు సమావేశము

**18 అక్టోబరు శనివారం**

సెనేటు సమావేశము

**19 అక్టోబరు ఆదివారం :**

ద్రవిడియను బోర్డాఫ్‌స్టడీసు మీటింగు

**20 అక్టోబరు సోమవారం**

ఇంటర్మీడియేటు తెలుగు కాంపోజిషను సబ్‌కమిటీ సమావేశము

**23 అక్టోబరు లక్ష్మివారం .**

రాజమండ్రీ మెయిలుకు అందుకోవలెను

**4 డిసెంబరు లక్ష్మివారం**

రిసెప్షెను పెండాలుకు రావలసినదని ఆహ్వానము ఎల్ టి హారిప్

**5 డిసెంబరు శుక్రవారం**

సాయంకాలము నాలుగుగంటల పదిహేను నిమిషములకు శంకుస్థాపన మహోత్సవము

# 1914

**1 జనవరి మంగళవారం**

చిరునామాలు ఏట్సు డబ్ల్యు బి 18 ఉబర్న్ బిల్డింగ్స్ యస్ డబ్ల్యు

ఆర్ కిప్లింగ్ రతెనన్స్ స్క్వేర్ యస్ డబ్ల్యు జి కె ఛస్టర్టన్ నోవర్ రోడ్స్ బేకన్స్‌ఫీల్డు బక్స్ నాటక రచయిత మిస్టర్ జార్జి బెర్నార్డుషా 10 అడెల్ఫీ టెర్రేస్ డబ్ల్యు సి

* * *

దేవతా పూజలకుం అంగరంగభోగానకుం యిప్పించ్చి కపాలానకుడిచిన దీని యెవ్వరు దప్పినా

* * *

**17 జనవరి శనివారం**

సర్ ముర్రేను మధ్యాహ్నం పన్నెండు గంటలకు కలిశాను

* * *

సంధి వ్యావహారికభాషలోగల ఉచ్చారణకు సన్నిహితముగా వుండేటట్లు చేద్దామనే ప్రయత్నం కానరాదు సంధి కార్యములు భాషలో స్వతస్సిద్ధంగా యేర్పడినవే తప్ప అవి కృతకమైనవిమాత్రం కాదు

లిఖితపూర్వకమైన భాషను చదివేటపుడు చదువరుల ఉచ్చారణశక్తిమీదనూ ఉదాత్తానుదాత్తాది స్వరభేదము వల్లనూ యివి యేర్పడతాయని రామయ్య వాదిస్తున్నాడు ఇది సంగీతం అవుతుందేతప్ప భాషాలక్షణంమటుకు కాదనే సంగతి ఆయన మర్చిపోతున్నాడు

ఇక లక్ష్మణరావుకు సంప్రదాయంమీద విశ్వాసం సంధికార్యముల వలన వాక్యములలో లయా స్పష్టతా యేర్పడతాయని ఆయన భావం

కొసకు యు జి కె యస్ సైతం వాడుకలోని సంధిని అనుసరించడానికి తలపెట్టింది తమున్నాద్యర్థకమ తరవాతవచ్చే కొట్టపడు మొదలైనచోట్ల సైతం ద్రుతప్రకృతికాలను నిర్లక్ష్యం చేసింది

రామయ్యవాదిస్తున్నట్లుగా ద్రావిడభాషల ధ్వని వుచ్చారణ క్రమం గ్రాంధికభాషను అనుసరించి యేర్పడినట్లయితే అంటే గ్రాంధికభాషకు స్వతస్సిద్ధముగా వొక ప్రత్యేకధ్వని శాస్త్రమన్నదే వున్నట్లయితే దానిని మార్చడానికి అయనకు అధికారం యెలాగు వచ్చింది ? ఇందుకు యడాగమం వొక దృష్టాంతం సంధిలేనిచోట కళలమీద యడాగమం వస్తోంది గ్రాంధికభాషలో య ఆదిగాగల పదాలులేవని చెప్పినా వాడుకభాషలో కొన్నివున్నాయి కృతకంగా తెచ్చిపెట్టుకొన్న యడాగమం చెవులకు పెటుకుగా వుంటున్నది ఆధునికత తెలుగు భాషలో ద్రుతప్రకృతికలు యించుమించు నశించిపోయినట్లే

గ్రాంధికభాషలో సంధిలేనిచోట కళలమీద మాత్రమే వచ్చే యదాగమం యే పదాలను ద్రుతప్రకృతికాలని గ్రాంధిక భాషావ్యాకరణాలు సూత్రీకరించాయో, అవే ద్రుతప్రకృతికాల మీద ఆధునిక గ్రాంధికభాషలో యదాగమం వస్తున్నది ద్రుతప్రకృతికాలు వున్నవనేవిషయం చాలామంది పండితుల మనసునుంచి తొలగిపోయిందనే కదా దీని అర్థం

లక్ష్మణరావు చెబుతున్నట్లుగా ధ్వనులకలయిక మాత్రమే సంధికాదు రామయ్య యింతకంటె కొంచెం జాగ్రత్తవహించి సంధి అంటే పదాదిని పదాంతమందువచ్చే మార్పులుగా పరిగణిస్తున్నప్పటికీ అవి యేమిటో స్పష్టంగా నిర్వచించడం లేదు సరే ఏసంధి యేమంత క్లిష్టమైన సమస్యకాదు

చిలకమర్తి మహాపురుషుల జీవిత చరిత్రము . యుపనిషత్తులు జదివి యదిమొదలు యాయన నాయక యతడు యక్కడస్థాపించియందు యట్లుచేయ యాదుదాని యెచ్చట యర్థము యన్నము యుద్యోగము యధికమయ్యే యుత్తర ప్రత్యుత్తరము యనుచితము యుపన్యాసము, యనంతరము యాచారము సహజజ్ఞానియని యనేకుల యభిప్రాయముచేసి యాయా దేశములందున్న

**18 జనవరి, ఆదివారం :**

సాహిత్య పరిషత్తు వార్షిక సమావేశానకు హాజరయితిని సమావేశమునకు పండితహరప్రసాదశాస్త్రి అధ్యక్షత వహించిరి పాలీభాష పూర్వమొకప్పుడెంతో ప్రాచుర్యము వహించి వుండేదనిన్నీ, అందుకు అదిసులభముగా పలుకుటకు అనువుగావుండుట కారణమనిన్నీ తమప్రసంగములో పండిత హరప్రసాదశాస్త్రిగారు నుడివిరి

**26 జనవరి సోమవారం :**

తెలుగు కాంపోజిషను 3 సి సెకండు పేపరు ఆన్సరు పుస్తకాలలో అన్నీ లోపాలే పరీక్షకు వెళ్ళే అభ్యర్థులకీ లోపాలు లేకుండా చేయవచ్చును ఇంగ్లీషు కాంపొజిషను బోధించే ఉపాధ్యాయుడే విద్యార్థులకు తెలుగు కాంపోజిషను చెప్పవలెను

తెలుగు గ్రూపు 3 (సి) ను అభ్యసించే విద్యార్థులు సెకండు పేపరు ఆన్సరుచేసేటపుడు నిర్దుష్టమైన గ్రాంధికమును రాయదానికి ప్రయత్నించాలి

గ్రాంధికభాషలో కాంపోజిషను రాయడానికి అభ్యర్థులకు యేపాటి శక్తికలదో పరీక్షించడానికి యీ పేపరు పెట్టారనుకుంటాను కంపల్సరీ కాంపోజిషనులో అభ్యర్థులు ఆధునిక ప్రయోగాలను వాడవచ్చును సాధారణంగా వాటినే అభ్యర్థులు ప్రయోగిస్తూ వస్తున్నారు

స్కూలుఫైనలు పరీక్షలో కంపల్సరీ పేపరుపెట్టారు ఆ సంప్రదాయాన్ని మానకుండా కాబోలును కాలేజీ తరగతులలో కంపల్సరీ కాంపొజిషను పేపరువుంటున్నది

**15 మార్చి, శనివారం :**

ఇంటర్మీడియటు తెలుగు కాంపోజిషనులో యే యే పద్ధతులు అనుసరించాలనే చర్చ తెమలక ఆలస్యమౌతున్నకొద్దీ యిక జాగుచేయడం కూడదనుకున్నాను పుస్తకాలమీద నా అభిప్రాయం వెంటనే పంపించాలనుకున్నాను

**16 మార్చి, సోమవారం :**

రావుబహదూర్ శ్రీ కందుకూరి వీరేశలింగంగారు వ్రాసిన రాజశేఖరచరిత్ర ఇది గోల్డుస్మిత్తు వికారాఫ్ వేక్ ఫీల్డు" అనే నవలకు అనుసరణ ఇది బహుళ ప్రచారం పొందిన నవల గ్రంథకర్త గ్రాంధికభాషలో రచించినప్పటికీ గ్రాంధికభాషా సంధులను వుల్లఘించారు ఈ ఉల్లంఘనంలో కూడా వొక నియమమును అక్కడక్కడ పాటించారు మరికొన్ని చోట్ల పాటించలేదు దీనిని యిదివరకు పాఠ్యగ్రంథంగా పెట్టారు

గ్రీకు పురాణకథలు మొదటిభాగం దీన్ని సెట్టి లక్ష్మీనరసింహంగారు వ్రాశారు హాల్కరు వండర్ వుడ్ టేంగిల్ వుడ్ కథలకిది అనువాదం కథలలో గొప్పలక్షణాలు సాహిత్య మెలకువలు వున్నాయి తెలుగు సారస్వతంలో నూతన పోకడలను యివి ప్రవేశపెడుతున్నాయి వీరేశలింగముగారి అనుసరణమువలె యీయన అనువాదం చక్కగా వుంది అనువాదకుడు మెలకువలు తెలిసిన రచయిత నంధిని పరిత్యజించడంలో వొక నియమాన్ననుసరించారు ఇది గ్రాంధికంలో వ్రాసిన గ్రంథమే ఇదివరకు ఇది విద్యార్థులకు పాఠ్యగ్రంథం

శృంగారచంద్ర కాశీయానం దీన్ని వ్రాసినవారు ముద్దులపల్లి గురుబ్రహ్మం దీనిలో యేమీ నాటకీయత కనిపించదు శైలి నిర్వహణపద్ధతీ చాలా పేలవంగా వున్నాయి ఆయన వ్రాసిందే మరొక గ్రంథం కొండవీటి చరిత్ర కృతకమైన భాష పుష్పలావికల వర్ణనలవల్ల విద్యార్థులు నేర్చుకోతగ్గదేమిటో

**22 మే శుక్రవారం :**

ఊటీకి వెళ్ళితిని

**26 మే, మంగళవారం :**

(1) మాయింట వొక వాచ్‌మన్

(2) శేషగిరిరావు బి ఏ ఆనర్సు

**3 జూన్, బుధవారం :**

మద్రాసు చేరుకున్నాము

**12 జూన్, శుక్రవారం :**

ఎన్నికలు

**17 జూన్, బుధవారం :**

ఊటీకి వెళ్ళితిని మళ్ళీ యీవేళే తిరిగి బయలు దేరాను

**1 ఆగస్టు శనివారం :**

టెక్సు బుక్కుమీద నివేదికను పంపితిని

**2 ఆగస్టు ఆదివారం :**

మద్రాసు విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్‌కు టైపుడులేఖ గోవిందరాజు అయ్యరుకు ఉత్తరం

**3 ఆగస్టు, సోమవారం :**

రిజిస్ట్రారుకు ఉత్తరం బి హనుమంతరావు స్టోన్ మిడిల్ మార్చులకు లేఖలు

**16 ఆగస్టు, ఆదివారం :**

మహారాజాను, ఇనస్పెక్టరు చూడ వెళ్ళారు

**1 సెప్టెంబరు, మంగళవారం :**

పాలకొల్లునుంచి నారింజపళ్లు పంపమని ఉత్తరం వ్రాస్తిని మావిఁడిపళ్ళు యెగుమతులు సర్ హెరాల్డు స్టూవర్టుకు ఉత్తరం

**6 సెప్టెంబరు, ఆదివారం :**

ఉక్కుదూలములు 4×18, 10" ×6"

4×14, 8" ×6

దాస్‌కు ఉత్తరం వేస్తిని

**7 సెప్టెంబరు, సోమవారం :**

తెలుగు పేపర్ల కరెక్షన్

**18 నవంబరు, బుధవారం :**

కరివేపాకు మొక్కలు భాగవతులవారి యింట బాదం మొక్కలు గున్నేశ్వరరావుగారి యింట కొబ్బరి మొక్కలు

తోటకు వెళ్లితిని చక్కగా దున్నలేదు అప్పయ్య పంతులుతోటనుంచి అరటిమొక్కలు తెచ్చి వేయిస్తిని కోటకు వెళ్ళాను ఎండవేడి మిక్కుటముగావున్నది. నాశరీరము ఎండకు దొరికిపోయినది. మిరపకాయలు కొనడానకు బజారుకు పోతిని

**20 నవంబరు, శుక్రవారం :**

సాయంకాలము టెంపరేచరు 99 6

తరువాత 99 4

మునసబును చూస్తిని మూర్తిపంతులుతో ప్రసంగించితిని

**21 నవంబరు, శనివారం :**

| | |
|---|---|
| ఉదయం జ్వరం | 98 4 |
| పదిగంటలకు | 98 5 లేదా అంతకంటె కొద్దిగా హెచ్చు |
| నిద్రపోయిన తరువాత | |
| మధ్యాహ్నము 2 గంటలకు | 99 2 |
| మూడూ నలభై నిమిషాలకు | 99 2 |
| ఆరూ ఇరవై నిమిషాలకు | 99 6 |
| తోటపాలెం బండీలో వెళ్లితిని | |
| భోజనం చేశాక పదిగంటలకు | 98 6 |
| తోటకు వెళ్ళితిని | |

రాత్రి కడుపులో తిప్పడ మారంభమయినది

**22 నవంబరు, ఆదివారం :**

| | |
|---|---|
| పొద్దున్నే అయిదూ ముప్పై అయిదు నిముషములకు | 98 4 |
| పదకొండూ, పన్నెండు గంటల మధ్య | 98 |
| రాత్రి యేడుగంటలకు | 99 |
| రెయిలు స్టేషనుకు వెళ్ళితిని | |
| తొమ్మిది గంటలకు | 99 |
| రాత్రి బాగుగానే నిద్రపట్టినది | |

**23 నవంబరు, సోమవారం :**

| | |
|---|---|
| ఉదయం ఆరు గంటలకు | 98 |
| తొమ్మిదీ ముప్పై అయిదు నిముషములకు | 98 6 |
| పదకొండు గంటలకు | 98 4 |
| నిద్రపోయి లేచిన తదుపరి మూడుగంటలకు | 98 8 |
| ఏడుగంటలకు | 98 4 |
| రమారమీ పదిగంటలకు | 98 8 |

పొద్దున్నే కొద్దిగా చలివచ్చినట్లు అనిపించినది మధ్యాహ్నము మూడుగంటలకు పెద్ద పూలతోటకు వెళ్ళితిని పరుపు మీద గుడ్డలు తీసివేసి నిద్రపోతిని కాలికి స్టాకింగ్స్‌తోనే

**24 నవంబరు, మంగళవారం :**

| | |
|---|---|
| ఉదయం అయిదూ నలభై నిమిషాలకు | 98 4 |
| ఎనిమిదిన్నరకు | 98 8 |
| ఇంచుమించు పన్నెండు గంటలకు | 99 4 |
| భోజనమయ్యాక పన్నెండున్నరకు | 100 |
| ఒంటిగంటన్నరకు | 100 |
| నిద్రపోయి లేచాక మూడు నలభై అయిదు నిమిషాలకు | 99 6 |
| అయిదుం పావుకు | 99 7 |
| ఆరూ నలభై అయిదు నిమిషాలకు విస్తళ్ళు కుట్టుతుండగా | 99 4 |
| పదిగంటలకు | 99 2 |

ఉదయం ఎనిమిదిన్నరకు శ్రీ రామానుజాచారిగారి యింటికి వెళ్ళి అక్కడనుంచి కోటకుబయలుదేరితిని. వీధులలో కొంతసేపు తచ్చాడితిని. ఉదయమే కడుపులో తిప్పడ మారంభించింది. భగభగ మంట.

మధ్యాహ్నం వొంటిగంటన్నరకు పట్టుకొన్న జ్వరం విశ్రాంతి తీసుకొకుండా పొద్దున్నే చంద్రాయణం చేయడం వల్ల వచ్చి వుంటుందేమో మరి ?

పులుసుతగిలితే స్టమక్‌లో ఒక మోస్తరు డ్రైసెన్సేషన్.

మొన్న దూమెరుగుగా పులుసు కలుపుకొని అన్నంతిన్నాను. ఈవేళ పులుసులో ఆనపముక్కలు తిన్నాను. ఉదయం అరిటికాయ పెరుగుకూర. గాని పెరుగు అంటీ అంటడం.

పొద్దున్న యిల్లు కదలకుండా వున్నట్లయితే, టెంపరేచరు తగ్గివుండే దనుకుంటాను.

ఇవాళవరకూ నేను ఉదయం బయట కెక్కడికీ వెళ్ళందే.

మీకు జ్వరం సాధారణంగా రాదనీ, వస్తే ఆట్టేకాలం వుండదనీ డాక్టరు బ్రౌనింగ్ నాకు చెప్పాడు. వొంటికి యే మాత్రం ఎండ తగలకుండా కాపాడుకోమని సలహాయిచ్చాడు.

బహుశా ఊటీలో వుండడంవల్లనేమో, నా శరీరానికేమాత్రం యెండంటే కిట్టకుండావుంది. నరాలనుఅది నీరసపరిచిందా యేమిటి చెప్మా !

**25 నవంబరు, బుధవారం :**

ఉదయం ఏడుగంటలకు నిద్రనుంచి లేచానా టెంపరేచరు 97.8 ; తొమ్మిది నలభై నిముషాలకు 97.8 ; థర్మామీటరు చాలాసేపునోట్లోవుంచి చూసుకుంటే దాని "రీడింగులు" 97.9 ; 98 ; 98.4; 98.6. టెంపరేచరు యిప్పుడిప్పుడే హెచ్చుతున్నదా ? లేక శరీరంలోని వొక్కొక్కభాగపు వేడీ నెమ్మది నెమ్మదిగా యెక్కుతున్నదందామా ?

భోజనం చేశాక ఒంటిగంటా పదినిముషాలకు చూసుకుంటే ఉష్ణోగ్రత 99. బడలిక తీర్చుకోవాలనిపిస్తున్న దీవేళ. నిద్రపోతే బాగుండును.

మధ్యాహ్నం మూడుగంటలకు నిద్రలేచాక ఊష్ణం 99. రాత్రి తొమ్మిది గంటలకు 99.2

**26 నవంబరు, లక్ష్మివారం :**

ఉదయం అయిదు గంటలకు 98.6 ; పన్నెండు గంటలకు 98.6 ; కొద్దిగా కడుపులో చురుక్కు చురుక్కుమనే నొప్పి. ఉదయం బీరకాయ. నారదబ్బకాయ. నిన్నరాత్రి వెలక్కాయ పచ్చడి. నిన్న మెంతికూర.

మూడు గంటలకు 100.4 రాత్రి 101 ; రాత్రి కడుపు నొప్పి విపరీతముగా ఆరంభమయింది. పెప్పరమెంటు అవీ పుచ్చుకున్నాను. నొప్పి తగ్గిందికాదు. కడుపులో ఆసిడ్ చేరింది. చారు ; సోడా. తగ్గలేదు నొప్పి. కొంచెం నల్లమందు వేసుకున్నాను. అరగంటకల్లా నొప్పి తగ్గింది.

**27 నవంబరు, శుక్రవారం :**

ఉదయం నాలుగు గంటలకు 101, అయిదు గంటలకు ఆముదంతాగాను. ఎనిమిది గంటలకు 99.6 ; ఏడుగంటలకు 99.5.

**28 నవంబరు, శనివారం :**

ఉదయం ఆరుంపావుకి 98 ఎనిమిదికి 98 వొంటిగంటకు 98 3 మూడూ నలభైనిముషాలకు 98 ఎనిమిదిగంటలకు 99 రాత్రి పదకొండు గంటలకు నిద్రపోయాను తెల్లవారురుఝాము నాలుగింటికి లేచాను

టెంపరేచరు కొంచెం తగ్గుమొహం పట్టడానికి కారణం ఆముదం ప్రభావమే అయి వుంటుందా ?

**29 నవంబరు, ఆదివారం :**

తెల్లారగట్ల నాలుగు గంటలకు 98 ఆరుగంటలకు 98 తొమ్మిదింపావుకి 98 1 ఒంటిగంటా పధ్నాలుగు నిముషాలకు నిద్రలేచాక 98 8

**30 నవంబరు, సోమవారం :**

| | |
|---|---|
| ఉదయం అయిదున్నరకు | 97 9 |
| తొమ్మిదింపావుకి | 98 3 |
| వొంటిగంటా పదినిముషాలకు | 99 1 |
| ఆరున్నరుకు | 99 1 |

ఒంటిగంటకు నిద్రపోతున్నపుడు ఫ్లానలుకోటు తొడుక్కున్నానేమో చెమటపట్టింది కులాసాగా లేనట్టనిపించింది మజ్జిగతాగాను

రాత్రి ఎనిమిది గంటలకు పరుపుమీద వాలాను తొమ్మిది గంటల తరవాత నిద్రపట్టింది

పట్టిందే కాని కోడికునుకు మాటి మాటికీ మెలకువ వచ్చేది

**1 డిసెంబరు, మంగళవారం :**

ఉదయం ఆరుగంటలకు లేచాను ఆరుంపావుకి 98 2 తొమ్మిదిగంటలకు 98 3 , పదకొండున్నరకు 99 రెండుగంటలకు 99 4

పదకొండున్నరకు స్నానంచేసి అన్నం తిన్నాను రెండు గంటలకు నిద్రలేచాను

పొద్దున్న అటూ యిటూ తిరుగాడాను ఏదో లోకాభిరామాయణం చెప్పుకున్నాం చాలా హాయిగా వున్నట్లనిపించింది

రాత్రి వాన కురిసింది

**2 డిసెంబరు, బుధవారం :**

ఆరుగంటలకు 97 6 , ఎనిమిదిం పావుకి 98 మూడు గంటలకు 100 ; ఇవాళ అన్నీ పనులే మూడుగంటలకు కాఫీ, జావా తాగాను

ఇవాళ మబ్బులూ, గాలీ

**3 డిసెంబరు, లక్ష్మివారం :**

అయిదుంపావుకి 98 9 ఆరునలభై అయిదు నిమిషాలకు 98 4 , మళ్ళీ యివాళ చేతినిండా పనే. మహారాణీతో కలసి మధ్యాహ్నం పన్నెండుదాకా ఆ కాగితమూ యీ కాగితమూ చూస్తూ కూచున్నాను వొంట్లో బాగున్నట్టువుంది

బహుశా జావలో కొంచెం కాఫీ కలిపి పుచుకోవడంవల్ల కాబోలును మధ్యాహ్నం భోజనం చేశాక విశ్రాంతి కాని నిద్ర పట్టింది కాదు మధ్యాహ్నం మూడుగంటలకు అప్పయ్యగారి తోటకు వెళ్ళాను చాలాదూరం నడిచాను ఇదివరకు యెంతబలంగా వుండేవాణ్ణో అంత సత్తువగానూ యివాళ వున్నాననిపించింది నా జబ్బుకు యేమిటి చికిత్స?(1) హాయిగా విశ్రాంతీ కంటి నిండా నిద్రా ? (2) బిస్మత్తుకూడానా ? (3) కాఫీ ?

**4 డిసెంబరు, శుక్రవారం :**

ఉదయం అయిదూ నలభై అయిదు నిముషాలకు 99 4 ఎనిమిదింపావుకి 98 8 సాయంకాలం అయిదుగంటలకు 98 3 , ఆరున్నరకు బాగా బడలిక తీరాక 98 4

**5 డిసెంబరు, శనివారం :**

పొద్దున్న ఆరుగంటలకు 98

**6 డిసెంబరు, ఆదివారం :**

పొద్దున్నే ఆముదం తాగాను ఎనిమిదిగంటలకు 99 6 తరవాత 100 4 , 101 4 కడుపునొప్పి మళ్లీ నల్లమందు వేసుకున్నాను వేసుకున్నాక నొప్పి తగ్గింది

**7 డిసెంబరు, సోమవారం :**

ఉదయం యేడుగంటలకు 98 3 , తొమ్మిదికి 98 1 పడుకొని లేచాక నాలుగు గంటలకు 97 8 రాత్రి తొమ్మిదికి 98 3 కు మించి

ఇవాళల్లా బిలో నార్మల్ బహుశా ఆముదం తాగినందువల్లనే కాబోలును అలా అయితే యిన్నిరోజులు టెంపరేచరు యిలా వుండడానకు కారణం మలబద్ధకమే అని నేను నిర్ధారణ చేసుకోవచ్చునా ? వొగర్పు తగ్గినది కాని నొప్పి మాత్రము వున్నది

**8 డిసెంబరు, మంగళవారం :**

ఉదయం ఆరుగంటలకు 97 4 · పదిన్నరకు 98 రెండూ నలభైఅయిదు నిముషాలకు 98 8

అబ్బే, మరి సందేహం లేదు ఈ లో టెంపరేచరు కు హేతువు ఆముదపు ప్రభావమే

**9 డిసెంబరు, బుధవారం :**

స్నానం చేశాక నార్మల్‌కంటె హెచ్చు.

**10 డిసెంబరు, లక్ష్మివారం :**

. తెల్లవారగట్ల నాలుగున్నరకు 98 6 రెండుగంటలకు 98 5 లేదా 6 రాత్రి తొమ్మిది గంటలకు 99 మధ్యాహ్నం క్షవరం చేయించుకొని స్నానంచేసిన తరువాత రెండుగంటలకు 98 5 లేదా 6 సరే

**11 డిసెంబరు, శుక్రవారం :**

ఉదయం తొమ్మిదిగంటలకు 99 స్నానానంతరం పదింపావుకి 99 , బాగా నిద్రపోయి లేచాక మూడూ యిరవైకి 99 1 లేదా 2 ; మెల్లిమెల్లిగా కడుపునొప్పి ఆరంభం

**12 డిసెంబరు, శనివారం :**

పొద్దున్నే అయిదున్నరకు 97 8 మధ్యాహ్నం బాగా పనిచేసి స్నానంచేసి వొక్క చిన్నకునుకు తీశాక 98 6

**14 డిసెంబరు, సోమవారం :**

ఉదయం నాలుగున్నరకు 98 1 , ఇవాళ చక్కగా పనిచేశాను

**15 డిసెంబరు, మంగళవారం :**

తెల్లవారుఝాము రెండుగంటలకు 100 2 అయిదు మోతాదుల సాల్టు తీసుకున్నాను ఆరున్నరకు 99 5 పది గంటలకు 99 6 మూడుగంటలకు 99 5 అయిదున్నరకు 99 4 మూడుగంటలకు నిద్రలేచాను రాత్రి పన్నెండున్నరకు 97.8 ; కొద్దిగా కడుపునొప్పి.

**16 డిసెంబరు, బుధవారం :**

ఉదయం ఆరుంపావుకు 98 8 కడుపునొప్పి తగ్గలేదు , నిద్రలేచాక వొంటిగంట నలభై అయిదు నిముషాలకు 99 4

**17 డిసెంబరు, లక్ష్మివారం :**

ఆరున్నరకు 97 8

**18 డిసెంబరు, శుక్రవారం :**

ఉదయం ఆరునలభై అయిదు నిముషాలకు 98 5 ఆముదంతాగాను ఒంటిగంటన్నరకి 100 రోజల్లా 98 6

**19 డిసెంబరు, శనివారం :**

ఆరున్నరకు 97 8 రెండుగంటలకు 98 6 లేతదూట పెరుగు పచ్చడి తిన్నాను ఇది వేసుకుతినడంవలన కడుపులో యాసిడు యేర్పడింది ఇక అరటిదూట వేసుకోకూడదు

రొజ్జగాలి, మబ్బులు వాన కురియలేదు

**20 డిసెంబరు, ఆదివారం :**

ఆరున్నరకు 99 ; పదకొండుగంటరకు 100, నిద్రపట్టకుండా చెడగొట్టడానికి అవసరమయినంతగా కడుపునొప్పి.

**21 డిసెంబరు, సోమవారం :**

తెల్లవారుఝాము 101; నాలుగుగంటలకు 101 ఏడూ నలభైఅయిదు నిముషములకు 99 8 · పదకొండు గంటలకు కడుపునొప్పి.

**22 డిసెంబరు, మంగళవారం :**

ఆరూనలభై అయిదు నిముషాలకు 97.4 ; పన్నెండూ నలభై అయిదు నిముషాలకు 98.4.

ఉదయం తొమ్మిదిన్నరకు విపరీతమైన ఆకలివేసింది.

**23 డిసెంబరు, బుధవారం :**

సుగుణవిలాస సభవారు కోరినకోరిక. ఆరున్నరకు 97.5 ; నాలుగుగంటలకు 99 ; ఆరుగంటలకు 99.4.

వకీలుగారు నా గ్రంథములను తీసుకువెళ్లిరి. గొడ్డళ్ళు. గునపం.

కొద్దిగా జ్వరం వచ్చినట్లు ఫీలవుతున్నాను.

**24 డిసెంబరు, లక్ష్మివారం :**

ఉదయం అయిదున్నరకు 98 ; వంట ఆలస్యముగ్గా అయినది. పదకొండుగంటలకు నలభై నిముషములకు భోజనం చేశాను. టెంపరేచరు 99.

**25 డిసెంబరు, శుక్రవారం :**

ఏడుగంటలకు 97.8 ; తొమ్మిదిగంటలకు 98 ; వొంటి గంటా నలభై అయిదు నిముషలకు 100; రెండుగంటలకు 100.5; రెండూ నలభై అయిదు నిముషములకు 100.2 లేదా 3 ? నాలుగు నలభై నిముషములకు 100.3 ; రాత్రి ఎనిమిదిగంటలకు 101 ; భోజనానంతరము తొమ్మిది గంటలకు 1002 ; తొమ్మిదిన్నరకు 99.6.

ఉదయం పదకొండుగంటలకు స్నానం చేశాను. కడుపు నొప్పి.

**26 డిసెంబరు, శనివారం :**

తెల్లవారగట్ల వొంటిగంటన్నరకు 98 ; నాలుగుంపావుకు 98.5 ; తొమ్మిదిన్నరకు 97.8 ; పదకొండుంపావుకు 98; రెండున్నరకు 99; నాలుగున్నరకు 98.8.

ఉల్లినారుకు సొమ్మియిచ్చి వేసితిని.

**27 డిసెంబరు, ఆదివారం :**

ఆరున్నరకు 97.6 ; తొమ్మిదిగంటలకు 98 ; మూడూ నలభై అయిదు నిముషములకు 98.4 ; తొమ్మిదిగంటలకు 98.

మధ్యాహ్నం నిద్రలేచాక ఎంతో నిస్సత్తువుగా వుంది !

**28 డిసెంబరు, సోమవారం :**

అక్కిరాజు ఉమాకాన్తమ్,

ఆన్ధ్రవాఙ్మయసమితి,

52 ఆఫీసు, వేఙ్కటాచల మొదలివీధి,

తిరువల్లిక్కేణి, చెన్నపురి.

ఆరుగంటలకు 97.6 ; ఆపనీ యీపనీ చేశాక పదిన్నరకు 98.4 ; రాత్రి ఏడున్నరకు 99.6 ; తొమ్మిదిన్నరకు 99.

**29 డిసెంబరు, మంగళవారం :**

ఉదయం ఆరున్నరకు 97 6

ఏడుగంటలకు 98 4

**30 డిసెంబరు, బుధవారం :**

ఆరున్నరకు 97 6 , పదింపావుకు 97 8 , చిన్నపూలతోటకు వెళ్లాను

రాత్రి ఆరున్నరకు 98 6

**31 డిసెంబరు, లక్ష్మివారం :**

ఆరుంపావుకు 97 6 · రాత్రి ఒంటిగంటన్నరకు 98 6

## 1915

**1 జనవరి, శుక్రవారం :**

ఉదయం అయిదూ యిరవైకి 98 రాత్రి ఏడుగంటలకు 99 2

వేడినీళ్ళు మీదపడుటవలన చేయి బొబ్బలెక్కినది

**2 జనవరి, శనివారం :**

ఆరూ నలభై అయిదు నిముషాలకు 97.6 , ఆరున్నరకు 101 తొమ్మిదిన్నరకు 102 ; ఆరున్నరకు సాల్టుపుచ్చుకున్నాను రెండున్నరకు 99 మళ్ళీ సాల్టు

**3 జనవరి, ఆదివారం :**

ఉదయం యేడుగంటలకు 98 ; పదకొండుకు 98 , పదకొండుకు 98 ; రెండున్నరకు 99

మధ్యాహ్నం భోజనం చేశాక మొహం ఝుమాయించింది వొంట్లో యేదో తిప్పుడు.

## వైద్యుని సలహాకై నివేదిక

1. **వృత్తి :** కళాశాలలో కొన్ని సంవత్సరాలకాలం లెక్చరరు పదవి· విజయనగరం మహారాజులకు ప్రైవేటు సెక్రటరీ

**వయసు :** ఏభైనాలుగేళ్ళు

**బరువు :** ముప్పైమూడో ఏట 78 పౌనులు నాలుగైదు నెలల క్రితం తూచుకుచూసుకుంటే 81 పౌనులున్నాను ఈ మధ్యనే మళ్ళీ తూచుకునేసరికి 84 పౌనులున్నట్టు కనిపించింది కాని. మెషిను ఆర్డరులో లేదేమోనని నా అనుమానం

2 శీతోష్ణపరిస్థితుల ప్రభావానికి నా శరీరం అతివేగంగా ప్రతిచలిస్తూ వుంటుంది సాధారణంగా వీచేగాలిని సైతం నేను భరించలేను గాలి వంటికితాకకుండా గొడుగును అడ్డంపెట్టుకుంటూ వుంటాను నడుస్తున్నప్పుడూ, బండిలో వెళుతున్నప్పుడూ, యిది నాకు మామూలు శీతోష్ణపరిస్థితుల కనుగుణంగా, వొక శాలువ లేకపోతే వొక శాలువమీద యింకొకటీ తలపాగా, కోటూ, కోటుమీదకోటూ కాకుంటే ఉన్నిదుస్తులు

ధరించడం నాకు పరిపాటి. ఇక కొండలమీద వున్నప్పుడు కూడా యివే దుస్తులు ; జుబ్బా మీద జుబ్బా ; కోటుమీద కోటు. కొండలమీద వాతావరణం చక్కగానే వుంటుంది. శరీరానికి మంచిదికూడాను. అయినప్పటికీ, నా శరీరారోగ్యం నాలుగైదు సంవత్సరాలనుంచీ అలాగే వుంది. కొండలమీద వున్నప్పటికీ అంతా యథా పరిస్థితే. నిరంతరం ఆలోచిస్తూ మేధస్సుకు శ్రమకల్పించడం బహుశా దీనికి కారణం కావచ్చును. కొండలమీద వున్నప్పుడు బాగా ఆకలివేస్తున్నప్పటికీ, కాస్త ఊపిరి సలిపినప్పటికీ, కొంత ప్రశాంతత చిక్కినప్పటికీ, యీమధ్య బొత్తిగా అదీలేదు.

3. మధ్యాహ్నం భోజనమయాక కొంతసేపు విశ్రాంతి తీసుకొనేవాణ్ణి. మంచంమీద వాలి రెండు మూడు గంటలపాటు సేదతీర్చుకొనేవాణ్ణి. ఇలాగ కొన్నేళ్ళు జరిగాయి. ఇలా కాక యింకొకలాగ చేస్తినా వొళ్ళు కుతకుత మనేది. సాయంకాలం మూడూ నాలుగుగంటలమధ్య ఆయాసంగా వుండేది. వొంట్లో నిస్త్రాణ. నాలుగు గంటలక్కానీ యింత రొట్టె. కాస్త కాఫీ పుచ్చుకుంటినా బడలిక తగ్గేది; ప్రాణం లేచివచ్చినట్లనిపించేది. ఓపిక కలిగేది. సాయంకాలంపూట నడవగలిగే వాణ్ణి. ఏ పనైనా చేయగలిగేవాణ్ణి. చకచకా అంగలువేస్తూ నడిచేవాణ్ణి. రొట్టె, కాఫీ తీసుకోవడంవల్ల లోపల యాసిడ్ పుట్టి, ఒక్కొక్కపుడు నిద్రరాక బాధపడుతూ రావడంవల్ల, యిక లాభంలేదని వాటినీ వొదిలి పెట్టేశాను. అవికూడా అరిగించుకోలేక పోతేయేం చేయడం మరి ! కొంచెం పుష్టికరమైన ఆహారం భుజించాలని యిప్పటికీ నాకు కోరికగా వుంటూనేవుంది. కాని అది కడుపులో చేరి 'యాసిడ్' కలిగిస్తే మాత్రం బాధ కలుగుతుంది. సాత్వికాహారం తీసుకున్న వెంటనే ఎంతో హాయిగా వుంటుంది. మంచి టిఫిను కావాలనిపిస్తుంది నాకు.

4. కొన్నేళ్ళ క్రితంమాట : అందరికివలె కాక నా శరీరం చాలా ఉష్ణంగా వున్నట్టనిపించేది. తరుచు ఏదో బాధగానే వుండేది. కడుపు భగభగ మండుతూ వుండేది ; రాత్రి భోజనం చేశాక స్థిమిత పడేవాణ్ణి.

5. రాత్రిపూట భోజనం చేసేముందు కొన్నేళ్ళపాటు కొంచెం క్లారెటు, కోకోవైను పుచ్చుకున్నానా లేదా అన్నంత స్వల్పంగా తీసుకునేవాణ్ణి. నా భోజనంలో ప్రధాన ఆహారం పాలూ, అన్నం, కాస్తంత చక్కెర. కడుపులో యాసిడుచేరి ఉధృతమైనపుడు, కునుకు పట్టేదికాదు. నాకూ, నిద్రకూ సగమెరిక. మాటిమాటికీ మూత్రం వస్తూవుండేది. రంగు వివర్ణం. క్లారెటు, తదితర పానీయాలను పూర్తిగా విడిచి పెట్టేను. కొన్నాళ్ళకు అవీ పడలేదు. ఎంత కొంచెం తీసుకున్నా చికాకు హెచ్చేది. ఉపశమనానికి బదులు మేధస్సు ప్రకోపించేది. మూడేళ్ళక్రితం, నాలికకు అల్సర్ వచ్చింది. పాలు తాగవద్దన్నారు. సరేనన్నాను. నైట్రో – హైడ్రోక్లారిక్ యాసిడ్‌తో కలిపిన మిక్స్చరు పుచ్చుకోవడంవల్ల అల్సరు పోయింది. మళ్ళీ అది రాలేదు.

6. విచిత్రమేమంటే, కొండలమీదికి వెళ్ళినపుడల్లా నాకు ఆకలి బాగానే వేస్తుంది. పొద్దున్నా సాయంకాలమూ కాఫీ తాగేవాణ్ణి. అయినప్పటికీ మళ్ళీ నా నాలుకను అల్సరు రాలేదు.

7. మామూలుగా వేసుకునే దుస్తులతోనే నిద్రపోవడం నా అలవాటు. కాని సాధారణంగా నామోము వెచ్చగా వుంటుంది. అందువల్ల మాటిమాటికీ విసురుకుంటూ వుంటాను. కొన్నాళ్లకి మోము భగభగమనడం పోయింది. అది భగభగమన్నప్పుడల్లా బహుశా టెంపరేచరు నార్మలుగాకంటె ఎక్కువ వుండేది కాబోలును.

8. ఇరవైమూడేళ్ళక్రితం, అటుపిమ్మట చాలా ఏళ్ళ వరకూ, నా నరాలూ, పేగులూ, సలుపులెత్తేవి. ఉన్న బాధంతా ముఖ్యంగా వాటివల్లనే. ఇట్టే అవి ప్రకోపించేవి. విరేచనం వొక్కొక్కపుడు కొంచెం నీళ్ళనీళ్ళగానూ, తరుచు గట్టిగానూ రోజూ నాలుగయిదుసార్లు అవుతూవుండేది. తీసుకున్న ఆహారం అరిగేదికాదు.

9 1819 వ సంవత్సరంలో వొకనాటి ఉదయం పదిగంటలకు వొక కొండను అధిరోహించ ఆరంభించాను శీతాకాలం ఎండకాస్తున్నది తలమీద ఎండ పడుతూనే వుంది తలపాగా లేదు గొడుగూలేదు కొండమీదవున్న భవంతికి త్వరత్వరగా చేరాలనే ప్రయత్నంలో అడ్డుదారిని గబగబ నాలుగడుగులు వేశాను కొండ శిఖరం మీద నాలుగడుగులు వేశాను కొండ శిఖరంమీద నాలుగడుగులు వేసేసరికి ఆయాసం లావయింది మూర్ఛ వచ్చినట్లయింది కొన్ని సెకండులపాటు స్పృహకూడా తప్పింది నాటి సాయంకాలం నుంచీ తలతిప్పడం మారంభించింది.

10 అదే పనిగా ఏదో ఒక ఆలోచనా పూర్వకమైన పనిచేయడంవల్ల మేధస్సుకు శ్రమ కలిగించడంవలన నా నరాలు పట్లు తప్పాయి నరాల బలహీనత హెచ్చింది దాంపత్యసుఖం అనుభవించిన తరువాత మేధస్సు ఉద్రేకం కాజొచ్చేది నిద్రపట్టేది కాదు ఒక్కొక్కప్పుడు భుజాలగూళ్లు సలుపులెత్తేవి నాకు నిద్రలేమి అనేజబ్బు ఎలాగూవుంది అయినా కాఫీ తీసుకోవడం మానేనుకాను నేను కాలేజీలో లెక్చరరుగా వుండేవాణ్ణి అదే పనిగా గ్రంధాలను పరిశీలించడం అలవాటై పోయింది కొంతకాలానికి పరిశీలన మాటకేమి వుత్తినే పుస్తకంలోని అక్షరాలను చదివితే చాలును తల భారమయేది మేధస్సుకు శ్రమ కలిగేది రెండడుగులు అలా నడిచివెళ్ళడమంటే ప్రాణాంతకం

11 సరే ఇక నాకు మరణం తప్పదనుకున్నాను కాని స్వర్గస్థులైన మహారాజావారు నన్ను చెన్నపట్టం తీసుకువెళ్ళి డాక్టర్ బ్రౌనింగ్‌కు చూపించారు రైలుప్రయాణం భారమైనా నేను మదరాసు వెళ్లాను డాక్టరు బ్రౌనింగు నన్ను పరీక్షించాడు నా శరీరంలోని నరాల నిర్మాణపద్ధతి పూర్తిగా చెడిపోయిందని చెప్పాడు కాని నేను చాలాకాలం బతుకుతానని అన్నాడు భోజనంతోపాటు ప్రతిసారీ యివి పుచ్చుకోవాలని ఆదేశించాడు అరోమెటిక్ కన్‌ఫెక్షన్ అయిదు గ్రెయినులు బిస్మత్ ఐదు గ్రెయినులు పెప్సిను అయిదు గ్రెయినులు

నరాల సత్తువకు తాను నాకు అప్పట్లో మందు యివ్వలేదు అలా యిచ్చినట్లయితే ప్రయోజనం లేదన్నాడు కారణం అప్పట్లో నా కేమాత్రం చురుకుకలిగించే ఏమందు వాడినా నా నరాలు వాటిని గ్రహించేస్థితిలో లేవట ఏం తీసుకున్నా నరాలు చలించిపోలాయట అందువలన సాత్వికమైన వొక టానిక్‌ను పుచ్చుకోమన్నాడు ఇది రాత్రిళ్ళు సేవించే ఔషధం ఇందువల్ల రాత్రిళ్ళుజరిగే వీర్యస్ఖలనం కట్టడుతుంది బెలాడోనా హెయసిమస్ కేంఫర్ ఇవికాక కాడ్‌లివరాయిల్ కొద్ది కొద్ది మోతాదులుగా యివ్వడమారంభించాడు

12 కొన్నాళ్ళకి కొంచెం నయమయింది ఆరోగ్యం బాగుపడింది కాని అయిదునెలలయాక బ్రోన్కైటిస్ వ్యాధీ జ్వరమూ పట్టుకున్నాయి

అయితే నా అనారోగ్యంవల్ల నాకొకటి కలిసివచ్చింది అదృష్టమే మరి డాక్టర్ బ్రౌనింగ్ వూళ్ళో లేకపోవడంవల్ల డాక్టర్ నంజుండరావు మందు యిస్తూవుండేవాడు ఆయనా నేనూ స్నేహితులమయాం రాత్రుళ్ళు బాగా కాగినపాలూ యింత అన్నమూ తినమని ఆయన సలహా యిచ్చాడు అప్పటికి నా వయస్సు ముప్పైమూడు బరువు డబ్బైఎనిమిది పౌనులు జ్వరం కాయడంవల్ల ఆరు పౌనులు తగ్గిపోయినాను

13 పాలు తాగడం యెందుకు మానేశానో కారణం మీకు ఇదివరకే చెప్పాను నాలుకకు అల్సరు వచ్చింది ఇక పాలు తాగవద్దన్నారు సరే నన్నాను పాలు పుచ్చుకోవడంవల్ల పొద్దున్నే విరేచనం బాగా అయేది మలబద్ధకంగావుంటే కాసిన్ని పాలు ఎక్కువ తీసుకునేవాడిని. ఇపుడు పాలు వొంటికి పడవు కడుపులో యాసిడు పుట్టుకొస్తుంది

14. 1894-95 మధ్యకాలంలో నాకు కలిగిన యితర బాధలు యివి : తల వెనకభాగం సూదులతో గుచ్చినట్టు, దబ్బళాలతో పొడిచినట్టు చురుక్కుమనేది. ఒక ఏడాదిపాటు బాధపడ్డాను. తరవాత తగ్గిపోయింది.

15. రోజూ మూడుపూటలా భోజనం చేసేవాడిని ; సాయంకాలం నాలుగు గంటలకు టిఫిను తీసుకునేవాడిని. ఒక్కొక్కపుడు కొన్ని వారాలపాటు అన్నానికి బదులు పొద్దున్నే పాలూ, కాఫీ తీసుకునేవాడిని. ఇలాగ పాలూ, కాఫీ తాగుతున్నపుడు మధ్యాహ్నం వేళల విరేచనం కొంచెం గట్టిగా అయేది ; నల్లగావుండేది.

16. విపరీతమైన బడలిక, ఆయాసం నాకు బాల్యం నుంచీ వున్నదే. నా శరీరతత్వమే అంత అనిపించేది. చాలా బక్కపల్చటి మనిషిని. కాని నేను కావించేకృషి, మేధోసంబంధమైన కార్యాచరణా అత్యధికం. నేనింత కృషి ఎలా చేస్తున్నానా అని నా మిత్రులకేకాదు. నాకే ఆశ్చర్యం వేసేది. ఎప్పుడూ పక్కమీద అలావాలి, విశ్రాంతి తీసుకోవాలనిపించేది. శారీరక కష్టమంటే యిష్టముండేది కాదు. ఇంత ఆయాసంగా వున్నా యింత బలహీనంగావున్నా పోనీ ఆలోచనలకు విశ్రాంతియిచ్చానా ! లేదు ; మేధస్సును అదేపనిగా శ్రమపెడుతూ వచ్చాను. నిన్న మొన్నటివరకు నేను కావించిన మూర్ఖప్పని యిదే.

17. ఇప్పుడు నాకు కలిగిన రుగ్మత యిది : పూర్తిగా నరాల బలహీనత. జీర్ణకోశం చెడిపోయింది. నరాలకు షాకు కలిగినా, నా ఆరోగ్యం చెడిపోతున్నదే అనే వ్యాకులతవలనా శరీరం మార్పుచెందేది; మలబద్ధంపోయి విరేచనమయేది. ఇది యిదివరకటిమాట. ఇపుడు అదీలేదు. నరాలకు ఉద్రేకం కలిగినా మలబద్ధం మలబద్ధమే. దీనికితోడు జ్వరం.

ఈ జ్వర లక్షణాలు బర్నేయూ మాన్యుయలు మొదటి వాల్యూములో రెండువందల మూడవపేజీలో పేర్కొనబడిన జ్వరలక్షణాలను పోలి వుంటవి. కడుపులో యాసిడు చేరినట్టు వుంటుంది. చారు తాగినా, మజ్జిగ పుచుకున్నా యిది ఎక్కువవుతుంది. కడుపు నొప్పి ఆరంభమవుతుంది. జీర్ణించుకుందుకు కొంచెం కష్టమైన ఆహారం, లేదా మలబద్ధం కలిగించేమందులు వాడినా, కడుపునొప్పి అధికమౌతుంది. అయితే యిది అరుదు. ఎనిమా చేసుకుంటే తప్పక ఉపశమనం కలుగుతుంది. ఆముదం మొదలైనవి అసలే పడవు. మా డాక్టరు యీ మిక్స్చరు వాడమని చెప్పాడు : మాగ్సల్ఫ్ వొక ఔన్సు ; సోడిసల్ఫు వొక ఔన్సు ; సోడా బైక్రోబ్ పది గ్రెయినులు.

ఈ మిక్స్చరు ఆరుడ్రాములు తాగితే ఆరేడు నీళ్ళవిరేచనాలవుతాయి. మొన్న వేసవివరకు నేనెప్పుడూ పర్గెటివు తీసుకోలేదు. పాలుతాగితే చాలుననిపించేది.

ఇప్పుడు ఎనిమిదిడ్రాముల మిక్స్చరు వాడినా ఫలితం కనిపించడం లేదు. అందుకని మూడు డ్రాముల ఆముదం తాగేను. కాని దీనితో నాపని తలకిందులైంది. గత్యంతరంలేక ఎనీమా చేసుకున్నాను. రెండుమూడు రోజులవరకు సవ్యంగానే వుంది.

ఇప్పుడు నేను తీసుకుంటున్న ఆహారం.

(అ) ఉదయం ఆరుగంటలకు మెల్లిన్సుఫుడ్ ఆరు చెమ్చాలు. నిండు చెమ్చాలు కావు. (ఆ) పదకొండు గంటలకు అన్నం, చప్పిడి కూర ; వాడే కూరగాయలు యివి : ఆనపకాయ ; పొట్లకాయ ; వంకాయలు. (ఇ) రాత్రి ఏడుగంటలకు మధ్యాహ్నంవలె మామూలు భోజనం.

నూకలు వేయించి జావ చేసుకుని యీ మధ్య పుచ్చుకునేవాడిని. కాని ఆయుర్వేద వైద్యులు, వేయించిన నూకల జావ మలబద్ధకం కలిగిస్తుందని చెప్పడంవల్ల మానివేశాను. ఇపుడు మళ్ళీ పుచ్చుకుంటున్నాను. నాకిప్పుడు

జావలాంటి పదార్థం సులభంగా జీర్ణమయేది తీసుకోవాలని వుంది మలబద్ధంపోయి జ్వరం తిరుగుమొహం పెట్టాలి. నరాల బలహీనతవల్ల కొంత, మందుల విషంవల్ల మరికొంత నాకు ఉష్ణం వచ్చి వుండవచ్చును నెల క్రితం నా టెంపరేచరు నూటమూడు డిగ్రీలు మెల్లిన్సుపుడ్డూ నూకలజావా మూడూ నాలుగు రోజులు పుచ్చుకున్నాను అప్పటికి టెంపరేచరు నార్మలుకు వచ్చింది మధ్యాహ్నం ఒక పూటే భోజనం చేసేవాణ్ణి తరవాత రాత్రుళ్ళుకూడా భోజనంచేశాను మధ్యాహ్నం భోజన మయాక టెంపరేచరు వచ్చింది మెల్లిన్సుపుడ్డూ నూకల జావా తీసుకోవడంవల్ల టెంపరేచరు తగ్గినా, ఆ తగ్గడంతో పాటు నీరసంకూడా పుట్టేది అన్నంతింటే నిస్త్రాణ వుండేది కాదు కొంచెం దారుఢ్యంగా వున్నట్టనిపించేది నిన్న రాత్రల్లా నిద్రపట్టలేదు ఇప్పుడు ఉదయం ఏడుగంటలయింది టెంపరేచరు నూరు డిగ్రీలు ఇదంతా నేను చెప్పగా వ్రాయబడ్డ నివేదిక

18. జ్వరం కాస్తున్నపుడు కడుపులో మంటపుట్టినట్లుంటుంది రొమ్ము భుజాలు, ప్రత్యేకంగా ఎడమభాగం నొప్పెడుతున్నాయి నూరు డిగ్రీల జ్వరం వచ్చినా, నొప్పి కలగనపుడు కొంత బాధనిపించదు టెంపరేచరు, నార్మలుకు వచ్చిందా ప్రాణం తెరిపిన బడినట్లుంటుంది బాధలేదు పనేమీ లేకుండా పూర్తిగా విశ్రాంతి తీసుకుంటూ కూచోడం నావల్లకాదు. అయితే ఎంత విశ్రాంతిని భరించగలదో అంత విశ్రాంతీ నేను తీసుకుంటూనే వున్నాను నాలాగ జాగ్రత్తగా ఆహారం తీసుకొనే వాళ్ళుంటారని నేననుకోను జ్వరంగా వుంది జ్వరంతో ప్రయాణం చేయడమంటే భయంగానేవుంది లేకపోతే మద్రాసు వచ్చి వైద్య సలహా తీసుకునేవాడినే

19. నాకు వస్తోన్న జ్వరం రెండు రకాలు : ఒకటి అపుడపుడు వస్తూ వుంటుంది కంఠంలో నొప్పి బయలుదేరినపుడు, బ్రోన్కైటిస్ వచ్చినపుడు, రక్తంలో విషసంబంధమైన పదార్థాలు చేరినపుడు యిది వస్తుంది.

అప్పుడు నీరసం హెచ్చుతుంది చికాకు లావవుతుంది అవయవాలు పీక్కుపోతాయి. కొంచెం చలివేస్తుంది. ఇప్పుడు వచ్చిన జ్వరం మామూలుగా వచ్చే ఉష్ణంకాదు సాధారణంగా నాకు ఆకలి బాగానే వేస్తుంది.

ఇపుడు వచ్చిన నా జ్వరానికి ప్రధాన కారణం యిదనుకుంటాను : జూలై మాసం యిక వెళ్ళిపోతుందనగా ఆఖరి వారంలో నా కొకరోజున నూటవొకటి డిగ్రీల జ్వరం వచ్చింది జ్వరం రావడానికి ముందు ఆవేళ నేను చాలా శ్రమపడ్డాను. శ్రమంతా, ఏదో ఒకటి చదవడం, రాయడం; ఆలోచనలకు శ్రమ కలిగించడంవల్ల టెంపరేచరు హెచ్చింది. కాని తగ్గింది ; మళ్ళీ మూడురోజులూ ఈ మధ్య రెండుసార్లు టెంపరేచరు హెచ్చింది మా డాక్టరు బహుశా యిది మలేరియా అయివుంటుందనుకున్నాడు నాకు చలిలేదు ఆకలి బాగానే వేస్తుంది. ఎందుకైనా మంచిది ముందే జాగ్రత్త తీసుకుందామని మా డాక్టరు రెండున్నర గ్రెయినులు క్వినైను వాడమన్నాడు. రోజుకు రెండుసార్లు క్వినైను తీసుకున్నాను. ఒకరోజున మాకెవరికీ తెలియకుండా ఒక పొరపాటు జరిగిపోయింది. డిస్పెన్సరీలో మందు ఎవరిచ్చారోకాని క్వినైను మోతాదు రెండున్నర గ్రెయినులకు బదులు అయిదు గ్రెయినులకు పెరిగింది.

నేను రెండు గ్రెయినుల క్వినైన్‌కు మించి ఎప్పుడూ తీసుకోలేదు అందువల్ల యీ ఐదు గ్రెయినుల మోతాదూ నాకు చాలా అవస్థ కలిగించి వుండాలి. దానితో నా కడుపూ, నరాలూ, పేగులూ చెడిపోయి వుంటాయి

## అనుబంధం

1. మలబద్ధం వచ్చినపుడు నూటవొకటీ, నూటరెండు డిగ్రీల జ్వరం వుంటున్నదని డాక్టర్ బర్నేయో చెబుతున్నాడు. కొంతమంది డాక్టర్లు యింతకంటె హెచ్చుజ్వరమే వస్తుందంటున్నారు. ఈ జ్వరం కాసినపుడు తలనొప్పి, నాలికపై ముళ్ళుపుడతాయి. నోరు పూస్తుంది. ఆకలి పుట్టదు. నాకు వచ్చిన జ్వరం యిలాంటిదే ననుకుంటాను.

2. గత నాలుగయిదు మాసాలలో నాకు అయిదారు సారులు జ్వరమొచ్చింది. తిన్న ఆహారం అరగలేదు. తీసుకున్న ఆహారం మంచిదీ కాదు. అందువల్ల కడుపునొప్పి ఆరంభమయింది. సరే ; ఇక మలబద్ధం, అటు తరవాత జ్వరం రానే వచ్చాయి.

ఇప్పుడు నాకు జ్వరం వచ్చినా, నాలిక మామూలుగానే వుంది. ఇంతకు ముందెన్నడూ నాకు తల నొప్పిపెట్టలేదు. ఎండలు ముదరడంవల్ల ఏప్రియలు ఎనిమిదో తేదీ నుంచి తలనొప్పి ఆరంభమయింది. ఇప్పుడు ఆకలి మటుకు బాగానే వేస్తోంది. ఊష్ణంవల్ల ఆకలి తగ్గలేదు. జ్వరం నూటవొకటి డిగ్రీలకు మించినట్లయితేమాత్రం ఆకలి చచ్చిపోతుంది. నాకు జ్వరం రావడానికి కారణాలు రెండు.

3. మొదటి కారణం : మధ్యాహ్నం వొంటిపూట తింటి. ఇంత అన్నం తినడమారంభించాను. అపుడు టెంపరేచరు తొంభైతొమ్మిది డిగ్రీలు. ఇందుతో జతపరచిన పట్టిక ఫిబ్రవరి పదిహేనువరకూ చూడండి. అటుపిమ్మట రాత్రుళ్ళు కూడా తినిచూద్దామనుకున్నాను. టెంపరేచరు 99.6 డిగ్రీలకు హెచ్చేది. ఫిబ్రవరి 19 వరకు ఇలాగేవుంది. తరవాత రెండురోజులూ టెంపరేచరు 99.8 డిగ్రీలు. ఇరవైరెండో తేదీన నూరు డిగ్రీలు. జావా అవీ తాగితే టెంపరేచరు తగ్గవచ్చును. మెల్లిన్సుపుడ్డూ, జావా తీసుకున్నాను. నీరసం అధికమయింది. అన్నం తింటే నిస్త్రాణగా వుండదు. బలంగానే వుంటుంది. కొన్నాళ్ళు అన్నమే తిన్నాను. నిస్త్రాణ పోయింది. కాస్త జవసత్వాలు వచ్చాయి. కాని కడుపులో ఆసిడ్ చేరినట్లు అనిపించింది. చింతపండు వాసన తగిలిందా యిది ఎక్కువవుతుంది. మజ్జిగ పడదు.

4. ఇక రెండవ కారణం : ఎండపొడ కిట్టదు. ఎండలో నాలగయిదు నిముషాలయినా నించోలేను. ఎండబాగా కాసిందా ఆనాడు నేను ఏదైనా పనిచేస్తినా జ్వరం వచ్చేస్తుంది. ఆ వేళ ఏమీ చదవనూకూడదు ; రాయాస్తీకాదు. నాకు విశ్రాంతి అవసరమౌతుంది. ఇప్పుడు పనీ పాటూ లేదు. విశ్రాంతి తీసుకుంటున్నాను.

5. మధ్యాహ్నం నిద్రపోకపోయానా, టెంపరేచరు విధిగా హెచ్చిందన్నమాటే. హెచ్చడంలోనూ అలా యిలా కాదు ; త్వరత్వరగా కొన్ని సంవత్సరాలనుంచీ వస్తూ పోతూ, హెచ్చుతూ, తగ్గుతూవున్న యీ టెంపరేచరువల్ల నా శారీరక తత్వమే అంత అనుకున్నాను. ఏమాత్రం ఉద్రేకం కలగకుండా నరాలకు శక్తి కలిగించాలి.

6. నరాల బలహీనతతప్పు మరొక వ్యాధేమీ నాకు లేదు. మిగిలిన అవయవాలన్నీ బాగానేవున్నాయి. నిన్న నూకల జావ తాగాను. పొద్దున్న ఏడుగంటలకి మెల్లిన్సుపుడ్డూ, పన్నెండుగంటలకి జావా పుచ్చుకున్నాను, రాత్రి ఏడుగంటలకి మెల్లిన్సుపుడ్డూ, కాసిన్నిపాలూ తీసుకున్నాను. దానితో ఎక్కిళ్ళు ప్రారంభమయాయి.

ఎండవేడి యెక్కువవుతున్నకొద్దీ టెంపరేచరు లావవుతోంది. కాని జ్వరానికి ప్రధానకారణం అజీర్ణం. మలబద్ధం నాకు కాస్త మంచి ఆహారంకావాలి. తినగానే జీర్ణమయితే మంచిది. అయితే మెల్లిన్స్‌పుడ్డూ. జావామాత్రం వొద్దు. అవి పుచ్చుకుంటే చెప్పలేనంత నిస్త్రాణగా వుంటోంది. నా జీర్ణకోశం చెడిపోయింది.

# నివాళి

* ఆయన మన ఆంధ్రులలో మాకు ముందటితరము వారిలో చాలా ప్రసిద్ధపురుషులు .... తనమాట చెల్లివచ్చిన చోటనల్లా మన ఆంధ్రులకు ఆంధ్ర సంస్థలకు సాయపడిన, సిసలైన దేశాభిమాని .... "దేశాభిమానం నాకు కద్దని వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్, పూని యేదైనాను వొకమేల్ కూర్చి జనులకు చూపవోయ్ !" అని తన ముత్యాలసరములలో పాడినట్లు తాను లోకోపకారమని నమ్మిన 'వ్యావహారిక భాషోద్ధరణ' మనే ఉద్యమమునకు ధారపోసిన మహితాత్ముడు. "నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను" అని ప్రవచించిన శ్రీ అప్పారావు పంతులుగారు నాకు గురుతుల్యులు.

♦ ఒకసారి మనోహరమగు స్త్రీలపాతపాట ఒకటి అప్పారావుగారి చెవినిబడి మనసున క్రొత్తసంగీతము తిరుగగా, తెలుగున ఒక క్రొత్త ఛందము నడిపింపవలెనని సంకల్పముదయించెను. 1910లో బరంపురమున జరిగిన నానావర్ణ సహపంక్తి భోజనములో అప్పారావు పాల్గొనినాడు. ఆ సంవత్సరమే తోకచుక్క పొడిచినది. ఒక విచిత్రమైన భావమథనమున అప్పారావు రసిక చిత్తమున నుండి ఒక క్రొత్త కవితావేశము రూపు కట్టినది ..... ఈతని కావ్యముల పాత్రలు ఒక సహజ భావోద్రేకములో ఈతనివలెనే, కావ్యౌచిత్యమును కుంటుపడనీయక మెరుగుదేరునట్లు సంస్కారాశయముల వెలిబుచ్చును.

♦ ఇంగిలీషు ప్రభుత్వం సుస్థిరంకాగానే, దిగజారుతున్న ఆర్థికపరిస్థితులు బట్టబయలైనాయి. ప్రజలు అన్నంలేక మాడిపోతున్నారనీ, ఈ దుస్థితి ప్రజలకు కలగడం మన దుష్టసాంఘిక పరిస్థితులవల్లనేననీ మనసంఘం మరామత్తుఅయి, ప్రజాప్రభుత్వస్థాపనమై, పరప్రభువుల స్వచ్ఛందవిహారం కట్టించబడితేనేగాని ప్రజలకు మరి ముక్తిలేదని ప్రజల్లో కొంతయలజడి కలిగింది ..... అంతవరకూ నిరసించబడ్డ జాతీయ సారస్వతం తిరగి ప్రజలదృష్టి నాకర్షించింది ... ప్రజాసామాన్య సారస్వతరక్త ధ్వజం ఎత్తబడింది ... ఈ రక్తధ్వజాన్ని ఎత్తినవారిలో నగ్రగణ్యులు గురజాడ వేంకట అప్పారాయకవి.

* గురజాడ అప్పారావు పంథొమ్మిదివందల పదిహేనులో చనిపోయినా పంథొమ్మిది వందల పదిహేను తరువాతనే జీవించడం ప్రారంభించాడు. కాల్పనికోద్యమంలో ఉన్న ఉత్తలక్షణాలన్నీ స్వచ్ఛమూ, విసర్గ సుందరమూ అయిన ఆయన వాణిలో కనబడతాయి. సామాన్యుల గాథలూ, సామాన్యుల మాటలూ, కావ్య ప్రాంగణాన ప్రవేశపెట్టడం ఆయన గొప్పతనం. ఆ 'ముత్యాలసరం' కూడా అలాగే అమరింది ! ఆ ఛందస్సు తెలుగువాడి కష్టసుఖాలూ, కథలూ ఎంత బాగా చెపుతుంది ! "పాట లాధరి చెట్లచేమలకై పాటపాడితే తాటి వనమున ఆగి చంద్రుడు తాను చెవియొగ్గడమూ",

"మంచి చెడ్డ రెండె కులములు; మంచి అన్నది మాల అయితే మాల నే నౌదున్" అని చాటడమూ "నలుగురు కూర్చుని నవ్వే వేళల పుత్తడిబొమ్మను పూర్ణమ్మను ఒక పరితలచి" అవన్నీ పలికించడమూ, "పెరిగి విరిగితి, విరిగి పెరిగితనని స్వంత కష్టసుఖాలు తలపోసుకుని వాపోవడమూ, "ప్రేమ కలుగక బ్రతుకు చీకటి" అని ప్రేమికుడు కావడమూ ఇవన్నీ ఆ క్రొత్త రోజుల్లో యువకవుల హృదయాలకు ఆనందపక్షాలు తొడిగి, గూటి యెరుగనివాటికి కొండంత జీవితాకాశాన్ని చూపెట్టాయి. వీరి రచన లన్నిటిలోనూ వీరేశలింగం మానవోద్యమ ప్రభావమే కనబడుతుంది.

* గురజాడ అప్పారావు పంతులుగారు సంస్కృత ఆంధ్ర ఆంగ్లభాషలలో నిష్ణాతులు ..... ఆయన సృష్టించిన పాత్రలు మానవత్వంతో నిండినట్టివి. ప్రాణమున్న ప్రతివాక్కరిలోనూ అవి జీవించి, జీవితాన్ని ఉత్సాహవంతం చేస్తాయి. మానవత్వంతోనూ జీవితంతోనూ పరిపూర్ణమైన రచన కన్యాశుల్కం. దానిలోని స్త్రీలూ, పురుషులూ దయాదాక్షిణ్యాలతోను, విపరీతాలతోను, అయుక్తాలతోను, క్రౌర్యాలతోను, కుయుక్తులతోను, పవిత్రతతోను, వంచకత్వంతోను తిరుగులాడతారు. ప్రకృతి - ఆచారం హేతువు - సంప్రదాయం, అభిప్రాయం, ఛాందసత్వం ఒకదానితో వొకటి తీవ్రసంఘర్షణలకు తలపడ్డ జీవిత వెల్లువలతో యిది నిండి తొణకిసలాడుతున్నది.

♦ మహాకవి గురజాడ అప్పారావుగారి గేయాలలో తేటతెనుగు భాష తియ్యదనము చక్కగా ద్యోతక మవుతాయి. మృదుమధురమైన పదాలను ఏరి కూర్చడంలో గురజాడ వారికున్న ప్రతిభ "ముత్యాల సరాలు" చాటుతాయి. సరళమైన శబ్దాలకు పదునుపెట్టి జతచేర్చి తాము అంద జేయాలనుకున్న భావాలను చదువరుల హృదయాలకు హత్తునట్లుగా చెప్పగల గొప్పశిల్పి అప్పారావుగారు. పూర్ణమ్మ, కన్యక మొదలయిన పాటలను చదివితే మహాకవి రచనా పాటవం చక్కగా స్ఫురించుతుంది.

గురజాడవారి "దేశభక్తి" గేయం, జాతీయ గీతాలన్నిటిలోకి అత్యుత్తమమైనదిగా నేను భావించుతాను. బ్రిటీష్ వాళ్ళ జాతీయగీతమైన "గాడ్ సేవ్ ది కింగ్"లో సామ్రాజ్య వాదుల అహంకారం ద్యోతకమవుతుందే గాని, మానవత్వం గోచరించదు. భారతదేశంలో ఉత్తమ జాతీయ గీతాలుగా ఎంచబడుతున్న 'వందేమాతరం', 'జనగణమన' లలో కూడా మాతృభూమిని కీర్తించడం వుందేగాని, ప్రజానీకంపై దృష్టిని కేంద్రీకరించవు. "దేశమంటే మనుషులోయ్" అని ఎలుగెత్తి చాటిన అప్పారావుగారి గీతం వాటన్నికంటే మహోన్నతమైనదనడంలో సందేహం లేదు.

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టి గొప్పలు చెప్పుకోకోయ్ ;
పూని యేదైనాను వొక మేల్
కూర్చి జనులకు చూపవోయ్"

అనే చరణంలోనూ

"స్వంత లాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్!"

అనే చరణంలోనూ అప్పారావుగారు మానవత్వం యొక్క ఔన్నత్యాన్ని నిరూపించారు.

"వెనకచూసిన కార్యమేమోయ్?
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందుఅడుగేయ్
వెనకపడితే వెనకే నోయ్ !"

అని మహాకవి ప్రజానీకాన్ని అభ్యుదయమార్గాన నడువమని ఉద్బోధించారు.

"యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్?
జల్దుకొని కళలెల్లనేర్చుకు
దేశిసరుకులు నించవోయ్ !"

"పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్ ;
తిండి కలిగితె కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్ !"

అని మహాకవి ఎలుగెత్తి చాటారు. ఇంత గొప్ప జాతీయ గీతాన్ని మనకందించిన మహాకవి మనవాడవడం నిజంగా ఆంధ్రప్రజల అదృష్టం !

ఏ కవికైనాసరే అతనిచుట్టూ ఒక సమాజం, ఆసమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. ఈ సామాజిక చారిత్రక పరిణామగమనంలో కవియొక్క సాహిత్యస్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలీ, ప్రతిభాశాలీ అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతంచేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను ... భవిష్యత్తు మీద గురజాడకున్న విశ్వాసానికి నేనిక్కడ నివాళులెత్తుతున్నారు. తక్కినవాళ్ళంతా తెలుగుదేశంలో యోధాను యోధులైతే ఒక్క గురజాడ మాత్రమే ప్రపంచంలో ఎచ్చట ప్రామాణ్యాలకైనా విలువగల సార్వజనీనతను సాధించినవాడు.

ఆధునిక సాహిత్య ప్రపంచంలో తెలుగు దేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవి సమ్మేళనంలో తెలుగువారి తరపున ప్రతినిధిగా విలువ గలిగినవాడు గురజాడ అప్పారావు ఒక్కడే. కవిగా మాత్రమేకాదు, కథారచయితగా, విమర్శకుడుగా విశేషించి నాటక కర్తగా గురజాడ ధ్రువతార.

ముఖ్యంగా నాటకరచన విషయంలో నీవు ప్రదర్శించిన ప్రతిభ సమకాలిక భారతదేశంలోనేకాదు ; సమకాలిక ప్రపంచంలోనే గణుతించ దగినట్టిది. నీవు 'కన్యాశుల్కము' నాటకాన్ని – ఒక సమకాలిక సమస్య యితివృత్తంగా – ప్రకటించిననాటికి యూరప్ ఖండములోనైనా క్రొత్తనాటకం అంతగా ప్రచారంలోనికి రాలేదు.

అప్పారాయకవి ఆంధ్రవాఙ్మయానికి ఒక సరిహద్దు. ఈయనతో నవ్యసారస్వతయుగం మొదలైనది ... స్వాతంత్ర్యపు టూర్పుపోసిన పరమేష్ఠి. దేశభక్తి అంటే ఏమిటో మొదట తెలియజెప్పిన మహానుభావుడితడే.

సాంఘిక దురాచారాలను బట్టబయలుచేసి సంఘ సంస్కారాన్ని సాహిత్యంద్వారా, అప్పారాయమహాకవికి పూర్వంగాని, తరవాతగాని ఏ తెలుగురచయితా ఆయన చేసినంత అమోఘమైన సేవ చెయ్యలేదనే నిస్సంశయంగా చెప్పవచ్చును.

దేవుళ్ళూ రాజులూ ధనికులు ఆక్రమించుకొన్న సాహిత్యాన్ని ప్రజలకు సంపాదించిన మహాపురుషుడు అప్పారాయ మహాకవి. సాహిత్య విప్లవకారుకుడై నూతన సంస్కృతిని నెలకొల్పిన మహాపురుషుడు.

అప్పారాయ మహాకవి తెలుగుజాతికి పెన్నిధి ! ప్రపంచ కవులకుటుంబానికి చెందిన విశ్వకవి !

ప్రతి విషయంలోను ఇంట స్పష్టమైన దృక్పథం ప్రదర్శించిన మహాకవి వెనుక ఒక మహత్తరమైన శక్తి వుంది. మారుతున్న లోకాన్ని తన రచనల్లో, స్పష్టంగా చిత్రించాడు. ప్రాచ్యపాశ్చాత్యసాహిత్య సంప్రదాయాలు మేళవించి, సజాతీయంగా, సహజంగా "క్రొత్తపాతల మేలుకలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా" జాతిని మేల్కొల్పి విజ్ఞానపథాలకు నడిపే ఉత్తమాదర్శం ఆయన రచనల్లో అడుగడుగునా గోచరిస్తుంది.

ఆంధ్రసాహిత్యంలో ఆయన అభ్యుదయయుగానికి దారితీసిన మహాకవి ఆయన ఉత్తమ జీవితాదర్శం ఎల్లప్పుడూ ఆంధ్రజాతి హృదయంలో వేగుచుక్కగా వెలుగొందుతుంది ఆయన దివ్యవాణి ఆంధ్రజాతికి కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది ముందుకు నడుపుతుంది అదే ఆంధ్ర సాహిత్యాభ్యుదయానికి ఆంధ్రజాతికీ అభ్యుదయానికీ ఆశారేఖ

## మహాకవి

గుత్తునా యని జాతిముత్యాల్
గుచ్చినాఁడే మేలిసరముల
ఇత్తునా యని తెలుఁగుఁదల్లికి
ఇచ్చినాఁడే భక్తితో !

నవవసంతము, నవ్యవనరమ,
మావికొమ్మల గమ్మచివురులు
పాటపాడెడి పరభృతంబును
ఎవ్వరాపుదురో ?

పొదుపుమలపై రంగవల్లిక
మింటినడుమఁ బ్రచండతేజము
సంజమబ్బులపైని కెంపులు
చూడకుంటిరిగా

రంగవల్లిక మాయమయ్యెను
చండతేజము మాసిపోయెను
సందెకెంపులు సాగిపోయెను
వెదకుచున్నారా .

కారుచీఁకటి గ్రమ్మినప్పుడె
చదల మబ్బులు కప్పినప్పుడె
మిఱుఁగురైనను మెఱయనప్పుడె
వెదకుచున్నారా

చుక్కలన్నియు సొక్కి సోలెను
గిరులు కదలెను, దిరుగఁబాడెను
లోక మోహనమధురగానా
స్వాదమోదమున

యుగయుగంబులనుండి మ్రోఁగెడు
విశ్వగానవియ త్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీత శీకరముల్ !

పాటపాడిన పరభృతంబును
మూఁగవోయిన ముద్దుకోయిలఁ
జిన్ని పికములు చిఱుతపాటలఁ
బిలుచుచున్నవియా

♦ ♦ ♦

# Sarangadhara

## PART I

The labouring dawn gave out the child of light
Whose infant became played O'er the river's breast
And woke the bees asleep in lotus bowers,
While from Godavary's bank in merry whirls
A thousand pigeons starred the morning sky.
"Mine that, that farthest speck, one cries ; "And mine
Is out of sight," another ; but a third,
"MinP surely wheels the best" ; and many so
Scanned with their weary eyes, like flying hopes
Their favourite birds. The prince at last as if
He said, "let all that be, now see how mine
Doth wheel, "with one warm kiss left his. At once
Rose over the air one deafening cheer; all eyes
Were up, when lo; no flight, no merry whirl,
The frightened bird rushed onward as if mad
And perched himself upon the palace heights.

The prince concerned his min'ster comrade called,
And said, "Didst thou not mark my pigeon perch

Upon those spires gilt by the morning sun ?
They are the queen s, and I shall fetch it back
But, then, the boy dewan held by the robe
Prince Saranga, and whispered in his ear,
The King s abroad to hunt and thou art fair '
Fool thought the prince as on he rushed, to breed
Such thought like this "

But at his sight up rose
Chittrangi, once his bride destined but whom
A father's love his mother made, and said,
O Sir what favour this . sooner we thought
Could Sampang blooms invite the bee, than thee
These mansions poor Pray seat thyself upon
This silken throne " She slowly washed his feet
With waters pure in golden vessels held,
And Washing, Many a way thy presence here
This day, gives boundless joy to me. Thy sire
To try his aged strength in youthful sports,
To hunt is gone ; and in thy beauteous form
I see the king to lusty youth transformed,
Then softly pressing dry with robes she wore
His feet, with smile on lip and blush on cheek,
What interest one may feel in thee, that once
Was bride destined ? Then flashed through the Prince s mind,
*The king's abroad to hunt and thou art fair '*
But yet he thought That may noX be.
And she went on, 'To whom but one beloved
I pride would feel to show my pleasure groves -
The talk of the world ? Pray rise and come,

And thou shalt see a hundred fountain leap
Bright in the morning sun, and Nature fair
All night in calm repose now gives herself
To mirth and jollity."

"Another time,
Good mother ! for me it would ill become
To tarry long, while all my comrades wait
Upon the river's bank, whereas we flew

Our pigeons, mine" - "Tis safe," she interposed,
And dragged him by the arm through several gates
And left him at a bright pool's brink and shut
A gate or two and slipt.

And he like one
From midnight slumbers snatched to moonlight bowers
In Persian vales, by some love-sick Peri,
With wonder looked around at scenes the like
He never saw before. All over the park
A hundred fountains flew, with rainbows decked
And full of golden foam ; a Jessamine sea
About him spread, and at his feet a pond
Now one by one her colored lilies closed,
More varied lay the scene beyond, where spread
As far as eye could reach an endless grove.
With raptured eye the prince surveyed the scene
And took his way to where one water broad
Shone in the morning sun, and stood reclined
To a youthful tree that kissed the water's face.

He was a learned youth, and not to him
Unknown the magic realms that poets trod
Before ; and spake to hi n each bird and bloom
Some poetic tale or moral sweet He mused
And musing stood, lost in a world of charms

But lo Presently at his side, the queen,
Her ringlets flying to the morning breeze,
Like water nymph or forest Dryad stepped ,
And looked steadfast with eye unlided like
Some modern mesmerist over his subject,
At that fair prince But he, like one in trance

Mesmeric, stood absorbed
And she advantaged by his absent mood
Stole softly round his neck here snowy arm
And softly thus began, Market thou prince
How now the Lord of Day from every bud
Kisses the sleep away, that blushing wakes
And opes her fairly lids ? The butterfly
Robed in his gandy silks wooes every bloom,
but wooes to quit - reckless wanton he .
And lo that malat twinning as it does
The Kulaya s tall and aged trunk holds up
Her odorous blooms to frolic Zephyr's kiss
In nature all his playful, all his mirth,
And beauteous things to beauteous things are linked "
And here a meaning look she cast at him.
But he a ghastly look returned, and slipped
From her side as if to pluck a lotus

That at the margin blew.
"Softly my prince !
Disturb not so the amours of that pair
Of ruddy geese, from nights' seperation sore,
That lately meet. 'Tis but a dreary waste
This mortal world, unless Love strew the scene
With freshening flowers. And O ! the pain one feels.
That feverish flame that creeps through every nerve -
Not soothed but fanned by Nature's cooling hand -
That anguish deep for one beloved ! Worse than
A brute is he, that having power to soothe,
Lends not his tender aid ! O! save me dear
From yonder black-bee buzzing over the bloom
That thou hast pluckt." She drew behind him close
As if for fear, and threw her arms around
His neck, like frightened fawn behind from bush
Of stately growth. "I tremble Prince," she said
In accents choked within an ivory throat,
"There crept into the hollow of that trunk
A frightful snake. Then carry me secure
To yonder summer house that skirts that lake."
She hung upon his arm, and he led on.
At that gate she looked relieved, held firm
The Prince's hand, and in her turn played guide.
"Lo ! Prince," she said as into a room they stepped,
"Upon these walls, a master pencil's work,
It was a smith of learning great, who was
Much favoured at our court. Him brahmins feared ;
And once my sire in whimsied mood fade him
Draw these. Become they not a bridal gift ?

The art of Love is there laid bare, and if
You read it to the end, why, then, thou learn'st,-
Where love is strong there hearts may wed.
You mark the amourts of that shepherd God
Of million wives ! Did ever a women love
And he not yield to here wish ?"

'Mother ! wrongly
You read the sense of all those wondrous works
Of great Gopal. Didst thou not hear it said
That spirit of God husbands the human souls ?"
As if not hearing, she, "There in those panes
The amorous God a worthy lesson teach.
And saints ! Well, well ! if there is a heart that burns
With love for thee, respect you not examples
They have' set ?"
"I? Certainly not. One e' en
May read the mystic meaning of the stars ;
Make out with daring aim the Maker's writ
On naked skulls, or peep through linkless words
At prophets' hearts ; but who, however great
Of learning, can presume to read the sense
Of acts divine? On commonest things, doubt stamps
Her dismal mark. Why then should one with feet
Unhallowed tread the realms divine ? "

"Well, prince !

If logic strange like this, befitting more
The broken hearts of forest bowers, should come
From youthful beauty, why then, may not our sex
Petition the Gods against the make of toys
Useless like us ! The sprightly shape belies

These monkish texts. But I shall preach
Thee now upon a different theme, that must -
If thou art the rock that mocks the iron's edge-
Go home directly to the heart." "This then,"
She said, removing a screen that careful hung
Upon a drawing drawn to human size,
"This then the text on which was vileness played -
Vileness and grim perfidy by a king -
One, not less worthy than thy sire"
He started back, like one that meets at night
Some frightful shape, while from his lips escaped,
"Undone ! Undone ! The image over the wall
To echo seemed. Speechless he stood, and not
The motion least his form betrayed, as if
The picture walked out of its frame. So like
Were they ; for it was his. "And knowest thou prince,"
She said, "the story of this piece which strikes thee dumb
With such a perfect beauty that, except
Within thy glass, I trow, you never met ?
At least I didn't : and so when first my eyes
Lighted upon this drawing, which thy sire
Sent as the bridegroom's - and falsely sent -
My very heart did weep for joy, and took
The image in. Since then the vision sweet
Haunted my thoughts, till last brought to this Court.
Whom did I meet within the bridal room ?
Oh ! Vilely done - thy sire! - and at his sight
Failed joy from me for ever. They say thou art
A man of tender heart; now make amends
For sins thy sire has done, or else no more

Can ! I endure the pangs of fruitless flame
For thee
He tried to speak, but anger choked
His breath, and, muttering something, Die than slip
From right He moved to walk away, but she
Caught Sarang by his cloak, which he, in haste
To fly, left in her grasp, and through the park
Over flower and plant like whirlwind passed and climbed
The garden wall and jumped him down And there
With sweep majestic flowed Godavary's stream.

He stood a moment on its bank, while rolled
Within his brain, like to a horrid dream,
The events late A moment cast a crazy look
Upon the stream below, and, as if it were
Oblivion s flood, dashed into the river and reached
The other shore

## PART II

The noon was far advanced, the monarch left
The tents, and sought where freshening to the eye
The forest trees a shady bower made.
Wearied with morning s mirth, all nature sank to rest
And not the slightest stir was there, save where
The streamlet gurgled over the distant slope,
And butterflies, like the spirits of the wood, among
The foliage moved And there he laid him down
Upon the grass, and wearied with the chase
Soon sunk to sleep and dreamt

It was moonlight
And with his queen beloved. long through the park
He walked in converse sweet, till when he reached
The summer house, and like a baby held
Her in his arms, a hideous shape came O er her
And he dropped her in fright, and there was blood,
And broken limbs lay strewn upon the floor"
He woke in fright, and passing hastily
On to the tents, he cried ' to horse" and rode
Away.
But how was she the object dear
Of all his anxious thoughts ? She when the prince
Ran roughshed over the park like a wild colt
And left the cloak behind, felt like a lover who
In dream obtains his lady's wished embrace
But walking feels the pillow in his arms.

Sorely distressed she felt and from her eyes
Rolled down big drops. In silent grief awhile
She stood, and in her heart the feelings changed
To wounded worth, and anger next followed ;
But revenge last took possession of her heart.

She leaned upon the gate and thought on what
To do ; cried, "He shall rue;" and tore as mad
Her costly robe, and broke her bangles O'er
A post, and, as to lock her thoughts in sleep
"Gainst every feeling soft, emptied a glass
And lay upon the floor.

But when she woke
It was night. She rose not, but still with face
Pillowed on crossed arms, she brought to mind
The events of the morn, till coming where
The prince with countenance stern contemptuous looked
On her and turned away, her bosom burned
Once more with dire revenge, and in the fit
She like a fury lifted up her head ; and saw
The king seated beside her, anxiously
Looking over the prostrate form before.
The Queen at once withdrew her face and dropped
It over again upon her crossed arms.
"What means the girl," he said, "this torn robe
And broken bangles strewn upon the floor !
And why withdraw thy face in haste, as if
You saw some hateful fiend in me? Is there
No better bedding than a floor ? Arise

And speak ! for me the riddle is hard to read."
But when he held her arm to lift her up,
"O ! touch me not my lord," she cried, "I am fouled,
Fouled by a stranger's touch within *thy* house,
Like harlot slighted. Ah ! 'tis woman's fate
To be every ill." "Slighted and fouled !
And who the wretch that touched ? for by my life
Tomorrow's morning shall not see him whole !"
"Vow not so, King ! for why should one be blamed
That fate decreed me this ? First brought my guile,
I have to brook indignity in the Court.
This morn, thy son, knowing you gone to hunt,
Came with the story of a pigeon fled :
Desired to see my park, and in this place,
This very place, laid violent hands on me;
Said I was once his bride destined, and spoke
Of love, but when I, drawing yonder sword,
Prepared to die rather than yield to his wish,
He like a coward fled, and left me here
Distressed. I am defiled and thee but ill
Befit ! Henceforth an ascetic shall I live
In forest caves secluded from the world,
But harm him not, thy son, for it is my fate
And not his fault." "Enough," he said, and walked
With haughty steps away.

It was the time
When, from their haunts, deities to shrines return;
And stars slip out from heaven's azure vault
Where on their silver thrones through all the night

A heavenly choir they keep; and beasts of prey
Completely wearied with their fruitless search
Homeward retrace their cautious steps Twas then
Upon a rock beneath a forest lime
That with a thousand eyes her fragrance wept,
Loud wailing lay, in agony deep, a prince
With severed legs and arms, and none was near
Except the workers of the deed who watched
With heavy hearts from distance over the scene,
But who you shape that like a shadow walks
The nighted wood? Some ghost whose haunts disturbed
The prince s wail? Oh no! it is the saint
Whom oft at early morn the woodman meets
Crossing with speed of wind the forest tracts
Has he then heard the prince s cry? He did,
And is presently at his side. ' Alas!
Innocent prince', he cried, and from his pot
Sprinkled the holy water over his form
At once the bleeding stopped, and, in his arm
Holding the swooning prince, the holy saint
Windswift over forest flew

## CONCLUSION

The sun has set, but, linger yet his rays
Over the odorous heights of eastern peaks,
Where, stopping in her thoughtless speed, the fawn
With baby-wonder eyes the setting day,
That, twitching now his mantle bright, walked down
The slopes of the western mount. The forest lay
In all its twilight grandeur robed in shades

But who be she that like a goddess sat
Upon a rock that edged a noiseless stream
And sh plike rose amidst a leafy sea?
All clad in purest white: one diamond lace
Alone adorned her neck and dangling rested

Over her fairy breast. Long did she trace
With thoughtful eye the evening evolutions
Of earth and sky, while each image that graced
Her orbs wooed back some relic of the past
Or golden thoughts that blossomed in her breast.
Softly she rose from reverie and withdrew
Her palm from, neath her rosy cheek, and touched
A VIN with flowerets decked, and charmed the wood :-

Chorus: *With power and pelf so falsely fair*
*The world is all to thee ·*
*O speak no more ; O speak no more,*
*The world is not fuor me.*

With tempting hues the lilies blow
Upon the Lake of Life ,
But all below, unseen they grow
The weeds of sin and strife.

The plant of wealth on guile is grown
And watered is with sin;
The craft of power on blood is built
Its sails are puffed with din.

O not to me that power and wealth
O not to me the world ;
In muddied streams there life doth flow
And vapours dim are curled.

Mine be these woods, these hills, these dales,
Mine be the crystal stream,
Like wild bird in these happy vales
A happy heart I roam.
The prince that was by me undone
Lives in the cave below ;
His limbs would all be whole again
In dozen moons or so

